

# వాసిష్ఠ రామాయణము

అనువాదకులు

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు




శ్రీ శుక బ్రహ్మాశ్రమము

కాళహస్తి

1987

పారాశర్యవచస్సరోజమమలం గీతార్థగన్ధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథాసంబోధనా బోధితమ్
లోకే సజ్జనషట్పదైరహరహః పేపీయమానం ముదా
భూయాద్ భారతపఙ్కజం కలిమలప్రధ్వంసినః శ్రేయసే

పరాశరుని పుత్రుడగు వ్యాసమునీంద్రుడను సరోవరమున భారతమను నిర్మలకమలము ఉత్పన్నమైనది అది గీతార్థమను మహా సుగంధముతో కూడినదియు వివిధ ఆఖ్యానములను కేసరములు కలదియు హరి కథా రూప సూర్య రశ్మిచే ప్రఫుల్లితమైనదియు సజ్జనులను తుమ్మెదలు నిరంతరము సంతోషముతో పానముచేసి మహదానందమును పొందు మకరందముతో నిండినదియు కలికాల పాపమును నాశనము చేయునదిగ అగు నొప్పుచున్నది అది మాకు శ్రేయస్సును కలుగ జేయుగాక!

భారతే సర్వవేదార్థః

సమస్త వేదముల యొక్క సారము భారతమందు గలదు

యన్నభారతే తన్నభారతే

భారతమందు ఏది లేదో అది భారతేతరమందు లేదు

ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్

ధర్మార్థ కామ మోక్షములను గూర్చి భారతమందేది తెలుప
బడెనో అదియే ఇతరత్ర గలుగుచున్నది దీనియందేది
తెలుపబడలేదో అది యెచటను లేదు

తిరుమల తిరుపతి దేవస్థానమువారు

ఈ గ్రంథముద్రణకు రూ 7500/- లు

( ఏడువేల అయిదువందల రూపాయలు )

సహాయముచేసిరి వారికి మా కృతజ్ఞతలు

ఇట్లు

ప్రకాశకులు

ఓమ్

# ప్రస్తావన

ఆధ్యాత్మ వఙ్మయమున భారతము మహోన్నత స్థాన మలంకరించి యున్నది గొప్ప తపస్సంపన్నుడగు శ్రీ వేదవ్యాస మహర్షి లక్ష శ్లోకములతో ఈ మహాగ్రంథమును రచించెను పంచమ వేదమని ప్రఖ్యాతిగాంచిన ఈ గ్రంథమందు ఎన్నియో ధర్మ రహస్యములు చెప్పబడియున్నవి వాని నన్నిటిని క్రోడీకరించి కథా భాగమును క్లుప్తపఱచి భారతరత్నాకరమన పేరుతో ఈ గ్రంథము ప్రకటింపబడినది భారతమందు తెలుపబడిన స్తోత్రములు అర్థముతో సహా మొట్టమొదట ఈ గ్రంథమున ఉల్లేఖింపబడినవి ముముక్షువు లీ గ్రంథమును శ్రద్ధతో పఠించి, మహనీయులు వచించిన ధర్మ సూక్ష్మములను చక్కగా గ్రహించి ఆచరణయందుంచుకొని, పరమశాంతిని బడయుదురు గాక!

ఓమ్

ఇట్లు

ప్రకాశకులు

ఓమ్

# కృష్ణనామ మహిమ

(శ్రీరూపగోస్వామి)

తుండే తాండవినీ రతిం వితనుతే తుండావలీ లబ్ధయే
కర్ణక్రోడ కడంబినీ ఘటయతే కర్ణార్బుదేభ్యః స్పృహామ్
చేతఃప్రాంగణ సంగినీ విజయతే సర్వేంద్రియాణాం కృతిం
నో జానే జనితా కియద్భి రమృతైః కృష్ణేతి వర్ణద్వయీ

కృష్ణ అను రెండక్షరములను ఉచ్చరించినంతనే కలుగు ఆనందముచే ఆహా! నాకు అసంఖ్యాకములగు నాలుకలున్నచో ఈ ఆనందమును ఇంకను అధికముగ అనుభవింతును గదా అని అనిపించును అట్లే కృష్ణనామమును వినినంత మాత్రముచే నాకు కోట్లకొలది చెవులుండిన బాగుండును అనిపించును మనస్సుతో కృష్ణనామమును స్మరించినంతనే సర్వేంద్రియముల సామర్థ్యములను జయించును కావున కృష్ణ అను ఈ రెండక్షరములు ఎన్ని అమృతములచే నిర్మింపబడెనో తెలియజాలము

సర్వేషా మేవ యజ్ఞానాం లక్షాణి చ వ్రతాని చ
తీర్థస్నానాని సర్వాణి తపాంస్యనశనాని చ
వేదపారసహస్రాణి ప్రదక్షిణ్యం భువ శ్శతం
కృష్ణనామజపస్యాస్య కలాం నార్హంతి షోడశీమ్

లక్షలకొలది యజ్ఞములు వ్రతములు తీర్థస్నానములు, తపస్సులు, ఉపవాసములు వేదపారములు భూప్రదక్షిణములు కూడ కృష్ణనామ జపము యొక్క పదునారవవంతు ఫలితమును కూడా ఒసంగజాలవు

ఓమ్

# యుగళ కిశోరాష్టకము

(శ్రీ రూపగోస్వామి)

1 నవజలధరవిద్యుద్యోతవర్ణౌ ప్రసన్నౌ
వదననయనపద్మౌ చారుచంద్రావతంసౌ
అలకతిలకఫాలౌ కేశవేశ ప్రఫుల్లౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! శరీర కాంతియందు నూతన మేఘమును మెఱుపులను పోలియున్నవారును సదా ప్రసన్నులును కమలమువంటి ముఖము నేత్రములు కలవారును, నెమలిపింఛమందలి అందమైన చంద్రుడు (రాధ పక్షమున పాటలోని చంద్రవంక) శిరోభూషణములుగ కలవారును ఫాలమున శోభించు ముంగురులు తిలకము కలవారను కేశపాశములచే అందమైనవారును అగు రాధాకృష్ణులను సదా స్మరింపుము

2 వసనహరితనీలౌ చందనాలేపనాంగౌ
మణిమరకతదీప్తౌ స్వర్ణమాలాప్రయుక్తౌ
కనకవలయ హస్తౌ రాసనాట్యప్రసక్తౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! పీతాంబర నీలాంబర శోభితులును, చందన లేపనముతో గూడిన అవయవములు కలవారును ఇంద్రనీలమణివంటి దేహకాంతి కలవారును బంగారపు హారములను ధరించినవారును, బంగారపు కంకణములుగల ముంజేతులు కలవారును రాసక్రీడ సక్తులును అగు రాధాకృష్ణులను భజింపుము

3 అతి మధురసువేషౌ రంగభంగీత్రిభంగౌ
మధురమృదులహాసౌ కుండలాకీర్ణకర్ణౌ
నటవరవరరమ్యౌ నృత్యగీతానురక్తౌ
భజ భజతు మనోరే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! మహాసుందరములైన రూపములు కలవారును ఉత్తమ భంగిమలు కలవారును మృదుమధురహాస్యములతో కూడిన వారును, కుండలములచే శోభించు చెవులు కలవారును ఉత్తమ నటీనటులవలె మనోహరరూపములు కలవారును, నృత్యగానములందు ఆసక్తి కలవారును అగు రాధాకృష్ణులను సేవింపుము

4 వివిధగుణవిదగ్ధౌ వందనీయౌ సువేశౌ
మణిమయమకరాద్యైః శోభితాంగౌ స్ఫురంతౌ
స్మితనమితకటాక్షౌ ధర్మకర్మప్రదత్తౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! అనేక సుగుణములచే భూషితులును నమస్కరింప దగినవారును మనోహర రూపములు కలవారును పద్మరాగ ఇంద్ర నీలములతో ప్రకాశించు దేహముచే శోభించువారును, చిఱునగవులు ఉత్తమ చూపులు కలవారును ధర్మ పుణ్య కర్మలచే లభించినవారును అగు (శ్రీ) రాధాకృష్ణులను సదా భజింపుము

5 కనకమకుటచూడౌ పుష్పతోద్భూషితాంగౌ
సకలవననివిష్టౌ సుందరానందపుంజౌ
చరణకమలదివ్యౌ దేవదేవాదిసేవ్యౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! బంగారు కిరీటము, చూడామణి కలవారును, నానావిధ పుష్పభూషణములచే శోభించు దేహము కలవారును, అనేక వనములందు సంచరించువారును మూర్తీభవించిన సౌందర్యము ఆనందము కలవారును, దివ్యపాదపద్మములచే సుందరమైనవారును, దేవతలచే సేవింపబడువారును అగు రాధాకృష్ణులను భజింపుము

6 అతిసువలితగాత్రౌ గంధమాల్యైర్విరాజౌ
కతికతిరమణీనాం సేవ్యమానౌ సువేశౌ
మునిసురగణభావ్యౌ వేదశాస్త్రాదివిజ్ఞౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! మహాసుందరమైన దేహము కలవారును సుగంధ పుష్పమాలలచే శోభించువారును పెక్కురు సుందరీమణులచే సేవింప బడువారును గొప్ప మునీశ్వరులచేతను దేవతలచేతను పూజింపబడు వారును వేదశాస్త్రాదివేత్తలును అగు రాధాకృష్ణులను సేవింపుము

7 అతిసుమధురమూర్తీ దుష్టదర్పప్రశాంతీ
సురవరవరదౌ ద్వౌ సర్వసిద్ధిప్రదానౌ
అతిరసవశమగ్నౌ గీతవాద్యప్రతానౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! మహాసుందరమైన ఆకారములు కలవారును, దుర్మార్గుల గర్వభంగ మొనర్చువారును ఉత్తమ దేవతలకు వరమొసంగువారును సమస్త సిద్ధులను ఒసంగువారును, పరమానంద మగ్నులై ఉండువారును గీతావాద్యములను విస్తరింపచేయువారును అగు రాధాకృష్ణులను లెస్సగ భజింపుము

8 అగమనిగమసారౌ సృష్టి సంహారకారౌ
వయసి నవకిశోరౌ నిత్యబృందావనస్థౌ
శమనభయవినాశౌ పాపినస్తారయంతౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణచంద్రౌ

ఓ మనస్సా! నిగూఢములైన వేదములకు సారభూతులును, సృష్టి లయ కారకులును నూతన కిశోర వయస్సు కలవారును సదా బృందావనమందు ఉండువారును యమునిచేకూర్చిన భయమును పోగొట్టువారును, పాపులను (బాగుపఱచి) తరింపజేయువారును అగు రాధాకృష్ణులను భజింపుము

9 ఇదం మనోహరం స్తోత్రం శ్రద్ధయా యః పఠేన్నరః
రాధికాకృష్ణచంద్రౌ చ సిద్ధిదౌ నాత్ర సంశయః

మనోహరమైన ఈ స్తోత్రమును ఏ మానవుడు శ్రద్ధతో పఠించునో అట్టివానికి రాధాకృష్ణులు సకల సిద్ధులను ఒసంగుదురు ఇవ్విషయమందు సందేహము లేదు

# విషయసూచిక

భారతమందలి కొన్ని పురుషపాత్రలు



భారతమందలి కొన్ని స్త్రీ పాత్రలు



భారత రత్నాకరము

ఓమ్

ఓమ్

# భారతమందలి స్తోత్రములు

## 1 సూర్య అష్టోత్తర శతనామావళి

**(ధౌమ్యుడు)**

**(వనపర్వము 13 వ అధ్యాయము)**

సూర్యోఽర్యమా భగస్త్వష్టా పూషార్కః సవితా రవిః ।
గభస్తిమానజః కాలో మృత్యుర్ధాతా ప్రభాకరః ॥ 1

పృథివ్యాపశ్చ తేజశ్చ ఖం వాయుశ్చ పరాయణమ్ ।
సోమో బృహస్పతిః శుక్రో బుధోఽఙ్గారక ఏవ చ ॥ 2

ఇన్ద్రో వివస్వాన్ దీప్తాంశుః శుచిః శౌరిః శనైశ్చరః ।
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ స్కన్దో వై వరుణో యమః ॥ 3

వైద్యుతో జాఠరశ్చాగ్నిరైన్ధనస్తేజసాం పతిః ।
ధర్మధ్వజో వేదకర్తా వేదాఙ్గో వేదవాహనః ॥ 4

కృతం త్రేతా ద్వాపరశ్చ కలిః సర్వమలాశ్రయః ।
కలా కాష్ఠా ముహూర్తాశ్చ క్షపా యామస్తథా క్షణః ॥ 5

సంవత్సరకరోఽశ్వత్థః కాలచక్రో విభావసుః ।
పురుషః శాశ్వతో యోగీ వ్యక్తావ్యక్తః సనాతనః ॥ 6

కాలాధ్యక్షః ప్రజాధ్యక్షో విశ్వకర్మా తమోనుదః ।
వరుణః సాగరోంఽశుశ్చ జీమూతో జీవనోఽరిహా ॥ 7

భూతాశ్రయో భూతపతిః సర్వలోక నమస్కృతః ।
స్రష్టా సంవర్తకో వహ్నిః సర్వస్యాదిర లోలుపః ॥ 8

అనన్తః కపిలో భానుః కామదః సర్వతోముఖః ।
జయో విశాలో వరదః సర్వధాతువిషేచితా ॥ 9

మనఃసుపర్ణో భూతాదిః శీఘ్రగః ప్రాణధారకః ।
ధన్వన్తరి ర్ధూమకేతురాదిదేవోఽదితేః సుతః ॥ 10

ద్వాదశాత్మారవిన్దాక్షః పితా మాతా పితా మహః ।
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్ ॥ 11

దేహకర్తా ప్రశాన్తాత్మా విశ్వాత్మా విశ్వతోముఖః ।
చరాచరాత్మా సూక్ష్మాత్మా మైత్రేయః కరుణాన్వితః ॥ 12

సూర్య అర్యమా భగ త్వష్టా పూషా అర్క సవితా రవి గభస్తిమాన్, అజ కాల, మృత్యు ధాతా ప్రభాకర పృథివీ ఆప తేజ ఖం (ఆకాశము) వాయు పరాయణ సోమ, బృహస్పతి, శుక్ర బుధ అంగారక ఇంద్ర వివస్వాన్ దీప్తాంశు శుచి శౌరి శనైశ్చర బ్రహ్మ విష్ణు రుద్ర స్కంద వరుణ యమ వైద్యుతాగ్ని జాఠరాగ్ని, ఐంధనాగ్ని తేజఃపతి ధర్మధ్వజ వేదకర్తా వేదాంగ వేదవాహన కృత త్రేతా ద్వాపర సర్వామలాశ్రయకలి కలా కాష్ఠా ముహూర్త రూప సమయ క్షపా(రాత్రి) యామ, క్షణ, సంవత్సరకర అశ్వత్థ కాలచక్రప్రవర్తక విభావసు శాశ్వతపురుష యోగి వ్యక్తావ్యక్త సనాతన కాలాధ్యక్ష ప్రజాధ్యక్ష విశ్వకర్మా, తమోనుద వరుణ సాగర అంశు జీమూత జీవన అరిహా భూతాశ్రయ, భూతపతి, సర్వలోక నమస్కృత స్రష్టా, సంవర్తక, వహ్ని సర్వాది అలోలుప అనంత కపిల భాను

కామద సర్వతోముఖ జయ విశాల వరద సర్వధాతునిషే చిత మనఃసువర్ణ భూతాది శీఘ్రగ ప్రాణధారక ధన్వంతరి ధూమకేతు ఆదిదేవ అదితిసుత ద్వాదశాత్మా అరవిందాక్ష పితామాతాపితామహ స్వర్గద్వార ప్రజాద్వార మోక్షద్వార త్రివిష్టప దేహకర్తా ప్రశాన్తాత్మా విశ్వాత్మా విశ్వతోముఖ, చరాచరాత్మా, సూక్ష్మాత్మా మైత్రేయ కరుణాన్విత – ఇవి అమిత తేజస్వి యగు సూర్యభగవానుని సంకీర్తన నొనర్చుటకు యోగ్యములైన 108 నామములు వీనిని పూర్వము సాక్షాత్ బ్రహ్మదేవుడు ఉపదేశించెను

సురగణ పితృయక్ష సేవితం
 హ్యసుర నిశాచర సిద్ధ వన్దితమ్।
వరకనక హుతాశనప్రభం
 ప్రణిపతితోఽస్మి హితాయ భాస్కరమ్॥ 13

(ఈ నామములను ఉచ్చరించుచు సూర్యునకు ఈ ప్రకారము నమస్కరించవలెను—) సమస్త దేవతలు పితరులు యక్షులు ఎవరికి సేవ యొనర్చుచున్నారో అసురులు రాక్షసులు సిద్ధులు ఎవరికి నమస్కరించుచున్నారో ఉత్తమ సువర్ణము వలెను అగ్ని వలెను కాంతివంతమైన వారగు అట్టి సూర్యభగవానునకు నేను నా హితము కొఱకై ప్రణామ మాచరించుచున్నాను

సూర్యోదయే యః సుసమాహితః పఠేత్
 స పుత్రదారాన్ ధనరత్న సంచయాన్।
లభేత జాతిస్మరతాం నరః సదా
 ధృతిం చ మేధ్యాం చ స విన్దతే పుమాన్॥ 14

ఎవడు సూర్యోదయ సమయమున బాగుగ ఏకాగ్ర చిత్తుడై ఈ నామములను పఠించునో అతడు స్త్రీ పుత్ర ధన రత్నరాసులను పూర్వజన్మస్మృతిని ధైర్యమును, ఉత్తమబుద్ధిని పొందుచున్నాడు

ఇమం స్తవం దేవవరస్య యో నరః
ప్రకీర్తయేచ్ఛుచి సుమనాః సమాహితః ।
విముచ్యతే శోకదవాగ్ని సాగరా
ల్లభేత కామాన్ మనసా యథేప్సితాన్ ॥ 15

ఎవడు స్నానాదుల నొనర్చి పవిత్ర శుద్ధ ఏకాగ్రచిత్తుడై సూర్యుని యొక్క ఈ నామాత్మక స్తోత్రమును కీర్తన యొనర్చుచున్నాడో అతడు శోకరూపదావానల సహితమగు దుస్తర సంసార సముద్రమునుండి విముక్తుడై మనోవాంఛిత పదార్థములను పొందుచున్నాడు

# సూర్య స్తోత్రము

(ధర్మరాజు)

(వనపర్వము 13 వ అధ్యాయము)

త్వం భానో జగతశ్చక్షు స్త్వమాత్మా సర్వదేహినామ్।
త్వం యోనిః సర్వభూతానాం త్వమాచారః క్రియావతామ్॥ 1

సూర్యదేవా! మీరు సమస్తజగత్తునకు నేత్రమును సమస్త ప్రాణులకు ఆత్మయు అయి యున్నారు మీరే సమస్త జీవులకు ఉత్పత్తి స్థానమున్ను కర్మానుష్ఠాన పరులయొక్క సదాచారమున్ను అయియున్నారు

త్వం గతిః సర్వ సాంఖ్యానాం యోగినాం త్వం పరాయణమ్।
అనావృతార్గలద్వారం త్వం గతి స్త్వం ముముక్షతామ్॥ 2

సమస్త సాంఖ్యయోగులయొక్క ప్రాప్తవ్య స్థానము మీరే అయి యున్నారు కర్మయోగులందఱి యొక్క ఆశ్రయము మీరే అయి యున్నారు మోక్షము యొక్క తెరువబడిన ద్వారము మీరే అయి యున్నారు ముముక్షువుల యొక్క గతియు మీరే అయి యున్నారు

త్వయా సంధార్యతే లోక స్త్వయా లోకః ప్రకాశ్యతే।
త్వయా పవిత్రీక్రియతే నిర్వ్యాజం పాల్యతే త్వయా॥ 3

సమస్త జగత్తును మీరే ధారణ యొనర్చుచున్నారు మీ వలననే ఈ జగత్తు ప్రకాశింపబడుచున్నది మీరే దీనిని పవిత్ర

యొనర్చుచున్నారు మఱియు మీ వలననే నిస్స్వార్థ భావనచే దీని యొక్క పాలనము గావింపబడుచున్నది

త్వాముపస్థాయ కాలే తు బ్రాహ్మణా వేదపారగాః।
స్వశాఖా విహితైర్మన్త్రైరర్చ న్త్యృషి గణార్చితమ్॥ 4

మీరు ఋషులచే పూజింపబడుచున్నారు వేదము నెఱింగిన తత్త్వజ్ఞులు తమయొక్క వేదశాస్త్ర వర్ణిత మంత్రముల ద్వారా ఉచితసమయమున ఉపాసన చేసి మిమ్ములను పూజించుచున్నారు

తవ దివ్యం రథం యాన్తమనుయాన్తి వరార్థినః।
సిద్ధచారణ గన్ధర్వా యక్షగుహ్యక పన్నగాః॥ 5

సిద్ధులు, చారణులు గంధర్వులు యక్షులు, నాగులు మీ నుండి వరమును పొందదలంచి మీ వేగయుక్త దివ్య రథముయొక్క వెనుక వెనుక వచ్చుచున్నారు

త్రయస్త్రింశచ్చ వై దేవాస్తథా వైమానికా గణాః।
సోపేన్ద్రాః సమహేన్ద్రాశ్చ త్వామిష్ట్వా సిద్ధిమాగతాః॥ 6

ముప్పదిమూడు కోట్ల దేవతలు విమానచారులగు సిద్ధులు ఉపేంద్ర మహేంద్ర సహితముగ మిమ్ములను ఆరాధించి సిద్ధిని పొందియున్నారు

ఉపయాన్త్యర్చయిత్వా తు త్వాం వైప్రాప్తమనోరథాః।
దివ్యమన్దారమాలాభి స్తూర్ణం విద్యాధరోత్తమాః॥ 7

గుహ్యాః పితృగణాః సప్తయే దివ్యా యే చ మానుషాః।
తే పూజయిత్వా త్వామేవ గచ్ఛన్త్యాశు ప్రధానతామ్॥ 8

వసవో మరుతో రుద్రా యే చ సాధ్యా మరీచిపాః।
వాలఖిల్యాదయః సిద్ధాః శ్రేష్ఠత్వం ప్రాణినాం గతాః॥ 9

శ్రేష్ఠులగు విద్యాధరులు దివ్యమందార పుష్పముల యొక్క మాలలచే మిమ్ములను పూజించి సఫలమనోరథులై శీఘ్రముగ మీ సమీపమునకు వచ్చుచున్నారు గుహ్యకులు ఏడు విధములైన పితృగణము దివ్యమానవులు మిమ్ములను పూజించి శ్రేష్ఠపదమును పొందుచున్నారు వసువులు మరుత్తులు రుద్రులు మీ యొక్క కిరణములను పానమొనర్చు వాలఖిల్యాది సిద్ధ మహర్షులు మిమ్ము లను ఆరాధించుటచే ప్రాణులందఱిలోను శ్రేష్ఠులైరి

స బ్రహ్మ కేషు లోకేషు స ప్తస్వప్యఖిలేషు చ।
న తద్భూతమహం మన్యే యదర్కాదతిరిచ్యతే॥ 10

స న్తి చాన్యాని స త్త్వాని వీర్యవ న్తి మహా న్తి చ।
న తు తేషాం తథా దీ ప్తిః ప్రభావో వాయథా తవ॥ 11

జ్యోతీంషి త్వయి సర్వాణి త్వం సర్వజ్యోతిషాం పతిః।
త్వయిం సత్యంచ సత్త్వంచ సర్వే భావాశ్చ సాత్త్వికాః॥ 12

త్వ త్తేజసా కృతం చక్రం సునాభం విశ్వకర్మణా।
దేవారీణాం మదో యేన నాశితః శార్ఙ్గధన్వనా॥ 13

బ్రహ్మలోకసహితములగు ఏడు ఊర్ధ్వ లోకములందును ఇతర సమస్తలోకములందును మీ కంటె అధికుడైన వా డెవడును కానుపించుటలేదు జగత్తు నందు అనేకమంది మహాశక్తిసంప న్నులు కలరు కాని వారి కాంతి ప్రభావము మీతో సమానముగ లేదు జ్యోతిర్మయ పదార్థము లన్నియు మీ యందే అంతర్గత ములై యున్నవి సమస్త జ్యోతులయొక్క ప్రభువు మీరే అయి యున్నారు సత్యము స త్త్వము సమస్త సాత్త్వికభావములు మీ యందే ప్రతిష్ఠితములై యున్నవి శార్ఙ్గము అను ధనుస్సును ధరిం

-చిన విష్ణువు దేనిద్వారా దైత్యుల గర్వమును నాశనమొనర్చిరో
అట్టి సుదర్శన చక్రమును విశ్వకర్మ మీ తేజస్సుచేతనే నిర్మించెను

త్వమాదాయాంశుభి స్తేజో నిదాఘే సర్వదేహినామ్।
సర్వౌషధిరసానాం చ పునర్వర్షాసు ముఞ్చసి। 14

మీరు గ్రీష్మఋతువునందు మీ కిరణములచే సమస్త దేహధారుల యొక్క తేజమును సమస్త ఓషధుల యొక్క రసము యొక్క సారమును ఆకర్షించి తిరిగి వర్షాకాలమున దానిని వర్షింపజేయుచున్నారు

తప న్త్యన్యే దహ న్త్యన్యే గర్జ న్త్యన్యే తథా ఘనాః।
విద్యోత న్తే ప్రవర్ష న్తి తవ ప్రావృష రశ్మయః॥ 15

వర్ష ఋతువునందు మీ యొక్క కొన్ని కిరణములు తపించుచు కొన్ని మండింపజేయుచు కొన్ని మేఘములై గర్జించుచు కొన్ని మెఱుపు అయి మెఱయుచు కొన్ని వర్షించుచు ఉన్నవి

న తథా సుఖయత్యగ్నిర్న ప్రావారా న కమ్బలాః।
శీతవాతార్దితం లోకం యథా తవ మరీచయః॥ 16

శీతకాలపు గాలిచే పీడింపబడిన జనులకు మీ కిరణము లెంత సుఖమును కలుగజేయునో అంత సుఖమును అగ్ని కాని కంబళ్ళు కాని వస్త్రములు కాని కలుగచేయజాలవు

త్రయోదశ ద్వీపవతీం గోభిర్భాస యసే మహీమ్।
త్రయాణామపి లోకానాం హితాయైకః ప్రవ ర్తసే॥ 17

మీరు మీ కిరణములద్వారా పదమూడు ద్వీపములతో కూడిన ఈ భూమిని ప్రకాశింపజేయుచున్నారు మఱియు ఒంటరిగనే ముల్లోకములకును హిత మొనర్చుచున్నారు

తవ యద్యుదయో న స్యాదన్ధం జగదిదం భవేత్ ।
న చ ధర్మార్థకామేషు ప్రవర్తేరన్ మనీషిణః ॥ 18

మీరు ఉదయించనిచో ఈ జగత్తంతయు గ్రుడ్డిది యగును మఱియు విజ్ఞులు ధర్మ అర్థ కామ సంబంధ కర్మములందు ప్రవృత్తులే కారు

ఆధానపశుబన్ధేష్టి మన్త్రయజ్ఞ తపః క్రియాః ।
త్వత్ప్రసాదాదవాప్యన్తే బ్రహ్మక్షత్ర విశాం గణైః ॥ 19

అగ్ని స్థాపన పశువులను కట్టుట పూజ మంత్రములు యజ్ఞానుష్ఠానము తపస్సు మున్నగు క్రియ లన్నియు మీ యొక్క కృపచేతనే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులద్వారా జరుపబడుచున్నవి

యదహర్బ్రహ్మణః ప్రోక్తం సహస్రయుగ సమ్మితమ్ ।
తస్య త్వమాదిరన్తశ్చ కాలజ్ఞైః పరికీర్తితః ॥ 20

వెయ్యి యుగములతో గూడిన బ్రహ్మదేవునియొక్క దినమేది చెప్పబడినదో కాలమానము నెఱిగిన విద్వాంసులు దాని ఆది అంతములు మీరే యని చెప్పుచున్నారు

మనూనాం మనుపుత్రాణాం జగతోఽమానవస్య చ ।
మన్వన్తరాణాం సర్వేషామీశ్వరాణాం త్వమీశ్వరః ॥ 21

మనువు రొక్కయు మను పుత్రులయొక్కయు జగత్తు రొక్కయు అమానవునియొక్కయు మన్వంతరము లన్నిటి రొక్కయు ఈశ్వరులయొక్కయు ఈశ్వరుడు మీరే అయియున్నారు

సంహారకాలే సమ్ప్రాప్తే తవ క్రోధ వినిః సృతః ।
సంవర్తకాగ్ని స్త్రైలోక్యం భస్మీకృత్యావతిష్ఠతే ॥ 22

ప్రళయకాల మేతెంచగా మీ వలన ప్రకటమగు సంవర్తక మను అగ్ని మూడు లోకములను భస్మ మొనర్చి తిరిగి మీ యందే స్థితిని పొందుచున్నది

త్వద్దీధితి సముత్పన్నా నానావర్ణా మహాఘనాః।
సైరావతాః సాశనయః కుర్వన్త్యాభూత సమ్ప్లవమ్॥ 23

మీ యొక్క కిరణముల చేతనే ఉత్పన్నములగు ఐరావతాది రంగురంగుల మహామేఘములు మెఱుపులు సమస్త ప్రాణుల యొక్క సంహారము నొనర్చుచున్నవి

కృత్వా ద్వాదశధాఽఽత్మానం ద్వాదశాదిత్యతాం గతః।
సంహృత్యైకార్ణవం సర్వం త్వం శోషయసి రశ్మిభిః॥ 24

ఎదప మీరే మిమ్ములను పండ్రెండు స్వరూపములుగ విభజించుకొని పండ్రెండుగురు సూర్యుల రూపమున ఉదయించి మీ కిరణములద్వారా ముల్లోకములను సంహార మొనర్చుచు ఏకార్ణవము యొక్క జలమునంతను శోషింప చేయుచున్నారు

త్వామిన్ద్రమాహు స్త్వం రుద్ర స్త్వం విష్ణుస్త్వం ప్రజాపతిః।
త్వమగ్ని స్త్వం మనః సూక్ష్మం ప్రభు స్త్వం బ్రహ్మ శాశ్వతమ్॥ 25

మిమ్ములనే ఇంద్రుడని చెప్పుచున్నారు మీరే రుద్రుడు మీరే విష్ణువు మీరే ప్రజాపతి అగ్ని సూక్ష్మమనస్సు ప్రభువు సనాతన బ్రహ్మము మీరే అయి యున్నారు

త్వం హంసః సవితా భానురంశుమాలీ వృషాకపిః।
వివస్వాన్ మిహారః పూషా మిత్రో ధర్మ స్తథైవ చ॥ 26

సహస్ర రశ్మిరాదిత్య స్తపనస్త్వం గవాంపతిః।
మార్తణ్డోఽర్కో రవిః సూర్యః శరణ్యో దినకృత్ తథా ॥ 27
దివాకరః సప్తసప్తిర్ధామకేశీ విరోచనః।
ఆశుగామీ తమోఘ్నశ్చ హరితాశ్వశ్చ కీర్త్యసే ॥ 28

సూర్యదేవా! మీరే హంస సవితా, భాను అంశుమాలీ, వృషాకపి వివస్వాన్ మిహిర పూషా మిత్ర ధర్మ సహస్ర రశ్మి ఆదిత్య తపన, గవాంపతి మార్తండ, అర్క రవి సూర్య శరణ్య దినకృత్ దివాకర సప్తసప్తి ధామకేశీ విరోచన ఆశుగామీ తమోఘ్న హరితాశ్వ—అను పేర్లచే పిలువబడు చున్నారు

స ప్తమ్యామథవా షష్ఠ్యాం భక్త్యా పూజాం కరోతియః।
అనిర్విణ్ణోఽనహంకారీ తం లక్ష్మీర్భజతే నరమ్ ॥ 29

ఎవడు సప్తమి యందు లేక షష్ఠియందు ఖేద అహంకార రహితుడై మిమ్ములను పూజించునో అతనికి ఐశ్వర్యము లభించును

న తేషా మాపదః సన్తి నాధయో వ్యాధ యస్తథా।
యే తవానన్యమనసః కుర్వన్త్యర్చన వన్దనమ్ ॥ 30

ఎవరు అనన్యచిత్తములో మీ యొక్క అర్చన వందనము గావించుదురో వారికి ఆపద ఎపుడును కలుగదు వారు మానసిక చింతలచేతను, రోగములచేతను బాధింపబడరు

సర్వరోగైర్విరహితాః సర్వ పాప వివర్జితాః।
త్వద్భావభక్తాః సుఖినో భవన్తి చిరజీవినః ॥ 31

ఎవరు ప్రేమపూర్వకముగ మీ యెడల భక్తి కలిగి యుందురో వారు సమస్త రోగములనుండి పాపములనుండి విముక్తులై చిరంజీవులు, సుఖవంతులు అగుదురు

# కార్తికేయస్వామి (స్కంద) నామావళి

## (మార్కండేయుడు)

## (వనపర్వము 232 వ అధ్యాయము)

ఆగ్నేయశ్చైవ స్కన్దశ్చ దీప్తకీర్తి రనామయః।
మయూరకేతుర్ధర్మాత్మా భూతేశో మహిషార్దనః॥ 1

కామజిత్ కామదః కాన్తః సత్యవాగ్ భువనేశ్వరః।
శిశుః శీఘ్రః శుచిశ్చణ్డో దీప్తవర్ణః శుభాననః॥ 2

అమోఘస్త్వనఘో రౌద్రః ప్రియశ్చన్ద్రాననస్తథా।
దీప్తశక్తిః ప్రశాన్తాత్మా భద్రకృత్ కూటమోహనః॥ 3

షష్ఠీప్రియశ్చ ధర్మాత్మా పవిత్రో మాతృవత్సలః।
కన్యాభర్తా విభక్తశ్చ స్వాహేయో రేవతీసుతః॥ 4

ప్రభుర్నేతా విశాఖశ్చ నైగమేయః సుదుశ్చరః।
సువ్రతో లలితశ్చైవ బాలక్రీడనకప్రియః॥ 5

ఖచారీ బ్రహ్మచారీ చ శూరః శరవణోద్భవః।
విశ్వామిత్ర ప్రియశ్చైవ దేవసేనాప్రియస్తథా॥ 6

వాసుదేవ ప్రియశ్చైవ ప్రియః ప్రియకృదేవ తు।
నామాన్యేతాని దివ్యాని కార్తికేయస్య యః పఠేత్।
స్వర్గం కీర్తిం ధనం చైవ స లభేన్నాత్ర సంశయః॥ 7

ఆగ్నేయ స్కంద దీప్తకీర్తి అనామయ మయూరకేతు ధర్మాత్మా భూతేశ మహిషమర్దన కామజిత్ కామద కాన్త సత్యవాక్ భువనేశ్వర శిశు శీఘ్ర శుచి చండ దీప్తవర్ణ ప్రశాన్తాత్మా భద్రకృత్ కూటమోహన షష్ఠీప్రియ ధర్మాత్మా పవిత్ర మాతృవత్సల కన్యాభర్తా విభక్త స్వాహేయ రేవతీ

సుత ప్రభు నేతా, విశాఖ నైగమేయ, సుదుశ్చర సువ్రత లలిత బాలక్రీడనకప్రియ ఆకాశచారి బ్రహ్మచారీ శూర శర వణోద్భవ విశ్వామిత్రప్రియ దేవసేనాప్రియ వాసుదేవప్రియ ప్రియ, ప్రియకృత్ —అను నివి కార్తికేయుని దివ్యనామములు ఎవడు వీనిని పఠించునో అతడు ధనమును కీర్తిని స్వర్గలోకమును పొందును ఇందు సంశయము లేదు

# స్కంద స్తోత్రము

(మార్కండేయుడు)

## (వనపర్వము 232 వ అధ్యాయము)

బ్రహ్మణ్యో వై బ్రహ్మజో బ్రహ్మవిచ్చ
బ్రహ్మేశయో బ్రహ్మవతాం వరిష్ఠః।
బ్రహ్మప్రియో బ్రాహ్మణసవ్రతీ త్వం
బ్రహ్మజ్ఞో వై బ్రాహ్మణానాం చ నేతా॥ 1

స్కందదేవా! మీరు బ్రాహ్మణ (బ్రహ్మనిష్ఠ)హితైషులు బ్రహ్మతేజులు, బ్రహ్మవేత్తలు, బ్రహ్మనిష్ఠులు బ్రహ్మజ్ఞానులలో శ్రేష్ఠులు బ్రాహ్మణప్రియులు, బ్రాహ్మణులవలె వ్రతధారులు, బ్రహ్మజ్ఞులు బ్రాహ్మణుల నాయకులు అయి యున్నారు

స్వాహా స్వధా త్వం పరమం పవిత్రం
మన్త్రస్తుత స్త్వం ప్రథితః షడర్చిః।
సంవత్సర స్త్వ మృతవశ్చ షడ్ వై
మాసార్ధ మాసావయనం దిశశ్చ॥ 2

స్వాహా స్వధారూపమైనదియు పరమ పవిత్రమైనదియు మంత్రములద్వారా ప్రశంసింపబడినదియు అగు సుప్రసిద్ధ షడర్చి అగ్ని మీరే అయి యున్నారు మీరే సంవత్సరములు ఆరు ఋతువులు పక్షములు మాసములు అయనములు దిక్కులు అయి యున్నారు

త్వం పుష్కరాక్షస్త్వరవిన్ద వక్త్రః
సహస్రవక్త్రోఽసి సహస్రబాహుః।
త్వం లోకపాలః పరమం హవిశ్చ
త్వం భావనః సర్వసురాసురాణామ్॥ 3

మీరు కమలనేత్రులు కమలముఖులు సహస్రనేత్రులు, సహస్రబాహువులు అయి యున్నారు లోకపాలురు సర్వోత్తమ హవిస్యము సమస్త దేవతల అసురుల పాలకులు మీరే అయి యున్నారు

త్వమేవ సేనాధిపతిః ప్రచణ్డః
ప్రభుర్విభుశ్చాప్యథ శత్రుజేతా।
సహస్రభూస్త్వం ధరణీ త్వమేవ
సహస్రతుష్టిశ్చ సహస్రభుక్ చ॥ 4

మీరే సేనాపతి ప్రచండరూపులు ప్రభువు, విభువు శత్రు విజయులు అయి యున్నారు మీరే సహస్ర భూస్వరూపులు పృథివి అయి యున్నారు మీరు వేల కొలది ప్రాణులకు సంతోష మును కలుగజేయువారు సహస్రభోక్తయు అయి యున్నారు

సహస్రశీర్షస్త్వమనన్త రూపః
సహస్రపాత్ త్వం గుహ శక్తిధారీ।
గఙ్గాసుతస్త్వం స్వమతేన దేవ
స్వాహామహీ కృత్తికానాం తథైవ॥ 5

మీకు వేలకొలది శిరస్సులు కలవు మీ స్వరూపమున కెచ్చటను అంతము లేదు మీకు వేలకొలది పాదములు కలవు మీరు శక్తిని ధరించుచున్నారు దేవా! మీరు మీ ఇచ్ఛానుసారము గంగ స్వాహా పృథివి కృత్తికల పుత్ర రూపమున ప్రకటమై యున్నారు

త్వం క్రీడసే షణ్ముఖ కుక్కుటేన
యథేష్ట నానావిధ కామరూపీ।
దీక్షాసి సోమో మరుతః సదైవ
ధర్మోఽసి వాయురచలేన్ద్ర ఇన్ద్రః॥ 6

షడాననా! మీరు కుక్కుట పక్షితో ఆడుకొందురు మీరు మీ ఇచ్ఛానుసారము పలువిధము రమణీయరూపములను ధరించుదురు మీరు సదా దీక్షా, సోమ మరుద్గణ ధర్మ వాయు గిరిరాజ ఇంద్రస్వరూపులై యున్నారు

సనాతనానామపి శాశ్వత స్త్వం
ప్రభుః ప్రభూణామపి చోగ్రధన్వా।
ఋతస్య కర్తా దితిజాన్త కస్త్వం
జేతా రిపూణాం ప్రవరః సురాణామ్॥ 7

మీరు సనాతనులలో సనాతనులు ప్రభువులకును ప్రభువులు మీ ధనుస్సు భయంకరమైనది మీరు సత్యప్రవర్తకులు దైత్యులను సంహారించువారు శత్రువిజయులు దేవతలలో శ్రేష్ఠులు అయి యున్నారు

సూక్ష్మం తపస్తత్ పరమం త్వమేవ
పరావరజ్ఞోఽసి పరావర స్త్వమ్।
ధర్మస్య కామస్య పరస్య చైవ
త్వత్తేజసా కృత్స్నమిదం మహాత్మన్॥ 8

సర్వోత్కృష్టమైన సూక్ష్మ తపస్సు మీరే అయియున్నారు కార్య కారణ తత్త్వము నెఱింగినవారు కార్యకారణస్వరూపులు మీరే అయియున్నారు ధర్మ కామములకు పరమైన మోక్ష స్వరూపమును మీరెఱింగియున్నారు మహాత్మా! ఈ సమస్త జగత్తు మీయొక్క తేజస్సుచే ప్రకాశించుచున్నది

వ్యాప్తం జగత్ సర్వ సురప్రవీర
శక్త్యా మయా సంస్తుత లోకనాథ।
నమోఽస్తు తే ద్వాదశ నేత్ర బాహో
అతః పరం వేద్మి గతిం న తేఽహమ్॥ 9

సమస్త దేవతాప్రవీరా! మీ శక్తిచే ఈ ప్రపంచమంతను వ్యాపించి యున్నది లోకనాథా! నేను యథాశక్తి మీ స్తవనమును గావించినాను పండ్రెండు నేత్రములతో బాహువులతో సొన్నగ శోభించుదేవా! మీకు నమస్కారము! దీనికంటె పరముగ ఏమీ స్వరూపము కలదో దానిని నే నెఱుగను

స్కన్దస్య య ఇదం విప్రః పఠేజ్జన్మ సమాహితః।
శ్రావయేద్ బ్రాహ్మణేభ్యో యః శృణుయాద్ వా
ద్విజేరితమ్। 10

ధనమాయుర్యశో దీప్తం పుత్రాఞ్ఛత్రుజయం తథా।
స పుష్టితుష్టీ సమ్ప్రాప్య స్కన్దసాలోక్యమాప్నుయాత్॥ 11

ఎవడు ఏకాగ్రచిత్తుడై స్కందదేవుని ఈ జన్మవృత్తాంతమును పఠించునో ఇతరులకు వినిపించునో లేక స్వయముగ విజ్ఞుల ద్వారా వినునో అతడు ధనమును ఆయుస్సును ఉజ్జ్వలకీర్తిని పుత్రులను శత్రువిజయమును తుష్టిని పుష్టిని బొంది తుదకు స్కందుని లోకమునకు పోవును

# కృష్ణస్తుతి

## (ద్రౌపది)

## (వనపర్వము - 263 వ అధ్యాయము)

కృష్ణ కృష్ణ మహాబాహో దేవకీ నన్దనావ్యయ ॥ 1
వాసుదేవ జగన్నాథ ప్రణతార్తి వినాశన ।
విశ్వాత్మన్ విశ్వజనక విశ్వహర్తః ప్రభోఽవ్యయ ॥ 2
ప్రపన్నపాల గోపాల ప్రజాపాల పరాత్పర ।
ఆకూతీనాం చ చిత్తీనాం ప్రవర్తక నతాస్మి తే ॥ 3

కృష్ణా! మహాబాహూ! దేవకీనందనా! నాశ రహిత వాసుదేవా! పాదములపై పడు దుఃఖితుల దుఃఖమును తొలగించు ఓ జగదీశ్వరా! సమస్త ప్రపంచముయొక్క ఆత్మ నాశరహితులగు ప్రభువులు మీరే! ఈ జగత్తుయొక్క సృష్టిని సంహారమును గావించువారు మీరే శరణాగతులను రక్షించు గోపాలా! సమస్త ప్రజలను పాలించు పరాత్పరుడగు పరమేశ్వరుడు మీరే మనస్సు బుద్ధి వీని ప్రేరకులగు పరమాత్మా! నేను మీకు ప్రణమిల్లుచున్నాను

వరేణ్య వరదానన్త అగతీనాం గతిర్భవ ।
పురాణపురుష ప్రాణమనోవృత్త్యాద్యగోచర ॥ 4
సర్వాధ్యక్ష పరాధ్యక్ష త్వామహం శరణం గతా ।
పాహి మాం కృపయాదేవ శరణాగతవత్సల ॥ 5

ఉత్తమ వరదాతా! అనంతా! రంపు! ఎవరికి మీరు తప్ప సహాయము చేయువారు మఱెవరును లేరో అట్టి అసహాయులగు భక్తులకు సహాయము చేయుదు! పురాణపురుషా! ప్రాణ మనోవృత్తులు మిమ్ములను సమీపించజాలవు సర్వులకు సాక్షియగు పరమాత్మా! నేను మిమ్ములను శరణు బొందుచున్నాను శరణాగతవత్సలురగు దేవా! దయచేసి నన్ను రక్షింపుడు

నీలోత్పలదలశ్యామ పద్మగర్భారుణేక్షణ ।
పీతామ్బరపరీధాన లసత్కౌస్తుభభూషణ ॥ 6

త్వమాదిరన్తో భూతానాం త్వమేవ చ పరాయణమ్ ।
పరాత్పరతరం జ్యోతిర్విశ్వాత్మా సర్వతోముఖః ॥ 7

నీల కమల దళ సమాన శ్యామసుందరా! కమల పుష్పము యొక్క లోపలిభాగము వలె ఒకింత ఎఱ్ఱనైన నేత్రములు గల పీతాంబరధారియగు ఓ శ్రీకృష్ణా! మీ వక్షఃస్థలముపై కౌస్తుభ మణిమయ భూషణము శోభను పొందుచున్నది ప్రభూ! మీరే సమస్త ప్రాణులయొక్క ఆది అంతములు అయి యున్నారు మీరే సర్వులకు పరమాశ్రయము అయి యున్నారు పరాత్పరుడు, జ్యోతిర్మయుడు సర్వాత్మస్వరూపుడు సర్వతోముఖ పరమేశ్వరుడు మీరే

త్వామేవాహుః పరం బీజం నిధానం సర్వసమ్పదామ్ ।
త్వయా నాథేన దేవేశ సర్వాపద్భ్యో భయం న హి ॥ 8

జ్ఞానులు మిమ్ములనే ఈ జగత్తుయొక్క పరమబీజముగను సమస్త సంప్రదాయములయొక్క నిధిగను చెప్పుదురు దేవేశ్వరా! మీరు నా రక్షకులైనచో విపత్తులన్నియు నాపై విరుచుకు పడినను నాకేమియు భయము లేదు

# దుర్గా స్తోత్రము

(ధర్మరాజు)

## (విరాటపర్వమ ౧ - 6 వ అధ్యాయము)

చతుర్భుజే చతుర్వక్త్రే పీనశ్రోణి పయోధరే ।
మయూరపింఛవలయే కేయూరాంగదధారిణి ॥
భాసి దేవి యథా పద్మా నారాయణ పరిగ్రహః ॥ 1

స్వరూపం బ్రహ్మచర్యం చ విశదం గగనేశ్వరీ ।
కృష్ణచ్ఛవిసమా కృష్ణా సంకర్షణ సమాననా ॥ 2

బిభ్రతీ విపులౌ బాహూ శక్రధ్వజసముచ్ఛ్రయౌ ।
పాత్రీ చ పఙ్కజీ ఘణ్టీ స్త్రీవిశుద్ధా చ యా భువి ॥ 3

పాశం ధనుర్మహాచక్రం వివిధాన్యాయుధాని చ ।
కుణ్డలాభ్యాం సుపూర్ణాభ్యాం కర్ణాభ్యాం చ విభూషితా ॥ 4

చన్ద్రవిస్పర్ధినా దేవి ముఖేన త్వం విరాజసే ।
ముకుటేన విచిత్రేణ కేశబన్ధేన శోభినా ॥ 5

భుజఙ్గాభోగవాసేన శ్రోణిసూత్రేణ రాజతా ।
విభ్రాజసే చాబద్ధేన భోగేనేవేహ మన్దరః ॥ 6

దేవీ! మీరు నాలుగు భుజములతో శోభించు విష్ణురూపిణియు నాలుగు ముఖములతో వెలయు బ్రహ్మస్వరూపిణియు అయియున్నారు సుందర అవయవములు కలిగియున్నారు నెమలి ఈకల వలయమును కేయూర అంగద, ఆభరణములను ధరించియున్నారు

నారాయణుని పత్నియగు లక్ష్మీదేవి వలె మీరు శోభించుచున్నారు ఆకాశమున సంచరించు దేవీ! మీయొక్క స్వరూపము బ్రహ్మచర్యము పరమ ఉజ్జ్వలములై యున్నవి మీరు శ్యామసుందరుడగు శ్రీకృష్ణుని కాంతివంటి కాంతి కలిగియున్నారు కనుకనే మీరు కృష్ణా అని చెప్పబడియున్నారు మీ ముఖము సంకర్షణుని ముఖమును పోలియున్నది మీరు (వర అభయ ముద్రలను ధరించి) పై కెత్తబడిన రెండు విశాలభుజములను ఇంద్రుని ధ్వజము వలె ధరించియున్నారు మీ మూడవ చేతియందు పాత్ర నాలుగవ చేతియందు కమలము ఐదవదానియందు ఘంట శోభించుచున్నవి ఆఱవ చేతియందు పాశము ఏడవ చేతియందు ధనుస్సు ఎనిమిదవ చేతియందు చక్రము శోభించుచున్నవి ఇవియే మీయొక్క వివిధ ఆయుధములు ఈ భూతలముపై స్త్రీయొక్క విశుద్ధస్వరూప మేది కలదో అది మీరే ఆయి యున్నారు మీరు చంద్రునితో పోటీ పడునట్టి ముఖము కలవారై యున్నారు మీ శిరస్సుపై విచిత్రమైన కిరీటము మీ జడతో కలసి శోభించుచున్నది మీ నడుమునకు చుట్టబడిన ఒడ్డాణము సర్పముచే చుట్టబడిన మందరాచలమువలె శోభను బడయుచున్నది

ధ్వజేన శిఖిపిచ్ఛానాముచ్ఛ్రితేన విరాజసే ।
కౌమారం వ్రతమాస్థాయ త్రిదివం పాలితం త్వయా ॥ 7

నెమలి ఈకచే అలంకరించబడిన మీ ధ్వజము ఆకాశమున ఎత్తుగ వెలయుచుండుటచే దానివలన మీ యొక్క శోభ మఱింత ఇనుమడించినది మీరు బ్రహ్మచర్య వ్రతమును ధరించి ముల్లోకములను పవిత్ర మొనర్చినారు

తేన త్వం స్తూయసే దేవి త్రిదశైః పూజ్యసేఽపి చ ।
త్రైలోక్యరక్షణార్థాయ మహిషాసురనాశిని ।
ప్రసన్నా మే సురశ్రేష్ఠే దయాం కురు శివా భవ ॥ 8

కనుకనే దేవతలందరును మిమ్ములను స్తుతించుచు పూజించుచున్నారు । ముల్లోకములను రక్షించుటకొఱకై మహిషాసురుని నాశమొనర్చిన ఓ దేవేశ్వరీ! నాపై ప్రసన్నురాలై దయచూపుడు నాకు శ్రేయస్సును కలుగజేయుడు

జయా త్వం విజయా చైవ సంగ్రామే చ జయప్రదా ।
మమాఽపి విజయం దేహి వరదా త్వం చ సామ్ప్రతమ్ ॥ 9

మీరు జయ విజయ అను పేర్లు కలిగియున్నారు యుద్ధమందు మీకే విజయము కలుగును కావున నాకున్ను విజయము కలుగజేయుడు ఇపుడు మీరు నాకు వరముల నొసంగుడు

విన్ధ్యే చైవ నగశ్రేష్ఠే తవ స్థానం హి శాశ్వతమ్ ।
కాలి కాలి మహాకాలి ఖడ్గఖట్వాఙ్గ ధారిణి ॥ 10

పర్వతములలో శ్రేష్ఠమగు వింధ్యపర్వతముపై మీయొక్క నివాసస్థానము శాశ్వతముగా కలదు కాళీ! కాళీ! మహాకాళీ! మీరు ఖడ్గమును మంచపుకోడును ధరించి యున్నారు

కృతాను యాత్రా భూతైస్త్వం వరదా కామచారిణి ।
భారావతారే యే చ త్వాం సంస్మరిష్యన్తి మానవాః ॥ 11

ప్రణమన్తి చ యే త్వాం హి ప్రభాతే తు నరా భువి ।
న తేషాం దుర్లభం కించిత్ పుత్రతో ధనతోఽపి వా ॥ 12

ఎవడు మిమ్ములను అనుసరించునో అతనికి మీరు మనోవాంఛిత వరములు ఒసంగుచున్నారు ఇచ్ఛానుసారము సంచరించు దేవీ! ఎవరు తమ తమ సంకటములను బాపుకొనుటకొఱకై మిమ్ములను స్మరింతురో ఎవరు ప్రతిదినము ప్రాతః[illegible] నమస్కరించుదురో వారికి ఈ భూతలమున పుత్ర[illegible]ధన ధాన్యా[illegible] లెవ్వియు దుర్లభములు కావు

దుర్గాత్ తారయసే దుర్గే తత్ త్వం దుర్గా స్మృతా జనైః ।
కాన్తారేష్వవసన్నానాం మగ్నానాం చ మహార్ణవే ॥ 13
దస్యుభిర్వా నిరుద్ధానాం త్వం గతిః పరమా నృణామ్ ।
జలప్రతరణే చైవ కాన్తారేష్వటవీషు చ ॥ 14
యే స్మరన్తి మహాదేవి న చ సీదన్తి తే నరాః ।
త్వం కీర్తిః శ్రీర్ధృతిః సిద్ధిర్హ్రీర్విద్యా సంతతిర్మతిః ॥ 15
సంధ్యా రాత్రిః ప్రభానిద్రా జ్యోత్స్నా కాన్తిః క్షమా దయా ।
నృణాం చ బన్ధనం మోహం పుత్రనాశం ధనక్షయమ్ ॥ 16
వ్యాధిం మృత్యుం భయం చైవ పూజితా నాశయిష్యసి ।
సోఽహం రాజ్యాత్ పరిభ్రష్టః శరణం త్వాం ప్రపన్నవాన్ ॥ 17

దుర్గాదేవీ! మీరు జనులను దుస్సహములైన దుఃఖముల నుండి ఉద్ధరించుచున్నారు కనుకనే జనులు మిమ్ములను 'దుర్గా' అని పిలుచుచున్నారు దుర్గమమగు అరణ్యమందు కష్టములను పొందు వారికి మహా సముద్రమున మునుగుచున్న వారికి దొంగల వశమందు పడినవారికి అందఱికిని మీరే పరమగతి అయియున్నారు మీరే వారిని సంకటములనుండి విముక్తులుగ చేయగలరు మహాదేవీ! నీటిపై ఈదునపుడు దుర్గమ మార్గమందు పయనించునపుడు అరణ్యమందు తిరుగాడునపుడు ఎవరు మిమ్ములను స్మరింతురో వారు క్లేశములను పొందరు మీరే కీర్తి ఐశ్వర్యము ధైర్యము సిద్ధి లజ్జ విద్య సంతతి మతి సంధ్య రాత్రి, ప్రభ (వెలుగు) నిద్ర జ్యోత్స్న (వెన్నెల) కాంతి ఓర్పు దయ అయియున్నారు మీరు పూజింపబడగా మనుజుల బంధనమును మోహమును పుత్రనాశ ధననాశముల సంకటమును వ్యాధిని మృత్యువును సమస్త భయములను నశింపజేయుచున్నారు నేనున్ను రాజ్యభ్రష్టుడనై అనుగ్రహమునకు మిమ్ములను శరణు బొందుచున్నాను

ప్రణతశ్చ యథా మూర్ధ్నా తవ దేవి సురేశ్వరి ।
త్రాహి మాం పద్మపత్రాక్షి సత్యే సత్యా భవస్వ నః ॥
శరణం భవమే దుర్గే శరణ్యే భక్తవత్సలే । 16

కమలనేత్రీ! దేవేశ్వరీ! నేను మీ పాదములపై శిరస్సునుంచి ప్రణమిల్లుచున్నాను నన్ను రక్షింపుడు సత్యస్వరూపిణీ! మీ మహిమను సత్యముొనర్చి మాకు చూపుడు శరణాగతులను రక్షించు భక్తవత్సలయగు దుర్గాదేవీ! నాకు శరణమొసంగుడు

# దుర్గా స్తవనము

## (అర్జునుడు)

## (భీష్మపర్వము 23 వ అధ్యాయము)

నమస్తే సిద్ధసేనాని ఆర్యే మన్దరవాసిని ।
కుమారి కాలి కాపాలి కపిలే కృష్ణపిఙ్గలే ॥ 1
భద్రకాలి నమస్తుభ్యం మహాకాలి నమోఽస్తు తే ।
చణ్డి చణ్డే నమస్తుభ్యం తారిణి వరవర్ణిని ॥ 2

మందర పర్వతముపై నివసించువారును సిద్ధుల సేనానేత్రియు నగు ఓ దేవీ! మీకు మరల మరల నమస్కారము మీరే కుమారి కాళి కాపాలి కపిల కృష్ణపింగళ భద్రకాళి, మహాకాళి మున్నగు పేర్లతో ప్రసిద్ధికెక్కియున్నారు మీకు మరల మరల ప్రణామములు దుష్టులపై ప్రచండమగు కోపము కలిగియుండుటచే మీరు చండియని పిలవబడుచున్నారు భక్తులను సంకటములనుండి

తరింపజేయుటచే మీరు తారిణి యని చెప్పబడుచున్నారు  మీ శరీరముయొక్క దివ్యవర్ణము చాల సుందరమైనది  నేను మీకు ప్రణామిల్లుచున్నాను

**కాత్యాయని మహాభాగే కరాలి విజయే జయే ।**
**శిఖిపించ్ఛధ్వజ ధరే నానాభరణభూషితే ॥ 3**

మహాభాగా! మీరే పూజనీయులైన కాత్యాయనియును భయంకర రూపధారిణి యగు కాళియు అయియున్నారు  మీరే విజయ, జయ అను పేర్లతో ప్రసిద్ధికెక్కియున్నారు  మీ ధ్వజము నెమలి ఈకతో కూడినది  వివిధ ఆభరణములు మీ అవయవముల శోభను ఇనుమడింపజేయుచున్నవి

**అట్టశూలప్రహరణే ఖడ్గఖేటకధారిణి ।**
**గోపేన్ద్రస్యానుజే జ్యేష్ఠే నన్దగోపకులోద్భవే ॥ 4**

మీరు భయంకరములైన త్రిశూలము ఖడ్గము డాలు వాలు మున్నగు ఆయుధములను ధరించియున్నారు  నందగోపుని వంశమందు మీరు అవతరించినారు  కనుకనే గోపేశ్వరుడగు శ్రీకృష్ణునకు మీరు చిన్న చెల్లెలుగా నున్నారు  గుణమునందును ప్రభావమునందు మీరు సర్వశ్రేష్ఠులై యున్నారు

**మహిషాసృక్ప్రియే నిత్యం కౌశికి పీతవాసిని ।**
**అట్టహాసే కోకముఖే నమస్తేఽస్తు రణప్రియే ॥ 5**

మహిషాసురుని రక్తమును ప్రవహింపజేసిన ఎడల మీకు చాల ప్రసన్నత్వము కలిగినది  మీరు కుశిక గోత్రమందు అవతరించుటచే కౌశికి అను పేరుతో ప్రసిద్ధికెక్కియున్నారు  మీరు పీతాంబరము ధరించియున్నారు  శత్రువులను చూచి మీరు అట్టహాసము చేయునపుడు మీ ముఖము చక్రవాకము వలె ఉద్దీప్తమగును

యుద్ధము మీకు చాల ప్రియమైయున్నది నేను మీకు మరల మరల ప్రణమిల్లుచున్నాను

**ఉమే శాకమ్భరి శ్వేతే కృష్ణే కైటభనాశిని।**
**హిరణ్యాక్షి విరూపాక్షి సుధూమ్రాక్షి నమోఽస్తు తే॥ 6**

ఉమా శాకంభరీ శ్వేతా కృష్ణా కైటభనాశినీ హిరణ్యాక్షీ విరూపాక్షీ సుధూమ్రాక్షీ మున్నగు పేర్లను కలిగియుండు ఓ దేవీ! మీకు మరల మరల నమస్కారము చేయుచున్నాను

**వేదశ్రుతి మహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి।**
**జమ్బూకటక చైత్యేషు నిత్యం సన్నిహితాలయే॥ 7**

మీరు వేదములయొక్క శ్రుతి అయియున్నారు మీ స్వరూపము మహా పవిత్రమైయున్నది వేదములు బ్రాహ్మణులు మీకు ప్రియస్వరూపులైయున్నారు మీరే జాతవేదా అగ్ని యొక్క శక్తి అయియున్నారు జంబూ కటక చైత్య వృక్షములందు మీ యొక్క నిత్య నివాస మున్నది

**త్వం బ్రహ్మవిద్యావిద్యానాం మహానిద్రా చ దేహినామ్।**
**స్కన్దమాతర్భగవతి దుర్గే కాన్తారవాసిని॥ 8**

మీరు సమస్త విద్యలందును బ్రహ్మవిద్యయు దేహధారులందఱియొక్క మహానిద్రయు అయియున్నారు భగవతీ! మీరు కార్తికేయుని తల్లి అయియున్నారు మఱియు దుర్గమ స్థానములందు నివసించు దుర్గయు అయియున్నారు

**స్వాహాకారః స్వధా చైవ కలా కాష్ఠా సరస్వతీ।**
**సావిత్రీ వేదమాతా చ తథా వేదాన్త ఉచ్యతే॥ 9**

స్వాహా స్వధా కళా కాష్ఠా సరస్వతీ సావిత్రి వేదమాతా, వేదాంత — అను ఇవియన్నియు మీయొక్క పేర్లు అయియున్నవి

స్తుతాసి త్వం మహాదేవి విశుద్ధేనాన్తరాత్మనా ।
జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదాద్ రణాజిరే ॥ 10

మహాదేవీ! నేను విశుద్ధ హృదయముతో మీ స్తోత్ర-స్తవనమును గావించినాను మీ కృపచే ఈ రణాంగణమందు నాకు సదా జయము కలుగుగాక!

కాన్తారభయదుర్గేషు భక్తానాం చాలయేషు చ ।
నిత్యం వససి పాతాలే యుద్ధే జయసి దానవాన్ ॥ 11

తల్లీ! మీరు భీకరారణ్యమందు, భయపూర్ణములగు దుర్గమస్థానములందు భక్తుల ఇండ్లయందు పాతాళమందు నిత్యము నివసించుచున్నారు యుద్ధమందు దానవులను మీరు ఓడించివేయుచున్నారు

త్వం జమ్భనీ మోహినీ చ మాయా హ్రీః శ్రీస్తథైవ చ ।
సంధ్యా ప్రభావతీ చైవ సావిత్రీ జననీ తథా ॥ 12

మీరే జంభనీ మోహినీ మాయా హ్రీం శ్రీ సంధ్యా ప్రభావతీ సావిత్రీ మరియు జననీ అయియున్నారు

తుష్టిః పుష్టిర్ధృతిర్దీప్తిశ్చన్ద్రాదిత్యవివర్ధినీ ।
భూతిర్భూతిమతాం సఙ్ఖ్యే వీక్ష్యసే సిద్ధచారణైః ॥ 13

మీరు తుష్టిని పుష్టిని ధృతిని సూర్యచంద్రులను వృద్ధిపఱచు దీప్తి అయియున్నారు ఐశ్వర్యవంతుల విభూతి (ఐశ్వర్యము) మీరే అయియున్నారు యుద్ధభూమియందు సిద్ధులు చారణులు మిమ్ములను దర్శించుచున్నారు

(సంజయుడు —)

య ఇదం పఠతే స్తోత్రం కల్య ఉత్థాయ మానవః ।
యక్షరక్షఃపిశాచేభ్యో న భయం విద్యతే సదా ॥ 14

ఎవడు ప్రొద్దుననే లేచి ఈ స్తోత్రమును పఠించునో అతనికి యక్ష రాక్షస పిశాచముల వలన ఎన్నడును భయము కలుగదు

న చాపి రిపవస్తేభ్యః సర్పాద్యా యే చ దంష్ట్రిణః ।
న భయం విద్యతే తస్య సదా రాజకులాదపి ।
వివాదే జయమాప్నోతి బద్ధో ముచ్యేత బన్ధనాత్ ॥ 15

శత్రువులును సర్పములు మున్నగు కోఱలు గల విష జంతువులును అతనికి ఏవిధమైన హానియు చేయజాలవు రాజకులము వలనను అతని కేమియు భయము ఉండదు దీనిని చదువుటచే వివాదమందు విజయము చేకూరును మఱియు బంధితుడు బంధనము నుండి విడుదల పొందును

దుర్గం తరతి చావశ్యం తథా చౌరై ర్విముచ్యతే ।
సంగ్రామే విజయేన్నిత్యం లక్ష్మీం ప్రాప్నోతి కేవలామ్॥ 16

అతడు దుర్గమ సంకటమును తప్పక దాటును దొంగలున్న అతనిని వదలివేయుదురు అతడు యుద్ధమందు సదా విజయమును పొందును మఱియు విశుద్ధమగు ఐశ్వర్యమును బడయును

ఆరోగ్యబలసమ్పన్నో జీవేద్ వర్షశతం తథా ।
ఏతద్ దృష్టం ప్రసాదాత్ తు మయా వ్యాసస్య ధీమతః ॥ 17

దీనిని పఠించువాడు ఆరోగ్యము బలము కలవాడై నూఱు సంవత్సరములు జీవించును ఇది యంతయు పరమ బుద్ధిమంతుడగు వ్యాసమునియొక్క అనుగ్రహముచే నేను ప్రత్యక్షముగ చూచితిని

# భ గ వ న్ను తి

## (బ్రహ్మదేవుడు)

## (భీష్మపర్వము 65 వ అధ్యాయము)

**విశ్వావసుర్విశ్వమూర్తిర్విశ్వేశో**
**విష్వక్సేనో విశ్వకర్మా వశీ చ ।**
**విశ్వేశ్వరో వాసుదేవోఽసి తస్మాద్**
**యోగాత్మానం దైవతం త్వాముపైమి ॥ 1**

ప్రభూ! మీరు సమస్త ప్రపంచమున వ్యాపించియున్నవారు మీరు విశ్వస్వరూపులు విశ్వమునకు ప్రభువు అయి యున్నారు ప్రపంచమున అన్నివైపుల మీయొక్క సేన కలదు ఈ విశ్వము మీ యొక్క కార్యమై యున్నది మీరు సమస్తమును మీ వశమందుంచుకొనువారై యున్నారు కనుకనే మిమ్ములను విశ్వేశ్వరుడనియు వాసుదేవుడనియు పిలుచుదురు మీరు యోగ స్వరూపులైన దేవతలు మిమ్ములను శరణు బొందుచున్నాను

**జయ విశ్వ మహాదేవ జయ లోకహితే రత ।**
**జయ యోగీశ్వర విభో జయ యోగపరావర ॥ 2**

విశ్వరూపులగు మహాదేవా! మీకు జయమగుగాక! లోకహితతత్పరులగు పరమేశ్వరా! మీకు జయ మగుగాక! అంతట వ్యాపించి యున్న యోగీశ్వరా! మీకు జయమగుగాక! యోగము యొక్క ఆది అంతములైన దేవా! మీకు జయమగుగాక!

**పద్మగర్భ విశాలాక్ష జయ లోకేశ్వరేశ్వర ।**
**భూత భవ్య భవన్నాథ జయ సౌమ్యాత్మజాత్మజ ॥ 3**

**అసంఖ్యేయగుణాధార జయ సర్వపరాయణ ।**
**నారాయణ సుదుష్పార జయ శార్ఙ్గధనుర్ధర ॥ 4**

మీ నాభినుండి ఆదికమలము జనించినది మీ నేత్రములు విశాలములైనవి మీరు లోకేశ్వరులకును ఈశ్వరులు మీకు జయమగుగాక! భూత భవిష్యద్వర్తమానముల ప్రభూ! మీకు జయమగుగాక! మీ స్వరూపము సౌమ్యమైనది స్వయంభువగు బ్రహ్మనైన నేను మీ పుత్రుడను మీరు అసంఖ్య గుణములకు ఆధారులును అందఱికిని శరణ మొసంగువారును అయియున్నారు మీకు జయమగుగాక! శార్ఙ్గ ధనస్సును ధరించు నారాయణా! మీ మహిమ యొక్క అంతమును పొందుట చాల కష్టము మీకు జయమగుగాక!

**జయ సర్వగుణోపేత విశ్వమూర్తే నిరామయ ।**
**విశ్వేశ్వర మహాబాహూ జయ లోకార్థతత్పర ॥ 5**

మీరు సమస్త ఉత్తమ గుణములతో కూడినవారును విశ్వమూర్తులును నిరామయులును అయియున్నారు మీకు జయమగుగాక! జగత్తుయొక్క అభీష్టమును సాధించు మహాబాహువగు విశ్వేశ్వరా! మీకు జయమగుగాక!

**మహోరగ వరాహాద్య హరికేశ విభో జయ ।**
**హరివాస దిశామీశ విశ్వవాసా మితావ్యయ ॥ 6**

మీరు గొప్పవగు శేషనాగ వారాహరూపములను ధరించువారు, సమస్తమునకు మీరు ఆదికారణులు హరికేశా! ప్రభూ! మీకు జయమగుగాక! మీరు పీతాంబరధారియు, దిక్కులకు ప్రభువును జగత్తునకు ఆధారులును, అప్రమేయులును, నాశరహితులును అయియున్నారు

వ్యక్తావ్యక్తామితస్థాన నియతేన్ద్రియ సత్క్రియ ।
అసంఖ్యేయాత్మభావజ్ఞ జయ గమ్భీర కామద ॥ 7

వ్యక్త అవ్యక్తములన్నియు మీయొక్క స్వరూపములే మీరు నివసించు చోటు అపారమై అనంతమై యున్నది మీరు ఇంద్రియములయొక్క నియంత మీ సమస్త కర్మలు శుభములే అయియున్నవి మీరు అసంఖ్యరూపులు ఆత్మవేత్తలు స్వభావముగ గంభీరులు భక్తుల అభీష్టములను పూర్ణమొనర్చువారు మీకు జయమగుగాక !

అనన్తవిదిత బ్రహ్మన్ నిత్య భూతవిభావన ।
కృతకార్య కృతప్రజ్ఞ ధర్మజ్ఞ విజయావహ ॥ 8

మీరు అనంతబోధస్వరూపులు నిత్యులు సమస్త భూతకోట్లను ఉత్పన్నమొనర్చువారు మీకిక చేయవలసినది ఏమియు లేదు మీ బుద్ధి పవిత్రమైనది మీరు ధర్మముయొక్క తత్త్వమును ఎఱిఁగినవారు మీరు విజయప్రదాతలు

గుహ్యాత్మన్ సర్వయోగాత్మన్ స్ఫుటం సమ్భూతసమ్భవ ।
భూతాద్య లోకతత్త్వేశ జయ భూత విభావన ॥ 9

పూర్ణయోగస్వరూపులగు పరమాత్మా! మీ స్వరూపము గూఢమైనను స్పష్టమైనది ఇప్పటివఱకు గడచినది ఇపుడు గడచుచున్నది అంతయు మీయొక్క రూపమే అయియున్నది మీరు సమస్తభూతములకు ఆదికారణులు లోకతత్త్వముయొక్క ప్రభువులు భూతభావనా! మీకు జయమగుగాక !

ఆత్మయోనే మహాభాగ కల్పసంక్షేప తత్పర ।
ఉద్భావనమనోభావ జయ బ్రహ్మ జనప్రియ ॥ 10

మీరు స్వయంభువులు మీ సౌభాగ్యము గొప్పది మీరుఈ కల్పమును సంహరించువారు మీరు విశుద్ధపరబ్రహ్మ స్వరూపులు ధ్యానము చేయుటచే అంతఃకరణమందు మీ యొక్క ఆవిర్భావము కలుగుచున్నది మీరు జీవులకు ప్రియతమమైన పరబ్రహ్మము అయి యున్నారు మీకు జయమగుగాక!

విసర్గ సర్గనిరత కామేశ పరమేశ్వర
అమృతోద్భవ సద్భావ ముక్తాత్మన్ విజయప్రద ॥ 11

మీరు స్వభావముగ ప్రపంచముయొక్క సృష్టియందు ప్రవృత్తిమగుచున్నారు సమస్త అభీష్టముల యొక్క ప్రభువగు పరమేశ్వరుడు మీరే అమృతముయొక్క ఉత్పత్తికి స్థానము సత్యస్వరూపమును ముక్తాత్మయు విజయము నొసంగువారును మీరే అయియున్నారు

ప్రజాపతిపతే దేవ పద్మనాభ మహాబల !
ఆత్మభూత మహాభూత సత్త్వాత్మన్ జయ సర్వదా ॥ 12

మీరు ప్రజాపతులకున్ను ప్రభువును పద్మనాభుడును మహాబలశాలియు అయి యున్నారు సర్వుల ఆత్మ మీరే మహాభూతములు మీరే సత్యస్వరూపులగు పరమేశ్వరా! మీకు సద జయమగు గాక!

పాదౌ తవ ధరా దేవీ దిశో బాహూ దివం శిరః ।
మూర్తిస్తేఽహం సురాః కాయశ్చన్ద్రాదిత్యౌ చ చక్షుషీ ॥ 13

భూమి మీ పాదములు దిక్కులు చేతులు దేవలోకము శిరస్సు బ్రహ్మనగు నేను మీ శరీరమును దేవతలు అవయవములు చంద్రసూర్యులు నేత్రములు

బలం తపశ్చ సత్యం చ కర్మ ధర్మాత్మకం తవ ।
తేజోఽగ్నిః పవనః శ్వాస అపస్తే స్వేదసమ్భవాః ॥ 14

తపస్సు సత్యము మీయొక్క బలము ధర్మము కర్మము మీ యొక్క స్వరూపము అగ్ని మీయొక్క తేజస్సు వాయువు మీ శ్వాస జలము మీ చెమట

అశ్వినౌ శ్రవణౌ నిత్యం దేవీ జిహ్వా సరస్వతీ ।
వేదాః సంస్కారనిష్ఠా హి త్వయీదం జగదాశ్రితమ్ ॥ 15

అశ్వినీకుమారులు మీయొక్క చెవులు సరస్వతీదేవి మీయొక్క జిహ్వ వేదము మీయొక్క సంస్కార నిష్ఠ ఈ జగత్తు సదా మీయొక్క ఆధారముపైననే నిలచియున్నది

న సంఖ్యానం పరీమాణం న తేజో న పరాక్రమమ్ ।
న బలం యోగయోగీశ జానీమస్తే న సమ్భవమ్ ॥ 16

యోగయోగీశ్వరా ! మీయొక్క సంఖ్యగాని పరిమాణముగాని మాకు తెలియదు మీయొక్క తేజము బలము పరాక్రమము కూడ మాకు తెలియవు మీయొక్క ఆవిర్భావ మెట్లగునో అదియు మేమెఱుఁగము

త్వద్భక్తినిరతా దేవ నియమైస్త్వాం సమాశ్రితాః ।
అర్చయామః సదా విష్ణో పరమేశం మహేశ్వరమ్ ॥ 17

ఋషయో దేవగన్ధర్వా యక్షరాక్షస పన్నగాః ।
పిశాచా మానుషాశ్చైవ మృగపక్షి సరీసృపాః ॥
ఏవమాది మయా సృష్టం పృథివ్యాం త్వత్ప్రసాదజమ్। 18

దేవా! మేము మీయొక్క ఉపాసనయందు సంలగ్నులై యున్నాము మీయొక్క నియమములను పాలించుచు మీ శరణ

యుండే యున్నాము విష్ణుదేవా! పరమేశ్వరుడును మహేశ్వరుడును అగు మిమ్ములనే మేము పూజించుచున్నాము మీయొక్క కృపచేతనే మేము భూమిపై ఋషులను దేవతలను గంధర్వులను, యక్షులను రాక్షసులను సర్పములను పిశాచములను మనుష్యులను మృగములను పక్షులను కృమికీటకాదులను సృష్టించితిమి

పద్మనాభ విశాలాక్ష కృష్ణ దుఃఖప్రణాశన ।
త్వం గతిః సర్వభూతానాం త్వం నేతా త్వం జగద్గురుః ।
త్వత్ప్రసాదేన దేవేశ సుఖినో విబుధాః సదా ॥ 19

పద్మనాభా! విశాలనేత్రా! దుఃఖహారి యగు శ్రీకృష్ణా! మీరే సమస్త ప్రాణులయొక్క ఆశ్రయము ప్రభువు అయి యున్నారు మీరే ప్రపంచమునకు గురువు దేవేశ్వరా! మీయొక్క కృపాదృష్టి వలననే దేవతలందఱును సదా సుఖవంతులై యున్నారు

పృథివీ నిర్భయా దేవ త్వత్ప్రసాదాత్ సదాభవత్ ।
తస్మాద్ భవ విశాలాక్ష యదువంశ వివర్ధనః ॥ 20

దేవా! మీయొక్క అనుగ్రహము చేతనే పృథివి సదా నిర్భయముగ నున్నది కనుకనే విశాల నేత్రా! మీరు భూమిపై యదువంశమున మరల అవతరించి అద్దాని కీర్తిని ఇనుమడింప జేయుడు

ధర్మసంస్థాపనార్థాయ దైత్యానాం చ వధాయ చ ।
జగతో ధారణార్థాయ విజ్ఞాప్యంకురు మే విభో ॥ 21

ప్రభూ! ధర్మముయొక్క స్థాపన దైత్యుల వధ, జగత్తుయొక్క రక్షణలకొఱకై మా ప్రార్థనను తప్పక అంగీకరింపుడు

యత్ తత్ పరమకం గుహ్యం త్వత్ప్రసాదాదిదం విభో ।
వాసుదేవ తదేతత్ తే మయోద్గీతం యథాతథమ్ ॥ 22

వాసుదేవా! మీరే పూర్ణతమ పరమేశ్వరుడు మీ యొక్క పరమరహస్య యథార్థ స్వరూపమేది కలదో అదియే ఇచట ఈ రూపమున మీ కృపచే గాన మొనర్పబడుచున్నది

సృష్ట్వా సంకర్షణం దేవం స్వయమాత్మానమాత్మనా ।
కృష్ణ త్వమాత్మనాస్రాక్షీః ప్రద్యుమ్నం చాత్మసమ్భవమ్ ॥ 23

శ్రీకృష్ణా! మీరు ఆత్మద్వారా స్వయముగ సంకర్షణ దేవ రూపమున ప్రకటమై స్వయముగ ఆత్మజస్వరూపముగ ప్రద్యుమ్ని సృష్టించిరి

ప్రద్యుమ్నాదనిరుద్ధం త్వం యం విదుర్విష్ణుమవ్యయమ్ ।
అనిరుద్ధోఽసృజన్మాం వై బ్రహ్మాణం లోకధారిణమ్ ॥ 24

ప్రద్యుమ్నుని నుండి మీరే అనిరుద్ధుని ప్రకటమొనర్చిరి వారిని జ్ఞానులు నాశరహిత విష్ణుస్వరూపముగ నెఱుగుచున్నారు ఆ విష్ణుస్వరూపుడగు అనిరుద్ధుడే లోకధాతయగు బ్రహ్మదేవుడైన నన్ను సృష్టించెను

వాసుదేవమయః సోఽహం త్వయైవాస్మి వినిర్మితః ।
(తస్మాద్ యాచామి లోకేశ చతురాత్మానమాత్మనా)
విభజ్య భాగశోఽఽత్మానం వ్రజ మానుషతాం విభో ॥ 25

ప్రభూ! ఈ ప్రకారముగ మీరే నన్ను సృష్టించిరి మీ కంటె అభిన్నుడనై యుండటచే నేనున్న వాసుదేవ మయుడనై యున్నాను కావున దేవేశ్వరా! మీరు స్వయముగ వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులను నాలుగు రూపములందు విభక్తమై మానవ శరీరమును గ్రహింపుడని ప్రార్థించుచున్నాను

తత్రాసురవధం కృత్వా సర్వలోక సుఖాయ వై।
ధర్మం ప్రాప్య యశఃప్రాప్య యోగం ప్రాప్స్యసి
తత్త్వతః ॥ 26

అచట సర్వజనుల సుఖముకొఱకై అసురులను వధించి ధర్మమును యశస్సును విస్తరింపజేయుడు తుదకు అవతారముయొక్క ఉద్దేశ్యమును పూర్ణమొనర్చి మీరు తిరిగి పారమార్థిక స్వరూపముతో సంయుక్తులై యుందురు

త్వాం హి బ్రహ్మర్షయో లోకే దేవాశ్చామిత విక్రమ।
త్రైస్త్రైర్నామభిర్యుక్తా గాయన్తి పరమాత్మకమ్ ॥ 27

అమిత పరాక్రమ శీలురగు పరమేశ్వరా! ప్రపంచమున మహర్షులు దేవతలు ఏకాగ్రచిత్తులై ఆయా లీలానుసారములగు నామముల ద్వార మీ పరమాత్మ స్వరూపమును గానమును చేయుచున్నారు

స్థితాశ్చ సర్వే త్వయి భూతసంఘాః
కృత్వాఽఽశ్రయం త్వాం వరదం సుబాహో।
అనాదిమధ్యాన్త మపార యోగం
లోకస్య సేతుం ప్రవదన్తి విప్రాః ॥ 28

సుబాహూ! వరదాయకులైన ప్రభువగు మీయొక్క ఆశ్రయము గైకొని సమస్త ప్రాణులు మీయందే స్థితిగలిగియున్నారు బ్రహ్మవేత్తలు మిమ్ములను ఆది మధ్యాంత రహితులుగను అపార యోగ రూపులుగను లోకమర్యాదను రక్షించు సేతు స్వరూపులుగను కీర్తించుచుదురు

# బ్రహ్మభూత స్తోత్రము

## (బ్రహ్మర్షులు దేవతలు)

## (భీష్మపర్వము 68 వ అధ్యాయము)

సాధ్యానామపి దేవానాం దేవదేవేశ్వరః ప్రభుః ।
లోకభావనభావజ్ఞ ఇతి త్వాం నారదోఽబ్రవీత్ ॥ 1

ప్రభూ! మీరు సాధ్యులకు దేవతలకు కూడ ప్రభువు అయియున్నారు మీరు దేవదేవేశ్వరులు మీరు సమస్త ప్రాణుల యొక్క హృదయభావములను ఎఱుఁగువారై యున్నారు మిమ్ము లనుగూర్చి నారదుడు ఇట్లే తెలియయున్నారు

భూతం భవ్యం భవిష్యం చ మార్కండేయోఽభ్యువాచహ ।
యజ్ఞం త్వాం చైవ యజ్ఞానాం తపశ్చ తపసామపి ॥ 2

మార్కండేయుడు మిమ్ములను భూత భవిష్యద్వర్తమాన స్వరూపులుగ చెప్పియున్నారు వారు మిమ్ములను యజ్ఞములకు యజ్ఞముగను తపస్సులకు సారభూతమగు తపస్సుగను చెప్పి యున్నారు

దేవానామపి దేవం చ త్వామాహ భగవాన్ భృగుః ।
పురాణం చైవ పరమం విష్ణో రూపం తవేతి చ ॥ 3

భృగుమహర్షి మిమ్ములను దేవతలకు దేవతగ చెప్పి యున్నారు విష్ణూ! మీ యొక్క రూపము మహా పురాతనము గను ఉత్కృష్టముగను ఉన్నది

వాసుదేవో వసూనాం త్వం శక్రం స్థాపయితా తథా।
దేవ దేవోఽసి దేవానామితి ద్వైపాయనోఽబ్రవీత్॥ 4

ప్రభూ! మీరు వసువులకు వాసుదేవుడున్ను ఇంద్రుని స్వర్గ రాజ్యమందు స్థాపించువారును అయియున్నారు దేవా! మీరు దేవతలకున్ను దేవత అయియున్నారు ద్వైపాయన మహర్షి మీ విషయమునుగూర్చి ఇట్లే చెప్పియున్నారు

పూర్వే ప్రజానిసర్గే చ దక్షమాహుః ప్రజాపతిమ్।
స్రష్టారం సర్వలోకానామఙ్గిరాస్త్వాం తథాబ్రవీత్॥ 5

ప్రథమ ప్రజాసృష్టి సమయమున మీరే దక్షప్రజాపతి అని చెప్పబడినారు మీరే సమస్త ప్రపంచముయొక్క సృష్టికర్త ఈ ప్రకారముగ అంగిరా ముని మిమ్ములనుగూర్చి చెప్పియున్నారు

అవ్యక్తం తే శరీరోత్థం వ్యక్తం తే మనసి స్థితమ్।
దేవా స్త్వత్సమ్భవాశ్చైవ దేవల స్త్వసితోఽబ్రవీత్॥ 6

అవ్యక్తము మీయొక్క శరీరమునుండియే ఉత్పన్నమైనది వ్యక్త మహత్తత్త్వాది కార్యవర్గము మీ మనస్సునందు స్థితి గలిగియున్నది దేవతలందఱును మీ నుండియే జనించినారు—అని అసితుడు దేవలుడు చెప్పిరి

శిరసా తే దివం వ్యాప్తం బాహుభ్యాం పృథివీ తథా।
జఠరం తే త్రయో లోకాః పురుషోఽసి సనాతనః॥ 7

ఏవం త్వామభిజానన్తి తపసా భావితా నరాః।
ఆత్మదర్శనతృప్తానామృషీణాం చాపి సత్తమః॥ 8

మీ శిరస్సుచే దేవలోకము, భుజములచే భూలోకము వ్యాపించియున్నది ముల్లోకములు మీ ఉదరమందున్నవి మీరే

సనాతన పురుషులు తపస్సుచే శుద్ధమైన అంతఃకరణముగల మహా త్ములు మిమ్ములను ఈ ప్రకారమే తెలిసికొనియున్నారు ఆత్మ సాక్షాత్కారముచే తృప్తిగొందిన జ్ఞానులగు మహర్షుల దృష్టి యందును మీరు అందఱికంటెను శ్రేష్ఠులై యున్నారు

రాజర్షీణా ముదారాణా మాహవేష్వ నివర్తినామ్ ।
సర్వధర్మప్రధానానాం త్వంగతిర్మధుసూదన ॥ 9

మధుసూదనా! సమస్త ధర్మముల దను ప్రధానమున్న యుద్ధమందెన్నడును వెనుకకు మరలనివారగు ఉదారులైన రాజర్షుల యొక్క పరమ ఆశ్రయమున్ను మీరే అయియున్నారు

ఇతి నిత్యం యోగవిద్భిర్భగవాన్ పురుషోత్తమః ।
సనత్కుమారప్రముఖైః స్తూయతే ఽభ్యర్చ్యతే హరిః ॥ 10

ఈ ప్రకారముగ సనత్కుమారుడు మున్నగు యోగవేత్తలు, పాపాపహారులు పురుషోత్తములైన మిమ్ములను సదా స్తుతించుచు పూజించుచు నున్నారు

# కృష్ణ స్తుతి

## (ధర్మరాజు)

## (ద్రోణపర్వము 149 వ అధ్యాయము)

కిం తు నాత్యద్భుతం తేషాం యేషాం న స్త్వం సమాశ్రయః
నతేషాం దుష్కృతం కించిత్ త్రిషు లోకేషు విద్యతే ॥ 1

సర్వలోకగురుర్యేషాం త్వం నాథో మధుసూదన ।
త్వత్ప్రసాదద్ధి గోవిన్ద వయం జేష్యామహే రిపూన్ ॥ 2

ఓ కృష్ణా! ఎవరికి మీరు ఆశ్రయమో అట్టి వారకు విజయము సౌభాగ్యము కలుగుట అత్యంత అద్భుతమైన విషయము కాదు మధుసూదనా! సమస్త జగత్తునకు గురువైన మీరు ఎవరికి రక్షకులై యున్నారో వారికి ముల్లోకములందును ఏచటను ఒకింతైనను దుష్కారమైనది లేదు గోవిందా! మీ కృపచే మేము శత్రువులపై నిశ్చయముగ విజయమును పొందెదము

స్థితః సర్వాత్మనా నిత్యం ప్రియేషు చ హితేషు చ ।
త్వాం చైవాస్మాభిరాశ్రిత్య కృతః శస్త్రసముద్యమః ॥ 3
సురైరివాసురవధే శక్రం శక్రానుజాహవే ।

ఉపేంద్రా! మీరు సర్వవిధముల మాకు హితమును ప్రియమును కలుగజేయుచున్నారు దేవతలు ఇంద్రుని ఆశ్రయించి యుద్ధమున అసురులను సంహరించుటకై యత్నించినట్లు మేము మిమ్ములనే ఆశ్రయించి శస్త్రములద్వారా యుద్ధమునకు సిద్ధపడితిమి

అసమ్భావ్యమిదం కర్మ దేవైరపి జనార్దన।
త్వద్బుద్ధి బలవీర్యేణ కృతవానేష ఫాల్గునః ॥ 4

జనార్దనా! మీ యొక్క బుద్ధి బల పరాక్రమములచేతనే ఈ అర్జునుడు దేవతలకున్ను అసంభవమైనట్టి కార్యమును చేసి చూపెంచెను

బాల్యాత్ ప్రభృతి తే కృష్ణ కర్మాణి శ్రుతవానహమ్।
అమానుషాణి దివ్యాని మహాన్తి చ బహూని చ।
తదైవాజ్ఞాసిషం శత్రూన్ హతాన్ ప్రాప్తాం చ మేదినీమ్ ॥ 5

శ్రీకృష్ణా! బాల్యకాలమునుండియు మీరు చేసిన అనేక అలౌకిక దివ్య మహత్తర కార్యములను వినినప్పటినుండియు నా శత్రువులు ఇక వధింపబడినవారే యనియు భూమండలరాజ్యమును పొందితిననియు నిశ్చయముగ తెలిసికొంటిని

త్వత్ప్రసాదసముత్థేన విక్రమేణారిసూదన।
సురేశత్వం గతః శక్రో హత్వా దైత్యాన్ సహస్రశః ॥ 6

శత్రుసూదనా! మీ కృపచే పొందబడిన పరాక్రమము ద్వారా ఇంద్రుడు వేలకొలది దైత్యులను సంహరించి దేవరాజపదమున ప్రతిష్ఠితుడయ్యెను

త్వత్ప్రసాదాద్ధృషీకేశ జగత్ స్థావరజఙ్గమమ్।
స్వవర్త్మని స్థితం వీర జపహోమేషు వర్తతే ॥ 7

వీర హృషీకేశా! మీ యనుగ్రహము చేతనే స్థావర జంగమ రూపమగు ఈ జగత్తు తన ధర్మము నందు నిలుకడ గలిగి జప హోమాది సత్కర్మములందు నిమగ్నమగుచున్నది

ఏకార్ణవమిదం పూర్వం సర్వమాసీత్ తమోమయమ్।
త్వత్ప్రసాదాన్మహాబాహో జగత్ప్రాప్తం నరోత్తమ ॥ 8

మహాబాహో! నరశ్రేష్ఠా! మొదట ఈ జగత్తంతయు ఏకార్ణవ జలమందు నిమగ్నమై అంధకారమందు విలీనమై యుండి పది తిరిగి మీ యొక్క కృపాదృష్టిచేతనే వర్తమానరూపమున వెలయుచున్నది

స్రష్టారం సర్వలోకానాం పరమాత్మానమవ్యయమ్ ।
యే పశ్యన్తి హృషీకేశం న తే ముహ్యన్తి కర్హిచిత్ ॥ 9

ఎవరు సమస్త జగత్తును సృష్టించు నాశరహిత పరమాత్మ యైన హృషీకేశుడగు మీయొక్క దర్శనమును పొందుదురో వారు ఎన్నడును మోహమునకు వశులు కానేరరు

పురాణం పరమం దేవం దేవదేవం సనాతనమ్ ।
యే ప్రపన్నాః సురగురుం న తే ముహ్యన్తి కర్హిచిత్ ॥ 10

మీరు పురాణ పురుషులు పరమ దేవులు దేవతలకున్ను దేవత పరమ గురువు సనాతన పరమాత్మ అయి యున్నారు ఎవరు మిమ్ములను శరణు బొందెదరో వారు ఎన్నడును మోహము పొందరు

అనాదినిధనం దేవం లోకకర్తారమవ్యయమ్ ।
యే భక్తాస్త్వాం హృషీకేశ దుర్గాణ్యతి తరన్తి తే ॥ 11

హృషీకేశ! మీరు ఆది అంత రహితులు విశ్వ విధాత నిర్వికార దేవత అయి యున్నారు మీ భక్తులు పెద్దపెద్ద సంకటములను కూడ దాటి పైచుదురు

పరం పురాణం పురుషం పరాణాం పరమం చ యత్ ।
ప్రపద్యతస్తత్ పరమం పరా భూతిర్విధీయతే ॥ 12

మీరు పరమ పురాతన పురుషులు మీరు పరము కంటెను పరమైన వారు పరమేశ్వరుడైన మిమ్ములను శరణు జొచ్చువారు పరమైశ్వర్య ప్రాప్తిని బడయుదురు

గాయన్తి చతురో వేదా యశ్చ వేదేషు గీయతే ।
తం ప్రపద్య మహాత్మానం భూతిమాప్నోత్యనుత్తమామ్॥ 13

నాలుగు వేదములు ఎవరి కీర్తిని గానము చేయుచున్నవో, ఎవరు సమస్త వేదముల చేతను గాన మొనర్పబడుచున్నారో అట్టి మహాత్ముడగు శ్రీకృష్ణుని శరణు బొంది నేను సర్వోత్తమ ఐశ్వర్యమును బడయుదును

పరమేశ పరేశేశ తిర్యగీశ నరేశ్వర ।
సర్వేశ్వరేశ్వరేశేశ నమస్తే పురుషోత్తమ ॥ 14

పురుషోత్తమా ! మీరు పరమేశ్వరులు పశుపక్షులకు మనుష్యులకు కూడ ఈశ్వరులు పరమేశ్వరులు అని పిలువబడు ఇంద్రాది లోకపాలురకన్ను మీరు ప్రభువు సర్వేశ్వరా ! అందఱికిన్ని ఎవడు ఈశ్వరుడో ఆతనికిన్ని మీరు ఈశ్వరులై యున్నారు మీకు నమస్కారము

త్వమీశేశేశ్వరేశాన ప్రభో వర్ధస్వ మాధవ ।
ప్రభవాప్యయ సర్వస్య సర్వాత్మన్ పృథులోచన ॥ 15

విశాలనేత్రుడగు మాధవా ! మీరు ఈశ్వరులకున్ను ఈశ్వరుడు, శాసకుడు అయియున్నారు ప్రభూ ! మీయొక్క అభ్యుదయము అగుగాక ! సర్వాత్మా ! మీరే సర్వుల సృష్టి ప్రళయములకు కారణమైయున్నారు

ధనంజయసఖా యశ్చ ధనంజయహితశ్చ యః ।
ధనంజయస్య గోప్తా తం ప్రపద్య సుఖమేధతే ॥ 16

అర్జునుని మిత్రుడు అర్జునుని హితైషి అర్జునుని రక్షకుడు అయిన శ్రీకృష్ణుని శరణ బొంది మనుజుడు సుఖవంతుడగుచున్నాడు

మార్కండేయః పురాణర్షిశ్చరితజ్ఞస్తవానఘ ।
మాహాత్మ్యమనుభావం చ పురా కీర్తితవాన్ మునిః ॥ 17

పాపరహితుడగు శ్రీకృష్ణా! ప్రాచీనకాలమందలి మహర్షియగు మార్కండేయుడు మీయొక్క చరిత్రను ఎఱిఁగియున్నాడు ఆ మునీంద్రుడు ఇదివరకే మీయొక్క ప్రభావమును మాహాత్మ్యమును నాకు వర్ణించి చెప్పెను

అసితో దేవలశ్చైవ నారదశ్చ మహాతపాః ।
పితామహశ్చ మే వ్యాసస్త్వామాహుర్విధిముత్తమమ్ ॥ 18

అసితుడు, దేవలుడు మహాతపస్వియగు నారదుడు నా పితామహుడగు వ్యాసముని మీరే సర్వోత్తమ విధి యని పేర్కొనినారు

త్వం తేజస్త్వం పరం బ్రహ్మ త్వం సత్యం త్వం మహత్ తపః ।
త్వం శ్రేయస్త్వం యశశ్చాగ్ర్యం కారణం జగతస్తథా ॥ 19

త్వయా సృష్టమిదం సర్వం జగత్ స్థావర జఙ్గమమ్ ।
ప్రలయే సమనుప్రాప్తే త్వాం వై నిపిశతే పునః ॥ 20

మీరే తేజము మీరే పరబ్రహ్మ మీరే సత్యము మీరే గొప్ప తపస్సు మీరే శ్రేయము మీరే ఉత్తమ యశస్సు మీరే జగత్తుయొక్క కారణము మీరే ఈ సమస్త స్థావర జంగమ జగత్తును సృష్టించితిరి మరల ప్రళయ కాలమున అది మీయందే లీనమైపోవును

అనాదినిధనం దేవం విశ్వస్యేశం జగత్పతే ।
ధాతారమజ మవ్యక్త మాహుర్వేదవిదో జనాః ॥
భూతాత్మానం మహాత్మాన మనన్తం విశ్వతోముఖమ్ । 21

జగత్పతీ! వేదవేత్తలు మిమ్ము ను ఆద్యంతరహితుడు దివ్యస్వరూపుడు విశ్వేశ్వరుడు ధాత జన్మరహితుడు భూతాత్మ

మహాత్మ, అనంతుడు, విశ్వతోముఖుడు మున్నగు పేర్లతో పిలుచు చున్నారు

త్వం దేవా న జానన్తి గుహ్యమాద్యం జగత్పతిమ్ ॥
నారాయణం పరం దేవం పరమాత్మాన మీశ్వరమ్ ।
జ్ఞానయోనిం హరిం విష్ణుం ముముక్షూణాం పరాయణమ్ ।
పరం పురాణం పురుషం పురాణానాం పరం చ యత్ ॥ 22

మీ రహస్యము గూఢమైనది మీరు అన్నిటికిని మూల కారణమును జగత్తునకు ప్రభువును అయియున్నారు మీరే పరమదేవుడు నారాయణుడు పరమాత్మ ఈశ్వరుడు అయి యున్నారు జ్ఞానస్వరూపుడగు శ్రీహరి ముముక్షువుల పరమా శ్రయమగు విష్ణువున్ను మీరే అయియున్నారు మీయొక్క యథార్థ స్వరూపమును దేవతలున్ను ఎఱుఁగరు మీరే పరమ పురాణపురుషులు పురాణముల కంటెను మీరు పరులు అయి యున్నారు

ఏవమాది గుణానాం తే కర్మణాం దివి చేహ చ ।
అతీతభూత భవ్యానాం సంఖ్యాతాత్ర న విద్యతే ॥ 23
సర్వతో రక్షణీయాః స్మ శక్రేణేవ దివౌకసః ।
యైస్త్వం సర్వగుణోపేతః సుహృన్న ఉపపాదితః ॥ 24

మీయొక్క ఇట్టి గుణములు భూత భవిష్యద్వర్తమాన కాలమున జరుగు కర్మలను లెక్కించగలవారు ఈ భూలోకమున గాని, స్వర్గమందుగాని ఎవడును లేడు ఇంద్రునిచే దేవతలు రక్షింపబడునట్లు మేమందరము మీద్వారా సర్వవిధముల రక్షణీ యులమై యున్నాము మాకు మీరు సర్వగుణసంపన్న సుహృదుని రూపమున లభించినారు

# కృష స్తవము

## (ధర్మరాజు)

## శాంతిపర్వము 43 వ అధ్యాయము

త్వామేకమాహుః పురుషం త్వామాహుః సాత్వతాం పతిమ్ ।
నాభిమస్త్వాం బహువిధైః స్తువన్తి ప్రయతా ద్విజాః ॥ 1

దేవా! మహనీయులు తమ మనస్సును ఇంద్రియములను సంయమమందుంచుకొని మిమ్ములనే అంతర్యామి యనియు, ఉపాసన యొనర్చు భక్తుల పాలకుడనియు పఠించుచున్నారు మఱియు వారు వివిధ నామములతో మిమ్ములను స్తుతించుచున్నారు

విశ్వకర్మణ నమస్తేఽస్తు విశ్వాత్మన విశ్వసమ్భవ।
విష్ణో జిష్ణో హరే కృష్ణ వైకుణ్ఠ పురుషోత్తమ ॥ 2

ఈ విశ్వమంతయు మీయొక్క లీలామయమైన సృష్టి అయియున్నది మీరు ఈ ప్రపంచమునకు ఆత్మ మీనుండియే యీ జగత్తు ఉత్పన్నమైనది మీరే వ్యాపకులగుటచే విష్ణువనియు విజయవంతులగుటచే జిష్ణువనియు, దుఃఖమును, పాపమును హరించివేయుటచే హరి యనియు మీపై మనసు ఆకర్షించుటచే కృష్ణుడనియు వైకుంఠధామమునకు అధిపతి యగుటచే వైకుంఠుడనియు, క్షర అక్షర పురుషులకంటె ఉత్తముడగుటచే పురుషోత్తము డనియు చెప్పబడుచున్నారు మీకు నమస్కారము

అదిత్యాః సప్తధా త్వం తు పురాణో గర్భతాం గతః ।
పృశ్నిగర్భస్త్వమేవైక స్త్రియుగం త్వాం వదన్త్యపి ॥ 3

పురాణ పురుషుడును పరమాత్మయు అగు మీరే పేడు విధములుగ అదితియొక్క గర్భమందు అవతరించితిరి మీరే పృశ్ని గర్భుడను పేరుతో ప్రసిద్ధికెక్కి యున్నారు మూడు యుగములందును ప్రకటమగుటచే విద్వాంసులు మిమ్ములను త్రియుగుడని చెప్పెదరు

శుచిశ్రవా హృషీకేశో ఘృతార్చిర్హంస ఉచ్యతే।
త్రిచక్షుః శమ్భురేకస్త్వం విభుర్దామోదరోఽపి చ॥ 4

మీ కీర్తి పరమ పవిత్రమైనది మీరు సమస్త ఇంద్రియముల యొక్క ప్రేరకులై యున్నారు ఘృతమే జ్వాలగా గల యజ్ఞపురుషుడు మీరే అయియున్నారు మీరే హంస అని చెప్పబడుచున్నారు త్రినేత్రధారి యగు శివుడును మీరును ఒకరే అయి యున్నారు మీరు సర్వవ్యాపి అయియుండుటతో బాటు దామోదరుడును అయియున్నారు

వరాహోఽగ్నిర్బృహద్భానుర్వృషభస్తార్క్ష్య లక్షణః।
అనీకసాహః పురుషః శిపివిష్ట ఉరుక్రమః॥ 5

వరాహ అగ్ని బృహద్భాను వృష గరుడధ్వజ అనీకసాహ పురుష శిపివిష్ట ఉరుక్రమ—అను నివి యన్నియు మీ యొక్కయే నామములు రూపములు అయియున్నవి

వరిష్ఠ ఉగ్రసేనానీః సత్యో వాజసనిర్గుహః।
అచ్యుతశ్చ్యావనోఽరీణాం సంస్కృతో వికృతిర్వృషః॥ 6

అందరికంటెను శ్రేష్ఠులును భయంకర సేనాపతియు సత్యస్వరూపులును అన్నదాతయు ప్రభువును అయిన కార్తికేయుడు మీరే అయియున్నారు మీరు స్వయముగ యుద్ధము నుండి ఎన్నడును విచలితులుకాక శత్రువులను వెనుకకు తరిమివేయుచున్నారు

స ప్కార సంపన్నులును (ప్కారము లేనివారును మీరు స్వరూపులే అయియున్నారు మీరు అభీష్టములు వర్షించు వృషదు అయియున్నారు

కృష్ణ ధర్మ స్త్వమేవాది ర్వృషదర్భో వృషాకపిః।
సిద్ధుర్వి ధర్మరాట్ కకుప్ త్రిధామా త్రిదివాచ్చ్యుతః॥ 7

కృష్ణధర్ములున్ను (యజ్ఞస్వరూపులున్ను) సర్వులకు ఆది కారణులున్ను మీరే అయియున్నారు వృషదర్భులున్ను (ఇంద్రుని దర్పమును అణచినవారును) వృషాకపియు (హరిహరులున్ను) మీరే అయియున్నారు సముద్రము నిర్గుణాత్మ మూడు దిక్కులు (పై క్రింద మధ్య) త్రిధ తేజములు (సూర్య చంద్ర అగ్నులు) వైకుంఠధామమునుండి క్రిందకు అవతీర్ణమొందినవారు మీరే అయియున్నారు

సమ్రాడ్ విరాట్ స్వరాట్ చైవ సురరాజో భవోద్భవః।
విభు ర్భూర్భువః కృష్ణః కృష్ణవర్త్మా త్వమేవ చ॥ 8

సమ్రాట్ విరాట్ స్వరాట్ దేవరాజ ఇంద్రుడు మీరే అయియున్నారు ఈ ప్రపంచము మీ నుండియే ప్రకటమైనది మీరు సర్వత్ర వ్యాపకులు నిత్యులు సత్యారూపులు నిరాకారులు అగు పరమాత్మ అయియున్నారు కృష్ణుడు కృష్ణధర్మ (అగ్ని) మీరే అయియున్నారు

స్విష్టకృద్ భిషగావర్తః కపిల స్త్వం చ వామనః।
యజ్ఞో ధ్రువః పతఙ్గశ్చ యజ్ఞ సేన స్త్వ ముచ్యసే॥ 9

మిమ్ములనే జనులు అభీష్టసాధకుడు అశ్వినీకుమారుల తండ్రి యగు సూర్యుడు కపిలముని, వామనుడు యజ్ఞము, ధ్రువుడు గరుడుడు యజ్ఞసేనుడు అనియు చెప్పుచున్నారు

శిఖణ్డీ నహుషో బభ్రుర్దివః స్పృక్ త్వం పునర్వసుః।
సుబభ్రూ రుక్మయజ్ఞశ్చ సుషేణో దున్దుభి స్తథా॥ 10

మీరు మీ శిరస్సుపై నెమలి ఈకను ధరించుచున్నారు మీరే పూర్వము నహుషుడను రాజుగ ప్రకటమైరి మీరు సమస్త ఆకాశమును వ్యాప్త మొనర్చియుండు మహేశ్వరుడు ఒకే పాదముతో ఆకాశమును కొలచు విరాట్టున్ను అయి యున్నారు పునర్వసు నక్షత్రరూపమున మీరే ప్రకాశించు చున్నారు మీరు అత్యంత పింగళవర్ణము కలవారును సువర్ణ దక్షిణలచే పూర్ణమైన యజ్ఞము ఉత్తమసేనతో కూడినవారును దుందుభి స్వరూపులును మీరే అయియున్నారు

గభస్తనేమిః శ్రీపద్మః పుష్కరః పుష్పధారణః।
ఋభుర్విభుః సర్వసూక్ష్మశ్చారిత్రం చైవ పఠ్యసే॥ 11

కాలచక్రము శ్రీపద్మము పుష్కరము పుష్పధారి ఋభువు విభువు మహాసూక్ష్మరూపి సదాచార స్వరూపుడు - అనియు మీరు చెప్పబడుచున్నారు

అమ్భోనిధి స్త్వం బ్రహ్మా త్వం పవిత్రం ధామ ధామవిత్।
హిరణ్యగర్భం త్వామాహుః స్వధా స్వాహా చ కేశవ॥ 12

జలనిధియగు సముద్రము బ్రహ్మదేవుడు పవిత్రధామము, ధామవేత్త మీరే అయి యున్నారు కేశవా! విద్వాంసులు మిమ్ములనే హిరణ్యగర్భుడు స్వధా స్వాహా మున్నగు పేర్లతో పిలుచుచున్నారు

యోని స్త్వమస్య ప్రలయశ్చ కృష్ణ
త్వమేవేదం సృజసే విశ్వమగ్రే।

విశ్వం చేదం త్వద్వశే విశ్వయోనే
నమోఽస్తు తే శార్జ్గ చక్రాసిపాణే॥ 18

శ్రీకృష్ణా! ఈ జగత్తునకు ఆదికారణము మీరే దీని ప్రళయ స్థానమున్ను మీరే కల్పారంభమున మీరే ఈ ప్రపంచమును సృష్టించుచున్నారు విశ్వకారణా! ఈ సమస్త ప్రపంచము మీ అధీనమే అయియున్నది చేతులందు ధనుస్సు చక్రము, ఖడ్గము ధరించు ఓ పరమాత్మా! మీకు నమస్కారము

# భీ ష్మ స్త వ రా జ ము

## (భీష్ముడు)

## (శాంతిపర్వము 47 వ అధ్యాయము)

ఆరిరాధయిషుః కృష్ణం వాచం జిగదిషామి యామ్॥
తయా వ్యాససమాసిన్యా ప్రీయతాం పురుషోత్తమః॥ 1

నేను శ్రీ కృష్ణుని ఆరాధించు కోరిక మనస్సునందుంచుకొని ఏమి చెప్పదలంచినానో అది విస్తృతమైనను సంక్షిప్తమైనను— దానిచే పురుషోత్తముడగు శ్రీకృష్ణుడు నాయెడల ప్రసన్నుడగుగాక!

శుచిం శుచిపదం హంసం తత్పదం పరమేష్ఠినమ్।
యుక్త్వా సర్వాత్మనాఽఽత్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్॥ 2

ఎవరు స్వయముగ శుద్ధులో ఎవరిని పొందు మార్గమున్ను శుద్ధమైనదో, ఎవరు హంసస్వరూపులో 'తత్' పద లక్ష్యార్థమగు

పరమాత్మరూపా ప్రజాపాలకుడగు పరమేష్ఠిరూపా నేను అన్ని వైపుల సంబంధము విడనాడి కేవలము ఆ పరమాత్మతోనే సంబంధము కలుగజేసికొని అట్టి సర్వాత్మయగు శ్రీకృష్ణునే సర్వవిధముల శరణు బొందుచున్నాను

అనాద్యన్తం పరంబ్రహ్మ న దేవా నర్షయో విదుః।
ఏకో యం వేద భగవాన్ ధాతా నారాయణో హరిః॥ 3

వారికి ఆది లేదు అంతము లేదు వారే పరబ్రహ్మ పరమాత్మ వారిని దేవతలు గాని ఋషులు గాని (ఇంద్రియమనంబులచే) ఎఱుఁగరు సర్వులయొక్క ధారణ పోషణ చేయు కేవలము నారాయణుడగు హరియే వారి నెఱుఁగును

నారాయణాదృషిగణాస్తథా సిద్ధ మహోరగాః।
దేవా దేవర్షయశ్చైవ యం విదుః పరమవ్యయమ్॥ 4

నారాయణుని వలననే ఋషులు సిద్ధులు పెద్ద పెద్ద నాగులు దేవతలు దేవర్షులు వారిని నాశరహిత పరమాత్మరూపమున ఎఱుఁగదొడగిరి

దేవదానవగన్ధర్వా యక్షరాక్షసపన్నగాః।
యం న జానన్తి కో హ్యేష కుతో వా భగవానితి॥ 5

దేవతలు దానవులు గంధర్వులు రాక్షసులు నాగులు కూడ వారివిషయమున ఈ భగవంతు డెవరు? ఎచటినుండి వచ్చెను? అని తెలిసికొన జాలకున్నారు

యస్మిన్ విశ్వాని భూతాని తిష్ఠన్తి చ విశన్తి చ।
గుణభూతాని భూతేశే సూత్రే మణిగణా ఇవ॥ 6

వారియందే సమస్తప్రాణులు స్థితి గల్గియున్నవి వారియందే అవి లయించుచున్నవి దారమందు మణులు గ్రుచ్చబడి యుండు

నట్లు భూతేశ్వరుడగు ఆ పరమాత్మయందు సమస్త త్రిగుణాత్మక ప్రాణులు గ్రుచ్చబడియున్నవి

యస్మిన్ నిత్యే తతే తన్తౌ దృఢే స్రగివ తిష్ఠతి।
సదసద్గ్రథితం విశ్వం విశ్వాఙ్గే విశ్వకర్మణి ॥ 7

భగవంతుడు ఎల్లప్పుడు ఉండియుండుదారు దారమందు పుష్పములువలె వారియందు కార్యకారణరూపమగు ఈ జగత్తంతయు గ్రుచ్చబడియున్నది ఈ ప్రపంచమంతయు వారి అవయవమందే కలదు ఈ విశ్వమును వారే సృష్టించిరి

హరిం సహస్రశిరసం సహస్రచరణేక్షణమ్ ।
సహస్రబాహుముకుటం సహస్రవదనోజ్జ్వలమ్ ॥ 8

ఆ శ్రీహరికి వేలకొలది శిరస్సులు వేలకొలది పాదములు వేలకొలది నేత్రములు కలవు వారు వేలకొలది భుజములతోను, వేలకొలది కిరీటములతోను వేలకొలది ముఖములతోను శోభించుచున్నారు

ప్రాహుర్నారాయణం దేవం యం విశ్వస్య పరాయణమ్ ।
అణీయసామణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసామ్ ।
గరీయసాం గరిష్ఠం చ శ్రేష్ఠం చ శ్రేయసామపి ॥ 9

వారే ఈ ప్రపంచమునకు పరమ ఆధారము వారినే నారాయణ దేవుడందురు వారు సూక్ష్మముకంటె సూక్ష్మమైనవారును స్థూలముకంటె స్థూలమైనవారును దృఢమైన దానికంటె దృఢమైనవారును, ఉత్తమమైన దానికంటె ఉత్తమమైనవారును అయియున్నారు

యం వాకేష్వనువాకేషు నిషత్సూపనిషత్సు చ
గృణన్తి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు ॥ 10

వాక, అనువాకములందును (మంత్రములందును) నిషద ఉపనిషదులందును సత్యవాక్యములను చెప్పు సామ మంత్రము లందును ఆ పరమాత్మనే సత్యము సత్యకర్మ అందురు

చతుర్భిశ్చతురాత్మానం సత్త్వస్థం సాత్వతాం పతిమ్ ।
యం దివ్యైర్దేవమర్చన్తి గుహ్యైః పరమనామభిః ॥ 11

వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ— అను ఈ నాలుగు ఉత్తమ నామములద్వారా బ్రహ్మము జీవుడు మనస్సు అహంకారము—అను ఈ నాలుగు స్వరూపములందును ప్రకటమైన ఆ భక్తపాలకుడగు శ్రీకృష్ణుని పూజ గావింపబడుచున్నది ఆ శ్రీకృష్ణుడు సర్వుల అంతఃకరణములందు విరాజమానుడై యున్నారు

యస్మిన్ నిత్యం తపస్తప్తం యదఙ్గేష్వను తిష్ఠతి ।
సర్వాత్మా సర్వవిత్ సర్వః సర్వజ్ఞః సర్వభావనః ॥ 12

వాసుదేవుని ప్రసన్నత్వము కొఱకే నిత్యము తపస్సుయొక్క అనుష్ఠానము గావింపబడుచున్నది వారు సర్వుల హృదయమందును విరాజమానులై యున్నారు వారు సర్వుల ఆత్మ సర్వులను ఎఱుగువారు సర్వస్వరూపులు సర్వజ్ఞులు సర్వులను సృష్టించు వారు అయియున్నారు

యం దేవం దేవకీ దేవీ వసుదేవాదజీజనత్ ।
భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్తమగ్నిమివారణిః ॥ 13

అరణి ప్రజ్వలితాగ్నిని ప్రకటమొనర్చునట్లు దేవకీదేవి ఈ భూమిపై వసించు బ్రహ్మనిష్ఠుల యొక్క వేదముల యొక్క యజ్ఞముల యొక్క రక్షణకొఱకై ఆ భగవంతుని వసుదేవుని తేజస్సుచే ప్రకటమొనర్చెను

యమనన్యే వ్యపేతాశీరాత్మానం వీతకల్మషమ్ ।
దృష్ట్వానన్త్యాయ గోవిన్దం పశ్యత్యాత్మానమాత్మని ॥ 14

అతివాయ్విన్ద్రకర్మాణమతి సూర్యాతితేజసమ్ ।
అతిబుద్ధీన్ద్రియాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్ ॥ 15

కోరికలన్నిటిని త్యజించి అనన్య భావముతో నుండు సాధకుడు మోక్షముకొఱకై తన విశుద్ధ అంతఃకరణమందు పాపరహిత శుద్ధ బుద్ధ పరమాత్మరగు ఏ గోవిందుని జ్ఞానదృష్టిచే సాక్షాత్కరించుకొనుచున్నాడో ఎవరి యొక్క పరాక్రమము వాయు ఇంద్రుల కంటెను అధికమైనదో ఎవరు తమ తేజస్సుచే సూర్యుని కూడ అధిగమించుచున్నారో ఎవరి స్వరూపము వఱకు ఇంద్రియములు మనస్సు బుద్ధియు పోళ్ళజాలవో అట్టి ప్రజాపాలకుడగు పరమేశ్వరుని నేను శరణు పొందుచున్నాను

పురాణే పురుషం ప్రోక్తం బ్రహ్మప్రోక్తం యుగాదిషు ।
క్షయే సంకర్షణం ప్రోక్తం తముపాస్య ముపాస్మహే ॥ 16

పురాణములందు ఎవరు పురుషుడని వర్ణింపబడినారో ఎవరు యుగముల ఆరంభమున బ్రహ్మ అనియు ఆ యుగాంతమందు సంకర్షణుడనియు చెప్పబడునో అట్టి ఉపాస్యుడగు పరమేశ్వరుని మేము ఉపాసించుచున్నాము

యమేకం బహుధాఽఽత్మానం ప్రాదుర్భూతమధోక్షజమ్ ।
నాన్యభక్తాః క్రియావన్తో యజన్తే సర్వకామదమ్ ॥ 17

యమాహుర్జగతః కోశం యస్మిన్ సంనిహితాః ప్రజాః ।
యస్మింల్లోకాః స్ఫురన్తీమే జలే శకునయో యథా ॥ 18

ఋతమేకాక్షరం బ్రహ్మ యత్ తత్ సదసతోః పరమ్ ।
అనాది మధ్యపర్యన్తం న దేవా నర్షయో విదుః ॥ 19

యం సురాసురగన్ధర్వాః సిద్ధా ఋషిమహోరగాః ।
ప్రయతా నిత్యమర్చన్తి పరమం దుఃఖభేషజమ్ ॥ 20

అనాదినిధనం దేవమాత్మయోనిం సనాతనమ్ ।
అప్రేక్ష్యమనభిజ్ఞేయం హరిం నారాయణం ప్రభుమ్ ॥ 21

ఒకరైనను అనేక రూపములతో ప్రకటమైనవారును ఇంద్రియముల కంటెను వాని విషయముల కంటెను అతీతులగుటచే అధోక్షజుడు అని చెప్పబడినవారును ఉపాసకుల అభీష్టములన్నిటిని పూర్ణము చేయువారును యజ్ఞాది కర్మలయందు పూజయందు మగ్నులగు అనన్య భక్తులు యజింపునట్టివారును జగత్తుయొక్క కోశాగారమని చెప్పబడువారును సమస్త ప్రజలు ఎవరియందు స్థితి గలిగియున్నారో అట్టివారును నీటిపై ఈదు జలపక్షులవలె ఎవరిపై ఈ సమస్త జగత్తుయొక్క చేష్టలు జరుగుచున్నవో అట్టివారును పరమార్థ సత్యస్వరూపులును ఏకాక్షర బ్రహ్మస్వరూపులును సత్ అసత్తులకు విలక్షణులును ఆది మధ్యాంతములు లేనివారును దేవతలు గాని ఋషులు గాని ఎవరిని సరిగా నెఱుంగజాలకున్నారో అట్టివారును తమ మనస్సును ఇంద్రియములను సంయమమందుంచుకొని సమస్త దేవతలు అసురులు గంధర్వులు సిద్ధులు ఋషులు, పెద్ద పెద్ద నాగులు ఎవరిని సదా పూజించుచున్నారో అట్టివారును, దుఃఖమను రోగమునకు చాల గొప్ప ఓషధి అయియున్నవారును జనన మరణ రహితులును స్వయంభువును సనాతన దేవతారూపులును ఈ చర్మ నేత్రములచేత చూచుటకుగాని బుద్ధి ద్వారా పూర్ణముగ తెలిసికొనుటకుగాని అసంభవమైనవారును అగు శ్రీహరియైన నారాయణ దేవుని నేను శరణు బొందుచున్నాను

యం వై విశ్వస్య కర్తారం జగతస్తస్థుషాం పతిమ్ ।
వదన్తి జగతోఽధ్యక్షమక్షరం పరమం పదమ్ ॥ 22

ఈ ప్రపంచము యొక్క విధాతయు చరాచర జగత్తు యొక్క ప్రభువును అయియున్నవారును ప్రపంచముయొక్క సాక్షియనియు నాశరహిత పరమపదమనియు చెప్పబడినవారను అగు పరమాత్మను నేను శరణు బొందుచున్నాను

హిరణ్యవర్ణం యం గర్భమదితేర్దైత్యనాశనమ్ ।
ఏకం ద్వాదశధా జజ్ఞే తస్మై సూర్యాత్మనే నమః ॥ 23

బంగారమువలె కాంతివంతులును అదితియొక్క గర్భము నుండి జనించినవారును దైత్య వినాశకులును ఒకరైనను పండ్రెండు రూపములుగ ప్రకటమైనవారును సూర్యస్వరూపులును అగు పరమేశ్వరునకు నమస్కారము

శుక్లే దేవాన్ పితౄన్ కృష్ణే తర్పయత్యమృతేన యః ।
యశ్చ రాజా ద్విజాతీనాం తస్మై సోమాత్మనే నమః ॥ 24

తమ అమృతమయములగు కళలచే శుక్లపక్షమున దేవతలను కృష్ణపక్షమున పితరులను తృప్తి నొనర్చువారును సమస్త ద్విజులకు రాజును సోమస్వరూపులును అగు పరమాత్మకు నమస్కారము

(హుతాశనముఖైర్దేవైర్ధార్యతే సకలం జగత్ ।
హవిః ప్రథమభోక్తా యస్తస్మై హోత్రాత్మనే నమః ॥ ) 25

అగ్నిముఖముగ కల దేవతలు ఈ జగత్తునంతను ధరించుచున్నారు అందటికంటెను మొదట హవిష్యముయొక్క భోక్తయైన అగ్నిహోత్రము యొక్క స్వరూపుడైన పరమేశ్వరునకు నమస్కారము

మహాత స్తమసః పారే పురుషం హ్యతితేజసమ్ ।
యం జ్ఞాత్వా మృత్యుమత్యేతి తస్మై జ్ఞేయాత్మనే నమః ॥ 26

అజ్ఞానమయ మహా అంధకారము కంటె పరమైనవారును, జ్ఞానప్రకాశముచే అత్యంత ప్రకాశముతో కూడిన ఆత్మస్వరూపులును ఎవరి నెఱిగినచో మనుజుడు మృత్యువునుండి శాశ్వతముగ విముక్తుడగునో అట్టి జ్ఞేయరూపులును అగు పరమేశ్వరునకు నమస్కారము

యం బృహన్తం బృహత్యుక్థే యమగ్నౌ యం మహాధ్వరే।
యం విప్రసంఘా గాయన్తి తస్మై వేదాత్మనే నమః ॥ 27

ఉక్థమను గొప్ప యజ్ఞము చేయునపుడు అగ్న్యాధాన కాలమున మహాయాగమున బ్రాహ్మణ బృందము ఎవరిని బ్రహ్మరూపమున స్తవనము చేయుదురో అట్టి వేదస్వరూపులగు భగవంతునకు నమస్కారము

ఋగ్యజుః సామధామానం దశార్ధహవిరాత్మకమ్ ।
యం సప్తతన్తుం తన్వన్తి తస్మై యజ్ఞాత్మనే నమః ॥ 28

ఋగ్వేదము యజుర్వేదము సామవేదము దేనికి ఆశ్రయములో ఐదువిధములగు హావిష్యము దేని స్వరూపమై గాయత్రి మొదలగు ఏడు ఛందస్సులు దేనియొక్క ఏడు తంతువులో అట్టి యజ్ఞముయొక్క రూపమున ప్రకటమైన పరమాత్మకు ప్రణామములు

చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పఞ్చభిరేవ చ ।
హూయతే చ పునర్ద్వాభ్యాం తస్మై హోమాత్మనే నమః ॥ 29

నాలుగు నాలుగు, రెండు ఐదు రెండు— ఈ పదునేడు అక్షరములతో గూడిన మంత్రములచే హావిష్యము అర్పింపబడునట్టి హోమస్వరూపుడైన పరమేశ్వరునకు నమస్కారము

యః సుపర్ణో యజుర్నామ ఛన్దోగాత్రస్త్రివృచ్ఛిరాః ।
రథన్తరం బృహత్ సామ తస్మై స్తోత్రాత్మనే నమః ॥ 30

ఎవరు 'యజుః' అను పేరు ధరించు వేదరూపుడైన పురుషుడై యున్నారో గాయత్రీ మున్నగు ఛందస్సులు ఎవరియొక్క అవయవములో యజ్ఞమే ఎవరియొక్క శిరస్సో రథన్తర బృహత్ అను పేర్లుగల సామము ఎవరియొక్క వాక్కు అయియున్నదో అట్టి స్తోత్రరూపుడైన భగవంతునకు నమస్కారము

యః సహస్రసమే సత్రే జజ్ఞే విశ్వసృజామృషిః ।
హిరణ్యపక్షః శకునిస్తస్మై హంసాత్మనే నమః ॥ 31

ఏ ఋషి వెయ్యి సంవత్సరములకు పూర్ణమగు ప్రజాపతుల యజ్ఞమందు బంగారు రెక్కలతో గూడిన పక్షి రూపమున ప్రకటమయ్యెనో అట్టి హంసరూపధారియగు పరమేశ్వరునకు నమస్కారము

పాదాఙ్గం సంధిపర్వాణం స్వరవ్యఞ్జనభూషణమ్ ।
యమాహురక్షరం దివ్యం తస్మై వాగాత్మనే నమః ॥ 32

పదములు ఎవరి అంగములో సంధి ఎవరి శరీర పర్వములో, స్వర వ్యంజనములు ఎవరి ఆభరణములో ఎవరిని దివ్య అక్షరమని చెప్పుదురో, అట్టి పరమేశ్వరునకు వాణీరూపమున నమస్కారము

యజ్ఞాఙ్గో యో వరాహో వై భూత్వా గాముజ్జహార హ ।
లోకత్రయ హితార్థాయ తస్మై వీర్యాత్మనే నమః ॥ 33

ఎవరు ముల్లోకముల హితముకొఱకై యజ్ఞమయ వరాహరూపమును ధరించి భూమిని రసాతలమునుండి పైకి ఎత్తిరో అట్టి వీర్య స్వరూపుడగు భగవంతునకు నమస్కారము

యః శేతే యోగమాస్థాయ పర్యఙ్కే నాగభూషితే ।
ఫణాసహస్రరచితే తస్మై నిద్రాత్మనే నమః ॥ 34

ఎవరు తమ యోగమాయను ఆశ్రయించి శేషసర్పము యొక్క వేయి పడగలతో గూడిన శయ్యపై శయనించుచున్నారో అట్టి యోగనిద్రాస్వరూపులగు పరమాత్మకు నమస్కారము

(విశ్వే చ మరుతశ్చైవ రుద్రాదిత్యాశ్వినావ ‍ి ।
వసవః సిద్ధసాధ్యాశ్చ తస్మై దేవాత్మనే నమః ॥ ) 35

విశ్వేదేవులు మరుద్గణము రుద్రుడు ఆదిత్యుడు అశ్వినీకుమారులు వసువులు సిద్ధులు సాధ్యులు—అను వీరందఱు ఎవరి యొక్క విభూతులో అట్టి దేవస్వరూపుడగు పరమాత్మకు నమస్కారము

(అవ్యక్త బుద్ధ్యహంకార మనోబుద్ధీన్ద్రియాణి చ ।
తన్మాత్రాణి విశేషాశ్చ తస్మై తత్త్వాత్మనే నమః ॥ ) 36

అవ్యక్తప్రకృతి బుద్ధి (మహత్తత్త్వము) అహంకారము, మనస్సు జ్ఞానేంద్రియములు తన్మాత్రలు వాని కార్యములు—అను నివియన్నియు ఎవరియొక్క స్వరూపములై యున్నవో అట్టి తత్త్వమయ పరమాత్మకు నమస్కారము

(భూతం భవ్యం భవిష్యచ్చ భూతాదిప్రభవాప్యయః ।
యో ఽగ్రజః సర్వభూతానాం తస్మై భూతాత్మనే నమః ॥) 37

భూత వర్తమాన భవిష్యత్కాలరూపులును ప్రాణికోట్లు నున్నగువాని ఉత్పత్తి లయములకు కారణభూతులున్ను సమస్త ప్రాణులకును అగ్రజుడని చెప్పబడువారును అగు భూతాత్మస్వరూప పరమేశ్వరునకు నమస్కారము

(యం హి సూక్ష్మం విచిన్వన్తిపరం సూక్ష్మవిదో జనాః ।
సూక్ష్మాత్ సూక్ష్మం చ యద్ బ్రహ్మ తస్మై సూక్ష్మాత్మనే
నమః ॥) 38

సూక్ష్మతత్త్వమెఱిగిన జ్ఞానులు ఏ పరమ సూక్ష్మతత్త్వము యొక్క అనుసంధానము గావించుచుందురో ఎవరు సూక్ష్మము కంటెను సూక్ష్మమైనవారో బ్రహ్మము స్వరూపముగా గలవారో అట్టి సూక్ష్మాత్మకు నమస్కారము

(మత్స్యో భూత్వా విరిఞ్చాయ యేన వేదాః సమాహృతాః ।
రసాతలగతః శీఘ్రం తస్మై మత్స్యాత్మనే నమః ॥) 39

ఎవరు మత్స్య శరీరమును ధరించి రసాతలమునకు పోయి నష్టమైన వేదములను బ్రహ్మదేవుని యొద్దకు శీఘ్రముగ గొని వచ్చెనో అట్టి మత్స్యరూపధారియగు శ్రీకృష్ణునకు నమస్కారము

(మన్దరాద్రిర్ధృతో యేన ప్రాప్తే హ్యమృతమన్థనే ।
అతికర్కశదేహాయ తస్మై కూర్మాత్మనే నమః ॥) 40

ఎవరు అమృతముకొఱకై సముద్రమథన సమయమున తమ వీపుపై మందర పర్వతమును ధరించిరో అత్యంత కఠోర దేహధారియైన కూర్మరూపుడగు అట్టి శ్రీకృష్ణునకు నమస్కారము

(వారాహం రూపమాస్థాయ మహీం వనపర్వతామ్ ।
ఉద్ధరత్యేకదంష్ట్రేణ తస్మై క్రోడాత్మనే నమః ॥) 41

ఎవరు వరాహరూపమును ధరించి తమ ఒక దంతముచే వన పర్వతసహితముగ భూమి నంతను ఉద్ధరించెనో అట్టి వరాహరూప ధారియగు భగవంతునకు నమస్కారము

(నారసింహవపుః కృత్వా సర్వలోక భయంకరమ్ ।
హిరణ్యకశిపుం జఘ్నే తస్మై సింహాత్మనే నమః ॥) 42

ఎవరు నరసింహరూపమును ధరించి సమస్త జగత్తునకు భయంకరుడైన హిరణ్యకశిపుడను రాక్షసుని వధించిరో అట్టి నృసింహరూపుడైన శ్రీహరికి నమస్కారము

(వామనం రూపమాస్థాయ బలిం సంయమ్య మాయయా ।
త్రైలోక్యం క్రాన్తవాన్ యస్తు తస్మై క్రాన్తాత్మనే
నమః ॥) 43

ఎవరు వామనరూపమును ధరించి మాయద్వారా బలిని బంధించి ముల్లోకమునంతను తమ పాదముతో కొలిచిరో అట్టి కాంతివంతులైన వామనరూపధారియగు శ్రీకృష్ణునకు నమస్కారము

(జమదగ్నిసుతో భూత్వా రామః శస్త్రభృతాం వరః ।
మహీం నిఃక్షత్రియాం చక్రే తస్మై గామాత్మనే నమః ॥ ) 44

ఎవరు శస్త్రధారులలో శ్రేష్ఠుడగు జమదగ్ని కుమారుడైన పరశురాముని రూపమును ధరించి ఈ భూమిని క్షత్రియరహితముగ గావించిరో అట్టి పరశురామస్వరూపుడైన శ్రీహరికి నమస్కారము

(త్రిః సప్తకృత్వో యశ్చైకో ధర్మే వ్యుత్క్రాన్త గౌరవాన్ ।
జఘాన క్షత్రియాన్ సంఖ్యే తస్మై క్రోధాత్మనే నమః ॥ ) 45

ధర్మము యెడల గౌరవమును ఉల్లఘించినట్టి క్షత్రియులను క్రోధముతో యుద్ధమందు ఒంటరిగనే ఇరువదియొక్క పర్యాయములు ఎవరు సంహరించిరో అట్టి పరశురామునకు నమస్కారము

(రామో దాశరథిర్భూత్వా పులస్త్యకుల నన్దనమ్ ।
జఘాన రావణం సంఖ్యే తస్మై క్షత్రాత్మనే నమః ॥) 46

ఎవరు దశరథసుతుడైన శ్రీరాముని రూపమును ధరించి యుద్ధమందు పులస్త్యకుల నందనుడగు రావణుని వధించిరో అట్టి క్షత్రియాత్మయగు శ్రీరామస్వరూపులైన శ్రీహరికి నమస్కారము

యోహాలీ ముసలీ శ్రీమాన్ నీలామ్బరధరః స్థితః ।
రామాయ రౌహిణేయాయ తస్మై భోగాత్మనే నమః ॥ 47

నాగలి రోకలి సదా ధరించి అద్భుతశోభతో కూడియుండు వారును నీలవస్త్రధారణచే శోభించువారును శేషావతారులును రోహిణీ నందనులును అగు బలరామునకు నమస్కారము

(శఙ్ఖినే చక్రిణే నిత్యం శార్ఙ్గిణే పీతవాససే ।
ఘనమాలాధరాయైవ తస్మై కృష్ణాత్మనే నమః ॥) 48

శంఖము చక్రము శార్ఙ్గ ధనుస్సు పీతాంబరము, వనమాల ధరించినవారును శ్రీకృష్ణస్వరూపులును అగు శ్రీహరికి నమస్కారము

వసుదేవసుతః శ్రీమాన్ క్రీడితో నన్దగోకులే ।
కంసస్య నిధనార్థాయ తస్మై క్రీడాత్మనే నమః ॥ 49

కంసవధ నిమిత్తము వసుదేవునియొక్క శోభాశాలి యగు పుత్రుడుగ ప్రకటమైనవారును నందుని గోకులమున వివిధ లీలలను గావించినవారును లీలామయులును అగు శ్రీకృష్ణునకు నమస్కారము.

వాసుదేవత్వమాగమ్య యదోర్వంశసముద్భవః ।
భూభారహరణం చక్రే తస్మై కృష్ణాత్మనే నమః ॥ 50

యదువంశమున అవతరించి వాసుదేవరూపమున వచ్చి భూమియొక్క భారమును హరించినవారును శ్రీకృష్ణాత్ములును అగు శ్రీహరికి నమస్కారము

సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ ।
లోకత్రయోపకారాయ తస్మై బ్రహ్మాత్మనే నమః ॥ 51

అర్జునునకు సారథ్యము కావించునపుడు ముల్లోకములకు ఉపకారము చేయు నిమిత్తము గీతాజ్ఞానమయామృతమును ఒసంగిన బ్రహ్మాత్మ యగు శ్రీకృష్ణునకు నమస్కారము

(దానవాంస్తు వశే కృత్వా పునర్బుద్ధత్వమాగతః ।
సర్గస్య రక్షణార్థాయ తస్మై బుద్ధాత్మనే నమః ॥) 52

సృష్టిని రక్షించుటకొఱకై దానవులను తమ అధీనమందుంచుకొని తిరిగి బుద్ధభావమును పొందినవారైన బుద్ధస్వరూపులగు శ్రీహరికి నమస్కారము

(హనిష్యతి కలౌ ప్రాప్తే మ్లేచ్ఛాంస్తురగవాహనః ।
ధర్మసంస్థాపకో యస్తు తస్మై కల్క్యాత్మనే నమః ॥) 53

ఎవరు కలియుగము వచ్చినపుడు గుఱ్ఱముపై నెక్కి ధర్మము యొక్క స్థాపనముకొఱకై మ్లేచ్ఛులను వధించుదురో అట్టి కల్కిరూపులగు శ్రీహరికి నమస్కారము

(తారామయే కాలనేమిం హత్వా దానవపుఙ్గవమ్ ।
దదౌ రాజ్యం మహేన్ద్రాయ తస్మై ముఖ్యాత్మనే నమః ॥) 54

తారామయ యుద్ధమున దానవరాజగు కాలనేమిని వధించి దేవరాజగు ఇంద్రునకు రాజ్యమంతయు ఇచ్చినట్టి ముఖ్యాత్మ యగు శ్రీహరికి నమస్కారము

(యః సర్వప్రాణినాం దేహే సాక్షిభూతో హ్యవస్థితః ।
అక్షరః క్షరమాణానాం తస్మై సాక్ష్యాత్మనే నమః ॥) 55

సమస్త ప్రాణులయొక్క శరీరములందు సాక్షిరూపమున ఉన్నవారును సమస్త క్షర భూతములందు అక్షర రూపమున విరాజమానులును అగు సాక్షియైన పరమాత్మకు నమస్కారము

(నమోఽస్తు తే మహాదేవ నమస్తే భక్తవత్సల ॥
సుబ్రహ్మణ్య నమస్తేఽస్తు ప్రసీద పరమేశ్వర ॥
అవ్యక్తవ్యక్త రూపేణ వ్యాప్తం సర్వం త్వయా విభో ।) 56

మహాదేవా! మీకు నమస్కారము భక్తవత్సలా! మీకు నమస్కారము సుబ్రహ్మణ్యా! మీకు నమస్కారము పరమేశ్వరా! నా యెడల ప్రసన్నులుకండు ప్రభూ! మీరు వ్యక్త అవ్యక్త రూపములతో సమస్త ప్రపంచమును వ్యాపించి యున్నారు

(నారాయణం సహస్రాక్షం సర్వలోకమహేశ్వరమ్ ॥
హిరణ్యనాభం యజ్ఞాఙ్గమమృతం విశ్వతోముఖమ్ ।
ప్రపద్యే పుణ్డరీకాక్షం ప్రపద్యే పురుషోత్తమమ్ ॥) 57

వేలకొలది నేత్రములు కలవారును సర్వలోకమహేశ్వరులును హిరణ్యనాభులును యజ్ఞాంగ స్వరూపులును అమృతమయులును సర్వతోముఖులును కమలనయనులును పురుషోత్తములును అగు నారాయణదేవుని నేను శరణు బొందుచున్నాను

సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషామమఙ్గలమ్ ।
యేషాం హృదిస్థో దేవేశో మఙ్గలాయతనం హరిః ॥ 58

ఎవరి హృదయమునందు మంగళస్వరూపులైన దేవేశ్వరుడగు శ్రీహరి విరాజమానుడై యుండునో వారి సమస్త కార్యములందును సదా మంగళమే (శుభమే) కలుగును ఏ కార్యమందును ఎన్నడును అమంగళము కలుగదు

(మఙ్గలం భగవాన్ విష్ణుర్మఙ్గలం మధుసూదనః ।
మఙ్గలం పుణ్డరీకాక్షో మఙ్గలం గరుడధ్వజః ॥) 59

విష్ణువు మంగళమయుడు మధుసూదనుడు మంగళమయుడు కమలనయనుడు మంగళమయుడు గరుడధ్వజుడు మంగళమయుడు

యస్తనోతి సతాం సేతుమృతే నామృతయోనినా ।
ధర్మార్థవ్యవహారాఙ్గై స్తస్మై సత్యాత్మనే నమః ॥ 60

ఎవరి సమస్త వ్యవహారములు కేవలము ధర్మము కొఱకే అయియున్నవో వశీభూతేంద్రియములద్వారా ఎవరు మోక్షసాధన భూతములగు వైదిక ఉపాయములచే మహాత్ముల ధర్మవ్యవస్థను ప్రసరింపజేయుచున్నారో అట్టి సత్యస్వరూపులైన పరమాత్మకు నమస్కారము

యం పృథగ్ధర్మచరణాః పృథగ్ధర్మఫలైషిణః ।
పృథగ్ధర్మైః సమర్చన్తి తస్మై ధర్మాత్మనే నమః ॥ 61

ఎవరు భిన్న భిన్న ధర్మములను ఆచరించి వేఱు వేఱుగ వాని ఫలములను ఇచ్ఛగించుచున్నారో అట్టివారు వేఱు వేఱు ధర్మముల ద్వారా ఎవరిని పూజించుచున్నారో అట్టి ధర్మస్వరూపులైన భగవంతునకు నమస్కారము

యతః సర్వే ప్రసూయన్తే హ్యనఙ్గాత్మాఙ్గ దేహినః ।
ఉన్మాదః సర్వభూతానాం తస్మై కామాత్మనే నమః ॥ 62

ఏ అనంగుని ప్రేరణచే అంగధారులగు సమస్త ప్రాణులు జన్మించుచున్నారో, దేనిచే సమస్త జీవులు ఉన్మత్తులగుచున్నారో అట్టి కామరూపమున ప్రకటమైన పరమేశ్వరునకు నమస్కారము

యం చ వ్యక్తస్థ మవ్యక్తం విచిన్వన్తి మహర్షయః ।
క్షేత్రే క్షేత్రజ్ఞమాసీనం తస్మై క్షేత్రాత్మనే నమః ॥ 63

ఎవరు స్థూలజగత్తునందు అవ్యక్తరూపమున వెలయుచున్నారో గొప్ప గొప్ప మహర్షులు ఎవరి తత్త్వమును అనుసంధాన మొనర్చుచున్నారో ఎవరు సమస్త క్షేత్రములందును,

క్షేత్రజ్ఞరూపమున స్థితిగల్గియున్నారో అట్టి క్షేత్రాత్మయగు పరమాత్మకు నమస్కారము

యం త్రిధాఽఽత్మాన మాత్మస్థం వృతం షోడశభిర్గుణైః ।
ప్రాహుః సప్తదశం సాంఖ్యా స్తస్మై సాంఖ్యాత్మనే నమః ॥ 64

సత్త్వ రజస్తమోగుణముల భేదముచే విచిత్రముగ గోచరించువారును గుణముల కార్యభూతములగు పదునాఱు వికారములచే ఆవృతుడైనను తన స్వరూపమందే స్థితుడై యున్నవారును సాంఖ్యులచే పదునేడవ తత్త్వము (పురుషుడు)గ భావింపబడువారును అగు సాంఖ్యస్వరూపులైన పరమాత్మకు నమస్కారము

యం వినిద్రా జితశ్వాసాః సత్త్వస్థాః సంయతేన్ద్రియాః ।
జ్యోతిః పశ్యన్తి యుఞ్జానా స్తస్మై యోగాత్మనే నమః ॥ 65

నిద్రను జయించి ప్రాణములపై విజయమును పొందినవారును ఇంద్రియములను తమ వశమునందుంచుకొని శుద్ధసత్త్వమందుండువారును నిరంతరము యోగాభ్యాసమున లగ్నమై యుండువారును అగు యోగులు ఎవరి జ్యోతిర్మయ స్వరూపమును సాక్షాత్కరించుకొనుచున్నారో అట్టి యోగరూప పరమాత్మకు ప్రణామములు

అపుణ్యపుణ్యోపరమే యం పునర్భవనిర్భయాః ।
శాన్తాః సంన్యాసినో యాన్తి తస్మై మోక్షాత్మనే నమః ॥ 66

పాప పుణ్యములు క్షయింప పునర్జన్మ భయము నుండి ముక్తులైన శాంతచిత్తులగు సన్న్యాసులు ఎవరిని పొందుచున్నారో అట్టి మోక్షరూప పరమాత్మకు నమస్కారము

B—5

యోఽసౌ యుగ సహస్రాన్తే ప్రదీప్తార్చిర్విభావసుః।
సమ్భక్షయతి భూతాని తస్మై ఘోరాత్మనే నమః॥ 67

సృష్టియొక్క ఒక వేయి యుగములు గడచిన పిమ్మట ప్రచండ జ్వాలలతో గూడిన ప్రళయ కాలీన అగ్నిరూపమును ధరించి సమస్త ప్రాణులను సంహారమొనర్చు ఘోరరూపధారి యగు పరమాత్మకు నమస్కారము

సమ్భక్ష్య సర్వభూతాని కృత్వా చైకార్ణవం జగత్।
బాలః స్వపతి యశ్చైకస్తస్మై మాయాత్మనే నమః॥ 68

ఈ ప్రకారముగ సమస్త భూతములను భక్షించి ఈ జగత్తును జలమయ మొనర్చువారును స్వయముగ బాలకుని రూపమును ధరించి అక్షయ వటవృక్షముయొక్క ఆకుపై శయనించువారును మాయామయులును అగు బాలముకుందునకు నమస్కారము

తద్ యస్య నాభ్యాం సమ్భూతం యస్మిన్ విశ్వం
ప్రతిష్ఠితమ్।
పుష్కరే పుష్కరాక్షస్య తస్మై పద్మాత్మనే నమః॥ 69

దేనిపై ఈ విశ్వమంతయు నిలచియున్నదో అట్టి బ్రహ్మాండ కమలము ఏ పుండరీకాక్షుని నాభి కమలమునుండి ప్రకటమయ్యెనో అట్టి కమలరూపధారి యగు పరమేశ్వరునకు నమస్కారము

సహస్రశిరసే చైవ పురుషాయామితాత్మనే।
చతుః సముద్రపర్యాయ యోగనిద్రాత్మనే నమః॥ 70

వేలకొలది శిరస్సులు కలవారును అంతర్యామి రూపమున సర్వులయందు విరాజమానులై యుండువారును పరిమితము కాని స్వరూపము కలవారును నాలుగు సముద్రములు కలియుటచే ఏకార్ణ

వము కాగా యోగనిద్రను ఆశ్రయించి శయనించువారును అగు యోగనిద్రారూపులైన భగవంతునకు నమస్కారము

యస్య కేశేషు జీమూతా నద్యః సర్వాఙ్గసంధిషు।
కుక్షౌ సముద్రాశ్చత్వార స్తస్మై తోయాత్మనే నమః॥ 71

ఎవరి శిరస్సుపై వెంట్రుకలుండు చోట మేఘములు కలవో, శరీరము యొక్క సంధులందు నదులు కలవో ఉదరమందు నాలుగు సముద్రములు కలవో అట్టి జలరూపుడగు పరమాత్మకు ప్రణామములు

యస్మాత్ సర్వాః ప్రసూయన్తే సర్గప్రలయవిక్రియాః।
యస్మింశ్చైవ ప్రలీయన్తే తస్మై హేత్వాత్మనే నమః॥ 72

సృష్టి ప్రళయములను వికారము లన్నియు ఎవరినుండి ఉత్పన్నమగుచున్నవో ఎవరియందు సమస్తము లయమొందుచున్నదో అట్టి కారణరూపుడగు పరమేశ్వరునకు నమస్కారము

యో నిషణ్ణో భవేద్ రాత్రౌ దివా భవతి విష్ఠితః।
ఇష్టానిష్టస్య చ ద్రష్టా తస్మై ద్రష్ట్రాత్మనే నమః॥ 73

రాత్రియందు మేలుకొనువారును పగటియందు సాక్షీరూపమున నుండువారును ఎల్లపుడును సర్వులయొక్క మంచి చెడ్డలను చూచుచు నుండువారును అగు ద్రష్టయైన పరమాత్మకు ప్రణామము

అకుణ్ఠం సర్వకార్యేషు ధర్మకార్యార్థముద్యతమ్।
వైకుణ్ఠస్య చ తద్ రూపం తస్మై కార్యాత్మనే నమః॥ 74

ఏ కార్యము గాని చేయుటయందు అడ్డు లేని వారును ధర్మకార్యములు చేయుటకు సదా ప్రయత్నశీలురై యుండు వారును, వైకుంఠధామ స్వరూపులును అగు కార్యరూప పరమాత్మకు నమస్కారము

త్రిః సప్తకృత్వో యః క్షత్రం ధర్మవ్యుత్క్రాన్తగౌరవమ్ ।
క్రుద్ధో నిజఘ్ను సమరే తస్మై క్రౌరాత్మనే నమః ॥ 75

ఎవరు ధర్మాత్ములైనను ధర్మము యొక్క గౌరవమును ఉల్లంఘించు క్షత్రియ సమాజమును క్రోధముతో యుద్ధమందు ఇరువదియొక్క సార్లు సంహరించెనో కఠోరత్వముయొక్క అభినయ మొనర్చు అట్టి పరశురాముకు నమస్కారము

విభజ్య పఞ్చధాఽఽత్మానం వాయుర్భూత్వా శరీరగః ।
యశ్చేష్టయతి భూతాని తస్మై వాయ్వాత్మనే నమః ॥ 76

ప్రతి శరీరమందును వాయురూపమున ఉండి తన్ను ప్రాణ అపానాది పంచ స్వరూపములందు విభక్త మొనర్చుకొని సమస్త ప్రాణులను క్రియాశీలురుగ నొనర్చు వాయురూప పరమేశ్వరునకు నమస్కారము

యుగేష్వావర్తతే యో గైర్మాసర్త్వయనహాయనైః ।
సర్గప్రలయయోః కర్తా తస్మై కాలాత్మనే నమః ॥ 77

ప్రతి యుగమందును యోగమాయ యొక్క బలముచే అవతరించువారును మాస, ఋతు అయన సంవత్సరముల ద్వారా సృష్టి ప్రళయములను గావించుచుండువారును అగు కాలరూప పరమాత్మకు ప్రణామము

బ్రహ్మ వక్త్రం భుజౌ క్షత్రం కృత్స్నమూరూదరం విశః ।
పాదౌ యస్యాశ్రితాః శూద్రాస్తస్మై వర్ణాత్మనే నమః ॥ 78

ఎవరికి బ్రాహ్మణులు ముఖమో క్షత్రియులందఱు భుజములో, వైశ్యులు ఎక్కలో ఉదరమో శూద్రులు పాదములో అట్టి చాతుర్వర్ణ్య రూపుడగు పరమేశ్వరునకు నమస్కారము

యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌ క్షితిః ।
సూర్యశ్చక్షుర్దిశః శ్రోత్రే తస్మై లోకాత్మనే నమః ॥ 79

ఎవరికి అగ్ని ముఖమో స్వర్గము శిరస్సో ఆకాశము నాభియో భూమి పాదములో సూర్యుడు నేత్రములో దిక్కులు చెవులో అట్టి లోకరూపుడగు పరమాత్మకు ప్రణామము

పరః కాలాత్ పరో యజ్ఞాత్ పరాత్ పరతరశ్చ యః ।
అనాదిరాదిర్విశ్వస్య తస్మై విశ్వాత్మనే నమః ॥ 80

కాలము కంటెను, యజ్ఞము కంటెను పరమైనవారును పరము కంటెను మహాపరమైనవారును ప్రపంచమున కంతటికిని ఆదియైనవారును తమకు ఆది ఏమియు లేనివారును అయిన విశ్వాత్ముడైన పరమాత్మకు నమస్కారము

(వైద్యుతో జాఠరశ్చైవ పావకః శుచిరేవ చ ।
దహనః సర్వభక్షాణాం తస్మై వహ్న్యాత్మనే నమః ॥) 81

మేఘమునందు మెఱపుగను ఉదరమందు జఠరాగ్ని రూపముగను ఉన్నవారును సర్వులను పవిత్రమొనర్చుటచే 'పావక' అనియు స్వరూపతః శుద్ధులై యుండుటచే 'శుచి' అనియు చెప్పబడువారును భక్ష్యపదార్థములన్నిటిని దగ్ధమొనర్చు అగ్నిదేవుడు స్వరూపముగ కలవారును అగు అగ్నిమయ పరమాత్మకు నమస్కారము

విషయే వర్తమానానాం యం తే వైశేషికైర్గుణైః ।
ప్రాహుర్విషయగోప్తారం తస్మై గోప్త్రాత్మనే నమః ॥ 82

వైశేషిక దర్శనమందు చెప్పబడిన రూప రసాది గుణముల ద్వారా ఆకర్షింపబడి విషయ సేవనమందు ప్రవృత్తులగు వారిని విషయాసక్తినుండి రక్షించునట్టి రక్షక రూపుడైన పరమాత్మకు నమస్కారము

**అన్నపానేన్ధనమయో రసప్రాణవివర్ధనః ।**
**యో ధారయతి భూతాని తస్మై ప్రాణాత్మనే నమః ॥ 83**

అన్న జల రూపమగు ఇంధనమును పొంది శరీరములోపల రసమును ప్రాణశక్తిని వృద్ధినొందించువారును సమస్త ప్రాణులను ధరించువారును అగు ప్రాణాత్మునైన పరమేశ్వరునకు నమస్కారము

**ప్రాణానాం ధారణార్థాయ యోఽన్నం భుఙ్క్తే చతుర్విధమ్ ।**
**అన్తర్భూతః పచత్యగ్నిస్తస్మై పాకాత్మనే నమః ॥ 84**

ప్రాణములను రక్షించుటకొఱకై భక్ష్య భోజ్య లేహ్య, చోష్యములను నాలుగు విధములైన అన్నములను ఏర్పాటు చేయువారును స్వయముగ పొట్టయందు అగ్నిరూపమున ఉండి భోజనమును జీర్ణమొనర్చువారును అగు పాకరూపుడైన పరమేశ్వరునకు ప్రణామము

**పింగేక్షణసటం యస్య రూపం దంష్ట్రా నఖాయుధమ్ ।**
**దానవేన్ద్రాన్తకరణం తస్మై దృప్తాత్మనే నమః ॥ 85**

ఎవరి యొక్క నరసింహ రూపము దానవ రాజగు హిరణ్యకశిపుని అంతమొనర్చినదో ఎవరి నేత్రములు వెంట్రుకలు ఆ సమయమున గోరోజనపు వర్ణముగ కన్పట్టెనో పెద్ద పెద్ద దంతములు గోళ్ళు ఎవరికి ఆయుధములై యుండెనో అట్టి నరసింహునకు ప్రణామము

**యం న దేవా న గన్ధర్వా న దైత్యా న చ దానవాః ।**
**తత్త్వతో హి విజానన్తి తస్మై సూక్ష్మాత్మనే నమః ॥ 86**

ఎవరిని దేవతలు కాని గంధర్వులు కాని దైత్యులు కాని దానవులు కాని సరిగా ఎఱుంగ జాలరో అట్టి సూక్ష్మ స్వరూపుడగు పరమాత్మకు నమస్కారము

**రసాతలగతః శ్రీమాననన్తో భగవాన్ విభుః ।**
**జగద్ ధారయతే కృత్స్నం తస్మై వీర్యాత్మనే నమః ॥ 87**

సర్వవ్యాపకుడైన శ్రీమంతుడగు ఏ భగవంతుడు అనంతుడను శేషసర్పము యొక్క రూపమున రసాతలమున ఉండి జగత్తునంతను తన శిరస్సుపై ధరించుచున్నారో అట్టి వీర్యరూపుడగు పరమాత్మకు ప్రణామము

**యో మోహయతి భూతాని స్నేహపాశానుబన్ధనైః ।**
**సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః ॥ 88**

ఎవరు ఈ సృష్టి పరంపరయొక్క రక్షణకొఱకై ప్రాణులందరిని స్నేహపాశమునందు బంధించి మోహమందు పడవేయుచున్నారో అట్టి పరమాత్మకు నమస్కారము

**ఆత్మజ్ఞానమిదం జ్ఞానం జ్ఞాత్వా పఞ్చస్వవస్థితమ్ ।**
**యం జ్ఞానేనాభిగచ్ఛన్తి తస్మై జ్ఞానాత్మనే నమః ॥ 89**

అన్నమయాది పంచకోశము లోపలనున్న ఆత్మ యొక్క జ్ఞానము కలిగినమీదట విశుద్ధ బోధద్వారా విజ్ఞులు ఎవరిని పొందుచున్నారో అట్టి జ్ఞానస్వరూప పరమాత్మకు నమస్కారము

**అప్రమేయశరీరాయ సర్వతోబుద్ధిచక్షుషే ।**
**అనన్తపరిమేయాయ తస్మై దివ్యాత్మనే నమః ॥ 90**

ఎవరి స్వరూపము ఏ ప్రమాణమునకును విషయము కాదో, ఎవరి బుద్ధి రూపనేత్రము అన్నివైపుల వ్యాపించియున్నదో ఎవరియందు అనేక విషయముల యొక్క సమావేశము కలదో అట్టి దివ్యాత్మయగు పరమేశ్వరునకు నమస్కారము

**జటినే దణ్డినే నిత్యం లమ్బోదరశరీరిణే ।**
**కమణ్డలునిషఙ్గాయ తస్మై బ్రహ్మాత్మనే నమః ॥ 91**

జడము, దండము ధరించువారును లంబోధర శరీరులును, కమండలువు తూణీరముగ (అమ్ముల పొదిగ) కలవారును అగు బ్రహ్మదేవ రూపమున నున్న భగవానునకు ప్రణామము

శూలినే త్రిదేశశాయ త్ర్యమ్బకాయ మహాత్మనే ।
భస్మ దిగ్ధాఙలిఙ్గాయ తస్మై రుద్రాత్మనే నమః ॥ 92

త్రిశూలమును ధరించువారును దేవతల యొక్క ప్రభువును, త్రినేత్రుడును మహాత్ముడును తన శరీరముపై విభూతిని ధరించు వారును అగు రుద్రరూపులైన పరమేశ్వరునకు నమస్కారము

చన్ద్రార్ధకృతశీర్షాయ వ్యాలయజ్ఞో వ్యాలయజ్ఞోపవీతినే ।
పినాకశూల హస్తాయ తస్మై ఉగ్రాత్మనే నమః ॥ 93

ఎవరి శిరస్సుపై అర్ధచంద్ర కిరీటము కలదో ఎవరి శరీరముపై సర్పరూప యజ్ఞోపవీతము శోభించుచున్నదో, ఎవరు తమ హస్తము లందు పినాకము త్రిశూలము ధరించి యున్నారో ఎవరు ప్రళయ కాలమున ఉగ్రరూపమును ధరించుదురో అట్టి శివునకు నమస్కారము

సర్వభూతాత్మభూతాయ భూతాదినిధనాయ చ ।
అక్రోధద్రోహమోహాయ తస్మై శాన్తాత్మనే నమః ॥ 94

ఎవరు సమస్త ప్రాణులయొక్క ఆత్మయై యున్నారో ఎవరు ప్రాణికోట్లయొక్క జనన మరణములకు కారణమై యున్నారో ఎవరియందు క్రోధము ద్రోహము మోహము ఏమాత్రము లేవో, అట్టి శాంతాత్ములగు పరమేశ్వరునకు నమస్కారము

యస్మిన్ సర్వం యతః సర్వం యః సర్వం సర్వ
తశ్చయః ।
యశ్చ సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః ॥ 95

ఎవరిలోపల సమస్త ప్రపంచము కలదో ఎవరినుండి సమస్తము ఉత్పన్నమగుచున్నదో ఎవరు స్వయముగ సర్వరూపులో ఎవరు సదా అన్ని వైపుల వ్యాపించియున్నారో ఎవరు సర్వమయులో, అట్టి సర్వాత్మకు నమస్కారము

**విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసమ్భవ ।**
**అపవర్గోఽసి భూతానాం పఞ్చానాం పరతః స్థితః ॥ 86**

ఈ విశ్వమును నిర్మాణమొనర్చు ఓ పరమేశ్వరా! మీకు ప్రణామము విశ్వముయొక్క ఆత్మయు విశ్వముయొక్క ఉత్పత్తిస్థానభూతులు నగు జగదీశ్వరా! మీకు నమస్కారము మీరు పంచభూతములకు పరమైనవారు మీరు సమస్తప్రాణుల మోక్షస్వరూపమైన బ్రహ్మము అయియున్నారు

**నమస్తే త్రిషు లోకేషు నమస్తే పరతస్త్రిషు ।**
**నమస్తే దిక్షు సర్వాసు త్వం హి సర్వమయో నిధిః ॥ 87**

ముల్లోకములందును వ్యాపించియున్న దేవా! మీకు నమస్కారము ముల్లోకములకంటె పరమైయుండు మీకు ప్రణామము అన్ని దిక్కులందు వ్యాపించియుండు ప్రభువగు మీకు నమస్కారము సమస్త పదార్థములతో పూర్ణమైన భండారమే మీరు

**నమస్తే భగవన్ విష్ణో లోకానాం ప్రభవాప్యయ ।**
**త్వం హి కర్తా హృషీకేశ సంహర్తా చాపరాజితః ॥ 88**

ప్రపంచమును ఉత్పన్నమొనర్చు నాశరహితులగు విష్ణుమూర్తీ! మీకు నమస్కారము హృషీకేశా! మీరు సర్వులయొక్క జన్మదాతయు సంహారకర్తయు అయి యున్నారు మీరు ఎవరిచేతను పరాజితులు కానేరరు

న వా పశ్యామి తే భావం దివ్యం హి త్రిషు వర్త్మసు ।
త్వాం తు పశ్యామి తత్త్వేన యత్ తే రూపం సనాతనమ్॥99

ముల్లోకములందును మీయొక్క దివ్యమైన జన్మ కర్మల రహస్యమును నే నెఱుంగను తత్త్వదృష్టిచే మీ యొక్క సనాతన రూప మేది కలదో దానిపై మాత్రము నేను దృష్టి నుంచు చున్నాను

దివం తే శిరసా వ్యాప్తం పద్భ్యాం దేవీ వసుంధరా ।
విక్రమేణ త్రయో లోకాః పురుషోఽసి సనాతనః ॥ 100

స్వర్గలోకము మీ శిరస్సు చేతను పృథ్వీ దేవి మీ పాదముల చేతను మూడులోకములు మీ యొక్క మూడడుగులచేతను వ్యాపించి యున్నవి మీరు సనాతన పురుషులు

దిశో భుజా రవిశ్చక్షుర్వీర్యే శుక్రః ప్రతిష్ఠితః ।
సప్త మార్గా నిరుద్ధా స్తే వాయోరమితతేజసః ॥ 101

దిక్కులు మీ భుజములు సూర్యుడు మీయొక్క నేత్ర మొలు ప్రజాపతియగు శుక్రాచార్యుడు మీయొక్క వీర్యము అయి యున్నారు అత్యంత తేజస్వియైన వాయువు యొక్క రూపముచే మీరు పైన గల ఏడు మార్గములను నిరోధించియున్నారు

అతసీ పుష్పసంకాశం పీతవాస సమచ్యుతమ్ ।
యే నమస్యన్తి గోవిన్దం న తేషాం విద్యతే భయమ్ ॥ 102

అతసీ పుష్పమువంటి కాంతి గలవారును శరీరముపై పీత వస్త్రము శోభించు చున్న వారును తమ స్వరూపమునుండి యెన్న డును చ్యుతి నొందనివారును అగు గోవిందునను నమస్కరించు వారికి ఎన్నడును భయము ఉండదు

ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో
దశాశ్వమేధావభృథేన తుల్యః ।
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ ॥ 103

శ్రీ కృష్ణునకు ఒక్క పర్యాయము నమస్కారము చేసినచో అది పది అశ్వమేధ యజ్ఞములందు అవభృథస్నానములతో సమానమైన ఫల మొసంగును అయితే పది అశ్వమేధ యజ్ఞములను చేసినవాడు తిరిగి ఈ ప్రపంచమున జన్మించును శ్రీ కృష్ణునకు నమస్కరించినవాడో ఇక తిరిగి జన్మింపడు భవ బంధనమందు పడడు

కృష్ణవ్రతాః కృష్ణమనుస్మరన్తో
రాత్రౌ చ కృష్ణం పునరుత్థితా యే ।
తే కృష్ణదేహాః ప్రవిశన్తి కృష్ణ
మాజ్యం యథా మన్త్రహుతం హుతాశే ॥ 104

శ్రీ కృష్ణభజనను గూర్చిన వ్రతము గైకొనినవారును, శ్రీ కృష్ణుని నిరంతరము స్మరించుచు రాత్రి పరుండువారును మరల ప్రొద్దున లేవగనే శ్రీ కృష్ణుని స్మరించువారును అగు భక్తులు శ్రీ కృష్ణ స్వరూపులే అయి మంత్రపరసముతో హోమము చేయబడిన నేయి అగ్నియందు మిళితమగునట్లు శ్రీ కృష్ణునియందు విలీనులగుచున్నారు

నమో నరకసంత్రాస రక్షామణ్డలకారిణే ।
సంసార నిమ్నగావర్తతరి కాష్ఠాయ విష్ణవే ॥ 105

నరకభయమునుండి రక్షింపబొనుటకై జనులకు రక్షామండలమును నిర్మించువారును సంసారమను నదియొక్క సుడిగుండమును

తప్పించుకొనుటకు నావ వంటి వారును అగు విష్ణువునకు నమస్కారము

నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిన్దాయ నమోనమః ॥ 106

బ్రహ్మనిష్ఠుల యెడల ప్రేమ కలిగియుండువారును గోవులకు, బ్రహ్మనిష్ఠులకు వాత మొనర్చువారను సమస్తజగత్తునకు హితము చేయువారును అగు సచ్చిదానందస్వరూపులైన గోవిందునకు నమస్కారము

ప్రాణకాన్తారపాథేయం సంసారోచ్ఛేదభేషజమ్ ।
దుఃఖశోకపరిత్రాణం హరిరిత్యక్షరద్వయమ్ ॥ 107

హరి అను రెండక్షరములు దుర్గమమైన బాటయందు సంకట సమయమున ప్రాణులకు దారిబత్తెము వంటివి సంసారమను వ్యాధిని తొలగించి వేయునట్టి దివ్యమైన ఔషధము వంటివి మఱియు సర్వదుఃఖములనుండియు శోకములనుండియు జీవుని ఉద్ధరించునవి అయి యున్నవి

యథా విష్ణుమయం సత్యం యథా విష్ణుమయం జగత్ ।
యథా విష్ణుమయం సర్వం పాప్మా మే నశ్యతాం తథా ॥ 108

సత్యము విష్ణుమయమైనది ప్రపంచమంతయు విష్ణుమయమైనది సమస్తము విష్ణుమయమైనది ఈ సత్యము యొక్క ప్రభావముచే నాయొక్క పాపమంతయు నశించిపోవుగాక !

త్వాం ప్రపన్నాయ భక్తాయ గతిమిష్టాం జిగీషవే ।
యచ్ఛ్రేయః పుణ్డరీకాక్ష తద్ ధ్యాయస్వ సురోత్తమ ॥ 109

దేవతలలో శ్రేష్ఠులును కమలనేత్రులును అగు శ్రీకృష్ణా! నేను మీ యొక్క శరణాగతుడైన భక్తుడను మఱియు అభీష్ట

గతిని పొందదలంచుచున్నాను దేనియందు నాకు శ్రేయము కలుగునో దానిని మీరే యోచింపుడు

**ఇతి విద్యాతపోయోనిరయోనిర్విష్ణురీడితః ।**
**వాగ్యజ్ఞేనార్చితో దేవః ప్రీయతాం మే జనార్దనః ॥ 110**

విద్యకు తపస్సునకు జన్మస్థానమైనవారును ఎవరికి జన్మనొసంగువారు మఱెవరును లేరో అట్టి విష్ణుభగవానుని నేను ఈ ప్రకారముగ వాగ్రూపమగు యజ్ఞముచే పూజించితిని దీనిచే ఆ జనార్దనుడు నా యెడల ప్రసన్నుడగుగాక !

**నారాయణః పరం బ్రహ్మ నారాయణపరం తపః ।**
**నారాయణః పరో దేవః సర్వం నారాయణః సదా ॥ 111**

నారాయణుడే పరబ్రహ్మము నారాయణుడే పరమ తపస్సు నారాయణుడే అందఱికంటెను పెద్ద దేవత నారాయణుడే సదా సమస్తము అయియున్నారు

వైశంపాయనుడు చెప్పెను

**స్తవరాజః సమాప్తోఽయం విష్ణోరద్భుత కర్మణః ।**
**గాఙ్గేయేన పురా గీతో మహాపాతకనాశనః ॥ 112**

జనమేజయా ! గంగానందనుడగు భీష్ముడు పూర్వము ఏ అద్భుత స్తవరాజమును గానము చేసెనో అద్భుత కర్మల నొనర్చు విష్ణువును గూర్చిన ఆ యీ స్తవరాజము గొప్ప గొప్ప పాపములను కూడ నశింపజేయునదై యున్నది

**ఇమం నరః స్తవరాజం ముముక్షుః**
**పఠఞ్శుచిః కలుషితకల్మషాపహమ్ ,**

అతీత్య లోకానమలాన్ సనాతనాన్
పదం స గచ్ఛత్యమృతం మహాత్మనః ॥ 118

ఈ స్తవరాజము సమస్త పాపములను నశింప జేయునదియై యున్నది సంసార బంధనము నుండి విముక్తి నొందదలంచువాడు దీనిని పవిత్ర భావముతో పఠించుచో అతడు నిర్మల సనాతన లోకములను కూడ దాటి పరమాత్మ యగు శ్రీకృష్ణుని అమృతమయ ధామమునకు వెడలును

# భగవత్స్తుతి

## (నారదుడు)

## (శాంతిపర్వము 209 వ అధ్యాయము)

అవ్యక్తం శాశ్వతం దేవం ప్రభవం పురుషోత్తమమ్ ।
ప్రపద్యే ప్రాఞ్జలిర్విష్ణుమక్షరం పరమం పదమ్ ॥ 1

ప్రభూ! అవ్యక్తమై సనాతనమైనట్టి దేవతయు సమస్తము యొక్క ఉత్పత్తికి కారణమును పురుషోత్తముడును నాశరహితుడును పరమపద స్వరూపుడును అగు విష్ణువునకు నేను చేతులు జోడించి నమస్కరించుచున్నాను

పురాణం ప్రభవం నిత్యమక్షయం లోకసాక్షిణమ్ ।
ప్రపద్యే పుణ్డరీకాక్షమీశం భక్తానుకమ్పినమ్ ॥ 2

పురాణ పురుషుడును సమస్తము యొక్క ఉత్పత్తికి కారణభూతుడును క్షయరహితుడును, జగత్తునంతటికిని సాక్షియు, కమ

లము వలె సుందరమైన నేత్రములు కలవాడును భక్తవత్సలుడును అగు విష్ణువును నేను శరణు పొందుచున్నాను

**లోకనాథం సహస్రాక్షమద్భుతం పరమం పదమ్ ।**
**భగవన్తం ప్రపన్నోఽస్మి భూతభవ్యభవత్ప్రభుమ్ ॥ 3**

సమస్త లోకములకును ప్రభువును సంరక్షకుడును వేల కొలది నేత్రములు కలవారును భూత భవిష్యద్వర్తమానములకు ప్రభువును అద్భుతుడును పరమపదరూపుడను అగు విష్ణు భగవానుని నేను శరణు పొందుచున్నాను

**స్రష్టారం సర్వలోకానా మనన్తం విశ్వతోముఖమ్ ।**
**పద్మనాభం హృషీకేశం ప్రపద్యే సత్యమచ్యుతమ్ ॥ 4**

సమస్త లోకముల యొక్క స్రష్టయు అన్ని వైపుల ముఖములు కలవారును అనంతుడను సర్వస్వరూపుడును అచ్యుతుడును ఇంద్రియము లన్నిటియొక్క ప్రభువును అగు పద్మనాభుని నేను శరణు పొందుచున్నాను

**హిరణ్యగర్భమమృతం భూగర్భం పరతః పరమ్ ।**
**ప్రభోః ప్రభుమనాద్యన్తం ప్రపద్యే తం రవిప్రభమ్ ॥ 5**

హిరణ్యగర్భుని అమృతస్వరూపమును భూమిని గర్భమందు ధరించువారును పరాత్పరుడును, ప్రభువులకును కూడ ప్రభువును, అనాదియు అనంతుడును సూర్యునివంటి కాంతి కలవారును అగు శ్రీహరిని నేను శరణు పొందుచున్నాను

**సహస్రశీర్షం పురుషం మహర్షిం తత్త్వ భావనమ్ ।**
**ప్రపద్యే సూక్ష్మమచలం వరేణ్యమభయప్రదమ్ ॥ 6**

వేలకొలది శిరస్సులు కలవారును అంతర్యామి యగు ఆత్మయు తత్త్వమును చింతనచేయు కపిల మహర్షి స్వరూపులును,

సూక్ష్మ అచల, శ్రేష్ఠరూపులను అభయ ప్రదులును అగు శ్రీహరిని శరణు పొందుచున్నాను

నారాయణం పురాణర్షిం యోగాత్మానం సనాతనమ్ ।
సంస్థానం సర్వతత్త్వానాం ప్రపద్యే ధ్రువమీశ్వరమ్ ॥ 7

ప్రాచీన ఋషియగు నారాయణుడును యోగాత్మయు సనాతన పురుషుడును తత్త్వములన్నిటియొక్క అధిష్ఠానమును, నాశరహితుడగు ఈశ్వరుడును అగు శ్రీహరిని నేను శరణుపొందు చున్నాను

యః ప్రభుః సర్వభూతానాం యేన సర్వమిదం తతమ్ ।
చరాచర గురుర్విష్ణుః స మే దేవః ప్రసీదతు ॥ 8

సమస్త భూతములకు ప్రభువును ఈ ప్రపంచమునందంతటను వ్యాపించియున్నవాడను చరాచరప్రాణులయొక్క గురువును అగు శ్రీహరి నాయెడల ప్రసన్నుడగుగాక !

యస్మాదుత్పద్యతే బ్రహ్మ పద్మయోనిః పితామహః ।
బ్రహ్మయోనిర్హి విశ్వాత్మా స మే విష్ణు ప్రసీదతు ॥ 9

ఎవరినుండి పద్మయోనియు పితామహుడును అగు బ్రహ్మ దేవుడు ఉద్భవించెనో వేదములకు కారణభూతుడును విశ్వాత్మయు నగు అట్టి విష్ణువు నాయెడల ప్రసన్నుడగు గాక !

యం పురా ప్రలయే ప్రాప్తే నష్టే స్థావరజఙ్గమే ।
బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టే లోకే పరావరే ॥ 10

ఆభూతసమ్ప్లవే చైవ ప్రలీనే ప్రకృతౌ మహాన్ ।
ఏక స్తిష్ఠతి విశ్వాత్మా స మే విష్ణుః ప్రసీదతు ॥ 11

పూర్వము మహాప్రళయము సంభవింప చరాచర ప్రాణులన్నియు నశించిపోవుచుండ బ్రహ్మాది దేవతలు కూడ లయించుచుండ ప్రపంచమందలి చిన్న వస్తువులు పెద్దవస్తువులు అన్నియు నశించిపోవుచుండ సమస్త భూతములు క్రమముగ లయింప మహత్తత్త్వమున్ను ప్రకృతి యందు విలీనము కాగా అపుడు ఎవరు ఒక్కరే శేషించియుందురో అట్టి విశ్వాత్మ యగు విష్ణువు నాయెడల ప్రసన్నుడగు గాక!

**చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పఞ్చభిరేవ చ ।**
**హూయతే చ పునర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు ॥ 12**

నాలుగు నాలుగు రెండు ఐదు రెండు—ఈ పదనేడు అక్షరముల మంత్రముల ద్వారా ఎవరికి ఆహుతి ఈయబడుచున్నదో అట్టి విష్ణువు నా యెడః ప్రసన్నుడగు గాక!

**పర్జన్యః పృథివీ సస్యం కాలో ధర్మః క్రియాక్రియే ।**
**గుణాకరః స మే బభ్రుర్వాసుదేవః ప్రసీదతు ॥ 13**

మేఘము భూమి సస్యము, కాలము ధర్మము కర్మము కర్మము యొక్క అభావము అనునివి యన్నియు ఎవరియొక్క స్వరూపములో ఎవరు గుణముల నిధియో అట్టి శ్యామవర్ణుడగు వాసుదేవుడు నా యెడల ప్రసన్నుడగు గాక!

**అగ్నీషోమార్కతారాణాం బ్రహ్మరుద్రేన్ద్రయోగినామ్ ।**
**యస్తేజయతి తేజాంసి స మే విష్ణుః ప్రసీదతు ॥ 14**

అగ్ని చంద్రుడు సూర్యుడు నక్షత్రములు బ్రహ్మదేవుడు రుద్రుడు ఇంద్రుడు యోగులు—అను వీరి యొక్క తేజస్సును కూడ జయించువారును అగు విష్ణువు నా యెడల ప్రసన్నుడగుగాక!

యోగావాస నమస్తుభ్యం సర్వావాస వరప్రద ।
యజ్ఞగర్భ హిరణ్యాఙ్గ పఞ్చయజ్ఞ నమోఽస్తు తే ॥ 15

యోగుల నివాసస్థాన మగు దేవా! మీకు నమస్కారము సర్వుల నివాసస్థానమున్ను వరదాయకుడును యజ్ఞగర్భుడును స్వర్ణకాంతి కలవారును పంచయజ్ఞమయులును అగు పరమేశ్వరా! మీకు నమస్కారము

చతుర్మూర్తే పరం ధామ లక్ష్మ్యావాస పరార్చిత ।
సర్వావాస నమస్తేఽస్తు వాసుదేవ ప్రధానకృత్ ॥ 16

మీరు శ్రీకృష్ణ బలరామ ప్రద్యుమ్న అనిరుద్ధులను ఈ నలుగురి రూపము కలవారు పరమధామ స్వరూపులు లక్ష్మీనివాసులు పరమపూజితులు సర్వుల నివాసస్థానము ప్రకృతియొక్క ప్రవర్తకులు అయి యున్నారు ఓ వాసుదేవా! మీకు నమస్కారము

అజస్త్వమగమః పన్థా హ్యమూర్తిర్విశ్వమూర్తిధృక్ ।
వికర్తః పఞ్చకాలజ్ఞ నమస్తే జ్ఞానసాగర ॥ 17

మీరు జన్మలేనివారు అగమ్యమార్గులు జగత్తుయొక్క ఆకారమంతయు మీరే ధరించుచున్నారు సంహారకారులగు రుద్రుడు మీరే మీరు (ప్రాతః సంగవ మధ్యాహ్న అపరాహ్ణ సాయాహ్నములను) ఐదు కాలములను ఎఱుఁగువారై యున్నారు జ్ఞానసాగరా! మీకు నమస్కారము

అవ్యక్తాద్ వ్యక్తముత్పన్నం వ్యక్తాద్ యస్తు పరోఽక్షరః ।
యస్మాత్ పరతరం నాస్తి తమస్మి శరణం గతః ॥ 18

ఏ అవ్యక్త పరమాత్మనుండి వ్యక్తమగు ఈ జగత్తు ఉత్పన్నమైనదో ఎవరు వ్యక్తము కంటె పరులును, నాశరహితులును అయి

యున్నారో ఎవరికంటె ఉత్కృష్టమైనది మఱియొక వస్తు వేదియు లేదో అట్టి విష్ణుభగవానుని నేను శరణు బొందుచున్నాను

న ప్రధానో న చ మహాన్ పురుషశ్చేతనో హ్యజః ।
అనయోర్యః పరతరః తమస్మి శరణం గతః ॥ 19

ప్రకృతి మహత్తత్త్వము—అను ఈ రెండును జడములైనవి పురుషుడు చేతనుడు జన్మరహితుడు ప్రకృతి మహత్తత్త్వములకు పరమైన వారగు పురుషోత్తముని నేను శరణు బొందుచున్నాను

చిన్తయన్తో హి యం నిత్యం బ్రహ్మేశానాదయః ప్రభుమ్ ।
నిశ్చయం నాధిగచ్ఛన్తి తమస్మి శరణం గతః ॥ 20

బ్రహ్మదేవుడు శివుడు మొదలగువారు ఏ భగవంతుని నిరంతరము చింతన చేయుచున్నను వారి స్వరూపమును గూర్చి ఏ నిశ్చయమున్ను పొందజాలక యున్నారో అట్టి పరమేశ్వరుని నేను శరణు పొందుచున్నాను

జితేన్ద్రియా మహాత్మానో జ్ఞానధ్యాన పరాయణాః ।
యం ప్రాప్య న నివర్తన్తే తమస్మి శరణం గతః ॥ 21

జ్ఞానులు ధ్యానపరాయణులగు జితేంద్రియ మహాత్ములు ఎవరిని పొంది మరల ఈ ప్రపంచమునకు తిరిగి రాక యున్నారో అట్టి శ్రీహరిని నేను శరణు పొందుచున్నాను

ఏకాంశేన జగత్ సర్వమవష్టభ్య విభుః స్థితః ।
అగ్రాహ్యో నిర్గుణో నిత్యస్తమస్మి శరణం గతః ॥ 22

ఏ సర్వవ్యాపియగు పరమేశ్వరుడు ఈ ప్రపంచమునంతను తన ఒక్క అంశముతో ధరించియున్నారో, ఎవరు ఏ ఇంద్రియములు

చేతను తెలియబడజాలరో ఎవరు నిర్గుణులో, నిత్యులో అట్టి పరమాత్మను నేను శరణు పొందుచున్నాను

**సోమార్కాగ్నిమయం తేజో యా చ తారామయీ ద్యుతిః ।**
**దివి సంజాయతే యోఽయం స మహాత్మా ప్రసీదతు ॥ 23**

ఆకాశమున సూర్య చంద్ర నక్షత్రముల కాంతి ఏది ప్రకాశింప చేయుచున్నదో అది అంతయు ఎవరియొక్క స్వరూపమో అట్టి పరమాత్మ నా యెడల ప్రసన్నుడగు గాక!

**గుణాదిర్నిర్గుణశ్చాద్యో లక్ష్మీవాంశ్చేతనో హ్యజః ।**
**సూక్ష్మః సర్వగతో యోగీ స మహాత్మా ప్రసీదతు ॥ 24**

గుణములన్నిటియొక్క ఆదికారణుడును స్వయముగ నిర్గుణుడును ఆదిపురుషుడును లక్ష్మీవంతుడును చేతనుడును జన్మరహితుడును సూక్ష్మరూపుడును సర్వవ్యాపియు యోగియు మహాత్ముడు నగు శ్రీహరి నా యెడల ప్రసన్నుడగు గాక!

**సాంఖ్యయోగాశ్చ యే చాన్యే సిద్ధాశ్చ పరమర్షయః ।**
**యం విదిత్వా విముచ్యన్తే స మహాత్మా ప్రసీదతు ॥ 25**

జ్ఞానయోగులు కర్మయోగులు సిద్ధులు మహర్షులు ఎవరిని తెలిసికొని ఈ ప్రపంచమున ముక్తులగుచున్నారో అట్టి పరమాత్ముడగు శ్రీహరి నా యెడల ప్రసన్నుడగు గాక!

**అవ్యక్తః సమధిష్ఠాతా హ్యచిన్త్యః సదసత్పరః ।**
**ఆస్థితః ప్రకృతిశ్రేష్ఠః స మహాత్మా ప్రసీదతు ॥ 26**

అవ్యక్తుడును సమస్తమునకు అధిష్ఠాతయు అచింత్యుడును సదసద్విలక్షణుడును ఆధార రహితుడును ప్రకృతికంటె శ్రేష్ఠుడును అగు శ్రీహరి నా యెడల ప్రసన్నుడగు గాక!

**క్షేత్రజ్ఞః పఞ్చధా భుఙ్క్తే ప్రకృతిం పఞ్చభిర్ముఖైః ।**
**మహాన్ గుణాంశ్చ యో భుఙ్క్తే స మహాత్మా ప్రసీదతు॥ 27**

ఎవరు జీవాత్మరూపముతో పంచ జ్ఞానేంద్రియములను ముఖములద్వారా శబ్దాది పంచ విషయములను అనుభవించుచున్నారో స్వయముగ మహత్తర రూపులై నప్పటికిని గుణములను అనుభవించుచున్నారో అట్టి మహాత్ముడగు శ్రీహరి నా యెడల ప్రసన్నుడగుగాక !

**సూర్యమధ్యేస్థితః సోమ స్తస్య మధ్యే చ యా స్థితా ।**
**భూతబాహ్యే చ యా దీప్తిః స మహాత్మా ప్రసీదతు ॥ 28**

సూర్యమండలమందు సోమరూపమున నున్నవారును ఆ సోమము లోపలగల అలౌకిక దీప్తి స్వరూపముగ కలవారును అయిన అట్టి పరమాత్మయగు శ్రీహరి నా యెడల ప్రసన్నుడగు గాక!

**నమస్తే సర్వతః సర్వ సర్వతోఽక్షి శిరోముఖ ।**
**నిర్వికార నమస్తేఽస్తు సాక్షీ క్షేత్రే వ్యవస్థితః ॥ 29**

సర్వస్వరూపులగు పరమేశ్వరా! మీకు అన్నివైపులనుండి నమస్కారము మీకు అన్నివైపుల నేత్రములు మస్తకములు ముఖములు కలవు నిర్వికారులగు పరమాత్మా! మీకు నమస్కారము మీరు ప్రతి క్షేత్రమందును (శరీరమందును) సాక్షిరూపమున వెలయుచున్నారు

**అతీన్ద్రియ నమస్తుభ్యం లిఙ్గైర్వ్యక్తైర్న మీయసే ।**
**యే చ త్వాం నాభిజానన్తి సంసారే సంసరన్తి తే ॥ 30**

ఇంద్రియాతీతులగు పరమేశ్వరా! మీకు నమస్కారము వ్యక్తములగు గుణతుల ద్వారా మీయొక్క జ్ఞానము కలుగుట

అసంభవము ప్రపంచమున మిమ్ములను తెలియనివారు జనన మరణ చక్రమందు పడిపోవుదురు

కామక్రోధ వినిర్ముక్తా రాగద్వేషవివర్జితాః ।
నాన్యభక్తా విజానన్తి న పునర్నారకా ద్విజాః ॥ 31

కామ క్రోధములనుండి విడుదల పొందినవారు రాగ ద్వేష రహితులు మీయొక్క అనన్య భక్తులు మాత్రమే మిమ్ములను తెలిసికొన గలుగుచున్నారు విషయములను నరకమందు పడిన వారు మిమ్ములను తెలిసికొనజాలరు

ఏకాన్తినో హి నిర్ద్వన్ద్వా నిరాశీః కర్మకారిణః ।
జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణస్త్వాం విశన్తి వినిశ్చితాః ॥ 32

మీయొక్క అనన్యభక్తులు ద్వంద్వరహితులు నిష్కామ కర్మ నాచరించువారు జ్ఞానాగ్నిచే తమ సమస్త కర్మలను దగ్ధ మొనర్చినవారును మీయెడల దృఢమైన నిష్ఠ కలవారును మీ యందే ప్రవేశించుచున్నారు

అశరీరం శరీరస్థం సమం సర్వేషు దేహిషు ।
పుణ్యపాపవినిర్ముక్తా భక్తాస్త్వాం ప్రవిశన్త్యుత ॥ 33

మీరు శరీరమందున్నను శరీరరహితులు సమస్త ప్రాణు లందును సమరూపమున ఉన్నవారు పుణ్య పాపములనుండి విముక్త లైనట్టి భక్తులు మీయందే ప్రవేశించుచున్నారు

అవ్యక్తం బుద్ధ్యహఙ్కారమనో భూతేన్ద్రియాణి చ ।
త్వయి తాని చ తేషు త్వం న తేషు త్వం న తే త్వయి ॥ 34

అవ్యక్తమగు ప్రకృతి బుద్ధి అహంకారము మనస్సు పంచమహాభూతములు సమస్త ఇంద్రియములు అన్నియు మీ

యందే ఉన్నవి వాని యన్నిటియందును మీరున్నారు కాని వాస్తవముగ వానియందు మీరు లేరు మీ యందవి లేవు

**ఏకత్వాన్యత్వ నానాత్వం యే విదుర్యాన్తి తే పరమ్ ।**
**సమోఽసి సర్వభూతేషు న తే ద్వేష్యోఽస్తి నప్రియః ॥ 35**
**సమత్వమభికాఙ్క్షేఽహం భక్త్యా వై నాన్యచేతసా ।**

ఏకత్వ అన్యత్వ అనేకత్వముల రహస్యమును బాగుగ తెలిసికొనినవారు పరమాత్మయగు మిమ్ములను పొందుచున్నారు మీరు సమస్త భూతములందును సమముగ నున్నారు మీ కెవడును ద్వేషుడు కాని ప్రియుడు కాని లేరు నేను అనన్యచిత్తముచే మీ యొక్క భక్తిద్వారా సమత్వము పొందదలంచుచున్నాను

**చరాచరమిదం సర్వం భూతగ్రామం చతుర్విధమ్ ॥ 36**
**త్వయా త్వయ్యేవ తత్ ప్రోతం సూత్రే మణిగణా ఇవ ।**

నాలుగు విధములగు ఈ చరాచర ప్రాణి సముదాయము మీచే వ్యాపింపబడియున్నది దారమునందు మణులు గ్రుచ్చబడు నట్లు ఈ ప్రపంచమంతయు మీ యందే ఓతప్రోతమై యున్నది

**స్రష్టా భోక్తాసి కూటస్థో హ్యతత్త్వస్తత్త్వ సంజ్ఞితః ।**
**అకర్మహేతు రచలః పృథగాత్మ న్యవస్థితః ॥ 37**

మీరు జగత్తుయొక్క స్రష్ట భోక్త కూటస్థులు ప్రపంచ తత్త్వసంజ్ఞ కలిగియున్నప్పటికిని దానికంటె సర్వథా విలక్షణులు మీరు కర్మకు హేతువు కారు మీరు నిశ్చలురు పరమాత్మ స్వరూపులు ప్రతి శరీరమందును జీవాత్మరూపమున మీరే వెలయు చున్నారు

**న తే భూతేషు సంయోగో భూతతత్త్వ గుణాతిగః ।**
**అహఙ్కారేణ బుద్ధ్యా వా న తే యోగస్త్రిభిర్గుణైః ॥ 38**

వాస్తవముగ ప్రాణులతో మీకు సంయోగము లేదు మీరు భూతములకంటె తత్త్వములకంటె గుణములకంటె పరమైనవారు అహంకారముతో బుద్ధితో త్రిగుణములతో మీ కేవిధమైన సంబంధము లేదు

న తే ధర్మోఽస్త్య ధర్మో వా నారమ్భో జన్మ వా పునః ।
జరామరణమోక్షార్థం త్వాం ప్రసన్నోఽస్మి సర్వశః ॥ 39

మీ కేవిధమైన ధర్మము కాని అధర్మము కాని లేవు ఏవిధమైన కార్యము లేదు జన్మము లేదు నేను జన్మమృత్యువుల నుండి విడుదల పొందుటకై సర్వవిధముల మిమ్ములను నేను శరణు పొందుచున్నాను

ఈశ్వరోఽసి జగన్నాథ తతః పరమ ఉచ్యసే ।
భక్తానాం యద్ధితం దేవ తద్ధ్యాహి త్రిదశేశ్వర ॥ 40

జగన్నాథా! మీరు ఈశ్వర స్వరూపులు కనుకనే పరమాత్మ యని చెప్పబడుచున్నారు దేవా! సురేశ్వరా! భక్తులకు హితమైన దానిని నాకు కలుగజేయుడు

విషయైరిన్ద్రియైర్వాపి న మే భూయః సమాగమః ।
పృథివీం యాతు మే ఘ్రాణం యాతు మే రసనా జలమ్ ॥ 41

రూపం హుతాశనం యాతు స్పర్శో యాతు చ మారుతమ్ ।
శ్రోత్రమాకాశమప్యేతు మనో వైకారికం పునః ॥ 42

విషయములతోను ఇంద్రియములతోను మరల ఎన్నడును నాకు కలయిక లేకుండుగాక! నా ఘ్రాణేంద్రియము పృథివీ తత్త్వమందు కలియుగాక! అట్లే రసేంద్రియము జలమందును రూపము (నేత్రము) అగ్నియందును స్పర్శ (త్వక్కు) వాయువునందును

శ్రోత్రేంద్రియము ఆకాశమందును మనస్సు అహంకారమందును కలియుగాక!

ఇన్ద్రియాణ్యం సంయాన్తు స్వాసు స్వాసు చ యోనిషు।
పృథివీ యాతు సలిలమాపోఽగ్ని మనలోఽనిలమ్ ॥ 43

వాయురాకాశమప్యేతు మనశ్చాకాశ ఎవ చ।
అహఙ్కారం మనో యాతు మోహనం సర్వదేహినామ్।
అహఙ్కారస్తతో బుద్ధిం బుద్ధిరవ్యక్త మచ్యుత ॥ 44

అచ్యుతా! ఇంద్రియములు వాని వాని జన్మస్థానములందు కలియుగాక! పృథివి జలమందును జలము అగ్నియందును అగ్ని వాయువునందును వాయువు ఆకాశమందును ఆకాశము మనస్సునందును మనస్సు మోహకరమగు ఆ అహంకారమందును అహంకారము మహత్తత్త్వమందును మహత్తత్త్వము అవ్యక్తమగు ప్రకృతియందును కలియుగాక!

ప్రధానే ప్రకృతిం యాతే గుణసామ్యే వ్యవస్థితే।
వియోగః సర్వకరణైర్గుణైర్యాత్వితశ్చ మే భవేత్ ॥ 45

ప్రధానము ప్రకృతిని పొంద గుణముల యొక్క సామ్యావస్థ యను మహాప్రళయము సంభవింప నాకు ఇంద్రియములన్నిటి నుండియు వాని విషయముల నుండియు వియోగము కలుగుగాక!

నిష్కైవల్యపదం తాత కాఙ్క్షేఽహం పరమం తవ।
ఏకీభావస్త్వయా మేఽస్తు న మే జన్మ భవేత్ పునః ॥ 46

మహాత్మా! నేను పరమ మోక్షమును కాంక్షించుచున్నాను మీతో నాయొక్క ఏకీభావము కలుగుగాక! ఈ ప్రపంచమున తిరిగి నేను జన్మింపకుందును గాక!

త్వద్బుద్ధి స్త్వద్ గతప్రాణ స్త్వద్భక్త స్త్వత్పరాయణః ।
త్వామేవాహం స్మరిష్యామి మరణే పర్యుపస్థితే॥ 47

మృత్యుకాల మేతెంచ నాయొక్క బుద్ధి మీయందే లగ్నమగుగాక! నా ప్రాణములు మీయందే లీనములగు గాక! నాకు మీ యందే భక్తి భావము కలిగియుండుగాక! నేను సదా మీ యొక్క శరణ్యమందే ఉండియుండుదును గాక! ఈ ప్రకారము నేను నిరంతరము మీయొక్క స్మరణయే చేయుచుందును గాక!

పూర్వదేహకృతా యే మే వ్యాధయః ప్రవిశన్తు మామ్ ।
అర్దయన్తు చ దుఃఖాని ఋణం మే ప్రతిముఞ్చతు ॥ 48

పూర్వ శరీరమందు నేనేమి దుష్కర్మములు చేసితినో వాని ఫలస్వరూపముగ వ్యాధులు నా శరీ మందు ప్రవేశించి వివిధదుఃఖముల ద్వారా నన్ను వేధించుగాక! వాని యన్నింటికి నాపై గల ఋణము తొలగిపోవుగాక!

అనుధ్యాతోఽసి దేవేశ న మే జన్మ భవేత్ పునః ।
తస్మాద్ బ్రవీమి కర్మాణి ఋణం మే న భవేదితి ॥ 49

దేవేశ్వరా! నాకు తిరిగి జన్మలేకుండుట కొఱకై నేను మిమ్ములను స్మరణ చేసితిని కావున నాయొక్క కర్మ నశించుగాక యనియు నాపై దేనియొక్కయు ఋణము శేషించి యుండ రాదనియు నేను తిరిగి మీతో వచించుచున్నాను

ఉపతిష్ఠన్తు మాం సర్వే వ్యాధయః పూర్వ సంచితాః ।
అనృణో గన్తుమిచ్ఛామి తద్ విష్ణోః పరమం పదమ్ ॥ 50

పూర్వజన్మమ దు నేనేమి కర్మలను సంచయ మొనర్చితినో అవి యన్నియు రోగాదులద్వారా నా శరీరమందు ఉండియుండు గాక! నేను వాని యన్నిటినుండి ఋణ విముక్తుడనై విష్ణుభగవానుని పరమధామమును పొందదలంచుచున్నాను

# శివ స్తుతి

## (దక్షుడు)

## (శాంతిపర్వము 284 వ అధ్యాయము)

**నమస్తే దేవదేవేశ దేవారిబలసూదన ।**
**దేవేన్ద్రబలవిష్టమ్భ దేవదానవపూజిత ॥ 1**

దేవదేవేశ్వరా! మీకు నమస్కారము మీరు దేవవైరులగు దానవుల సేనను సంహరించువారును దేవరాజగు ఇంద్రుని శక్తిని కూడ స్తంభింపజేయువారును అయి యున్నారు దేవతలు దానవులు అందఱును మిమ్ములను పూజించిరి

**సహస్రాక్ష విరూపాక్ష త్ర్యక్ష యక్షాధిపప్రియ ।**
**సర్వతః పాణిపాదాన్త సర్వతోఽక్షి శిరోముఖ ॥ 2**

మీరు వేలకొలది నేత్రములు కలవారు కావున మీరు సహస్రాక్షుడు అని చెప్పబడిరి మీ ఇంద్రియములు అన్నిటికంటెను విలక్షణములైనవి అవి పరోక్షవిషయములను కూడ ప్రత్యక్షము చేసికొనగలవు కావున మిమ్ములను విరూపాక్షుడందురు మీరు మూడు నేత్రములు కలిగియుండుటచే త్ర్యక్షుడని చెప్పబడిరి యక్షరాజగు కుబేరునకున్ను మీరు ప్రియులు మీకు అన్నివైపుల చేతులు కాళ్ళు నేత్రములు మస్తకములు ముఖములు కలవు

**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠసి ।**
**శఙ్కుకర్ణ మహాకర్ణ కుమ్భకర్ణార్ణవాలయ ॥**
**గజేన్ద్రకర్ణ గోకర్ణ పాణికర్ణ నమోఽస్తుతే । 3**

మీకు అన్నివైపుల చెవులు కూడ కలవు ప్రపంచమున ఏది కలదో దాని నంతను వ్యాపించి మీరు వెలయుచున్నారు శంకుకర్ణుడు మహాకర్ణుడు కుంభకర్ణుడు అర్ణవాలయుడు గజేంద్ర కర్ణుడు గోకర్ణుడు పాణికర్ణుడు—అను ఏడుమంది పార్షదులు మీ యొక్క స్వరూపులే అయి యున్నారు వీరి అందఱి రూపమున నున్న మీకు నమస్కారము

శతోదర శతావర్త శతజిహ్వ నమోఽస్తుతే।
గాయన్తి త్వా గాయత్రిణోఽర్చన్త్యర్కమర్కిణః।
బ్రహ్మాణం త్వా శతక్రతుమూర్ధ్వం ఖమివ మేనిరే॥ 4

మీకు అనేక ఉదరములు ఆవర్తములు జిహ్వలు ఉండుటచే మీరు శతోదరుడని శతావర్తుడని శతజిహ్వుడని చెప్పబడు చున్నారు మీకు నమస్కారము గాయత్రీమంత్రమును జపము చేయువారు మీయొక్క మహిమనే గాన మొనర్చుచున్నారు సూర్యోపాసకులు సూర్యుని రూపమున మిమ్ములనే ఆరాధించు చున్నారు ఋషులు మిమ్ములనె బ్రహ్మదేవుడుగను శతక్రతు డగు ఇంద్రుడుగను ఆకాశమువలె సర్వోన్నత పదముగను భావించు చున్నారు

మూర్తౌ హి తే మహామూర్తే సముద్రామ్బరసంనిభ।
సర్వా వై దేవతా హ్యస్మిన్ గావో గోష్ఠ ఇవాసతే॥ 5

సముద్ర ఆకాశముల వలె అపార అనంత రూపమును ధరించు మహామూర్తిధారియగు మహేశ్వరా! గోశాలయందు గోవులు నివసించునట్లు భూమి జలము అగ్ని వాయువు ఆకాశము సూర్యుడు చంద్రుడు యజమానుడు అను మీ యొక్క ఎనిమిది విధములగు మూర్తులందు సమస్త దేవతలు నివసించు చున్నారు

శివచ్ఛరీరే పశ్యామి సోమమగ్నిం జలేశ్వరమ్।
ఆదిత్యమథ వై విష్ణుం బ్రహ్మాణం చ బృహస్పతిమ్॥ 6

నేను మీ శరీరమందు సోముని, అగ్నిని వరుణుని సూర్యుని విష్ణువును బ్రహ్మదేవుని, బృహస్పతిని కూడ చూచుచున్నాను

భగవాన్ కారణం కార్యం క్రియా కరణమేవ చ।
అసతశ్చ సతశ్చైవ తథైవ ప్రభవాప్యయౌ॥ 7

మీరే కారణ కార్య క్రియా (ప్రయత్న) కరణములు సత్పదార్థముల యొక్కయు అసత్పదార్థముల యొక్కయు ఉత్పత్తి ప్రళయస్థానము లున్ను మీరే అయి యున్నారు

నమో భవాయ శర్వాయ రుద్రాయ వరదాయ చ।
పశూనాం పతయే నిత్యం నమోఽస్త్వన్ధకఘాతినే॥ 8

మీరు సమస్తము యొక్క ఉద్భవములకు స్థానమగుటచే 'భవుడని సంహారమునకు కారణమగుటచే శర్వుడనియు రు అనగా పాపమును లేక దుఃఖమును తొలగించువారగుటచే 'రుద్రుడని వరముల నొసంగువారగుటచే 'వరదుడని పశువుల (జీవుల) పాలకుడగుటచే పశుపతి అని చెప్పబడుచున్నారు మీరు అంధకాసురుని వధించుటచే అంధకఘాతి యని చెప్పబడుచున్నారు మీకు మరల మరల నమస్కారము

త్రిజటాయ త్రిశీర్షాయ త్రిశూలవరపాణినే।
త్ర్యమ్బకాయ త్రినేత్రాయ త్రిపురఘ్నాయ వైనమః॥ 9

మీరు మూడు జడలు, మూడు మస్తకములు ధరించువారై యున్నారు మీ చేతియందు శ్రేష్ఠమగు త్రిశూలము శోభను

బడయుచున్నది మీరు వ్యాపకులు త్రినేత్రధారులు త్రిపురా సురసంహారకులు అయి యున్నారు మీకు నమస్కారము

నమశ్చణ్డాయ కుణ్డాయ అణ్డాయాణ్డధరాయ చ ।
దణ్డినే సమకర్ణాయ దణ్డిముణ్డాయ వై నమః ॥ 10

మీరు దుష్టులయెడల మహా క్రోధము కలిగియుండుటచే 'చండు డని చెప్పబడుచున్నారు ఉదరమున జగత్తంతయు ఉండుటచే మీరు 'కుండు డనియు చెప్పబడుచున్నారు మీరు 'అండుడు (బ్రహ్మాండస్వరూపుడు) అని 'అండధరుడు (బ్రహ్మాండమును ధరించువాడు) అనియు పేర్కొనబడుచున్నారు మీరు దండధారి (దుష్టులకు దండన నొసంగువారు) అనియు సమకర్ణుడు (సమస్తమును సమానముగ వినువారు) అనియు దండధారులును శిరోముండన మొనర్చుకొనువారును అగు సంన్యాసులున్ను మీ స్వరూపులే అయియున్నారు కావున దండిముండు డనియు కూడ చెప్పబడుచున్నారు అట్టి మీకు నమస్కారము

నమోర్ధ్వదంష్ట్రకేశాయ శుక్లాయావతతాయ చ ।
విలోహితాయ ధూమ్రాయ నీలగ్రీవాయ వై నమః ॥ 11

ఊర్ధ్వదంష్ట్రుడు ఊర్ధ్వకేశుడు శుక్లుడు (శుద్ధ బ్రహ్మస్వరూపుడు) అవతతుడు (జగద్రూపమున వ్యాపించినవారు) విలోహితుడు ధూమ్రుడు నీలగ్రీవుడు అను పేర్లు గల ఓ దేవా! మీకు నమస్కారము

నమోఽస్త్వ ప్రతిరూపాయ విరూపాయ శివాయ చ ।
సూర్యాయ సూర్యమాలాయ సూర్యధ్వజ పతాకినే ॥ 12

అప్రతిరూపుడు విరూపుడు (వివిధ రూపములు ధరించువాడు) శివుడు సూర్యుడు సూర్యమాల (సూర్యమండలమందు శోభించు

వారు) సూర్యధ్వజపతాకిని (ధ్వజముపై పతాకముపై సూర్యుని చిహ్నము కలవారు) అగు ఓ పరమశివా! మీకు నమస్కారము

నమః ప్రమథనాథాయ వృషస్కన్ధాయ ధన్వినే ।
శత్రుందమాయ దణ్డాయ పర్ణచీరపటాయ చ ॥ 13

ప్రమథ గణములకు అధీశ్వరులును వృషభమువంటి కంధములు కలవారును ఎనాకమను ధనుస్సును ధరించినవారును శత్రువులను దమనమొనర్చువారును, శత్రువులకు దండస్వరూపులును భోజపత్ర వల్కల వస్త్రములను ధరించువారును అగు మహాదేవా! మీకు నమస్కారము

నమో హిరణ్యగర్భాయ హిరణ్యకవచాయ చ ।
హిరణ్యకృతచూడాయ హిరణ్యపతయే నమః ॥ 14

హిరణ్యగర్భుడును హిరణ్యకవచుడును (బంగారు కవచము కలవాడు) హిరణ్యచూడుడును (బంగారు ముకుటము ధరించిన వారు), హిరణ్యపతియు (సువర్ణమునకు అధిపతి) అగు పరమశివా! మీకు నమస్కారము

నమః స్తుతాయ స్తుత్యాయ స్తూయమానాయ వై నమః ।
సర్వాయ సర్వభక్షాయ సర్వభూతాన్తరాత్మనే ॥ 15

స్తుతింపబడినవారును స్తుతింపబడుటకు యోగ్యులును స్తుతింపబడుచున్నవారును సర్వస్వరూపులును సర్వభక్షియు సమస్త ప్రాణుల అంతరాత్మయు నగు ఓ దేవా! మీకు నమస్కారము

నమో హోత్రేఽథ మన్త్రాయ శుక్లధ్వజ పతాకినే ।
నమో నాభాయ నాభ్యాయ నమః కటకటాయ చ ॥ 16

హోత మంత్రములు మీరే మీకు నమస్కారము మీ యొక్క ధ్వజము పతాకము తెలుపువి అట్టి మీకు నమస్కారము నాభుడును (నాభియందు జగత్తును ధరించువారును) నాభ్యుడును (సంసార చక్రము యొక్క నాభిస్థానము) కటకటుడును (ఆవరణమునకున్న ఆవరణుడును) అగు మీకు నమస్కారము

నమోఽస్తు కృశనాసాయ కృశాఙ్గాయ కృశాయ చ ।
సంహృష్టాయ విహృష్టాయ నమః కిలకిలాయ చ ॥ 17

కృశించిన నాసిక అవయవములు శరీరము కలవారును అత్యంత హర్షోల్లాస పరిపూర్ణులును విశేషహర్షమును అనుభవించువారును హర్షజనిత కిలకిల ధ్వని కలవారు నగు ఓ మహాదేవా! మీకు నమస్కారము!

నమోఽస్తు శయమానాయ శయితా యోత్థితాయ చ ।
స్థితాయ ధావమానాయ ముణ్డాయ జటిలాయ చ ॥ 18

సమస్త ప్రాణులయందు శయనించు అంతర్యామియు ప్రళయకాలమున యోగనిద్రను ఆశ్రయించి నిదురించువారును, సృష్ట్యారంభమున కల్పాంతనిద్రనుండి మేల్కాంచువారును బ్రహ్మరూపమున అంతట నున్నవారును కాలరూపమున సదా పరుగెత్తువారును శిరోముండనము కావించుకొను సంన్యాసులయొక్కయు జటాధారులగు తపస్వుల యొక్కయు స్వరూపము కలవారును అగు పరమశివా! మీకు నమస్కారము

నమో నర్తన శీలాయ ముఖవాదిత్రవాదినే ।
వాద్యోపహారలుబ్ధాయ గీతవాదిత్రశాలినే ॥ 19

తాండవనృత్యము కావించువారును ముఖముతో శృంగీ మొదలగు వాయిద్యములను వాయించువారును కమల పుష్పము

యొక్క ఉపహారమును గ్రహించుటకు కుతూహలము కలవారును పాడుట, వాయిద్యమును వాయించుట అను కళలయందు తత్పరులును అగు దేవా! మీకు నమస్కారము!

నమో జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ బలప్రమథనాయ చ।
కాలనాథాయ కల్యాయ క్షయాయోపక్షయాయ చ॥ 20

జ్యేష్ఠులును శ్రేష్ఠులును బలుడను రాక్షసుని మథించి(నశిoచి) వైచినవారును కాలుని యొక్క నియంతయు సర్వశక్తిమంతులును, మహాప్రళయ అవాంతరప్రళయ రూపులును అగు మహాదేవా! మీకు నమస్కారము

భీమ దున్దుభిహాసాయ భీమ వ్రతధరాయ చ।
ఉగ్రాయ చ నమో నిత్యం నమోఽస్తు దశబాహవే॥ 21

భయంకర శబ్ద మొనర్చు దుందుభి శబ్దము వలె తోచు అట్టహాసము కలవారును భీమవ్రతమును ధరించువారును పది భుజములతో సుశోభితమగు ఉగ్రరూపమును ధరించినవారును అగు ఓ పరమేశ్వరా! మీకు నిత్యము మరల మరల నమస్కరించుచున్నాను

నమః కపాలహస్తాయ చితిభస్మప్రియాయ చ।
విభీషణాయ భీష్మాయ భీమవ్రతధరాయ చ॥ 22

కపాలము చేతియందు కలవారును చితియందలి భస్మము ప్రియముగ కలవారును భయంకరులును నిర్భయులును గొప్ప వ్రతములను ఆచరించువారు నగు మీకు నమస్కారము

నమో వికృతవక్త్రాయ ఖడ్గజిహ్వాయ దంష్ట్రిణే।
పక్వామమాంసలుబ్ధాయ తుమ్బీ వీణాప్రియాయ చ॥ 23

వికృతముఖులును ఖడ్గమును పోలిన నాలుక గలవారును దంతములతో సుశోభితమైన ముఖము కలవారును, పక్వములును అపక్వములును అగు ఫలములు కూడిన పదార్థములందు ప్రీతి కల వారును తుంబి (వాయిద్య విశేషము) వీణ ప్రియమైనవారును అగు ఓ మహాదేవా! మీకు నమస్కారము

నమో వృషాయ వృష్యాయ గోవృషాయ వృషాయ చ ।
కటంకటాయ దణ్డాయ నమః పచనచాయ చ ॥ 24

వర్షమును కురిపించువారును ధర్మమును వృద్ధిపఱచు వారును గోవృష (నంది) వృష (ధర్మము) నామములు కల వారును నిరంతరగతి శీలురును శాసకులును సమస్త భూతము లను పచనమొనర్చు కాలస్వరూపులునగు మీకు నమస్కారము

నమః సర్వవరిష్ఠాయ వరాయ వరదాయ చ ।
వరమాల్యగన్ధ వస్త్రాయ వరాతివరదే నమః ॥ 25

సర్వశ్రేష్ఠవర స్వరూపులును వరదాతలును ఉత్తము వస్త్ర మాల్య గంధములను ధరించువారును భక్తులయొక్క ఇచ్ఛాను సారము అంతకు మించియు వరముల నొసంగువారును అగు దేవా! మీకు నమస్కారము!

నమో రక్తవిరక్తాయ భావనాయాక్షమాలినే ।
సమ్భిన్నాయ విభిన్నాయ ఛాయాయాత పనాయ చ ॥ 26

అనురక్తి విరక్తి — రెండును కలవారును, ధ్యానపరాయ ణులును రుద్రాక్షమాలను ధరించువారును కారణరూపమున అన్నిటియందును వ్యాపించియున్నవారును కార్యరూపమున వేఱు వేఱుగ కనుపించువారును సమస్త ప్రపంచమునకు నీడ, ఎండ నొసంగువారును అగు ఓ మహాదేవా! మీకు నమస్కారము

అఘోర ఘోరరూపాయ ఘోరఘోరతరాయ చ।
నమః శివాయ శాన్తాయ నమః శాన్తతమాయ చ॥ 27

అఘోర ఘోర ఘోరతరరూపములను ధరించువారును, శివ, శాంత పరమశాంత స్వరూపులును అగు ఓ శంకరా! మీకు మరల మరల నమస్కారము

ఏకపాద్బహునేత్రాయ ఏకశీర్షే నమోఽస్తు తే।
రుద్రాయ క్షుద్రలుబ్ధాయ సంవిభాగప్రియాయ చ॥ 28

ఏకపాదము అనేక నేత్రములు ఒక శిరస్సు గలవారును భక్తులొసంగు చాల చిన్న వస్తువునందుకూడ ఆసక్తి కలవారును దానికి బదులుగా వారికి అపార ధనరాశిని ఒసంగువారును అగు ఓ రుద్రదేవా! మీకు నమస్కారము

పఞ్చాలాయ సితాఙ్గాయ నమః శమశమాయ చ।
నమశ్చణ్డికఘణ్టాయ ఘణ్టాయై ఘణ్టఘణ్టినే॥ 29

ఈ ప్రపంచమును నిర్మాణ మొనర్చు శిల్పులును తెలుపు వర్ణముతో కూడిన శరీరము కలవారును సదా శాంతముగ నుండువారును శత్రువులను భీతిల్ల జేయు ఘంటాధ్వని కలవారును ఘంటానాదశబ్దము చేయువారును అగు మహేశ్వరా! మీకు నమస్కారము

సహస్రాధ్మాతఘణ్టాయ ఘణ్టామాలాప్రియాయ చ।
ప్రాణఘణ్టాయ గన్ధాయ నమః కలకలాయ చ॥ 30

ఎవరి మందిరములందు వ్రేలాడగట్టబడిన ఘంటలను వేలాది జనులు మ్రోగించుదురో అట్టివారును ఘంటలయొక్క మాల ప్రియమైనవారును ఎవరి ప్రాణములున్ను ఘంటవలె శబ్ద మొనర్చునో అట్టివారును గంధరూపులును, కోలాహలరూపులును అగు అట్టి పరమశివునకు నమస్కారము

**హూం హూం హూంకారపారాయ హూంహూంకార**
**ప్రియాయ చ ।**
**నమః శమశమే నిత్యం గిరివృక్షాలయాయ చ ॥ 31**

క్రోధాదులకంటెను ఆకాశాదులకంటెను పరమై యుండు శాంతస్వరూపమగు పరబ్రహ్మమై యున్నవారును 'హూం హూం' అనుట ప్రియమైనవారును శాంతముగ నుండుడు శాంతముగ నుండుడు అని చెప్పి సర్వులకు ఆశ్వాసన మొసంగువారును పర్వతముల మీదను చెట్లక్రిందను నివసించువారును అగు పరమేశ్వరా! మీకు నమస్కారము

**గర్భమాంసస్పృగాలాయ తారకాయ తరాయ చ ।**
**నమో యజ్ఞాయ యజినే హుతాయ ప్రహుతాయ చ ॥ 32**

గర్భమాంసము నందు నక్క ప్రీతి కలిగియుండునట్లు ఫలములందలి గుజ్జు యెడల ప్రీతికలవారును సర్వులను తరింపజేయువారును తరణ తారణ సాధనరూపులును యజ్ఞ యజమాన హూవన అగ్ని స్వరూపులును అగు మహాదేవా! మీకు నమస్కారము!

**యజ్ఞవాహాయ దాన్తాయ తప్యాయాతపనాయ చ ।**
**నమస్తటాయ తట్యాయ తటానాం పతయే నమః ॥ 33**

యజ్ఞ నిర్వాహకులున్ను యజ్ఞమును దేవతల వఱకు పొందింపజేయు అగ్నిదేవ స్వరూపులును మనస్సును ఇంద్రియములను వశమందుంచుకొనువారును, జనుల కష్టములను చూచి సంతృప్తహృదయులగువారును శత్రువులకు సంతాప మొసంగువారును తటరూపులును నదీస్వరూపులును తటపాలకులును అయిన ఓ పరమేశ్వరా! మీకు నమస్కారము

అన్నదాయాన్నపతయే నమ స్త్వన్నభుజే తథా।
నమః సహస్రశీర్షాయ సహస్రచరణాయ చ ॥ 34

అన్నదాత, అన్నపతి అన్నభోక్తయు, వేలకొలది శిరస్సులు వేలకొలది పాదములు కలవారును అగు మహాదేవా! మీకు మరల మరల నమస్కారము

సహస్రోద్యతశూలాయ సహస్రనయనాయ చ।
నమో బాలార్కవర్ణాయ బాలరూపధరాయ చ ॥ 35

వేలకొలది చేతులతో వేలకొలది శూలములను గైకొని యున్న వారును వేలకొలది నేత్రములు కలవారును ప్రాతఃకాల సూర్యునివలె దేదీప్యమానమైన అంగకాంతి కలవారును బాలక రూపమును ధరించువారును అగు శంకరునకు నమస్కారము

బాలానుచరగోప్త్రాయ బాలక్రీడనకాయ చ।
నమోవృద్ధాయ లుబ్ధాయ క్షుబ్ధాయ క్షోభణాయ చ ॥ 36

బాలకుల సంరక్షకులును బాలకులతో ఆటలాడుకొను వారును అందఱి కంటెను పెద్దవారును భక్తి ప్రేమలయందు ప్రీతి కలవారును దుష్టుల సాహచరణముచే క్షుబ్ధులగు వారును దురాచారులకు క్షోభను కలుగజేయువారు నగు ఓ పరమేశ్వరా! మీకు నమస్కారము!

తరఙ్గాఙ్కితకేశాయ ముఞ్జకేశాయ వై నమః।
నమః షట్కర్మతుష్టాయ త్రికర్మనిరతాయ చ ॥ 37

గంగాతరంగములతో కూడినట్టియు ముంజను పోలినట్టియు కేశములు కలవారును అధ్యయన అధ్యాపన యజన యాజన దాన, ప్రతిగ్రహములను షట్కర్మలచే సంతుష్టులగువారు ను, యజన అధ్యయన, దాన తత్పరులును అగు దేవా! మీకు నమస్కారము!

వర్ణాశ్రమాణాం విధివత్ పృథక్కర్మ నివర్తినే ।
నమో ఘుష్యాయ ఘోషాయ నమః కలకలాయ చ ॥ 38

వర్ణాశ్రమముల భిన్న భిన్న కర్మలను విధిప్రకారము విభజించువారును జపనీయ మంత్రరూపులును ఘోష స్వరూపులును, కోలాహలమయులు నగు మహాదేవునకు మరల మరల నమస్కారము

శ్వేతపిఙ్గల నేత్రాయ కృష్ణరక్తేక్షణాయ చ ।
ప్రాణభగ్నాయ దణ్డాయ స్ఫోటనాయ కృశాయ చ ॥ 39

తెలుపు ఎంగళవర్ణము నలుపు, ఎఱుపు రంగులతో కూడిన నేత్రములు కలవారును ప్రాణవాయువును జయించువారును, దండ (ఆయుధ) రూపులును బ్రహ్మాండమను ఘటమును బ్రద్దలు కొట్టువారును కృశించిన శరీరము కలవారు నగు పరమశివునకు నమస్కారము

ధర్మకామార్థ మోక్షాణాం కథనీయ కథాయ చ ।
సాంఖ్యాయ సాంఖ్యముఖ్యాయ సాంఖ్యయోగప్రవర్తినే ॥ 40

ధర్మ అర్థ కామ, మోక్షముల నొసంగు విషయమందు వర్ణింపదగినట్టి కీర్తి, కథ కలవారును సాంఖ్యస్వరూపులును సాంఖ్యయోగులందు ప్రధానులును, సాంఖ్యశాస్త్రమును ప్రవృత్త మొనర్చువారును అగు ఓ పరమశివా! మీకు నమస్కారము!

నమో రథ్యవిరథ్యాయ చతుష్పథరథాయ చ ।
కృష్ణాజినోత్తరీయాయ వ్యాల యజ్ఞోపవీతినే ॥ 41

రథముపై కూర్చొనిగాని రథము లేకుండగాని సంచరించువారును జల, అగ్ని వాయు ఆకాశములందు కూడ చనువారును, నల్లనిమృగచర్మమును కప్పుకొనువారును సర్పమయమగు యజ్ఞోప

పీతమును ధరించువాడును అగు ఓ సదాశివా! మీకు నమస్కారము

ఈశాన వజ్రసంఘాత హరికేశ నమోఽస్తుతే ।
త్ర్యమ్బకామ్బికనాథాయ వ్యక్తావ్యక్త నమోఽస్తుతే ॥ 42

ఈశ్వరా! మీ శరీరము వజ్రము వలె కఠినమైనది హరికేశా! మీకు నమస్కారము వ్యక్తావ్యక్త రూపులగు పరమేశ్వరా! మీరు త్రినేత్రధారి అంబికాపతి అయిన మీకు నమస్కారము

కామ కామద కామఘ్న తృప్తాతృప్త విచారిణే ।
సర్వ సర్వద సర్వఘ్న సంధ్యారాగ నమోఽస్తుతే 43

కోరికలను పరిపూర్ణ మొనర్చువారును కాముని సంహారించిన వారును, తృప్త, అతృప్తములను గూర్చి విచారణ సల్పువారును, సర్వస్వరూపులు సమస్తము నొసంగువారును సర్వ సంహారకులును సంధ్యాకాలమువంటి రంగు కలవారును అగు ఓ పరమశివా! మీకు నమస్కారము!

మహాబల మహాబాహో మహాసత్త్వ మహాద్యుతే ।
మహామేఘచయప్రఖ్య మహాకాల నమోఽస్తుతే ॥ 44

మహాబలా! మహాబాహూ! మహాసత్త్వా! మహాద్యుతీ! మహామేఘముల సమూహమువంటి రంగు కలవారు మహాకాల స్వరూపులు అగు దేవా! మీకు నమస్కారము!

స్థూల జీర్ణాఙ్గ జటిలే వల్కలాజినధారిణే ।
దీప్తసూర్యాగ్ని జటిలే వల్కలాజినవాససే ।
సహస్రసూర్యప్రతిమ తపోనిత్య నమోఽస్తుతే ॥ 45

స్థూల జీర్ణ శరీరము కలవారును జటాధారులును వల్కల ముసు మృగచర్మమును వస్త్రము వలె ధరించువారును, దేదీప్య మాన సూర్యాగ్నులవలె జ్యోతిర్మయమైన జడచే సుశోభితులును వేలకొలది సూర్యులవలె ప్రకాశవంతులును సదా తపస్సునందు సంలగ్నులై యుండువారు నగు ఓ మహేశ్వరా! మీకు నమస్కారము

ఉన్మాదన శతావర్త గఙ్గాతోయార్ద్రమూర్ధజ ।
చన్ద్రావర్త యుగావర్త మేఘావర్త నమోఽస్తుతే ॥ 46

మస్తకముపై గంగానదియొక్క వందలకొలది అలలు, సుడులు కలిగియున్నవారును గంగాజలముచే సదా తడుపబడిన కేశములు కలవారును చంద్రుని క్షయ వృద్ధులందు పడవేయు వారును, యుగములను పునరావృత్తి గావించువారును మేఘముల యొక్క ప్రవర్తకులును అగు ఓ మహాదేవా! మీకు నమస్కారము

త్వమన్నమన్నభోక్తా చ అన్నదోఽన్నభుగేవ చ ।
అన్నస్రష్టా చ పక్తా చ పక్వభుక్పవనోఽనలః ॥ 47

అన్నము అన్నభోక్త అన్నదాత అన్నభుక్కు అన్న స్రష్ట, పాచకుడు పక్వాన్నభోజి, ప్రాణవాయువు జఠరాగ్ని—మీరే అయియున్నారు

జరాయుజాణ్డజాశ్చైవ స్వేదజాశ్చ తథోద్భిజాః ।
త్వమేవ దేవదేవేశ భూతగ్రామశ్చతుర్విధః ॥ 48

దేవదేవేశ్వరా! జరాయుజ అండజ స్వేదజ ఉద్భిజము లను నాలుగు విధములైన ప్రాణి సమూహము మీరే అయి యున్నారు

చరాచరస్య స్రష్టా త్వం ప్రతిహర్తా తథైవ చ ।
త్వామాహుర్బ్రహ్మవిదుషో బ్రహ్మ బ్రహ్మవిదాం వర ॥ 49

బ్రహ్మవిద్వరిష్ఠా! చరాచర జీవులయొక్క సృష్టి సంహార ములను గావించువారు మీరే బ్రహ్మజ్ఞానులు మిమ్ములనే బ్రహ్మము అందురు

మనసః పరమా యోనిః ఖం వాయుర్జ్యోతిషాం నిధిః ।
ఋక్సామాని తథోఙ్కారమాహుస్త్వాం బ్రహ్మవాదినః ॥ 50

వేదవాదులగు విజ్ఞులు మిమ్ములనే మనస్సుయొక్క పరమ కారణముగను ఆకాశముగను వాయువుగను తేజస్సుయొక్క నిధిగను ఋక్కుగను సామముగను ఓంకారముగను చెప్పెదురు

హాయి హాయి హువా హాయి హావు హాయి తథాసకృత్ ।
గాయన్తి త్వాం సురశ్రేష్ఠ సామగా బ్రహ్మవాదినః ॥ 51

సురశ్రేష్ఠా! సామగాన మొనర్చు వేదవేత్తలు హా 3 యి హా 3 యి హు 3 వా హా 3 యి హా 3 వు హా 3 యి ఈ ప్రకా రముగ మరల మరల ఉచ్చరించుచు నిరంతరము మీయొక్క మహిమనే గాన మొనర్చుచున్నారు

యజుర్మయో ఋఙ్మయశ్చ త్వమాహుతిమయస్తథా ।
పఠ్యసే స్తుతిభిశ్చైవ వేదోపనిషదాం గణైః ॥ 52

యజుర్వేదము ఋగ్వేదము మీయొక్క స్వరూపమే అయి యున్నవి హావిష్యము మీరే వేదములు ఉపనిషత్తులు తమ తమ స్తుతుల ద్వారా మీయొక్క మహిమనే ప్రతిపాదించుచున్నవి

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా వర్ణావరాశ్చ యే ।
త్వమేవ మేఘసంఘాశ్చ విద్యుతోఽశనిగర్జితః ॥ 53

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు శూద్రులు అంత్యజులు—మీరొక్క- స్వరూపులే అయి యున్నారు మేఘముల సమూహము మెఱపు గర్జన గడగడ శబ్దము మీరే అయి యున్నారు

**సంవత్సర స్త్వమృతవో మాసో మాసార్ధమేవ చ।**
**యుగం నిమేషాః కాష్ఠా స్త్వం నక్షత్రాణి గ్రహాః కలాః ॥ 54**

సంవత్సరములు ఋతువులు మాసములు పక్షములు యుగములు, నిమేషములు కాష్ఠలు నక్షత్రములు గ్రహములు కళలు మీరే అయియున్నారు

**వృక్షాణాం కకుదోఽసి త్వం గిరీణాం శిఖరాణి చ।**
**వ్యాఘ్రో మృగాణాం పతతాం తార్క్ష్యోఽన న్తశ్చ భోగినామ్॥55**

వృక్షములలో ప్రధానములైన వటాదులు పర్వతములందు వాని శిఖరములు వన జంతువులందు వ్యాఘ్రము పక్షులందు గరుడుడు సర్పములందు అనంతుడు మీరే అయియున్నారు

**క్షీరోదో హ్యుదధీనాం చ యన్త్రాణాం ధనురేవ చ।**
**వజ్రః ప్రహరణానాం చ వ్రతానాం సత్యమేవ చ॥ 56**

సముద్రములందు క్షీరసాగరము యంత్రములందు ధనుస్సు ఆయుధములందు వజ్రము వ్రతములందు సత్యము మీరే అయి యున్నారు

**త్వమేవ ద్వేష ఇచ్ఛా చ రాగో మోహః క్షమాక్షమే।**
**వ్యవసాయో ధృతిర్లోభః కామక్రోధౌ జయాజయౌ॥ 57**

ద్వేషము ఇచ్ఛ అనురాగము మోహము క్షమ అక్షమ, ప్రయత్నము ధైర్యము లోభము కామము క్రోధము జయము, పరాజయము మీరే అయియున్నారు

త్వం గదీ త్వం శరీ చాపీ ఖట్వాఙ్గీ ఝర్ఝరీ తథా।
ఛేత్తా భేత్తా ప్రహర్తా త్వం నేతా మన్తా ఎతా మతః॥ 58

మీరు గద బాణము ధనుస్సు మంచపుకోడు ఝర్ఝర మను అస్త్రము ధరించువారై యున్నారు మీరు ఛేదన భేదన ప్రహారములను సలుపువారై యున్నారు మీరు సత్పథముపై గొనిపోవువారని శుభమును మననము చేయువారని తండ్రి యని విశ్వసింపబడుచున్నారు

దశలక్షణసంయుక్తో ధర్మోఽర్థః కామ ఏవ చ।
గఙ్గా సముద్రాః సరితః పల్వలాని సరాంసి చ॥ 59
లతా వల్ల్యస్తృణౌషధ్యః పశవో మృగపక్షిణః।
ద్రవ్యకర్మసమారమ్భః కాలః పుష్పఫలప్రదః॥ 60

పది లక్షణములతో కూడిన ధర్మము మఱియు అర్థము కామము మీరే అయి యున్నారు గంగ సముద్రము నదులు గుంటలు చెఱువులు లతలు తీగెలు తృణములు ఓషధులు పశువులు మృగములు, పక్షులు ద్రవ్యము, కర్మముల ఆరంభము పుష్పములు పండ్లు ఒసంగు కాలము—అన్నియు మీరే అయి యున్నారు

ఆదిశ్చాన్తశ్చ దేవానాం గాయత్ర్యోంకార ఏవ చ।
హరితో రోహితో నీలః కృష్ణో రక్తస్తథారుణః।
కద్రుశ్చ కపిలశ్చైవ కపోతో మేచకస్తథా॥ 61

మీరు దేవతలయొక్క ఆది అంతము అయి యున్నారు గాయత్రీ మంత్రము ఓంకారము మీరే అయియున్నారు హరిత లోహిత నీల కృష్ణాదులను పది రకములైన రంగులు మీ స్వరూపములే అయియున్నవి

అవర్ణశ్చ సువర్ణశ్చ వర్ణకారో ఘనోపమః ।
సువర్ణనామా చ తథా సువర్ణప్రియ ఏవ చ ॥ 62

మీరు వర్ణరహితు లగుటచే అవర్ణులని మంచి వర్ణము కల వారగుటచే సువర్ణులని చెప్పబడుచున్నారు మీరు వర్ణముల నిర్మాతయు, మేఘమువంటి వారును అయి యున్నారు మీ పేరునందు సుందరవర్ణములు ఉపయోగింపబడినవి కనుక మీరు సువర్ణ నామా అని చెప్పబడిరి శ్రేష్ఠవర్ణములు మీకు ప్రియమైనవి

త్వమిన్ద్రశ్చ యమశ్చైవ వరుణో ధనదోఽనలః ।
ఉపప్లవశ్చిత్రభానుః స్వర్భానుర్భానురేవ చ ॥ 63

ఇంద్రుడు, యముడు వరుణుడు కుబేరుడు అగ్ని సూర్య చంద్ర గ్రహణములు చిత్రభానుడు (సూర్యుడు) రాహువు కేతువు భానుడు మీరే అయి యున్నారు

హోత్రం హోతా చ హోమ్యం చ హుతం చైవ తథా ప్రభుః ।
త్రిసౌపర్ణం తథా బ్రహ్మ యజుషాం శతరుద్రియమ్ ॥ 64

హోత్రము హోత హవనీయ పదార్థము హవనక్రియ (దాని ఫలముసంగు) పరమేశ్వరుడు మీరే అయి యున్నారు వేదముయొక్క త్రిసౌపర్ణ మను పేరుగల శ్రుతులందును యజుర్వేదముయొక్క శత రుద్రీయ ప్రకరణమందును గల వైదిక నామములన్నియు మీయొక్క నామములే అయి యున్నవి

పవిత్రం చ పవిత్రాణాం మఙ్గలానాం చ మఙ్గలమ్ ।
గిరికో హిండుకో వృక్షో జీవః పుద్గల ఏవ చ ॥ 65

ప్రాణః సత్త్వం రజశ్చైవ తమశ్చాప్రమద స్తథా ।
ప్రాణోఽపానః సమానశ్చ ఉదానో వ్యాన ఏవ చ ॥ 66

ఉన్మేషశ్చ నిమేషశ్చ క్షుతం జృమ్భితమేవ చ ।
లోహితాన్తర్గతా దృష్టిర్మహావక్త్రో మహోదరః ॥ 67

మీరు పవిత్రముల కంటెను పవిత్రులును మంగళముల కంటెను మంగళులును అయి యున్నారు మీరు అచేతనమును చేతన మొనర్చువారును గమనాగమనముల నొనర్చువారును సంసారవృక్షము జీవుడు శరీరము ప్రాణము సత్త్వము రజస్సు తమస్సు అప్రమదము (ఊర్ధ్వరేతము) ప్రాణము అపానము సమానము ఉదానము వ్యానము ఉన్మేషము నిమేషము (కండ్లు తెరచుట మూయుట) తుమ్ముట ఆవలించుట మొదలగు చేష్టలన్నియు అయి యున్నారు అగ్నిమయ మైనట్టియు ఎఱుపు రంగు గల్గినట్టియు దృష్టి మీ లోపల దాగియున్నది మీ ముఖము ఉదరము చాల గొప్పవి

సూచీరోమా హరిశ్మశ్రురూర్ధ్వకేశశ్చలాచలః ।
గీతవాదిత్ర తత్త్వజ్ఞో గీతవాదనకప్రియః ॥ 68

మీ రోమములు సూక్ష్మములుగ నున్నవి గడ్డము మీసములు నల్లగ నున్నవి తల వెంట్రుకలు పైకి లేచుకొని యున్నవి మీరు చరాచర స్వరూపులు పాడుట వాయిద్యములు ప్రయోగించుట, బాగుగ ఎఱింగినవారు అవి మీకు చాల ప్రియమైనవి

మత్స్యో జలచరో జాల్యోఽకలః కేలికలః కలిః ।
అకాలశ్చాతికాలశ్చ దుష్కాలః కాల ఏవ చ ॥ 69

మత్స్య, జలచర జాలధారులు మీరే అయి యున్నారు మీరు బంధనమునకు పరమై యున్నారు మీరు కేళి (శృంగార) కళాయుక్తులు యుగస్వరూపులు అయి యున్నారు మీరు అకాల అతికాల దుష్కాల కాలరూపులై యున్నారు

మృత్యుః శూరశ్చ కృత్యశ్చ పక్షోఽపక్షక్షయం కరః ।
మేఘకాలో మహాద్రంష్ట్రః సంవర్తకబలాహకః ॥ 70

మృత్యువు ఛేదించు శస్త్రము ఛేద్యము, మిత్రులు, శత్రు పక్షమును నశింపజేయువారు మీరే అయి యున్నారు మీరు మేఘమువంటి వర్ణము కలవారును గొప్ప దంతములు కలవారును, ప్రళయ కాలీన మేఘ స్వరూపులును అయి యున్నారు

ఘణ్టోఽఘణ్టో ఘటీ ఘణ్టీ చరుచేలీ మిలీ మిలీ ।
బ్రహ్మకాయికమగ్నీనాం దణ్డీముణ్డ స్త్రిదణ్డధృక్ ॥ 71

ప్రకాశవంతులు అవ్యక్తమగు ప్రకాశము కలవారు కర్మ ఫలముతో కూడునట్లు చేయువారు ఘంటాశబ్దము కలవారు జీవులతో కూడ క్రీడల నొనర్చువారు కారణరూపమున సమస్తమందు వ్యాపించియున్నవారు మీరే అయి యున్నారు మీరే బ్రహ్మము అగ్నుల స్వరూపము దండి త్రిదండధారియు అయి యున్నారు

చతుర్యుగశ్చతుర్వేదశ్చాతుర్హోత్ర ప్రవర్తకః ।
చాతురాశ్రమ్యనేతా చ చాతర్వర్ణ్యకరశ్చ యః ॥ 72

నాలుగు యుగములు నాలుగు వేదములు మీ స్వరూపములే అయి యున్నవి నాలుగు విధములైన హోత్రకర్మల ప్రవర్తకులు మీరే అయి యున్నారు మీరు నాలుగు ఆశ్రమముల అధినేతయు, నాలుగు వర్ణములయొక్క సృష్టికర్తయు అయి యున్నారు

సదా చాక్షప్రియో ధూర్తో గణాధ్యక్షో గణాధిపః ।
రక్తమాల్యామ్బరధరో గిరిశో గిరికప్రియః ॥ 73

మీరు అక్షప్రియ ధూర్త గణాధ్యక్ష, గణాధిపాది నామములతో కూడియున్నారు మీరు ఎఱుపు వస్త్రము, ఎఱుపు

పుష్పముల మాల ధరించియున్నారు మీరు పర్వతముపై శయనించుచు ఎఱుపు వస్త్రమునందు ప్రీతి గలిగియున్నారు

శిల్పికః శిల్పినాం శ్రేష్ఠః సర్వశిల్పప్రవర్తకః ।
భగనేత్రాఙ్కుశశ్చణ్డః పూష్ణో దన్త వినాశనః ॥ 74

శిల్పులందు సర్వశ్రేష్ఠుడైన శిల్పి మీరే సర్వవిధ శిల్పకళా ప్రవర్తకులు మీరే మీరు భగదేవతయొక్క కండ్లు తొలగించుటయందు అంకుశమువంటి వారు చండస్వరూపులు పూషుని దంతములు నశింపజేసినవారు అయి యున్నారు

స్వాహా స్వధా వషట్కారో నమస్కారో నమో నమః ।
గూఢవ్రతో గుహ్యతపాస్తారకస్తారకామయః ॥ 75

స్వాహా స్వధా వషట్ నమస్కారము నమో నమః మున్నగు పదములు మీయొక్క పేర్లే అయి యున్నవి మీరు గూఢవ్రతధారులు గుప్త తపస్సు నాచరించువారు తారక మంత్రము నక్షత్రపూర్ణమగు ఆకాశమును అయి యున్నారు

ధాతా విధాతా సంధాతా విధాతా ధారణోఽధరః ।
బ్రహ్మ తపశ్చ సత్యం చ బ్రహ్మచర్యమథార్జవమ్ ॥ 76

భూతాత్మా భూతకృద్భూతో భూతభవ్య భవోద్భవః ।
భూర్భువః స్వరితశ్చైవ ధ్రువో దాన్తో మహేశ్వరః ॥ 77

ధాత విధాత సంధాత ధారణుడు అధరుడు (ఆధార రహితుడు) మీయొక్క పేర్లే అయియున్నవి బ్రహ్మదేవుడు తపస్సు సత్యము, బ్రహ్మచర్యము ఆర్జవము (ఋజుత్వము) భూతాత్మ, భూతములను సృష్టించువారు నిత్యసిద్ధులు భూత భవిష్య ద్వర్తమానముల ఉత్పత్తికి కారణభూతులు భూలోక భువర్లోక స్వర్లో

కములు, స్థిరరూపులు శాంతుడు మహేశ్వరుడు మీరే అయి యున్నారు

దీక్షితోఽదీక్షితః కాన్తో దుర్దాన్తోఽదాన్తనాశనః ।
చన్ద్రావర్తో యుగావర్తః సంవర్తః సమ్ప్రవర్తకః ॥ 78

దీక్షితులు అదీక్షితులు శుభావంతులు దుర్దాంతులు ఉద్దండప్రాణులను నశింపజేయువారు, మాసము కల్పము, ప్రళయము మరల సృష్టి వీనిని సంచాలన మొనర్చువారు మీరే అయి యున్నారు

కామో బిన్దురణుః స్థూలః కర్ణికారస్రజప్రియః ।
నన్దీముఖో భీమముఖః సుముఖో దుర్ముఖోఽముఖః ॥ 79

చతుర్ముఖో బహుముఖో రణేష్వగ్నిముఖ స్తథా ।
హిరణ్యగర్భః శకునిర్మహోరగపతిర్విరాట్ ॥ 80

కామ బిందు సూక్ష్మ స్థూలరూపులు మీరే అయియున్నారు మీరు కర్ణికార పుష్పమాలయందు ప్రీతి కలిగియున్నారు నందీముఖుడు భీమముఖుడు సుముఖుడు దుర్ముఖుడు అముఖుడు, చతుర్ముఖుడు బహుముఖుడు యుద్ధమందు శత్రువులను సంహరించుటవలన అగ్నిముఖుడు హిరణ్యగర్భుడు శకుని (పక్షివలె అసంగుడు) మహాసర్పముల అధిపతి విరాడ్రూపుడు మీరే అయి యున్నారు

అధర్మహా మహాపార్శ్వశ్చణ్డధారో గణాధిపః ।
గోనర్దో గోప్రతారశ్చ గోవృషేశ్వరవాహనః ॥ 81

త్రైలోక్యగోప్తా గోవిన్దో గోమార్గోఽమార్గ ఏవచ ।
శ్రేషః స్థిరశ్చ స్థాణుశ్చ నిష్కమ్పః కమ్ప ఏవ చ ॥ 82

దుర్వారణో దుర్విషహో దుఃసహో దురతిక్రమః ।
దుర్ధర్షో దుష్ప్రకమ్పశ్చ దుర్విషో దుర్జయో జయః ॥ 83

శశః శశాఙ్కః శమనః శీతోష్ణక్షు జ్జరాధికృత్ ।
ఆధయో వ్యాధయశ్చైవ వ్యాధిహా వ్యాధిరేవ చ ॥ 84

అధర్మనాశకుడు మహాపార్శ్వుడు చండధారుడు గణాధిపుడు జీవులను ఆపత్తునుండి కాపాడువారు నందిపై స్వారి చేయువారు త్రైలోక్యరక్షకుడు గోవిందుడు ఇంద్రియ సంచాలకుడు ఇంద్రియములకు అగోచరుడు శ్రేష్ఠుడు స్థిరుడు స్థాణురూపుడు నిష్కంపుడు కంపుడు దుర్వారణుడు (ఎదుర్కొన జాలనివాడు) గొప్ప వేగము కలవారు దుస్సహుడు దుర్లంఘ్యుడు దుర్ధర్షుడు దుర్జయుడు జయుడు శీఘ్రగామి చంద్రుడు యమరాజు మీరే అయియున్నారు శీతోష్ణములు ఆకలి వార్ధక్యము మానసిక చింతలను మీరు దూరమొనర్చువారు ఆధివ్యాధులు / వానిని దూరీకరించువారు మీరే అయియున్నారు

మమ యజ్ఞమృగవ్యాధో వ్యాధీనామాగమో గమః ।
శిఖణ్డీ పుణ్డరీకాక్షః పుణ్డరీక వనాలయః ॥ 85

దణ్డధార స్త్ర్యమ్బకశ్చ ఉగ్రదణ్డోఽణ్డనాశనః ।
విషాగ్నిపాః సురశ్రేష్ఠః సోమపా స్త్వం మరుత్పతిః ॥ 86

నా యజ్ఞమను మృగమునకు వ్యాధుడు మీరే మఱియు వ్యాధుల గమనాగమనములకు మీరే ఆధారభూతులు మీరు మస్తకముపై నెమలి ఈకను ధరించియున్నారు మీరు కమల నేత్రులు కమలవనమున నివసించువారు దండధరులు త్రినేత్రులు ఉగ్రదండులు బ్రహ్మాండ సంహారకులు అయియున్నారు మీరు

విషాగ్నులను పానము చేయువారు మరుద్గణములకు ప్రభువు అయి యున్నారు

అమృతపాస్త్వం జగన్నాథ దేవదేవ గణేశ్వరః ।
విషాగ్నిపా మృత్యుపాశ్చ క్షీరపాః సోమపా స్తథా ।
మధుశ్చ్యుతానామగ్రపా స్త్వమేవ తుషితాద్యపాః ॥ 87

దేవాధిదేవా ! జగన్నాథా ! మీరు అమృతమును పానము చేయువారు గణనాథులు విషాగ్నినుండి మృత్యువునుండి రక్షించు వారు పాలు సోమరసము త్రాగువారు సుఖము నుండి భ్రష్టులైన జీవులయొక్క ప్రధానరక్షకులు తుషితులను దేవతలకును ఆది భూతుడైన బ్రహ్మదేవుని కూడ పాలించువారు అయియున్నారు

హిరణ్యరేతాః పురుష స్త్వమేవ
త్వం స్త్రీ పుమాం స్త్వం చ నపుంసకం చ ।
బాలో యువా స్థవిరో జీర్ణదంష్ట్ర
స్త్వం నాగేన్ద్ర శక్ర స్త్వం విశ్వకృద్విశ్వకర్తా ॥ 88
విశ్వకృద్ విశ్వకృతాం వరేణ్య స్త్వం విశ్వవహో
విశ్వరూప స్తేజస్వీ విశ్వతోముఖః ।
చన్ద్రాదిత్యౌ చక్షుషీ తే హృదయం చ పితామహః ॥ 89

మీరు అగ్ని అంతర్యామి స్త్రీ పురుషుడు నపుంసకుడు బాలుడు యువకుడు వృద్ధుడు అయి యున్నారు నాగేశ్వరా! మీరు జీర్ణదంతులు ఇంద్రుడు విశ్వకర్త, విశ్వముయొక్క రచన యొనర్చు ప్రజాపతులలో శ్రేష్ఠులు విశ్వముయొక్క భారమును వహించువారు విశ్వరూపులు తేజస్వి అన్నివైపుల ముఖములు కలవారును అయియున్నారు చంద్రుడు సూర్యుడు మీయొక్క నేత్రములు పితామహుడగు బ్రహ్మదేవుడు మీయొక్క హృదయము

మహోదధిః సరస్వతీ వాగ్ బలమనలో౽
నిలః అహోరాత్రం నిమేషోన్మేషకర్మ ॥ 90

మీరే సముద్రము సరస్వతి మీయొక్క వాక్కు అగ్ని వాయువు మీయొక్క బలము మీరు నేత్రములను తెరచుట మూయుటయే, దిన రాత్రులు

న బ్రహ్మా న చ గోవిన్దః పౌరాణా ఋషయో న తే ।
మాహాత్మ్యం వేదితుం శక్తా యాథాతథ్యేన తే శివ ॥ 91

పరమశివా! మీయొక్క మాహాత్మ్యమును సరిగా తెలిసికొనుటకు బ్రహ్మదేవుడు విష్ణువు ప్రాచీన ఋషులు కూడ సమర్థులు కారు

యా మూర్తయః సుసూక్ష్మాస్తే న మహ్యం యాన్తి దర్శనమ్।
త్రాహి మాం సతతం రక్ష పితా పుత్రమివౌరసమ్ ॥ 92

మీ సూక్ష్మరూపము మాకు కనుపించదు దేవా! తండ్రి తన కుమారుని రక్షించునట్లు మీరు నన్ను సదా రక్షింపుడు!

రక్ష మాం రక్షణీయో౽హం తవానఘ నమో౽స్తు తే ।
భక్తానుకమ్పీ భగవాన్ భక్తశ్చాహం సదా త్వయి ॥ 93

పాపరహితా! నేను మీ ద్వారా రక్షింపబడుటకు యోగ్యుడను మీరు తప్పక నన్ను రక్షించుడు మీకు నమస్కరించుచున్నాను మీరు భక్తులపై దయచూపు భగవంతుడు నేను సదా మీ భక్తుడను

యః సహస్రాణ్యనేకాని పుంసామావృత్య దుర్దృశః ।
తిష్ఠత్యేకః సముద్రాన్తే స మే గోప్తాస్తు నిత్యశః ॥ 94

వేలకొలది మనుష్యులపై మాయా యవనిక పడియుండుటచే బహుజనులకు దుర్నిరీక్ష్యులై యున్నవారును అద్వితీయులును సము

ద్రవమును బోలిన కోరికలు అత్యల్పమైన పిదపనే ప్రకాశమునకు వచ్చువారును అగు ఓ పరమేశ్వరా! నన్ను రక్షింపుడు

**యం వినిద్రా జితశ్వాసాః సత్త్వస్థాః సంయతేన్ద్రియాః ।**
**జ్యోతిఃపశ్యన్తి యుఞ్జానా స్తస్మై యోగాత్మనే నమః ॥ 95**

నిద్రకు వశీభూతులు కాక ప్రాణములపై విజయమును పొందినవారును ఇంద్రియములను జయించి సత్త్వగుణమందు స్థితి గల్గియున్నవారును అగు యోగులు ధ్యానమందు ఏ జ్యోతిర్మయ తత్త్వమును సాక్షాత్కరించుకొనుచున్నారో అట్టి యోగాత్మయగు పరమేశ్వరునకు నమస్కారము

**జటిలే దణ్డినే నిత్యం లమ్బోదర శరీరిణే ।**
**కమణ్డలునిషఙ్గాయ తస్మై బ్రహ్మాత్మనే నమః ॥ 96**

సదా జటను దండమును ధరించియుండువారును విశాలమైన ఉదరము శరీరము కలవారును ఎవరి కమండలువు అమ్ముల పొదియొక్క పనిని నిర్వహించునో అట్టి వారును బ్రహ్మదేవుని రూపమున విరాజిల్లువారును అగు శివునకు ప్రణామము

**యస్య కేశేషు జీమూతా నద్యః సర్వాఙ్గసంధిషు ।**
**కుక్షౌ సముద్రాశ్చత్వార స్తస్మై తోయాత్మనే నమః ॥ 97**

ఎవరి కేశములందు మేఘములు శరీరముయొక్క సంధులందు నదులు ఉదరమందు నాలుగు సముద్రములు కలవో అట్టి జలస్వరూపుడగు పరమాత్మకు నమస్కారము

**సమ్భక్ష్య సర్వభూతాని యుగాన్తే పర్యుపస్థితే ।**
**యః శేతే జలమధ్యస్థస్తం ప్రపద్యేఽమ్బుశాయినమ్ ॥ 98**

ప్రళయకాల మే తెంచ సకుస్త ప్రాణులను సంహారించి ఏకా ర్ణవ జలమందు శయనించువారును జలశాయియు నగు భగవంతుని నేను శరణు బొందుచున్నాను

**ప్రవిశ్య వదనం రాహోర్యః సోమం పిబతే నిశి ।**
**గ్రసత్యర్కం చ స్వర్భానుర్భూత్వా మాం సోఽభిరక్షతు ॥ 99**

రాత్రియందు రాహువు యొక్క ముఖమందు ప్రవేశించి స్వయముగ చంద్రుని అమృతమును పానము చేయువారును స్వయ ముగ నే రాహువు అయి సూర్యునిపై గ్రహణము కావించువారును అగు పరమాత్మ నన్ను రక్షించుగాక!

**యే దానుపతితా గర్భా యథా భాగానుపాసతే ।**
**నమస్తేభ్యః స్వధా స్వాహా ప్రాప్నువన్తు ముదస్తు తే ॥ 100**

బ్రహ్మదేవుని తరువాత జనించు దేవతలు ఎతరులు బాలుర వలె యజ్ఞములందు తమ తమ భాగములను గ్రహించుచున్నారు, వారికి నమస్కారము వారు స్వాహా స్వధా ద్వారా తమ భాగ ములను పొంది ప్రసన్నులగుదురు గాక!

**యేఽఙ్గుష్ఠమాత్రాః పురుషా దేహస్థాః సర్వదేహినామ్ ।**
**రక్షన్తు తేహి మాం నిత్యం నిత్యం చాప్యాయయన్తు మామ్॥ 101**

ఎవరు అంగుష్ఠమాత్ర జీవరూపమున సమస్త దేహధారుల దు వెలయుచుందురో అట్టి దేవదేవుకు నన్ను సదా రక్షించుగాక! నాకు సదా వృద్ధిని కలగజేయు గాక!

**యే నరోదన్తి దేహస్థా దేహినో రోదయన్తి చ ।**
**హర్షయన్తి న హృష్యన్తి నమస్తేభ్యోఽస్తు నిత్యశః ॥ 102**

దేహములందు నివసించుచు తాము సద్వ్యక్త దేహధారులను ఎవరు (వారి వారి కర్మనుబట్టి) పీడించుచుందురో తాము స్వాయముగ హర్షింపక దేహధారులను హర్షింప జేయుచుందురో అట్టి రుద్రులందఱికిని నేను ప్రతినిత్యము నమస్కరించుచున్నాను

యే నదీషు సముద్రేషు పర్వతేషు గుహాసు చ ।
వృక్షమూలేషు గోష్ఠేషు కాన్తారే గహనేషు చ ॥ 103

చతుష్పథేషు రథ్యాసు చత్వరేషు తటేషు చ ।
హస్త్యశ్వరథశాలాసు జీర్ణోద్యానాలయేషు చ ॥ 104

యేషు పఞ్చసు భూతేషు దిశాసు విదిశాసు చ ।
చన్ద్రార్కయోర్మధ్యగతా యే చ చన్ద్రార్కరశ్మిషు ॥ 105

రసాతలగతా యే చ యే చ తస్మై పరం గతాః ।
నమస్తేభ్యో నమస్తేభ్యో నమస్తేభ్యోఽస్తు నిత్యశః ॥ 106

నది సముద్రము పర్వతము గుహ వృక్షముల మూలము, గోశాల దుర్గమ మార్గము వనము మార్గముల కూడలి దారి తిన్నె ఒడ్డు ఏనుగులశాల గుఱ్ఱముల శాల రథశాల పాతతోట శిథిలమైన ఇల్లు పంచభూతములు దిక్కులు రెండు దిక్కుల మధ్య భాగములు చంద్రుడు సూర్యుడు వాని వాని కిరణములు రసాతలము ఇతర స్థానములు మొదలగు వానియందు అధిష్ఠాన దేవతా రూపమున ఏ పరమాత్మ వ్యాపించియున్నారో వారికి మరల మరల నమస్కారము

యేషాం న విద్యతే సంఖ్యా ప్రమాణం రూపమేవ చ ।
అసంఖ్యేయగుణా రుద్రా నమస్తేభ్యోఽస్తు నిత్యశః ॥ 107

ఎవరి యొక్క సంఖ్యా ప్రమాణ రూపములకు హద్దు లేదో, ఎవరి గుణములు లెక్కింపబడజాలవో అట్టి రుద్రునకు నేను సదా నమస్కరించుచున్నాను

సర్వభూతకరో యస్మాత్ సర్వభూతపతిర్హరః ।
సర్వభూతాన్తరాత్మా చ తేన త్వం న నిమన్త్రితః ॥ 108

దేవా! మీరు సమస్త భూతములకు జన్మదాత సమస్తము యొక్క పాలకులు సంహారకులు అయియున్నారు మీరే సమస్త ప్రాణులయొక్క అంతరాత్మ కనుక మిమ్ములను నేను వేఱుగ ఆహ్వానింపలేదు

త్వమేవ హీజ్యసే యస్మాద్ యజ్ఞైర్వివిధ దక్షిణైః ।
త్వమేవ కర్తా సర్వస్య తేన త్వం న నిమన్త్రితః ॥ 109

అనేక విధములైన దక్షిణలతో గూడిన యజ్ఞముల ద్వారా మీరే యజింపబడుచున్నారు మీరే సమస్తమునకు కర్త కనుకనే నేను మిమ్ములను వేఱుగ ఆహ్వానింపలేదు

అథవా మాయయా దేవ సూక్ష్మయా తవ మోహితః ।
ఏతస్మాత్ కారణాద్ వాపి తేన త్వం న నిమన్త్రితః ॥ 110

లేక దేవా! మీయొక్క సూక్ష్మమాయచే నేను మోహమందు బడితిని ఈ కారణము చేతను నేను మిమ్ములను ఆహ్వానింపలేదు

ప్రసీద మమ భద్రం తే భవ భావగతస్య మే ।
త్వయి మే హృదయం దేవ త్వయి బుద్ధిర్మనస్త్వయి ॥ 111

దేవా! మీకు జయమగు గాక! నేను భక్తి భావముతో మిమ్ములను శరణుజొచ్చుచున్నాను కావున మీరు నాయెడల ప్రసన్నులు కండు నా హృదయము బుద్ధి మనస్సు సమస్తము మీకే అర్పించుచున్నాను

# నారాయణ స్తుతి

## (నారదుడు)

## (శాంతిపర్వము 338 వ అధ్యాయము)

(1) నమస్తే దేవదేవేశ (2) నిష్క్రియ (3) నిర్గుణ (4) లోక సాక్షిన్ (5) క్షేత్రజ్ఞ (6) పురుషోత్తమ (7) అనన్త (8) పురుష (9) మహాపురుష (10) మహాపురుషోత్తమ (11) త్రిగుణ (12) ప్రధాన (13) అమృత (14) అమృతాఖ్య (15) అనన్తాఖ్య (16) వ్యోమ (17) సనాతన (18) సదసద్వ్యక్తావ్యక్త (19) ఋతధామన్ (20) ఆదిదేవ (21) వసుప్రద (22) ప్రజాపతే (23) సుప్రజాపతే (24) వనస్పతే (25) మహాప్రజాపతే (26) ఊర్జస్పతే (27) వాచస్పతే (28) జగత్పతే (29) మనస్పతే (30) దివస్పతే (31) మరుత్పతే (32) సలిలపతే (33) పృథివీపతే (34) దిక్పతే (35) పూర్వనివాస (36) గుహ్య (37) బ్రహ్మపురోహిత (38) బ్రహ్మకాయిక (39) మహారాజిక (40) చాతుర్మహారాజిక (41) భాసుర (42) మహాభాసుర (43) సప్తమహాభాగ (44) యామ్య (45) మహాయామ్య (46) సంజ్ఞా సంజ్ఞ (47) తుషిత (48) మహాతుషిత (49) ప్రమర్దన (50) పరి నిర్మిత (51) అపరినిర్మిత (52) వశవర్తిన్ (53) అపరినిన్దిత (54) అపరిమిత (55) వశవర్తిన్ (56) అవశవర్తిన్ (57) యజ్ఞ (58) మహాయజ్ఞ (59) యజ్ఞసమ్భవ (60) యజ్ఞయోనే (61) యజ్ఞగర్భ (62) యజ్ఞహృదయ (63) యజ్ఞస్తుత (64) యజ్ఞభాగహర (65) పఞ్చయజ్ఞ (66) పఞ్చకాలకర్తృపతే (67) పాఞ్చరాత్రిక (68) వైకుణ్ఠ (69) అపరాజిత (70) మానసిక (71) నామనామిక (72) పరస్వామిన్ (73) సుస్నాత (74) హంస (75) పరమహంస (76)

మహాహంస (77) పరమయాజ్ఞిక (78) సాంఖ్యయోగ (79) సాంఖ్య మూర్తే (80) అమృతేశయ (81) హిరణ్యేశయ (82) దేవేశయ (83) కుశేశయ (84) బ్రహ్మేశయ (85) పద్మేశయ (86) విశ్వే శ్వర (87) విష్వక్సేన (88) త్వం జగదన్వయ (89) త్వం జగత్ప్ర కృతిః (90) తవాగ్నిరాస్యమ్ (91) వడవాముఖోఽగ్నిః (92) త్వమా హుతిః (93) సారథిః (94) త్వం వషట్కారః (95) త్వమోఙ్కారః (96) త్వం తపః (97) త్వం మనః (98) త్వం చన్ద్రమాః (99) త్వం చక్షురాదిత్యం (100) త్వం సూర్యః (101) త్వం దిశాం గజః (102) త్వం దిగ్భానో (103) విదిగ్భానో (104) హయశిరః (105) ప్రథమ త్రిసౌపర్ణః (106) వర్ణధరః (107) పఞ్చాగ్నే (108) త్రిణాచికేత (109) షడఙ్గనిధాన (110) ప్రాగ్జ్యోతిష (111) జ్యేష్ఠసామగ (112) సామికవ్రతధర (113) అథర్వశిరాః (114) పఞ్చమహాకల్ప (115) ఫేనపాచార్య (116) వాలఖిల్య (117) వైఖానస (118) అభగ్న యోగ (119) అభగ్నపరిసంఖ్యాన (120) యుగాదే (121) యుగ మధ్య (122) యుగనిధన (123) ఆఖణ్డల (124) ప్రాచీనగర్భ (125) కౌశిక (126) పురుష్టుత (127) పురుహూత (128) విశ్వకృత్ (129) విశ్వరూప (130) అనన్తగతే (131) అనన్తభోగ (132) అనన్త (133) అనాదే (134) అమధ్య (135) అవ్యక్తమధ్య (136) అవ్యక్త నిధన (137) వ్రతావాస (138) సముద్రాదివాస (139) యశోవాస (140) తపోవాస (141) దమావాస (142) లక్ష్మ్యావాస (143) విద్యావాస (144) కీర్త్యావాస (145) శ్రీవాస (146) సర్వా వాస (147) వాసుదేవ (148) సర్వచ్ఛన్దక (149) హరిహయ (150) హరిమేధ (151) మహాయజ్ఞభాగహర (152) వరప్రద (153) సుఖ ప్రద (154) ధనప్రద (155) హరిమేధ (156) యమ (157) నియమ (158) మహానియమ (159) కృచ్ఛ్ర (160) అతికృచ్ఛ్ర (161) మహాకృచ్ఛ్ర (162) సర్వకృచ్ఛ్ర (163) నియమధర

(164) నివృత్తధర్మ (165) ప్రవచనగత (166) పృశ్నిగర్భప్రవృత్తి (167) ప్రవృత్తవేదక్రియ (168) అజ (169) సర్వగతే (170) సర్వదర్శిన్ (171) అగ్రాహ్య (172) అచల (173) మహావిభూతే (174) మాహాత్మ్యశరీర (175) పవిత్ర (176) మహాపవిత్ర (177) హిరణ్మయ (178) బృహత్ (179) అప్రతర్క్య (180) అవిజ్ఞేయ (181) బ్రహ్మాగ్ర్య (182) ప్రజాసర్గకర (183) ప్రజానిధనకర (184) మహామాయాధర (185) చిత్రశిఖణ్డిన్ (186) వరప్రద (187) పురోడాశభాగహర (188) గతాధ్వర (189) ఛిన్నతృష్ణ (190) ఛిన్నసంశయ (191) సర్వతోవృత్త (192) నివృత్తిరూప (193) బ్రాహ్మణరూప (194) బ్రాహ్మణప్రియ (195) విశ్వమూర్తే (196) మహామూర్తే (197) బాన్ధవ (198) భక్తవత్సల (199) బ్రహ్మణ్యదేవ భక్తోఽహం త్వాం దిదృక్షురేకాన్త దర్శనాయ (200) నమో నమః ॥

బ్రహ్మణ్యదేవ మున్నగు నామములచే పిలువబడు ఓ పరమేశ్వరా! నేను మీ భక్తుడను మీ దర్శనాభిలాషచే యిచట ఉన్నాను ఏకాంతమున దర్శనమొసంగు పరమాత్మయగు మీకు మరల మరల నమస్కారము!

# నారాయణ స్తోత్రము

## (గరుత్మంతుడు)

## (అనుశాసన పర్వము 13 వ అధ్యాయము)

నారాయణాయ శుద్ధాయ శాశ్వతాయ ధ్రువాయ చ ॥
భూతభవ్యభవేశాయ శివాయ శివమూర్తయే ।
శివయోనేః శివాద్యాయ శివపూజ్యతమాయ చ ॥ 1

శుద్ధుడు సనాతనుడు ధ్రువుడు (నిశ్చలుడు) భూత వర్తమాన భవిష్యత్తుల ప్రభువు శివస్వరూపుడు మంగళమూర్తి శుభముయొక్క ఉత్పత్తి స్థానము శివునకును ఆదికారణుడు శివునకున్ను పరమ పూజనీయుడు అగు నారాయణ దేవునకు నమస్కరించుచున్నాను

ఘోరరూపాయ మహతే యుగాన్తకరణాయ చ ।
విశ్వాయ విశ్వదేవాయ విశ్వేశాయ మహాత్మనే ॥ 2

కల్పమును అంతమొనర్చుటకై అత్యంత ఘోర రూపమును దాల్చువారును విశ్వరూపులును, విశ్వదేవులును విశ్వేశ్వరులును, మహాత్మయు నగు శ్రీహరికి నమస్కరించుచున్నాను

సహస్రోదరపాదాయ సహస్ర నయనాయ చ ।
సహస్రబాహవే చైవ సహస్రవదనాయ చ ॥ 3

వేలకొలది ఉదరములు పాదములు నేత్రములు కలవారును వేలగొలది భుజములతోను ముఖములతోను శోభించువారును అగు విష్ణువునకు నమస్కారము

శుచిశ్రవాయ మహాతే ఋతుసంవత్సరాయ చ ।
ఋగ్యజుః సామవక్త్రాయ అథర్వశిరసే నమః ॥ 4

పవిత్రమగు కీర్తి కలవారును మహత్తర స్వరూపులును ఋతు సంవత్సర రూపులును ఋక్ యజుస్సామ వేదములు ముఖములుగ కలవారును అథర్వ వేదము శిరస్సుగ కలవారును అగు నారాయణ దేవునకు నమస్కారము

హృషీకేశాయ కృష్ణాయ ద్రుహిణోరుక్రమాయ చ ।
బ్రహ్మేన్ద్రికాయ తార్క్ష్యాయ వరాహాయైక శృఙ్గిణే ॥ 5

హృషీకేశుడు (ఇంద్రియముల నియంత, కృష్ణుడు (సచ్చిదానంద స్వరూపుడు) ద్రుహిణుడు (బ్రహ్మదేవుడు త్రివిక్రముడు బ్రహ్మదేవ ఇంద్ర గరుడ స్వరూపుడు ఒక కొమ్ము గల వరాహ రూపమును ధరించినవారు నగు విష్ణువునకు నమస్కారము

శిపివిష్టాయ సత్యాయ హరయేఽథ శిఖణ్డినే ।
హుతాయోర్ధ్వాయ వక్త్రాయ రౌద్రానీకాయ సాధవే ॥ 6
సిన్ధవే సిన్ధువర్షఘ్నే దేవానాం సిన్ధవే నమః ।

తేజస్సుతో వ్యాపించిన వారును సత్యుడు హరి శిఖండి (నెమలి ఈకను ధరించిన శ్రీకృష్ణుడు) మున్నగు పేర్లు కలవారును అగ్నిరూపులును ఊర్ధ్వముఖులును రౌద్రసేనాయుతులును సాధువును సింధువును సముద్రమున వర్షమును లీన మొనర్చువారును గంగా స్వరూపులును అగు విష్ణువునకు నమస్కారము

గరుత్మతే త్రినేత్రాయ సుధామాయ వృషావృషే ॥
సమ్రాడుగ్రే సంకృతయే విరజే సమ్భవే భవే । 7

గరుడ రూపధారియు త్రినేత్రుడును (రుద్ర రూపుడును) ఉత్తమ నివాసము కలవారును వృషావృషుడును ధర్మపాలకులును

సర్వులకు చక్రవర్తియు ఉగ్రరూపధారియు ఉత్తమ కృతి (సేర్పరితనము) కలవారును, రజోగుణ రహితులును సమస్తము యొక్క ఉత్పత్తికి కారణరూపులును భవరూపులును అగు విష్ణువునకు నమస్కారము

వృషాయ వృషరూపాయ విభవే భూర్భువాయ చ ॥
దీప్తసృష్టాయ యజ్ఞాయ స్థిరాయ స్థవిరాయ చ । 8

అభీష్ట వస్తువులను వర్షించువారును ధర్మస్వరూపులును వ్యాపకులును భూలోక భువర్లోక మయులును తేజస్సులచే సంపాదితమైన యజ్ఞము స్వరూపముగ కలవారును స్థిరరూపులును పెద్ద వారును అగు విష్ణువునకు నమస్కారము

అచ్యుతాయ తుషారాయ వీరాయ చ సమాయ చ ॥
జిష్ణవే పురుహూతాయ వశిష్ఠాయ వరాయ చ । 9

తమ మహిమనుండి ఎన్నడును జారనివారును శీతలాంతఃకరణులును వీరత్వము కలవారును సర్వత్ర సమభావముతో నున్న వారును విజయశీలురును అనేకులచే పిలవబడువారును ఇంద్ర రూపులును సర్వశ్రేష్ఠులగు వశిష్ఠులునగు విష్ణుభగవానునకు నమస్కారము

సత్యేశాయ సురేశాయ హరయేఽథ శిఖణ్డినే ॥
వర్హిషాయ వరేణ్యాయ వసవే విశ్వవేధసే । 10

సత్యమునకు దేవతలకు ప్రభువును హరియు నెమలి ఈక మకుటమున కలవారును (శ్రీకృష్ణుడు) దర్భలపై కూర్చుండు సర్వశ్రేష్ఠ వసురూపులును విశ్వ ద్రష్టయునగు విష్ణువునకు నమస్కారము

కిరీటినే సుకేశాయ వాసుదేవాయ శుష్మిణే ॥
బృహదుక్థసుషేణాయ యుగ్యే దున్దుభయే తథా ॥ 11

కిరీట ధారులు సుందర కేశములతో శోభించు వారును, పరాక్రమ వంతులును వసుదేవ నందన శ్రీకృష్ణ స్వరూపులును బృహదుక్థమను సామము స్వరూపముగ కలవారును సుందర సేనా సంయుక్తులును వృషభరూపులును దుందుభియను వాద్యవిశేషము కలవారును అగు విష్ణుభగవానునకు నమస్కారము

భవేసఖాయ విభవే భరద్వాజాభయాయ చ ॥
భాస్కరాయ వరేన్ద్రాయ పద్మనాభాయ భూరిణే । 12

ఈ ప్రపంచమున జీవులకు సఖుడున్ను వ్యాపకరూపులును, భరద్వాజునకు అభయ మొసంగిన వారును సూర్య రూపమున ప్రకాశమును విస్తరించువారును శ్రేష్ఠ పురుషులకు ప్రభువును నాభినుండి కమలము ప్రకటమైనవారును మహత్తర రూపులును అగు నారాయణునకు నమస్కారము

పునర్వసుభృతత్వాయ జీవప్రభవిషాయ చ ॥
వషట్కారాయ స్వాహాయై స్వధాయై నిధనాయ చ ।
ఋచే చ యజుషే సామ్నే త్రైలోక్యపతయే నమః ॥ 13

పునర్వసు నక్షత్రముచే పాలితులును జీవుల ఉత్పత్తి స్థానమున్ను వషట్కార స్వాహా స్వధా నిధనములు నామములు, రూపములుగ కలవారును ఋక్ యజుస్సామవేద స్వరూపులును ముల్లోకములకు అధిపతియు అగు విష్ణుభగవానునకు నమస్కారము

శ్రీపద్మాయాత్మసదృశే ధరణే ధారణే పరే ।
సౌమ్యాయ సౌమ్యరూపాయ సౌమ్యే సుమనసే నమః ॥ 14

శోభావంతములగు కవములను చేతియందు కలవారును, ఆత్మ స్వరూపులును ధారణ ఒనర్చువారు, ఒనరింపజేయువారు నగు పరమాత్మ స్వరూపులును సౌమ్య రూపధారులును సౌమ్య సుందర మనస్సు కలవారు నగు శ్రీహరికి నమస్కారము।

విశ్వాయ చ సువిశ్వాయ విశ్వరూపధరాయ చ।
కేశవాయ సుకేశాయ రశ్మికేశాయ భూరిణే॥ 15

విశ్వరూపులు సుందర విశ్వముయొక్క నిర్మాతలు విశ్వరూపధారులు కేశవులు సుందర కేశయుక్తులు కిరణరూప కేశములు కలవారు అధిక బలశాలియు నగు విష్ణు భగవానునకు నమస్కారము

హిరణ్యగర్భాయ నమః సౌమ్యాయ వృషరూపిణే।
నారాయణాగ్రవపుషే పురుహూతాయ వజ్రిణే॥
ధర్మిణే వృషసేనాయ ధర్మసేనాయ రోధసే। 16

హిరణ్యగర్భుడు సౌమ్యుడు వృషరూపధారి నారాయణుడు శ్రేష్ఠ శరీరధారి ఇంద్రుడు వజ్రమును ధరించువారు ధర్మాత్ముడు వృషసేనుడు ధర్మసేనుడు తటరూపుడు నగు శ్రీహరికి నమస్కారము

మునయే జ్వరముక్తాయ జ్వరాధిపతయే నమః॥
అనేత్రాయ త్రినేత్రాయ పింగళాయ విదూర్మిణే। 17

మననశీలుడగు ముని జ్వరాదిరోగ రహితుడు జ్వరమునకు అధిపతి నేత్రరహితుడు త్రినేత్రుడు, పింగళవర్ణయుక్తుడు ప్రబలను తరంగముల ఉత్పత్తికి మహా సముద్రము వంటివారును అగు విష్ణు భగవానునకు నమస్కారము

తపోబ్రహ్మనిధానాయ యుగపర్యాయిణే నమః ॥
శరణాయ శరణ్యాయ శక్తేష్ట శరణాయ చ ।
నమః సర్వభవేశాయ భూతభవ్య భవాయ చ ॥ 18

తపస్సునకు వేదములకు నిధియు మరల మరల యుగముల పరివర్తనమును గావించువారును సర్వుల శరణదాతయు, శరణాగత వత్సలుడును శక్తిశాలియగు వానికి అభీష్ట ఆశ్రయమైయున్న వారును సమస్త ప్రపంచమునకు అధీశ్వరుడును భూత వర్తమాన భవిష్య రూపులును అగు నారాయణునకు నమస్కారము

పాహి మాం దేవదేవేశ కోఽప్యజోఽసి సనాతన ।
ఎవం గతోఽసి శరణం శరణ్యం బ్రహ్మయోనినామ్ ॥ 19

దేవదేవేశ్వరా! మీరు నన్ను రక్షింపుడు సనాతన పరమాత్మా! మీరు అనిర్వచనీయులు జన్మరహితులు బ్రహ్మనిష్ఠులకు శరణదాతలు నేను ఈ (సంసార) సంకటమున పడియుండి మిమ్ములనే శరణు పొందుచున్నాను

# శివస్తోత్రము

## (ఉపమన్యువు)

## (అనుశాసన పర్వము 14వ అధ్యాయము)

నమో దేవాధిదేవాయ మహాదేవాయ తే నమః ॥
శక్రరూపాయ శక్రాయ శక్రవేషధరాయ చ ।
నమస్తే వజ్రహస్తాయ పిఙ్గలాయారుణాయ చ ॥ 1

ప్రభూ! మీరు దేవతలకును అధినేత మీకు నమస్కారము మీరే గొప్ప దేవత మీకు నమస్కారము ఇంద్రుడు మీ యొక్క స్వరూపుడే అయి యున్నాడు మీరే సాక్షాత్ ఇంద్రుడు మీరు ఇంద్రుని వంటి వేషమును ధరించువారు ఇంద్ర రూపమున మీరే చేతియందు వజ్రాయుధమును ధరించి యున్నారు మీరు పింగళ వర్ణము ఎఱుపురంగు కలిగియున్నారు మీకు నమస్కారము

పినాకపాణయే నిత్యం శఙ్ఖశూలధరాయ చ ।
నమస్తే కృష్ణవాసాయ కృష్ణకుఞ్చితమూర్ధజే ॥ 2

మీ చేతియందు పినాకము శోభను బడయుచున్నది మీరు సదా శంఖమును త్రిశూలమును ధరించి యున్నారు మీ వస్త్రములు నలుపురంగు కలిగియున్నవి మీరు మస్తకముపై నల్లని కేశములు కలిగియున్నారు మీకు నమస్కారము

కృష్ణాజినోత్తరీయాయ కృష్ణాష్టమిరతాయ చ ।
శుక్లవర్ణాయ శుక్లాయ శుక్లామ్బరధరాయ చ ॥ 3

నల్లని మృగచర్మము మీ యొక్క దుప్పటి మీరు శ్రీ కృష్ణాష్టమీ వ్రతమందు తత్పరులై యున్నారు మీరు తెలుపు వర్ణము కలిగియున్నారు మీరు శుద్ధ స్వరూపులు మీకు తెల్లని వస్త్రమును ధరించు చున్నారు మీకు నమస్కారము

శుక్లభస్మావలిప్తాయ శుక్లకర్మరతాయ చ।
నమోఽస్తు రక్తవర్ణాయ రక్తామ్బరధరాయ చ॥ 4

మీరు సమస్త అంగములందు విభూతిని (భస్మమును) పూసికొని యున్నారు మీరు పరిశుద్ధ కర్మమందు అనురక్తులు అప్పుడప్పుడు మీరు ఎఱుపువర్ణమును గలిగియున్నారు మఱియు ఎఱుపు వస్త్రమును కూడ ధరించు చున్నారు మీకు నమస్కారము

రక్తధ్వజపతాకాయ రక్తస్రగనులేపనే।
నమోఽస్తు పీతవర్ణాయ పీతామ్బరధరాయ చ॥ 5

ఎఱుపు వస్త్రమును ధరించునపుడు మీ ధ్వజ పతాకములు ఎఱుపుగానే ఉండును ఎఱ్ఱని పూవులమాలను ధరించి మీరు మీ అవయవములకు ఎఱుపు చందనపు పూత కలిగియుందురు ఒకపుడు మీ అవయవకాంతి పసుపు రంగుగా ఉండును అపుడు మీరు పసుపురంగుగల వస్త్రములను ధరించి యుందురు అట్టి మీకు నమస్కారము

నమోఽస్తూచ్ఛ్రితచ్ఛత్రాయ కిరీటవరధారిణే।
అర్ధహారార్ధకేయూర అర్ధకుణ్డలకర్ణినే॥ 6

మీ మస్తకముపై ఎత్తైన గొడుగు ఉంచబడి యున్నది మీరు సుందర కిరీటమును ధరించుదురు అర్ధనారీశ్వర రూపమున మీ యొక్క సగము అవయవములపై హారము కేయూరము కుండలము శోభించు చున్నవి అట్టి మీకు నమస్కారము

నమః పవన వేగాయ నమో దేవాయ వై నమః।
సురేన్ద్రాయ మునీన్ద్రాయ మహేన్ద్రాయ నమోఽస్తు తే॥ 7

మీరు వాయువు వంటి వేగము కలవారు మీరే నా యొక్క ఆరాధ్య దేవులు మీరే సురేంద్రులు మునీంద్రులు, మహేంద్రులు అట్టి మీకు మరల మరల నమస్కారము

నమః పద్మార్ధమాలాయ ఉత్పలైర్మిశ్రితాయ చ।
అర్ధ చన్దన లిప్తాయ అర్ధస్రగను లేపనే॥ 8

మీ సగము అవయవము కమలమాల చేతను సగము కలువ పువ్వుల చేతను అలంకరింపబడి యున్నవి సగము అవయవమందు చందన లేపము సగము అవయవమందు సుగంధిత మగు అంగ రాగము కలిగియున్నారు అట్టి అర్ధనారీశ్వరరూపులగు మీకు నమస్కారము

నమ ఆదిత్య వక్త్రాయ ఆదిత్యనయనాయ చ।
నమ ఆదిత్యవర్ణాయ ఆదిత్యప్రతిమాయ చ॥ 9

మీ ముఖము సూర్యుని వలె తేజోవంతమైనది సూర్యుడు మీ నేత్రము మీ అవయవ కాంతియు సూర్యుని వలె దేదీప్య మానముగ నున్నది మీరు సూర్యుని పోలియున్నారు అట్టి మీకు నమస్కారము

నమః సోమాయ సౌమ్యాయ సౌమ్యవక్త్రధరాయ చ।
సౌమ్యరూపాయ ముఖ్యాయ సౌమ్యదంష్ట్రావిభూషణే॥ 10

సోమస్వరూపులును సౌమ్యులును సౌమ్యముఖమును ధరించినవారును, సౌమ్యస్వరూపులును ముఖ్యులును, సౌమ్యదంతము లచే విభూషితులును అగు ఓ పరమశివా! మీకు నమస్కారము

**నమః శ్యామాయ గౌరాయ అర్ధ పీతార్ధపాణ్డవే ।**
**నారీ నరశరీరాయ స్త్రీ పుంసాయ నమోఽస్తు తే ॥ 11**

మీరు హరి హర రూపులగుటచే మీ సగము శరీరము శ్యామవర్ణముగను సగము గౌరవర్ణముగను ఉన్నది సగము శరీర మందు మీరు పీతాంబరమును సగమునందు శ్వేతవస్త్రమును ధరించియున్నారు మీ సగము శరీరము స్త్రీయొక్క అవయవ ములు సగమందు పురుషుని అవయవములు కలిగియున్నవి మీరు స్త్రీ పురుషరూపులు అట్టి మీకు నమస్కారము

**నమో వృషభ వాహాయ గజేన్ద్రగమనాయ చ ।**
**దుర్గమాయ నమస్తుభ్యమగమ్యగమనాయ చ ॥ 12**

మీరు ఒకపుడు ఎద్దుపైనను మఱి యొకపుడు గజరాజు పైనను కూర్చొని పయనించుదురు మీరు దుర్గములు ఇతరులకు అగమ్యమైన చోటికిని మీరు వెళ్ళగలరు అట్టి మీకు నమస్కా రము

**నమోఽస్తు గణగీతాయ గణవృన్దరతాయ చ ।**
**గణానుయాతమార్గాయ గణనిత్యవ్రతాయ చ ॥ 13**

ప్రమథగణము మీ మహిమను గానమొనర్చుచున్నారు మీరు మీ పార్షదుల మండలియందు ప్రీతి కలిగియున్నారు మీ యొక్క ప్రతి మార్గమందును ప్రమథగణము మీ వెనువెంట పోవు చున్నారు మిమ్ములను సేవించుటయే గణముయొక్క నిత్యవ్రతమై యున్నది అట్టి మీకు నమస్కారము

**నమః శ్వేతాభ్రవర్ణాయ సంధ్యారాగప్రభాయ చ ।**
**అనుద్దిష్టాభిధానాయ స్వరూపాయ నమోఽస్తు తే ॥ 14**

తెలుపు మేఘముల వంటి కాంతికలవారును సంధ్యాకాల మందలి అరుణరాగము వంటి కాంతికలవారును నిశ్చితమైన పేరు లేనివారును ఆత్మస్వరూపమున స్థితినొందియుండువారును అగు పరమశివా! మీకు నమస్కారము

నమో రక్తాగ్రవాసాయ రక్తసూత్రధరాయ చ।
రక్తమాలావిచిత్రాయ రక్తామ్బరధరాయచ॥ 15

ఎఱుపు వస్త్రము కట్టుకొనువారును ఎఱుపు సూత్రమును ధరించువారును ఎఱుపురంగుతో కూడిన మాలచే విచిత్ర శోభను బడయువారును అగు రుద్రదేవునకు నమస్కారము

మణిభూషితమూర్ధాయ నమశ్చన్ద్రార్ధభూషణే।
విచిత్రమణిమూర్ధాయ కుసుమాష్టధరాయ చ॥ 16

దివ్యమణిచే విభూషితమైన నొసలు కలవారును శిరస్సుపై అర్ధచంద్రుడను భూషణము కలవారును విచిత్రమణులచే ప్రకాశితమైన శిరస్సు కలవారును ఎనిమిది పుష్పములను ధరించువారు నగు దేవా! మీకు నమస్కారము!

నమోఽగ్నిముఖనేత్రాయ సహస్రశశిలోచనే।
అగ్నిరూపాయ కాన్తాయ నమోఽస్తు గహనాయ చ॥ 17

ముఖ నేత్రములందు అగ్ని కలవారును వేలకొలది చంద్రుల వలె ప్రకాశమానములైన నేత్రములు కలవారును అగ్నిస్వరూపులును సుందరశరీరులును దుర్గమువనరూపులును అగు ఓ మహా దేవా! మీకు నమస్కారము!

ఖచరాయ నమస్తుభ్యం గోచరాభిరతాయ చ।
భూచరాయ భువనాయ అనన్తాయ శివాయ చ॥ 18

చంద్ర సూర్యుల రూపమున ఆకాశమార్గమున సంచరించు వారును, గోవులు సంచరించు చోటునందు విశేష ప్రీతి కలవారును భూమిపై సంచరించువారును త్రిభువన రూపులును అనంతులును, శివస్వరూపులును అగు దేవా! మీకు నమస్కారము!

నమో దిగ్వాససే నిత్యమధివాస సువాససే।
నమో జగన్నివాసాయ ప్రతిపత్తి సుఖాయ చ॥ 19

దిక్కులే వస్త్రములుగ కలవారును సర్వుల నివాసస్థానమును సుందర వస్త్రములను ధరించువారును జగత్తంతయు తమ యందు కలవారును సమస్త జీవులయొక్క సుఖము సులభ్యమైన వారును అగు పరమేశ్వరా! మీకు నమస్కారము!

నిత్యముద్బద్ధముకుటే మహాకేయూర ధారిణే।
సర్పకణ్ఠోపహారాయ విచిత్రాభరణాయ చ॥ 20

శిరస్సుపై సదా మకుటమును ధరించువారును భుజములందు విశాలములగు కేయూరములు కలవారును కంఠమందు సర్పముల మాలచే శోభించువారును విచిత్రములగు భూషణములచే విభూషితులు నగు రుద్రదేవా! మీకు నమస్కారము!

నమస్త్రినేత్రనేత్రాయ సహస్రశతలోచనే।
స్త్రీపుంసాయ నపుంసాయ నమః సాంఖ్యాయ యోగినే॥ 21

సూర్య చంద్రాగ్నులను మూడు నేత్రములు కలవారును, లక్షలకొలది నేత్రములు కలవారును స్త్రీయు పురుషుడును, నపుంసకుడును, సాంఖ్యవేత్తయు యోగియు అగు దేవా! మీకు నమస్కారము!

శంయోరభిస్రవన్తాయ అథర్వాయ నమోనమః।
నమః సర్వార్తినాశాయ నమః శోకహరాయ చ॥ 22

యజ్ఞపూరకు డగు 'శంయు' అను దేవతయొక్క ప్రసాద రూపులును అధర్వవేదస్వరూపులును సర్వుల బాధను తొలగించు వారును శోకహారులును అగు ఓ పరమశివా! మీకు మరల మరల నమస్కారము

నమో మేఘనినాదాయ బహుమాయాధరాయ చ।
బీజక్షేత్రాభిపాలాయ స్రష్టారాయ నమో నమః॥ 23

మేఘము వలె గంభీర నినాదము చేయువారును అనేక మాయలకు ఆధారభూతులును బీజమును క్షేత్రమును పాలించు వారును జగత్తుయొక్క సృష్టిని చేయువారును అగు రుద్రదేవా! మీకు మరల మరల నమస్కారము!

నమః సురాసురేశాయ విశ్వేశాయ నమోనమః।
నమః పవనవేగాయ నమః పవనరూపిణే॥ 24

దేవతలకు అసురులకు ప్రభువును సమస్త ప్రపంచమున కును ఈశ్వరుడును వాయువుకంటె వేగము కలవారును వాయు రూపులును అగు మహేశ్వరా! మీకు మరల మరల నమస్కారము!

నమః కాఞ్చనమాలాయ గిరిమాలాయ వై నమః।
నమః సురారిమాలాయ చణ్డవేగాయ వై నమః॥ 25

బంగారుమాలను ధరించినవారును పర్వత సమూహ మందు విహరించువారును దేవతల శత్రువుల మాలను ధరించు వారును ప్రచండమగు వేగము కలవారును అగు పరమశివా! మీకు మరల మరల నమస్కారము

బ్రహ్మశిరోపహర్త్రాయ మహిషఘ్నాయ వై నమః।
నమః స్త్రీరూపధారాయ యజ్ఞవిధ్వంసనాయ చ॥ 26

బ్రహ్మదేవుని యొక్క శిరస్సును ఛేదించినవారును మహిమ మును వినాశ మొనర్చినవారును స్త్రీరూపమును ధరించినవారును, (దక్షుని) యజ్ఞమును విధ్వంస మొనర్చినవారును అగు దేవా! మీకు మరల మరల నమస్కారము

నమస్త్రిపురహర్త్రాయ యజ్ఞవిధ్వంసనాయ చ।
నమః కామాఙ్గనాశాయ కాలదణ్డధరాయ చ॥ 27

అసురుల త్రిపురములను నాశ మొనర్చినవారును దక్షుని యజ్ఞమును విధ్వంస మొనర్చినవారును కాముని శరీరమును నాశము గావించినవారును, కాలదండమును ధరించినవారు నగు పర మేశ్వరా! మీకు మరల మరల నమస్కారము

నమః స్కన్దవిశాఖాయ బ్రహ్మదణ్డాయ వై నమః।
నమో భవాయ శర్వాయ విశ్వరూపాయ వై నమః॥ 28

స్కందరూపులును విశాఖస్వరూపులును బ్రహ్మదండరూపు లును భవ (ఉత్పాదక) రూపులును శర్వ (సంహార) రూపులును, విశ్వస్వరూపులును అగు ఓ పరమశివా! మీకు మరల మరల నమ స్కారము!

ఈశానాయ భవఘ్నాయ నమోఽస్త్వన్ధకఘాతినే।
నమో విశ్వాయ మాయాయ చిన్త్యాచిన్త్యాయ వై నమః॥ 29

ఈశ్వరులును సంసారబంధ వినాశకులును అంధకాసురుని సంహారించినవారును విశ్వస్వరూపులును మాయారూపులును చింత్య అచింత్యరూపులును అగు దేవా! మీకు మరల మరల నమస్కారము

త్వం నో గతిశ్చ శ్రేష్ఠశ్చ త్వమేవ హృదయం తథా।
త్వం బ్రహ్మా సర్వదేవానాం రుద్రాణాం నీలలోహితః॥ 30

మీరే మా గతి మీరు శ్రేష్ఠులు మీరే మా హృదయము మీరు సమస్త దేవతలందును బ్రహ్మదేవుడును, రుద్రులందును నీలలోహితుడును అయి యున్నారు అట్టి మీకు నమస్కారము

అత్మా చ సర్వభూతానాం సాంఖ్యే పురుష ఉచ్యతే ।
ఋషభ స్త్వం పవిత్రాణాం యోగినాం నిష్కలః శివః ॥ 31

మీరు సమస్త ప్రాణులందును ఆత్మ అయి యున్నారు సాంఖ్యశాస్త్రమందు మీరు పురుషుడని చెప్పబడుచున్నారు మీరు పవిత్రులలో ఋషభుడు యోగులందు నిష్కళ (నిర్మల) శివుడు అయి యున్నారు

గృహస్థ స్త్వమాశ్రమిణామీశ్వరాణాం మహేశ్వరః ।
కుబేరః సర్వయక్షాణాం క్రతూనాం విష్ణురుచ్యతే ॥ 32

ఆశ్రమస్థులలో మీరు గృహస్థుడును ఈశ్వరులలో మహేశ్వరుడును యక్షులందరిలో కుబేరుడును అయి యున్నారు యజ్ఞములందు మీరు విష్ణువని చెప్పబడుచున్నారు

పర్వతానాం భవాన్ మేరుర్నక్షత్రాణాం చ చన్ద్రమాః ।
వసిష్ఠస్త్వ మృషీణాం చ గ్రహాణాం సూర్య ఉచ్యతే ॥ 33

మీరు పర్వతములలో మేరువని నక్షత్రములలో చంద్రుడని ఋషులలో వసిష్ఠుడని గ్రహములలో సూర్యుడని చెప్పబడుచున్నారు

ఆరణ్యానాం పశూనాం చ సింహ స్త్వం పరమేశ్వరః ।
గ్రామ్యాణాం గోవృషశ్చాసి భవాన్లోక ప్రపూజితః । 34

మీరు అరణ్య పశువులందు సింహము లగు మీరు పరమేశ్వరుడు గ్రామీణ పశువులందు మీరు లోక సమ్మానితమగు ఆబోతు అయి యున్నారు

ఆదిత్యానాం భవాన్ విష్ణుర్వసూనాం చైవ ప్రావకః।
పక్షిణాం వైనతేయస్త్వమనన్తో భుజగేషు చ॥ 35

ఆదిత్యులందు మీరు విష్ణువు వసువులందు అగ్ని పక్షులందు వినతానందనుడగు గరుడుడు సర్పము లందు అనంతుడు (శేష నాగము) అయి యున్నారు

సామవేదశ్చ వేదానాం యజుషాం శతరుద్రియమ్।
సనత్కుమారో యోగానాం సాంఖ్యానాం కపిలో హ్యసి॥36

మీరు వేదములందు సామవేదము యజుర్వేద మంత్రము లలో శతరుద్రీయము యోగులలో సనత్కుమారుడు సాంఖ్య వేత్తలలో కపిలుడును అయియున్నారు

శక్రోఽసి మరుతాం దేవ పితౄణాం హవ్యవాడసి।
బ్రహ్మలోకశ్చ లోకానాం గతీనాం మోక్ష ఉచ్యసే॥ 37

దేవా! మీరు మరుద్గణములలో ఇంద్రుడు పితరులలో హవ్య వాహనుడగు అగ్ని లోకములలో బ్రహ్మలోకము గతులలో మోక్షము అని చెప్పబడుచున్నారు

క్షీరోదః సాగరాణాం చ శైలానాం హిమవాన్ గిరిః।
వర్ణానాం బ్రాహ్మణశ్చాసి విప్రాణాం దీక్షితో ద్విజః॥ 38

మీరు సముద్రములలో క్షీరసముద్రము, పర్వతములలో హిమాలయము వర్ణములలో బ్రాహ్మణవర్ణము బ్రాహ్మణు లందును దీక్షిత బ్రాహ్మణుడు (యజ్ఞదీక్ష గైకొనినవాడు) అయి యున్నారు

ఆదిస్త్వమసి లోకానాం సంహర్తా కాల ఏవ చ।
యచ్చాన్యదపి లోకే వై సర్వతేజోఽధికం స్మృతమ్॥ 39

మీరు సమస్త లోకముల యొక్క ఆది అయి యున్నారు సంహరించు కాలము మీరే అయియున్నారు ప్రపంచమున ఏయే వస్తువులు తేజస్సునందు చాల గొప్పవో అవి యన్నియు భగవంతుడగు మీరే అయియున్నారని నా నిశ్చితాభిప్రాయము

నమస్తే భగవన్ దేవ నమస్తే భక్తవత్సల
యోగేశ్వర నమస్తేఽస్తు నమస్తే విశ్వసమ్భవ ॥ 40

భగవానుడా! దేవా! మీకు నమస్కారము భక్తవత్సలా! మీకు వందనము యోగేశ్వరా! మీకు నమస్కారము ప్రపంచముయొక్క ఉత్పత్తికి కారణభూతులగు దేవా! మీకు నమస్కారము

ప్రసీద మమ భక్తస్య దీనస్య కృపణస్య చ।
అనైశ్వర్యేణ యుక్తస్య గర్భవ సనాతన। 41

సనాతన పరమేశ్వరా! దీనుడను దుఃఖిని భక్తుడను అగు నాయెడల ప్రసన్నులు కండు నేను ఐశ్వర్యము లేనివాడను మీరే నాయొక్క ఆశ్రయదాత అయియున్నారు

యచ్చాఽపరాధం కృతవానజ్ఞాత్వా పరమేశ్వర।
మద్భక్త ఇతి దేవేశ తత్ సర్వం క్షన్తుమర్హసి ॥ 42

పరమేశ్వరా! దేవేశా! తెలియక నేను ఏ అపరాధమును చేసితినో దానిని ఇతడు నా భక్తుడు అని తలంచి క్షమించుడు!

ఓమ్

# శివ స్తోత్రము

## (శ్రీకృష్ణుడు)

## (అనుశాసన పర్వము - 14 వ అధ్యాయము)

నమోఽస్తు తే శాశ్వత సర్వయోనే
బ్రహ్మాధిపం త్వామృషయో వదన్తి।
తపశ్చ సత్త్వం చ రజస్తమశ్చ
త్వామేవ సత్యం చ వదన్తి సన్తః ॥ 1

సమస్తమునకు కారణభూతులగు సనాతన పరమేశ్వరా! మీకు నమస్కారము మీరు బ్రహ్మదేవునకు కూడ అధిపతులని ఋషులు చెప్పుదురు మీరే తపస్సని సత్త్వగుణమని రజోగుణమని తమోగుణమని సత్యస్వరూపులని సాధువులు వచించుదురు

త్వం వై బ్రహ్మ చ రుద్రశ్చ వరుణోఽగ్నిర్మనుర్భవః।
ధాతా త్వష్టా విధాతా చ త్వం ప్రభుః సర్వతోముఖః। 2

మీరే బ్రహ్మదేవుడు రుద్రుడు వరుణుడు అగ్ని, మనువు శివుడు ధాత విధాత త్వష్ట అయియున్నారు మీరు అన్నివైపుల ముఖములు కల పరమేశ్వరుడు

త్వత్తో జాతాని భూతాని స్థావరాణి చరాణి చ।
త్వయా సృష్టమిదం కృత్స్నం త్రైలోక్యం సచరాచరమ్॥ 3

సమస్త చరాచరప్రాణులు మీ నుండియే ఉత్పన్నములైనవి స్థావర జంగమ ప్రాణులతో గూడిన ఈ సమస్త త్రైలోక్యము యొక్క సృష్టిని మీరే కావించితిరి

యానీన్ద్రియాణీహ మనశ్చ కృత్స్నం
యే వాయవః సప్త తథైవ చాగ్నయః ।
యే దేవసంస్థాస్తవ దేవతాశ్చ
తస్మాత్ పరం త్వామృషయో వదన్తి ॥ 4

ఇచట ఏయే ఇంద్రియములు సంపూర్ణ మనస్సు, సమస్త వాయువు ఏడు అగ్నులు దేవసముదాయమందు స్తుతింప యోగ్యులగు దేవతలు కలరో వారి యందఱికంటె పైస్థితి మీది ఋషులు మీ విషయమందు ఇట్లే చెప్పుదురు

వేదాశ్చ యజ్ఞాః సోమశ్చ దక్షిణా పావకో హవిః ।
యజ్ఞోపగం చ యత్ కించిద్ భగవాంస్తద సంశయమ్ ॥ 5

వేదము యజ్ఞము సోమము దక్షిణ అగ్ని హవిస్సు యజ్ఞోపయోగములగు ఇతర సామగ్రి, అంతయు భగవంతుడగు మీరే అయియున్నారు ఇందు సంశయము లేదు

ఇష్టం దత్తమధీతం చ వ్రతాని నియమాశ్చ యే ।
హ్రీః కీర్తిః శ్రీర్ద్యుతిస్తుష్టిః సిద్ధిశ్చైవ తదర్పణీ ॥ 6

యజ్ఞము, దానము, అధ్యయనము వ్రతము నియమము లజ్జ, కీర్తి శ్రీ ద్యుతి తుష్టి సిద్ధి— ఇవి యన్నియు మీ స్వరూపమును పొందింప జేయునవై యున్నవి

కామః క్రోధో భయం లోభో మదః స్తమ్భోఽథ మత్సరః ।
ఆధయో వ్యాధయశ్చైవ భగవంస్తనవస్తవ ॥ 7

దేవా! కామ క్రోధ భయ లోభ మదములు స్తబ్ధత్వము మాత్సర్యము ఆధి (మానసిక వ్యాధి) వ్యాధి— ఇవి యన్నియు మీయొక్క శరీరములే అయియున్నవి

కృతిర్వికారః ప్రణయః ప్రధానం బీజ మవ్యయమ్ ।
మనసః పరమాం యోనిః ప్రభావశ్చాప శాశ్వతః ॥ 8

క్రియ, వికారము ప్రణయము ప్రధానము, నాశరహిత మగు బీజము, మనస్సు యొక్క పరమ కారణము సనాతన ప్రభావము ఇవి కూడ మీ యొక్క స్వరూపములే అయి యున్నవి

అవ్యక్తః పావనోఽచిన్త్యః సహస్రాంశుర్హిరణ్మయః ।
ఆదిర్గణానాం సర్వేషాం భవాన్ వై జీవితాశ్రయః ॥ 9

అవ్యక్తులు పావనులు అచింత్యులు హిరణ్మయ సూర్య స్వరూపులు అగు మీరే సమస్త గణములకు ఆది కారణము జీవితము యొక్క ఆశ్రయము అయి యున్నారు

మహానాత్మా మతిర్బ్రహ్మా విశ్వః శమ్భుః స్వయమ్భువః ।
బుద్ధిః ప్రజ్ఞోపలబ్ధిశ్చ సంవిత్ ఖ్యాతిర్ధృతిః స్మృతి ॥ 10
పర్యాయ వాచకైః శబ్దైర్మహానాత్మా విభావ్యతే ।
త్వాం బుద్ధ్వా బ్రాహ్మణో వేదాత్ ప్రమోహం
వినియచ్ఛతి ॥ 11

మహత్తరమైనది ఆత్మ మతి బ్రహ్మదేవుడు ప్రపంచము శంభువు, స్వయంభువు బుద్ధి ప్రజ్ఞ, ఉపలబ్ధి సంవిత్తు ఖ్యాతి, ధృతి స్మృతి —అను ఈ పదునైదు పర్యాయ వాచకములగు పదముల ద్వారా పరమాత్మయగు మీరే భావింప బడుచున్నారు వేదముల ద్వారా మీ యొక్క జ్ఞానమును బడసి బ్రహ్మజ్ఞానులు మోహమును సర్వథా నశింప జేసికొన చున్నారు

హృదయం సర్వభూతానాం క్షేత్రజ్ఞస్త్వమృషిస్తుతః ।
సర్వతః పాణిపాదస్త్వం సర్వతోఽక్షి శిరోముఖః ॥ 12

ఋషులచే ప్రశంసింపబడు మీరే సమస్తప్రాణుల హృదయమందున్నట్టి క్షేత్రజ్ఞులు మీకు అన్నివైపుల చేతులు కాళ్ళు కలవు అన్ని వైపుల నేత్రములు మస్తకములు, ముఖములు కలవు

సర్వతః శ్రుతిమాఁల్లోకే సర్వమావృత్య తిష్ఠసి ।
ఫలం త్వమసి తిగ్మాంశో౯ నిమేషాదిషు కర్మసు ॥ 13

మీకు అన్నివైపుల చెవులు కలవు జగత్తునందు మీరు సమస్తమందును వ్యాపించి యున్నారు జీవునియొక్క కన్ను తెరచుట మూయుట మొదలుకొని ఉన్నట్టి సమస్త కర్మముల యొక్క ఫలము మీరే అయి యున్నారు

త్వం వై ప్రభార్చిః పురుషః సర్వస్య హృది సంశ్రితః ।
అణిమా మహిమా ప్రాప్తిరీశానో జ్యోతిరవ్యయః ॥ 14

నాశరహితుడైన పరమేశ్వరుడగు మీరే సూర్యుని యొక్క కాంతి అగ్ని యొక్క జ్వాల అయి యున్నారు సమస్త ప్రాణుల యొక్క హృదయమందు ఆత్మరూపమున మీరే నివసించి యున్నారు అణిమ మహిమ, ప్రాప్తి మొదలగు సిద్ధులు మఱియు జ్యోతులు మీరే అయి యున్నారు

త్వయి బుద్ధిర్మతిర్లోకాః ప్రపన్నాః సంశ్రితాశ్చయే ।
ధ్యానినో నిత్యయోగాశ్చ సత్య సత్త్వా జితేన్ద్రియాః ॥ 15

మీయందు బోధ మననముల శక్తి ఉండి యున్నది ఎవరు మిమ్ములను శరణు పొంది సర్వధా మిమ్ములను ఆశ్రయించుచున్నారో, అట్టి ధ్యాన పరాయణులు నిత్య యోగయుక్తులు సత్య సంకల్పులు, జితేంద్రియులు అగుచున్నారు

యస్త్వాం ధ్రువం వేదయతే గుహాశయం
ప్రభుం పురాణం పురుషం చ విగ్రహమ్ ।
హిరణ్మయం బుద్ధిమతాం పరాం గతిం
స బుద్ధిమాన్ బుద్ధిమతీత్య తిష్ఠతి ॥ 16

ఏ బుద్ధిమంతుడు మిమ్ములను తన హృదయ గుహాయందున్న ఆత్మగను ప్రభువుగను పురాణ పురుషునిగను మూర్తిమంతుడగు పర బ్రహ్మముగను హిరణ్మయ పురుషునిగను పరమ గతి రూపముగను నిశ్చయముగ ఎఱుంగుచున్నాడో అట్టి బుద్ధిమంతుడే లౌకిక బుద్ధిని ఉల్లంఘించి పరమాత్మ భావమందు ప్రతిష్ఠితుడగుచున్నాడు

విదిత్వా సప్త సూక్ష్మాణి షడంగం త్వాం చ మూర్తితః ।
ప్రధాన విధియోగస్థస్త్వామేవ విశతే బుధః ॥ 17

జ్ఞానులు మహత్తత్త్వము అహంకారము పంచ తన్మాత్రలు—అను ఈ ఏడు సూక్ష్మ తత్త్వములను తెలిసికొని మీ స్వరూప భూతములగు ఆఱు అంగములను గూర్చిన బోధను బడసి ప్రముఖమగు విధి యోగమును ఆశ్రయించి మీయందే ప్రవేశించుచున్నారు

ఓమ్

# శివ స్తవము

## (తండి)

## (అనుశాసనపర్వము 16 వ అధ్యాయము)

పవిత్రాణాం పవిత్ర స్త్వం గతిర్గతి మతాం వర ।
అత్యుగ్రం తేజసాం తేజ స్తపసాం పరమం తపః ॥ 1

సర్వశ్రేష్ఠులగు పరమేశ్వరా! మీరు పవిత్రులలో మహా పవిత్రులు గతిశీలురగు ప్రాణులకు ఉత్తమగతి మీరు తేజస్సులలో అత్యంత ఉగ్రతేజస్సు తపస్సులలో ఉత్కృష్ట తపస్సు అయియున్నారు

విశ్వావసు హిరణ్యాక్ష పురుహూత నమస్కృత ।
భూరికల్యాణద విభో పరం సత్యం నమోఽస్తు తే ॥ 2

గంధర్వరాజగు విశ్వావసు దైత్యరాజగు హిరణ్యాక్షుడు, దేవరాజగు ఇంద్రుడును మీకు నమస్కరించుచున్నారు సర్వులకు మహాకళ్యాణమును (శుభమును) ఒసంగు ప్రభూ! మీరు పరమ సత్యస్వరూపులు మీకు నమస్కారము

జాతీమరణభీరూణాం యతీనాం యతతాం విభో ।
నిర్వాణద సహస్రాంశో నమస్తేఽస్తు సుఖాశ్రయ ॥ 3

ప్రభూ! జనన మరణముల వలన భీతిల్లి సంసార బంధనము నుండి విముక్తులగుటకై ప్రయత్నించు యతులకు మోక్షము నొసంగువారు మీరే అయి యున్నారు వేలకొలది కిరణములతో కూడిన

సూర్య రూపమున మీరే వెలుగుచున్నారు సర్వులకు ఆశ్రయము
మగు ఓ మహేశ్వరా! మీకు నమస్కారము

బ్రహ్మ శతక్రతుర్విష్ణుర్విశ్వేదేవా మహర్షయః।
న విదుస్త్వాం తు తత్త్వేన కుతో వేత్స్యామహే వయమ్।
త్వత్తః ప్రవర్తతే సర్వం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 4

బ్రహ్మదేవుడు విష్ణువు ఇంద్రుడు, విశ్వేదేవతలు మహా
ర్షులు, మిమ్ములను యథార్థ రూపమున తెలిసికొనలేకున్నారు ఇక
మే మెట్లు తెలిసికొనగలము? మీ నుండియే సమస్తము యొక్క
ఉత్పత్తి సంభవించుచున్నది మీ యందే ఈ జగత్తంతయు ప్రతి
ష్ఠితమై యున్నది

కాలాఖ్యః పురుషాఖ్యశ్చ బ్రహ్మాఖ్యశ్చ త్వమేవ హి।
తనవస్తే స్మృతాస్తిస్రః పురాణజ్ఞైః సురర్షిభిః ॥ 5

కాలుడు, పురుషుడు బ్రహ్మదేవుడు—అను ఈ మూడు
పేర్ల ద్వారా మీరే ప్రతిపాదింపబడుచున్నారు పురాణవేత్త
లగు బ్రహ్మర్షులు ఈ మూడును మీ రూపములే యని వచించు
చున్నారు

అధిపౌరుష మధ్యాత్మ మధిభూతాధి దైవతమ్।
అధిలోకాధి విజ్ఞాన మధియజ్ఞ స్త్వమేవ హి ॥ 6

అధి పౌరుష అధ్యాత్మ అధి భూత అధి దైవత అధి
లోక అధి విజ్ఞాన అధి యజ్ఞములు మీరే అయి యున్నారు

త్వాం విదిత్వాత్మ దేహస్థం దుర్విదం దైవతైరపి
విద్వాంసో యాన్తి నిర్ముక్తాః పరం భావమనామయమ్ ॥ 7

మీరు దేవతలకను దుర్జ్ఞేయులై యున్నారు జ్ఞానులు మిమ్ములను తమ శరీరమందే ఉన్న అంతర్యామి యగు ఆత్మరూప మున తెలిసికొని సంసార బంధనము నుండి విముక్తులై రోగ శోక రహితులై పరమాత్మను పొందుచున్నారు

అనిర్వృత స్తవ విభో జన్మమృత్యు రనేకశః ।
ద్వారం తు స్వర్గమోక్షాణా మాక్షేప్తా త్వం దదాసి చ ॥ 8

ప్రభూ! మీరు స్వయముగనే దయగలిగి జీవుని ఉద్ధరింప దలంచినచో అతని కిక మరల మరల జనన మరణములు కలుగుచునే యుండును స్వర్గ మోక్ష ద్వారములు మీరే అయి యున్నారు (వారి వారి కర్మలను బట్టి) వానిని పొందింపజేయువారు పొందింపక చేయువారును మీరే అయి యున్నారు

త్వం వై స్వర్గశ్చ మోక్షశ్చ కామః క్రోధ స్త్వమేవ చ ।
సత్త్వం రజ స్తమశ్చైవ అధశ్చోర్ధ్వం త్వమేవ హి ॥ 9

స్వర్గ మోక్షములు కామ క్రోధములు, సత్త్వరజస్తమో గుణములు ఊర్ధ్వ అధో లోకములు మీరే అయియున్నారు

బ్రహ్మా భవశ్చ విష్ణుశ్చ స్కన్దేన్ద్రౌ సవితా యమః ।
వరుణేన్దూ మనుర్ధాతా విధాతా త్వం ధనేశ్వరః ॥ 10

బ్రహ్మదేవుడు విష్ణువు శివుడు స్కందుడు, ఇంద్రుడు, సూర్యుడు, యముడు వరుణుడు, చంద్రుడు మనువు ధాత, విధాత ధనాధ్యక్షుడగు కుబేరుడు మీరే అయియున్నారు

భూర్వాయుః సలిలం ర్గ్నిశ్చ ఖం వాగ్బుద్ధిః స్థితిర్మతిః ।
కర్మ సత్యానృతే చోభే త్వమేవా స్తి చ నాస్తి చ ॥ 11

భూమి వాయువు జలము, అగ్ని, ఆకాశము వాక్కు బుద్ధి స్థితి మతి కర్మ సత్యము అసత్యము ఉనికి లేమి, మీరే అయియున్నారు

ఇన్ద్రియాణీన్ద్రి యార్థాశ్చ ప్రకృతిభ్యః పరం ధ్రువమ్ ।
విశ్వా విశ్వపరో భావశ్చిన్త్యా చిన్త్యస్త్వమేవ వా ॥ 12

ఇంద్రియములు ఇంద్రియ విషయములు మీరే ప్రకృతికి పరమైనవారు నిశ్చలురు నాశరహిత తత్త్వము మీరే అయియున్నారు విశ్వము అవిశ్వము రెండిటికి పరమైన విలక్షణ భావము చింత్య అచింత్యములు మీరే అయియున్నారు

యచ్చైతత్ పరమం బ్రహ్మ యచ్చైతత్ పరమం పదమ్ ।
యా గతిః సాంఖ్యయోగానాం సభవాన్నాత్ర సంశయః ॥ 13

పరబ్రహ్మము, పరమపదము సాంఖ్యవేత్తల యొక్కయు యోగుల యొక్కయు గతులు మీరే అయియున్నారు ఇందులకు సంశయము లేదు

నూనమద్య కృతార్థాః స్మ నూనం ప్రాప్తాః సతాం గతిమ్ ।
యాం గతిం ప్రార్థయన్తీహ జ్ఞాన విర్మలబుద్ధయః ॥ 14

జ్ఞానము చే నిర్మలమైనట్టి బుద్ధి కల జ్ఞానులు సత్పురుషులు ఏ గతిని పొంద దలంచుచున్నారో ఆ గతినే నిశ్చయముగ మేము (ఇపుడు మీ దర్శనము చే) పొందితిమి కావున నేడు నిక్కముగ మేము కృతార్థులమైతిమి

అహో మూఢాః స్మ సుచిరమిమం కాలమచేతసా ।
యన్న విద్మః పరం దేవం శాశ్వతం యం విదుర్బుధాః ॥ 15

ఆహా! మేము అజ్ఞానవశమున ఇంత దీర్ఘకాలము వఱకు మోహమందు పడియుంటిమి ఏల యనిన ఎవరిని జ్ఞానులు తెలిసికొందురో అట్టి సనాతన పరమదేవుని మేమింతవఱకు తెలిసికొనకాలకుంటిమి

నేయమాసాదితా సాక్షాత్ త్వద్భక్తి ర్జన్మభిర్మయా ।
భక్తానుగ్రహకృద్ దేవోఽయం జ్ఞాత్వా మృతమశ్నుతే ॥ 16

ఇపుడు అనేక జన్మముల ప్రయత్నముచే నేను మీయొక్క భక్తిని పొందితిని మీరు భక్తుల యెడల అనుగ్రహము కల్గి యుండు గొప్ప దేవత విద్వాంసులు తెలిసికొని జ్ఞానులు మోక్షమును పొందుచున్నారు

దేవాసురమునీనాం తు యచ్చ గుహ్యం సనాతనమ్ ।
గుహాయాం నిహితం బ్రహ్మ దుర్విజ్ఞేయం మునేరపి ॥ 17

స ఏష భగవాన్ దేవః సర్వకృత్ సర్వతోముఖః ।
సర్వాత్మా సర్వదర్శీ చ సర్వగః సర్వవేదితా ॥ 18

ఏ సనాతన బ్రహ్మము దేవతలకు, అసురులకు మునులకు కూడ రహస్యమై యున్నదో ఏది హృదయ గుహయందుండి మనన శీలుడగు మునికి కూడ దుర్విజ్ఞేయమై యున్నదో అదియే ఈ భగవానుడు సమస్తమును సృష్టించు దేవత మీరే మీరికి అన్నివైపుల ముఖములు కలవు మీరు సర్వాత్మ సర్వదర్శి సర్వవ్యాపి సర్వజ్ఞుడు అయియున్నారు

దేహకృద్ దేహభృద్ దేహీ దేహభుగ్ దేహినాం గతిః ।
ప్రాణకృత్ ప్రాణభృత్ ప్రాణీ ప్రాణదః ప్రాణినాం
గతిః ॥ 19

దేవా! మీరు శరీరముయొక్క నిర్మాత శరీరధారి అయియున్నారు కావుననే దేహీ అని చెప్పబడుచున్నారు దేహముయొక్క భోక్త దేహధారుల పరమగతి మీరే అయియున్నారు ప్రాణముల ఉత్పాదకులు ప్రాణధారి ప్రాణి ప్రాణదాత, ప్రాణుల గతి మీరే అయియున్నారు

అధ్యాత్మ గతిరిష్టానాం ధ్యాయినామాత్మ వేదినామ్ ।
అపునర్భవ కామానాం యా గతిః సోఽయ మీశ్వరః ॥ 20

ధ్యానమొనర్చు ప్రియ భక్తులయొక్క అధ్యాత్మ గతియు, పునర్జన్మయొక్క కోరిక లేకుండు ఆత్మజ్ఞానులయొక్క గతియు ఈ ఈశ్వరుడే అయియున్నారు

అయం చ సర్వభూతానాం శుభాశుభ గతిప్రదః ।
అయం చ జన్మమరణే విదధ్యాత్ సర్వజన్తుషు ॥ 21

సమస్త ప్రాణులకు (వారి వారి కర్మలననుసరించి) శుభ, అశుభ గతులను ప్రదానమొనర్చునది వీరే అట్లే సమస్త ప్రాణులకు జన్మ మృత్యువులను ఒసంగునదియు వీరే

అయం సంసిద్ధి కామానాం యా గతిః సోఽయ మీశ్వరః ।
భూరాద్యాఞ్ సర్వభువనానుత్పాద్య సదివౌకసః ।
దధాతి దేవస్తనుభిరష్టాభిర్యో బిభర్తి చ ॥ 22

మోక్షము నభిలషించువారి పరమగతి వీరే అయియున్నారు దేవతానివాసములగు భూర్భువరాది లోకములను సృష్టించి ఈ మహాదేవుడే (పృథివీ జల వాయు అగ్ని ఆకాశ సూర్య, చంద్ర యజమానులను) తన ఎనిమిది మూర్తుల ద్వారా వాని యొక్క ధారణను పోషణను గావించుచున్నారు

అతః ప్రవర్తతే సర్వమస్మిఞ్ సర్వం ప్రతిష్ఠితమ్ ।
అస్మింశ్చ ప్రలయం యాతి అయమేకః సనాతనః ॥ 23

వీరినుండియే సమస్తము ఉత్పన్నమగుచున్నది వీరియందే సమస్త జగత్తు ప్రతిష్ఠితమై యున్నది వీరియందే సమస్తము లయించుచున్నది వీరే ఏకైక సనాతన పురుషుడు

అయం స సత్యకామానాం సత్యలోకః పరం సతామ్।
అపవర్గశ్చ ముక్తానాం కైవల్యం చాత్మవేదినామ్ ॥ 24

సత్యము నపేక్షించు సజ్జనులకు వీరే సర్వోత్తమ సత్యలోకము ముక్తులయొక్క మోక్షము ఆత్మజ్ఞానుల కైవల్యము వీరే

అయం బ్రహ్మాదిభిః సిద్ధైర్గుహాయాం గోపితః ప్రభుః।
దేవాసుర మనుష్యాణా మప్రకాశో భవేదితి ॥ 25

దేవతలకు అసురులకు మనుష్యులకు వీరి స్వరూపము అగోచరము బ్రహ్మదేవుడు మొదలగు సిద్ధులు ఈ పరమేశ్వరుని తమ హృదయ గుహయందు దాచుకొని యున్నారు

తం త్వాం దేవాసురనరా స్తత్త్వేన న విదుర్భవమ్।
మోహితాః ఖల్వనేనైవ హృదిస్థేనా ప్రకాశినా ॥ 26

హృదయ మందిరమున నిగూఢముగ నుండి గోచరము కాని ఈ పరమాత్మ యగు దేవుడు సర్వులను తన మాయచే మోహితులగొనర్చి యున్నారు కనుకనే దేవతలు అసురులు మనుష్యులు, మహాదేవుడగు మిమ్ములను యథార్థ రూపమున తెలిసికొన లేకున్నారు

యే చైనం ప్రతిపద్యన్తే భక్తియోగేన భావితాః।
తేషామేవాత్మ నాఽఽత్మానం దర్శయత్యేష హృచ్ఛయః ॥ 27

ఎవరు భక్తియోగములో కూడి ఆ పరమేశ్వరుని శరణు బొందుచున్నారో వారికి హృదయ మందిరమున శయనించు ఈ భగవంతుడు స్వయముగ దర్శన మొసంగును

యం జ్ఞాత్వా న పునర్జన్మ మరణం చాపి విద్యతే।
యం విదిత్వా పరం వేద్యం వేదితవ్యం న విద్యతే॥ 28

యం లబ్ధ్వా పరమం లాభం నాధికం మన్యతే బుధః।
యాం సూక్ష్మాం పరమాం ప్రాప్తిం గచ్ఛన్నవ్యయ
మక్షయమ్॥ 29

యం సాంఖ్యా గుణతత్త్వజ్ఞాః సాంఖ్యశాస్త్ర విశారదాః।
సూక్ష్మజ్ఞాన తరాః సూక్ష్మం జ్ఞాత్వా ముచ్యన్తి బన్ధనైః। 30
యం చ వేదవిదో వేద్యం వేదాన్తే చ ప్రతిష్ఠితమ్।
ప్రాణాయామపరా నిత్యం యం విశన్తి జపన్తి చ॥ 31
ఓంకార రథమారుహ్య తే విశన్తి మహేశ్వరమ్।
అయం స దేవయానా నామాదిత్యో ద్వారముచ్యతే॥ 32

ఎవరిని ఎఱింగినచో జనన మరణముల బంధనము ఉండదో ఎవరి జ్ఞానమును పొందినచో ఇక ఉత్కృష్టమగు జ్ఞేయతత్త్వమును తెలిసికొనుటకు మిగిలియుండదో ఎవరిని పొందిన విదప జ్ఞాని గొప్ప లాభమును కూడ అధికముగ తలంపడో ఏ సూక్ష్మ పదార్థమును పొంది జ్ఞాని నాశరహితమగు పరమ పదమును బడయుచున్నాడో సత్త్వాది త్రిగుణములను ఇరువదినాలుగు తత్త్వములను తెలిసికొను సాంఖ్య జ్ఞాన విశారదులగు సాంఖ్యయోగులు ఏ సూక్ష్మ తత్త్వము నెఱింగి ఆ సూక్ష్మ జ్ఞాన రూప నౌకద్వారా సంసార సముద్రమును దాటి వేయుచున్నారో మఱియు సర్వ విధ బంధనముల నుండి విడివడుచున్నారో ప్రాణాయామ పరాయణులు వేద వేత్తలు తెలిసికొన దగినదియు వేదాంతమందు ప్రతిష్ఠితమైనదియునగు ఏ సత్య తత్త్వము యొక్క ధ్యానమును జపమును చేయుచున్నారో దాని యందే ప్రవేశించుచున్నారో అదియే ఈ మహేశ్వరుడు ఓంకార

మను రథముపై నెక్కి ఆ సద్ధులు వీరియందే ప్రవేశించుచున్నారు వీరే దేవయానము యొక్క ద్వారరూపుడగు సూర్యుడని చెప్పబడు చున్నారు

అయం చ పితృయానానాం చన్ద్రమా ద్వారముచ్యతే।
ఏష కాష్ఠా దిశశ్చైవ సంవత్సర యుగాది చ॥ 33
దివ్యాదివ్యః పరో లాభ అయనే దక్షిణోత్తరే।

వీరే పితృయాన మార్గము యొక్క ద్వారమగు చంద్రుడు అని చెప్పబడుచున్నారు కాష్ఠ దిక్కు సంవత్సరము యుగము మొదలైనవికూడ వీరే అయి యున్నారు దివ్యలాభము (దేవలోక సుఖము) అదివ్య లాభవ ఇహలోక సుఖము) పరమ లాభము (మోక్షము) ఉత్తరాయణము దక్షిణాయణము కూడ వీరే అయి యున్నారు

ఏనం ప్రజాపతిః పూర్వమారాధ్య బహుభిః స్తవైః।
ప్రజార్థం వరయామాస నీలలోహిత సంజ్ఞితమ్॥ 34

పూర్వము ప్రజాపతి గాథ స్తోత్రముల ద్వారా నీలలోహితు డను పేరుగల ఈ భగవంతునే ఆరాధించి ప్రజల సృష్టికొఱకై వర మును పొందెను

ఋగ్భిర్యమనుశంసన్తి తత్త్వే కర్మణి బహ్వృచాః।
యజుర్భిర్యత్త్రిధా వేద్యం జుహ్వత్యధ్వర్యవోఽధ్వరే।
సామభిర్యం చ గాయన్తి సామగాః శుద్ధబుద్ధయః॥ 35

ఋతం సత్యం పరం బ్రహ్మ స్తువన్త్యాథర్వణా ద్విజాః।
యజ్ఞస్య పరమా యోనిః పతిశ్చాయం పరః స్మృతః॥ 36

ఋగ్వేదము యొక్క పండితులు తాత్త్విక యజ్ఞ కర్మ యందు ఋగ్వేద మంత్రముల ద్వారా ఎవరి మహిమను గాన

కొనియాడుచున్నారో యజుర్వేదమును తెలిసినవారు యజ్ఞమందు యజుర్వేద మంత్రముల ద్వారా దక్షిణాగ్ని గార్హపత్య ఆహవనీయములను త్రివిధ హోమములచే తెలిసికొన యోగ్యులగు ఏ మహాదేవుని ఉద్దేశ్యముతో ఆహుతి నొసంగుచున్నారో శుద్ధ బుద్ధితో గూడినవారైన సామవేద గాయకులగు విద్వాంసులు సామ మంత్రముల ద్వారా ఎవరిని స్తుతించుచున్నారో అథర్వ వేదజ్ఞులు ఋతము సత్యము పరబ్రహ్మము అను పేర్లచే ఎవరిని స్తుతించుచున్నారో ఎవరు యజ్ఞమునకు పరమ కారణమో ఆ పరమేశ్వరుడే సమస్త యజ్ఞముల యొక్క పరమపతి యని భావించబడుచున్నారు

రాత్ర్యహః శ్రోత్రనయనః పక్షమాస శిరోభుజః ।
ఋతు వీర్య స్తపో ధైర్యో హ్యబ్దగుహ్యోరు పాదవాన్ ॥ 37

రాత్రి పగలు వీరి యొక్క చెవులు కండ్లు అయి యున్నవి పక్షము మాసము వీరి శిరస్సు భుజములు ఋతువు వీర్యము తపస్సు ధైర్యము సంవత్సరము గుహ్యేంద్రియము తొడలు పాదములు అయి యున్నవి

మృత్యుర్యమో హుతాశశ్చ కాలః సంహారవేగవాన్ ।
కాలస్య పరమా యోనిః కాలశ్చాయం సనాతనః ॥ 38

మృత్యువు, యముడు అగ్ని, సంహారము కొఱకైన వేగశాలియగు కాలము కాలము యొక్క పరమ కారణము సనాతన కాలము ఈ మహాదేవుడే అయి యున్నారు

చన్ద్రాదిత్యౌ సనక్షత్రౌ గ్రహాశ్చ సహ వాయునా ।
ధ్రువః సప్తర్షయశ్చైవ భువనాః సప్త ఏవ చ ॥ 39

ప్రధానం మహదవ్యక్తం విశేషాన్తం సవైకృతమ్।
బ్రహ్మాది స్తమ్బ పర్యన్తం భూతాది సదసచ్చ యత్।
అష్టౌ ప్రకృతయశ్చైవ ప్రకృతిభ్యశ్చ యః పరః॥ 40

చంద్రుడు సూర్యుడు నక్షత్రములు గ్రహములు వాయువు, ధ్రువుడు సప్తర్షులు ఏడు లోకములు మూల ప్రకృతి మహాతత్త్వము వికార సహితమును విశేష పర్యంతమును అగు సమస్త తత్త్వము బ్రహ్మదేవుని మొదలుకొని కీటము వఱకు గల సమస్త జగత్తు భూతాదులు సత్తు అసత్తు ఎనిమిది ప్రకృతులు ప్రకృతి కంటె పరమైన పురుషుడు—వీరి యందఱి రూపమున ఈ మహాదేవుడే విరాజమానుడై యున్నారు

అస్య దేవస్య యద్ భాగం కృత్స్నం సమ్పరివర్తతే।
ఏతత్ పరమమానన్దం యత్ తచ్ఛాశ్వతమేవ చ।
ఏషా గతిర్వి రక్తానామేష భావః పరః సతామ్॥ 41

ఈ మహాదేవుని అంశభూతమైన ఏ యీ సంపూర్ణ జగత్తు చక్రమువలె నిరంతరము చలించుచున్నదో అదియు వీరే అయి యున్నారు వీరు పరమానంద స్వరూపులు శాశ్వతబ్రహ్మమున్ను వీరే అయి యున్నారు విరక్తుల గతియు వీరే సజ్జనుల పరమభావమున్ను వీరే అయి యున్నారు

ఏతత్ పదమనుద్విగ్నమేతద్ బ్రహ్మ సనాతనమ్।
శాస్త్రవేదాఙ్గ విదుషామేతద్ ధ్యానం పరం పదమ్॥ 42

ఉద్వేగరహితమగు పరమపదము వీరే సనాతన బ్రహ్మము వీరే శాస్త్రములను వేదాంగములను ఎఱిఁగిన వారికి వీరే ధ్యానింపదగిన పరమపదము అయి యున్నారు

ఇయం సా పరమా కాష్ఠా ఇయం సా పరమా కలా।
ఇయం సా పరమా సిద్ధిరియం సా పరమా గతిః॥ 43
ఇయం సా పరమా శాన్తిరియం సా నిర్వృతిః పరా।
యం ప్రాప్య కృతకృత్యాః స్మ ఇత్యమన్యన్త యోగినః॥ 44

మీరే పరమ కాష్ఠ పరమ కళ పరమ సిద్ధి పరమగతి పరమ శాంతి పరమానందము వీరిని పొంది యోగులు తమ్ములను కృతకృత్యులుగ తలంచుకొనుచున్నారు

ఇయం తుష్టిరియం సిద్ధిరియం శ్రుతిరియం స్మృతిః।
అధ్యాత్మ గతిరిష్టానాం విదుషాం ప్రాప్తిరవ్యయా॥ 45

మహాదేవా! తుష్టి (తృప్తి) సిద్ధి శ్రుతి స్మృతి భక్తుల అధ్యాత్మగతి జ్ఞానుల అక్షయప్రాప్తి (పునరావృత్తి రహిత మోక్షము) మీరే అయియున్నారు

యజతాం కామయానానాం మఖైర్విపుల దక్షిణైః।
యా గతిర్యజ్ఞశీలానాం సా గతిస్త్వం న సంశయః॥ 46

బహు దక్షిణలతో గూడిన యజ్ఞములద్వారా సకామ భావముతో యజనము చేయు యజమానులకు ఏ గతి లభించునో అదియు మీరే అయియున్నారు ఇట సంశయము లేదు

సమ్యగ్ యోగజపైః శాన్తిర్నియమైర్దేహ తాపనైః।
తప్యతాం యా గతిర్దేవ పరమా సా గతిర్భవాన్॥ 47

దేవా! ఉత్తమ యోగ జపములద్వారా మఱియు శరీరమును శుష్కింపచేయు ఉపవాసాది నియమముల ద్వారా ఏ శాన్తి లభించునో తపస్సు చేయువారికి ఏ దివ్యగతి సంప్రాప్తించునో అట్టి పరమగతి మీరే అయియున్నారు

కర్మన్యాసకృతానాం చ విరక్తానాం తతి స్తతః ।
యా గతిర్బ్రహ్మసదనే సా గతి స్త్వం సనాతన ॥ 48

సనాతన దేవా! కర్మ సన్న్యాసులకును, విర క్తులకును బ్రహ్మలోకమున ఏ ఉత్తమగతి సంప్రాప్తించునో అది మీరే అయి యున్నారు

అపునర్భవకామానాం వైరాగ్యే వర్తతాం చ యా ।
ప్రకృతీనాం లయానాం చ సా గతి స్త్వం సనాతన ॥ 49

సనాతన పరమేశ్వరా! మోక్షమును అభిలషించి వైరాగ్య మార్గమున పయనించువారికిని ప్రకృతియందు లయమును పొందు వారికిని ఏ గతి సంప్రాప్తించునో- అది మీరే అయియున్నారు

జ్ఞానవిజ్ఞానయుక్తానాం నిరుపాఖ్యా నిరఞ్జనా ।
కైవల్యా యా గతిర్దేవ పరమా సా గతిర్భవాన్ ॥ 50

దేవా! జ్ఞాన, విజ్ఞానములతో గూడినవారికి నామరహిత మగు ఏ నిరంజన కైవల్యరూప పరమగతి సంప్రాప్తించునో అది మీరే అయి యున్నారు

వేదశాస్త్ర పురాణోక్తాః పఞ్చైతా గతయః స్మృతాః ।
త్వత్ప్రసాదాద్ధి లభ్యన్తే న లభ్యన్తేఽన్యథా విభో ॥ 51

ప్రభూ! వేదశాస్త్రములందు, పురాణములందు ఏ ఈ ఐదు గతులు చెప్పబడి యున్నవో, అవి మీ కృపవలననే కలుగుచున్నవి మఱియొక విధముగ కాదు

ఓమ్

# శివసహస్రనామ స్తోత్రము

## (ఉపమన్యువు)

## (అనుశాసన పర్వము 17 వ అధ్యాయము)

స్థిరః స్థాణుః ప్రభుర్భీమః ప్రవరో వరదో వరః ।
సర్వాత్మా సర్వవిఖ్యాతః సర్వః సర్వకరో భవః ॥ 1

పరమశివుడు నిశ్చలురు సమస్త జగత్తునకు ఆధార స్తంభులు ప్రభువు, భయంకరులు సర్వశ్రేష్ఠులు వరప్రదులు వరణ మొనర్ప దగినవారు (లేక వరస్వరూపులు) సర్వుల ఆత్మ సర్వ విఖ్యాతులు సర్వస్వరూపులు సమస్త ప్రపంచముయొక్క సృష్టికర్త సమస్తము యొక్క ఉత్పత్తికి స్థానము

జటీ చర్మీ శిఖణ్డీ చ సర్వాఙ్గః సర్వభావనః ।
హరశ్చ హరిణాక్షశ్చ సర్వభూతహరః ప్రభుః ॥ 2

జటధారి వ్యాఘ్ర చర్మమును ధరించువారు శిఖను ధరించినవారు సమస్త అవయవములతో కూడినవారు సమస్తము యొక్క ఉత్పాదకులు పాపహరులు లేడి వంటి విశాల నేత్రములు కలవారు సమస్త భూతములను (లయకాలమున) సంహరించువారు సమర్థులగు ఈశ్వరుడు (లేక యజమాని)

ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ నియతః శాశ్వతో ధ్రువః ।
శ్మశానవాసీ భగవాన్ ఖచరో గోచరోఽర్దనః ॥ 3

ప్రవృత్తి మార్గము కలవారు నివృత్తి మార్గము కలవారు నియమ పరాయణులు శాశ్వతులు నిశ్చలురు శ్మశానవాసి, భగ

వంతుడు (ఐశ్వర్యము జ్ఞానము కీర్తి సంపద వైరాగ్యము ధర్మము కలవాడు) ఆకాశమందు సంచరించువారు భూమిపై సంచరించువారు పాపులను బాధించువారు

అభివాద్యో మహాకర్మా తపస్వీ భూతభావనః ।
ఉన్మత్తవేషప్రచ్ఛన్నః సర్వలోక ప్రజాపతిః ॥ 4

నమస్కరింపదగినవారు గొప్ప కార్యములను చేయువారు తపస్వి సంకల్పమాత్రముచే ఆకాశాది భూతములను సృష్టించువారు ఉన్మత్తవేషమున దాగియుండువారు సర్వలోక ప్రజాపాలకులు

మహారూపో మహాకాయో వృషరూపో మహాయశాః ।
మహాత్మా సర్వభూతాత్మా విశ్వరూపో మహాహనుః ॥ 5

మహారూపులు మహాశరీరులు (విరాడ్రూపులు) ధర్మస్వరూపులు, మహాయశస్వి మహాత్ములు సర్వభూతాత్ములు, విశ్వరూపులు, గొప్ప చెక్కిళ్లు కలవారు

లోకపాలోఽన్తర్హితాత్మా ప్రసాదో యహాగర్దభిః ।
పవిత్రం చ మహాంశ్చైవ నియమో నియమాశ్రితః ॥ 6

లోకపాలురు, అదృశ్యస్వరూపులు, ప్రసన్నులు రథారూఢులు పవిత్రులు (శుద్ధవస్తురూపులు) మహత్తరరూపులు, నియమపాలనచే పొందదగినివారు, నియమముల ఆశ్రయభూతులు

సర్వకర్మా స్వయమ్భూత ఆదిరాదికరో నిధిః ।
సహస్రాక్షో విశాలాక్షః సోమో నక్షత్రసాధకః ॥ 7

సమస్త జగత్తు కర్మగలవారు స్వయంభువు (నిత్యసిద్ధులు), సమస్తమునకు ఆది, ఆదిపురుషుడగు హిరణ్యగర్భుని సృష్టించువారు,

అతుల ఐశ్వర్యభండారము వేలకొలది నేత్రములు కలవారు విశాలనేత్రులు చంద్రస్వరూపులు నక్షత్రముల సాధకులు

చన్ద్రః సూర్యః శనిః కేతుర్గ్రహో గ్రహపతిర్వరః ।
అత్రిరత్ర్యా నమస్కర్తా మృగబాణార్పణోఽనఘః ॥ 8

చంద్రుడు సూర్యుడు శని కేతువు గ్రహము గ్రహపాలకులు వరణీయులు అత్రిఋషిస్వరూపులు అత్రిభార్య అనసూయకు (దుర్వాసుని రూపమున) నమస్కరించువారు మృగరూపధారియగు యజ్ఞముపై బాణము వేయువారు పాపరహితులు

మహాతపా ఘోరతపా అదీనో దీనసాధకః ।
సంవత్సరకరో మన్త్రః ప్రమాణం పరమం తపః ॥ 9

మహాతపస్వి ఘోరతపస్సు చేయువారు ఉదారస్వభావులు శరణాగతులగు దీనుల యొక్కయు దుఃఖితుల యొక్కయు మనోరథములను ఈడేర్చువారు సంవత్సర నిర్మాత, మంత్రరూపులు, ప్రమాణస్వరూపులు ఉత్కృష్ట తపస్స్వరూపులు

యోగీ యోజ్యో మహాబీజో మహారేతా మహాబలః ।
సువర్ణరేతాః సర్వజ్ఞః సుబీజో బీజవాహనః ॥ 10

యోగి, మనోయోగము యొక్క ఆశ్రయులు, మహాకారణరూపులు మహావీర్యశాలి మహాబలురు అగ్నిరూపులు సర్వజ్ఞులు ఉత్తమబీజరూపులు, జీవుల సంస్కారరూప బీజములను వహించువారు

దశబాహు స్త్వనిమిషో నీలకణ్ఠ ఉమాపతిః ।
విశ్వరూపః స్వయం శ్రేష్ఠో బలవీరోఽబలో గణః ॥ 11

పది భుజములు కలవారు కనురెప్ప మూయనివారు నీలకంఠులు, పార్వతీపతి, విశ్వరూపులు స్వయంశ్రేష్ఠులు, బలముచే వీరత్వమును ప్రకటించువారు నిర్బల సముదాయరూపులు

గణకర్తా గణపతిర్దిగ్వాసాః కామ ఏవ చ।
మన్త్రవిత్ పరమో మన్త్రః సర్వభావకరో హరః॥ 12

గణములను సంఘటన మొనర్చువారు, ప్రమథగణముల ప్రభువు దిక్కులే వస్త్రములుగ కలవారు కమనీయులు మంత్రవేత్త ఉత్కృష్ట మంత్రరూపులు సమస్త పదార్థములను సృష్టించువారు, హరుడు (దుఃఖమును హరించువాడు)

కమణ్డలు ధరో ధన్వీ బాణహస్తః కపాలవాన్।
అశనీ శతఘ్నీ ఖడ్గీ పట్టిశీ చాయుధీ మహాన్॥ 13

ఒక చేతియందు కమండలువును ధరించినవారు మఱియొక చేతిలో ధనుస్సును ధరించువారు మూడవ చేతిలో బాణమును గ్రహించినవారు నాల్గవ చేతిలో కపాలమును ధరించినవారు ఐదవ చేతియందు వజ్రమును ధరించినవారు ఆఱవ చేతియందు శతఘ్నిని ధరించినవారు ఏడవ చేతియందు ఖడ్గమును ధరించినవారు ఎనిమిదవ చేతియందు పట్టిసమును (ఆయుధ విశేషమును) ధరించినవారు తొమ్మిదవ చేతియందు త్రిశూలమును ధరించినవారు సర్వశ్రేష్ఠులు

స్రువహస్తః సురూపశ్చ తేజస్తేజస్కరో నిధిః।
ఉష్ణీషీ చ సువక్త్రశ్చ ఉదగ్రో వినతస్తథా॥ 14

పదవ చేతియందు స్రువమును ధరించినవారు, సుందరరూపులు తేజస్వి భక్తుల తేజస్సును వృద్ధిచేయు నిధిరూపులు శిరస్సుపై తలపాగ కలవారు సుందరముఖులు ఓజస్వి వినయశీలురు

దీర్ఘశ్చ హరికేశశ్చ సుతీర్థః కృష్ణ ఏవ చ।
శృగాలరూపః సిద్ధార్థో ముణ్డః సర్వ శుభఙ్కరః॥ 15

దీర్ఘరూపులు బ్రహ్మ విష్ణు మహేశ స్వరూపులు త్రయ తీర్థస్వరూపులు కృష్ణుడు(సచ్చిదానంద స్వరూపులు) సర్వముయొక్క రూపమును ధరించువారు ప్రయోజనములన్నియు సిద్ధించినవారు, శివస్వరూపులు సమస్త ప్రాణులకు శుభమును కలుగజేయువారు

అజశ్చ బహురూపశ్చ గన్ధధారీ కపర్ద్యపి।
ఊర్ధ్వరేతా ఊర్ధ్వలిఙ్గ ఊర్ధ్వశాయీ నభఃస్థలః॥ 16

జన్మరహితులు అనేక రూపములను ధరించువారు, సుగంధ పదార్థములను ధరించువారు జటాజూటమును ధరించినవారు ఊర్ధ్వరేతస్కులు ఊర్ధ్వలింగ రూపులు ఆకాశమున శయనించువారు ఆకాశము నివాస స్థానముగ కలవారు

త్రిజటీ చీరవాసాశ్చ రుద్రః సేనాపతిర్విభుః।
అహశ్చరో నక్తంచర స్తిగ్మమన్యుః సువర్చసః॥ 17

మూడు జటలను ధరించినవారు వల్కలవస్త్రమును ధరించువారు రుద్రుడు (దుఃఖమును దూరముగ పారద్రోలువారు) సేనాపతి సర్వవ్యాపి పగటియందు సంచరించువారు రాత్రియందు సంచరించువారు తీక్ష్ణమైన రౌద్రము కలవారు సుందరమగు తేజస్సు కలవారు

గజహా దైత్యహా కాలో లోకధాతా గుణాకరః।
సింహశార్దూలరూపశ్చ ఆర్ద్రచర్మాంబరావృతః॥ 18

గజ రూపధారియగు అసురుని సంహరించినవారు (అంధకాది) దైత్యులను సంహరించినవారు కాలుడు లేక సంవత్సరాది రూపులు సమస్త జగత్తుయొక్క ధారణ పోషణ ఒనర్చువారు షడ్గుణములకు నిలయులు సింహ వ్యాఘ్రాది రూపములను ధరించువారు గజాసురుని తడచిన చర్మమును వస్త్రముగ ధరించినవారు

కాలయోగీ మహానాదః సర్వకామశ్చతుష్పథః ।
నిశాచరః ప్రేతచారీ భూతచారీ మహేశ్వరః ॥ 19

కాలమునుకూడ యోగబలముచే జయించువారు గొప్ప నాదము కావించువారు (లేక అనాహతధ్వని రూపులు), సమస్త కామనలు సంపన్నమైనవారు కర్మ భక్తి యోగాదులను నాలుగు మార్గముల ద్వారా పొందబడు వారు రాత్రియందు సంచరించు వారు ప్రేతములతోకూడ సంచరించువారు భూతములతోకూడ సంచరించువారు మహేశ్వరుడు

బహుభూతో బహుధరః స్వర్భానురమితో గతిః ।
నృత్యప్రియో నిత్యనర్తో నర్తకః సర్వలాలసః ॥ 20

సృష్టికాలమున ఏకమునుండి అనేకముగ అగువారు, అనేక రూపములను ధరించువారు స్వర్భానువు అనంతుడు భక్తులకు ముక్తులకు పొందదగినవారు నృత్యప్రియులు నిరంతరము నృత్యము సలుపువారు నర్తకులు సర్వులపై ప్రేమ కలవారు

ఘోరో మహాతపాః పాశో నిత్యో గిరిరుహో నభః ।
సహస్రహస్తో విజయో వ్యవసాయో హ్యతన్ద్రితః ॥ 21

భయంకర రూపధారి గొప్ప తపస్సు చేయువారు, తన మాయా రూప పాశముచే బంధించువారు నిత్యులు పర్వతముపై నెక్కినవారు ఆకాశమువలె అసంగులు సహస్రహస్తులు విజయులు దృఢ నిశ్చయము కలవారు, అలసత్వము (సోమరితనము) లేనివారు

అధర్షణో ధర్షణాత్మా యజ్ఞహా కామ నాశకః ।
దక్షయాగాపహారీ చ సుసహో మధ్యమ స్తథా ॥ 22

అజేయులు భయరూపులు దక్షుని యజ్ఞమును ధ్వంసమొనర్చినవారు, కామదేవుని నాశమొనర్చినవారు మహా సహనశీలురు, మధ్యస్థులు

తేజోఽపహారీ బలహా ముదితోఽర్థోఽజితోఽవరః ।
గమ్భీరఘోషో గమ్భీరో గమ్భీర బలవాహనః ॥ 23

ఇతరుల తేజమును హరించువారు బలుడను రాక్షసుని సంహరించినవారు ఆనందస్వరూపులు తనకంటె శ్రేష్ఠుడెవ్వడును లేనివారు గంభీరనాదమొనర్చువారు గంభీరులు మహాబలయుక్తమగు వృషభముపై నెడలువారు

న్యగ్రోధరూపో న్యగ్రోధో వృక్షకర్ణ స్థితిర్విభుః ।
సుతీక్ష్ణ దశనశ్చైవ మహాకాయో మహాననః ॥ 24

వటవృక్ష స్వరూపులు వటవృక్ష సమీప నివాసి వటవృక్ష పత్రముపై శయనించు బాలముకుంద రూపులు వివిధ రూపములతో ప్రకటమగువారు మహా తీక్ష్ణములైన దంతములు కలవారు మహా శరీరులు విశాలముఖము కలవారు

విష్వక్సేనో హరిర్యజ్ఞః సంయుగాపీడవాహనః ।
తీక్ష్ణతాపశ్చ హర్యశ్వః సహాయః కర్మకాలవిత్ ॥ 25

దైత్యుల సేనను అన్నివైపుల తరిమివేయువారు హరి (ఆపత్తులను హరించువారు) యజ్ఞరూపుడు యుద్ధమందు బాధారహితమగు వాహనము కలవారు తీక్ష్ణ తాపరూపులు (లేక సూర్యుడు) పచ్చని రంగుగల గుఱ్ఱములతో కూడినవారు ప్రాణులకు సహాయమొనర్చువారు కర్మముల యొక్క కాలమును చక్కగ తెలిసినవారు

విష్ణుప్రసాదితో యజ్ఞః సముద్రో వడవాముఖః ।
హుతాశనసహాయశ్చ ప్రశాన్తాత్మా హుతాశనః ॥ 26

విష్ణువుచే ఆరాధింపబడి ప్రసన్న మొనర్పబడినవారు యజ్ఞ స్వరూపులు సముద్రరూపులు బడబానలరూపులు అగ్ని సఖుడగు వాయువుయొక్క స్వరూపము కలవారు ప్రశాంతచిత్తులు అగ్ని

ఉగ్రతేజా మహాతేజా జన్యో విజయకాలవిత్ ।
జ్యోతిషామయనం సిద్ధిః సర్వవిగ్రహ ఏవ చ ॥ 27

భయంకర తేజము కలవారు మహా తేజము కలవారు, ప్రపంచమును సృష్టించువారు, విజయకాలము నెఱిఁగినవారు, జ్యోతులకు స్థానము సిద్ధి స్వరూపులు సర్వ స్వరూపులు

శిఖీ ముణ్డీ జటీ జ్వాలీ మూర్తిజో మూర్ధగో బలీ ।
వేణవీ పణవీ తాలీ ఖలీ కాలకటం కటః ॥ 28

శిఖాధారియగు గృహస్థుని స్వరూపము కలవారు, శిఖా రహితుడగు సన్న్యాసి జటాధారియగు వానప్రస్థుడు అగ్నిజ్వాల యందు ఆహుతి నొనర్చు బ్రహ్మచారి శరీరరూపమున ప్రకటమగు వారు సహస్రార చక్రమందు ధ్యేయరూపమున విరాజిల్లువారు, బలిష్ఠులు మురళిని వాయించువారు, ప్రణవమను వాద్యమును ప్రయోగించువారు తాళము వేయువారు జగత్తునకు ప్రభువు యమ రాజు యొక్క మాయను కప్పువారు

నక్షత్ర విగ్రహ మతిర్గుణ బుద్ధిర్లయోఽగమః ।
ప్రజాపతిర్విశ్వబాహుర్విభాగః సర్వగోఽముఖః ॥ 29

నక్షత్రాదుల గమనమును ఎఱిఁగినవారు గుణములందు బుద్ధిని లగ్నము చేయువారు ప్రళయస్థాన రూపులు, గమనము

లేనివారు (నిశ్చలురు) ప్రజాపతి అంతట బాహువులు కలవారు, విభాగ స్వరూపులు, సర్వవ్యాపి, ముఖము (ఆకారము) లేనివారు

విమోచనః సుసరణో హిరణ్యకవచోద్భవః ।
మేఢ్రజో బలచారీ చ మహీచారీ స్రుతస్తథా ॥ 30

సంసార బంధనమునుండి విడిపించువారు శ్రేష్ఠ ఆశ్రయ రూపులు హిరణ్యగర్భుని ఉత్పత్తికి స్థానరూపులు మేఢ్రజులు, బలమును సంచార మొనర్చువారు భూమిపై సంచరించువారు అంతటను వ్యాపించి యున్నవారు

సర్వతూర్యనినాదీ చ సర్వాతోద్యపరిగ్రహః ।
వ్యాలరూపో గుహావాసీ గుహో మాలీ తరఙ్గవిత్ ॥ 31

అన్నివిధముల వాద్యములను వాయించువారు వాద్యము లన్నిటిని సంగ్రహ మొనర్చువారు శేషనాగ స్వరూపులు సర్వుల హృదయ గుహాయందు నివసించువార కార్తికేయ స్వరూపులు మాలాధారి క్షుత్పిపాసాదులను ఆఱు ఊర్ములకు (తరంగములకు) సాక్షి

త్రిదశస్త్రికాలధృక్ కర్మసర్వబన్ధ విమోచనః ।
బన్ధనస్త్వసురేన్ద్రాణాం యుధి శత్రువినాశనః ॥ 32

ప్రాణుల జన్మ స్థితి వినాశములను మూడు దశలకు కారణ భూతులు భూత వర్తమాన భవిష్యత్తులను మూడు కాలములను ధరించువారు కర్మలయొక్క సమస్త బంధనములను త్రెంచివేయు వారు అసుర శ్రేష్ఠులను బంధించువారు యుద్ధమందు శత్రువులను వినాశ మొనర్చువారు

సాంఖ్యప్రసాదో దుర్వాసాః సర్వసాధునిషేవితః ।
ప్రస్కన్దనో విభాగజ్ఞోఽతుల్యో యజ్ఞవిభాగవిత్ ॥ 33

సాంఖ్య జ్ఞానముచే ప్రసన్నుడగు వారు రుద్రావతారమగు దుర్వాసముని రూపులు సర్వసాధుసుసేవితులు బ్రహ్మాదులనుకూడ స్థానభ్రష్టు లొనర్ప గలవారు కర్మఫల విభాగమును ఎఱిఁగిన వారు, తులనారహితులు యజ్ఞసంబంధ హవిర్ద్రవ్యముయొక్క విభిన్న భాగములను గూర్చిన జ్ఞానము కలవారు

సర్వవాసః సర్వచారీ దుర్వాసా వాసవోఽమరః ।
హైమో హేమకరోఽయజ్ఞః సర్వధారీ ధరోత్తమః ॥ 34

సర్వత్ర నివసించువారు సర్వత్ర సంచరించువారు అనంతుడగుటచే వస్త్రముచే కప్పబడుట దుర్లభమైనవారు ఇంద్ర స్వరూపులు అమరులు (నాశరహితులు) హిమాలయ స్వరూపుడు సువర్ణముయొక్క ఉత్పాదకుడు కర్మరహితులు సమస్తమును ధరించువారు ధారణ నొనర్చువారిలో శ్రేష్ఠులు (లేక సమస్త బ్రహ్మాండమును ధరించువారు)

లోహితాక్షో మహాక్షశ్చ విజయాక్షో విశారదః ।
సంగ్రహో నిగ్రహః కర్తా సర్పచీర నివాసనః ॥ 35

ఎఱుపు నేత్రములు కలవారు పెద్ద నేత్రములు కలవారు, విజయశీలమగు రథము కలవారు విద్వాంసులు సంగ్రహణ మొనర్చువారు ఉద్దండులకు దండన నొసంగు వారు సమస్త ప్రపంచమునకు కర్త సర్పమయ వస్త్రమును ధరించువారు

ముఖ్యోఽముఖ్యశ్చ దేహశ్చ కాహలిః సర్వకామదః ।
సర్వకాలప్రసాదశ్చ సుబలో బలరూపధృక్ ॥ 36

సర్వకామవరశ్చైవ సర్వదః సర్వతోముఖః ।
ఆకాశనిర్విరూపశ్చ నిపాతీ హ్యవశః ఖగః ॥ 37

ముఖ్యులు వారి కంటె ముఖ్యుడు వేఱొకడు లేనివారు జేహ స్వరూపులు కాహాలమను వాద్య విశేషమును వాయించువారు, కోరిక లన్నిటిని సఫలమొనర్చువారు, సదా దయ చూపువారు, మహా బలిష్ఠులు, బల రూపములకు ఆధారమైనవారు సమస్త ఉత్తమ పదార్థములలో శ్రేష్ఠులు (మోక్ష స్వరూపులు), సమస్తము నొసంగువారు అన్నివైపుల ముఖములు కలవారు ఆకాశమువలె ఎవరి నుండి వివిధ రూపములు ప్రకటమగునో అట్టివారు పాపులను నరకమందు పడద్రోయు వారు తనపైన ఎవరి వశము లేనివారు ఆకాశ గమనము కలవారు

రౌద్రరూపోఽంశురాదిత్యో బహురశ్మిః సువర్చసీ ।
వసువేగో మహావేగో మనోవేగో నిశాచరః ॥ 38

రౌద్ర రూపధారి కిరణ స్వరూపులు అదితి పుత్రరూపులు అనేక కిరణయుక్త సూర్యస్వరూపులు ఉత్తమ తేజస్సుతో కూడినవారు వాయువేగము కలవారు మహా వేగముతో కూడినవారు మనోవేగము కలవారు రాత్రివేళ సంచరించువారు

సర్వవాసీ శ్రియావాసీ ఉపదేశకరోఽకరః ।
మునిరాత్మనిరాలోకః సమ్భగ్నశ్చ సహస్రదః ॥ 39

సమస్త ప్రాణులందు ఆత్మరూపమున నివసించువారు లక్ష్మీసహిత విష్ణుస్వరూపులు జిజ్ఞాసువులకు తత్త్వము నుపదేశించువారు కర్తృత్వాభిమాన రహితులు మననశీలురు దేహాది ఉపాధిని వేఱుగనుంచి ఆలోచించువారు, (భక్తులచే) బాగుగ సేవింపబడువారు వేలకొలది దాన మొసంగువారు

పక్షీ చ పక్షరూపశ్చ అతిదీప్తో విశామ్పతిః ।
ఉన్మాదో మదనఃకామో హ్యశ్వత్థోఽర్థకరో యశః ॥ 40

గరుడ రూపధారి శుక్లపక్ష స్వరూపులు మహా తేజస్వి ప్రజలకు ప్రభువు ప్రేమోన్మత్తులు కామదేవరూపులు రమణీయ విషయ స్వరూపులు సంసారవృక్ష రూపులు ధనాదుల నొసంగు వారు యశస్స్వరూపులు

వామదేవశ్చ వామశ్చ ప్రాగ్ దక్షిణశ్చ వామనః ।
సిద్ధయోగీ మహర్షిశ్చ సిద్ధార్థః సిద్ధసాధకః ॥ 41

వామదేవఋషి స్వరూపులు పాపులకు ప్రతికూలురు సమస్తమునకు ఆది, కుశలురు బలిని బంధించిన వామనరూపధారి సిద్ధయోగి మహర్షి ఆప్తకాముడు సిద్ధసాధక రూపులు

భిక్షుశ్చ భిక్షురూపశ్చ విపణో మృదురవ్యయః ।
మహాసేనో విశాఖశ్చ షష్ఠిభాగో గవాం పతిః ॥ 42

ఆది భిక్షువు భిక్షురూపధారి వ్యవహారమునకు అతీతులు, కోమల స్వభావము కలవారు అవ్యయులు మహాసేనులు కార్తికేయునకు సహాయకులు ప్రభవాది షష్ఠి సంవత్సరరూపులు ఇంద్రియములకు ప్రభువు

వజ్రహస్తశ్చ విష్కమ్భీ చమూస్తమ్భన ఏవ చ ।
వృత్తా వృత్త కరస్తాలో మధుర్మధుకలోచనః ॥ 43

చేతియందు వజ్రమును ధరించిన ఇంద్రునియొక్క స్వరూపులు, విస్తారయుక్తులు దైత్యసేనను స్తబ్ధమొనర్చువారు యుద్ధకార్య నిపుణులు శుద్ధ బ్రహ్మమును ఎఱిఁగినవారు వసంతఋతు రూపులు పింగళ నేత్రములు కలవారు

వాచస్పత్యో వాజసనో నిత్యమాశ్రమపూజితః ।
బ్రహ్మచారీ లోకచారీ సర్వచారీ విచారవిత్ ॥ 44

పురోహితుని కార్య మొనర్చువారు శుక్ల యజుర్వేదము యొక్క మాధ్యందినీశాఖను ప్రవర్తింపజేసినవారు ఆశ్రమముల ద్వారా సదా పూజింపబడువారు, బ్రహ్మచారి, లోకములన్నిటి యందు సంచరించువారు సర్వత్ర సంచరించువారు విచారణ నెఱిగినవారు

ఈశాన ఈశ్వరః కాలో నిశాచారీ పినాకవాన్ ।
నిమిత్తస్థో నిమిత్తం చ నన్దిర్నన్దికరో హరిః ॥ 45

నియంత ఈశ్వరుడు కాలుడు రాత్రియందు (ప్రళయకాల మందు) సంచరించువారు పినాకమను ధనుస్సు కలవారు అంత ర్యామి నిమిత్తకారణ రూపులు జ్ఞానమను సంపద నొసంగు వారు

నన్దీశ్వరశ్చ నన్దీ చ నన్దనో నన్దివర్ధనః ।
భగహారీ నిహన్తా చ కాలో బ్రహ్మా పితామహః ॥ 46

నందీశ్వరుడు నందిగణ స్వరూపులు పరమానందము నొసంగువారు సమృద్ధిని అభివృద్ధి చేయువారు (పాపుల) ఐశ్వర్య మును అపహరించువారు మృత్యురూపమున సర్వులను అంత మొందించువారు అఱువదినాలుగు కళలకు నివాసస్థానము బ్రహ్మ దేవ స్వరూపులు ప్రజాపతికిన్ని తండ్రి

చతుర్ముఖో మహాలిఙ్గశ్చారు లిఙ్గస్తథైవ చ ।
లిఙ్గాధ్యక్షః సురాధ్యక్షో యోగాధ్యక్షో యుగావహః ॥ 47

చతుర్ముఖులు మహాలింగస్వరూపులు రమణీయ వేషధారి, ప్రత్యక్షాది ప్రమాణములకు అధ్యక్షులు దేవతల అధిపతి, యోగ మునకు అధ్యక్షులు, నాలుగు యుగములను నిర్వహించువారు

బీజాధ్యక్షో బీజకర్తా అధ్యాత్మానుగతో బలః ।
ఇతిహాసః సకల్పశ్చ గౌతమోఽథ నిశాకరః ॥ 48

కారణములకు అధ్యక్షులు కారణముల ఉత్పాదకులు, అధ్యాత్మ శాస్త్రమును అనుకరించువారు బలవంతులు ఇతిహాస రూపులు యజ్ఞముల ప్రయోగాదులఁ గూర్చిన మీమాంసాది సమూహము తర్క శాస్త్ర ప్రణేతులగు మునిస్వరూపులు చంద్ర రూపులు

దమ్భో హ్యదమ్భో వైదమ్భో వశ్యో వశకరః కలిః ।
లోకకర్తా పశుపతిర్మహాకర్తా హ్యనౌషధః ॥ 49

శత్రువులను దమన మొనర్చువారు దంభరహితులు దంభ రహితులకు ఆత్మీయులు భక్త పరాధీనులు ఇతరులను వశమందుంచుకొను శక్తి కలవారు కలియుగరూపులు జగత్తును సృజించువారు జీవులకు ప్రభువు పంచ మహాభూతాది సృష్టిని చేయువారు అన్నాది ఓషధుల సేవనము లేనివారు

అక్షరం పరమం బ్రహ్మ బలవచ్ఛక్ర ఏవ చ ।
నీతిర్హ్యనీతిః శుద్ధాత్మా శుద్ధో మాన్యో గతాగతః ॥ 50

అక్షర బ్రహ్మస్వరూపులు పరబ్రహ్మరూపులు శక్తిశాలి ఇంద్రుడు నీతిస్వరూపులు సామభేదాది రహితులు శుద్ధాత్మ, శుద్ధులు సామాన్యులు గమనాగమనరూప సంసార స్వరూపులు

బహుప్రసాదః సుస్వప్నో దర్పణోఽథ త్వమిత్రజిత్ ।
వేదకారో మన్త్రకారో విద్వాన్ సమరమర్దనః ॥ 51

భక్తులపై మహాదయ చూపువారు సుందర స్వప్నయుతులు, అద్దమువలె నిర్మలురు శత్రువులను జయించువారు వేదముల కర్త..

పురోహితుని కార్య మొనర్చువారు శుక్ల యజుర్వేదము యొక్క మాధ్యందినీశాఖను ప్రవర్తింపజేసినవారు ఆశ్రమముల ద్వారా సదా పూజింపబడువారు బ్రహ్మచారి లోకములన్నిటి యందు సంచరించువారు సర్వత్ర సంచరించువారు విచారణ నెఱిఁగినవారు

ఈశాన ఈశ్వరః కాలో నిశాచారీ పినాకవాన్ ।
నిమిత్తస్థో నిమిత్తం చ నన్దిర్నన్దికరో హరిః ॥ 45

నియంత ఈశ్వరుడు, కాలుడు రాత్రియందు (ప్రళయకాల మందు) సంచరించువారు పినాకమను ధనుస్సు కలవారు అంత ర్యామి నిమిత్తకారణ రూపులు జ్ఞానమను సంపద నొసంగు వారు

నన్దీశ్వరశ్చ నన్దీ చ నన్దనో నన్దివర్ధనః ।
భగహారీ నిహన్తా చ కాలో బ్రహ్మా పితామహః ॥ 46

నందీశ్వరుడు నందిగణ స్వరూపులు పరమానందము నొసంగువారు సమృద్ధిని అభివృద్ధి చేయువారు (పాపుల) ఐశ్వర్య మును అపహరించువారు మృత్యురూపమున సర్వులను అంత మొందించువారు అఱువదినాలుగు కళలకు నివాసస్థానము బ్రహ్మ దేవ స్వరూపులు ప్రజాపతికిన్ని తండ్రి

చతుర్ముఖో మహాలిఙ్గశ్చారు లిఙ్గస్తథైవ చ ।
లిఙ్గాధ్యక్షః సురాధ్యక్షో యోగాధ్యక్షో యుగావహః ॥ 47

చతుర్ముఖులు మహాలింగ స్వరూపులు రమణీయ వేషధారి, ప్రత్యక్షాది ప్రమాణములకు అధ్యక్షులు దేవతల అధిపతి, యోగ మునకు అధ్యక్షులు, నాలుగు యుగములను నిర్వహించువారు

బీజాధ్యక్షో బీజకర్తా అధ్యాత్మానుగతో బలః ।
ఇతిహాసః సకల్పశ్చ గౌతమోఽథ నిశాకరః ॥ 48

కారణములకు అధ్యక్షులు కారణముల ఉత్పాదకులు అధ్యాత్మ శాస్త్రమును అనుకరించువారు బలవంతులు ఇతిహాస రూపులు యజ్ఞముల ప్రయోగాదులఁ గూర్చిన మీమాంసాది సమూహము తర్క శాస్త్ర ప్రణేతులగు మునిస్వరూపులు, చంద్ర రూపులు

దమ్భో హ్యదమ్భో వైదమ్భో వశ్యో వశకరః కలిః ।
లోక కర్తా పశుపతిర్మహాకర్తా హ్యనౌషధః ॥ 49

శత్రువులను దమన మొనర్చువారు దంభరహితులు దంభ రహితులకు ఆత్మీయులు భక్త పరాధీనులు ఇతరులను వశమం దుంచుకొను శక్తి కలవారు కలియుగరూపులు జగత్తును సృజించు వారు జీవులకు ప్రభువు పంచ మహాభూతాది సృష్టిని చేయువారు, అన్నాది ఓషధుల సేవనము లేనివారు

అక్షరం పరమం బ్రహ్మ బలవచ్ఛక్ర ఏవ చ ।
నీతిర్హ్యనీతిః శుద్ధాత్మా శుద్ధో మాన్యో గతాగతః ॥ 50

అక్షర బ్రహ్మస్వరూపులు పరబ్రహ్మరూపులు శక్తిశాలి, ఇంద్రుడు నీతిస్వరూపులు సామభేదాది రహితులు శుద్ధాత్మ, శుద్ధులు సామాన్యులు గమనాగమనరూప సంసార స్వరూపులు

బహుప్రసాదః సుస్వప్నో దర్పణోఽథ త్వమిత్రజిత్ ।
వేదకారో మన్త్రకారో విద్వాన్ సమరమర్దనః ॥ 51

భక్తులపై మహాదయ చూపువారు సుందర స్వప్నయుతులు, అద్దమువలె నిర్మలురు శత్రువులను జయించువారు వేదముల కర్త,

మంత్రములను ఆవిష్కరించువారు విద్వాంసులు యుద్ధమందు శత్రువులను సంహారించువారు

**మహామేఘనివాసీ చ మహాఘోరో వశీ కరః ।**
**అగ్నిజ్వాలో మహాజ్వాలో అతిధూమ్రోహుతో హవిః ॥ 52**

ప్రళయకాలిక మహా మేఘములందు నివసించువారు ప్రళయము గావించువారు అందఱిని వశమందుంచుకొనువారు, సంహారకారి, అగ్నిజ్వాలవలె తేజస్సంపన్నులు అగ్నికంటెను గొప్ప తేజము కలవారు కాలాగ్ని రూపమున మహా ధూమ్రవర్ణము కలవారు అగ్నిరూపులు హవనీయ పదార్థ రూపులు

**వృషణః శఙ్కరో నిత్యం వర్చస్వీ ధూమకేతనః ।**
**నీలస్తథాఙ్గలుబ్ధశ్చ శోభనో నిరవగ్రహః ॥ 53**

కర్మఫలమును వర్షింపజేయు ధర్మస్వరూపులు శంకరులు సదా తేజస్సుతో ప్రకాశించువారు అగ్నిస్వరూపులు శ్యామవర్ణయుక్తులగు శ్రీహరి తన అవయవ సౌందర్యమునకు స్వయముగ లుబ్ధుడగువారు, శోభాశాలి ప్రతిబంధ రహితులు

**స్వస్తిదః స్వస్తిభావశ్చ భాగీ భాగకరో లఘుః ।**
**ఉత్సఙ్గశ్చ మహాఙ్గశ్చ మహాగర్భపరాయణః ॥ 54**

కళ్యాణదాయకులు కళ్యాణమయ సత్తారూపులు, యజ్ఞమందు భాగము గైకొనువారు శీఘ్రకారి సంగరహితులు గొప్ప శరీరము కలవారు హిరణ్యగర్భునకు పరమాశ్రయులు

**కృష్ణవర్ణః సువర్ణశ్చ ఇన్ద్రియం సర్వదేహినామ్ ।**
**మహాపాదో మహాహస్తో మహాకాయో మహాయశాః ॥ 55**

శ్యామవర్ణ విష్ణుస్వరూపులు ఉత్తమ వర్ణయుక్తులు, సమస్త ప్రాణుల ఇంద్రియ సమూహరూపులు గొప్ప పాదములు గల

త్రివిక్రమ స్వరూపులు పెద్ద హస్తములు కలవారు విశ్వరూపులు మహా యశస్సు కలవారు

**మహామూర్ధా మహామాత్రో మహానేత్రో నిశాలయః ।**
**మహాన్తకో మహాకర్ణో మహోష్ఠశ్చ మహాహనుః ॥ 56**

గొప్ప శిరస్సు కలవారు మహామాత్రులు (గొప్ప కొలత గలవారు) మహానేత్రులు అవిద్యయొక్క లయస్థానము మృత్యువునకును మృత్యువు వంటివారు గొప్ప చెవులు కలవారు గొప్ప పెదవులు కలవారు గొప్ప చెక్కిళ్ళు కలవారు

**మహానాసో మహాకమ్బుర్మహాగ్రీవః శ్మశానభాక్ ।**
**మహావక్షా మహోరస్కో హ్యన్తరాత్మా మృగాలయః ॥ 57**

గొప్ప నాసిక (ముక్కు) కలవారు గొప్ప కంఠము కలవారు విశాలమగు మెడ కలవారు శ్మశానమునందు సంచరించువారు విశాలమగు వక్షస్థలము కలవారు విశాలమగు ఱొమ్ము కలవారు గొప్ప దంతములు కలవారు గొప్ప జిహ్వ కలవారు గొప్ప ముఖము కలవారు

**లమ్బనో లమ్బితోష్ఠశ్చ మహామాయః పయోనిధిః ।**
**మహాదన్తో మహాదంష్ట్రో మహాజిహ్వో మహాముఖః ॥ 58**

అనేక బ్రహ్మాండముల యొక్క ఆశ్రయము ప్రళయ కాలమున విశ్వమునంతను గ్రసించుటకొఱకై తన నోటిని తెఱచుకొనినవారు మహా మాయావి, క్షీర సాగరరూపులు గొప్ప దంతములు కలవారు గొప్ప దంష్ట్రికములతో గూడినవారు పెద్ద నాలుక కలవారు విశాలమైన ముఖము కలవారు

**మహానఖో మహారోమా మహాకోశో మహాజటః ।**
**ప్రసన్నశ్చ ప్రసాదశ్చ ప్రత్యయో గిరిసాధనః ॥ 59**

పెద్ద గోళ్లు కలవారు గొప్ప రోమములు కలవారు గొప్ప ఉదరము కలవారు గొప్ప జటకలవారు ఆనందమగ్నుడు ప్రసన్న మూర్తి జ్ఞానస్వరూపులు, పర్వతమును యుద్ధసాధనముగ నొనర్చు వారు

స్నేహనోఽ స్నేహనశ్చైవ అజితశ్చ మహామునిః ।
వృక్షాకారో వృక్షకేతు రనలో వాయువాహనః ॥ 60

ప్రాణులయెడల స్నేహము కలవారు ఆసక్తి రహితులు ఎవరిచేతను ఓడింపబడనివారు మహాముని సంసార వృక్ష స్వరూపులు వృక్షము వలె ఎత్తైన ధ్వజము కలవారు అగ్నిస్వరూపులు వాయు వాహనులు

గణ్డలీ మేరుధామా చ దేవాధిపతిరేవ చ ।
అథర్వశీర్షః సామాస్య ఋక్సహస్రామితేక్షణః ॥ 61

పర్వత గుహలందుండువారు మేరు పర్వతము నివాస స్థానముగ కలవారు దేవతలకు ప్రభువు అధర్వవేదము మస్తకముగ కలవారు సామవేదమను ముఖము కలవారు వేలకొలది ఋక్కులు నేత్రములుగ కలవారు

యజుః పాదభుజో గుహ్యః ప్రకాశో జఙ్గమ స్తథా ।
అమోఘార్థః ప్రసాదశ్చ అభిగమ్యః సుదర్శనః ॥ 62

యజుర్వేదము చేతులు కాళ్ళుగ కలవారు, రహస్య స్వరూపులు ప్రకాశ స్వరూపులు కదలువారు వాంఛితములను సఫలమొనర్చువారు శీఘ్రముగ ప్రసన్నులగువారు సులభముగ పొందబడువారు సుందరమైన దర్శనము కలవారు

ఉపకారః ప్రియః సర్వః కనకః కాఞ్చనచ్ఛవిః ।
నాభిర్నన్దికరో భావః పుష్కరస్థపతిః స్థిరః ॥ 63

ఉపకారము చేయువారు ప్రియులు సర్వస్వరూపులు సువర్ణ స్వరూపులు బంగారు కాంతి కలవారు సమస్త లోకముల నాభిస్వరూపులు ఆనందకరులు శ్రద్ధాభక్తి స్వరూపులు బ్రహ్మాండమను పుష్కరమును నిర్మించువారు స్థిరస్వరూపులు

ద్వాదశస్త్రాసనశ్చాద్యో యజ్ఞో యజ్ఞసమాహితః ।
నక్తం కలిశ్చ కాలశ్చ మకరః కాలపూజితః ॥ 64

పదునొకండు రుద్రులకంటె శ్రేష్ఠుడగు పండ్రెండవ రుద్రుడు సంహారకారియగుటచే భయజనకులు సమస్తమునకు ఆదికారణులు, యజ్ఞరూపులు యజ్ఞమందుండు వారు ప్రళయరాత్రి స్వరూపులు కలిస్వరూపులు, కాలరూపులు మకరాకారమగు శింశుమార చక్రరూపులు కాలునిచే పూజితులు

సగణో గణకారశ్చ భూతవాహనసారథిః ।
భస్మశయో భస్మగోప్తా భస్మభూత స్తరుర్గణః ॥ 65

ప్రమథాది గణయుక్తులు భక్తులను తన గణములందు చేర్చువారు త్రిపుర వినాశమునకై సమస్త ప్రాణుల క్షేమమును సిద్ధింపజేయు బ్రహ్మదేవుని సారథిగ నొనర్చినవారు భస్మముపై శయనించువారు, భస్మము ద్వారా రక్షించువారు భస్మస్వరూపులు కల్పవృక్ష స్వరూపులు గణరూపులు

లోకపాల స్తథాలోకో మహాత్మా సర్వపూజితః ।
శుక్ల స్త్రిశుక్లః సమ్పన్నః శుచిర్భూతనిషేవితః ॥ 66

లోకమును పాలించువారు, లోకాతీతులు మహాత్ములు, సర్వ పూజితులు శుద్ధ స్వరూపులు, మనస్సు వాక్కు శరీరము శుద్ధముగ కలవారు సమస్త సంపదలతో కూడినవారు పరమ పవిత్రులు, సమస్త ప్రాణులచే సేవింపబడువారు

ఆశ్రమస్థః క్రియావస్థో విశ్వకర్మమతిర్వరః ।
విశాలశాఖ స్తామ్రోష్ఠో హ్యమ్బుజాలః సునిశ్చలః ॥ 67

నాలుగు ఆశ్రమములందు ధర్మరూపమున ఉన్నవారు యజ్ఞాది క్రియలందు సంలగ్నులు ప్రపంచ నిర్మాణ క్రియయందు కుశలురు శ్రేష్ఠులు విశాల భుజములు కలవారు ఎఱ్ఱని పెదవులు కలవారు జలసమూహ రూపులు మహా నిశ్చలురు

కపిలః కపిశః శుక్ల ఆయుశ్చైవ పరోఽపరః ।
గన్ధర్వో హ్యదితిస్తార్క్ష్యః సువిజ్ఞేయః సుశారదః ॥ 68

కపిలవర్ణము కలవారు కపిశ (పసుపు మిశ్రిత ఎఱుపు) వర్ణము కలవారు శ్వేతవర్ణము కలవారు జీవితరూపులు ప్రాచీనులు అర్వాచీనులు గంధర్వ రూపులు అదితి స్వరూపులు గరుడ రూపులు సులభముగ తెలిసికొనబడు వారు ఉత్తమవాక్కు పలుకు వారు

పరశ్వధాయుధో దేవో అనుకారీ సుబాన్ధవః ।
తుమ్బవీణో మహాక్రోధ ఊర్ధ్వరేతా జలేశయః ॥ 69

పరశురామ స్వరూపులు దేవుడు భక్తులను అనుకరించువారు ఉత్తమ బాంధవ రూపులు తుంబవీణను వాయించువారు, ప్రళయకాలమున మహాక్రోధమును ప్రకట మొనర్చువారు, ఊర్ధ్వరేతస్కులు (విష్ణురూపమున) జలమందు శయనించువారు

ఉగ్రో వంశకరో వంశో వంశనాదో హ్యనిన్దితః ।
సర్వాఙ్గరూపో మాయావీ సుహృదో హ్యనిలోఽనలః ॥ 70

ప్రళయకాలమున భయంకర రూపమును ధరించువారు వంశ ప్రవర్తకులు వంశ స్వరూపులు (శ్రీకృష్ణరూపమున) మురళిని

పాయించువారు, నిందారహితులు సర్వాంగపరిపూర్ణులు మాయను స్వాధీనము చేసికొనినవారు సుహృదులు వాయుస్వరూపులు, అగ్నిస్వరూపులు

బన్ధనో బన్ధకర్తా చ సు బన్ధ న విమోచనః ।
సయజ్ఞారిః సకామారిర్మహాదంష్ట్రో మహాయుధః ॥ 71

స్నేహబంధనమందు బంధించువారు బంధనరూప సంసారము యొక్క నిర్మాత మా యా బంధనమునుండి విముక్తి చేయువారు దక్షయజ్ఞ శత్రువులతో నుండువారు కామవిజయులగు యోగులతో నుండువారు గొప్ప దంతములు కలవారు గొప్ప ఆయుధములు కలవారు

బహుధా నిన్దితః శర్వః శఙ్కరః శఙ్కరోఽధనః ।
అమరేశో మహాదేవో విశ్వదేవః సురారిహా ॥ 72

(దక్షాదులచే) అనేక విధములుగ నిందింపబడిన వారు, ప్రళయకాలమున సమస్తమును సంహరించువారు శంకరులు భక్తులకు ఆనంద మొసంగువారు సాంసారిక ధనరహితులు దేవతలకును ఈశ్వరుడు మహాదేవుడు సమస్త ప్రపంచమునకును ఆరాధ్య దేవుడు దేవ శత్రువులను సంహరించు వారు

అహిర్బుధ్న్యోఽనిలాభశ్చ చేకితానో హవిస్తథా ।
అజైకపాచ్చ కాపాలీ త్రిశంకు రజితః శివః ॥ 73

శేషనాగ స్వరూపులు వాయువేగము కలవారు, మహాజ్ఞానయుక్తులు హవిష్య రూపులు పదునొకండు రుద్రులలో నొకరు కపాల రూపమగు అఖిల బ్రహ్మాండమునకు అధీశ్వరులు త్రిశంకు రూపులు ఎవరిచేతను పరాజితుడు కానివారు శివుడు

ధన్వన్తరిర్ధూమకేతుః స్కన్దో వైశ్రవణస్తథా ।
ధాతా శక్రశ్చ విష్ణుశ్చ మిత్రస్త్వష్టా ధ్రువో ధరః ॥ 74

మహావైద్య ధన్వంతరి రూపులు అగ్నిస్వరూపులు కార్తికేయస్వామి స్వరూపులు కుబేర స్వరూపులు సమస్తమును ధరించువారు ఇంద్ర స్వరూపులు విష్ణు స్వరూపులు మిత్రులు (లేక పంద్రెండుగురు ఆదిత్యులలో నొకరు) ప్రజాపతి విశ్వకర్మ నిశ్చల స్వరూపులు, ఎనిమిది వస్తువులలో ఒకరగు ధరుని స్వరూపము కలవారు

ప్రభావః సర్వగో వాయురర్యమా సవితా రవిః ।
ఉషఙ్గుశ్చ విధాతా చ మాన్ధాతా భూత భావనః ॥ 75

ఉత్కృష్ట భావముతో కూడినవారు సర్వవ్యాపియగు వాయు స్వరూపులు (లేక సూత్రాత్మ) అర్యమ అను ఆదిత్య రూపులు జగత్తునంతటిని ఉత్పన్న మొనర్చువారు సూర్యుడు సర్వదాహక కిరణములుగల సూర్యస్వరూపుడు ప్రాణులను విశేషముగ ధారణ పోషణ నొనర్చువారు జీవుని తృప్తి పఱచువారు ప్రాణులందఱి యొక్క ఉత్పాదకులు

విభుర్వర్ణవిభావీ చ సర్వకామగుణావహః ।
పద్మనాభో మహాగర్భశ్చన్ద్ర వక్త్రోఽనిలో నలః ॥ 76

వివిధ రూపముల వెలయువారు వివిధ వర్ణములను వివిధ రూపములను వ్యక్తమొనర్చువారు సమస్తభోగములను గుణములను కలుగజేయువారు పద్మనాభ విష్ణుస్వరూపులు బ్రహ్మాండమును ఉదరమున ధరించువారు చంద్రుని వంటి సుందరముఖము కలవారు వాయు రూపులు అగ్నిరూపులు

బలవాంశ్చోపశాన్తశ్చ పురాణః పుణ్యచఞ్చురీ ।
కురుకర్తా కురువాసీ కురుభూతో గుణౌషధః ॥ 77

బలవంతులు శాంత స్వరూపులు పురాణ పురుషులు పుణ్యముద్వారా తెలిసికొనబడు వారు దయా స్వరూపులు కురుక్షేత్రముయొక్క నిర్మాత కురుక్షేత్ర స్వరూపులు ఓషధి గుణము కలుగజేయునట్లు జ్ఞాన వైరాగ్యాది గుణములను కలుగజేయువారు

సర్వాశయో దర్భచారీ సర్వేషాం ప్రాణినాం పతిః ।
దేవదేవః సుఖాసక్తః సదసత్సర్వరత్నవిత్ ॥ 78

సర్వులకు ఆశ్రయరూపులు దర్భలపై ఉంచబడు హావిష్యమును భక్షించువారు సమస్త ప్రాణులకు ప్రభువు, దేవదేవులు ఆత్మసుఖాసక్తులు సత్స్వరూపులు అసద్రూప జగత్స్వరూపులు సమస్త రత్నములను ఎఱిగినవారు

కైలాసగిరివాసీ చ హిమవద్గిరి సంశ్రయః ।
కూలహారీ కూలకర్తా బహువిద్యో బహుప్రదః ॥ 79

కైలాసగిరి వాసి హిమవద్గిరి సంశ్రయులు ప్రవాహముచే నదుల తటములను అపహరించువారు పెద్ద పెద్ద సరోవరములను నిర్మించువారు అనేక విద్యలు తెలిసినవారు అధికముగ ఇచ్చువారు

వణిజో వరకీ వృక్షో బకులశ్చన్దనశ్ఛదః ।
సారగ్రీవో మహాజత్రురలోలశ్చ మహౌషధః ॥ 80

వణిజులు సంసారమను వృక్షమును నరికివేయు వారు, సంసార వృక్ష రూపులు వకుళ (పొగడ) వృక్షస్వరూపులు చందన వృక్ష స్వరూపులు తమాల వృక్షరూపులు సుదృఢ కంఠము కల వారు పెద్ద సంధి ఎముకలు కలవారు అచంచలురు మహా ఔషధ స్వరూపులు

**సిద్ధార్థకారీ సిద్ధార్థశ్ఛన్దోవ్యాకరణోత్తరః ।**
**సింహనాదః సింహదంష్ట్రః సింహగః సింహవాహనః ॥ 81**

ఆశ్రితుల మనోరథములను సఫలమొనర్చువారు, ఉత్తమ సిద్ధాంతములు కలవారు సింహనాదమొనర్చువారు సింహము వంటి దృఢమైన దంతములు కలవారు సింహముపై కూర్చుండి వెడలు వారు సింహవాహనులు

**ప్రభావాత్మా జగత్కాలస్థాలో లోకహిత స్తరుః ।**
**సారఙ్గో నవచక్రాఙ్గః కేతుమాలీ సభావనః ॥ 82**

ఉత్కృష్ట సత్తా స్వరూపులు ప్రళయకాలమున జగత్తు యొక్క సంహారమొనర్చు కాలుని స్థానము లోకహితులను తరింపజేయువారు చాతకస్వరూపులు నూతన హంసరూపులు, ధ్వజ పతాకములచే అలంకృతులు ధర్మస్థానము నురక్షించువారు

**భూతాలయో భూతపతిరహోరాత్రమనిన్దితః ॥ 83**

సమస్త ప్రాణికోట్ల యొక్క ఇల్లు సమస్త ప్రాణులకు ప్రభువు దిన రాత్రి స్వరూపులు అనిందితులు

**వాహితా సర్వభూతానాం నిలయశ్చ విభుర్భవః ।**
**అమోఘః సంయతోహ్యశ్వో భోజనః ప్రాణధారణః ॥ 84**

సమస్త ప్రాణులయొక్క భారమును వహించువారు సమస్త ప్రాణులకు నివాస స్థానము సర్వవ్యాప సత్తారూపులు అమోఘ స్వరూపులు సంయమ శీలురు ఉత్తమ అశ్వరూపులు అన్నదాత, సర్వుల ప్రాణములను ధరించువారు

**ధృతిమాన్ మతిమాన్ దక్షః సత్కృతశ్చ యుగాధిపః ।**
**గోపాలిర్గోపతిర్గ్రామో గోచర్మవసనో హరిః ॥ 85**

ధైర్యము కలవారు బుద్ధిమంతులు చతురులు సర్వులచే సత్కరింపబడువారు యుగాధిపులు ఇంద్రియముల పాలకులు గోవుల ప్రభువు సమాహారూపులు గోచర్మమయ వస్త్రమును ధరించువారు, హరి (భక్తుల దుఃఖములను హరించువారు)

హిరణ్యబాహుశ్చ తథా గుహాపాలః ప్రవేశినామ్ ।
ప్రకృష్టారిర్మహాహర్షో జితకామో జితేన్ద్రియః ॥ 86

బంగారు కాంతిగల భుజములచే సుశోభితులు గుహాలందు ప్రవేశించు యోగులయొక్క గుహాలను సంరక్షించువారు శత్రువులను క్షీణింపజేయువారు పరమానంద స్వరూపులు కామవిజయి, జితేంద్రియులు

గాన్ధారశ్చ సువాసశ్చ తపఃసక్తో రతిర్నరః ।
మహాగీతో మహానృత్యో హ్యప్సరోగణసేవితః ॥ 87

గాంధారస్వరరూపులు సుందర స్థానమందు నివసించువారు తపస్సునందు సంలగ్నులు ప్రీతిరూపులు విరాట్పురుషులు వేద శాస్త్రములచే గాన మొనర్పబడిన మాహాత్మ్యము కలవారు, మహానృత్యము చేయువారు అప్సరసలచే సేవింపబడువారు

మహాకేతు ర్మహాధాతు ర్నైకసాను చరశ్చలః ।
ఆవేదనీయ ఆదేశః సర్వగన్ధసుఖావహః ॥ 88

ధర్మరూప మహాధ్వజము కలవారు సువర్ణస్వరూపులు అనేక పర్వత శిఖరములపై సంచరించువారు ఎవరిచేతను చిక్కబడనివారు ప్రార్థింప యోగ్యులు ఆజ్ఞల నిచ్చువారు, గంధాది విషయముల యొక్క సుఖమును పొందింపజేయువారు

తోరణస్తారణో వాతః పరిధీ పతిఖేచరః ।
సంయోగో వర్ధనో వృద్ధో అతివృద్ధో గుణాధికః ॥ 89

మోక్షద్వార స్వరూపులు, తరింపజేయువారు వాయురూపులు బ్రహ్మాండ పరిధిరూపులు ఆకాశచారుల ప్రభువు, ప్రాణుల వృద్ధికి హేతుభూతమగు సంయోగరూపులు, సద్గుణములు వృద్ధి కలవారు, సర్వులకు పురాతనమైన వారు సదుణాధికులు

నిత్య ఆత్మసహాయశ్చ దేవాసురపతిః పతిః ।
యుక్తశ్చ యుక్తబాహుశ్చ దేవో దివి సుపర్వణః ॥ 90

నిత్యము ఆత్మయొక్క సహాయము కావించువారు దేవతలకు అసురులకు ప్రభువు సర్వులకు ప్రభువు భక్తుల ఉద్ధారణాకొఱకై సదా ప్రయత్నశీలుడై యుండువారు సర్వుల రక్షణకొఱకై ఉపయోగించు బాహువులు కలవారు ఇంద్రునియొక్కయు ఆరాధ్య దైవము

ఆషాఢశ్చ సుషాఢశ్చ ధ్రువోఽథ హరిణో హరః ।
వపురావర్తమానేభ్యో వసుశ్రేష్ఠో మహాపథః ॥ 91

భక్తులను సహించు శక్తి నొసంగువారు ఉత్తమ సహనశీలురు నిశ్చలరూపులు శుద్ధస్వరూపులు హరుడు (పాపహారి) స్వర్గలోకము నుండి తిరిగి వచ్చువారికి నూతన దేహ మొసంగువారు, శ్రేష్ఠ ధన (మోక్ష) స్వరూపులు సర్వోత్తమ మార్గస్వరూపులు

శిరోహారీ విమర్శశ్చ సర్వ లక్షణ లక్షితః ।
అక్షశ్చ రథయోగీ చ సర్వయోగీ మహాబలః ॥ 92

వివేకపూర్వకముగ దుష్టుల శిరస్సులను ఛేదించువారు సమస్త శుభలక్షణములతో కూడినవారు రథముతో సంబంధము కలిగియుండువారు ఎల్లప్పుడు యోగయుక్తులు మహాబలసంపన్నులు

**సమామ్నాయోఽ సమామ్నాయ స్తీర్థదేవో మహారథః ।**
**నిర్జీవో జీవనో మన్త్రః శుభాక్షో బహుకర్కశః ॥ 93**

వేదస్వరూపులు, వేదేతరస్మృత్యాదిరూపులు సమస్త తీర్థముల దేవస్వరూపులు గొప్ప రథము కలవారు జడ ప్రపంచ స్వరూపులు జీవనదాత మంత్ర స్వరూపులు మంగళమయ దృష్టి కలవారు సంహార కాలమున మహా కఠోర స్వభావము కలవారు

**రత్నప్రభూతో రత్నాఙ్గో మహార్ణవ నిపానవిత్ ।**
**మూలం విశాలో హ్యమృతో వ్యక్తావ్యక్త స్తపోనిధిః ॥ 94**

అనేక రత్న భండారరూపులు రత్నమయ అవయవములు కలవారు మహా సాగరములను నట్టి నిపానములను (తొట్లను) ఎఱిగినవారు సంసార వృక్షమునకు మూలము విశాలరూపులు అమృత స్వరూపులు సాకార నిరాకార స్వరూపులు తపోనిధి

**ఆరోహణోఽధిరోహశ్చ శీలధారీ మహాయశాః ।**
**సేనాకల్పో మహాకల్పో యోగో యుగకరో హరిః ॥ 95**

పరమపద ద్వార స్వరూపులు పరమపదమున ఆరూఢులు సుశీల సంపన్నులు గొప్ప కీర్తి కలవారు సేనయొక్క ఆభూషణ రూపులు బహుమూల్య అలంకారములచే అలంకృతులు యోగ స్వరూపులు యుగప్రవర్తకులు హరి

**యుగరూపో మహారూపో మహానాగహనోఽ వధః ।**
**న్యాయనిర్వపణః పాదః పణ్డితో హ్యచలోపమః ॥ 96**

యుగరూపులు మహారూపులు గజాసురుని సంహరించినవారు, వధింపబడనివారు (మృత్యురహితులు) న్యాయోచితమగు దానము చేయువారు శరణయోగ్యులు జ్ఞాని, పర్వతము వలె నిశ్చలుడు

బహుమాలో మహామాలః శశీ హర సులోచనః ।
విస్తారో లవణః కూపస్త్రియుగః సఫలోదయః ॥ 97

అనేక మాలలను ధరించినవారు మహా మాలలను ధరించు వారు చంద్రుని వలె సౌమ్యమైన దృష్టి కలవారు విశాల లవణ సముద్ర రూపులు త్రియుగ స్వరూపులు సఫలమైన అవతారోద యము కలవారు

త్రిలోచనో విషణ్ణాఙ్గో మణివిద్ధో జటాధరః ।
బిన్దుర్విసర్గః సుముఖః శరః సర్వాయుధః సహః । 98

త్రినేత్రులు అంగరహితులు (నిరాకారులు) మణి యొక్క కుండలమును ధరించుటకై కుట్టబడిన చెవులు కలవారు జటాధరులు బిందుస్వరూపులు త్యాగరూపులు సు దర ముఖులు బాణ రూపులు సర్వాయుధములు కలవారు సహనశీలురు

నివేదనః సుఖాజాతః సుగన్ధారో మహాధనుః ।
గన్ధపాలీ చ భగవానుత్థానః సర్వ కర్మణామ్ ॥ 99

వృత్తిరహితమగు జ్ఞానము కలవారు వృత్తు లన్నియు లయింప సుఖరూపమున ప్రకటమగువారు ఉత్తమ గంధయుక్తులు, గొప్ప ధనుస్సును ధరించినవారు ఉత్తమ గ ధము ను (సుగుణ మును) రక్షించు భగవంతుడు సమస్త కర్మల యొక్క ఉత్థాన స్థానము

మన్థానో బహులో వాయుః సకలః సర్వలోచనః ।
తలస్తాలః కరస్థాలీ ఊర్ధ్వసంహననో మహాన్ ॥ 100

విశ్వమును మథించుటలో సమర్థులు ప్రళయ కాల మహా వాయు స్వరూపులు సమస్త కళలతో కూడినవారు సమస్తము నకు ద్రష్ట చేతితో తాళము వేయువారు, చేతులను భోజన

పాత్రగ నుపయోగించువారు సుదృఢ శరీరము కలవారు చాల గొప్పవారు

ఛత్రం సుచ్ఛత్రో విఖ్యాతో లోకః సర్వాశ్రయః క్రమః ।
ముణ్డో విరూపో వికృతో దణ్డీ కుణ్డీ వికుర్వణః ॥ 101

గొడుగువలె పాప తాపములనుండి సురక్షితముగ కాపాడు వారు ఉత్తమ ఛత్రస్వరూపులు సుప్రసిద్ధలోకస్వరూపులు సర్వుల యొక్క ఆధారభూతమైన గతి ముండిత శిరస్సు గలవారు వికట స్వరూపులు విపరీత క్రియలను గల్గియుండువారు దండధారి కుండి క్రియద్వారా అలభ్యులు

హర్యక్షః కకుభో వజ్రీ శతజిహ్వః సహస్రపాత్ ।
సహస్రమూర్ధా దేవేన్ద్రః సర్వదేవమయో గురుః ॥ 102

సింహస్వరూపులు సమస్త దిక్స్వరూపులు వజ్రధారి వందల కొలది నాలుకలు కలవారు వేలకొలది పాదములు శిరస్సులు కలవారు దేవేంద్రుడు సర్వ దేవమయులు గురువు

సహస్ర బాహుః సర్వాఙ్గః శరణ్యః సర్వలోకకృత్ ।
పవిత్రం త్రికకున్మన్త్రం కనిష్ఠః కృష్ణ పిఙ్గలః ॥ 103

వేలకొలది భుజము లు కలవారు సర్వాంగసంపన్నులు శర ణ్యులు సమస్త లోకములను సృష్టించువారు పరమ పవిత్రులు త్రిపదా గాయత్రీరూపులు అదితిపుత్రులలో చిన్నవారు (లేక వామన రూపధారి యగు విష్ణువు) శ్యామగౌరవర్ణ హరిహర మూర్తి

బ్రహ్మదణ్డ వినిర్మాతా శతఘ్నీపాశ శక్తిమాన్ ।
పద్మగర్భో మహాగర్భో బ్రహ్మగర్భో జలోద్భవః ॥ 104

బ్రహ్మాదండమును నిర్మించువారు, శతఘ్ని పాశముల యొక్క శక్తికలవారు బ్రహ్మదేవుని స్వరూపులు జగద్రూప గర్భము కలవారు వేదములను ఉదరమున గలవారు ఏకార్ణవ జలమందు ప్రకటమగువారు

గభస్తిర్బ్రహ్మకృద్ బ్రహ్మీ బ్రహ్మవిద్ బ్రాహ్మణో గతిః ।
అనన్తరూపో నైకాత్మా తిగ్మతేజాః స్వయమ్భువః ॥ 105

సూర్యస్వరూపులు వేదములను ఆవిష్కరించువారు వేదాధ్యాయి బ్రహ్మనిష్ఠుల పరమగతి అనంతరూపులు అనేక శరీర ధారి బ్రహ్మదేవుని కంటెను ప్రచండమైన తేజస్సు కలవారు

ఊర్ధ్వగాత్మా పశుపతి ర్వాతరంహా మనోజవః ।
చన్దనీ పద్మనాలాగ్రః సురభ్యుత్తరణో నరః ॥ 106

దేశకాల వస్తురూప ఉపాధికంటె అతీతమైన స్వరూపము కలవారు జీవుల ప్రభువు వాయువుకంటె వేగము కలవారు మనో వేగము కలవారు చందనము పూయబడిన అవయవములు కలవారు, పద్మనాళము యొక్క మూలస్వరూపులు (లేక విష్ణుస్వరూపులు) సురభిని క్రిందకు త్రోయువారు (అత్యంత మనోహరులు) నరరూపులు

కర్ణికారమహాస్రగ్వీ నీలమౌలిః పినాకధృత్ ।
ఉమాపతిరుమాకాన్తో జాహ్నవీధృదుమాధవః ॥ 107

కర్ణికార పుష్ప మహామాలను ధరించువారు శిరస్సుపై నీలమణియుయు మకుటమును ధరించువారు పినాకమను ధనుస్సును ధరించువారు బ్రహ్మవిద్యకు ప్రభువు పార్వతీ ప్రియతములు, గంగను శిరస్సుపై ధరించువారు పార్వతీపతి

**శ్రేష్ఠో వరాహో వరదో వరేణ్యః సుమహాస్వనః ।**
**మహాప్రసాదో దమనః శత్రుహా శ్వేతపిఙ్గలః ॥ 108**

శ్రేష్ఠవరాహ రూపధారి వరప్రదులు శ్రేష్ఠులు గొప్ప స్వరము కలవాడు దుష్టులను దమన మొనర్చువాడు శత్రువులను నశింప జేయువాడు అర్ధ నారీశ్వర రూపమందు శ్వేతపింగళ వర్ణము కలవారు

**పీతాత్మా పరమాత్మా చ ప్రయతాత్మా ప్రధానధృత్ ।**
**సర్వ పార్శ్వముఖస్త్ర్యక్షో ధర్మసాధారణో వరః ॥ 109**

హిరణ్మయ స్వరూపులు పరమాత్మ విశుద్ధచిత్తులు జగత్తునకు కారణభూతమైన త్రిగుణమయ ప్రధానము యొక్క అధిష్ఠాన రూపులు సమస్త దిక్కులవైపు ముఖము కలవారు ధర్మపాలనానుసారము వర మొసంగువారు

**చరాచరాత్మా సూక్ష్మాత్మా అమృతో గోవృషేశ్వరః ।**
**సాధ్యర్షిర్వసురాదిత్యో వివస్వాన్ సవితామృతః ॥ 110**

చరాచర ప్రాణుల ఆత్మ అతి సూక్ష్మరూపులు నిష్కామ ధర్మమునకు ప్రభువు సాధ్య దేవతల ఆచార్యులు అదితి కుమారుడగు వసువు కిరణములచే సుశోభితుడగు అమృత స్వరూపుడైన సూర్యుడు

**వ్యాసః సర్గః సుసంక్షేపో విస్తరః పర్యయో నరః ।**
**ఋతుః సంవత్సరో మాసః పక్షః సంఖ్యా సమాపనః ॥ 111**

వేదవ్యాస స్వరూపులు సంక్షిప్త విస్తృత సృష్టి స్వరూపులు ఋతువు సంవత్సరము మాస రూపులు పక్ష రూపులు తిథి సంఖ్యను సమాప్త మొనర్చు సంక్రాంత్యాది పర్వ రూపులు

కలాః కాష్ఠా లవా మాత్రా ముహూర్తాహః క్షపాః క్షణాః ।
విశ్వక్షేత్రం ప్రజాబీజం లిఙ్గమాద్యస్తు నిర్గమః ॥ 112

కళా రూపులు కాష్ఠా రూపులు లవా (కాల) రూపులు, కాలావయవ స్వరూపులు ముహూర్త దిన రాత్రి స్వరూపులు, క్షణ రూపులు బ్రహ్మాండమను వృక్షమునకు ఆధారము, ప్రజల యొక్క కారణ రూపులు మహత్తత్త్వ స్వరూపులు అందఱికంటె ముందు ప్రకటమైనవారు

సదసద్ వ్యక్తమవ్యక్తం పితా మాతా పితామహః ।
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్ ॥ 113

సద్రూపులు అసజ్జగద్రూపులు సాకారరూపులు నిరాకార రూపులు తండ్రి తల్లి తాత స్వర్గద్వార రూపులు ప్రజలకు కారణభూతులు మోక్షద్వార రూపులు స్వర్గ రూపులు

నిర్వాణం హ్లాదనశ్చైవ బ్రహ్మలోకః పరా గతిః ।
దేవాసుర వినిర్మాతా దేవాసుర పరాయణః ॥ 114

మోక్ష స్వరూపులు ఆనంద మొసంగువారు, బ్రహ్మలోక స్వరూపులు సర్వోత్కృష్ట గతి స్వరూపులు దేవతల యొక్క అసురులయొక్క జన్మదాత దేవతల అసురుల పరమ ఆశ్రయులు

దేవాసుర గురుర్దేవో దేవాసుర నమస్కృతః ।
దేవాసుర మహామాత్రో దేవాసుర గణాశ్రయః ॥ 115

దేవాసురుల గురువు దేవుడు దేవాసుర నమస్కృతులు, దేవతలకంటె అసురులకంటె మహాశ్రేష్ఠులు దేవతలను అసురులును ఆశ్రయింప దగినవారు

దేవాసుర గణాధ్యక్షో దేవాసుర గణాగ్రణీః ।
దేవాతిదేవో దేవర్షిదేవాసుర వరప్రదః ॥ 116

దేవతల అసురుల అధ్యక్షులు దేవతల కంటె అసురుల కంటె గొప్పవారు దేవతల కంటె గొప్ప దేవుడు దేవర్షి దేవాసుర వరప్రదులు

దేవాసురేశ్వరో విశ్వో దేవాసుర మహేశ్వరః ।
సర్వదేవమయోఽచిన్త్యో దేవతాత్మాఽఽత్మ సమ్భవః ॥ 117

దేవతలకు అసురులకు ఈశ్వరుడు విశ్వరూపులు దేవతలకు అసురులకు మహేశ్వరుడు సర్వదేవ మయులు దేవతల అంతరాత్మ స్వాయంభువు

ఉద్భిత్ త్రివిక్రమో వైద్యో విరజో నీరజోఽమరః ।
ఈడ్యో హస్తీశ్వరో వ్యాఘ్రో దేవసింహో నరర్షభః ॥ 118

వృక్షాది స్వరూపులు త్రివిక్రముడు (వామనుడు) వైద్య స్వరూపులు రజోగుణ రహితులు నిర్మలురు మరణము (నాశము) లేనివారు స్తుతింప యోగ్యులు ఇంద్ర స్వరూపులు వ్యాఘ్ర రూపులు దేవతలలో సింహమువలె పరాక్రమ వంతులు, మనుజులలో శ్రేష్ఠులు

విబుధోఽగ్రవరః సూక్ష్మః సర్వదేవ స్తపో మయః ।
సుయుక్తః శోభనో వజ్రీప్రాసానాం ప్రభవోఽవ్యయః ॥ 119

మహాజ్ఞాని యజ్ఞమందు ప్రథమభాగము గైకొనుటకు అధికారి సూక్ష్మ రూపులు సర్వదేవ స్వరూపులు తపోమయులు, భక్తులను రక్షించుటకై సర్వ విధముల సావధానులై యుండువారు, మంగళ స్వరూపులు వజ్రాయుధము ధరించువారు, ప్రాసమను అస్త్రముయొక్క ఉత్పత్తి స్థానము అవ్యయులు

గుహః కాన్తో నిజః సర్గః పవిత్రం సర్వపావనః ।
శృఙ్గీ శృఙ్గప్రియో బభ్రూ రాజరాజో నిరామయః ॥ 120

కార్తికేయ స్వరూపులు, మహానంద రూపులు, సృష్టికి అభిన్నులు పరమ పవిత్రులు శృంగియను వాద్యమును తనయొద్ద నుంచుకొనువారు పర్వత శిఖరమును ప్రియముగ తలంచువారు, విష్ణు స్వరూపులు రాజరాజు నిరామయులు (దోషరహితులు)

**అభిరామః సురగణో విరామః సర్వసాధనః ।**
**లలాటాక్షో విశ్వదేవో హరిణో బ్రహ్మవర్చసః ॥ 121**

ఆనంద దాయకులు దేవసమూహ రూపులు అన్నిటి నుండి ఉపరతిని పొందినవారు అన్ని సాధనల చేతను సాధ్యులు లలాటమందు మూడవ నేత్రము కలవారు సమస్తవిశ్వమునకు దేవుడు మృగరూపులు బ్రహ్మతేజ సంపన్నులు

**స్థావరాణాం పతిశ్చైవ నియమేన్ద్రియ వర్ధనః ।**
**సిద్ధార్థః సిద్ధ భూతార్థోఽచిన్త్యః సత్యవ్రతః శుచిః ॥ 122**

హిమాచలాది రూపులు నియమములచే మనస్సహిత ఇంద్రియములను దమన మొనర్చువారు ఆప్తకాములు (అభీష్టములు నెరవేరినవారు) సిద్ధించిన సమస్త ప్రయోజనములు కలవారు, మనస్సుయొక్క సంకల్పమునకు పరమైయుండువారు సత్యవ్రతులు, శుద్ధులు

**వ్రతాధిపః పరంబ్రహ్మ భక్తానాం పరమా గతిః ।**
**విముక్తో ముక్త తేజాశ్చ శ్రీమాఞ్ఛ్రీవర్ధనో జగత్ ॥ 123**

వ్రతములకు అధిపతి సర్వశ్రేష్ఠులు సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపులు భక్తులకు పరమ గతి విముక్తులు శత్రువులపై తన తేజస్సును వదలువారు యోగైశ్వర్య సంపన్నులు భక్తుల సంపదలను వృద్ధి చేయువారు జగత్స్వరూపులు

**శివమేభిః స్తువన్ దేవం నామభిః పుష్టివర్ధనైః ।**
**నిత్యయుక్తః శుచిర్భూత్వా ప్రాప్నోత్యాత్మాన మాత్మనా ॥ 184**

ఎవడు సదా యోగయుక్తుడై పవిత్రభావముతో ఈ పుష్టి వర్ధకములగు ఈ నామముల ద్వారా శివుని స్తుతించునో అట్టి భక్తుడు పరమాత్మయగు ఆ శివుని స్వయముగనే పొందుచున్నాడు.

ఓమ్

ఓం

# విష్ణు సహస్రనామ స్తోత్రము

## (భీష్ముడు)

## (అనుశాసన పర్వము 139వ అధ్యాయము)

**ఓం విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్య భవత్ప్రభుః ।**
**భూతకృద్ భూతభృద్ భావో భూతాత్మా భూతభావనః ॥ 1**

సచ్చిదానంద స్వరూపులు విరాట్స్వరూపులు సర్వవ్యాపి ఎవరి నుద్దేశించి యజ్ఞమందు వషట్క్రియ కావింపబడుచున్నదో అట్టివారు (యజ్ఞ స్వరూపులు) భూత వర్తమాన భవిష్యత్తుల ప్రభువు సమస్త ప్రాణులను సృజించువారు సమస్త ప్రాణులను పోషించువారు, స్వతః ఉత్పన్నమగువారు ప్రాణుల ఆత్మ ప్రాణుల ఉత్పత్తి వృద్ధిని కావించువారు

**పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః ।**
**అవ్యయః పురుషః శ్రీమాన్ సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ ॥ 2**

పవిత్రాత్మ పరమాత్మ ముక్తుల పరమగతి అవ్యయులు, శరీరమందు శయనించువారు, సాక్షి క్షేత్రజ్ఞుడు అక్షరుడు

యోగో యోగవిదాం నేతా ప్రధాన పురుషేశ్వరః ।
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥ 3

ఇంద్రియ నిరోధరూప యోగముచే పొందబడువారు, యోగవేత్తల ప్రభువు ప్రకృతి పురుషులకు ప్రభువు నరసింహ రూపులు వక్షస్థలమందు లక్ష్మిని ధరించువారు (లేక ఐశ్వర్య యుక్తులు) కేశవుడు (క=బ్రహ్మ అ=విష్ణువు ఈశ-మహాదేవుడు—ఈ ప్రకారముగ కేశవుడనగా త్రిమూర్తి స్వరూపుడు) పురుషోత్తముడు

సర్వః శర్వః శివః స్థాణుర్భూతాదిర్నిధిరవ్యయః ।
సమ్భవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥ 4

సర్వరూపులు సమస్తమును ప్రళయకాలమందు సంహారించువారు శివుడు, స్థిరుడు భూతములకు ఆదికారణుడు నాశరహిత స్థానరూపులు, తన ఇచ్ఛచే లెస్సగ ప్రకటమగువారు సమస్త భోక్తల ఫలములను ఉత్పన్న మొనర్చువారు సమస్తమును భరించువారు దివ్యజన్మ కలవారు ప్రభువు, ఈశ్వరుడు

స్వయమ్భూః శమ్భురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః ॥ 5

స్వాయంభువు శంభువు ఆదిత్యుడు కమలనేత్రుడు, వేద ఘోష కలవారు, జన్మమృత్యు రహితులు విశ్వమును ధారణ మొనర్చువారు కర్మ తత్ఫలముల యొక్క రచన చేయువారు, సమస్త ప్రపంచమును ధారణ మొనర్చు ఉత్తములు

6 అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽమరప్రభుః
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః

అప్రమేయుఁడు (ప్రమాణాదులచే తెలియఁబడనివాఁడు) హృషీకేశుఁడు (ఇంద్రియములకు ప్రభువు) పద్మనాభుఁడు దేవతల ప్రభువు విశ్వమును రచించువాఁడు మనువు సంహారకాలమున ప్రాణులను కృశింపఁజేయువాఁడు అత్యంత స్థూలరూపులు అతి ప్రాచీనులు [illegible]

7 అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః
ప్రభూతస్త్రికకుద్ధామ పవిత్రం మఙ్గలం పరమ్

అగ్రాహ్యుఁడు శాశ్వతుఁడు కృష్ణుఁడు, జ్ఞాన ఐశ్వర్యాదిగుణ సంపన్నుఁడు ఊర్ధ్వాధోమధ్యములను నాలుగుదిక్కులకు ఆశ్రయభూతుఁడు సర్వులను పవిత్ర మొనర్చువారు మహామంగళ స్వరూపులు

8 ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదన

సమస్తప్రాణుల నియంత, ప్రాణప్రదులు, ప్రాణరూపులు జ్యేష్ఠులు శ్రేష్ఠులు ప్రజాపతి హిరణ్యగర్భుఁడు భూమితనయందు కలవాఁడు మాధవుఁడు (లక్ష్మీపతి) మధుసూదనుఁడు (మధువను రాక్షసుని సంహరించినవాఁడు)

9 ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్

ఈశ్వరుఁడు పరాక్రమశీలురు ధనుస్సు కలవారు మేధావి గరుడపక్షి ద్వారా గమనము సలుపువారు క్రమమునకు కారణ

భూతులు సర్వోత్తములు ఎవరిచేతను తిరస్కరింపఁబడనివారు కృతజ్ఞులు ప్రయత్నమునకు ఆధారభూతులు ఆత్మవంతులు (తన మహామయం దున్నవారు)

**10 సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః**
**అహః సంవత్సరో వ్యాలః ప్రత్యయః సర్వదర్శనః**

దేవతలకు ప్రభువు శరణ్యులు పరమానందస్వరూపులు విశ్వమునకు కారణభూతులు కాలరూపవ నున్నవారు శేషనాగస్వరూపులు ఉత్తమబుద్ధిచే తెలిసికొనఁబడువారు అందఱి యొక్క ద్రష్ట

**11 అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాది రచ్యుతః**
**వృషాకపి రమేయాత్మా సర్వయోగవినిస్సృతః**

జన్మరహితులు సర్వేశ్వరుఁడు సిద్ధుఁడు, సిద్ధిరూపులు, సర్వులకు ఆదిస్వరూపులు అచ్యుతుఁడు (తన స్వరూపస్థానమునుండి జాఱనివాఁడు) ధర్మరూపులు అప్రమేయ స్వరూపులు వివిధ శాస్త్రసాధనలచే తెలియఁబడువారు

**12 వసుర్వసుమనా స్సత్యః సమాత్మా సమ్మిత స్సమః**
**అమోఘః పుణ్డరీకాక్షో వృషకర్మా వృషాకృతిః**

సమస్తప్రాణుల నివాసస్థానము ఉదారమనస్సు కలవారు సత్యస్వరూపులు సమస్తప్రాణులందు ఆత్మరూపమున సమముగ నుండువారు సమస్త పదార్థములచే కొలువఁబడఁజాలనివారు సమస్వరూపులు భక్తులుచేయు పూజాదులకు ఫలప్రదానము చేయువారు కమలనేత్రులు ధర్మస్థాపనకొఱకై శరీరమును ధరించువారు

**13 రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోనిః శుచిశ్రవాః**
**అమృత శ్శాశ్వత స్థాణు ర్వరారోహో మహాతపాః**

సహస్రాక్షః అనేక శిరస్సులు కలవారు లోకములను భరించు వారు జగత్తును ఉత్పన్నము చేయువారు పవిత్ర కీర్తికలవారు అప్రతిష్ఠితులు (ఎప్పుడు మరణించనివారు) నిత్యము స్థిర ముగ నుండువారు పొందునట్టి ఉత్తమ పునరావృత్తిరహిత స్థాన రూపులు గొప్ప తపస్సు కలవారు

**14 సర్వగ స్సర్వవిద్భాను ర్విష్వక్సేనో జనార్దనః**
**వేదో వేదవిదవ్యఙ్గో వేదాఙ్గో వేదవిత్ కవి**

సర్వత్ర వ్యాపించియుండువారు అంతయు తెలిసికొను ప్రకాశస్వరూపులు విష్వక్సేనుడు (దైత్యసేనను చెల్లాచెదరు చేయువారు) జనార్దనుడు (భక్తులచే పరమ పురుషార్థము యాచింపబడువారు) వేదరూపులు వేదవేత్త పరిపూర్ణులు వేదాంగరూపులు వేదములను తెలిసినవారు కవి

**15 లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృత**
**చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః**

లోకాధ్యక్షులు దేవతలకు అధ్యక్షులు, ధర్మాధ్యక్షులు కార్యరూపముచే కృతులు కారణరూపముచే అకృతులు బ్రహ్మ దేవుడు విష్ణువు మహేశ్వరుడు నిరాకారబ్రహ్మము — అను నాలుగు రూపములు కలవారు ఉత్పత్తి స్థితి నాశము, రక్షణ ము నాలుగు వ్యూహములు కలవారు నాలుగు దంతములు కల నరసింహరూపులు నాలుగు చేతులు కలవారు

**16 భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః**
**అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసు**

ఏకరస ప్రకాశస్వరూపులు భోజనము (లౌకిక జ్ఞానులచే అను భవింపబడు అమృతస్వరూపులు) భోక్త, సహనశీలురు జగదాది

యందు హిరణ్యగర్భరూపమున స్వయముగ ఉత్పన్నమగువారు పాపరహితులు విజయులు, సమస్త ప్రాణులను జయించువారు విశ్వమునకు కారణరూపులు అవతార శరీరములందు మరల మరల నివసించువారు

**17 ఉపేన్ద్రో వామనః ప్రాంశు రమోఘ శ్శుచిరూర్జితః**
**అతీన్ద్రః సంగ్రహ స్సర్గో ధృతాత్మా నియమో యమః**

ఉపేంద్రుడు వామనుడు ముల్లోకములు దాటుటకై త్రివిక్రమరూపముతో పెరుగువారు వ్యర్థము కాని చేష్టలవారు శుచిస్వరూపులు మహాబలశాలి అతీంద్రులు (ఇంద్రునికంటెను గొప్పవారు), ప్రళయకాలమున సమస్తమును సంగ్రహించువారు సృష్టి యొక్క కారణరూపులు జన్మాదిరహితులై స్వేచ్ఛగ స్వరూపమును ధరించువారు, ప్రజలను వారి వారి అధికారములందు నియమించువారు, యముడు (నియమమున మెలగువారు)

**18 వేద్యో వైద్య స్సదాయోగీ వీరహా మాధవో మధుః**
**అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః**

వేద్యులు (తెలియదగినవారు) విద్యలన్నిటిని ఎఱుగువారు సదా యోగమందుండువారు ధర్మరక్షణకొరకై అసుర వీరులను సంహరించువారు మాధవుడు (విద్యయొక్క ప్రభువు) అమృతమువలె నరులను ప్రసన్నులొనర్చువారు ఇంద్రియాతీతులు మహామాయావి (మాయావులపైకూడ మాయను ప్రయోగించువారు) మహోత్సాహులు మహాబలశాలి

**19 మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః**
**అనిర్దేశ్యవపుః శ్రీమా నమేయాత్మా మహాద్రిధృక్**

గొప్ప బుద్ధిమంతులు గొప్ప పరాక్రమశీలురు మహాశక్తిమంతులు మహాకాంతిమంతులు అవర్ణనీయులు శ్రీమంతులు ఊహింపరాని ఆత్మస్వరూపులు మందర గోవర్ధన పర్వతములను ధారణ నొనర్చినవారు

**20 మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాంగతిః**
**అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః**

గొప్ప ధనుస్సుకలవారు భూమిని ధారణ ఒనర్చువారు తన వక్షఃస్థలమున లక్ష్మీదేవికి నివాసము నొసంగినవారు సజ్జనులకు పరమాశ్రయులు ఎవనిచేతను అడ్డగింపబడనివారు దేవతలకు ఆనందమును కలుగజేయువారు గోవిందులు (వేదవాక్కుల ద్వారా జ్ఞానము పొందింప జేసెడువారు), వేదవాక్కులను తెలిసినవారికి ప్రభువు

**21 మరీచిర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః,**
**హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః**

మహాతేజస్స్వరూపులు దుష్టులను దమన మొనర్చువారు (బ్రహ్మదేవునకు వేదజ్ఞానము బోధించువారు) హంసరూపమును ధరించువారు గరుడస్వరూపులు శేషనాగస్వరూపులు బంగారము వలె రమణీయమగు నాభి గలవారు గొప్ప తపస్సు నాచరించినవారు పద్మనాభుడు ప్రజాపతి

**22 అమృత్యుః సర్వదృక్ సింహః సంధాతా సంధిమాన్**

**అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా**

మృత్యురహితులు సమస్తమును చూచువారు, సింహస్వరూపులు (లేక దుష్టులను నశింప జేయువారు) ప్రాణులను వారి

వారి కర్మఫలములతో సంయుక్తము చేయుచున్నవారు సమస్త యజ్ఞముల ఫలమును అనుభవించువారు స్థిరరూపులు సుగ్రీవాదులను దూరముగ పారద్రోలువారు ఎవనిచేతను సంకల్ప శక్యముకాని బలపరాక్రమములు కలవారు సకలులపై శాసనము చేయువారు వేదశాస్త్రముల దుర్లక్ష్యమైన స్వరూపము కలవారు దేవ శత్రువులను సంహరించువారు

**23 గురు ర్గురుతమో ధామ సత్యః సత్యపరాక్రమః**
**నిమిషోఽనిమిషః స్రగ్వీ వాచస్పతి రుదారధీః**

గురువు గురువర్యులు (బ్రహ్మాదులకున్న విద్యాప్రదాన మొనర్చువారు) సమస్త జగత్తుయొక్క ఆశ్రయము సత్యస్వరూపులు సత్యపరాక్రమశీలురు (అమోఘపరాక్రమము కలవారు) యోగనిద్రయందు మూసికొనిన నేత్రములు కలవారు మత్స్యరూపమున అవతారము నెత్తినవారు బుద్ధితో కూడినట్టి సమస్త విద్యలకు ప్రభువు

**24 అగ్రణీర్గ్రామణీః శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః**
**సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్ష స్సహస్రపాత్**

ముముక్షువులను ఉత్తమపదమునకు తీసికొనిపోవువారు ప్రాణికోట్లయొక్క నాయకులు శ్రీమంతులు న్యాయస్వరూపులు జగద్రూపయంత్రమును నడిపించువారు శ్వాసరూపమున ప్రాణులచే చేష్టల నొనర్పజేయువారు వేలకొలది శిరస్సులు కలవారు విశ్వాత్మకులు వేలకొలది నేత్రములు కలవారు

**25 ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః**
**అహ స్సంవర్తకో వహ్ని రనిలో ధరణీధరః**

సంసారచక్రమును త్రిప్పువారు సంసారబంధనరహితులు, తన యోగమాయచే కప్పబడియున్నరు ఉద్రాదిస్వరూపములచే ప్రళయకాలమున ప్రాణులను మర్దించువారు సూర్యరూపమున పగటియొక్క మహాప్రవృత్తులు అన్నిదేవుళ్ళ వాయుస్వరూపులు కామిని ధరించారు

## 26 సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వధృగ్ విశ్వభుగ్ విభుః సత్కర్తా సత్కృతః సాధు ర్జహ్ను ర్నారాయణో నరః

మహాదయ గలిగియుండువారు ప్రసన్నాత్ములు ప్రపంచమును పాలించువారు సర్వవ్యాప భక్తులను సత్కరించువారు పూజితులచేతను పూజితులు సాధుస్వభావులు సంహారకాలమున జీవులను లయమొనర్చువారు నారాయణులు నరులు

## 27 అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టః శిష్టకృ చ్ఛుచిః సిద్ధార్థః సిద్ధసంకల్పః సిద్ధిదః సిద్ధిసాధనః

అసంఖ్యాకరూపములు గుణములు కలవారు అప్రమేయులు (దేనిచేతను కొలువబడనివారు) విశిష్టులు శ్రేష్ఠమును గావించువారు శుచిస్వరూపులు సిద్ధార్థులు (అన్నియును ఈడేర్చువారు) సిద్ధసంకల్పులు సిద్ధిప్రదులు (కర్మఫలములను సంగువారు) సిద్ధియను క్రియను సాధించువారు

## 28 వృషాహీ వృషభో విష్ణు ర్వృషపర్వా వృషోదరః వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః

యజ్ఞములను తనయందుంచుకొనువారు భక్తులకు వాంఛితపదార్థములను వర్షింపజేయువారు విష్ణువు (శుద్ధసత్త్వమూర్తి)

నివారణార్థ) ఔషధరూపులు సంసారసముద్రమును దాటటకు
సేతు (సారథి) రూపులు సత్యధర్మపరాక్రమవంతులు

**32 భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽనలః
కామహా కామకృత్ కాన్తః కామః కామప్రదః ప్రభుః**

భూతభవిష్యద్వర్తమానముల ప్రభువు వాయురూపులు లోకమును పవిత్ర మొనర్చువారు అగ్నిస్వరూపులు భక్తుల సకామభావమును నశింపజేయువారు భక్తుల వాంఛితములను తీర్చువారు రమణీయరూపులు (క=బ్రహ్మదేవుడు, అ=విష్ణువు మ=మహాదేవుడు ఈ ప్రకారముగ—(కామః) త్రిదేవరూపులు భక్తులకు వారు కోరిన వస్తువులను ఇచ్చువారు ప్రభువు (సర్వ సామర్థ్యవంతులు)

**33 యుగాదికృద్ యుగావర్తో నైకమాయో మహాశనః
అదృశ్యోఽవ్యక్తరూపశ్చ సహస్రజిదనన్తజిత్**

యుగాదులను ఆరంభించువారు నాలుగుయుగములను చక్రమువలె త్రిప్పువారు అనేకమాయలను ధరించువారు కల్పాంతమందు సర్వమును గ్రసించివైచువారు అదృశ్యులు అవ్యక్త రూపులు యుద్ధమందు వేలకొలది శత్రువులను జయించువారు, మహాప్రాణులను జయించువారు

**34 ఇష్టోఽవిశిష్టః శిష్టేష్టః శిఖణ్డీ నహుషో వృషః
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః**

పరమానందరూపు లగుటచే మహాప్రియులు ఏ విశేషణములు లేనివారు శిష్టులయొక్క ఇష్టదైవము, నెమలి ఈకను తన శిరోభూషణముగ ధరించినవారు ప్రాణులను మాయచే బ

బంధించువారు, కోరికలను ఈడేర్చు ధర్మస్వరూపులు కోపమును నశింపఁజేయువారు క్రోధవశ కలిగియుండు దైత్యాదులను నశింపఁ జేయువారు అగ్నిదైవుల చేత ఎ క వారు భూమిని ధరించువారు

**35 అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః**
**అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః**

అచ్యుతులు విఖ్యాతులు ప్రాణరూపులు (ప్రజలను జీవింప చేయువారు) సర్వులను పోషించు వారు ఇంద్రుని సోదరరూపులు జలముయొక్క అధిష్ఠానరూపులు అప్రమత్తులు తన మహిమ యందు ప్రతిష్ఠితులు

**36 స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః,**
**వాసుదేవో బృహద్భాను రాదిదేవః పురందర**

కార్తికేయస్వామిరూపులు, ధర్మపథమును ధరించువారు, సమస్త ప్రాణుల జన్మాదిరూపభారమును వహించువారు వర ప్రదులు వాయువులను చలింపఁజేయువారు వాసుదేవులు (సకల ప్రాణులందు ఆత్మరూపమున వసించువారు) సమస్త ప్రపంచము ను ప్రకాశింపఁజేయు సూర్యరూపులు ఆదిదేవులు, అసురుల నగరము లను ధ్వంస మొనర్చువారు

**37 అశోక స్తారణ స్తారః శూర శ్శౌరి ర్జనేశ్వరః**
**అనుకూల శ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః**

శోకరహితులు, సంసారసాగరమును తరింపఁజేయువారు, జన్మజరామృత్యుభయమునుండి రక్షించువారు, శూరులు శూర ర (శ్రీ) వసుదేవపుత్రులు సమస్త జనులకు ప్రభువు సర్వులకు అనుకూలురు ధర్మరక్షణకొఱకై వందలకొలఁది అవతారములను

ఎల్లప్పుడు యోగులు హృదయములందు కమలముల ధరించువారు, కమలము వలె కోమలమైన దృష్టి కలవారు

**38 పద్మనాభో ఒరవిన్దాక్షః పద్మగర్భ శ్శరీరభృత్**
**మహార్ధి రృద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః**

పద్మనాభుడు (లేక హృదయకమలమందు నివసించువాడు), కమలనేత్రులు, హృదయకమలమందు ధ్యానింపదగువారు, సర్వ శరీరములను ధరించువారు, మహా ఐశ్వర్యవంతులు అందరికంటె గొప్పవారు పురాతన స్వరూపులు విశాలనేత్రులు గరుడ ధ్వజులు (గరుడ చిహ్నముగల ధ్వజము కలవారు)

**39 అతులః శరభో భీమః సమయజ్ఞో హవి ర్హరిః,**
**సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః**

అతులితులు శరీరములను ప్రకాశింపజేయువారు, భయానకులు (పాపులకు భయము కలుగునట్టివారు) సమభావమును ఆచరించువారు యజ్ఞములందు హవిర్భాగములను హరించువారు సర్వ సల్లక్షణయుక్తులు లక్ష్మీవంతులు (ఐశ్వర్యవంతులు లేక తన వక్షస్థలమున లక్ష్మి కలవారు) యుద్ధమందు విజయమును బడయువారు

**40 విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదరః సహః**
**మహీధరో మహాభాగో వేగవానమితాశనః**

నాశరహితులు మత్స్యావతారము నెత్తినవారు పరమానందప్రాప్తికి మార్గరూపులు ప్రపంచమునకు కారణరూపులు దామోదరుడు (యశోదచే త్రాటిచే కట్టబడిన ఉదరముకలవారు) భక్తుల అపరాధములను సహించువారు భూమిని ధరించువారు,

మహాభాగ్యశాలి తీవ్రవేగము కలవారు ప్రళయకాలమున ప్రపంచము నంతయు భక్షించువారు

**41 ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః**
**కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః**

జగత్తుయొక్క ఉత్పత్తికి కారణులు సృష్టిసమయమున ప్రకృతి పురుషులందు ప్రవేశించి వారిని సంక్షోభపెట్టువారు, దేవుఁడు, సమస్త ఐశ్వర్యము తనయందు కలవారు పరమేశ్వరుఁడు సృష్టికి ముఖ్యసాధనరుపులు జగత్తుయొక్క ఉపాదాన నిమిత్త కారణులు సమస్తమును రచించువారు విచిత్రలోకములను సృజించువారు తనయొక్క విలక్షణమైన స్వరూపలీలాదులయొక్క కారణము ఎఱుఁగఁబడఁజాలనివారు, మాయచే తన స్వరూపమును కప్పుకొనువారు

**42 వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః**
**పరర్ధిః పరమస్పష్టస్తుష్టః పుష్టః శుభేక్షణః**

జ్ఞానస్వరూపులు సమస్తజీవులను వ్యవస్థాపూర్వకము గ రచించువారు ప్రళయమునకు స్థానరూపులు భక్తులకు స్థాన మొసంగువారు అచలస్వరూపులు శ్రేష్ఠైశ్వర్యయుక్తులు జ్ఞాన స్వరుపులగుటచె పరమస్పష్టరూపులు, సంతుష్టులు సర్వత్ర పరిపూరులు దర్శనమాత్రముచే శుభము నొసఁగువారు

**43 రామో విరామో విరజో మార్గో నేయో నయోఽనయః,**
**వీరః శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః**

రాముఁడు (యోగులు రమించు నిత్యానంద స్వరూపులు), ప్రళయకాలమున ప్రాణులకు తనయందు విరామ మొసంగువారు,

రజోగుణ తమోగుణ రహితులు ముముక్షువులకు మార్గస్వరూపులు ఉత్తమజ్ఞానముచే గ్రహింపయోగ్యులు సర్వులను నియమమందుంచువారు స్వతంత్రులు వీరులు శక్తిమంతులలో శ్రేష్ఠులు ధర్మస్వరూపులు, ధర్మవేత్తలలో ఉత్తములు

## 44 వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథు హిరణ్యగర్భః శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః

వైకుంఠ (పరమధామ) స్వరూపులు ఐశ్వర్యమను శరీరమందు శయనించువారు ప్రాణవాయురూపమున చేష్టసలుపువారు ప్రాణదాయకులు, విరాడ్రూపమున విస్తరించువారు హిరణ్యగర్భుడు (బ్రహ్మ) శత్రువులను సంహరించువారు సమస్త పదార్థములందు వ్యాపించియున్నవారు, వాయురూపులు అధోక్షజుడు (తన స్వరూపమునుండి క్షీణించనివారు)

## 45 ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః

ఋతుస్వరూపులు భక్తులకు సులభముగ దర్శనమొసంగువారు కాలుడై తన మహిమయందుంచువారు శరణార్థులచే గ్రహింపబడువారు (ప్రళయకాలమున ఉగ్రరూపులు (లేక సూర్యాదులకున్న భయకారణులు) సంవత్సర (కాల) రూపులు సమస్తకార్యములను చక్కగా నెరవేర్చువారగు ముముక్షువులకు విశ్రాంతి (మోక్షము) నొసంగువారు (బలిచక్రవర్తి నుండి) సమస్త విశ్వమును దక్షిణగా పొందినవారు

## 46 విస్తారః స్థావర స్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్ అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః

సమస్త లోకముల విస్తారముయొక్క స్థానము పృథివ్యాది పదార్థములను తనయందుంచుకొనువారు జ్ఞాన స్వరూపులగుటచే స్వయముగ ప్రమాణరూపులు ప్రపంచముయొక్క నాశరహితము కారణము, సర్వులచే అర్థింపఁబడువారు పూర్ణకాములగుటచే ఏ ప్రయోజనము లేనివారు, గొప్ప కోశముకలవారు యథార్థసుఖ రూప మహాభోగము కలవారు, మహాధనరూపులు

**47 అనిర్విణ్ణః స్థవిష్ఠోఽభూ ర్ధర్మయూపో మహామఖః,**
**నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః**

వికారరహితులు విరాడ్రూపముతో నున్నవారు జన్మరహితులు ధర్మముయొక్క స్తంభరూపులు, మహాయజ్ఞస్వరూపులు సమస్తనక్షత్రముల కేంద్రస్వరూపులు చంద్రరూపులు సమర్థులు సమస్తజగత్తుయొక్క నివాసస్థానము, సృష్ట్యాదులకై లెస్సగ చేష్ట సలుపువారు

**48 యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాంగతిః,**
**సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్**

యజ్ఞస్వరూపులు (లేక, విష్ణువు) పూజనీయులు అందఱికంటె అధికముగ ఉపాసింపఁదగినవారు, యజ్ఞరూపులు, సజ్జనులను రక్షించువారు, సజ్జనుల పరమగతి, సమస్తము చూచువారు, నిత్యముక్త ఆత్మస్వరూపులు, సర్వజ్ఞులు ఉత్తమజ్ఞానస్వరూపులు

**49 సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖద స్సుహృత్,**
**మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః**

భక్తపాలనాది శ్రేష్ఠవ్రతములు కలవారు ప్రసన్నముఖులు గాత్మస్వరూపులు, గంభీరవాక్కు పలుకువారు, సుఖదాయకులు ప్రాణులపై దయకలవారు మనోహరులు క్రోధరహితులు పరాక్రమశీలమునైన భుజములు కలవారు, అధర్మావలంబులను నశింపజేయువారు

## 50 స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్, వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః

ప్రళయకాలమున ప్రాణు లందరిని అజ్ఞాననిద్రయందు శయింపజేయువారు స్వతంత్రులు సర్వవ్యాపి, లోకోద్ధరణకొరకై అనేకరూపములను ధరించువారు లీలారూపములగు అనేకకార్యముల నాచరించువారు సమస్తముయొక్క నివాసస్థానము, భక్తులయొక్క పరమవాత్సల్యము, బృందావనమందు దూడలను పాలన గొనర్చువారు, రత్నగర్భ (సముద్ర) స్వరూపులు, సమస్త ధనములకు ప్రభువు

## 51 ధర్మగుబ్ ధర్మకృద్ ధర్మీ సదసత్క్షరమక్షరమ్, అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః

ధర్మమును రక్షించువారు ధర్మమును ఆచరించువారు, సకలధర్మములకు ఆధారము సత్స్వరూపులు, అసద్రూపజగత్స్వరూపులు, స్వభోగాతిశయములు నాశరహితులు జీవునికంటె విలక్షణులు, కార్యస్వరూపులు సమస్తమును తెలిసిన ధరించువారు, శ్రీవత్సాదిచిహ్నములను ధరించువారు

## 52 గభస్తినేమి స్సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః, ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః

కరణాము గుర్య కార్య వాసక న ఉన్నవారు సర్వప్రాణుల అంతఃకరణమం దుంపువారు నరసింహారూపమును ధరించినవారు ప్రాణులకు మహేశ్వరుడు ఆదిదేవుడు మహాదేవుడు సమస్త దేవతలకు ప్రభువు దేవతలను పోషించుచున్నట్టి దేవపరమగురువు

**53 ఉత్తరో గోపతి ర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః**
**శరీరభూతభృద్ భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః**

సంసారము ద్రమునుండి తరింపజేయువారు గోపాలురు, సమస్తప్రాణులను రక్షించువారు జ్ఞానగమ్యులు పురాతనులు శరీరోత్పాదకములగు పంచభూతములను పాలించువారు నిరతిశయ ఆనందము ననుభవించువారు వానరుల ప్రభువగు శ్రీరామచంద్రుడు యజ్ఞాదులందు గొప్పదక్షిణల నొసంగువారు

**54 సోమపో౽మృతపః సోమః పురుజిత్ పురుసత్తమః**
**వినయో జయః సత్యసంధో దాశార్హః సాత్వతాంపతిః**

యజ్ఞములందు సోమరసమును త్రాగువారు అమృతము పానము చేయువారు చంద్రరూపులు అనేకులను విజయులై భక్తుల నానుగూర్చువారు మహాశ్రేష్ఠులు దుష్టులను దండించువారు జయశీలురు సత్యసంధులు దాశార్హకులమందు ప్రకటించువారు యాదవులకు (లేక భక్తులకు) ప్రభువు

**55 జీవో వినయితా సాక్షీ ముకున్దో౽మితవిక్రమః**
**అమ్భోనిధి రనన్తాత్మా మహోదధిశయో౽న్తకః**

జీవరూపులు భక్తులవినయభావమును ప్రత్యక్షముగ అనుభవించువారు ముకుందులు (ముక్తిదాత) అమితపరాక్రమశీలురు

ముద్రి  రులు అనంతరూపులు ప్రళయకాలమున మహాసముద్ర శయనించువారు మృత్యుస్వరూపులు

**56 అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః**
**ఆనన్దో నన్దనో నన్దః సత్యధర్మా త్రివిక్రమః**

బ్రహ్మాదేవస్వరూపులు పూజనీయులు నిత్యసిద్ధులగుటచే స్వభావముగ ఉత్పన్నముకానివారు శత్రువులను జయించువారు నిత్యప ప్రముదిత మొనర్చువారు ఆనందరూపులు సర్వులను ప్రసన్న మొనర్చువారు సమ ఐశ్వర్యసంపన్నులు ధర్మజ్ఞానాది సర్వగుణయుక్తులు త్రివిక్రముడు (మూడుఅడుగులచే మూడు లోకములను కొలచినవారు)

**57 మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః**
**త్రిపద స్త్రిదశాధ్యక్షో మహాశృఙ్గః కృతాన్తకృత్**

కపిలమహర్షి స్వరూపులు కృతజ్ఞులు భూమియొక్క ప్రభువు త్రిగుణము లనెడు మూడుపాదములుకల విశ్వరూపులు దేవతల ప్రభువు మత్స్యావతారమున గొప్పకొమ్మును ధరించినవారు స్మరించువారి సమస్త కర్మములను అంత మొనర్చువారు

**58 మహావరాహో గోవిన్దః సుషేణః కనకాఙ్గదీ**
**గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః**

వరాహావతారమును గైకొనినవారు గోవిందుడు సుందర సేనతో కూడినవారు సువర్ణాభరణమును ధరించువారు హృదయాకాశమున దాగుకొనువారు, గంభీరస్వభావులు, ప్రవేశించుట కష్టమైన స్వరూపముగలవారు మనోవాగతీతులు చక్రగదాధరులు

59 వేధాః స్వాఙ్గోఽజితః కృష్ణో దృఢ సఙ్కర్షణో ఽచ్యుతః
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః

అంతయు విధాన మొనర్చువారు కార్య మొనర్చుటయందు సహకరించువారు ఎవనిచేతను జయింపఁబడనివారు శ్రీకృష్ణుఁడు దృఢరూపులు ప్రళయకాలమున సమస్తమును సంహరించువారు, వాశరహితులు వరుణదేవస్వరూపులు, వరుణపుత్రుఁడగు వసిష్ఠస్వరూపులు (అశ్వత్థ) వృక్షరూపులు సంకల్పమాత్రముచే సృష్ట్యాదులను గావించు మహాశక్తిసంపన్నులు

60 భగవాన్ భగహానన్దీ వనమాలీ హలాయుధః
ఆదిత్యో జ్యోతి రాదిత్యః సహిష్ణు ర్గతిసత్తమః

భగవంతుఁడు (ఐశ్వర్యాదిషడ్గుణశీలుఁడు) భక్తులయొక్క దైవభక్తి నభివృద్ధిపఱచుటకొఱకై వారి సాంసారిక ఐశ్వర్యమును హరించువారు పరమానందస్వరూపులు, వనమాలను ధరించువారు హలాయుధధారియగు బలరామస్వరూపులు అదితిపుత్రుఁడగు వామనుఁడు సూర్యమండలమందు విరాజిల్లు జ్యోతిస్స్వరూపులు ద్వంద్వములను సహించుకొనువారు సర్వశ్రేష్ఠగతిస్వరూపులు,

61 సుధన్వా ఖణ్డపరశు ర్దారుణో ద్రవిణప్రదః
దివిస్పృక్ సర్వదృగ్ వ్యాసో వాచస్పతి రయోనిజః

గొప్పధనుస్సును ధరించువారు శత్రువులను ఖండించు గొడ్డలిని ధరించిన పరశురామస్వరూపులు సన్మార్గవిరోధులకు మహా భయంకరులు అర్థిభక్తులకు ధనసంపద నొసంగువారు స్వర్గమును స్పృశించి వ్యాపించినవారును సమస్తమును ద్రష్ట మఱియు శ్రీవేదవ్యాస స్వరూపులు విద్యకు ప్రభువు మఱియు స్వయంభువు

**62 త్రిసామా సామగః సామ నిర్వాణం భేషజం భిషక్**
**సంన్యాసకృచ్ఛమః శాన్తో నిష్ఠా శాన్తిః పరాయణమ్**

మూఁడు సామశ్రుతులచే స్తుతింపఁబడువారు, సామవేదమును గాన మొనర్చువారు, సామవేదస్వరూపులు నిర్వాణ (పరమానంద) స్వరూపులు సంసారరోగమునకు ఔషధము సంసారరోగమును పోఁగొట్టు వైద్యులు, సంన్యాసాశ్రమ, సంన్యాసయోగములను నిర్మాణ మొనర్చువారు, ఉపశమరూపులు శాంతులు సమస్తమునకు అధిష్ఠానరూపులు, పరమశాంతిస్వరూపులు, పరమప్రాప్యస్థానము

**63 శుభాఙ్గః శాన్తిదః స్రష్టా కుముద కువలేశయః**
**గోహితో గోపతి ర్గోప్తా వృషభాక్షో వృషప్రియః**

సుందరఅవయవములు కలవారు, శాంతిదాయకులు సృష్ట్యారంభమున స[illegible]మును సృష్టించువారు, భూమిపై ప్రసన్నతాపూర్వ[illegible] [illegible]లీల[illegible] [illegible]వారు జలముపైన శేషనాగముపై శయనించు[illegible] [illegible] గోవులకు [illegible]హిత మొనర్చువారు గోవులకు భూమికి ప్రభువు, తన [illegible]చే [illegible] స్వ[illegible]మును ఆచ్ఛాదించు వారు కృపాదృష్టి కలవారు ధర్మమును ప్రేమించువారు

**64 అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః**
**శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాంవరః**

రణభూమియందు, ధర్మపాలనయందు వెనుకకు మరలనివారు, నిత్యశుద్ధమనస్సుకలవారు, ప్రళయకాలమున జగత్తును సూక్ష్మ మొనర్చువారు శరణాగతులను రక్షించువారు శివుఁడు. శ్రీవత్స మను చిహ్నమును వక్షస్థలమున ధరించువారు శ్రీలక్ష్మి

రియొక్క నివాసస్థానము శ్రీలక్ష్మిపతి శ్రీమంతులలో శ్రేష్ఠులు

**65 శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః**
**శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః**

పుణ్యాత్ములకు ఐశ్వర్యము నొసంగువారు శ్రీలక్ష్మి నాథుఁడు శ్రీలక్ష్మీదేవియొక్క అంతఃకరణమందు ఎల్లపుడు నివ సించువారు సమస్త ఐశ్వర్యములకు నిధి జనులకు వారివారి కర్మల ననుసరించి ఐశ్వర్యమును ఒసంగువారు శ్రీలక్ష్మిని వక్షస్థల మందు ధరించినవారు పుణ్యాత్ములకు ఐశ్వర్యమును విస్తరింపఁ జేయువారు మంగళస్వరూపులు పెక్కు ఐశ్వర్యములతో కూడిన వారు ముల్లోకములకు ఆశ్రయులు

**66 స్వక్షః స్వఙ్గః శతానన్దో నన్ది ర్జ్యోతి ర్గణేశ్వరః**
**విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః**

సుందరనేత్రులు మనోహరములగు అవయవములు కలవారు పెక్కువిధములుగ విభజింపఁబడిన ఆనందము స్వరూపముగ ల వారు పరమానందస్వరూపులు నక్షత్రసముదాయముల ఈశ్వరులు జయింపఁబడిన మనస్సుకలవారు అనిర్వచనీయస్వరూపులు సత్కీర్తి కలవారు సంశయరహితులు

**67 ఉదీర్ణః సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వత స్థిర**
**భూశయో భూషణో భూతి ర్విశోకః శోకనాశనః**

సమస్త ప్రాణులకంటెను శ్రేష్ఠులు సర్వత్ర నేత్రములు కలవారు ఇతరశాసకులు లేనివారు నిత్యులు, భువిపై శయి

నించువారు తన చరణచిహ్నములచే భూమియొక్క శోభను వృద్ధి పఱచువారు సమస్త ఐశ్వర్యములకు ఆధారరూపులు శోకరహితులు భక్తుల శోకమును నశింపఁజేయువారు

## 68 అర్చిష్మానర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః

చంద్రసూర్యాది సమస్తజ్యోతులను దేదీప్యమాన మొనర్చు ప్రకాశమయ అనంతకిరణములతో ప్రకాశించువారు సమస్త జనులచే పూజితులు ఘటమువలె సమస్తమునుయొక్క నివాసస్థానము విశుద్ధాత్ములు భక్తుల అంతఃకరణములను పవిత్రమొనర్చువారు ఎవనిచేతను బంధింపఁబడనివారు ప్రతిపక్షరహితులు ప్రద్యుమ్న స్వరూపులు మహాపరాక్రమశీలురు

## 69 కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః

కాలనేమియను అసురుని సంహరించినవారు వీరులు శూరులగు (శ్రీకృష్ణుఁడు ఇంద్రాదిసురరపశువులకును ఈశ్వరుఁ డంతర్యామి పరమున ముల్లోకములకును ఆత్మ మఱియు ముల్లోకములకును ప్రభువు కేశవుఁడు (బ్రహ్మ విష్ణు శివస్వరూపులు) కేశి యను అసురుని సంహరించినవారు హరి (పాపములను హరించువారు)

## 70 కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః అనిర్దేశ్యవపుర్విష్ణుర్వీరోఽనన్తో ధనఞ్జయః

సమస్తకామనలకు అధిష్ఠాతలగు దేవుఁడు భక్తుల కామనలను పరిపూర్తి చేయువారు త ... ఎయతమ భక్తులను ...

వారు, మనోహరరూపము కలవారు సమస్త వేదశాస్త్రములను రచించువారు, అనిర్వచనీయస్వరూపులు, విష్ణువు వీరులు అంటేయులు అర్జునరూపులు (లేక, అధికధనమును జయించి తెచ్చువారు)

## 71 బ్రహ్మణ్యో బ్రహ్మకృద్ బ్రహ్మ బ్రహ్మ బ్రహ్మ వివర్ధనః
## బ్రహ్మవిద్ బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణ ప్రియః

తపస్సు వేదము బ్రహ్మనిష్ఠుడు, జ్ఞానము—వీనిని రక్షించు వారు తపస్సు మున్నగువానిని రచించువారు బ్రహ్మదేవుడు సచ్చిదానందస్వరూపులు బ్రహ్మశబ్దవాచకము లగు తపస్సు మున్నగువానిని వృద్ధిచేయువారు బ్రహ్మవేత్త బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మశబ్దవాచకము లగు తపస్సు మున్నగువాని అధిష్ఠానము బ్రహ్మజ్ఞాని బ్రహ్మనిష్ఠులకు ప్రియులు

## 72 మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః
## మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః

మహావేగముతో వెడలువారు గొప్పకార్యములను చేయువారు, గొప్పతేజస్సు కలవారు, వాసుకి (సర్ప) స్వరూపులు మహా యజ్ఞస్వరూపులు, గొప్పయజ్ఞములను కావించువారు సమస్త యజ్ఞములు విభూతులుగా గల గొప్పయజ్ఞస్వరూపులు గొప్ప యజ్ఞసంబంధ హవిస్స్వరూపులు

## 73 స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిః స్తోతా రణప్రియః,
## పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః

స్తుతింపదగినవారు, స్తుతిచే ప్రసన్నులగువారు, స్తోత్ర రూపులు స్తవనస్వరూపులు, స్తుతించువారు, యుద్ధప్రియులు, పరి

పూర్ణులు భక్తులను సర్వవిధముల పరిపూర్ణ మొనర్చువారు, పుణ్య స్వరూపులు పుణ్య (పవిత్ర) కీర్తికలవారు, రోగరహితులు

## 74 మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః, వసుప్రదో వాసుదేవో వసు ర్వసుమనా హవిః

మనోవేగము కలవారు సమస్తవిద్యల రచయిత ఉపదేశ కర్త హిరణ్యామయపురుషుడు ప్రథమసృష్టియొక్క బీజము వీర్యముగ కలవారు ధనమును విరివిగ నొసంగువారు, వాసుదేవుడు (వసుదేవుని పుత్రుండగు శ్రీకృష్ణుడు) సర్వుల అంతఃకరణమందు నివసించువారు, అందఱియందు సమముగ నివసించు శక్తితో కూడిన మనస్సుకలవారు యజ్ఞమందలిహవిస్సు స్వరూపముగ కలవారు

## 75 సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాసః సుయామునః

సద్గతిస్వరూపులు, సత్కార్య మొనర్చువారు సద్రూపులు, అనేకరూపములతో భాసించువారు సజ్జనుల పరమప్రాప్యస్థానము (లేక సత్పురాయణులు) శూరులతో కూడిన సేనకలవారు, యదు వంశీయులందు శ్రేష్ఠులు జనుల ఆశ్రయస్వరూపులు యమునా తీర వాసులగు గోపబాలురు మొదలగువారితో కూడిన శ్రీకృష్ణుడు

## 76 భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాపరాజితః

సమస్తప్రాణుల ముఖ్య నివాసస్థానము వాసుదేవుడు, సమస్తప్రాణుల ఆధారము, అగ్నిస్వరూపులు దర్పముకలవారిని

కింపఁజేయువారు భక్తులకు ఉత్సాహమును కలుగఁజేయువారు, నిత్యానందమగ్నులు బహుకష్టముతో హృదయమందు ధరింపఁ బడువారు అజేయులు

**77 విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్,**
**అనేకమూర్తి రవ్యక్తః శతమూర్తిః శతాననః**

విశ్వమూర్తి గొప్పస్వరూపముకలవారు దేదీప్యమాన మగు స్వరూపము కలవారు నిరాకారులు, అనేకరూపులు అవ్యక్తులు వందలకొలది రూపములు కలవారు వందలకొలఁది ముఖములు కలవారు

**78 ఏకో నైక సవః కః కిం యత్ తత్ పదమనుత్తమమ్,**
**లోకబన్ధు ర్లోకనాథో మాధవో భక్తవత్సలః**

అద్వితీయులు అనేకరూపులు సోమరసము తీయఁబడు యజ్ఞము యొక్క స్వరూపము కలవారు సుఖస్వరూపులు విచారణీయ బ్రహ్మస్వరూపులు స్వతస్సిద్ధులు విస్తారమొనర్చువారు, అత్యుత్తమపరమపదస్వరూపులు లోకబంధువు లోకనాథుఁడు మాధవుఁడు భక్తవత్సలుఁడు

**79 సువర్ణవర్ణో హేమాఙ్గో వరాఙ్గ శ్చన్దనాఙ్గదీ,**
**వీరహా విషమః శూన్యో ఘృతాశీ రచల శ్చలః**

సువర్ణవర్ణము కలవారు బంగారువలె కాంతిమంతములైన యవయవములు కలవారు, శ్రేష్ఠములైన అవయవములు కలవారు, గంధ లేపనముచే సుశోభితులు శూరులగు అసురులను నాశ మొనర్చువారు అనుపమానులు (అసమానులు), దృశ్యేతరాన్యులు

(గ్రేవఃణరవారులు), ఆశ్రితులయొ°ల కృపాపూర్ణ మగు సంకల్ప మొనర్చువారు నిశ్చలురు సర్వత్ర గమన మొనర్చువారు,

## 80 అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృక్, సుమేధా మేధజో ధన్యః సత్యమేధా ధరాధరః,

అభిమానములేనివారు ఇతరులను గౌరవించువారు పూజనీయులు సమస్తలోకములకు ప్రభువు త్రిలోకధారి, గొప్పబుద్ధి కలవారు యజ్ఞమందు ప్రకటనగునారు ధన్యులు సత్యశ్రేష్ఠబుద్ధి కలవారు భూమిని ధరించువారు

## 81 తేజో వృషో ద్యుతిధరః సర్వశస్త్రభృతాంవరః ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృఙ్గో గదాగ్రజ

భక్తులపై ఆనందమును తేజస్సును వర్షింపజేయువారు, గొప్పకాంతిని ధరించువారు సమస్తశాస్త్రవేత్తలలో శ్రేష్ఠులు, ధ[illegible] సమస్తమును [illegible] కొనువారు భక్తులకు అభీష్టఫలముల నొసంగుటయందు తత్పరు[illegible] ఆఖ్యాత ఉపసర్గ నిపాతములను నలుగుకొమ్ములను ధరించు శబ్దబ్రహ్మస్వరూపులు శ్రీకృష్ణులు

## 82 చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేదవి దేకపాత్

రామ లక్ష్మణ భరత శత్రుఘ్న రూప చతుర్మూర్తి, నలుగు చేతులు కలవారు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న, అనిరుద్ధ స్వరూపులు సాలోక్యాది చతుర్గతిస్వరూపులు, మనో బుద్ధ్యహంకార చిత్తరూప చతురంతఃకరణ స్వరూపులు, ధర్మార్థ

కామమోక్షములను నాలుగు పురుషార్థముల ఉత్పత్తి స్వరూపులు నతుర్వేదవేత్త ఏకపాదముచే సమస్తవిశ్వమును వ్యాపించినవారు

**83 సమావర్తోఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః**
**దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా**

సంసారచక్రమును తెస్సగ త్రిప్పువారు సర్వత్ర విద్యమానులై యున్నవారు దుర్జయులు దురతిక్రములు దుర్లభులు దుర్గములు కష్టముతో పొందబడువారు కష్టముతో యోగులచే హృదయమందు సాక్షాత్కరించుకొనబడువారు దుర్జనులను నశింపజేయువారు

**84 శుభాఙ్గో లోకసారఙ్గః సుతన్తుస్తన్తువర్ధనః**
**ఇన్ద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః**

ఉత్తమ అవయవములతో [illegible] వారు లోక[illegible] [illegible] గ్ర[illegible]ంచువారు సుందరజగద్రూపతంతువు కలవారు ఆ తంతువును వృద్ధిచేయువారు [illegible] వలె కర్మ నా[illegible]రించు[illegible] గొప్పగొప్పకార్యముల నాచరించువారు కృతకృత్యులు అనేకకార్యముల నాచరించుటకు అవతారములను గ్రహించి వచ్చినారు

**85 ఉద్భవః సున్దరః సున్దో రత్ననాభః సులోచనః**
**అర్కో వాజసనః శృఙ్గీ జయన్తః సర్వవిజ్జయీ**

[illegible]ష్ఠజన్మను ధరించువారు సుందరరూపులు మహాకా[illegible] కలవారు [illegible] [illegible] [illegible] భకలవారు సుందర[illegible] [illegible] [illegible] (సూర్యాది పూజ్యులు) యాచకుల[illegible] అ[illegible] [illegible] చేయువా[illegible] ప్రళయకాలమున కొమ్ముగల మత్స్యరూ[illegible]

మును ధరించువారు శత్రువులను జయించువారు సమస్తము తెలిసినవారు సమస్తమును జయించువారు

## 86 సువర్ణబిన్దు రక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః

సుందర అక్షరయుక్త ఓంకారస్వరూపులు దేనిచేతను క్షోభింపబడనివారు బ్రహ్మాదులకున్న ఈశ్వరుడు పరమానంద సరోవరరూపులు, మహాగర్తముకలవారు మహాభూతస్వరూపులు, మహానిధిస్వరూపులు (లేక సర్వుల గొప్పనివాసస్థానము)

## 87 కుముదః కున్దరః కున్దఃపర్జన్య పావనో౽నిలః అమృతాశో౽మృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః

భూమికి భారమును తీర్చి ప్రసన్నత్వమును కలుగజేయువారు, హిరణ్యాక్షుని వధించుటకై భూమిని విదీర్ణమొనర్చినవారు కుందానము చేయువారు ఇష్టవస్తువులను వర్షించువారు, పవిత్రరూపులు సదా ప్రబుద్ధులుగ నుండువారు అమోఘ సంకల్పయోపులు నిత్యస్వరూపులు సర్వజ్ఞులు సర్వతోముఖులు

## 88 సులభః సువ్రతః సిద్ధః శత్రుజి చ్ఛత్రుతాపనః న్యగ్రోధో౽దుమ్బరో౽శ్వత్థ శ్చాణూరాన్ధ్రనిషూదనః

భక్తిచే సులభముగ పొందబడువారు, భక్తితో అర్పింపబడినదానిని ప్రేమతో స్వీకరించువారు సర్వసిద్ధులు కలవారు శత్రువులను జయించువారు శత్రువులను తపింపజేయువారు వటవృక్షరూపులు (కారణరూపమున) ఆకాశము కంటెను ఊర్ధ్వముగ నుండువారు అశ్వత్థ (రావి) వృక్షస్వరూపులు, చాణూరుడను (ఆంధ్రజాతి) మల్లుని వధించినవారు

**89 సహస్రార్చిః సప్తజిహ్వః సప్తైధాః సప్తవాహనః,**
**అమూర్తి రనఘోఽచిన్త్యో భయకృద్ భయనాశనః**

వేలకొలఁది కిరణములుగల సూర్యస్వరూపులు అగ్నిస్వరూపులు ఏడుదీప్తులతోఁగూడిన అగ్నిస్వరూపులు ఏడు గుఱ్ఱములతోఁ గూడిన సూర్యస్వరూపులు నిరాకారులు పాపరహితులు అచింత్యులు దుష్టులను భీతిల్లఁజేయువారు భయనాశకులు.

**90 అణు ర్బృహ త్కృశః స్థూలో గుణభృ న్నిర్గుణో మహాన్**
**అధృత స్స్వధృతః స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః**

మహాసూక్ష్మరూపులు, విశాలస్వరూపులు, చాల తేలిక అయినవారు (సూక్ష్మరూపులు) స్థూలరూపులు, సమస్త గుణములు కలవారు నిర్గుణులు పరమమహాత్మ్యస్వరూపులు నిరాధారులు తన మహిమయందే యున్నవారు, సుందరముఖము కలవారు ఆదిపురుషుఁడు జగద్రక్షణమును వర్ధిల్లఁజేయువారు

**91 భారభృత్ కథితో యోగీ యోగీశః సర్వకామదః**
**ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః**

భూభారమును, భక్తులయోగక్షేమములను వహించువారు వేదశాస్త్రములద్వారా మహాత్ములద్వారా వర్ణింపఁబడినవారు యోగి (నిత్యసమాధియుక్తులు) యోగీశ్వరుఁడు, సమస్తకామనలను పూర్ణమొనర్చువారు సర్వులకు విశ్రాంతినొసఁగువారు దుష్టులను సంతప్తమొనర్చువారు ప్రళయకాలమున ప్రాణులన్నిటని క్షయమొనర్చువారు వేదవృక్షస్వరూపులు వాయువు వీచుటకు శక్తి నొసంగువారు.

92 ధనుర్ధరో ధనుర్వేదో దణ్డో దమయితా దమః
అపరాజితః సర్వసహో నియన్తా నియమో యమః

ధనుస్సును ధరించువాడు ధనుర్విద్య నెఱిఁగినవాడు దమ మొనర్చువారి దమనశక్తి దమన మొనర్చువాడు దమనస్వరూపులు అజేయులు సమస్తము సహించుకొను శక్తి కలవారు సర్వులను వారివారి కర్తవ్యమందు నియుక్తమొనర్చువారు నియమమొనర్చు ర్పఁబడనివారు (సర్వస్వతంత్రులు) శాసకుఁడు లేనివారు

93 సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాయణః,
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ ప్రీతివర్ధనః

బలవీర్య సామర్థ్యాది సమస్త తత్త్వసంపన్నులు సాత్త్వికులు సత్యస్వరూపులు సత్యధర్మపరాయణులు పరమఇష్టులు ప్రియవస్తువు సమర్పింప యోగ్యులు సంపూజ్యులు భక్తులకు ప్రియ మొనర్చువారు ప్రీతి వివర్ధనులు

94 విహాయసగతి ర్జ్యోతిః సురుచి ర్హుతభుగ్ విభుః
రవి ర్విరోచనః సూర్యః సవితా రవిలోచన

ఆకాశమున గమన మొనర్చువారు స్వయంప్రకాశరూపులు సుందరకాంతి కలవారు యజ్ఞమందు హవిస్సును అగ్నిద్వారా భుజించువారు సర్వవ్యాపి సూర్యుఁడు ఎచిత్రముగ ప్రకాశమును వ్యాపింపఁజేయువారు సూర్యుఁడు (శోభను ప్రకటించువాఁడు) జగత్తును ఉత్పన్న మొనర్చువారు సూర్యుఁడను నేత్రము కలవారు

95 అనన్తో హుతభుగ్ భోక్తా సుఖదో నైకజోఽగ్రజః,
అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః

అంతములేనివారు హోమము చేయబడినదాని) భుజించు వారు భోక్త (జగత్తును పాలించువారు) సుఖప్రదులు ధర్మోద్ధరణ కొఱకై స్వేచ్ఛగా అనేకజన్మల నెత్తువారు ఆదిపురుషులు ధైర్య ముకలవారు సజ్జనులయెడల క్షమకలిగియుండువారు సమస్త లోక ములకు అధిష్ఠానరూపులు అత్యంత ఆశ్చర్యమయులు

**96 సనాత్ సనాతనతమః కపిలః కపి రవ్యయః**
**స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః**

అనంతకాలస్వరూపులు, మహాసనాతనులు, కపిలావతార రూపులు సూర్యదేవులు అవ్యయులు పరమానందమను మంగ ళము నొసంగువారు ఆశ్రితులకు శుభమును చేకూర్చువారు, మంగళస్వరూపులు భక్తులక్షేమమును కాపాడువారు, శుభమొన ర్చుటయందు సమర్థులు

**97 అరౌద్రః కుండలీ చక్రీ విక్ర మ్యూర్జితశాసన ,**
**శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః**

కాంతిమూర్తి ప్రకాశమానములైన కుండలములను ధరించు వారు చక్రము ధరించువారు పరాక్రమశీలురు శ్రేష్ఠశాసనము లను పాలించువారు వాక్కునకు అవిషయులు శబ్దములను సహించువారు తాపత్రయములకు శాంతి నొసంగువారు జ్ఞాను లకు రాత్రియగు సంసారమును అజ్ఞానులకు రాత్రియగు జ్ఞానమును రెండిటిని ఉత్పన్న మొనర్చువారు

**98 అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః**
**విద్వత్తమో వీతభయ పుణ్యశ్రవణకీర్తన**

క్రూరభావరహితులు, పరమసుందరులు కార్యదక్షులు ప్రళయకాలమున సంహార మొనర్చువారు క్షమ కలిగియుండు వారి కో శ్రేష్ఠులు మహావిద్వాంసులు భయరహితులు ఎవని నామ గుణ సంకీర్తన పరమపావన మైనదో అట్టివారు

**99 ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుఃస్వప్ననాశనః,**
**వీరహా రక్షణః సన్తో జీవనః పర్యవస్థితః**

సంసారసముద్రమునుండి తరింపజేయువారు, పాపులను పాపములను నశింపజేయువారు, పుణ్యస్వరూపులు, దుస్స్వప్నములను నశింపజేయువారు రక్షించువారు, మహాత్ములరూపమున ప్రకట మగువారు, సమస్తప్రాణులయొక్క జీవనరూపులు విశ్వమంతట వ్యాపించియున్నవారు

**100 అనన్తరూపోఽనన్తశ్రీ ర్జితమన్యు ర్భయాపహః**
**చతురస్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః**

అనంతరూపులు, అపరిమితశోభాసంపన్నులు క్రోధమును జయించినవారు భయమును పోగొట్టువారు మంగళమూర్తి గంభీరాత్ములు కర్మానుసారము ఫల మొసంగువారు జనులకు వివిధ ఆజ్ఞల నొసంగువారు వేదములద్వారా సమస్తకర్మలయొక్క ఫలమును వచించువారు

**101 అనాదిర్భూర్భువో లక్ష్మీః సువీరో రుచిరాఙ్గదః**
**జననో జనజన్మాది ర్భీమో భీమపరాక్రమః**

అనాదిస్వరూపులు భూమికి ఆధారభూతులు లక్ష్మీస్వరూపులు (ఐశ్వర్యశోభ స్వరూపులు) మహావీరులు ఉత్తమ భూషణ

స్వరూపులు సమస్తయజ్ఞములకు అధిష్ఠాత యజమానరూపమున యజ్ఞము చేయువారు యజ్ఞాంగస్వరూపులు యజ్ఞములను జరిపించువారు

## 105 యజ్ఞభృద్ యజ్ఞకృద్ యజ్ఞీ యజ్ఞభుగ్ యజ్ఞసాధన
## యజ్ఞాన్తకృద్ యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ

యజ్ఞములను భరించువారు యజ్ఞములకర్త సమస్తయజ్ఞములు ఎవరియందు సమాప్తమగునో అట్టివారు యజ్ఞభోక్త, బ్రహ్మయజ్ఞ, జప యజ్ఞములు ఎవనిప్రాప్తికి సాధనములో అట్టివారు, యజ్ఞముల ఫల మొసంగువారు యజ్ఞములందు గుప్తముగానున్న నిష్కామయజ్ఞస్వరూపులు అన్నస్వరూపులు అన్నములభోక్త

## 106 ఆత్మయోనిః స్వయంజాతో వైఖానః సామగాయనః,
## దేవకీనన్దనః స్రష్టా క్షితీశః పాపనాశనః

కారణములేనివారు స్వయముగ స్వేచ్ఛాపూర్వకముగ ప్రకటమగువారు వారాహావతారధారి సామవేదము గానమొనర్చువారు, దేవకీపుత్రులు, సమస్తలోకముల రచయిత పృథ్వీపతి పాపనాశకులు

## 107 శఙ్ఖభృ న్నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః
## రథాఙ్గపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః

శంఖమును ధరించువారు నందకమను ఖడ్గమును ధరించువారు, చక్రమును ధరించువారు, శార్ఙ్గమను ధనుస్సు ధరించినవారు

గదను ధరించినవాడు రథాంగముగ చక్రము చేతియందుకలవారు ... న క్షోభను పొందని యు ... న్ముస్త్రాయుధములను ధరించు వాడు

108 ఇదం శృణుయా న్నిత్యం య శ్చాపి పరి
కీర్తయేత్
నాశుభం ప్రాప్నుయాత్ కించిత్ సోఽముత్రేహ
చ మానవః

ఎవడు ఈ విష్ణుసహస్రనామమును సదా శ్రవణము చేయునో మఱియు ప్రతిరోజు దీనిని పఠించునో కీర్తించునో, అట్టివానికి ఈ లోకమునగాని పరలోకమునగాని ఎచటను అశుభ మేమియు కలుగనేరదు

ఓమ్

# శివస్తవము
## (సంవర్తకుడు)
### (ఆశ్వమేధిక పర్వము – 8వ అధ్యాయము)

1 రుద్రాయ శితికణ్ఠాయ పురుషాయ సువర్చసే
కపర్దినే కరాలాయ హర్యక్ష్ణే వరదాయ చ

2 త్ర్యక్ష్ణే పూష్ణో దన్తభిదే వామనాయ శివాయ చ
యామ్యాయావ్యక్తరూపాయ సద్వృత్తే శఙ్కరాయ
చ

3 క్షేమ్యాయ హరికేశాయ స్థాణవే పురుషాయ చ
హరినేత్రాయ ముణ్డాయ క్రుద్ధాయోత్తరణాయ చ

4 భాస్కరాయ సుతీర్థాయ దేవదేవాయ రంహసే
ఉష్ణీషిణే సువక్త్రాయ సహస్రాక్షాయ మీఢుషే

5 గిరిశాయ ప్రశాన్తాయ యతయే చీరవాససే,
బిల్వదణ్డాయ సిద్ధాయ సర్వదణ్డధరాయ చ

6 మృగవ్యాధాయ మహతే ధన్వినేఽథ భవాయ చ,
వరాయ సోమవక్త్రాయ సిద్ధమన్త్రాయ చక్షుషే

7 హిరణ్యబాహవే రాజన్నుగ్రాయ పతయే దిశామ్
లేలిహానాయ గోష్ఠాయ సిద్ధమన్త్రాయ వృష్ణయే

8 పశూనాంపతయే చైవ భూతానాంపతయే నమః
వృషాయ మాతృభక్తాయ సేనాన్యేమధ్యమాయ చ

9 స్రువహస్తాయ పతయే ధన్వినే భార్గవాయ చ,
అజాయ కృష్ణనేత్రాయ విరూపాక్షాయ చైవ హ

10 తీక్ష్ణదంష్ట్రాయ తీక్ష్ణాయ వైశ్వానరముఖాయ చ
మహాద్యుతయేఽనఙ్గాయ సర్వాయ పతయేవిశామ్

11 విలోహితాయ దీప్తాయ దీప్తాక్షాయ మహౌజసే
వసురేతఃసువపుషే పృథవే కృత్తివాససే

12 కపాలమాలినే చైవ సువర్ణమకుటాయ చ,
మహాదేవాయ కృష్ణాయ త్ర్యమ్బకాయానఘాయ చ

13 క్రోధనాయానృశంసాయ మృదవే బాహుశాలినే
దణ్డినే తప్తతపసే తథైవాక్రూరకర్మణే

14 సహస్రశిరసే చైవ సహస్రచరణాయ చ
నమ స్స్వధాస్వరూపాయ బహురూపాయ దంష్ట్రిణే

రుద్రుఁడు (దుఃఖమును పోఁగొట్టువారు), నీలకంఠుఁడు అంతర్యామి మహాతేజస్వి జటాజూటధారి భయంకరరూపముకలవారు పచ్చనినేత్రముకలవారు వరప్రదుఁడు, మూఁడు నేత్రములు కలవారు పూషునియొక్క దంతములను పెరికివేసినవారు వామనస్వరూపులు, శివుఁడు, యమరాజస్వరూపులు అవ్యక్తరూపులు, సదాచారి శంకరుఁడు మంగళకరుఁడు, గొప్ప కేశములుకలవారు స్థిరుఁడు పురుషుఁడు, హరినేత్రుఁడు (పచ్చని నేత్రములు కలవారు), కేశఖండన మొనర్చుకొనినవారు (దుష్టులయెడల లేక సంహారకాలమున) క్రుద్ధుఁడు, సంసారసముద్రమును దాటించువారు, సూర్యరూపులు పవిత్రతీర్థరూపులు దేవదేవుఁడు వేగవంతుఁడు తలపాగ ధరించువారు సుందరముఖుఁడు సహస్రనేత్రుఁడు కోరికలను నెరవేర్చువారు పర్వతముపై పరుండువారు ప్రశాంతుఁడు యతి (సంయమి) చీరవస్త్రమును ధరించువారు బిల్వదండము ధరించువారు సిద్ధుఁడు సర్వదుష్టులకు దండన నొసంగువారు, ఆర్ద్రాభృత స్వరూపులు గొప్పవారు, ధనుస్సును ధరించువారు, ప్రపంచమును ఉత్పన్న మొనర్చువారు, శ్రేష్ఠుఁడు, చంద్రునివలె సుందరమైన ముఖముకలవారు మంత్రము లన్నిటిని సిద్ధ మొనర్చినవారు, నేత్రరూపులు బంగారువలె సుందరమైన హస్తములు కలవారు, భయం

కయుండు దిక్పాలి అగ్నిరూపమున హవిస్సును ఆస్వాదించువారు వాక్కునకు నివాసస్థానము సిద్ధమంత్రరూపులు వాంఛితముల వర్షమును కురియువారు పశుపతి భూతపతి ధర్మస్వరూపులు కూంత్ర భక్తుడు సేనానాయకులు మధ్యముడు చేతియందు స్రువమును ధరించిన ఋత్విజపులు సర్వులను పాలించువారు, ధనుస్సును ధరించినవారు భార్గవుడు జన్మరహితుడు కృష్ణనేత్రుడు విరూపాక్షుడు తీ దంతములుకలవారు తీక్ష్ణరూపులు అగ్నిరూపముఖము కలవారు మహాప్రకాశస్వరూపులు నిరాకారుడు, సర్వరూపుడు సర్వులకు ప్రభువు, రక్తవర్ణము కలవారు తేజస్సు, ప్రకాశించు నేత్రములు కలవారు మహాబలవంతుడు, అగ్నిరూపుడు ,సుందరశరీరము కలవారు స్థూలరూపుడు మృగచర్మమును ధరించువారు బంగారు రటము ధరించినవారు మహాదేవుడు కృష్ణుడు (సచ్చిదానంద స్వరూపుడు) త్రినేత్రధారి పాపరహితుడు, దుష్టులపై క్రోధమొనర్చువారు కోమలస్వభావము కలవారు మృదుస్వభావముకలవారు బాహుశాలి దుష్టులకు దండన నొసంగువారు (లేక దండధరుడు) తీవ్రతపము చరించువారు కోమలమగు కర్మను చేయువారు వేలకొలది శిరస్సులు కలవారు వేలకొలది పాదములు కలవారు స్వధాస్వరూపుడు బహురూపుడు గొప్పదంతములుకలవారు — అగు ఓ పరమశివా! మీకు నమస్కారము!

**15 పినాకినం మహాదేవం మహాయోగిన మవ్యయమ్**
**త్రిశూలహస్తం వరదం త్ర్యమ్బకం భువనేశ్వరమ్**

**16 త్రిపురఘ్నం త్రినయనం త్రిలోకేశం మహౌజసమ్**
**ప్రభవం సర్వభూతానాం ధారణం ధరణీధరమ్**

17 ఈశానం శఙ్కరం సర్వం శివం విశ్వేశ్వరం భవమ్
ఉమాపతిం పశుపతిం విశ్వరూపం మహేశ్వరమ్

18 విరూపాక్షం దశభుజం దివ్యగోవృషభధ్వజమ్
ఉగ్రం స్థాణుం శివం రౌద్రం శర్వం గౌరీశ మీశ్వరమ్

19 శితికణ్ఠ మజం శుక్రం పృథుం పృథుహరం వరమ్
విశ్వరూపం విరూపాక్షం బహురూప ముమాపతిమ్

20 ప్రణమ్య శిరసా దేవ మనఙ్గాఙ్గహరం హరమ్,
శరణ్యం శరణం యాహి మహాదేవం చతుర్ముఖమ్

పినాకమను ఆయుధమును ధరించినవారు మహాదేవుడు మహాయోగి నాశరహితుడు చేతియందు త్రిశూలమును ధరించినవారు వరదాయకుడు త్రినేత్రుడు లోకేశ్వరుడు, త్రిపురాసురుని సంహరించినవారు మూడునేత్రములు కలవారు ముల్లోకములకు ప్రభువు గొప్పబలశాలి సర్వజీవుల ఉత్పత్తికి కారణభూతులు సమస్తమును ధరించువారు భూభారమును వహించువారు జగత్తుయొక్క శాసకుడు శుభకరుడు సర్వరూపుడు శివుడు విశ్వేశ్వరుడు జగత్తును ఉత్పన్నమొనర్చువారు పార్వతీపతి, పశుపతులుడు విశ్వరూపుడు మహేశ్వరుడు విరూపాక్షుడు పదిచేతులుకలవారు వృషభచిహ్నముకల ధ్వజము లవారు ఉగ్రుడు స్థిరరూపుడు, శివుడు రుద్రుడు శర్వుడు గౌరీశుడు ఈశ్వరుడు శితికంఠుడు జన్మరహితుడు శుక్రుడు పృథువు పృథుహరుడు, శ్రేష్ఠుడు విశ్వరూపుడు బహురూపుడు ఉమాపతి, కాముని భస్మమొనర్చినవారు, హరుడు, చతుర్ముఖుడు

శరణాగతవత్సలుఁడు – అగు మహాదేవునకు శిరస్సుతో ప్రణమిల్లి వారికి శరణాగతుఁడను కావలయును

21 విరోచమానం వపుషా దివ్యాభరణభూషితమ్
అనాద్యన్త మజం శమ్భుం సర్వవ్యాపిన మీశ్వరమ్

22 నిస్త్రైగుణ్యం నిరుద్వేగం నిర్మలం నిధి మోజసామ్
ప్రణమ్య ప్రాఞ్జలిః శర్వం ప్రయామి శరణం హరమ్

తనయొక్క తేజసంపన్నమగు శరీరముచే ప్రకాశించువారు దివ్యభూషణములచే భూషితుఁగు ఆద్యంతరహితుఁగు జన్మరహితుఁగు, శంభువు సర్వవ్యాపి ఈశ్వరుఁడు, త్రిగుణరహితుఁడు ఉద్వేగశూన్యుఁ నిర్మలుఁగ ఓజస్సుల తేజస్సుల నిధి సర్వుల పాపమును దుఃఖమును హరించువారు అగు శంకరునకు ప్రణమిల్లి వారిని శరణుపొందుచున్నాను

23 సమ్మాన్యం నిశ్చలం నిత్య మకారణ మలేపనమ్
అధ్యాత్మ వేద మాసాద్య ప్రయామి శరణం ముహుః

సమ్మాననీయుఁడు, నిశ్చలుఁడు, నిత్యుఁగు, కారణరహితుఁగు నిర్లిప్తుఁడు అధ్యాత్మతత్త్వజ్ఞుఁడు అగు శివుని సమీపించి నేను మరల మరల శరణుపొందుచున్నాను

24 యస్య నిత్యం విదుః స్థానం మోక్ష మధ్యాత్మచిన్తకాః
యోగిన స్తత్త్వమార్గస్థా కైవల్యం పద మక్షరమ్

25 యం విదుః సఙ్గనిర్ముక్తాః సామాన్యం సమదర్శినః,
తం ప్రపద్యే జగద్యోని మయోనిం నిర్గుణాత్మకమ్

అధ్యాత్మవిచారణచేయు జ్ఞానులు మోక్షతత్త్వముఁద ఎవరి స్థితిని నమ్ముచున్నారో తత్త్వమార్గమున పరినిష్ఠితులగు యోగులు పరతరాత్మకైవల్యపదమును ఎవరియొక్క స్వరూపముగ ఎఱుఁగుచున్నారో ఆ భక్తిరహాత్ములైన సమదృష్టిగల మహాత్ములు ఎవరిని సర్వత్ర సమముగ ఉన్నట్లు తెలిసికొనుచున్నారో అట్టి జన్మరహితులును జగత్తునకు కారణభూతులును సర్వజ్ఞులు పరమాత్ములయును అగు శివుని నేను శరణుపొందుచున్నాను

**26 అసృజద్ యస్తు భూరాదీన్ సప్తలోకాన్ సనాతనాన్**
**స్థితః సత్యోపరిస్థాణుం తం ప్రపద్యే సనాతనమ్**

ఎవరు సత్యలోకముపైన స్థితులై భూరాదిసప్తలోకములను సృష్టించెనో నిశ్చలరూపులును సనాతనులును అగు అట్టి శివుని నేను శరణుపొందుచున్నాను

**27 భక్తానాంసులభం తం హి దుర్లభం దూరపాతినామ్,**
**అదూరస్థ మముం దేవం ప్రకృతేఃపరతః స్థితమ్**
**నమామి సర్వలోకస్థం వ్రజామి శరణం శివమ్**

భక్తులకు సులభుఁడును, దైవవిముఖులగు వారికి దుర్లభుఁడును సర్వులకు సమీపమునందున్నవాఁడును ప్రకృతి పరమై యుండువారును సర్వలోకవ్యాపియగు మహాదేవుఁడును అయిన శివునకు నమస్కరించి వారిని శరణుపొందుచున్నాను

ఓమ్

ఓం

# భారతమాహాత్మ్యము

**1** ఇమం శతసహస్రం హి శ్లోకానాం పుణ్యకర్మణామ్
సత్యవత్యాత్మజే నేహ వ్యాఖ్యాత మమితౌజసా

మహాప్రభావశాలియైన సత్యవతీనందనుడగు వ్యాసమునీంద్రుడు పుణ్యాత్ములైన పాండవులకథయగు భారతమును లక్షశ్లోకములతో రచించెను

**2** య ఇదం శ్రావయేద్ విద్వాన్ యే చేదం శృణుయు ర్నరాః
తే బ్రహ్మణః స్థాన మేత్య ప్రాప్నుయు ర్దేవతుల్యతామ్

ఏ విద్వాంసుడు ఈ భారతమును వినిపించునో మఱియు ఎవరు దీనిని విందురో వారు బ్రహ్మలోకమున కేగి దేవతలతో సమానముగ అగుదురు

**3** ఇదం హి వేదైః సమితం పవిత్ర మపి చోత్తమమ్
శ్రావ్యాణా ముత్తమం చేదం పురాణ మృషిసంస్తుతమ్

ఋషులచే ప్రశంసింపబడిన ఈ పురాతన ఇతిహాసము శ్రవణము చేయుటకు యోగ్యములైన గ్రంథము లన్నిటిలోను శ్రేష్ఠమైనది ఇది వేదములతో సమానముగ పవిత్రమైనది ఉత్తమమైనది

**4** ధర్మశాస్త్ర మిదం పుణ్య మర్థశాస్త్ర మిదం పరమ్
మోక్షశాస్త్ర మిదం ప్రోక్తం వ్యాసే నామితబుద్ధినా

పుణ్యకరమగు ధర్మశాస్త్రము ఉత్తమమగు అర్థశాస్త్రము శ్రేష్ఠమైన మోక్షశాస్త్రము అగు ఈ భారతమును మహామేధావియగు వ్యాసుడు చెప్పెను

5 శరీరేణ కృతం పాపం వాచా చ మనసైవ చ
సర్వం సంత్యజతి క్షిప్రం య ఇదం శృణుయా న్నరః

ఏ మనుజుడు ఈ గ్రంథమును వినునో అతడు శరీరము చేతను వాక్కుచేతను మనస్సుచేతను చేసినపాపము నంతయును వెంటనే వదలివేయును

6 శ్లోకం వా ప్యనుగృహ్ణీత తథార్ధశ్లోకమేవ వా
అపి పాదం పఠేన్నిత్యం న చ నిర్భారతో భవేత్

ప్రతిదినము భారతము లోని ఒకశ్లోకము గాని అర్ధశ్లోకమును గాని ఒకపాదమునుగాని చదువవలెను అంతియేకాని భారతమును అసలేమియు చదువక ఉండరాదు

7 నతాం స్వర్గగతిం ప్రాప్య తుష్టిం ప్రాప్నోతి మానవః
యాం శ్రుత్వైవ మహాపుణ్య మితిహాస ముపాశ్నుతే

మహాపుణ్యదాయకమైన ఈ ఇతిహాసమును వినుటమాత్రము చేతనే మనుజునకు కలుగు సంతుష్టి స్వర్గలోకమును పొందినను కలుగదు

8 శృణ్వఞ్ఛ్రద్ధ పుణ్యశీలః శ్రావయంశ్చేద మద్భుతమ్
నరః ఫల మవాప్నోతి రాజసూయాశ్వమేధయోః

ఏ పుణ్యాత్ముడు శ్రద్ధతో ఈ అద్భుతేతిహాసమగు భారతమును వినునో వినిపించునో అతడు రాజసూయయజ్ఞముయొక్కయు ఫలమును పొందును

9 యథా సముద్రో భగవాన్ యథా మేరుర్మహాగిరిః
ఉభౌ ఖ్యాతౌ రత్ననిధీ తథా భారత ముచ్యతే

ఐశ్వర్యపూర్ణమగు సముద్రము ? ప్పదగు మేరుపర్వతము రత్నములకు నిధులని ఎట్లు చెప్పఁబ ?ో అట్లే ఈ గారతమ న్న రత్నస్వరు పములగు ఉపదేశములయొక్కయు కథలయొక్కయు భండార మని చెప్పఁబడినది

10 ఇదం హి వేదైః సమితం పవిత్ర మపి చోత్తమమ్,
శ్రవ్యం శ్రుతిసుఖం చైవ పావనం శీలవర్ధనమ్

ఈ భారతగ్రంథము వేదములతో సమానముగ పవిత్రమైనది ఉత్తమమైనది ఇది వినఁదగినది వినునపు ఇయ్యది చెవులకు సుఖమును కలుగఁజేయును దీనిని శ్రవణము చేయుటచే అంతఃకర ణము పవిత్ర మగును మఱియు ఉత్తమశీలస్వభావమును గూర్చిన బుద్ధి కలుగును

11 ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్

ధర్మ అర్థ కామ మో సంబంధముగ ఏ విషయము లీ గ్రంథమునందు తెలపఁబడినవో అవియే ఇతరత్ర కూడ చెప్పఁ బడినవి దీనియందు లేని విషయములు మఱెచటను లేవు

12 ఆకర్ణ్య భక్త్యా సతతం జయాఖ్యం భారతం మహత్
శ్రీశ్చ కీర్తి స్తథా విద్యా భవన్తి సహితాః సదా

జయ అను పేరుగల ఈ భారతేతిహాసమును సదా భక్తి పూర్వకముగ వినువానికి ఐశ్వర్యము కీర్తి విద్య మూఁడును లభించును

13 కార్ష్ణం వేద మిమం విద్వా ఞ్ఛ్రావయిత్వార్థ మశ్నుతే
ఇదం భారత మాఖ్యానం యః పఠేత్ సుసమాహితః
స గచ్ఛేత్ పరమాం సిద్ధి మితి మే నాస్తి సంశయః

వ్యాసమునిచే రచింపఁబడి ప్రసిద్ధి కెక్కిన ఈ భారతమను పంచమవేదమును ఎవఁడు వినిపించునో అతనికి సంపద చేకూరును

14 భారతం శృణుయా న్నిత్యం భారతం పరికీర్తయేత్
భారతం భవనే యస్య తస్య హస్తగతో జయః

భారతమును సదా వినవలెను సదా పఠించవలెను భారత గ్రంథము ఎవని ఇంటియం దుండునో అతనికి విజయము కరతలామలకమై యుండును

15 భారతం సర్వశాస్త్రాణా ముత్తమం భరతర్షభ
భారతాత్ ప్రాప్యతే మోక్ష స్తత్త్వ మేతద్ బ్రవీమి తత్

భారతము శాస్త్రములలో నెల్ల ఉత్తమమైనది భారతముచే మోక్షము లభించును ఇది పరమసత్యము

16 యత్ర విష్ణుకథా దివ్యాః శ్రుతయ శ్చ సనాతనాః
తచ్ఛ్రోతవ్యం మనుష్యేణ పరం పద మిహేచ్ఛతా

విష్ణువుయొక్క దివ్యకథలు సనాతనములైన శ్రుతులు ఉన్నట్టి ఈ భారతమును పరమాత్మపదమును ఇచ్ఛగించు మనుజుఁడు అవశ్యము పఠించవలెను

17 ఏతత్ పవిత్రం పరమ మేతద్ ధర్మ నిదర్శనమ్
ఏతత్ సర్వగుణోపేతం శ్రోతవ్యం భూతి మిచ్ఛతా

భారతము మహాపవిత్రమైన గ్రంథము ధర్మముయొక్క స్వరూపము నిది సాక్షాత్కరింపఁజేయునదై సమస్తములైన ఉత్తమ గుణములతో కూడినదై యున్నది తన శ్రేయమును, అభివృద్ధిని కోరువారు దీనిని తప్పక పఠింపవలెను

18 కాయికం వాచికం చైవ మనసా సముపార్జితమ్,
తత్సర్వం నాశ మాయాతి తమ స్సూర్యోదయే యథా

సూర్యోదయముచే అంధకారము నశించునట్లు భారతము యొక్క శ్రవణముచే శరీర వాఙ్మనంబులచేఁ గావింపఁబడిన పాప మంతయు నశించిపోవును

19 శృణోతి శ్రావయేద్ వాపి సతతం చైవ యో నరః
సర్వపాపవినిర్ముక్తో వైష్ణవం పద మాప్నుయాత్

ఎవఁడు భారతమును సదా వినునో వినిపించునో అతఁడు పాపము లన్నిటినుండి విముక్తుఁడై విష్ణుపదమును పొందును

20 య శ్చేదం శ్రావయేద్ విద్వాన్ సదా పర్వణి పర్వణి
ధూతపాప్మా జితస్వర్గో బ్రహ్మభూయాయ కల్పతే

ఏ విద్వాంసుఁడు భారతమును సదా ప్రతిపర్వమందును శ్రవణ మొనర్పఁజేయునో అతఁడు పాపరహితుఁడై స్వర్గవిజేతయై, బ్రహ్మమును పొందును

ఓమ్

ఓం

# ఉపోద్ఘాతము

మహాభారతమును రచించినది శ్రీ వేదవ్యాసమహర్షి లిఖించినది శ్రీ గణేశుడు మహాభారతము ఆర్యసంస్కృతియొక్క భారతీయసనాతనధర్మముయొక్క అత్యంత ఆదరణీయమగు ఒక మహాగ్రంథము ఇది అమూల్యధర్మరత్నములయొక్క మహాభాండారము వేదముల రహస్యమును ఉపనిషత్తులసారమును పురాణముల ఆశయమును ఈ గ్రంథమునందు తెలిపితి నని రచయితయగు శ్రీ వేదవ్యాసులు స్వయముగ చెప్పిరి కావున భారతము మహాకావ్యము గూఢార్థమయమగు జ్ఞానవిజ్ఞానశాస్త్రము ధర్మగ్రంథము అధ్యాత్మశాస్త్రము సర్వశాస్త్రసంగ్రహము అయియున్నది దీని అన్నిటికంటెను గొప్పవిషయ మేమనగా దీనియందు అద్వితీయుడును సర్వశక్తిమంతుడును సర్వజ్ఞుడును సర్వలోకమహేశ్వరుడును సర్వసద్గుణసంపన్నుడును సృష్టిస్థితిలయకారకుడును సచ్చిదానందఘనుడును వాసుదేవుడును అగు శ్రీకృష్ణుని గుణగణములయొక్క మధురగానము కలదు ఈ గ్రంథముయొక్క మహిమ అపారమైనది మహానీయులు దీనిని పంచమవేద మని పేర్కొని దీనియొక్క సర్వోపరిమహత్త్వమును శ్లాఘించిరి

ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్

(భారతము 1 62 53)

'ఓ భరతశ్రేష్ఠా! ధర్మ అర్థ కామ మోక్షములనుగూర్చి ఏయే విషయములు భారతమందు తెలుపఁబడినవో అవియే ఇతర

మహాభారతమందు సనత్సుజాతీయము భగవద్గీత అనుగీత భీష్ముని ధర్మబోధ శివసహస్రనామములు విష్ణుసహస్రనామములు మున్నగు ఉత్తమోత్తరవిషయము లుండుటవలన ఇయ్యది పరమ పూజ్యమై యలరారుచున్నది

మహర్షి వేదవ్యాసులు కలియుగారంభమున దేశ కాల ధర్మ ఆయుర్వ్యాదుల స్థితిని గమనించి పరమకృపాపూర్వకముగ సర్వశ్రేయస్సుకోరినవారై ఈ గ్రంథమును రచించిరి జనమేజయుని ప్రశ్నను పురస్కరించుకొని వైశంపాయనుడు ఆతనికి వ్యాసమహర్షి యొక్క ఆజ్ఞచే ఈ గ్రంథమును వినిపించెను తదుపరి సూతపుత్రుడగు ఉగ్రశ్రవుడు నైమిశారణ్యవాసులగు శౌనకాదులకు పదునెనిమిది పర్వములతో గూడిన ఈ మహాగ్రంథమును వినిపించెను

ఇదం హి వేదైః సమితం పవిత్రమపి చోత్తమమ్।
ధన్యం యశస్య మాయుష్యం శ్రోతవ్యం నియతాత్మభిః॥

మహాభారతము వేదములతో సమానమైనది పవిత్రమైనది ఉత్తమమైనది ధనమును ఆయుష్షును కీర్తిని ఒసంగునది అయియున్నది కావున సంయమశీలురు దీనిని పఠింతురు గాక!

ఆర్యావర్తమునందలి గ్రంథములన్నిటికంటె మహాభారతము చాల గొప్పది సామాన్యముగ దేనినిగూర్చియైన వర్ణించి చెప్పినపుడు జనులు మహాభారతమందలి దృష్టాంతములనే చెప్పుచుందురు వాస్తవముగ అజ్ఞానాంధకారమునబడి అంధులై సంసారమున తిరుగాడుచుండు జనులనేత్రములను జ్ఞానాంజనముయొక్క శలాకముచే తెరచునిమిత్తమే శ్రీ వేదవ్యాసమునీంద్రులు మహా

భారతమును రచించిరి మహాభారతమను సూర్యునిచే జనుల అజ్ఞానాంధకారము తొలగిపోవుచున్నది భారతమను పూర్ణచంద్రునిచే మనుజుల బుద్ధియను కలువ వికాసమును పొందుచున్నది ఎందఱో విద్వాంసులు ఈ గ్రంథము యొక్క అంశమును గైకొని కావ్యరచన నొనర్చుచున్నారు ఎందఱో వక్తలు వ్యాఖ్యాతలు దీనియొక్క ఒక్క అంశముపై సభలలో ఉపన్యసించుచున్నారు వ్యాఖ్యానించుచున్నారు దీనినిబట్టి ఈ మహాగ్రంథముయొక్క యోగ్యత ఎట్టిదో జనులు ఊహించవచ్చును

భారతీయ సాహిత్యమునందు మహాభారతమునకు మహోన్నత స్థానము కలదు విద్వాంసులు వేదములనువలె దీని నాదరించుచుందురు ఈ మహాగ్రంథమునందు గురుభక్తి మాతాపితరుల సేవ పాతివ్రత్య ధర్మము తీర్థములయొక్క యజ్ఞ దాన తపోవ్రత ఉపవాససేవాదుల యొక్క మాహాత్మ్యము వర్ణాశ్రమ ధర్మములు రాజధర్మములు, ఆపద్ధర్మములు దానధర్మములు శ్రాద్ధధర్మములు మోక్షధర్మములు, మోక్షప్రాప్తికొఱకై భక్తి జ్ఞాన వైరాగ్య సదాచార నిష్కామ కర్మాదులు చాల విశదముగ వర్ణింపబడియున్నవి ప్రపంచమంతయు ఆదరదృష్టితో చూచుచున్నట్టియు విశ్వసాహిత్యమందలి సర్వోత్తమ గ్రంథమైనట్టియు భగవద్గీతయను అనుపమ గ్రంథము ఈ భారతము నందే కలదు కావున ఇట్టి పరమోపయోగకరమగు పవిత్ర గ్రంథమును సర్వులును శ్రద్ధాపూర్వకముగ అధ్యయనము చేయవలయును

మహాభారతమందు శిక్షాప్రదములైన అనేక ఉపదేశములు, ఆఖ్యానములు తెలుపబడియున్నప్పటికిని సారభూతములైన కొన్ని మాత్రము ఇపు చట ఉల్లేఖింప బడుచున్నవి——

మనుజుని శ్రేయస్సునకు శ్రద్ధయే ప్రధాన హేతువై యున్నది భగవంతుని యెడల, మహాత్ముల యెడల, శాస్త్రములయెడల, మాతా

పితరుల యెడల గురువుల యెడల భక్తికలిగియుండుట వారి వాక్యము లందు ఆత్మయొక్క అస్తిత్వమందు విశ్వాసము కలిగియుండుట శ్రద్ధ యనఁబడును దీనినిగూర్చి మహాభారతమందు అనేక ఉదాహరణలు లభించుచున్నవి ఆయోదధౌమ్యమహర్షి శిష్యులగు ఆరుణి ఉపమన్యువు వేదుఁడు అనువారి గురుభక్తి శ్రద్ధ పేర్కొనఁదగియున్నవి బ్రహ్మవేత్తయు ఆచార్యుఁడునగు వేదుని శిష్యుఁడగు ఉత్తంకుని గురుభక్తి గురుసేవ ప్రశంసనీయములై యున్నవి యయాతి కుమారుఁడగు పూరుపు యొక్కయు భీష్ముని యొక్కయు పితృభక్తి గణనీయమై యున్నది ధర్మవ్యాధుఁడు మాతాపితరుల సేవచేతను ఆజ్ఞాపాలనము చేతను దివ్యదృష్టి సంపన్నుఁడును గొప్ప ధర్మజ్ఞుఁడును అయి కౌశికుఁడను మహాతపస్వికి ధర్మోపదేశము చేయఁగలైను ఈ ప్రకారముగ మనుజుని శారీరక మానసిక భౌతిక నైతిక వ్యావహారిక, ధార్మిక, ఆధ్యాత్మిక ఉన్నతికి సంబంధించిన అనేక ఆఖ్యానములు దృష్టాంతములు భారతమునందు కలవు బ్రహ్మచర్యాశ్రమ గృహస్థాశ్రమ, సంన్యాసాశ్రమ ధర్మము లెన్నియో ఈ మహాగ్రంథమున తెలుపఁబడినది

ఇఁక మహాభారతమందలి ప్రధాన పురుషపాత్రలను గుఱించియు ప్రధాన స్త్రీపాత్రలను గుఱించియు ఒకింత యోచించెదము—

ఓమ్

# భారతమందలి కొన్ని పురుష పాత్రలు

## శ్రీ కృష్ణుఁడు

ఆదిపర్వమందలి ప్రథమాధ్యాయమందు సౌతి ఉగ్రశ్రవుఁడు శౌనకాదులకు—మహాభారతము యొక్క ముఖ్యవిషయము స్వయముగ సనాతన పరబ్రహ్మ స్వరూపుఁడైన వాసుదేవుఁడగు శ్రీకృష్ణుఁడే యని పేర్కొనెను వారినుండియే ఈ సంపూర్ణ విశ్వము ఉత్పన్నమైనది వారియొక్క దివ్యలీలలనే భక్తులు సంకీర్తన మొనర్చుచుందురు భారతమందు మొట్టమొదట శ్రీకృష్ణునియొక్క దర్శనము ద్రుపదుని రాజధానియందు ద్రౌపదియొక్క స్వయంవర సందర్భమున అగును అచట కౌరవపక్షమువారు పాండవులతో యుద్ధముచేయ దలంపగా శ్రీకృష్ణుఁడు కౌరవపక్ష రాజులకు అకారణముగ ఉత్తేజితులు కావలదని హితము చెప్పెను అనంతరము శ్రీకృష్ణుఁడు భీమునిచే మల్లయుద్ధమున జరాసంధుని అంతమొందింపఁజేసి ప్రజలకు హితమును చేకూర్చెను ధర్మరాజు కావించిన రాజసూయ యజ్ఞమందు శ్రీకృష్ణుఁడు బ్రహ్మనిష్ఠుల చరణక్షాళన కార్యమును స్వీకరించి బ్రహ్మనిష్ఠుల సేవామహిమను తద్ద్వారా లోకమునకు చాటెను తదుపరి అహంభావపూరితుఁడగు శిశుపాలుని శిరస్సును ఛేదించి వైచెను రాజసూయ యాగసందర్భమున భీష్ముఁడు శ్రీకృష్ణుఁడే ప్రథమ సత్కారమున కర్హుఁడని తెలుపగా ధర్మరాజు శ్రీకృష్ణుని ప్రప్రథమమున సేవించి పూజించెను ద్రౌపదీ వస్త్రాపహరణ సమయమున ద్రౌపది శ్రీకృష్ణుని సహాయ మర్థింప వస్త్రప్రదానము ద్వారా వారు ఆమెను కాపాడిరి

అరణ్యమున ధర్మరాజుయొక్క ప్రశ్నను పురస్కరించుకొని మార్కండేయ మహాముని శ్రీకృష్ణుని మహిమనుగూర్చి వర్ణించి చెప్పెను ఎప్పటి యుద్ధమును నివారించుటకై శ్రీకృష్ణుడు శాంతి దూతగ వ్యవహరించి దుర్యోధనునకు ఎంతయో నచ్చచెప్పెను తత్సమయమున కౌరవసభలో విశ్వరూపమునుగూడ చూపెను కాని దుర్యోధనుడు వారి బోధలను వాక్యములను పెడచెవిని పెట్టెను యుద్ధప్రారంభసమయమున శ్రీకృష్ణుడు అర్జునునకు భగవద్గీత ను బోధించి పెక్కు ధర్మోపదేశములద్వారా అతనికి ధైర్యమును కలుగ జేసెను యుద్ధమందు భీష్ముని వధించుటకై చక్రమును చేబట్టి చనుచుండ అర్జునుడు వారించెను యుద్ధసమయమున శ్రీకృష్ణుడు పెక్కు కీలకసమయములందు పాండవులకు సముచితములైన సలహాలను ఒసంగి వారి విజయమున కెంతగనో తోడ్పడెను

అంపసెజ్జపై పరుండియున్న భీష్ముడు శ్రీకృష్ణుని లెస్సగ స్తుతించెను ఈ ప్రకారముగ మహాభారతమందు సచ్చిదానంద రూపుడగు శ్రీకృష్ణుని మహిమ వారి భక్తవత్సలత్వము, వారిని పొందుటకు సాధనభూతములైన ధర్మములు తెలుపబడి యున్నవి శ్రీకృష్ణుడు స్వయముగ భగవంతుడు అవతారమూర్తి వారు సర్వమయులు సర్వాతీతులు జగత్తంతయు వారి స్వరూపమే వారినే ఆశ్రయించవలెను వారిని శరణుపొంది ధర్మపూర్వకముగ వ్యవహరించుచు అధర్మాచరణను తొలగించుకొనవలెను

భారతాఖ్యం సరోభాతి వ్యాసవాగమృతైర్వృతమ్
యత్ర క్షత్ర కులాబ్జేషు హంసయతి హరేర్యశః

మహాభారతమను సరస్సు వ్యాసమునీంద్రుని వాక్కను అమృతముచే పరిపూర్ణమై శోభించుచున్నది అందు క్షత్రియకుల

రూప కమల సమూహములందు శ్రీ కృష్ణుని ఉజ్జ్వల కీర్తి హంస వలె క్రీడించుచున్నది

ఓమ్

# భీష్ముడు

భీష్ముడు కురువంశపు మహారాజగు శాంతనుని పుత్రుడు తల్లి పేరు గంగాదేవి ఇతడు చిన్నతనమునందే సాంగోపాంగముగ వేదములను అధ్యయనముచేసి అస్త్రములను అభ్యసించెను అట్లు అభ్యసించుచు ఒకపుడతడు తన బాణముల ప్రభావముచే గంగానది యొక్క ప్రవాహమును అడ్డగించెను తండ్రియగు శాంతనుడు కైవర్తరాజు కుమార్తెయగు సత్యవతిని వివాహము చేసికొనదలంచగా ఆ రాజుయొక్క షరతుప్రకారము సత్యవతీ తనయునకే రాజ్యాధికారము లభింపజేయు నిమిత్తము భీష్ముడు ఆజీవిత బ్రహ్మచర్య ప్రతిజ్ఞను గైకొని రాజ్యమును తృణమువలె పరిత్యజించెను తండ్రి యొక్క ఆశయమును నెరవేర్చుటకై భీష్ముడిటి గొప్ప ప్రతిజ్ఞను గైకొని తన అపారపితృభక్తిని లోకమునకు వెల్లడించెను శాంతనునకు సత్యవతివలన చిత్రాంగుడు విచిత్రవీర్యుడు అను ఇరువురు పుత్రులు కలిగిరి కొంతకాలమునకు శాంతనుడు ఇహలోకమును వీడెను చిత్రాంగుడు గంధర్వయుద్ధమందు మరణించెను విచిత్రవీర్యుడు క్షయరోగమువలన మృతినొందెను అత్తఱి కురువంశము యొక్క ఉచ్ఛేదము సంభవింపకుండు నిమిత్తమై వివాహము యొక్క అవసరము ఏర్పడినప్పటికిని భీష్ముడు తాను కావించిన భీష్మప్రతిజ్ఞను ఏ మాత్రము సడలింపలేదు పంచభూతములు తమతమ గుణములను వదలివేసినను చంద్రుడు తన శీతలత్వమును పరిత్యజించినను నేను నా సత్యప్రతిజ్ఞను విడనాడజాలను నేను త్రైలోక్య

రాజ్యమును బ్రహ్మదేవుని పదమును కూడ వదలివేయఁగలను, కాని సత్యమును వదలజాలను అని అతఁడు ఘోషించెను

పరశురామునితో సంభవించిన యుద్ధమందు భీష్ముఁడు తన అద్భుత పరాక్రమమును వెల్లడించెను కౌరవసభయందు శ్రీకృష్ణుఁడు సంధిని గూర్చిన ప్రస్తావనను తెచ్చినపుడు — శ్రీకృష్ణుని వాక్యములను విని ఆ ప్రకార మాచరించుట శ్రేయస్కర మని భీష్ముఁడు దుర్యోధనునకు ఎంతయో హితము చెప్పెను కాని దుర్యోధనుఁడు సమ్మతింపలేదు అందుచే యుద్ధము అనివార్య మయ్యెను

మహాభారతయుద్ధమందు కౌరవపక్షమందలి సర్వశ్రేష్ఠ యోధుఁడు భీష్ముడే అయియుండెను కనుకనే కౌరవసేనయొక్క ప్రథమ సేనానాయకుని గౌరవమును అతఁడు పొందఁగల్గెను పాండవులకు కౌరవులకు ఇరువురకు ఎతామహుఁడై యుండుటచే భీష్ముఁడు ఇరువురియెడల ప్రేమ సానుభూతి గలిగియుండెను యుద్ధము జరిగిన పదునెనిమిది రోజులలో పదిరోజులు భీష్ముఁడు కౌరవ సేనానాయకుఁడగ నుండెను వృద్ధుఁడైనను భీష్ముడు యుద్ధమందు అద్భుత పరాక్రమమును చూపెను ఒక సమయమున శ్రీకృష్ణుఁడు చక్రమును బూని భీష్మునితో తలపడుటకు వెడలుచుండ అర్జునుఁడు వారించెను

భీష్ముఁడుండగా కౌరవసేనను జయించుట దుర్లభ మని పాండవులు గ్రహించి అతనికడకేగి అతఁడు మరణించునుపాయమును తెలుపుఁడని యడుగఁగా అపుడు శిఖండి విషయమును వారి కెఱిఁగించి భీష్ముఁడు పాండవులకు అనుకూల వాతావరణమును కల్పించెను

యుద్ధమందు భీష్ముని శరీరమున రోమరోమమున బాణములు గ్రుచ్చుకొనగా అతడు ధరాశాయి అయి దేహత్యాగమునకు దక్షిణాయనము ఉపయుక్తము కాదని తలంచి ఉత్తరాయణము వచ్చు

వఱకు శరశయ్యపైననే పరుండియుండెను. తండ్రివలన స్వేచ్ఛామృత్యురూపవరమును అతఁడు పొందియుండెను. భీష్ముని చికిత్సకొఱకై దుర్యోధనుఁడు వైద్యులను పిలిపించినను భీష్ముఁడు చికిత్సకు అంగీకరింపక వారి నందఱిని పంపివేసెను. అచ్చటి జనులు భీష్ముని అసాధారణ ధర్మనిష్ఠను సాహసమును చూచి ఆశ్చర్యచకితులైరి.

భీష్ముఁడు అఖండ బ్రహ్మచారి, ఆదర్శ పితృభక్తుఁడు, ఆదర్శ సత్యప్రతిజ్ఞుఁడు, ఆదర్శవీరుఁడే కాక మహాశాస్త్రవేత్తయు, ధర్మవేత్తయు, ఈశ్వర తత్త్వవేత్తయు, గొప్ప భగవద్భక్తుఁడును అయియుండెను. శ్రీకృష్ణుని ప్రేరణచే అతఁడు అంపశయ్యపై పరుండియే ధర్మరాజునకు పెక్కుదినములు ధర్మోపదేశమును గావించెను. అనేక మహత్త్వపూర్ణ విషయములపై ప్రసంగించెను. భారతమందలి శాంతిపర్వ అనుశాసన పర్వములందట్టి బోధ విశదముగ తెలుపఁబడినది. భీష్ముని ధర్మబోధ వినుటకై పలువురు అచ్చోటికేతెంచిరి.

శ్రీకృష్ణుని యొక్క మహిమను ప్రభావమును భీష్ముఁడు చక్కఁగ నెఱిఁగియుండెను. రాజసూయ యాగమందు ప్రథమముగ ఎవరికి అర్ఘ్యనివేదనము కావింపవలెనని ధర్మరాజు అడుగగా శ్రీకృష్ణుఁడే అట్టి పూజనమునకర్హుఁడని భీష్ముఁడు చెప్పెను. బాణశయ్యపై పరుండి భీష్ముఁడు శ్రీకృష్ణుని లెస్సగ స్తుతించెను. శ్రీకృష్ణుఁడు సాక్షాత్ భగవంతుఁడే యని పలుసందర్భములందును జనులకు తెలియఁజేసెను. ధర్మరాజునకతఁడు వినిపించిన విష్ణుసహస్రనామ స్తోత్రము ద్వారా అతనియొక్క భగవద్భక్తి, భగవత్తత్త్వ విజ్ఞానము బాగుగ ప్రస్ఫుటమగుచున్నవి. భీష్మునివంటి మహనీయులు ప్రపంచ ఇతిహాసమున చాల అరుదుగా కనిపించుదురు. వారి గుణగణములు లోకులకు ఆదర్శవంతములై యలరారుచున్నవి.

# ధర్మరాజు

మూర్తీభవించిన ధర్మమే ధర్మరాజు అతనికి యుధిష్ఠిరుడను పేరుకూడ కలదు పాండురాజునకు కుంతీదేవివలన కలిగిన ఐదుగురు కుమారులలో జ్యేష్ఠుడు ధర్మరాజ ఆతనియందు ధైర్యము స్థిరత్వము సహిష్ణుత్వము నమ్రత దయాళుత్వము అవిచలప్రేమ, మున్నగు అనేక లోకోత్తర సుగుణములు కలవు అతడు తన శీల సదాచార విచారశీలత్వములచే చిన్నతనమునందే లోకప్రియుడయ్యెను

ధర్మరాజ అజాతశత్రువని లోకమున ప్రసిద్ధికెక్కెను అతనికి ఎవరితోను వైరము లేదు శత్రువుల యెడలను అతనికి సద్భావము కలిగియుండెను పాండవులు ద్వైతవనమందున్నప్పుడు గంధర్వులు దుర్యోధనుని యుద్ధమందు ఓడించి బంధించిరను వార్త వినగనే ధర్మరాజు తన సోదరులకు అతనిని ఎట్లైన విడిపించుడని చెప్పి పంపగా అర్జునుడు బాణవర్షమును కురిపించి గంధర్వులనుండి దుర్యోధనాదులను విడిపించిరి ఈ ప్రకారము అపకారికి ఉపకారము నొనర్చి ధర్మరాజ తన విశాల హృదయమును జనులకు వ్యక్తము చేసెను పాండవుల వనవాస సమయమున ఆశ్రమమందు ద్రౌపది ఒకతెయే యున్నపుడు, సింధురాజగు జయద్రథుడు అచటికి వచ్చి ఆమెను బలాత్కారముగ రథముపై కూర్చుండబెట్టి వెడలుచుండ ఆ వార్త తెలిసికొని పాండవు లతనిని వెన్నంటిరి భీముడాతనిని బంధించి ధర్మరాజు యెద్దకు గొనిరాగా ధర్మరాజు దయాపూర్వకముగ అతని విడిపించ జేసి తన క్షమాశీలత్వమును దయాళుత్వమును ప్రత్యక్షముగ చూపెను

అరణ్యమందు ఒకనాడు ధర్మరాజునకు దప్పిక కలుగగా నకులుని పిలిచి సమీపమునగల ఒక చెఱువునందలి నీటిని పాత్రతో

తీసుకొని రమ్మనిచెప్ప ఆతఁడట్లే వెడలఁగా ఆ చెఱువునొద్ద ఒక యక్షుఁడు నేనడుగు ప్రశ్నలకు జవాబు ఇచ్చి తరువాత నీరు త్రాగుము, నీరు గైకొని పొమ్ము అని చెప్పఁగా, నకులుఁడు ఆ వాక్యములను సరకుగొనక నీరు త్రాఁగఁబోఁగా నిశ్చేష్టుఁడై క్రింద పడిపోయెను అట్లే తక్కిన ముగ్వురు సోదరులు కూడ పడిపోయిరి తుదకు ధర్మరాజు అచటికి స్వయముగ వెడలి ఆ యక్షుని ప్రశ్నలకు సముచిత ప్రత్యుత్తరముల నీయఁగా అతఁడు సంతుష్టుఁడై నీ సోదరులలో నీవు కోరినవాని నొకనిని ఉజ్జీవింపఁ జేసెద నని తెలుప ధర్మరాజు నకులుని ఉజ్జీవింపఁజేయు మని కోరెను. అట్లేల కోరితివని అడుగఁగా ధర్మరాజ తన తండ్రికి కుంతి మాద్రి అని ఇరువురు భార్యలు కలరనియు, కుంతీ పుత్రులలో తానున్నాననియు మాద్రీ సుతులలో నకులు డొకఁ డుండినచో ఇరువురు తల్లులు పుత్రవతులుగా నుందురని చెప్పి తన అద్భుత సమభావమును లోకమునకు వెలడి చేసెను యక్షుఁడు సంతసించి కలుగురు సోదరులను ఉజ్జీవింపఁ జేసెను

ధర్మరాజునకు శ్రీకృష్ణుని యెడల దుర్గాదేవి యెడల మిక్కుటమగు భక్తి కలదు అతఁడు దుర్గాదేవిని స్తుతించి ఆమె వలన వరమును పొందెను (అజ్ఞతవాసము జయప్రదముగా జరుగు లాగున వరసిద్ధిని బడసెను) ధర్మరాజు సదాచార సంపన్నుఁడు వినయశీలుఁడు సమయోచిత వ్యవహారమం దతఁడు అత్యంత కుశలుఁడు అతఁడు గురుజనుల యెడల మానమర్యాదలు కలిగి యుండెను మహాకఠినసమయములందు కూడ అతఁడు శిష్టాచార మర్యాదను మఱువకుండెను మహాభారతయుద్ధారంభ సమయమున ఇరుపక్షములందు సేనలు సుసన్నద్ధములై యున్నపుడు ధర్మరాజు శత్రుసేన యొక్క మధ్యనుండిపోయి భీష్మ ద్రోణ కృప, శల్యుల పాదములకు నమస్కరించి వారి ఆశీర్వాదమును అర్థించెను ధర్మ రాజుతెక్క ఇట్టి వినయపూర్వక శిష్టజనోచితవ్యవహారమును వారందఱు మిక్కిలి ప్రసన్నులైరి

ధర్మరాజుయొక్క ఉదారత్వము చెప్పుకోదగినది పాండవులకు రాజ్యమొసంగుటకు కౌరవులు సమ్మతించనపుడు తమకు ఐదు గ్రామములైనను ఇచ్చిన చాలునని ధర్మరాజు తెలియజేసెను కాని దుర్యోధనుడంగీకరింపలేదు కావున యుద్ధము అనివార్యమైనది యుద్ధము సమాప్తమైన వెనుక ధర్మరాజుయొక్క రాజ్యాభిషేకానంతరము గూడ ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రుల యెడల ఎంతయో సద్భావము కలిగియుండెను ధర్మరాజు ఎచట వెళ్ళినను అచట పవిత్ర వాతావరణము నెలకొనుచుండును ఆతని సన్నిధియందు నరకవాసులు గూడ సుఖశాంతులను బడసిరి నహుషుడు అగస్త్యుని శాపముచే అజగరమై యున్నపుడు ధర్మరాజుయొక్క దర్శన సంభాషణల మాత్రముచే అజగర జన్మనుండి విముక్తి నొంది తిరిగి స్వర్గమును పొందెను వెయ్యేల

ధర్మో వివర్ధతి యుధిష్ఠిర కీర్తనేన

అనుటచే ధర్మరాజుయొక్క కీర్తనమాత్రముచే ధర్మము అభివృద్ధియగును ధర్మరాజుయొక్క జీవితము మహాపవిత్రమై ధర్మపూర్ణమై జనులకు ఆదర్శవంతమై అలరారుచున్నది

## భీముడు

భీముడు మహాబలశాలి ఎచట అన్యాయము జరుగుచుండుట అతడు చూచునో వెంటనే ప్రతీకారమొనర్చుటకు సిద్ధపడుచుండును అతడు తన అన్నయగు ధర్మరాజుయొక్క ఆజ్ఞను శిరసావహించుచుండెను వారణావతము నందలి లక్క ఇంటినుండి బయటకు వెడలిన పిదప భీకరారణ్యమున జనునపుడు భీముడు హిడింబాసురునితో పోరాడి అతనిని వధించెను ఏకచక్రపురమున బకాసురుని సంహరించి ప్రజలకు ఆనందమును కలుగజేసెను భీముడు క్షాత్రధర్మము రూపు దాల్చినవాడు అతడు మల్లయుద్ధమున శల్యుని ఓడించి మహా

రాక్రమమును చూపెను మఱియు అతనిని వధింపక విడిచిపెట్టి తన సౌజన్యమును ప్రకటించెను చనిని అతని పరివారమును తరిమి పెట్టి భీముఁడు విరాటదేశ ప్రజలను బాధలనుండి విముక్తులఁజేసెను

ఇక నిట్లు కార్యార్థి భవించిన ధీరత్వమని చెప్పవచ్చును పుష్కర కార్యముల నెన్నిటనో అతఁడు సాధించెను మహాశక్తిశాలియగు జరాసంధుని మల్లయుద్ధమున భీముఁడు చీల్చివేసెను భీముఁడు కేవలము యోధుఁడే కాక నీతిశాస్త్ర కోవిదుఁడును అయియున్నాఁడు ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమున భీముఁడు శత్రువు లందఱిని చంపెద ననియు దుశ్శాసనుని వక్షఃస్థలమును చీల్చివైచి రక్తమును త్రాగెద ననియు శపథము చేసెను తదుపరి ఆ ప్రతిజ్ఞను అక్షరశః నెరవేర్చెను భీముఁడు యుద్ధమందు తన అపూర్వ బలపరాక్రమములను చూపి శత్రుసేనలను పరాజితులుగ చేసి పాండవుల విజయమున కెంతయో దోహదమును కలుగజేసెను

## అర్జునుఁడు

అర్జునుఁడు పాండవ మధ్యముఁడు మహాపరాక్రమశాలి అస్త్రశస్త్ర విద్యానిపుణుఁడు సాక్షాత్ నరఋషియొక్క అవతారము శ్రీకృష్ణుని పరమ భక్తుఁడు సఖుఁడు అర్జునుని నిమిత్తముగా నుంచుకొని శ్రీకృష్ణుఁడు దుష్టసంహారమను తన అవతారోద్దేశ్యమును నెరవేర్చెను అర్జునునిగూర్చి శ్రీకృష్ణుఁడే స్వయముగ గీతయందు భక్తోఽసి మే సఖా చేతి (నీవు నా భక్తుఁడవు సఖుఁడవు) అని చెప్పెను శ్రీకృష్ణుఁడు అర్జునుఁడు అనేక పర్యాయములు భిన్న భిన్న స్థానములందు చాలకాలము కలిసిమెలసి అన్యోన్య సద్భావముతో ఆత్మీయతతో మెలఁగి యుండిరి ఉత్తర గోగ్రహణ సమయమందును యుద్ధమందును భీష్మునంతటి మహాయోధాగ్రేసరుని కూడ ఎదిర్చి అర్జునుఁడు విజయమును చేబట్టెను

పుత్రశోకముచే పీడితుఁడైన అర్జునుఁడు అభిమన్యుని మృత్యువునకు ప్రధాన కారణము జయద్రథుఁడని తెలిసికొని మఱునాటి దినమున సూర్యాస్తమయమునకు ముందే జయద్రథుని వధించి వేసెదనని ప్రతిజ్ఞను పూని శ్రీకృష్ణుడు తెలిపిన యుక్తి ననుసరించి ఆ ప్రకారమే ఆతనిని అంతమొందించి వేసెను

అర్జునుఁడు శివుని గూర్చి తపస్సుచేసి వారివలన పాశుపతాస్త్రమును బడసెను శివునకున్ను అర్జునుని యెడల చాల దయకలదు ఇంద్రునివలన అర్జునుఁడు గాండీవ మను అద్భుత ధనుస్సును పొందెను అర్జునుని యందు దైవీగుణము లనేకములు కలవు అతఁడు ధీరుఁడు వీరుఁడు ఇంద్రియజేత దయాళువు కోమలస్వభావుఁడు సత్యప్రతిజ్ఞుఁడు అయియుండెను అతనియందు పుట్టుకనుండియు దైవీసంపద్గుణములు అలరారుచుండెను

సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ అని ఈ విషయమును భగవానుఁడే గీతయందు తెలిపియుండెను అర్జునుని యోగ్యతను గమనించి శ్రీకృష్ణుఁడు అతనిని నిమిత్తముగా నుంచుకొని మహత్తరమైన గీతా శాస్త్రమును లోకమునకు అందించెను గీతను భగవానుని ముఖతః విను భాగ్యమును బడసిన అర్జునుఁడు ధన్యుఁడు

ద్రౌపదియొక్క స్వయంవర సమయమున అర్జునుఁడు ఏకచక్రపురమందు దుర్యోధన సాల్వ శిశుపాల, జరాసంధ శల్యాదు లెవ్వరును చేయఁజాలని పని చేసివైచెను అతఁడు ధనుస్సును అవలీలగ ఎత్తి లక్ష్యమును భేదించివైచి ద్రౌపదిని బడసెను

ఖాండవ దహన సమయమందును అర్జునుఁడు అద్భుత పరాక్రమమును చూపెను ఇంద్రుని వాక్యమును పురస్కరించుకొని

అర్జునుఁడు నివాత కవచులను దానవులను సంహారించెను అర్జునుఁడు కొంతకాలము స్వర్గమున నివసించి ఇంద్రుని నుండి కొన్ని అస్త్ర విద్యలను నేర్చుకొనెను మహాభారత యుద్ధమందు అర్జునుఁడు ప్రధాన పాత్ర వహించెను ఆ యుద్ధమందు శ్రీకృష్ణుఁడు అర్జునుని సారథిగ నుండెను యుద్ధమందు శ్రీకృష్ణుని సహాయముచే అర్జునుఁడు భీష్మ ద్రోణ కర్ణ అశ్వత్థామాది యోధాగ్రేసరులను ఎదుర్కొని విజయమును సాధించెను శూరవీరత్వము అస్త్రజ్ఞానము ఇంద్రియ జయము – అను మూఁడు గుణములయొక్క అద్భుత సమ్మిశ్రణము అర్జునుని యందు కలదు అర్జునుని జీవితము ఒక దివ్యజీవితము ఆతని చరిత్ర ఆదర్శవంతము శిక్షాప్రదము అయియున్నది

## అభిమన్యుఁడు

అభిమన్యుఁడు మహాభారత కావ్యమందలి ఒక అపూర్వపాత్ర అతఁడు అర్జునుని కుమారుఁడు తల్లి సుభద్ర అర్జునునితో సమానమైన ధనుర్ధరుఁడు పాండవుల అజ్ఞాతవాసానంతరము అభిమన్యుని వివాహము విరాటుని పుత్రికయగు ఉత్తరతో కావింపఁబడెను మహాయుద్ధమందు ద్రోణుఁడు సేనాధ్యక్షుఁడుగ నున్న సమయమున అభిమన్యుఁడు ఒంటరిగనే శత్రువ్యూహమును ఛేదించుచు పోయెను అభిమన్యుని అపూర్వ పరాక్రమమునకు ద్రోణాచార్యుఁడు కూడ చాల ప్రశంసించెను కాని అన్యాయముగ ఆఱుమంది యోధులు నలువైపుల నుండి ఆ బాలకుని చుట్టుముట్టి ఆతనిని ధనుర్విహీనునిగను రథరహితునిగను గావించి వధించివేసిరి అభిమన్యుని అద్భుత వీరత్వమును పరాక్రమమునుగాంచి సర్వులు ఆశ్చర్యచకితులైరి శ్రీకృష్ణుని యందు పాండవులయందు ఏ శ్రేష్ఠగుణములు కలవో, అవి యన్నియు అభిమన్యునియందు ఏకీభవించి యున్నవి

# వేదవ్యాసులు

మహర్షి వేదవ్యాసులు పరాశరుని పుత్రులు తల్లి సత్యవతి అతఁడు మహాభారతము యొక్క రచయిత అనేక శక్తిసంపన్నుఁ డగు మహాత్ముఁడు వ్యాసముని నాలు వేదములను విభజించి వేద విస్తారమును గావించినందువలన వేదవ్యాసులని ప్రసిద్ధి కెక్కెను ఇతనికి కృష్ణద్వైపాయనుఁడు బాదరాయణుఁడు అను పేర్లు గూడ కలవు పదునెనిమిది పురాణములను మహాభారతమును బ్రహ్మసూత్రము లను వ్యాస స్మృతిని ఈతఁడే రచించెను శ్రుతి స్మృతి పురాణ ములకు ధర్మమునకు వ్యాసులు ప్రధాన వ్యాఖ్యాత యని చెప్పవచ్చును ఆధ్యాత్మిక చరిత్రయందు వ్యాసుల పేరు చిరస్థాయిగ నుండ గలదు భగవద్గీత మొదలగు అనుపమరత్నములు వ్యాసుల కృపచేతనే లోకమునకు లభ్యమైనవి శ్రీకృష్ణునిచే ఒసంగఁబడిన భగవద్గీతయను మహత్తర జ్ఞానోపదేశమును వ్యాసమహర్షి ఛందోబద్ధ మొనర్చి మహాభారతమందు గ్రథిత మొనర్చి లోకమునకు మహోపకార మొనర్చెను అతఁడు త్రికాల దర్శియు స్వేచ్ఛాగమనము కల వాఁడును అయియుండెను

పాండవులు వనవాసము చేయుచున్న కాలమున దుర్యోధనుఁడు శస్త్రాస్త్ర సుసజ్జితుఁడై పాండవులపై ఆక్రమణము సలుప దలంచినపుడు వ్యాసులు తన దివ్యదృష్టిచే ఆ విషయ మెఱిఁగి దుర్యోధనునకు బుద్ధి చెప్పి ఆ దుష్కర్మనుండి అతనిని విరమింపఁ జేసెను

వ్యాసమహర్షి సంజయునకు దివ్యదృష్టి నొసంగెను దాని ప్రభావముచే సంజయుఁడు యుద్ధక్షేత్రమున జరిగిన విషయము లన్నిటిని తెలిసికొని ధృతరాష్ట్రునకు తెలియఁజెసెను శ్రీకృష్ణుఁడు అర్జునునకు బోధించిన భగవద్గీతోపదేశమును వ్యాసప్రసాదిత దివ్య దృష్టి వలననె సంజయుఁడు వినఁగల్గెను మఱియు భగవానుని విశ్వ రూపమునుకూడ చూడఁగల్గెను ధృతరాష్ట్రుఁడు గాంధారి వనమందు

నివసించుచున్నపుడు ధర్మరాజు తన పరివారముతో అచటి
కేతెంచినపుడు వ్యాసమహర్షి గూడ అచటికి వచ్చి పుత్రశోకముతో
కుమిలుచున్న ధృతరాష్ట్రుని వరము కోరుకొనుమని యడుగగా
యుద్ధమందు మృతినొందిన తన పుత్రులను బంధువులను చూడఁ
దలంచినట్లు అతఁడు చెప్పగా అటే వ్యాసులు వారందఱిని పవిత్ర
గంగానదీ తీరమున మృతులందఱిని చూపెట్టెను ఆ సమయమున
వ్యాసులు ధృతరాష్ట్రునకు దివ్యదృష్టి నొసంగెను బంధువు లందఱి
ఆ సమాగమము దృశ్యము అద్భుతమై అచింత్యమై అల
రారెను అటు వేదవ్యాసులు జనమేజయునకు మృతినొందిన ఆతని
తండ్రియగు పరీక్షిత్తును గూడ చూపించి తన అలౌకిక సామర్థ్యమును
లోకమునకు వెల్లడి చేసెను వాస్తవముగ వ్యాసులు ఒక అద్భుత
శక్తిశాలియగు మహనీయుడు

## ద్రోణుఁడు

ద్రోణుఁడు భరద్వాజుని పుత్రుఁడు భరద్వాజుఁడు అస్త్ర
వేత్తలలో నిపుణుఁడు భరద్వాజుఁడు అగ్నివేశునకు అగ్నివేశుఁడు
ద్రోణునకు ఆగ్నేయాస్త్రమును ఇచ్చిన శిక్షణ నొసంగిరి ద్రుపద
రాజు ద్రోణునితోసహా భరద్వాజునొద్ద విద్యాధ్యయనము
చేసెను ద్రోణుడు వేదవేదాంగములందు పారంగతుఁడై కృపి
తమ్ముని అతని అశ్వత్థామ యను కొమారుఁడుండెను ద్రోణుఁడు
పరశురాముని యొద్ద సమస్త అస్త్రశస్త్రముల యొక్క జ్ఞానమును,
ధనుర్వేదమును బడసెను ద్రోణుని ధనుర్విద్యా కౌశలమును
చూచి భీష్ముఁడతనిని ఆచార్యపదమున ప్రతిష్ఠించి రాజకుమారు
లకు ధనుర్విద్యయందు శిక్షణ గఱపుటకు నియోగించెను భీష్ముని
అనంతరము ద్రోణుఁడు సమర్థించగలుగుటను యుద్ధమున
భీష్ముని యనంతరము ద్రోణుఁడు సేనాధ్యక్షుఁడై అద్భుత పరాక్రమ

మును జూదం తుట్టతుదకు ద్రుపదుని పుత్రుడగు ధృష్టద్యుమ్నునిచే వధింపబడెను అతడు బుద్ధియందు బృహస్పతితోను నీతియందు శుక్రాచార్యునితోను సమానుడు అతడు మహాతేజస్వి నాలుగు వేదములను ఎఱిగిన మహానీయుడు

## విదురుడు

విదురుడు విచిత్రవీర్యుని కుమారుడు అతనిని ధర్మావతారమని చెప్పవచ్చును అతడు గొప్ప బుద్ధిమంతుడు నీతిజ్ఞుడు ధర్మజ్ఞుడు విద్వాంసుడు సదాచార సంపన్నుడు భగవద్భక్తుడు అయియుండెను కనుకనే అతనిని సర్వులును గౌరవించుచుండిరి అతడు నిర్భయుడు సత్యవాది అయియుండెను ధృతరాష్ట్రాదులకు అతడు చక్కని సలహాలు ఇచ్చుచుండును పాండవులు ధర్మాత్ములై యుండుటవలన ప్రత్యక్షముగను గుప్తరూపమునను అతడు వారికి సహాయము చేయుచుండెను యతో ధర్మ స్తతో జయః అనునట్లు ధర్మావలంబులగు పాండవులకే ఎట్టకేలకు విజయము కలుగునని విదురుడు ఎఱిగియుండెను

లక్కయింటినుండి తప్పించుకొనిపోవు నుపాయమును విదురుడు పాండవుల ఎఱింగించి వారిని కాపాడెను దుర్యోధనునకు విదురుడు ఎన్నియో హితవాక్యములను చెప్పెను అతడు వినలేదు ధృతరాష్ట్రునకు విదురుడు బోధించిన నీతివాక్యములు, ధర్మప్రబోధము విదురనీతి అను పేరుతో చాల ప్రఖ్యాతిచెందియుండెను విదురుడు జ్ఞానియు తత్త్వదర్శియు మాత్రమేకాక అనన్య భగవద్భక్తుడు కూడ అయియుండెను శ్రీకృష్ణునియెడల విదురునకు ఎంతయో భక్తి కలదు శ్రీకృష్ణునకున్ను విదురునియెడల ఎంతయో ప్రీతి కలదు శ్రీకృష్ణు పాండవుల దూతగా హస్తినాపురము వెళ్ళినపుడు కౌరవ

సభాసదులతో మాట్లాడినపిదప వారు నేరుగా విదురుని యింటికి పోయి ఆతని ఆతిథ్యమును స్వీకరించిరి

యుద్ధానంతరము విదురుఁడు అరణ్యమునకు పోయి ఘోర తపంబు నాచరించెను సాక్షాత్ ధర్మముయొక్క అవతారముగు విదురుఁడు ధర్మమయ జీవితమును గడపి తన ధర్మప్రబోధములచే లోకమునకు మహోపకార మొనర్చెను

## సంజయుఁడు

సంజయుఁడు ధృతరాష్ట్రుని మంత్రి అతఁడు గొప్ప ప్రభుభక్తుఁడు బుద్ధిమంతుఁడు నీతిజ్ఞుఁడు ధర్మజ్ఞుఁడు, సత్యవాది, నిర్భయుఁడును అయియుండెను అతఁడు ధృతరాష్ట్రునకు చక్కని సలహాలు ఇచ్చుచుండును అతఁడు చివరివఱకు ధృతరాష్ట్రుని వెంటనే ఉండెను వ్యాసమహర్షికి కృపాపాత్రుఁడును శ్రీకృష్ణార్జునులకు ప్రియుఁడును అయియుండెను అతఁడు దుర్యోధనునియొక్క అత్యాచారములను ఖండించి చెప్పుచుండును ధర్మమును ప్రోత్సహించుచుండును యుద్ధమును ఆపుటకు అతఁడు ఎంతయో ప్రయత్నించి ఇరుపక్షములవారికి యుద్ధముయొక్క దుష్పరిణామమును గూర్చి లెస్సగ తెలియఁజెప్పెను ధృతరాష్ట్రుఁడు పాండవులతో సంభాషించుటకై సంజయుని ఉపప్లావ్యమునకు పంపఁగా యుద్ధవిరమణను ప్రోత్సహించుచు సంజయుఁడు పాండవులకు సలహా ఇచ్చెను సంధియే శాంతికి సర్వోత్తమ ఉపాయమని చెప్పెను గాంధారీ, వేదవ్యాస, విదురుల సమక్షమున సంజయుఁడు ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణుని మహిమను గూర్చి చెప్పి, వారు సమస్త ప్రపంచమునకును ప్రభువని తెలియఁజేసెను సంజయునకు శ్రీకృష్ణుని స్వరూపము యొక్క జ్ఞానము, గొప్పశాస్త్ర పరిజ్ఞానము కూడ కలవు

వ్యాసమహర్షి సంజయునకు దివ్యదృష్టి నొసంగుటచే సంజయుఁడు యుద్ధమందలి విషయము లన్నియు చక్కఁగ నెఱిఁగి వానిని ధృతరాష్ట్రునకు తెలియఁజేసెను యుద్ధరంగమున శ్రీకృష్ణుఁడు అర్జునునకు బోధించిన భగవద్గీతనుకూడ సంజయుఁడు ధృతరాష్ట్రునకు చెప్పెను సంజయునకు గీతాశాస్త్రమును విను భాగ్యమేకాక భగవానుని విశ్వరూపమును సందర్శించు నవకాశముకూడ లభించినది ఈ రెండు నవకాశములు లభించినందువలన తనకు పరమానందము కలిగినదని అతఁడు ధృతరాష్ట్రునకు చెప్పెను యుద్ధ ప్రారంభ సమయమున సంజయుఁడు ఈ క్రింది వాక్యములను ధృతరాష్ట్రునకు చెప్పి పాండవుల విజయమును గూర్చి ప్రకటించెను

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ

ఎచట యోగేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు ధనుర్ధారియగు అర్జునుఁడు ఉందురో, అచట సంపద విజయము ఐశ్వర్యము స్థిరమగు నీతి ఉండును

యుద్ధానంతరము గాంధారీ ధృతరాష్ట్రులతోఁగూడ సంజయుఁడున్ను వనమునకు పోయెను అచటకూడ అతఁడు తన ప్రభువునకు సర్వవిధముల సేవచేసెను సంజయుని జీవితము ఆదర్శవంతమైనది జాతి కుల, మత భేదములేక ఎవరైనను తమ ప్రయత్నముచే మహోన్నత జీవితమును గడుపగలరని సంజయుని వృత్తాంతము ఋజువు చేయుచున్నది

## దుర్యోధనుఁడు

దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుని జ్యేష్ఠపుత్రుఁడు పాండవులను ద్వేషించువాఁడు అసూయాగ్రస్తుఁడు అతఁడు కలియొక్క

అంశావతారమని చెప్పవచ్చును రాజ్యలోభి అహంకారి, ఈర్ష్యా ళువు దంభదర్పాన్వితుఁడు పెద్దల వాక్యములను అవహేళన చేయు వాఁడు తనగొప్పను తాను చెప్పుకొనువాఁడు దుర్యోధనుఁడు రాజనీతియందు నిపుణుఁడు అతఁడు భీముని తన ప్రబల శత్రువుగ పరిగణించుచుండెను గదా యుద్ధమున అతఁడు మహాకుశలుఁడు కనుకనే భీమునితో జరిగిన గదాయుద్ధమందు ప్రావీణ్యమును ప్రద ర్శించెను అతఁడు ఇతరుల లోపములను వెదకును కాని తన లోపము లను గూర్చి పట్టించుకొనఁడు పాండవులయెడల వైరభావము గల వాఁడై ఆ వైరాగ్నియందు భారతపుత్రులెందఱినో హోమము చేసినవైచి తుదకు తానుకూడ ఆ అగ్నియందు భస్మమైపోయెను పాండవులకు సూదిమొన మోపునంత స్థలముకూడ యివ్వనని చెప్పుట లోను లక్కయింటిని కాల్చి పాండవులకు అపకారము చేయదలంచుట లోను దుర్యోధనుని ప్రబలమగు ఈర్ష్యాభావము ద్యోతకమగుచున్నది మహాపరాక్రమశాలియగు కర్ణుని దుర్యోధనుఁడు తన మిత్రునిగ నొనర్చుకొని అతనిని అంగదేశమునకు అధిపతి గావించెను

ద్రౌపదిని అవమానింప యత్నించుట దుర్యోధనుని జీవితములో మహాకళంకయుక్తమైన కార్యము అకార్యము ద్వారా అతఁడు తన వినాశమును తానే కొనితెచ్చుకొనెను దుర్యోధనుని రాజ్య పరిపాలనమందు గుప్తచర విభాగము సువ్యవస్థితమై యుండెను దుర్యోధనునియందు కొన్ని సుగుణము లున్నను దుర్గుణ బాహుళ్య మునందవి అంతర్లీనములై పోయెను

## కర్ణుఁడు

కుంతీదేవికి కుమారావస్థ యందు సూర్యదేవుని వలన కర్ణుని జన్మము కలిగెను లోకాపవాద భయముచే కుంతి ఆతనిని చిన్నపుడు

ఒక పెట్టెయందుంచి గంగానది యందు వదలివైచెను సూతస్త్రీ యగు రాధ అతనిని సాకి పెంచి పెద్ద చేసెను కనుకనే కర్ణుఁడు సూత పుత్రుఁడు రాధేయుఁడు అను పేర్లతో ప్రసిద్ధి కెక్కెను మహాశక్తి మంతుఁడగు కర్ణుని దుర్యోధనుఁడు తన వైపున కాంక్షించుకొని అతనిని అంగదేశాధిపతిగ నొనర్చెను యుద్ధమందు దుర్యోధనుఁడు కర్ణుని సహాయముపై ఆధారపడి యుండెను

కర్ణుఁడు గొప్పదాత, తపస్వి ఉదారశీలుఁడు అతఁడు కవచ కుండలములను దరించియే జన్మించెను ఇంద్రుఁడు ఆ రెండిటిని తన కిమ్మని అడిగినపుడు నిస్సంకోచముగ వానిని ఇచ్చివైచెను ఇంద్రుఁడు సంతసించి ఆతనికి అమోఘమగు ఒక శక్తి నొసంగెను శ్రీకృష్ణుఁడు కర్ణునితో అతడు సూతపుత్రుడు కాదఁడనియు క్షత్రియుఁడనియు వచించి పాండవపక్షము వహించులాగున చెప్పగా అతఁడు అంగీకరించ లేదు చివరివఱకు దుర్యోధనుని వదలక యుంగుట అతని కృతజ్ఞతకు ఉజ్జ్వల దృష్టాంతమై యున్నది

మహాయుద్ధమందు కర్ణుఁడు రెండు రోజులు సేనాపతిగ నుండి గొప్ప పరాక్రమమును చూపెను తుదకు ఆతని రథచక్రము భూమి యందు దిగబడిపోయెను తదుపరి యుద్ధమందు దాతఁడు అర్జునునిచే సంహరింపఁబడెను క్షాత్రతేజముతో నలరారు మహాయోధుఁడు కర్ణుడు దాతృత్వమునందు దాతని కాతఁడే సాటి కనుకనే దాన కర్ణుఁడని అతఁడు లోకమున ప్రసిద్ధి కెక్కెను

ఓమ్

# భారతమందలి కొన్ని స్త్రీ పాత్రలు

## కుంతీదేవి

కుంతీదేవి ఒక ఆదర్శ మహిళ పాండురాజు యొక్క పత్ని పాండవుల తల్లి చిన్నప్పటి నుండి ఆమె పృథయని పిలువఁబడు చుండెను ఆమె సుశీల, సదాచారపరురాలు సంయమశీల భక్తురాలు అయియుండెను నిష్కామభావముతో ఆమె దుర్వాసాది అతిథులకు సేవ చేసెను దుర్వాసుఁడు ఆమె అతిథి సేవకు ప్రసన్నుఁడై వర మివ్వఁదలంచినను ఆమె అంగీకరింపలేదు దుర్వాసుఁడు చెప్పిన మంత్రముల ద్వారా కుంతి ధర్మ వాయు ఇంద్రులను ఆవాహన మొనర్చి వారివలన క్రమముగ ధర్మరాజ భీమ, అర్జునులను పుత్రులను బడసెను పాండురాజు యొక్క రెండవ భార్యయగు మాద్రికి అశ్వినీ కుమారులవలన నకులుఁడు సహదేవుఁడు అను పుత్రులు కలిగిరి

భర్తయగు పాండురాజు యొక్క మరణానంతరము కుంతీదేవి యొక్క జీవితము కష్టముగ గడచినను ఆమె ధైర్యముతో పరిస్థితులను ఎదుర్కొనెను ఆమె కష్టములను లెక్కచేయక చివఱి వరకు ధర్మముపై ఆరూఢయై యుండెను ఆమె స్వభావము కోమలము దయాయుక్తము అయియుండెను ఆమె ఇతరుల కష్టములను చూడఁజాలక యుండును ఏకచక్రనగరమున బ్రాహ్మణ గృహమందు నివసించునపుడు బకాసురుని యొద్దకు భోజనము నిమిత్తము ఆమె భీముని పంపి బ్రాహ్మణ కుటుంబస్థుల శోకమును పోఁగొట్టెను

కుంతీదేవి సత్యపరాయణురాలు ద్రౌపదీ స్వయంవరమున అర్జునుఁడు విజయమునొంది ద్రౌపదిని బడసి ఇంటికి వచ్చి తల్లియగు

కుంతితో అమ్మా! భిక్ష గొనివచ్చితిమి అని చెప్పఁగా నాయనలారా! అందఱును కలిసి దానిని అనుభవించుఁడు అని పలికెను తద్వాక్యఫలముగ ఐదుగురు సోదరులును ద్రౌపదిని వివాహమాడవలసి వచ్చెను కుంతీదేవి యొక్క సత్యనిష్ఠను ఈ సంఘటన లెస్సగ నిరూపించుచున్నది

కుంతీదేవియొక్క జీవితము మొదటినుండి చివఱవఱకు త్యాగపూర్ణమై తపస్యామయమై అనాసక్తమై యుండెను హస్తిన పురము నుండి శ్రీకృష్ణునిద్వారా ఆమె (వనవాసము చేయుచున్నట్టియు, అజ్ఞాతవాసమున నున్నట్టియు) తన పుత్రులకు సందేశము పంపుచు క్షత్రియధర్మమును నెరవేర్పుఁడని ఆదేశించెను తుదకు ఆమె గాంధారీ ధృతరాష్ట్రులతో గూడ వనమునకు పోయి తపం బాచరించెను కుంతీదేవి వంటి ఆదర్శమహిళలు ప్రపంచమున చాల అరుదుగ లభించుదురు

# ద్రౌపది

ద్రౌపది పాంచాలరాజగు ద్రుపదునికి అయోనిజయగు పుత్రి మహాసౌందర్యవతి కుంతీదేవి యొక్క వాక్యమును పురస్కరించుకొని ఈమె పాండవులైదుగురిని వివాహమాడవలసి వచ్చెను ఆమె గొప్ప పతివ్రత భగవద్భక్తురాలు అయి యుండెను శ్రీకృష్ణుని పాదపద్మముల యెడల ఆమెకు పరమభక్తి కలదు వారు తమ రక్షకుఁడనియు నాథుఁడనియు పరమ ఆత్మీయుఁడనియు ఆమె నమ్ముచుండెను కౌరవసభయందు దుశ్శాసనుఁడు ఆమెను అవమానింప నొడగినపుడు తన్ను రక్షింపుఁడని శ్రీకృష్ణుని హృదయపూర్వకముగ ప్రార్థించెను శ్రీకృష్ణుఁడామెను కాపాడెను

పాండవులు ద్రౌపదీ సమేతముగ కామ్యక వనమునందు నివసించుచుండ ఒకనాఁడు అందఱి భోజనమైన వెనుక దుర్వాస మహర్షి వేలకొలఁది శిష్యులతో కూడ అచటికి వచ్చెను ధర్మరాజు వారికి ఆతిథ్య మొసఁగఁ దలంచెను అత్తఱి ద్రౌపది శ్రీకృష్ణుని ప్రార్థింపగా వా రచటికి వచ్చి వంటపాత్రలో మిగిలిన ఒక కూరాకును నోటిలో వేసికొనఁగా బ్రహ్మాండ మంతయు తృప్తిని పొందెను దుర్వాసుఁడు, ఆతని శిష్యులు కూడ కడుపు నిండుటచే తృప్తిని బడసి అచ్చోటనుండి వెడలిపోయిరి ఈ ప్రకారముగ భక్తవత్సలుఁడగు శ్రీకృష్ణుఁడు పాండవ దులను రక్షించెను ఒకపుడు వనమందు శ్రీకృష్ణుఁడు సత్యభామాసమేతుఁడై పాండవుల యొద్దకు వచ్చెను అపుడు సత్యభామ, ద్రౌపదిని శూరవీరులగు నీ పతులు నీ యధీనులై ఎట్లున్నారో చెప్పుమని అడుగగా ద్రౌపది పతివ్రతా ధర్మములను పెక్కింటికిని తెలిపి తానా ప్రకార మాచరించుచున్నా ననియు, తాను అహంకారము, ఈర్ష్య లేక చాల జాగ్రతగ తన భర్తలకు, సేవ చేయుచున్నా ననియు చెప్పెను

క్షత్రియోచిత తేజము, భక్త్యోచితక్షమ – అను రెండు దివ్య గుణముల సమ్మిశ్రణమే ద్రౌపది కౌరవసభలో దుశ్శాసనుఁడు ఆమెను అవమానింపఁదలంచినపుడు ద్రౌపది మహాధైర్యముతో సభాసదుల నుద్దేశించి న్యాయమును కలుగఁజేయుఁడని చెప్పెను

కామ్యకవనమందు జయద్రథుడు ఆమెను బలాత్కారముగ లాగుకొని పోఁదలంచినపుడు ఆతనిని త్రోసివైచెను కాని జయద్రథుడు బలాత్కారముగ ఆమెను రథమునందు కూర్చుండఁబెట్టి వెడలుచుండ భీమార్జునులు అతనిని వెంటాడి పట్టుకొని తగిన శాస్తిచేసి విడిచిపెట్టిరి ద్రౌపది యొక్క పాతివ్రత్య తేజము చాలఅపూర్వమైనది తన కుమారులను రాత్రి నిద్రించుచుండ వధించివేసిన

అశ్వత్థామను గురుపుత్రుడని భావించి ద్రౌపది ఆతనిని వదలిపెట్టించి మహాత్తరమౌ సహనశీలత్వమును లోకమునకు వ్యక్తపరచెను ద్రౌపది వంటి నారీమణులు పతివ్రతలు, సచ్చరిత్రలు లోకమున కెంతయో శోభను చేకూర్చుదురు

## ఉపసంహారము

ఈ ప్రకారముగ శ్రీకృష్ణ, భీష్మ విదురాది మహనీయుల దివ్యబోధలతోను భీష్మ ద్రోణ అర్జున అభిమన్యు కర్ణాదుల పరాక్రమ గాథలతోను గాంధారీ కుంతీ ద్రౌపద్యాది పతివ్రతా శిరోమణుల పవిత్ర చరిత్రతోను శ్రీకృష్ణ వేదవ్యాసాదుల అలౌకిక దివ్యమహిమాన్విత అద్భుత కార్యములతోను గూడి మహాభారతము అధ్యాత్మ వాఙ్మయమున సర్వజనాదరణీయమగు గ్రంథముగ విరాజిల్లుచున్నది

ద్వైపాయనోష్ఠపుటనిస్సృత మప్రమేయం
పుణ్యం పవిత్ర మథ పాపహరం శివం చ
యో భారతం సమధిగచ్ఛతి వచ్యమానం
కిం తస్య పుష్కరజలై రభిషేచనేన

వ్యాసమహర్షి యొక్క ముఖము నుండి బయలుదేరిన ఈ నిస్తుల, పుణ్యదాయక పవిత్ర పాపహారక, కళ్యాణమయ మహాభారతమును వినువాడు పుష్కరతీర్థ జలమున స్నాన మాచరించుట వలన కలుగు పుణ్యము కంటె అధికమగు పుణ్యమును పడయును

భారతే సర్వ వేదార్థః

అనునట్లు సమస్త వేదముల యొక్క సారమైన ఈ భారత గ్రంథమును పఠించువారు, వినువారు అందలి ధర్మములను ఆచరించువారు ధన్యులు

ఓమ్

ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# భారత రత్నాకరము

# 1 ఆదిపర్వము

1 నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్

నారాయణునకు (శ్రీకృష్ణునకు) నరోత్తముఁడగు నరునకు (అర్జునునకు) సరస్వతీదేవికి వేదవ్యాసాచార్యునకు నమస్కరించి ఆ ఎదప మహాభారతమును పఠించవలెను

2 ఓమ్ నమో భగవతే వాసుదేవాయ ఓమ్ నమః
పితామహాయ ఓమ్ నమః ప్రజాపతిభ్యః ఓమ్ నమః
కృష్ణద్వైపాయనాయ ఓమ్ నమః
సర్వవిఘ్నవినాయకేభ్యః

ఓంకార రూపుఁడగు భగవంతుఁడైన వాసుదేవునకు నమస్కారము ఓంకార రూపుఁడైన పితామహునకు నమస్కారము ఓంకార రూపులైన ప్రజాపతులకు నమస్కారము ఓంకార రూపుఁడైన కృష్ణద్వైపాయనునకు నమస్కారము ఓంకార రూపుఁడును సర్వవిఘ్న వినాశకుఁడు నగు విఘ్నేశ్వరునకు నమస్కారము

పూర్వము శౌనకాది మహర్షులు నైమిశారణ్యమందు పన్నెండు సంవత్సరములు సత్రయాగము జరుపుచుండ అచటికి లోమహర్షణుని పుత్రుఁడును, గొప్ప విద్వాంసుఁడును వక్తయునగు సౌతి (ఉగ్రశ్రవుఁడు) రాగా, ఆ ఋషులు మీరెచటినుండి వచ్చితిరని ప్రశ్నింప తాను పరీక్షిన్మహారాజ కొమారుఁడగు జనమేజయుఁడు కావించిన సర్పయజ్ఞమందు వ్యాసముని శిష్యుఁడగు వైశం

పాయనుఁడు వ్యాసమునియొక్క ఆజ్ఞచే వ్యాస విరచితమగు భారతమును జనమేజయునకు చెప్పగా అద్దానిని విని వచ్చితినని చెప్పెను అపుడా ఋషులు ఆతఁడు వినినట్టి భారతమును శ్రవణము చేయుటకు తమకు కుతూహలముగా నున్నదనియు కావున అద్దానిని చెప్పఁడనియు అడుగగా సౌతి ఇట్లు చెప్ప నారంభించెను—

హిమాలయ పర్వతముయొక్క ఒకానొక గుహయందు వ్యాసముని ధ్యాననిష్ఠయందుండి భారతముయొక్క స్వరూపమును గూర్చి విచారించగా అతని జ్ఞానదృష్టిచే అతఁడు మొదటినుండి చివరవరకు భారత చరిత్ర నంతయు ప్రత్యక్షమునవలె చూచి ఆ మహాగ్రంథమును రచించెను బ్రహ్మదేవుని సూచన ననుసరించి వ్యాసముని తాను మొదట మనస్సునందు భావనచేసిన ఆ భారతమును చెప్పుచుండ గణేశుఁడు దానిని లిఖించెను

ధృతరాష్ట్రుఁడు పాండురాజు విదురుఁడు అను ముగ్గురు సోదరులు కలరు ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు అతనికి దుర్యోధనుఁడు మొదలుగాగల నూరుమంది కుమారులు పాండురాజునకు ధర్మరాజు, భీముఁడు అర్జునుఁడు నకులుఁడు సహదేవుఁడు అను ఐదుమంది కుమారులు కలరు

సౌతి రువాచ

3 యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కన్ధోఽర్జునో భీమసేనోఽస్య శాఖాః
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే
మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ

సౌతి (ఉగ్రశ్రవుఁడు) శౌనకాది మహర్షుల కిట్లు చెప్పెను—

ధర్మరాజు ధర్మమయమగు విశాలమైన వృక్షము అర్జునుఁడు దాని స్కంధము (బోదె) భీమసేనుఁడు దాని శాఖ (కొమ్మ) మాద్రీ

పుత్రులగు నకుల సహదేవులు దాని సమృద్ధములగు ఫలపుష్పములు శ్రీకృష్ణుం౦ వేదములు బ్రహ్మనిష్ఠులు దాని మూలము

కొంతకాలమునకు ధర్మరాజు రాజ౹ూయ యజ్ఞమాచరించెను పాండవుల సంపదలను చూచి దుర్యోధనునకు ఈర్ష్య కలిగెను ఆ సమయమునసే మయుఁడను దానవుఁడు పాండవులకు ఒక అపూర్వ మైన సభాభవనమును నిర్మించి ఒసంగెను అదిచూచి దుర్యోధనునకు ఇంకను అధిక సంతాపము కలిగెను తదుపరి దుర్యోధనుఁడు గాంధార రాజపు శకునిని వెంటపెట్టుకుని పాండవులతో మాయజూద మాడి వారిని ఓడించెను మ్మాట అనేక సంఘటనలు జరిగిన అనంతరము పాండవులకు కౌరవులకు యుద్ధము సంభవింప, దానియందు ఇరు పక్షములందును ఎందఱో మరణించిరి యుద్ధమందు కౌరవులు ఓడి పోయిరి పాండవులు గెలిచిరి పుత్రశోకముతో దుఃఖించుచున్న ధృత రాష్ట్రుని సంజయుఁడు అనేక ధర్మబోధలు చెప్పి ఓదార్చెను

ఈ ఇతిహాసము యొక్క ఆధారము పైననే వ్యాసముని పరమ పుణ్యమయమై ఉపనిషద్రూపమైనట్టి ఈ భారతమును రచించెను

4 భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః
స హి సత్యమృతం చైవ పవిత్రం పుణ్యమేవ చ

ఈ గ్రంథము యొక్క ముఖ్యవిషయము స్వయముగ సనాతన పరబ్రహ్మ స్వరూపుఁడైన వాసుదేవుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు దీనియందు వారిని గూర్చిన సంకీర్తనయే చేయింప బడినది వారు సత్యస్వరూపులు పవిత్రులు పుణ్యస్వరూపులు

5 యత్తత్ యతివరా ముక్తా ధ్యానయోగబలాన్వితాః
ప్రతిబిమ్బమివాదర్శే పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్

ధ్యానయోగశక్తి సంపన్నులగు జీవన్ముక్తులైన యతివర్యులు అద్దమునందు ప్రతిబింబమువలె తమ హృదయమునం దున్న ఆ పరమాత్మ యొక్క అనుభవమును పొందుచుందురు

6 పురా కిల సురైః సర్వైః సమేత్య తులయా ధృతమ్
చతుర్భ్యః సరహస్యేభ్యో వేదేభ్యో హ్యాధికం యదా

7 తదా ప్రభృతి లోకేఽస్మిన్ మహాభారత ముచ్యతే
మహత్త్వే చ గురుత్వే చ ధ్రియమాణం యతోఽధికమ్

పూర్వము దేవతలందఱును కలిసి త్రాసుయొక్క ఒక పళ్లెర ములో నాలుగు వేదములను మఱియొక్క పళ్లెరములో మహా భారతమును ఉంచి తూచగా మహాభారతము బరువుగా నుండినందు వలన అప్పటినుండియు ఆ గ్రంథము మహాభారతమను పేరుతో పిలువఁబడఁ దొడగెను సత్యమను త్రాసుయందు తూచగా ఈ గ్రంథము మహత్త్వమందును గౌరవమందును గంభీరత్వమునందును వేదములకంటె అధికమని తేలినది

8 ధర్మే మతిర్భవతు వః సతతోత్థితానాం
స హ్యేక ఏవ పరలోకగతస్య బన్ధుః
అర్థాః స్త్రియశ్చ నిపుణైరపి సేవ్యమానా
నైవాప్తభావ ముపయాన్తి న చ స్థిరత్వమ్

మీరు సాంసారిక ఆసక్తులనుండి పైకిలెండు మీ మనస్సులు సదా ధర్మమందే లగ్నమగుగాక ! ఏలయనగా పరలోకమున కేగు జీవునకు బంధువు సహాయకుఁడు కేవలము ధర్మమే అయియున్నది చతురులగు మనుజులకు ధనమును స్త్రీలను సేవించినవానియొక్క శ్రేష్ఠత్వముపై విశ్వాసము ఉండదు-మఱియు అవి స్థిరములని వారు తలంపరు

పరీక్షిన్మహారాజు యొక్క కుమారుఁడగు జనమేజయుఁడు తన సోదరులతోఁ గూడ కురుక్షేత్రమందు దీర్ఘకాలము నడచునటువంటి ఒక యజ్ఞమును ప్రారంభించెను జనమేజయుని సర్పయాగవిషయమై రురువను మునికి జిజ్ఞాస కలిగెను ఆతనికి సహస్రపాదుఁడను విప్రుఁడు అహింసయొక్క గొప్పతనమును గూర్చి ఇట్లు వచించెను

9 అహింసా పరమోధర్మః సర్వప్రాణభృతాం వర
తస్మాత్ ప్రాణభృతః సర్వాన్ న హింస్యాద్ బ్రాహ్మణః క్వచిత్
బ్రాహ్మణః సౌమ్య ఏవేహ భవతీతి పరా శ్రుతి

ప్రాణులలో శ్రేష్ఠుఁడగు ఓ బ్రహ్మనిష్ఠుఁడా! అహింస అన్నిటి కంటె ఉత్తమమైన ధర్మమై యున్నది కాఁబట్టి బ్రహ్మనిష్ఠుఁడగు వాఁడు ప్రాణికోట్లలో దేనిని ఎపుడును హింసింపరాదు బ్రహ్మనిష్ఠుఁడు ఈ ప్రపంచమున సదా సౌమ్య స్వభావమే కలిగియుండునని శ్రుతుల యొక్క ఉత్తమవాక్యమై యున్నది

10 వేదవేదాంగవిన్నామ సర్వభూతాభయప్రదః
అహింసా సత్యవచనం క్షమా చేతి వినిశ్చితమ్

మఱియు ఆ బ్రహ్మనిష్ఠుఁడు వేద వేదాంగములను ఎఱిఁగిన వాఁడును సమస్తప్రాణులకును అభయ మొసంగువాఁడును అయి యుండును అహింస సత్యభాషణము, ఓర్పు వేదముల స్వాధ్యాయనము బ్రహ్మనిష్ఠుని యొక్క ధర్మములై యున్నవి

ఎమ్మట శౌనకుఁడు జనమేజయుని సర్పయాగమును మాన్పించఁ జేసిన ఆస్తీకుని వృత్తాంతము తెలియఁజేయుమని అడుగగా, సౌతి యిట్లు చెప్పెను పరీక్షిత్తు అను మహారాజు రాజ్యమును పరిపాలించు చుండెను ఒకనాఁడతఁడు వేటకై అరణ్యమునకుపోయి ఒక మృగ

మును వెంటాడి అలసిపోయి సమీపముననే ధ్యాననిష్ఠుడై కూర్చుండి యున్న శమీకుని చూచి మృగ మెచటికి పోయినదని అతనిని ప్రశ్నింప అతడు సమాధాన మివ్వనందున క్రుద్ధుడై ఒక సర్పము యొక్క మృతకళేబరమును ఆ ఋషి మెడలో వేసిపోయెను కొంత సేపటికి ఆ ఋషి యొక్క కుమారుడగు శృంగి మా తండ్రిని అవమాన పరచినవాడు ఏడు దినములైన పిదప తక్షకుడను మహాసర్పముచే కఱవఁబడి మరణించుగాక! అని శపించెను

తన కుమారుడు పరీక్షిత్తునకు శాప మొసంగిన విషయము తెలిసికొని తండ్రియగు శమీకుడు అతనితో ఇట్లు చెప్పెను

శమీక ఉవాచ —

11 క్షన్తవ్యం పుత్ర ధర్మో హి హతో హన్తి న సంశయః
యది రాజా న సంరక్షేత్ పీడా నః పరమా భవేత్

(శమీకుడు తన పుత్రునితో యిట్లు చెప్పెను—) నాయనా! పరీక్షిన్మహారాజు యొక్క అపరాధమును క్షమించవలెను ధర్మమును నశింపఁజేసినచో ఆ ధర్మమే మనుజుని నశింపఁజేయును దీనియందు సందేహ మేమియును లేదు రాజు రక్షించనిచో మనకు గొప్ప కష్టము కలుగఁగలదు

12 పుత్రా వృత్తో వయఃస్థోఽపి సతతం వాచ్య ఏవ తు
యథా స్యాద్ గుణసంయుక్తః ప్రాప్నుయాచ్చ మహద్ యశః

తండ్రి తన కుమారునకు—అతఁడు పెద్ద వయస్సు కలిగి యున్నప్పటికిని సదా సత్కర్మలనే ఉపదేశింపవలెను దానిచే అతఁడు గుణవంతుఁడగును మఱియు గొప్పకీర్తిని బడయును

13 స త్వం శమపరో భూత్వా వన్య మాహార మాచరన్
చర క్రోధ మిమం హత్వా నైవం ధర్మం ప్రహాస్యసి

నీవు మనస్సును ఇంద్రియములను నిగ్రహించి కందమూల ఫలములను ఆహారముగఁ గైకొనుచు ఈ క్రోధమును నశింపఁజేసి ఉత్తమ ఆచరణ కలిగి యుండుము అట్లు చేసినచో నీయొక్క ధర్మమునకు హాని కలుగదు

14 క్రోధో హి ధర్మం హరతి యతీనాం దుఃఖసంచితమ్
తతో ధర్మవిహీనానాం గతి రిష్టా న విద్యతే

ప్రయత్నశీలురగు సాధకులు కష్టపడి సంపాదించిన ధర్మమును క్రోధము నశింపఁజేయుచున్నది ధర్మహీనులగు మనుజులకు అభీష్టమైన గతి లభించును

15 శమ ఏవ యతీనాం హి క్షమిణాం సిద్ధికారకః
క్షమావతా మయం లోకః పరశ్చైవ క్షమావతామ్

క్షమాశీలురగు సాధకులకు శమము (ఇంద్రియ నిగ్రహము) సిద్ధిని కలుగఁ జేయును ఎవరియందు క్షమ (ఓర్పు) గలదో అట్టి వారికె ఇహలోకము పరలోకము శ్రేయస్సును కలుగఁజేయునవై యుండును

16 తస్మాచ్చరేథాః సతతం క్షమాశీలో జితేన్ద్రియః
క్షమయా ప్రాప్స్యసే లోకాన్ బ్రహ్మణః సమనన్తరాన్

కాఁబట్టి నీవు సదా ఇంద్రియములను వశమొనర్చుకొనుచు క్షమాశీలుఁడవై యుండుము క్షమ చేతనే నీవు బ్రహ్మలోక సమీప వర్తులగు లోకములకు ఏగఁగలవు

శృంగియొక్క శాపమువలన పరీక్షిత్తు తక్షకుఁడను సర్పముచే కఱవఁబడి మరణించెను తన తండ్రిని రక్షింపఁగల కాశ్యపుని తండ్రి యొద్దకు రానీయక త్రోవలోనే పంపివేసి తండ్రి మరణమునకు హేతు

భూతుఁడైన తక్షకుని యెడల పగతీర్చుకొనఁదలచి జనమేజయుఁడు సర్పయజ్ఞమును ప్రారంభించెను తత్సందర్భమున ఆస్తీకుఁడను నతఁడు అచటికి విచ్చేసి యజమానుని, ఋత్విగాదులను స్తుతింప జనమేజయుఁడు సంతోషించి వరమును కోరుకొనుమని చెప్పగా అంతట ఆస్తీకుఁడు సర్పయజ్ఞము నిలిపివేయఁబడుఁగాక! అని వరమును కోరుకొనెను అప్పటికే అనేక సర్పములు యజ్ఞకుండమున పడి మరణించినవి కొద్దిసేపటిలో తక్షకుని వంతు రానున్నది సరిగా అదియే సమయమున ఆస్తీకుఁడు వరమును కోరుకొని యజ్ఞమును నిలుపుదల చేయించెను అపుడు సర్పము లన్నియు తమ్ము రక్షించి నందులకు చాల సంతోషించి ఆస్తీకుని వరము కోరుకొనుమని చెప్పగా అతఁడిట్లనెను—

ఆస్తీక ఉవాచ—

17 సాయం ప్రాత ర్యే ప్రసన్నాత్మరూపా
లోకే విప్రా మానవా యే పరేఽపి
ధర్మాఖ్యానం యే పఠేయు ర్మమేదం
తేషాం యుష్మన్నైవ కించిద్ భయం స్యాత్

ఆస్తీకుఁ డిట్లు చెప్పెను—

నాగులారా! లోకములో ఎవఁడు ప్రసన్నచిత్తుఁడై సాయం ప్రాతస్సమయములందు ఈ ఉపాఖ్యానమును పఠించునో అతనికి మీవలన (సర్పమువలన) భయము కలుగకుండుఁగాక!

18 తైశ్చాప్యుక్తో భాగినేయః ప్రసన్నై
రేతత్ సత్యం కామ మేవం వరం తే
ప్రత్యాయుక్తాః కామితం సర్వశస్తే
కర్తారః స్మ ప్రవణా భాగినేయ

ఈ మాటలు విని సర్పము లన్నియు చాల సంతోషించి ఆస్తికునితో ఇట్లు చెప్పినవి - నీ కోరిక నెరవేరుగాక! మేము చాల ప్రేమతో నమ్రతతో గాకుండాని అన్నివిధముల మీ మనో రథమును నెరవేర్చెదము

19 అసితం చార్తిమన్తం చ సునీథం చాపి యః స్మరేత్
దివా వా యది వా రాత్రౌ నాస్య సర్పభయం భవేత్

అసిత ఆర్తిమాన్ సునీథ - అను మంత్రములను ఎవడు పగలుగాని రాత్రిగాని పఠించునో అతనికి సర్పములవలన ఏ విధమైన భయము ఉండదు

20 యో జరత్కారుణా జాతో జరత్కారౌ మహాయశాః
ఆస్తీకః సర్పసత్రే వః పన్నగాన్ యోఽభ్యరక్షత
తం స్మరన్తం మహాభాగా న మాం హింసితు మర్హథ

(అసిత ఆర్తిమన్ సునీథ - అను మంత్రములు క్రమముగ ఈ క్రింద తెలుపబడినవి—) జరత్కారుడను ఋషి చే జరత్కారు అను నాగకన్యకు జనించిన ఆస్తీకుడను ఋషి సర్పయాగమున సర్పములను రక్షించెను అతనిని నేను స్మరించుచున్నాను మహాభాగ్య శాలురగు సర్పములారా! మీరు నన్ను కఱవకుడు

21 సర్పాపసర్ప భద్రం తే గచ్ఛ సర్ప మహావిష
జనమేజయస్య యజ్ఞాన్తే ఆస్తీకవచనం స్మర

మహావిషధరులగు ఓ సర్పములారా! మీరు పారిపొండు మీకు శుభ మగుగాక! జనమేజయుని యజ్ఞముయొక్క సమాప్తి సమయమున ఆస్తీకునకు మీరు చెప్పిన వాక్యములను స్మరింపుడు

22 ఆస్తీకస్య వచః శ్రుత్వా యః సర్పో న నివర్తతే
శతధా భిద్యతే మూర్ధ్ని శింశవృక్షఫలం యథా

ఆస్తికునకు చెప్పిన శపథవాక్యములను విని యే సర్పము వెడలిపోదో దాని శిరస్సు శింశవృక్షఫలమువలె వందలకొలది ముక్కలై పోవును

జనమేజయుని సర్పయజ్ఞమునకు వ్యాసముని విచ్చేయగా ఆతనిని అర్ఘ్యపాద్యాదులచే రాజ సత్కరించి కౌరవ, పాండవుల వృత్తాంతము తెలియజేయుమని ప్రార్థింప అంతట వ్యాసముని తన సమీపముననే కూర్చుండియున్న తన శిష్యుడగు వైశంపాయనుని ఇదివఱకు తా నతనికి చెప్పిన ఆ వృత్తాంత మంతయు జనమేజయునకు చెప్పవలాగన ఆదేశించెను ఆతఁడంములకు అంగీకరించి ఆ కౌరవ, పాండవ వృత్తాంతమంతయు (భారతమును) జనమేజయునకు ఈ ప్రకారము చెప్పెను

వైశంపాయన ఉవాచ—

23 ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్

(వైశంపాయనుఁడు జనమేజయునితో నిట్లు చెప్పెను—)

ఓ భరతశ్రేష్ఠా! ధర్మమును గూర్చియు, అర్థమును గూర్చియు కామమును గూర్చియు, మోక్షమును గూర్చియు ఏ విషయములు ఈ గ్రంథమునందు కలవో అవియే ఇతర గ్రంథములందును కలవు ఏవి ఈ గ్రంథమున లేవో అవి ఎచటను ఉండవు

ఉపరిచర రాజుయొక్క కొమార్తెయగు సత్యవతికి పరాశరుని వలన వ్యాసముని జన్మించెను ఆతఁడే వేదములను విస్తార మొనర్చెను భారతమును వ్రాసెను వ్యాసమునీంద్రుఁడు నాలుగు వేదములను పంచమ వేదమగు భారతమును సుమంతునకు జైమినికి పైలునకి తన పుత్రుఁడగు శుకునకు వైశంపాయనుఁడగు నాకు అధ్యయన మొనర్చఁజేసెను

ధృతరాష్ట్రుఁడు, పాండురాజు విదురుఁడు అను ముగ్గురు సోదరు లుండిరి ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులను నూరుగురు పుత్రులు పాండురాజునకు ధర్మరాజు భీముఁడు అర్జునుఁడు నకులుఁడు, సహదేవుఁడు – అను ఐదుగురు కుమారులు ఉండిరి కౌరవ పాండవ యుద్ధమున ఎందఱో యోధులు పాల్గొనిరి వారిలో కొందఱి చరిత్రలలో ఈ మహాభారత చరిత్ర విస్తరించినది

పూర్వము దుష్యంతుఁడను మహారాజుండెను అతఁడు అరణ్యమునకు వేటాడుటకు పోయి అచటఁగల కణ్వమహర్షియొక్క ఆశ్రమమునకు వెళ్ళెను కాని కణ్వుఁడు ఆశ్రమమున లేఁడు శకుంతల అను సుందర కన్య మాత్రము ఉండెను నీ జన్మ వృత్తాంత మేమి యని దుష్యంతుఁడు ఆమెను అడుగగా ఆమె ఒకానొక ఋషికి కణ్వుఁడు చెప్పిన తన వృత్తాంతమును ఇట్లు చెప్పెను – విశ్వామిత్ర మేనకలవలన నేను జన్మించితిని అరణ్యమున శకుంత పక్షులు నన్ను కాపాడుటచే నాకు శకుంతల అను పేరు ఏర్పడినది కణ్వమహర్షి నన్ను ఆశ్రమమునకు గొనివచ్చి తన పుత్రికగా భావించి సంరక్షించు చున్నారు

24 శరీరకృత్ ప్రాణదాతా యస్య చాన్నాని భుఞ్జతే
క్రమేణైతే త్రయోఽప్యుక్తాః పితరో ధర్మశాసనే

శరీరమును నిర్మాణ మొనర్చువాఁడు ప్రాణములను రక్షించువాఁడు అన్నము పెట్టువాఁడు – అను ఈ ముగ్గురును ధర్మశాస్త్రములందు తండ్రులని చెప్పఁబడిరి

తదుపరి దుష్యంతుఁడు శకుంతలను గాంధర్వమున వివాహము చేసికొని నగరమునకు వెడలెను కొంతసేపైన తర్వాత కణ్వుఁడు ఆశ్రమమునకు రాగా శకుంతల జరిగిన వృత్తాంత మంతయు అతనికి తెలియఁజేసెను కణ్వుఁడు వారి వివాహమును ఆమోదించెను,

కొంతకాలమునకు శకుంతలకు భరతుఁడను ఒక పుత్రుఁడు జన్మించెను అతఁడు చిన్ననాటినుండియు అద్భుత శక్తిని బలపరాక్రమములను కలిగి యుండెను కణ్వుని ఆదేశము మేరకు శకుంతల తన పుత్రుని వెంటనిడుకొని దుష్యంతుని యొద్దకు వెళ్ళెను కాని దుష్యంతుఁడు ఆమె విషయమై తన కేమియు జ్ఞాపకము లేదని చెప్పఁగా అప్పుడు శకుంతల పూర్వ మతఁడు చేసిన వాగ్దానమును భంగము చేయవ దని ఇట్లు చెప్పెను

శకున్తలోవాచ—

25 యోఽన్యథా సన్త మాత్మాన మన్యథా ప్రతిపద్యతే
కిం తేన న కృతం పాపం చౌరేణాత్మాపహారిణా

(శకుంతల దుష్యంతునితో ఇట్లు చెప్పెను—)

ఆత్మ ఒక విధముగ నుండఁగా దానిని మఱియొక విధముగ ఎవఁడు ప్రతిపాదించునో ఆత్మాపహారియగు అట్టి చోరునిచే ఏ పాపము చేయఁబడక యున్నది?

26 ఏకోఽహ మస్మీతి చ మన్యసే త్వం
న హృచ్ఛయం వేత్సి మునిం పురాణమ్
యో వేదితా కర్మణః పాపకస్య
తస్యాన్తికే త్వం వృజినం కరోషి

నేనొక్కఁడనే ఉన్నాను - ఇంకెవరును లేరు అని మీరు తలంచుచున్నారు కాని హృదయమందు అంతర్యామి రూపమున వెలుఁగుచున్న పరమాత్మను మీరు తెలిసికొనుటలేదు అతఁడు పాప పుణ్యములను తెలిసికొనుచున్నాఁడు అట్టివాని సమీపముననే మీరు పాపము చేయుచున్నారు

27 మన్యతే పాపకం కృత్వా న కశ్చిద్ వేత్తి మా మితి
విదన్తి చైనం దేవాశ్చ యశ్చైవాన్తర పూరుషః

అసత్యమునుండి దూరముగ నుండు సాధుమహాత్ముల దృష్టి యందు ధర్మమే హితకరమైనది ధర్మ మెప్పుడును దుఃఖదాయకము కానేరదు మనుజుఁడు పాపము చేయుచు నన్నెవరును తెలిసికొనుట లేదు అని తలంచును అది చాల పొరపాటు ఏలయనఁగా దేవత లందఱును మఱియు అంతర్యామియగు పరమాత్మయు మనుజుఁడు చేయు పాపమును పుణ్యమును చూచుచు ఎఱుఁగుచునున్నారు

28 ఆదిత్య చన్ద్రావనిలానలౌ చ
ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్

సూర్యుడు చంద్రుడు వాయువు అగ్ని అంతరిక్షము, భూమి జలము హృదయము యముఁడు పగలు రాత్రి రెండు సంధ్యలు ధర్మము – అను ఇవి యన్నియు మనుజుఁడు చేయు మంచి చెడ్డ వ్యవహారము లన్నిటిని తెలిసికొనుచున్నారు

29 యమో వైవస్వత స్తస్య నిర్యాతయతి దుష్కృతమ్
హృది స్థితః కర్మసాక్షీ క్షేత్రజ్ఞో యస్య తుష్యతి

హృదయమందున్న కర్మసాక్షియగు పరమాత్మ ఎవని యెడల సంతుష్టుఁడై యుండునో, అట్టివానియొక్క పాపము లన్నిటిని సూర్యపుత్రుఁడగు యముఁడు స్వయముగ నశింపజేయును

30 న తు తుష్యతి యస్యైష పురుషస్య దురాత్మనః
తం యమః పాపకర్మాణం నియాతయతి దుష్కృతమ్

కాని ఏ దురాత్ముని అంతర్యామి సంతుష్టుఁడై యుండఁడో అట్టి పాపియొక్క పాపకర్మలకు యముఁడు స్వయముగ దండన నొసంగును

31 మూర్ఖో హి జల్పతాం పుంసాం శ్రుత్వా వాచః శుభాశుభాః
అశుభం వాక్య మాదత్తే పురీష మివ సూకరః

మూర్ఖుఁడు ఇతరుల మంచి వాక్యములను చెడ్డవాక్యములను విని అందు చెడ్డవానినే స్వీకరించును పంది అనేక వస్తువు లున్నప్పటికిని అందు మలమునే స్వీకరించునుగదా!

32 ప్రాజ్ఞస్తు జల్పతాం పుంసాం శ్రుత్వా వాచః శుభాశుభా
గుణవత్ వాక్య మాదత్తే హంసః క్షీరమివామ్భసః

వివేకవంతుఁడు ఇతరుల మంచి వాక్యమును చెడ్డ వాక్యములను విని అందు మంచి వాక్యములనే స్వీకరించును హంస పాలు నీళ్ళు కలిసిన దా నుండి పాలనే స్వీకరించునుగదా।

33 అన్యాన్ పరివదన్ సాధు ర్యథా హి పరితప్యతే
తథా పరివదన్నన్యాం స్తుష్టో భవతి దుర్జనః

ఇతరులను నిందించు విషయమై సాధుమహాత్ములు చాల బాధపడుదురు కాని దుష్టులు సంతోషించుదురు

34 అతో హాస్యతరం లోకే కించిదన్య న్న విద్యతే
యత్ర దుర్జన మిత్యాహ దుర్జనః సజ్జనం స్వయమ్

దుర్జనుఁడు సజ్జనుని దుష్టుఁడని యని స్వయముగ చెప్పును ఇంతకు మించి లోకములో హాస్యాస్పదమైన విషయము వేఱొకటి లేదు

35 వరం కూపశతాద్ వాపి వరం వాపిశతాత్ క్రతుః
వరం క్రతుశతాత్ పుత్రః సత్యం పుత్రశతాద్ వరమ్

నూఱు నూతులకంటె ఒక దిగుడుబావి శ్రేష్ఠమైనది నూఱు దిగుడుబావులకంటె ఒక యజ్ఞము శ్రేష్ఠమైనది నూఱు యజ్ఞము లకంటె ఒక పుత్రుఁడు శ్రేష్ఠుఁడు నూర్గురు పుత్రులకంటె ఒక సత్యము శ్రేష్ఠమైనది

36 అశ్వమేధసహస్రం చ సత్యం చ తులయా ధృతమ్
అశ్వమేధసహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే

వేయి అశ్వమేధ యజ్ఞములను త్రాసుయొక్క ఒక పళ్ళెరమందును సత్యమును మఱియొక పళ్ళెరమందును ఉంచి తూచగా, సత్యమే బరువైనదిగా (ఉత్తమమైనదిగా) స్పష్టమగును

37 నాస్తి సత్యసమో ధర్మో న సత్యాద్ విద్యతే పరమ్
నహి తీవ్రతరం కించి దనృతాదిహ విద్యతే

సత్యమునకు సమానమైన ధర్మము మఱియొకటి లేదు సత్యము కంటె పరమైనది ఏదియు లేదు అసత్యమును మించిన తీవ్రతరమైన పాపము మఱియొకటి ఈ ప్రపంచమున లేదు

మహాశయా! ఈతఁడు మన ఇరువురకు కలిగిన పుత్రుఁడు ఇదివఱకు మీరు వాగ్దానముచేసిన ప్రకారము ఈతనిని యువరాజ పదమున ప్రతిష్ఠింపుఁడు! అప్పుడు ఆకాశవాణి శకుంతల వాక్యములు సత్యములే యని పలుకగా దుష్యంతుఁడు ప్రసన్నుఁడై వారిరువురను స్వీకరించి, కుమారునకు భరతుఁడను నామధేయమిడి అతనికి రాజ్యాధిపత్యము నొసంగెను

జనమేజయా! పూర్వము యయాతి అను రాజు రాజ్యమేలుచు భోగభాగ్యముల ననుభవించుచుండ కొంతకాలమునకు వార్ధక్యవ దాపురించగా ఇంద్రియములు కృశింపఁ దొడఁగెను కాని భోగాశ తగ్గలేదు అపు డతఁడు తన కుమారులైదుగురిని పిలచి వారిలో ఎవరైన తన వృద్ధావస్థను గైకొని వారి యౌవనమును తన కిచ్చెదరా అని అడుగగా మొదటి నలుగురు అందులకు అంగీకరించ లేదు చివరివాఁడగు పూరుఁడు మాత్రము సమ్మతించెను అపుడు యయాతి శుక్రాచార్యుని వరప్రభావముచే తన కుమారుని యౌవనమును తాను గ్రహించి, తన వార్ధక్యమును అతని కొసంగి బహు

కాలము విషయభోగముల ననుభవించెను కాని అప్పటికిని భోగాశ తిగ్గలేదు అపుడాతడు లోకమున కిట్లు చాటెను

38 న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఎవాభివర్ధతే

విషయ భోగములను గూర్చిన కోరిక విషయములను అనుభవించుటచే ఎన్నటికిని శాంతింపదు పైగా అగ్నియందు నేయి వేసినచో ఇంకను అధికముగ మండునట్లు ఆ కోరిక ఇంకను పెరిగిపోవును

39 పృథివీ రత్నసమ్పూర్ణా హారణ్యం పశవః స్త్రియః
నాలమేకస్య తత్ సర్వమితి మత్వా శమం వ్రజేత్

రత్నములతో నిండిన ఈ భూమి బంగారము పశువులు స్త్రీలు-ఇవి యన్నియు ఒక్కనికి లభించినను అతడు సంతృప్తి నందక ఇంకను వాంఛించుచుండును ఇట్లు తలంచి ఇక శాంతిని పొందవలెను భోగేచ్ఛను తొలగించుకొనవలెను

40 యదా న కురుతే పాపం సర్వభూతేషు కర్హిచిత్
కర్మణా మనసా వాచా బ్రహ్మ సమ్పద్యతే తదా

మనస్సుచేతను వాక్కుచేతను కర్మచేతను సమస్త ప్రాణుల యెడల ఎవడు ఎపుడు చెడ్డతలంపులు లేకుండునో పాపము చేయకుండునో అపుడాతడు పరబ్రహ్మమును పొందును

41 యదా చాయం న బిభేతి యదా చాస్మాన్న బిభ్యతి
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎపుడు మనుజుడు తనినిగూర్చియు భయపడకుండునో ప్రపంచములో ఏ ప్రాణియు అతనినిగూర్చి భయమును పొందకుండునో, ఎపుడాతడు దేనిని వాంఛింపకుండునో దేనిని ద్వేషింపకుండునో అపుడాతడు పరబ్రహ్మమును పొందును

జనమేజయా! యయాతికి ఇగువురు భార్యలు కలరు దేవయాని శర్మిష్ఠ అ౧ దేవయాని శుక్రాచార్యుని కొమార్తె శర్మిష్ఠ వృషపర్వ రాజుయొక్క కొమార్తె ఒకనాడు శర్మిష్ఠ దేవయానితో కఠోరముగ పలుకగా దేవయ ని చింతాగ్రస్తయై తన తండ్రితో ఆ విషయము విన్నవింపగా ఆతడిట్లు చెప్పెను—

శుక్ర ఉవాచ—

42 యః పరేషాం నరో నిత్యమతివాదాం స్తితిక్షతే
దేవయాని విజానీహి తేన సర్వమిదం జితమ్

(శుక్రాచార్యుడు దేవయానితో ఇట్లు చెప్పెను—) ఎవడు ఇతరుల కఠోర వచనములను సహించుకొనునో అతడు ఈ జగత్తు అంతటిపై విజయమును పొందినట్లే యని తలంచుము

43 య సముత్పతితం క్రోధం నిగృహ్ణాతి హం ం యదా
స యన్తే త్యుచ్యతే సద్భిర్న యో రశ్మిషు లమ్బతే

ఎవడు ఎ ం౧వచ్చిన ోపమును గుఱ్ఱములనువలె అదుపులో నుంచుకొనునో అట్టివాడు నిజమైన సారథియని సజ్జనులచే చెప్ప బడును అంతియేకాని కేవలము గ్గములను పట్టుకొని యుండువాడు కాదు

44 యః సముత్పతితం క్రోధమక్రోధేన నిరస్యతి
దేవయాని విజానీహి తేన సర్వమిదం జితమ్

ఎవడు పొంగివచ్చిన క్రోధమును అక్రోధము (క్షమాభావము) చేత తన మనస్సునుండి తొలగించివేయునో, అతడు జగత్తు నంతటిని జయించినట్లే తలంచుము

45 యః సముత్పతితం క్రోధం క్షమయేహ నిరస్యతి
యథోరగస్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే

సర్పము కుబుసమును వదలివేయునట్లు ఎవడు పొంగివచ్చిన కోపమును క్షమద్వారా త్యజించివేయునో అట్టివాడే శ్రేష్ఠుడని చెప్పబడినది

తదుపరి శర్మిష్ఠ తండ్రియగు వృషపర్వుడు దాదికో దేవయాని యొక్క అభీష్టమును నెరవేర్చుమని శర్మిష్ఠకు చెప్పలాగున వచించి ఈ ప్రకారముగ పలికెను —

వృషపర్వోవాచ—

46 త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్

(వృషపర్వుడు చెప్పెను—) కులము యొక్క హితముకొఱకు ఒకనిని త్యజింపవలెను గ్రామము యొక్క హితముకొఱకు కులమును త్యజించవలెను పట్టణము యొక్క హితముకొఱకు గ్రామమును త్యజించవలెను ఆత్మయొక్క హితము కొఱకు ప్రపంచము నంతను త్యజించవలెను

ఎన్నటి యయాతి అనేక విషయభోగములను బహుకాలము ననుభవించినను తృప్తికలుగనందున తన కుమారుడగు పూరునితో ఇట్లు చెప్పెను—

యయాతి రువాచ—

47 న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఎవాభివర్ధతే

(యయాతి కుమారుడగు పూరునితో ఇట్లు చెప్పెను) కోరికలను అనుభవించుటచే కామము ఎన్నటికిని శమించదు అగ్నిలో ఆహుతివేసిన చందమున పైపెచ్చు అది ఇంకను వృద్ధినొందును

48 యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః
ఏకస్యాపి న పర్యాప్తం తస్మాత్ తృష్ణాం పరిత్యజేత్

ఈ భూమిపై ఎంత ధాన్యము, బంగారము పశువులు స్త్రీలు-కలరో అవియన్నియు ఇచ్చినను ఒక్క మనుజునికైనను చాలవు కాబట్టి తృష్ణను వదలివేయవలెను

49 యా దుస్త్యజా దుర్మతిభిర్యా న జీర్యతి జీర్యత
యోఽసౌ ప్రాణాన్తకో రోగస్తాం తృష్ణాం త్యజతః సుఖమ్

దుర్బుద్ధులగువారిచే త్యజింపబడుటకు కష్టసాధ్యమును జనులు వృద్ధులైనను వృద్ధత్వము నొందనిదియు ప్రాణాంతకమైన రోగము వంటిదియు నగు తృష్ణను వదిలివేయువానికి సుఖము కలుగును

0 పూర్ణం వర్షసహస్రం మే విషయాసక్తచేతసః
తథాప్యనుదినం తృష్ణా మమైతేష్వభిజాయతే

విషయములందాసక్తి కలిగి ఇపుడు వేయి సంవత్సరములు నిండినను — ఇపుడను ప్రతిదినము ఆ విషయముల యెడల తృష్ణ జనించుచునే యున్నది

కొంత కాలమునకు యయాతి దేవలోకమునకేగి ఇంద్రునితో సంభాషించుచు ఇట్లు చెప్పను—

51 న హీదృశం సంవననం త్రిషు లోకేషు విద్యతే
దయా మైత్రీ చ భూతేషు దానం చ మధురా చ వాక్

ప్రాణకోట్లయెడల దయ మైత్రీభావము దానము మధుర వాక్యములు—వీనితో సమానమైన వశీకరణ వస్తువులు ముల్లోకము లందెచటను ఉండవు

52 తస్మాత్ సాన్త్వం సదా వాచ్యం న వాచ్యం పరుషం క్వచిత్
పూజ్యాన్ సమ్పూజయేద్ దద్యాన్న చ యాచేత్ కదాచన

కాబట్టి ఎప్పుడును కఠోరవాక్యములను ఎలుకరాదు సదా శాంతిపూర్ణములగు మధురవాక్యములనే పలుకవలెను పూజనీయులగు వారిని పూజించవలెను ఇతరులకు దానమీయవలెను పరులను యాచించరాదు

యయాతి ఇంద్రునితో మాట్లాడునపుడు తపస్సునందు తనతో సమానమైన వాడెవడును లేడని తెలుపుటవలన, ఇతరుల నవమానించిన కారణమున పుణ్యము క్షీయింప స్వర్గమునుండి భూలోకమునకు పడిపోయెను తదుపరి పాలకుడను రాజర్షితో అతడిట్లు చెప్పెను—

53 మహాధనో యో యజతే సుయజ్ఞై
ర్యం సర్వవిద్యాసు వినీతబుద్ధిః
వేదానధీత్య తపసాஉஉయోజ్య దేహం
దివం సమాయాత్ పురుషో వీతమోహః

ఎవరు ధనవంతుడైనను ఉత్తమ యజ్ఞములద్వారా భగవంతుని ఆరాధించునో సమస్త విద్యలను పొందినను ఎవరు వినయ బుద్ధికలిగి యుండునో వేదములను పఠించి తపస్సు కావించునో, అట్టివాడు మోహరహితుడై స్వర్గము నొందును

54 దుఃఖైర్న తప్యేన్న సుఖైః ప్రహృష్యేత్
సమేన వర్తేత సదైవ ధీరః
దిష్టం బలీయ ఇతి మన్యమానో
న సంజ్వరేన్నాపి హృష్యేత్ కథంచిత్

దుఃఖములచే తపించరాదు సుఖములచే హర్షితుడు కారాదు సమభావముతో నుండవలెను భాగ్యమునే ప్రబలముగ నెంచి ఏ విధమైన చింతకుగాని హర్షమునకుగాని వశుడు కారాదు

55 తపశ్చ దానం చ శమో దమశ్చ
ప్రారార్జవం సర్వభూతానుకమ్పా
స్వర్గస్య లోకస్య వదన్తి సన్తో
ద్వారాణి సప్తైవ మహాన్తి పుంసామ్
నశ్యన్తి మానేన తమోఽభిభూతాః
పుంసః సదైవేతి వదన్తి సన్తః

తపస్సు దానము శమము (అంతరింద్రియ నిగ్రహము) దమము (బాహ్యేంద్రియ నిగ్రహము) లజ్జ సరళత్వము సమస్త ప్రాణులయెడల దయ - అను ఏడును స్వర్గలోకమునకు గొప్ప ద్వారము లని మహాత్ములు చెప్పుదురు ఆ గుణములు సదా అభిమాన రూపమగు తమస్సుచే కప్పబడినచో నశించిపోవునని మహాత్ములు చెప్పుదురు

56 యస్తు కామాన్ పరిత్యజ్య త్యక్తకర్మా జితేన్ద్రియః
అతిష్ఠేచ్చ మునిర్మౌనం స లోకే సిద్ధిమాప్నుయాత్

ఏ ముని కోరికలన్నిటిని పరిత్యజించి (లౌకిక) కర్మలను వదలి జితేంద్రియుడై సదా మౌనముగ నుండునో అతడు లోకమున పరమసిద్ధిని బొందును

పిదప కొంతకాలమునకు యయాతి తన సత్కర్మల ద్వారా భూలోకమును వీడి స్వర్గలోకమున కేగెను జనమేజయా ! భరత వంశమున శంతనుడను రాజు కలడు అతనికి గంగాదేవివలన దేవవ్రతుడను మహాశక్తిసంపన్నుడైన పుత్రుడు కలడు ఒకనాడు శంతనుడు యమునా నదీ సమీపమున గల వనమందు సంచరించు చుండ అచట దాశరాజు (నిషాదరాజు) యొక్క కుమార్తెయగు సత్యవతిని చూచి మోహితుడై ఆమెను వివాహము చేసికొన దలంచి ఆమె తండ్రితో ఆ విషయమును తెలియజేయగ అతడు ఆమె

వలన కలుగు పుత్రునికె ఆతని అనంతరము రాజ్యాధిపత్యము నొసంగ వలెనను షరతును కోరెను ఆ విషయమును తెలిసి కుమారుడగు దేవవ్రతుడు తండ్రియొక్క మనోరథమును పూర్ణమొనర్చుటకై తనకు యావజ్జీవితము రాజ్యముగాని వివాహముగాని అవసరము లేదనియు ఆ జీవితము తాను నైష్ఠిక బ్రహ్మచారిగనే యుందుననియు భీష్మప్రతిజ్ఞ చేసెను కనుకనే ఆతనికి భీష్ముడను పేరు కలిగెను అపుడు శంతనుడు సత్యవతిని వివాహము చేసికొనెను ఆమె వలన రాజునకు చిత్రాంగదుడు విచిత్రవీర్యుడు అను ఇరువురు పుత్రులు కలిగిరి కొంతకాలమునకు శంతనుడు చిత్రాంగదుడు మరణింప విచిత్రవీర్యుడు రాజయ్యెను

విచిత్రవీర్యుడు అంబిక, అంబాలిక అను ఇరువురిని వివాహము చేసికొనెను కాని కొంతకాలమునకు రోగముచే అతడు మరణించెను అపుడు సత్యవతి భీష్మునితో రాజ్యాధిపత్యమును గ్రహింపుమని కోరగా భీష్ముడు అందులకు సమ్మతించలేదు తాను కావించిన ప్రతిజ్ఞను భంగమొనర్చ్పనని తల్లితో ఇట్లు చెప్పెను-

57 పరిత్యజేయం త్రైలోక్యం రాజ్యం దేవేషు వాపునః
యద్ వాప్యధికమేతాభ్యాం న తు సత్యం కథంచన

(భీష్ముడు తల్లితో ఇట్లు చెప్పెను-) నేను ముల్లోకములను దేవతల సామ్రాజ్యమును ఈ రెండిటికంటెను మించిన దానినైనను త్యాగము చేయగలను కాని సత్యమును మాత్రము ఎన్నడును త్యజింపజాలను

అటుపిమ్మట సత్యవతి యొక్క అభిప్రాయము ననుసరించి వ్యాసముని కురువంశము యొక్క వర్ధిల్లింప నెంచెను వ్యాసముని ద్వారా అంబిక అంబాలిక అంబిక యొక్క దాసి - వీరి ముగ్గురికి క్రమముగ ధృతరాష్ట్రుడు పాండురాజు విదురుడు అను

ముగ్గురు కుమారులు జన్మించిరి ధృతరాష్ట్రుడు గాంధారిని పాండురాజు కుంతిని మాద్రిని విదురుడు దేవకరాజ కుమార్తెను వివాహము చేసుకొనిరి కుంతీదేవి కన్యగా ఉండునపుడు దుర్వాసుడొసంగిన మంత్రమును పరీక్షింప దలంచి సూర్యుని ఆవాహనము చేయగా సూర్యుడు ప్రత్యక్షమయ్యెను సూర్యునివలన ఆమెకు కర్ణుడను పుత్రుడు కలిగెను కాని సూర్యుడామెకు తిరిగి కన్యాత్వమును ప్రసాదించెను కుంతీదేవి అపవాద భయముచే కర్ణుని జలమందు వదలివేయగా సూతపుత్రుడగు అతిరథుడు ఆ బాలుని తన ఇంటికి తీసుకొని వెళ్ళెను ఆ సూతపుత్రుడు అతని భార్యయగు రాధ ఆ బాలుని తమ పుత్రునిగా భావించి సాకుచుండిరి ఆ పిల్లవాడు పుట్టుకతోనే కవచకుండలములతో జన్మించి మహాపరాక్రమ శీలుడై యుండెను

ధృతరాష్ట్రునకు గాంధారివలన దుర్యోధనుడు మొదలైన నూరుమంది పుత్రులు దుఃశల అను ఒక పుత్రిక జన్మించిరి మరియు ఒక వైశ్యజాతీయ స్త్రీద్వారా యుయుత్సుడను నతడు జన్మించెను పాండురాజునకు కుంతివలన ధర్మదేవ వాయుదేవ ఇంద్రదేవ అశ్వినీ దేవతల అంశలచే క్రమముగ ధర్మరాజు భీముడు అర్జునుడు అను మువ్వురు పుత్రులును మాద్రివలన నకుల సహదేవులు అను ఇరువురు పుత్రులును కలిగిరి కొంతకాలమునకు పాండురాజు మరణించెను ద్రోణాచార్యుడు కౌరవులకు పాండవులకు విలువిద్యయందు శిక్షణ నొసంగెను కొంతకాలమునకు ధర్మరాజు యువరాజ పదమున అభిషిక్తుడయ్యెను దుర్యోధనుడు కర్ణుని అంగదేశాధిపతిగా గావించెను దుర్యోధనుని ప్రేరణచే ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతమునకు పంపెను అచట దుర్యోధనునిచే ఏర్పాటుచేయబడిన లక్క యింటిలో వారు కాపురముండుచు కొంతకాలమునకు దానిని

తగులబెట్టి సొరంగము ద్వారా పాండవులు కుంతి బయటకు వెడలిపోయి వనమందు ప్రవేశించిరి అచట భీముడు హిడింబాసురుని వధించి అతని సోదరియగు హిడింబను వివాహము చేసికొనెను. ఆమె వలన భీమునకు ఘటోత్కచుడను పుత్రుడు జన్మించెను మ్మట పాండవులు ఏకచక్రపురమున ప్రవేశించిరి అచట భీముడు బకాసురుని వధించెను అనంతరము పాండవులు పాంచాలదేశమున కేగుచుండ రాత్రి వేళ గంగాతీరమందు చిత్రరథుడను గంధర్వుడు వారల నడ్డగింప అర్జును డాతనిని యుద్ధమందు ఓడించివేసెను పిమ్మట ఆ గంధర్వుడు అర్జునునితో మిత్రత్వమును కలిగియుండెను

ఆ గంధర్వునితో సంభాషించు సందర్భమున అర్జునుడు ఒకపుడు వసిష్ఠ విశ్వామిత్రులకు వైరమేల కలిగెనో వచింపుమని యడుగగా గంధర్వుడు ఇట్లు చెప్పెను - ఒకపుడు రాజగు విశ్వామిత్రుడు మంత్రులతో కూడ అరణ్యమున వేటకై వెడలి అలసిపోయి అచటగల వసిష్ఠాశ్రమమునకు వచ్చెను వసిష్ఠుడు వారలను సత్కరించెను ఆశ్రమమందు వసిష్ఠుని మొదకల కామధేనువును చూచి దానిని తన కిమ్మని విశ్వామిత్రుడు వసిష్ఠుని అడుగగా ఆతడు సమ్మతించనందున విశ్వామిత్రుడు వసిష్ఠునితో యుద్ధమునకు తలపడెను అపుడు కామధేనువగు నందిని విశ్వామిత్రుని సేననంతను తరిమివైచెను అంతట విశ్వామిత్రుడు వసిష్ఠునిపై బాణవర్షము కురిపించ వసిష్ఠుడు ఒక్క చిన్న వెదురు కఱ్ఱతో వాని నన్నిటిని ఆపివైచెను అది చూచి విశ్వామిత్రుడిట్లు పలికెను—

58 విశ్వామిత్రః క్షత్రభావాన్నిర్విణ్ణో వాక్యమబ్రవీత్
దిగ్ బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్

విశ్వామిత్రుడు క్షత్రియత్వము యెడల ఖిన్నుడై ఉదాసనుడై యిట్లు పలికెను - క్షత్రియ బలము నామమాత్రపు బలమే అయి

యున్నది దాని ధిక్కారము! బ్రహ్మతేజస్సు వలన కలుగు బలమే వాస్తవమైన బలము అయియున్నది

అపుడు విశ్వామిత్రుడు తపశ్శక్తి చాల గొప్పదనియు తపో బలమే అన్నిటికంటె గొప్ప బలమనియు తెలిసికొని రాజ్యమును పరిత్యజించి సంపదలను వదలి, భోగములను త్యజించివైచి ఏకాంతమునకు పోయి తపస్సునందే మనస్సునులగ్నపఱచి ఋద్ధిని బడసెను

ఇక పాండవులు పంచాలదేశమున ప్రవేశించి ద్రుపదుని రాజధాని కేగిరి అచట ద్రౌపది కై స్వయంవరమందు అర్జునుడు లక్ష్యమును భేదించి ద్రౌపదిని బడసెను పిమ్మట భీముడు అర్జునుడు తమ నివాసమున కేగి తల్లియగు కుంతీదేవితో ద్రౌపది విషయము మనస్సునందుంచుకొని అమ్మా భిక్షగొని వచ్చితిమి అని చెప్పగా నాయనలారా! దానిని మీరందఱును (ఐదుమంది) అనుభవించుడు అని పలికెను తల్లి మాట ప్రకారము పంచపాండవులు ద్రౌపదిని వివాహము చేసికొనదలంచిరి తత్సందర్భమున ధర్మరాజు వ్యాస మునితో ఇట్లు చెప్పెను—

యుధిష్ఠిర ఉవాచ —

59 గురోర్హి వచనం ప్రాహుర్ధర్మ్యం దర్మజ్ఞ సత్తమ
గురూణాం చైవ సర్వేషాం మాతా పరమకో గురుః

(ధర్మరాజు చెప్పెను-) ధర్మజ్ఞోత్తములగు వ్యాసమహర్షీ! గురువుల ఆజ్ఞ ధర్మసంగతమని చెప్పబడినది మఱియు గురువులందఱి లోను పరమ గురువుగా తల్లి యెంచబడినది

పిమ్మట పంచపాండవులతో ద్రౌపది వివాహము జరిగెను పాండవులకు అర్ధరాజ్యమిమ్మని భీష్ముడు దుర్యోధనునకు చెప్పెను

—ం ్రులు హ_స్తినాపురమునకు వచ్చి అర్థరాజ్యమును బడసి ఇంద్ర గరమును నిర్మించుకొనిరి కొంత కాలమునకు అర్జునుడు ద్వారక ఋంగు సుభద్రను వివాహము చేసికొనెను వారికి అభిమన్యుడను ాశ_ శాలియైన పుత్రుడు జనించెను

కపుడు శ్రీకృష్ణుడు అర్జునుడు ఖాండవవనమునకు వెళ్ళిరి దేవు ం ఖాండవవనమును దహించుటకు వారల సహాయమును ఉర్జున రందులకు సమ్మతించెను అగ్నిదేవుని వలన అర్జునుడు వ్య ధ ుస్సులను రథాదులను అక్షయతూణీరములను బడసెను అట్లే శ్రీకృష్ణునున్ను ఒక దివ్యాస్త్రమగు చక్రమును పొందెను అపుడు అగ్ని దేవుడు ఖాండవవనమును దహించెను వనము యొక్క దహన మమున ఆ వనమందలి శార్ఙ్గ పక్షులు రక్షణోపాయము కొఱ_కై ఎర ్రము సంభాషించుకొనినవి అందు జరితారి అనుపక్షి తక్కిన లతో ఇట్లు చెప్పెను

జ తారిరువాచ—

60 తు రతః కృచ్ఛ్రకాలస్య దీమా జాగర్తి పూరుషః
న కృచ్ఛ్రకాలం ప్రాప్య వ్యథాం నైవైతి కర్హిచిత్

(జరితారి అనుపక్షి తక్కిన పక్షులతో ఇట్లు చెప్పెను-) బుద్ధి మంతుడగువాడు సంకటకాలము రాక మునుపే జాగ్రతగ నుండును ంకటము లేటస్థించినపుడు అతడెన్నడును వ్యథితుడు కానేరడు

61 యస్తు కృచ్ఛ్రమతిప్రాప్తం విచేతా నావబుధ్యతే
 కృచ్ఛ్రకాలే వ్యథితో న శ్రేయో విన్దతే మహత్

రానున్న సంకటమును తెలిసికొనని మూఢ చిత్తుడు, సంకట మయమున వ్యథితుడగుట వలన గొప్ప శ్రేయమును పొగొట్టు ానును

తదుపరి ఆ పక్షులు అగ్నిదేవుని స్తుతింప అగ్నిదేవుడు ప్రసన్నుడై వానిని దహింపలేదు

పిమ్మట శ్రీకృష్ణుని ఆజ్ఞచే మయాసురుడు పాండవుల కొఱకై గొప్ప సభాభవనమును నిర్మించెను ధర్మరాజాదులు మయనిర్మిత సభాభవనమందు ప్రవేశించిరి అనంతరము ధర్మరాజు రాజసూయ యాగమును గావింపనెంచెను జరాసంధుని జయించు విషయమున ధర్మరాజు నిరుత్సాహమును చూపగా అపుడర్జునుడాతనికి ఉత్సాహము కలుగజేయుచు ఇట్లనెను –

ఓం

# 2 సభాపర్వము

అర్జున ఉవాచ—

1 దైన్యం యథా బలవతి తథా మోహో బలాన్వితే
తావుభౌ నాశకౌ హేతూ రాజ్ఞా త్యాజ్యౌ జయార్థినా

(అర్జునుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను-) బలవంతునియందు దీనత్వముండుట గొప్ప దోషమైనట్లు బలిష్ఠునియందు మోహము ఉండుటయు మహా దుర్గుణమైయున్నది దీనత్వ మోహములు రెండును వినాశమునకు కారణములైయున్నవి కావున విజయమును కోరునట్టి రాజు ఆ రెండింటిని విడువవలయున్నది

అనంతరము భీముడు జరాసంధుని వధించెను అర్జునుడు భీముడు నకులుడు సహదేవుడు అనేక దేశములను రాజులను జయించిరి అంతట ధర్మరాజు రాజసూయ యాగమును గావించెను అత్తఱి అనేక మంది మహాత్ములు రాజులు అచటికి విచ్చేసిరి భీష్ముని సూచన మేరకు ఆ రాజసూయయాగ సందర్భమున శ్రీకృష్ణునకు అగ్రపూజ జరుప నిశ్చయింపబడెను కాని శిశుపాలుడందులకు అంగీకరింపక ఆక్షేప పూర్వక వచనములను పలుకగా అపుడు ధర్మరాజు అతనికి ఎంతయో నచ్చ చెప్పెను తత్సందర్భమున భీష్ముడు చేదిరాజగు శిశుపాలునితో ఇట్లు చెప్పెను-

భీష్మ ఉవాచ

2 దానం దాక్ష్యం శ్రుతం శౌర్యం హ్రీః కీర్తిర్బుద్ధిరుత్తమా
సన్నతిః శ్రీర్ధృతిస్తుష్టిః పుష్టిశ్చ నియతాచ్యుతే

(భీష్ముడు శిశుపాలునితో ఇట్లు చెప్పెను-) దానము దక్షత్వము శాస్త్రజ్ఞానము, శౌర్యము లజ్జ కీర్తి ఉత్తమబుద్ధి వినయము,

ఐశ్వర్యము ధైర్యము తుష్టి పుష్టి - అను ఈ సద్గుణములన్నియు భగవంతుడగు శ్రీకృష్ణునియందు కలవు

3 ఆదిత్యశ్చన్ద్రమాశ్చైవ నక్షత్రాణి గ్రహాశ్చ యే
దిశశ్చ విదిశశ్చైవ సర్వం కృష్ణే ప్రతిష్ఠితమ్

సూర్యుడు చంద్రుడు నక్షత్రములు గ్రహములు దిక్కులు అన్నియు శ్రీకృష్ణునియందే ప్రతిష్ఠితములై యున్నవి

4 అగ్నిహోత్రముఖా వేదా గాయత్రీ ఛన్దసాం ముఖమ్
రాజాముఖం మనుష్యాణాం నదీనాం సాగరో ముఖమ్

5 నక్షత్రాణాం ముఖం చన్ద్ర ఆదిత్యస్తేజసాం ముఖమ్
పర్వతానాం ముఖం మేరుర్గరుడః పతతాం ముఖమ్

6 ఊర్ధ్వం తిర్యగధశ్చైవ యావతీ జగతో గతిః
సదేవకేషు లోకేషు భగవాన్ కేశవో ముఖమ్

వేదములందు అగ్నిహోత్రకర్మ ఛందస్సులందు గాయత్రి మనుష్యులలో రాజు నదులలో (జలాశయములలో) సముద్రము నక్షత్రములలో చంద్రుడు తేజోమయ పదార్థములందు సూర్యుడు పర్వతములందు మేరువు పక్షులందు గరుత్మంతుడు శ్రేష్ఠులైనట్లు, దేవలోక సహిత సమస్త లోకములందు పైన క్రింది ప్రక్కల జగత్తు యొక్క ఆశ్రయము లెన్నికలవో వాని యన్నియందును భగవంతుడగు శ్రీకృష్ణుడే శ్రేష్ఠుడు

7 అవ్యక్తో వ్యక్తలిఙ్గస్థో య ఏష భగవాన్ ప్రభుః
నారాయణో జగచ్చక్రే ప్రభవాప్యయః సంహితః

ఆ భగవానుడు అవ్యక్తుడై యున్నను వ్యక్తమగు శరీరమందు స్థితుడై యున్నాడు సృష్టి ప్రళయకాలములందు కూడ అతడు వెలయు చున్నాడు సర్వశక్తిమంతుడగు భగవంతుడైన ఆ నారాయణుడే ఈ ప్రపంచమునంతను నిర్మాణమొనర్చెను

శిశుపాలుడు భీష్ముని వాక్యములను వరకు గొనక శ్రీకృష్ణునితో యుద్ధమునకు సిద్ధపడి అమ్మహానీయుని లూలనాడెను. అపుడు శ్రీకృష్ణుడు తన చక్రమును పంపగా అదిపోయి శిశుపాలుని శిరస్సును ఛేదించివేసెను అపుడాతని తేజస్సు శ్రీకృష్ణునియందు ప్రవేశించెను. తదుపరి యథావిధిగా రాజసూయయాగము సమాప్తమయ్యెను ఎమ్మట దుర్యోధనుడు మయనిర్మిత పాండవ సభాభవనమున ప్రవేశించి భ్రమచేత తప్పటడుగులు వేయుచు పరిహాసపాత్రుడయ్యెను మఱియు రాజసూయయాగమున పాండవుల వైభవమును చూచి ఆతడు ఓర్చలేకపోయెను అపుడు దుర్యోధనుడు తండ్రియగు ధృతరాష్ట్రుని కడకేగి పాండవుల సంపదను గూర్చి చెప్పుకొని తన బాధను వెల్లడింపగా అది విని ధృతరాష్ట్రుడిట్లు చెప్పెను -

ధృతరాష్ట్ర ఉవాచ —

8 త్వం వై జ్యేష్ఠో జ్యైష్ఠినేయః పుత్ర మా పాణ్డవాన్ ద్విష
ద్వేష్టా హ్యసుఖమాదత్తే యథైవ నిధనం తథా

(ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను-) దుర్యోధనా! నీవు నా జ్యేష్ఠపుత్రుడవు పెద్ద రాణికి జన్మించినావు నీవు పాండవుల యెడల ద్వేషము కలిగియుండకుము. ఏలయనిన ద్వేషము కలిగియుండువాడు మృత్యువు వలె కష్టమును పొందును

9 అనార్యాచరితం తాత పరస్వస్పృహణం భృశమ్
స్వసంతుష్టః స్వధర్మస్థో యః స వై సుఖమేధతే

10 అవ్యాపారః పరార్థేషు నిత్యోద్యోగః స్వకర్మసు
రక్షణం సముపాత్తానామేతద్ వైభవలక్షణమ్

ఇతరుల ధనమును ఆశించుట నీచుల పని ఎవడు తన యొక్క ధనమందు సంతుష్టుడగుచు ఉండునో అట్టివాడే సుఖపూర్వకముగ ఉన్నతిని పొందును ఇతరుల ధనమును హరించుటకు ప్రయత్నింప

ంచుట తన కర్తవ్యమును నెరవేర్చుటకు సదా ప్రయత్నశీలుడై యుండుట తనకు ప్రాప్తించుదానిని సంరక్షించుకొనుట — ఇవియే ఉత్తమ వైభవముయొక్క లక్షణములై యున్నవి

11 ఎపత్తిష్వవ్యథో దక్షో నిత్యముత్థానవాన్ నరః
అప్రమత్తో వినీతాత్మా నిత్యం భద్రాణి పశ్యతి

ఎపత్తులందు దుఃఖపడనివాడు సదా ప్రయత్నశీలుడై యుండువాడు ప్రవృత్తి చేసినవాడు హృదయమున వినయమును ప్రేమను కలవాడు — అట్టి చతుర మానవుడు సదా శుభమునే చూచును.

దుర్యోధన ఉవాచ

12 యస్య నాస్తి నిజా ప్రజ్ఞా కేవలం తు బహుశ్రుతః
న స జానాతి శాస్త్రార్థం దర్వీ సూపరసానివ

(అంతట దుర్యోధనుడు తండ్రితో ఇట్లు చెప్పెను—)

ఎవనికి స్వతః ప్రజ్ఞ లేదో అట్టివాడు అనేక శాస్త్రములను శ్రవణము చేసినను గరిటె పాకరసమును తెలిసికొనజాలనట్లు శాస్త్రార్థము నెఱుగకుండును

తండ్రీ! అన్నియు తెలిసియుండియు నీవు నన్ను మోహమున ఎందులకు ఎడవేయుచున్నావు? అని ఈ ప్రకారముగ చెప్పి పాండవులను జూదమాడుటకై ఆహ్వానించుటకు తన తండ్రిని ప్రోత్స హించెను ధృతరాష్ట్రుని చే ధర్మరాజును హస్తినాపురమునకు పిలిపించెను జూదమందు శకునియొక్క మాయోపాయములచే ధర్మ రాజు ఓడిపోయెను అంతట విదురుడు జూదము మంచిదికాదని చెప్పుచు దుర్యోధనునితో ఇట్లు పలికెను—

విదుర ఉవాచ—

13 లభ్యతే ఖలు పాపీయాన్ నరో ను ప్రియవాగిహ
అప్రియస్య హి పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః

(విదురుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—)

ఈ ప్రపంచమున సదా ప్రియముగా పలుకునట్టి మహాపాపి యైనను లభింపవచ్చును గాని హితకరమైనను అప్రియ వచనములను చెప్పువాడు వినువాడు మహా దుర్లభుడై యుండును

14 యస్తు ధర్మపరశ్చ స్యాద్ధిత్వా భర్తుః ప్రియాప్రియే
అప్రియాణ్యాహ పథ్యాని తేన రాజా సహాయవాన్

ఎవడు ధర్మమందు తత్పరుడై తన యజమానికి ప్రియము అప్రియము అను విచారణను వదలివేసి అప్రియమైనను హితకర వాక్యమునే చెప్పునో అతడు రాజునకు నిజమైన సహాయకుడై యుండును

జూదమందు ధర్మరాజు ధనమును, రాజ్యమును తన్ను సోదరులను ద్రౌపదిని కూడ అచ్చుకొనెను అపుడు విదురుడు దుర్యోధనుని మందలించుచు ఈ ప్రకారముగ సదోపదేశము చేసెను—

15 నారున్తుదః స్యాన్న నృశంసవాదీ
న హీనతః పరమభ్యాదదీత
యయాస్య వాచా పర ఉద్విజేత
న తాం వదేదుషతీం పాపలోక్యామ్

ఎవనితోను కఠోర వచనమును పలుకరాదు నీచకర్మ ద్వారా శత్రువును వశమొనర్చుటకు ప్రయత్నింపరాదు ఇతరులకు కష్టము కలిగించునవియు నరకమును కలుగజేయునవియు నగు వచనములను ఎన్నడును పలుకరాదు

16 వముచ్చరన్త్యతి వాదాశ్చ వక్త్రాద్
యైరాహతః శోచతి రాత్ర్యహాని
పరస్య నామర్మసు తే పతన్తి
తాన్ పణ్డితో నావసృజేత్ పరేషు

ముఖమునుండి కటువాక్యములను బాణములు వెలువడు నపుడు వానిచే కొట్టబడువారు రాత్రిందినములు శోకమందు చింతయందు మునిగియుందురు అవి చెప్పువాని శత్రువులకు బాధను కలుగజేయుదురు గాన విజ్ఞుడగువాడు ఇతరులతో నిష్ఠురముగ మాట్లాడరాదు

ఎప్పుడు దుశ్శాసనుడు ద్రౌపదిని సభలోనికి జుట్టు పట్టుకొని ఈడ్చుకొనివచ్చి అవమానము చేయగోరెను అప్పుడు వికర్ణుడు రాజుల నుద్దేశించి ధర్మప్రసంగము చేయుచు ఇట్లు పలికెను —

17 చత్వార్యాహుర్నరశ్రేష్ఠా వ్యసనాని మహీక్షితామ్
మృగయాం పానమక్షాంశ్చ గ్రామ్యే చైవాతి రక్తతామ్

(వికర్ణుడు రాజులతో ఇట్లు చెప్పెను—)
రాజులకు నాలుగు దుర్వ్యసనములు చెప్పబడినవి—అని
(1) వేటాడుట (2) త్రాగుట (3) జూదమాడుట
(4) విషయ భోగములందు అత్యంతాసక్తి కలిగియుండుట

దుశ్శాసనుడు ద్రౌపదిని అవమానించుచున్న సమయమున ఆమె శ్రీకృష్ణుని ఇట్లు ప్రార్థించెను—

ద్రౌపద్యువాచ

18 గోవిన్ద ద్వారకావాసిన్ కృష్ణగోపీజనప్రియ
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ

(ద్రౌపది శ్రీకృష్ణుని యిట్లు ప్రార్థించెను—)

గోవిందా! ద్వారకావాసా! కృష్ణా! గోపజన ప్రియా! కౌరవులచే అవమానింపబడుచున్న నన్నేల తెలిసికొనుట లేదు?

19 హే నాథ హే రమానాథ వ్రజనాథార్తినాశన
కౌరవార్ణవమగ్నాం మాముద్ధరస్వ జనార్దన

ప్రభూ! లక్ష్మీనాథా! వ్రజనాథా! సంకట నాశనా! జనార్దనా! నన్ను ఉద్ధరింపుము

20 కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన
ప్రపన్నాం పాహి గోవిన్ద కురుమధ్యేఽవసీదతీమ్

కృష్ణా! కృష్ణా! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వభావనా! గోవిందా! కౌరవుల మధ్య కష్టముల నొందుచు మిమ్ములను శరణు వేడుచున్న ఈ అబలను రక్షింపుము

అంతట శ్రీకృష్ణుని అనుగ్రహముచే తండోపతండములుగా చీరెలు వచ్చుటవలన ద్రౌపది అవమానమునుండి కాపాడబడెను అప్పుడు భీముడు సభాముఖమున ప్రతిజ్ఞచేసి దుశ్శాసనుని యొద్ధమందు వధించెదనని శపథము చేసెను అంతట ధృతరాష్ట్రుడు ధర్మరాజును బుజ్జగించి ఈ ప్రకారముగ పలికెను

ధృతరాష్ట్ర ఉవాచ

21 న వైరాణ్యభిజానన్తి గుణాన్ పశ్యన్తి నాగుణాన్
విరోధం నాధిగచ్ఛన్తి యే త ఉత్తమపూరుషాః

(ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పను —)

ఎవరు వైరమును జ్ఞప్తియందుంచుకొనరో ఎవరు గుణములనే చూచుదురో అవగుణములను చూడరో అట్టివారు ఉత్తములని చెప్పబడుదురు

22 స్మరన్తి సుకృతాన్యేవ న వైరాణి కృతాన్యపి
సన్తః పరార్థం కుర్వాణా నావేక్షన్తే ప్రతిక్రియామ్

మహాత్ములు ఇతరుల ఉపకారాదులనే జ్ఞప్తియందుంచు కొందురు కాని వారి వైరమును కాదు వారు ఇతరులకు మేలు చేయుదురే కాని వారికి ప్రతీకార మొనర్పరు

23 సంవాదే పరుషాణ్యాహుర్యుధిష్ఠిర నరాధమాః
ప్రత్యాహుర్మధ్యమాస్త్వేతేఽనుక్తాః పరుషముత్తరమ్

24 న చోక్తా నైవ చానుక్తాస్త్వహితాః పరుషా గిరః
ప్రతిజల్పన్తి వై ధీరాః సదా ఉత్తమపూరుషాః

నీచులు సామాన్యముగు సంభాషణయందు కూడ కటు వాక్యముల నుచ్చరింతురు మొదట కటువచనములను పలుకక ప్రత్యుత్తరమందు కఠినముగ పలుకువారు మధ్యమ తరగతివారు ధీరులు శ్రేష్ఠులు ఇతరులు కఠినవచనములను పలికినను పలుకకున్నను తాము మాత్రము అహితవచనములను పలుకనేయరు

25 స్మరన్తి సుకృతాన్యేవ న వైరాణి కృతాని చ
సన్తః ప్రతి విజానన్తో లబ్ధ్వా ప్రత్యయమాత్మనః

మహాత్ములు తమ అనుభవమును ముందిడుకొని ఇతరుల సుఖ దుఃఖములను తన సుఖదుఃఖములుగనే భావించుచు వారి ఉత్తమ నడవడికనే జ్ఞప్తియందుంచుకొందురు కాని వారి వైరమునుగాని విరోధమునుగాని కాదు

అనంతరము ధర్మరాజు తిరిగి రెండవసారి శకునితో జూదమాడి ఓడిపోయెను తత్ఫలితముగ ధర్మరాజాదులు పండ్రెండు సంవత్సరములు వనవాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము గావింప వలసి వచ్చినది పాండవులు వనవాసమునకు పోవునపుడు పురవాసులు దుఃఖించి వారిని అనుగమించుచు వారితో ఇట్లనిరి —

# 3 వనపర్వము

పౌరా ఊచుః

1 మోహజాలస్య యోనిర్హి మూఢైరేవ సమాగమః
అహన్యహని ధర్మస్య యోని సాధుసమాగమః

(పౌరులు పాండవులతో ఇట్లు చెప్పిరి-) మూర్ఖులతోటి సాంగత్యము మోహజాలమును ఉత్పన్నమొనర్చును సాధుమహాత్ముల తోటి సాంగత్యము ప్రతిదినము ధర్మమును సంప్రాప్తింపజేయును

2 తస్మాత్ ప్రాజ్ఞైశ్చ వృద్ధైశ్చ సుఖభావైస్తపస్విభిః
సద్భిశ్చ సహ సంసర్గః కార్యః శమపరాయణైః

కాబట్టి ప్రాజ్ఞులు పెద్దలునగువారు ఉత్తమ స్వభావము కలవారును శాంతిపరాయణులును తపస్వులును అగు సజ్జనుల సాంగత్యమును చేయవలెను

3 యేషాం త్రీణ్యవదాతాని విద్యా యోనిశ్చ కర్మ చ
తాన్సేవ్యాస్తైః సమాస్యా హి శాస్త్రేభ్యోఽపి గరీయసీ

ఎవరికి విద్య జాతి పనులు - అను మూడును ఉజ్జ్వలముగా నుండునో అట్టివారి సాంగత్యమునే చేయవలెను. ఏలయనగ వారితో బాటు కూర్చునుట శాస్త్రముల స్వాధ్యాయము కంటెను గొప్పది

4 నిరారమ్భా హ్యపి వయం పుణ్యశీలేషు సాధుషు
పుణ్యమేవాప్నుయామేహ పాపం పాపోపసేవనాత్

మేము అగ్నిహోత్రాది శుభకర్మలను చేయకున్నను పుణ్యాత్ములగు సాధువుల సాంగత్యమున నివసించుటచే మాకు పుణ్యము సంప్రాప్తించును పాపుల సాంగత్యమునే జనులకు పాపము సంభవించును

5 అసతాం దర్శనాత్ స్పర్శాత్ సంజల్పాచ్చ సహాసనాత్
దర్మాచారాః ప్రహీయన్తే సిద్ధ్యన్తి చ న మానవాః

దుష్టులగువారి యొక్క దర్శనము స్పర్శనము సంభాషణము, సాంగత్యము మొదలగువానిచే ధార్మిక ఆచారములయొక్క హాని సంభవించును కాబట్టి అట్టివారికి సిద్ధి యెన్నడును లభించదు

6 బుద్ధిశ్చ హీయతే పుంసాం నీచైః సహ సమాగమాత్
మధ్యమైర్మధ్యతాం యాతి శ్రేష్ఠతాం యాతి చోత్తమైః

నీచుల సాంగత్యముచే మనుజుని బుద్ధి నశించును మధ్యమ తరగతివారి సాంగత్యముచే బుద్ధి మధ్యమముగనుండును ఉత్తములగు వారి సాంగత్యముచే బుద్ధి శ్రేష్ఠత్వము నొందును

పాండవులు వనమునకేగుటకు సిద్ధులైయున్న సమయమున శౌనకుడను విద్వాంసుడైన బ్రాహ్మణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను –

శౌనక ఉవాచ

7 శోకస్థాన సహస్రాణి భయస్థానశతాని చ
దివసే దివసే మూఢమావిశన్తి న పణ్డితమ్

(శౌనకుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను –) వేలకొలది శోక స్థానములు వందల కొలది భయస్థానములు ప్రతిదినము మూఢుని పొందునే కాని జ్ఞానిని కాదు

8 మనోదేహసముత్థాభ్యాం దుఃఖాభ్యామర్దితం జగత్
తయోర్వ్యాస సమాసాభ్యాం శమోపాయమిమం శృణు

మానసిక, శారీరక దుఃఖములచే ప్రపంచమంతయు పీడింపబడు చున్నది ఈ దుఃఖములు శమించుటకు ఉపాయము సంక్షేపముగను విస్తారముగను వినుము,

9 వ్యాధేరనిష్టసంస్పర్శాచ్ఛ్రమాదిష్ట వివర్జనాత్
దుఃఖం చతుర్భిః శారీరం కారణైః సమ్ప్రవర్తతే

రోగములు అప్రియ పదార్థముల ప్రాప్తి అధిక పరిశ్రమ ప్రియవస్తువుల వియోగము - అను ఈ నాలుగు కారణముల వలన శారీరక దుఃఖము కలుగును

10 తదా తత్ప్రతికారాచ్చ సతతం చావిచిన్తనాత్
ఆధివ్యాధిప్రశమనం క్రియాయోగద్వయేన తు

ఈ నాలుగు కారణములకు ప్రతికారము చేయుట వానిని గూర్చి చింతింపకుండుట - అను క్రియాయోగములు రెండును దుఃఖ నివారకోపాయములై యున్నవి వీని వలన శారీరక మానసిక వ్యాధులు శమించును

11 మానసం శమయేత్ తస్మాజ్జ్ఞానే నాగ్నిమివామ్బునా
ప్రశాన్తే మానసే హ్యస్య శారీరముపశామ్యతి

జలముచే అగ్నిని శమింపజేయులాగున జ్ఞానముచే మానసిక దుఃఖమును శమింపజేయవలెను మానసిక దుఃఖము తొలగగనే మనుజుని శారీరక దుఃఖము కూడ తొలగిపోవును

12 మనసో దుఃఖమూలం తు స్నేహా ఇత్యుపలభ్యతే
స్నేహాత్ తు సజ్జతే జన్తుర్దుఃఖ యోగముపైతి చ

మానసిక దుఃఖమునకు మూలము సంసారమునందు ఆసక్తి అట్టి ఆసక్తి వలననే జీవుడు దృశ్యవస్తువులందు తగుల్కొని దుఃఖము నొందుచున్నాడు

13 కోటరాగ్నిర్యథాశేషం సమూలం పాదపం దహేత్
ధర్మార్థౌ తు తథాల్పోఽపి రాగదోషో వినాశయేత్

చెట్టు తొఱ్ఱయందున్న అగ్ని చెట్టునంతను దహించివేయునట్లు విషయముల యెడల గల ఆసక్తి ధర్మ అర్థముల రెండిటిని నశింపజేయును

14 విప్రయోగే న తు త్యాగీ దోషదర్శీ సమాగమే
విరాగం భజతే జన్తుర్నిర్వైరో నిరవగ్రహః

విషయములు ప్రాప్తించనప్పుడు వానిని త్యజించువాడు త్యాగి కాడు విషయములు సంప్రాప్తించినను వాని యందలి దోషమును చూచి వానిని పరిత్యజించువాడే నిజమైన త్యాగి అట్టివాడే వైరాగ్యమును పొందును అతని మనస్సునందు ఎవని యెడల ద్వేషభావము లేనందువలన అతడు నిర్వైరుడు బంధముక్తుడు అగును

15 తస్మాత్ స్నేహం న లిప్సేత మిత్రేభ్యో ధనసంచయాత్
స్వశరీరసముత్థం చ జ్ఞానేన వినివర్తయేత్

కాబట్టి మిత్రుల యెడల ధనాదుల యెడగల ఆసక్తి కలిగియుండరాదు తన శరీరము యెడల ఉత్పన్నమైన ఆసక్తిని జ్ఞానముచె తొలగించుకొనవలెను

16 జ్ఞానాన్వితేషు యుక్తేషు శాస్త్రజ్ఞేషు కృతాత్మసు
న తేషు సజ్జతే స్నేహః పద్మపత్రేష్వివోదకమ్

జ్ఞానియు యోగయుక్తుడును, శాస్త్రజ్ఞుడును, మనస్సును వశమందుంచుకొనువాడును అగువానిపై — కమలపత్రముపై జలమువలె — ఆసక్తి యొక్క ప్రభావమేమియు ఉండదు

17 రాగాభిభూతః పురుషః కామేన పరికృష్యతే
ఇచ్ఛా సంజాయతే తస్య తతస్తృష్ణా వివర్ధతే

18 తృష్ణా హి సర్వపాపిష్ఠా నిత్యోద్వేగకరీ స్మృతా
అధర్మబహులా చైవ ఘోరా పాపానుబన్ధినీ

రాగము వశీభూ నాని కామము తన వైపులాగ
ను లఘు తని యాస్సునందు కామభోగములను గార్చిన ఇచ్ఛ
గాముకు తగుపరి తృష్ణ వృద్ధి నొందగను తృష్ణ మహాపాపబద్ధదనియు
నిత్యము ఉద్వేగమును కలుగజేయుననియు చెప్పబడినది దానిచే
సంభవించును అద్యది అత్యంత భయంకరమగు పాపబంధ
ముస నీపుని ప క్రియును

19 యా దుస్త్యజా దుర్మతిభిర్యా న జీర్యతః
యోஉసౌ ప్రాణాన్తికో రోగస్తాం తృష్ణాం త్యజతః సుఖమ్

త్యజించుటకు కష్టసాధ్యమైనదియు శరీరము శిథిలమైనను
శిథిలం కానిదియు ప్రాణనాశకమగు రోగము వంటిదియు తృష్ణను
త్యజించువానికి సుఖము లభించును

20 రాజతః సలిలాదగ్నేశ్చోరత స్స్వజనాదపి
భయమర్థవతాం నిత్యం మృత్యోః ప్రాణభృతామివ

ధనవంతులకు రా జలము అగ్ని చోరులు స్వజనులు- అను
వల - మృత్యువుచే భయము కలుగునట - భయము కలుగును

21 అనిత్యం యౌవనం రూపం జీవితం రత్నసంచయః
ఐశ్వర్యం ప్రియసంవాసో గృధ్యేత్ తత్ర న పణ్డితః

యౌవనము రూపము జీవితము రత్నసంగ్రహము ఐశ్వర్యము
ప్రియులతోటి నివాసము — అనునివి అనిత్యములు కావున వివేక
వంతులు వానిని అభిలషించరాదు

22 ధర్మార్థం యస్య విత్తేహా వరం తస్య నిరీహతా
ప్రక్షాలనాద్ధి పంకస్య శ్రేయో న స్పర్శనం నృణామ్

ధర్మము నాచరించుటకు, ధనోపార్జన గావించుట ఉత్తమమైనది
కాదు ఏలయనిన బురద పూసికొని కడుగుకొనుట కంటె బురదను
తాకకయే యుండుట ఉత్తమము కదా!

23 తృణాని భూమిరుదకం వాక్ చతుర్థీ చ సూనృతా
సతామేతాని గేహేషు నోచ్ఛిద్యన్తే కదాచన

ఆసనము కొఱకై తృణములు కూర్చొనుటకు స్థలము, జలము మధురవాక్కు — అను ఈ నాలుగున్ను సజ్జనుల ఇండ్లయందు ఎన్నడును లేకుండ వుండవు (సదా యుండును)

24 ఆత్మార్థం పాచయేన్నాన్నం న వృథా ఘాతయేత్ పశూన్
న చ తత్ స్వయమశ్నీయాద్ విధివద్ యన్న నిర్వపేత్

కేవలము తన కొఱకు మాత్రము అన్నము వండు కొనరాదు పశువులను హింసించరాదు దేవతలకు విధి పూర్వకముగా సమర్పించని దానిని తాను తినరాదు

2 శ్వభ్యశ్చ శ్వపచేభ్యశ్చ వయోభ్యశ్చావపేద్ భువి
వైశ్వదేవం హి నామైతత్ సాయం ప్రాతశ్చ దీయతే

కుక్కలకు చండాలురకు కాకులకు అన్నము వేయవలెను ఇది వైశ్వదేవమను గొప్ప యజ్ఞము దీనిని ఉదయము సాయంత్రము కూడ అనుష్ఠించవలెను

26 అహో బత మహత్ కష్టం విపరీతమిదం జగత్
యేనాపత్రపతే సాధురసాధుస్తేన తుష్యతి

ఆహా! చాల దుఃఖకరమైన విషయము! ఈ ప్రపంచమున విపరీత విషయములు గోచరించుచున్నవి మహాత్ములు ఏ కర్మ చేయుటకు సిగ్గుపడుచున్నారో, దుష్టులు దానిని చేయుటయందే ప్రీతిని గొనుచున్నారు

27 ప్రాయతే బుధ్యమానోఽపి నరో హారిభిరిన్ద్రియైః
విమూఢసంజ్ఞో దుష్టాశ్వైరుద్భ్రాన్తైరివ సారథిః

ఒకింత తెలివి గలిగిన మనుజుడు కూడ మనస్సును చాలించు ఇంద్రియములచే విషయముల వైపునకు ఈడ్వబడుచున్నాడు ఆ సమయమున అతని విచారణాశక్తి మోహాంత మగుచున్నది చెడ్డ గుఱ్ఱములు వశమందు లేనందుచే సారథిని కుమార్గమునకు ఈడ్చుకొని పోవునట్లు అజితేంద్రియుడు కూడ తన ఇంద్రియములచే ఈడ్చుకొని పోబడును

28 ఏవం పతతి సంసారే తాసు తాస్వివ యోనిషు
అవిద్యా కర్మ తృష్ణాభిర్భ్రామ్యమాణోఽథ చక్రవత్

ఈ ప్రకారముగ అవిద్య కర్మ, తృష్ణల ద్వారా చక్రమువలె తిరుగుచు మనుజుడు సంసారముగ వివిధ యోనులందు పడుచున్నాడు

29 ఇజ్యాధ్యయనదానాని తపః సత్యం క్షమా దమః
అలోభ ఇతి మార్గోఽయం ధర్మస్యాష్టవిధః స్మృతః

యజ్ఞము, అధ్యయనము దానము తపస్సు సత్యము క్షమ మనస్సు, ఇంద్రియముల యొక్క సంయమము, లోభమును పరిత్యజించుట — అను ఈ యెనిమిదిన్ని ధర్మము యొక్క యెనిమిది మార్గములు

30 సమ్యక్సంకల్పసంజనాత్ సమ్యక్ చేన్ద్రియనిగ్రహాత్
సమ్యగ్వ్రతవిశేషాచ్చ సమ్యక్ చ గురుసేవనాత్

31 సమ్యగాహారయోగాచ్చ సమ్యక్ చాధ్యయనాగమాత్
సమ్యక్కర్మోపసంన్యాసాత్ సమ్యక్చిత్త నిరోధనాత్

పూర్ణముగ సంకల్పములను ఏకమగు ఉత్తమ ధ్యేయమందు నెలకొల్పుటచేతను ఇంద్రియములను బాగ వశమొనర్చుకొనుట చేతను అహింసాదివ్రతములను లెస్సగ పాలించుట చేతను గురు సేవను బాగుగ ఒనర్చుటచేతను, యోగసాధనమునకు ఉపయోగకరమైన ఆహారమును సేవించుటచేతను, వేదాదులను బాగుగ అధ్యయ

సన చేయుటచేతను కర్మలను లెస్సగ భగవత్సమర్పణము చేయుట చేతను, చిత్తమను బాగుగ నిరోధించుటచేతను మనుజుడు పరమ శ్రేయమును పొందుచున్నాడు

32 ఏవం కర్మాణి కుర్వన్తి సంసారవిజిగీషవః
రాగద్వేష వినిర్ముక్తా ఐశ్వర్యం దేవతా గతాః

సంసారమును జయింపదలంచు బుద్ధిమంతుడు ఈ ప్రకారము రాగద్వేషరహితుడై కర్మలను చేయవలెను ఈ నియమములను పాలించుటచేతనే దేవతలు ఐశ్వర్యమును పొందిరి

పాండవులు వనమునకేగు సందర్భమున కొందఱు బ్రాహ్మణులు కూడ వెంటరాగా వారికి భోజనము సమకూర్చుట ఎట్లు అని ధర్మరాజ పురోహితుడగు ధౌమ్యుని అడుగగా సూర్యారాధన చేయుమనగ అతడు చెప్పి ఆ పద్ధతిని వివరించెను ధర్మరాజు అట్లే సూర్యుని ఆరాధించి ఆతని నుండి అక్షయ పాత్రను బడసెను పిమ్మట పాండవులు కామ్యకవనమందు ప్రవేశించిరి శ్రీకృష్ణాదులు ధృష్టద్యుమ్నుడు మొదలైనవారు పాండవుల యొద్దకు వచ్చినపుడు అర్జునుడు శ్రీకృష్ణుని ఇట్లు స్తుతించెను —

33 పురుషస్యాప్రమేయస్య సత్యస్యామితతేజసః
ప్రజాపతిపతేర్విష్ణో ర్లోకనాథస్య ధీమతః

(అర్జునుడు శ్రీకృష్ణుని ఇట్లు స్తుతించెను — ) భగవంతుడగు శ్రీకృష్ణుడు అంతర్యామి అప్రమేయుడు సత్యస్వరూపుడు అమిత తేజస్వి ప్రజాపతులకున్ను నాథుడు సమస్తలోకములకున్ను రక్షకుడు మఱియు పరమ బుద్ధిమంతుడగు శ్రీవిష్ణువే అయియున్నారు

34 క్షేత్రజ్ఞః సర్వభూతానామాదిరన్తశ్చ కేశవ
నిధానం తపసాం కృష్ణ యజ్ఞస్త్వం చ సనాతనః

ఓ కౌరవా! మీరు క్షేత్రజ్ఞులు (అందరి మొక్క ఆత్మ) సమస్త ప్రాణుల యొక్క ఆది అంతము మీరే తపస్సుయొక్క అధిష్ఠానము యజ్ఞము మీరే మీరు సనాతన స్వరూపులు

అపుడు శ్రీకృష్ణుడు పాండవులకు హితవచనములను చెప్పుచు ఇట్లు బోధించెను

వాసుదేవ ఉవాచ —

35 స్త్రియోఽక్షా మృగయా పానమేతత్ కామసముత్థితమ్
దుఃఖం చతుష్టయం ప్రోక్తం యైర్నరో భ్రశ్యతే శ్రియః

((శ్రీకృష్ణుడు పాండవులతో ఇట్లు చెప్పెను—)

స్త్రీలయెడల ఆసక్తి కలిగియుండుట జూదమాడుట వేటాడుట మద్యపానము చేయుట - అను ఈ నాలుగు విధములైన భోగములు కామనాజనితములగు దుఃఖములని చెప్పబడినది వానివలన మనుజుడు తన ధనమును ఐశ్వర్యమును కోల్పోవుచున్నాడు

పిమ్మట పాండవులు ద్వైతవనమున కేగిరి అక్కడ మార్కండేయుడు పాండవుల కిట్లు బోధించెను

మార్కణ్డేయ ఉవాచ—

36 సహ్రనేత్రప్రతిమో మహాత్మా
యమస్య నేతా నముచేశ్చ హన్తా
చతుర్నిదేశాదనఘః స్వధర్మం
వాసం వనే దాశరథిశ్చచార

(మార్కండేయుడు పాండవుల కిట్లు బోధించెను—)

దశరథనందనుడగు శ్రీరాముడు మహాతేజుడు ఇంద్రుడు వారి మఱియొక రూపము వారు యమునియొక్క నియంతయై యున్నారు నముచి వంటి దానవులయొక్క నాశకులు అయినను ఆ

మహాత్ముడు తన తండ్రియొక్క ఆజ్ఞను ధర్మముగ నెంచి అరణ్యమందు నివసించెను

37 స చాపి శక్రస్య సమప్రభావో
మహానుభావః సమరేష్వజేయః
విహాయ భోగానచరద్ వనేషు
నేశే బలస్యేతి చరేదధర్మమ్

ఇంద్రునితో సమానమగు ప్రతిభకలవాడును గొప్ప అనుభవము కలవాడును యుద్ధమందు సదా అజేయులును అగు అట్టి శ్రీరామచంద్రుడు గూడ సమస్త భోగములను పరిత్యజించి అరణ్యమందు నివసించెను కాబట్టి ఎవడును తన భోగభాగ్యములను చూచియు, తన్ను బలవంతునిగా తలంచియు అధర్మము చేయరాదు

తదుపరి ద్రౌపది ధర్మరాజుతో ప్రసంగించుచు శత్రువుల వైరభావమును గూర్చి పలుకగా అపుడు ధర్మరాజ ద్రౌపదితో ఇట్లు చెప్పెను——

యుధిష్ఠిర ఉవాచ——

38 క్రోధో హన్తా మనుష్యాణాం క్రోధో భావయితా పునః
ఇతి విద్ధి మహాప్రాజ్ఞే క్రోధమూలౌ భవాభవౌ

(ధర్మరాజు ద్రౌపదితో ఇట్లు చెప్పెను——)

మహాబుద్ధిశాలివగు ద్రౌపదీ! కోపమే మనుష్యుని చంపునదై యున్నది ఆ కోపము జయింపబడుచో అభ్యుదయమును కలుగజేయును ఉన్నతి అవనతి – రెండును క్రమముగ క్రోధాభావ, క్రోధామూలములే అయియున్నవి

39 యో హి సంహరతే క్రోధం భవస్తస్య సుశోభనే
యః పునః పురుషః క్రోధం నిత్యం న సహతే శుభే
తస్యాభావాయ భవతి క్రోధః పరమదారుణః

కోపమును నిగ్రహించువానికి ఉన్నతి కలుగును కోపము యొక్క వేగమును అరికట్టలేనివానికి ఆ కోపము వినాశకారి యగును

40 క్షమా ధర్మః క్షమా యజ్ఞః క్షమా వేదాః క్షమా శ్రుతమ్
య ఏతదేవం జానాతి స సర్వం క్షన్తుమర్హతి

క్షమ (ఓర్పు) ధర్మము క్షమ యజ్ఞము, క్షమ వేదము క్షమ శాస్త్రము ఈ విధముగ తెలిసికొనువానికి అంతయు క్షమా యోగ్యమై యుండగలదు

41 యేషాం మన్యుర్మనుష్యాణాం క్షమయాభిహతః సదా
తేషాం పరతరే లోకాస్తస్మాత్ క్షాన్తిః పరామతా

ఎవరి క్రోధము క్షమచే నిగ్రహింపబడునో అట్టివానికి సర్వోత్తమ లోకములు సంప్రాప్తించుచున్నవి కావున క్షమ అన్నింటి కంటె గొప్ప సుగుణముగ తలంచబడినది

42 వ్యాసో వసిష్ఠో మైత్రేయో నారదో లోమశః శుకః
అన్యే చ ఋషయః సర్వే ధర్మేణైవ సుచేతసః

వ్యాసముని, వసిష్ఠుడు మైత్రేయుడు నారదుడు లోమశుడు శుకుడు ఇంకను ఇతర మహర్షులు ధర్మమును పాలించుట వలననే శుద్ధ హృదయులైరి

43 ధర్మ ఏవ ప్లవో నాన్యః స్వర్గం ద్రౌపది గచ్ఛతామ్
సైవ నౌః సాగరస్యేవ వణిజః పారమిచ్ఛతః

సముద్రమును దాట దలచువారికి పడవ అవసరమైనట్లు స్వర్గమున కేగ దలంచువారికి ధర్మమే శరణ్యము కాని మఱియొకటి కాదు

(అనంతరము ధర్మరాజు భీమునితో ఇట్లు చెప్పెను—)

యుధిష్ఠిర ఉవాచ—

44 మమ ప్రతిజ్ఞాం చ నిబోధ సత్యాం
వృణే ధర్మమమృతా జ్జీవితాచ్చ
రాజ్యం చ పుత్రాశ్చ యశో ధనం చ
సర్వం న సత్యస్య కలాముపైతి

(ధర్మరాజు భీమునితో ఇట్లు చెప్పెను—)

నా యీ సత్యమైన ప్రతిజ్ఞను వినుము నేను జీవితముకంటెను, అమరత్వము కంటెను ధర్మమును గొప్పదిగా తలంచుచున్నాను రాజ్యము పుత్రులు యశస్సు, ధనము - ఇవి యన్నియు సత్య గర్మములయొక్క పదునారవ భాగమునైన ను పొందలేవు

పిదప పాండవులు కామ్యకవనమునకు వెళ్ళిరి అర్జును సోదరులతో కలిసికొని ఇంద్రకీల పర్వతముపైకి వెడలి ఇంద్రుని దర్శించెను అర్జునుడు ఆ పర్వతముపై ఉగ్రతపం బాచరించెను పిమ్మట శివుని గూర్చి ప్రార్థించెను శివుడు అర్జునునితో వరమును కోరుకొనుమనగా అర్జునుడు పాశుపతాస్త్రమును కోరుకొనగా అట్లే శివుడు దాని నొసంగి దాని ప్రయోగ ఉపసంహారముల పద్ధతిని కూడ చెప్పెను

తదుపరి ఇంద్రుని ఆహ్వానమును పురస్కరించుకొని అర్జునుడు స్వర్గమున కేగి ఇంద్రునినుండి కొన్ని అస్త్రాదులను గ్రహించెను ఇచట వనమందు పాండవుల చెంతకు బృహదశ్వముని వచ్చి ధర్మ రాజాదులకు నల దమయంతుల చరిత్రను చెప్పెను తత్కథాసంద ర్భమున ఋతుపర్ణరాజు బాహుకుని రూపమున ఉన్న నలునితో ఇట్లు చెప్పెను—

45 సర్వః సర్వం న జానాతి సర్వజ్ఞో నాస్తి కశ్చన
నైకత్ర పరినిష్ఠాస్తి జ్ఞానస్య పురుషే క్వచిత్

(ఋతుపర్ణరాజు బాహుకునితో ఇట్లు చెప్పెను—)

జనులందఱు అన్ని విషయములను ఎఱుగరు ప్రపంచములో (భగవంతుడు తప్ప) సర్వజ్ఞుడైనవాడును లేడు మఱియు ఒకనియందే సమస్త జ్ఞానము ఉండదు

ఉలస్త్య ఉవాచ

46 యస్య హస్తౌ చ పాదౌ చ మనశ్చైవ సుసంయతమ్
విద్యా తపశ్చ కీర్తిశ్చ స తీర్థఫలమశ్నుతే

(పులస్త్యుడు భీష్మునితో ఇట్లు చెప్పెను—)

ఎవనికి చేతులు, కాళ్ళు మనస్సు వశమందుండునో ఎవడు విద్య తపస్సు కీర్తి – వీనితోకూడి యుండునో అట్టివాడే తీర్థసేవనము యొక్క (పూర్ణ) ఫలమను పొందును

47 అకల్కకో నిరారమ్భో లఘ్వాహారో జితేన్ద్రియః
విముక్తః సర్వపాపేభ్య తీర్థఫలమశ్నుతే

దంభము మొదలగు దోషములు లేనివాడు కర్తృత్వము అహంకారము తొలగినవాడు అల్పాహారి జితేంద్రియుడు సమస్త పాపములనుండి విడివడ తీర్థములయొక్క వాస్తవ ఫలమును పొందును

48 అక్రోధనశ్చ రాజేన్ద్ర సత్యశీలో దృఢవ్రతః
ఆత్మోపమశ్చ భూతేషు స తీర్థఫలమశ్నుతే

కోపము లేనివాడు సత్యవాది దృఢత్వముతో వ్రతముల నాచరించువాడు సమస్త ప్రాణులందును ఆత్మభావము కలిగియుండు వాడు తీర్థముల ఫలమును పొందును

49 ఋషీణాం పరమం గుహ్యమిదం భరతసత్తమ
తీర్థాభిగమనం పుణ్యం యజ్ఞైరపి విశిష్యతే

భరతశ్రేష్ఠా! ఇది ఋషులకు కూడ పరమగోప్యమైన రహస్యము తీర్థయాత్ర మహాపవిత్రమైన సత్కర్మ ఇది యజ్ఞములు కంటెను గొప్పది

ఎదుం ధర్మరాజు యెద్దకు నారదుడు వచ్చెను ధర్మరాజు తీర్థములను గూర్చి నారదుని అడుగగా నారదుడు ఇదివరకు భీష్మునకు పులస్త్యముని తీర్థములను గూర్చియు వాని మహిమను గూర్చియు చెప్పి విషయమును విపులముగా చెప్పెను అటే గౌమ్య పురోహితుడు కూడ ధర్మరాజునకు పెక్కు తీర్థములను గూర్చి చెప్పెను తత్సందర్భమున గౌమ్యుడు ధర్మరాజుతో ఇట్లు పలికెను

ధౌమ్య ఉవాచ—

50 పవిత్రాణాం హి గోవిన్దః పవిత్రం పరముచ్యతే
పుణ్యానామపి పుణ్యోఽసౌ మఙ్గలానాం చ మఙ్గలమ్
త్రైలోక్యే పుణ్డరీకాక్షో దేవదేవః సనాతనః

(ధౌమ్యుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

భగవంతుడగు గోవిందుడు పవిత్రములను కూడ పవిత్రము చేయునట్టి పరమ పవిత్రుడు. పుణ్యములకును పుణ్యమును మంగళములకును మంగళమును అయియున్నారు కమలనేత్రుడగు దేవాధిదేవుడును, సనాతనుడును అగు శ్రీహరి నాశరహితుడగు పరమాత్మయు జీవుల రూపమున వెలయువారును క్షేత్రజ్ఞుడును పరమేశ్వరుడును అయియున్నారు అచింత్య స్వరూపుడగు ఆ మధుసూదనుడే ద్వారకా పట్టణమందున్నారు

అనంతరము పాండవులు తీర్థయాత్రలు చేయుచుండగా ఆ కామ్యకవనమందలి ఋషులు ధర్మరాజుతో ఇట్లు చెప్పిరి—

ఋషయ ఊచుః—

51 శరీరనియమం ప్రాహుర్బ్రాహ్మణా మానుషం వ్రతమ్
మనోవిశుద్ధాం బుద్ధిం చ దైవమాహుర్వ్రతం ద్విజాః

(ఋషులు ధర్మరాజుతో ఇట్లు చెప్పిరి—)

బ్రహ్మనిష్ఠులు శరీరశుద్ధి యొక్క నియమమును మానుషవ్రతమనియు మనస్సుచే శుద్ధమొనర్పబడిన బుద్ధిని దైవవ్రతమనియు చెప్పెదరు

అంతట లోమశుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—

లోమశ ఉవాచ—

52 వర్ధత్యధర్మేణ నరస్తతో భద్రాణి పశ్యతి
తతః సపత్నాఞ్జయతి సమూలస్తు వినశ్యతి

(లోమశుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

అధర్మముచే మొదట మనుజుడు వర్ధిల్లినట్లును అభ్యుదయములను గాంచినట్లును తోచవచ్చును తదుపరి శత్రువులను జయించినట్లు కానిపించవచ్చును కాని తుదకు అతడు సమూలముగ నశించిపోవును

ఎట్లు పాండవులు నైమిశారణ్యాది పుణ్యక్షేత్రములను, పెక్కు తీర్థములను దర్శించిరి. ధర్మరాజ యొక్క ప్రశ్నను పురస్కరించుకొని లోమశుడు అగస్త్యుని వృత్తాంతమును ధర్మరాజునకు చెప్పెను—పిదప భగీరథుని యొక్కయు ఋష్యశృంగముని యొక్క ఉపాఖ్యానములను వర్ణించి చెప్పెను తదుపరి పాండవులు మహేంద్ర పర్వతముపైకి అనంతరము ప్రభాసక్షేత్రమునకు వెడలిరి పిదప లోమశుడు ధర్మరాజునకు మాంధాత చక్రవర్తి యొక్క చరిత్రను చెప్పెను ఎట్లు లోమశుడు అనేక తీర్థముల యొక్క మహిమను ధర్మరాజునకు చెప్పుచు ఉశీనరరాజ యొక్క చరిత్రను వర్ణించెను

ఉశీనరరాజు యొక్క మహత్త్వమును పరీక్షించుటకై ఇంద్రుడు డేగ
రూపముననూ అగ్ని పావురము రూపముననూ ఆ రాజు యొద్దకు వచ్చిరి
డేగ పావురమును తరుముచురాగా పావురము రాజు ఒడిలో తల
దాచుకొనెను అపుడు డేగ తనకు ఆకలిగా ఉన్నదనియు పావురమును
తనకిమ్మనియు ఉశీనరరాజు నడుగగా అతడిట్లు చెప్పెను—

రాజోవాచ—

53 యో వై కశ్చిద్ ద్విజాన్ హన్యాద్ గాం వా లోకస్యమాతరమ్
శరణాగతం చ త్యజతే తుల్యం తేషాం హి పాతకమ్

(ఉశీనరరాజు డేగతో ఇట్లు చెప్పెను—)

ద్విజులను చంపువాడు జగన్మాతయగు గోవును వధించువాడు
శరణాగతిని పొందిన వానిని వదలి పెట్టువాడు—అను ఈ ముగ్గురికిని
పాపము సమానముగ తగులుకొనును

శ్యేన ఉవాచ—

54 ధర్మం యో బాధతే ధర్మో న స ధర్మః కుధర్మ తత్
అవిరోధాత్ తు యో ధర్మః స ధర్మః సత్య విక్రమ

(పక్షి రాజగు డేగ ఉశీనరరాజుతో ఇట్లు చెప్పెను—)

సత్యనిష్ఠుడవగు రాజా! ఏ ధర్మము మఱియొక ధర్మమునకు
బాధకమగునో అది ధర్మము కాదు కుధర్మము మఱియొక ధర్మము
నకు విరోధము కాని ధర్మమే వాస్తవమైన ధర్మము

55 విరోధిషు మహీపాల నిశ్చిత్య గురులాఘవమ్
న బాధా విద్యతే యత్ర తం ధర్మం సముపాచరేత్

పరస్పర విరుద్ధములుగ తోచు ధర్మములందు గౌరవ లాఘవము
లను విచారించి, దేనియందు ఇతరులకు బాధ కలుగదో ఆ ధర్మమును
ఆచరించవలెను

56 గురులాఘవ మాదాయ ధర్మాధర్మ వినిశ్చయే
యతో భూయాంస్తతో రాజన్ కురుష్వ ధర్మనిశ్చయమ్

ధర్మ అధర్మములను నిర్ణయము చేయునపుడు పుణ్యపాపముల యొక్క గౌరవలాఘవములను దృష్టియందుంచుకొని విచారణ చేయుడు దేనియందు ఎక్కువ పుణ్యము కలదో అదియే ఆచరించ యోగ్యమగు ధర్మమని నిర్ణయించుము

ఎట్లు ఉశీనరుడు తన శరీరమందలి కొంత మాంసమును డేగకిచ్చి దాని ఆకలి తీర్చి పావురమును రక్షించెను రాజు యొక్క ఉదారత్వమును పరోపకార బుద్ధిని చూచి ఇంద్రాగ్నులు చాల సంతోషించి నీ కీర్తి శాశ్వతముగ లోకములో నిలుచును అని చెప్పి వెడలిపోయిరి ఉశీనరుడు తన ధర్మముచే భూమండలమును, ఆకాశమును వ్యాపించి దేదీప్యమానమగు శరీరమును ధరించి స్వర్గలోకము పోయెను

ఈ విధముగ లోమశుడు ధర్మరాజునకు అష్టావక్రముని యొక్క చరిత్రను చెప్పెను బాల్యకాలమునందు అష్టావక్రుడు జనకుని భవనమునకు వెళ్ళగా అచట ద్వారపాలకుడు బాలకునకు ప్రవేశము లేదు వృద్ధులకే అని చెప్పగా అపుడు అష్టావక్రుడు మేము వేదవిజ్ఞానము, ఇంద్రియ నిగ్రహము మొదలైనవి కలవారము కావున (జ్ఞాన) వృద్ధులమే అని పలికి యిట్లు చెప్పెను—

అష్టావక్ర ఉవాచ —

57 న జ్ఞాయతే కాయవృద్ధ్యా వివృద్ధి
ర్యథాష్ఠీలా శాల్మలేః సంప్రవృద్ధా
హ్రస్వోఽల్పకాయః ఫలితో వివృద్ధో
యశ్చాఫలస్తస్య న వృద్ధభావః

(అష్టావక్రుడు ద్వారపాలునితో ఇట్లు చెప్పను—)

కేవలము శరీరము వృద్ధి నొందిన మనుజుడు వృద్ధి నొందినట్లు తలంపబడడు—శాల్మల వృక్షఫలము వలె చిన్న వృక్షమైనను బాగుగ ఫలములు కలిగియుండినచో అది గొప్పదిగ తలంచబడును అంతియే కాని ఫలములు లేని చెట్టు కాదు ఫలములు లేని చెట్టు పెరిగినను పెరగని దానితో సమానము

58 న తేన స్థవిరో భవతి యేనాస్య పలితం శిరః
బాలోఽపి యః ప్రజానాతి తం దేవాః స్థవిరం విదుః

జుట్టు నెరబడినంతమాత్రముచే మనుజుడు పెద్దవాడు కానేరడు వయస్సునందు బాలుడైనను జ్ఞానమందు ఆధిక్యత కలవానిని దేవతలు పెద్దవాడు అందురు

59 న హాయనైర్న పలితైర్న విత్తేన న బన్ధుభిః
ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచానః స నో మహాన్

వయస్సు ఎద్దదియగుట చేతగాని జుట్టు నెరియుట చేతగాని ధనము ఎక్కువగా నుండుట చేతగాని మనుజుడు గొప్పవాడు కానేరడు అర్థముతో కూడ వేదములన్నిటిని అధ్యయనము చేసినవాడును, వక్తయు గొప్పవాడని ఋషులు నియమమేర్పఱచిరి

అప్పుడు జనకమహారాజు అష్టావక్రుని మాటలు విని అతనితో ఇట్లు చెప్పను—

రాజోవాచ—

60 త్రింశకద్వాదశాంశస్య చతుర్వింశతిపర్వణః
యస్త్రిషష్టిశతారస్య వేదార్థం స పరః కవిః

(జనకుడు అష్టావక్రునితో ఇట్లు చెప్పెను—)

ముప్పది అవయవములు, పన్నెండు అంశములు, ఇరువది

నాలుగు పర్వములు మూడువందల అఱువది ఆకులుగల పదార్థమును దాని ప్రయోజనమును తెలిసికొనువాడు గొప్ప జ్ఞాని

అంతట అష్టావక్రుడు జనకునితో ఇట్లు పలి ను

అష్టావక్ర ఉవాచ —

61 చతుర్వింశతిపర్వ త్వాం షణ్ణాభి ద్వాదశప్రది
తత్ త్రిషష్టిశతారం వై చక్రం పాతు సదాగతి

(అష్టావక్రుడు జనకునితో ఇట్లు చెప్పెను—)

దేనియందు పండ్రెండు అమావాస్యలు, పండ్రెండు పూర్ణిమలు అను ఇఱువది నాలుగు ఎర్వములు ఋతువులను ఆఱు నాభులు మాసరూపములగు పండ్రెండు అంశములు, దినరూపములగు మూడు వందల అఱువది ఆకులుకలదో నిరంతరము తిరుగుచుండునో సంవత్సర రూపమగు అట్టి కాలచక్రము రక్షించుగాక!

అటు ఎమ్మట బందీ అను జనకాస్థానపండితునకును అష్టావక్రునకును శాస్త్రార్థమున వాదము సంభవింప అందు అష్టావక్రుడు జయించెను జనకుడు చాల సంతోషించెను. అనంతరము అష్టావక్రుడు సమంగా నదిలో స్నానమాచరించగా అతని అంగములన్నియు చక్కగా ఏర్పడెను ఇక పాండవులు తదుపరి ఉత్తరాభిముఖమునకు యాత్ర సాగించి గంధమాదన పర్వతము పైకి వెడలిరి మఱియు బదరికాశ్రమమందు ప్రవేశించిరి ద్రౌపది యొక్క అభీష్టముననుసరించి భీముడు సౌగన్ధిక కమల పుష్పములను తెచ్చుటకు కదళీవనమునకు పోగా అచట భీమునకు హనుమంతుడు కానుపించెను హనుమంతుడు త్రోవకు అడ్డుగా ఉండుటచే ప్రక్కకు తొలగుమ భీముడడుగగా, తన తోకను ప్రక్కకు తొలగించుమని హనుమంతుడు చెప్పెను కాని భీముడు దానిని కదలించలేకపోయెను అపుడు భీముడు హనుమంతుని అతని వృత్తాంతమును తెలియజేయుమని అడుగ, అంతట

హనుమంతుడు భీమునకు శ్రీరాముని చరిత్రను నాలుగు యుగముల ధర్మములను వినిపించి తన విశాల స్వరూపమును చూపెను

మఱియు హనుమంతుడు భీమున కిట్లు బోధించెను—

హనూమానువాచ—

62 ఆచారసమ్భవో ధర్మో ధర్మే వేదాః ప్రతిష్ఠితాః
వేదైర్యజ్ఞాః సముత్పన్నా యజ్ఞై ర్దేవాః ప్రతిష్ఠితాః

(హనుమంతుడు భీమునితో ఇట్లు చెప్పెను—)

ఆచారము (శుద్ధ ఆచరణ) చే ధర్మము ఉత్పన్నమగుచున్నది ధర్మమందు వేదములు ప్రతిష్ఠింపబడియున్నవి వేదముల నుండి యజ్ఞములు ప్రకటములయ్యెను యజ్ఞములచే దేవతల యొక్క స్థితి సంభవించుచున్నది

63 ద్విజాతీనామృతం ధర్మో హ్యేకశ్చైవైక లక్షణః
యజ్ఞాధ్యయన దానాని త్రయః సాధారణాః స్మృతాః

ద్విజులకు ముఖ్య ధర్మము సత్యము ఇది ధర్మము యొక్క ఒక ప్రధాన లక్షణము యజ్ఞము స్వాధ్యాయము దానము—అను ఈ మూడును ద్విజులకు సామాన్య ధర్మములుగ ఎంచబడినవి

ఇట్లు బోధించి హనుమంతుడు అంతర్ధానమొందెను అనంతరము భీముడు క్రోధవశులను రాక్షసులను ఓడించి ద్రౌపదికొఱకై సౌగంధి పుష్పములను గైకొని వెళ్ళెను ఎదప ద్రౌపదీసహితముగ ధర్మరాజ, నకుల సహదేవులను ఎత్తుకుపోయిన జటాసురుని భీముడు వధించెను పిమ్మట పాండవులు నరనారాయణాశ్రమమునుండి రాజర్షి ఆర్ష్టిషేణుని ఆశ్రమమునకు వెడలగా అచట ఆర్ష్టిషేణుడు ధర్మరాజునకు వానోపదేశము చేసెను గంధమాదన పర్వతమునకు కుబేరుడు వచ్చి ధర్మరాజును కలిసికొనెను అనంతరము అర్జునుడు స్వర్గమునుండి తిరిగివచ్చి

ఆ పర్వతముపై సోదరులను కలిసి నెను పిదప శ్రీకృష్ణుడు వచ్చి ధర్మరాజును ఓదార్చి ధైర్యము చెప్పి వెడలెను అర్జునుడు తన వృత్తాంతమంతయు సోదరుల కెరిగించెను పిదప అర్జునుడు పాతాళమున ప్రవేశించి అచట నివాతకవచలను దానవులతో యుద్ధము చేసి వారిని సంహరించి పౌలోమ కాలకేయులను దానవులను వధించి తదుపరి సోదరులకడకు రాగా అతని విజయ వృత్తాంతము విని ధర్మరాజు హర్షించెను

తరువాత పాండవులు గంధమాదన పర్వతము నుండి బయలుదేరి బదరికాశ్రమముగుండా ద్వైతవనమందు ప్రవేశించిరి అప్పుడు అజగర రూపమున నున్న నహుషుడు భీముని పట్టుకొనెను ధర్మరాజు సర్ప రూపముననున్న నహుషుని కడకేగగా అతడు ధర్మరాజును ఇట్లు ప్రశ్నించెను—

సర్ప ఉవాచ—

64 బ్రాహ్మణః కో భవేద్ రాజన్ వేద్యం కిం చ యుధిష్ఠిర
బ్రవీహ్యతిమతిం త్వాం హి వాక్యైరనుమిమీమహే

(సర్పము (నహుషుడు) ధర్మరాజును ఇట్లడిగెను—)

బ్రాహ్మణుడెవడు? అతడు తెలిసికొనదగిన తత్త్వమేది? మీ మాటలు వినుటచే మీరు గొప్ప బుద్ధిమంతులని తెలియుచున్నది

అప్పుడు ధర్మరాజ నహుషున కిట్లు ప్రత్యుత్తర మొసంగెను

యుధిష్ఠిర ఉవాచ—

65 సత్యం దానం క్షమా శీలమానృశంస్యం తపో ఘృణా
దృశ్యన్తే యత్ర నాగేన్ద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః

(ధర్మరాజు సర్పముతో ఇట్లు చెప్పెను —)

ఎవనియందు సత్యము దానము క్షమ సౌశీల్యము క్రూరత్వ రాహిత్యము తపస్సు దయ – అను ఈ సద్గుణములుండునో, అతడే బ్రాహ్మణుడని చెప్పబడును

66 వేద్యం సర్ప పరంబ్రహ్మ నిర్దుఃఖమసుఖం చ యత్
యత్ర గత్వా న శోచన్తి భవతః కిం వివక్షితమ్

తెలిసికొనదగిన తత్త్వము పరబ్రహ్మమే అయియున్నది సుఖ దుఃఖములకు పరమైయున్నదియగు దానిని తెలిసికొనినచో మనుజుడు శోకమును దాటివేయగలడు ఇక ఈ విషయమై ఏమి అడుగ దలంచితిరో చెప్పుడు

67 భవానేతాదృశో లోకే వేదవేదాఙ్గ పారగః
బ్రూహి కిం కుర్వతః కర్మ భవేద్ గతిరనుత్తమా

మీరు వేద వేదాంగములను చక్కగ తెలిసినవారు లోకమున మిమ్ములను గూర్చి ఇట్టి ఖ్యాతియే కలదు ఏ కర్మను ఆచరించుటచే మనుజునకు సర్వోత్తమగతి సంప్రాప్తించునో తెలియజేయుడు

అది విని సర్పము (నహుషుడు) ధర్మరాజుతో ఇట్లు చెప్పెను-

సర్ప ఉవాచ—

68 పాత్రే దత్త్వా ప్రియాణ్యుక్త్వా సత్యముక్త్వా చ భారత
అహింసా నిరతః స్వర్గం గచ్ఛేదితి మతిర్మమ

సర్పము ధర్మరాజునకు ఇట్లు చెప్పెను—

మనుష్యుడు సత్పాత్రునకు దానము చేయుట చేతను సత్య, ప్రియ వచనములను పలుకుటవలనను, అహింసా ధర్మమున తత్పరు డగుటచేతను స్వర్గమును (ఉత్తమగతిని) పొందునని ఈ విషయమున నా అభిప్రాయమై యున్నది

(అపుడు ధర్మరాజు నహుషుని ఇట్లడిగెను—)

యుధిష్ఠిర ఉవాచ—

69 కథం స్వర్గే గతిః సర్ప కర్మణాం చ ఫలం ధ్రువమ్
అశరీరస్య దృశ్యేత ప్రబ్రూహి విషయాంశ్చ మే

(ధర్మరాజు సర్పమును ఇట్లడిగెను—)

మనుజునకు స్వర్గప్రాప్తి కర్మలయొక్క ఫలము ఏ ప్రకారము కలుగును ? మఱియు దేహాభిమానము లేనివానికి ఎట్టి గతి లభించును? అను విషయములను తెలియజేయుడు

అంతట నహుషుడు ధర్మరాజున కిట్లు చెప్పెను—

సర్ప ఉవాచ—

70 తిస్రో వై గతయో రాజన్ పరిదృష్టాః స్వకర్మభిః
మానుషం స్వర్గవాసశ్చ తిర్యగ్యోనిశ్చ తత్ త్రిధా

(సర్పము ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

వారి వారి కర్మలననుసరించి జీవులకు ఈ మూడు విధములైన గతులు కలుగుచున్నవి స్వర్గలోక ప్రాప్తి మనుష్య యోనియందు జన్మ పశుపక్ష్యాది యోనులందు (మఱియు నరకములందు) జన్మించుట—

71 తత్ర వై మానుషాల్లోకాద్ దానాదిభిరతన్ద్రితః
అహింసార్థ సమాయుక్తైః కారణైః స్వర్గమశ్నుతే

వీనిలో మనుష్య యోనియందు జన్మించువాడు అలసత్వము ప్రమత్తత వదలి అహింసను పాలించుచు దానాది శుభకర్మలను చేయుచో అతనికి ఈ పుణ్యకర్మల ప్రభావముచే స్వర్గము సంప్రాప్తించును

72 విపరీతైశ్చ రాజేన్ద్ర కారణైర్మానుషో భవేత్
తిర్యగ్యోనిస్తథా తాత విశేషశ్చాత్ర వక్ష్యతే

73 కామక్రోధ సమాయుక్తో హింసాలోభ సమన్వితః
మనుష్యత్వాత్ పరిభ్రష్టస్తిర్యగ్యోనౌ ప్రసూయతే

అట్లుకాక, విపరీతముగ ప్రవర్తించుటచే తిరిగి మనుష్య యోనులందు గాని, పశుపక్ష్యాది యోనులందు గాని జన్మించవలస

యుండును పశుపక్ష్యాది యోనులందు జన్మించుటకు కారణము చెప్పబడుచున్నది కామ క్రోధ లోభ హింసలయందు తత్పరుడై, మానవత్వమునుండి భ్రష్టుడగువాడు తన మనుష్య జన్మను పొందుటకు తగిన యోగ్యతను కూడ పోగొట్టుకొని పశుపక్ష్యాది జన్మలను ఎత్తును

74 తిర్యగ్యోన్యాః పృథగ్భావో మనుష్యార్థే విధీయతే
గవాదిభ్యస్తథాశ్వేభ్యో దేవత్వమపి దృశ్యతే

75 సోఽయమేతా గతీస్తాత జన్తుశ్చరతి కార్యవాన్
నిత్యే మహతి చాత్మానమవ స్థాపయతే ద్విజః

76 జాతో జాతశ్చ బలవద్ భుక్తే జీవ చాత్మా స దేహవాన్
ఫలార్థస్తాత నిష్ప్రక్తః ప్రజాపాలన భావనః

ప్రయోజనమున జీవుడు ఈ మూడు జన్మలందును తిరుగాడు చుండును కర్మఫలమును కోరు దేహాభిమానియైన జీవుడు పరవశత్వముచే మాటి మాటికి జన్మ ఎత్తుచు సుఖదుఃఖముల ననుభవించు చుండును కాని ఎవనికి కర్మఫలమందు ఆసక్తి లేదో, అతడు జనుల క్షేమమునందు అభిప్రాయము కలవాడై తన ఆత్మను నిత్యము పరబ్రహ్మమందు, పరమాత్మయందు స్థాపించుచుండును

77 సత్యం దమస్తపో దానమహింసా ధర్మనిత్యతా
సాధకాని సదా పుంసాం న జాతిర్న కులం నృప

సత్యము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు దానము, అహింస, ధర్మపరాయణత్వము - అను ఈ సద్గుణములే సదా మనుష్యులకు సిద్ధిని కలుగజేయునవై యున్నవి అంతియే కాని జాతి, కులములు కావు

ధర్మరాజుయొక్క సాన్నిధ్యముచే నహుషునకు శాపవిమోచనము సిద్ధింప, అతనికి సర్పాకృతి పోయి దివ్య శరీరము లభింపగా

విమానముపై యతడు తిరిగి స్వర్గలోకమున కరిగెను భీముడు సర్పము బారినుండి విముక్తుడయ్యెను అంతట పాండవులు ద్వైతవనమునుండి తిరిగి కామ్యకవనమందు ప్రవేశించిరి అచట పాండవుల యొద్దకు శ్రీకృష్ణుడు సత్యభామ మార్కండేయుడు నారదుడు వచ్చిరి అపుడు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇటు చెప్పెను—

శ్రీకృష్ణ ఉవాచ—

78 ధర్మః పరః పాణ్డవ రాజ్యలాభాత్
తస్యార్థ మాహు స్తప ఎవరాజన్
సత్యార్జవాభ్యాం చరతా స్వధర్మం
జితస్త్వ యాయం చ పరశ్చ లకః

(శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

ఓ పాండునందనా! రాజ్య లాభముకంటె ధర్మము గొప్పది ధర్మముయొక్క వృద్ధికొఱకై తపస్సు ప్రధాన సాధనముగా చెప్పబడినది మీరు సత్యము, సరళత్వము మొదలగు సద్గుణములతో బాటు స్వధర్మమును పాలించుచున్నారు కాబట్టి మీరు ఇహ లోకమును, పరలోకమును కూడ జయించినారు

అనంతరము మార్కండేయుడు ధర్మరాజున కిట్లు బోధించెను—

మార్కణ్డేయ ఉవాచ—

79 అశుభైః కర్మభిః పాపా స్తిర్యక్ నిరయగామినః
సంసారేషు విచిత్రేషు పచ్యమానాః పునః పునః

(మార్కండేయుడు ధర్మరాజున కిట్లు బోధించెను—)

పాపాచరణ కలవారు తమ అశుభ కర్మలయొక్క ఫల స్వరూపముగ పశుపక్ష్యాది జన్మల నెత్తుచు నరకమందు డుచు నుందురు విచిత్రములగు సంసారిక యోనులందు జన్మించుచు వారు దుఃఖములచే సంతప్తులగుచుందురు,

80 మనుష్యా స్తత్ర తపసః సర్వాగమపరాయణాః
స్థిరవ్రతాం సత్యపరా గురుశుశ్రూషణే రతాః

81 సుశీలాః శుక్లజాతీయాః క్షాన్తా దాన్తాః సుతేజసః
శుచియోన్యన్తరగతాః ప్రాయశః శుభలక్షణాః

జ్ఞానులగువారు తపస్వులై, సమస్త శాస్త్రములయొక్క అధ్యయనమందు తత్పరులై స్థిరముగ వ్రతములను పాలించుచు, సత్యానారాయణులై, గురుసేవా తత్పరులై, సుశీల సంపన్నులై, సాత్త్వికగుణము కలవారై క్షమాశీలురై, జితేంద్రియులై మహా తేజస్సంపన్నులై యుందురు వారు శుద్ధయోనులందు జన్మించుచు శుభలక్షణములచే సుశోభితులై యుందురు

82 కారణం వః ప్రవక్ష్యామి హేతుయోగసమాసతః
(మృత్యుః ప్రభవనే యేన నాస్మాకం నృపసత్తమాః
శుద్ధాచారా అనలసాః సంధ్యోపాసన తత్పరాః
శుద్ధాన్నాః శుద్ధసుదనా బ్రహ్మచర్య వ్రతాన్వితాః)
సత్యమేవాభిజానీమో నానృతే కుర్మహే మనః
స్వధర్మ మనుతిష్ఠామస్తస్మా న్మృత్యుభయం న నః

మాపై మృత్యువు యొక్క ప్రభావము ఏల పడదో వచించుచున్నాను వినుడు మేము శుద్ధ ఆచార విచారములతో కూడి యున్నాము అలసత్వము లేక యున్నాము ప్రతిదినము సంధ్యోపాసనాపరాయణులమై యున్నాము శుద్ధమగు అన్నమును భుజించుచున్నాము శుద్ధరీతిగ న్యాయపూర్వకముగ ధనాదుల నార్జించుచున్నాము సదా బ్రహ్మచర్య వ్రతపాలనమందు నిమగ్నులమై యున్నాము మేము సత్యమునే తెలిసికొనుచున్నాము అసత్యమందెన్నడును మా మనస్సును పోనీయము మఱియు సదా స్వకీయ ధర్మమును పాలించుచున్నాము కావున మాకు మృత్యువు వలన భయము లేదు.

తత్సందర్భమున మార్కండేయుడు తార్క్ష్యముని యొక్క ప్రశ్నను పురస్కరించుకొని సరస్వతీదేవి ఇట్లు చెప్పెను—

సరస్వత్యువాచ—

83 తం వై పరం వేదవిదః ప్రపన్నాః
పరం పరేభ్యః ప్రథితం పురాణమ్
స్వాధ్యాయవన్తో వ్రతపుణ్యయోగై
స్తపోధనా వీతశోకా విముక్తాః

(సరస్వతీదేవి తార్క్ష్యబుుషితో ఇట్లు చెప్పెను—)

స్వాధ్యాయమను యోగమున సంలగ్నులును, తపస్సునే ధనముగ నెంచువారును అగు యోగులు వ్రతములు పుణ్యము, యోగము—వీని సాధనములచే ఏ ప్రఖ్యాత, పురాతన పరాత్పర పదమును పొంది శోకరహితులును ముక్తులును అగుచున్నారో, అదియే సనాతనబ్రహ్మపదమైయున్నది వేద వేతలు ఆ పరమపదము యొక్క యే ఆశ్రయమును పొందుచున్నారు

ఎదప మార్కండేయుడు ధర్మరాజతో వైవస్వతమను చరిత్రము, మత్స్యావతార కథ చెప్పెను ఎమ్మట ప్రళయకాల దృశ్యమును గూర్చియు, తాను బాలముకుందుని దర్శించుటను గూర్చియు చెప్పెను భగవంతుడు బాలముకుందుడు మార్కండేయునితో ఇట్లు పలికెను—

దేవ ఉవాచ

84 అపాం నారా ఇతి పురాసంజ్ఞాకర్మ కృతం మయా
తేన నారాయణోఽప్యుక్తో మమ తత్ త్వయనం సదా

(భగవంతుడగు బాలముకుందుడు మార్కండేయునితో ఇట్లు చెప్పెను—)

పూర్వము నేను జలమునకు నారా అని పేరు పెట్టితిని ఆ జలము సదా నా అయనము (నివాసస్థానము) కావున నేను నారాయణ అను పేరుతో ప్రసిద్ధి కెక్కితిని

85 అహం నారాయణో నామ ప్రభవః శాశ్వతోఽవ్యయః
విధాతా సర్వభూతానాం సంహర్తా చ ద్విజోత్తమ

ఆ నారాయణుడను నేనే సమస్తము యొక్క ఉత్పత్తికి కారణ భూతుడను సనాతనుడను, నాశరహితుడను అయియున్నాను ద్విజోత్తమా! సమస్త ప్రాణుల యొక్క సృష్టి సంహారములను కావించువాడను నేనే నేనే విష్ణువును నేనే బ్రహ్మదేవుడను, నేనే దేవరాజగు ఇంద్రుడను, నేనే కుబేరుడను యముడను

86 అహం శివశ్చ సోమశ్చ కశ్యపోఽథ ప్రజాపతిః
అహం ధాతా విధాతా చ యజ్ఞశ్చాహం ద్విజోత్తమ

నేనే శివుడను, చంద్రుడను, ప్రజాపతి కశ్యపుడను, ధాతను విధాతను, యజ్ఞమును అయియున్నాను

87 అగ్నిరాస్యం క్షితి పాదౌ చన్ద్రాదిత్యౌ చ లోచనే
ద్యౌర్మూర్ధా ఖం దిశః శ్రోత్రే తథాఽఽపః స్వేదసమ్భవాః

88 సదిశం చ నభః కాయో వాయుర్మనసి మే స్థితః
మయా క్రతుశతైరిష్టం బహుభిః స్వాప్తదక్షిణైః

అగ్ని నా ముఖము భూమి నా పాదములు చంద్రుడు సూర్యుడు నా నేత్రములు, ద్యులోకము నా శిరస్సు ఆకాశము, దిక్కులు నా చెవులు జలము నా శరీరము యొక్క చెమటచే ప్రకటమైనది దిక్కులతో కూడిన ఆకాశము నా యొక్క శరీరము వాయువు నా మనస్సునందున్నది నేను భూరి దక్షిణలతో గూడిన అనేక వందల కొలది యజ్ఞములను చేసితిని

89 సమ్యగ్ వేదమధీయానా యజన్తే వివిధైర్మఖైః
శాన్తాత్మానో జితక్రోధాః ప్రాప్నువన్తి ద్విజాతయః

ఏ ద్విజులు వేదములను చక్కగ అధ్యయనము చేసి శాంత చిత్తులై, క్రోధరహితులై వివిధ యజ్ఞముల ద్వారా, నన్నారాధించుదురో వారు నన్ను పొందుదురు

90 ప్రాప్తుం న శక్యో యో విద్వాన్ నరైర్దుష్కృత కర్మభిః
లోభాభిభూతైః కృపణైరనార్యైరకృతాత్మభిః

91 తం మాం మహాఫలం విద్ధి నరాణాం భావితాత్మనామ్
సదుష్ప్రాపం విమూఢానాం మార్గం యోగైర్నిషేవితమ్

ఓ విద్వాంసుడా! పాపకర్మలను చేయువారు లోభులు, కృపణులు అనార్యులు అజితాత్ములు అగు మనుజులు దేనిని ఎన్నడును పొందలేరో అట్టి మహాఫలమే నేనని యెఱుఁగుము శుద్ధాంతఃకరణులగువారై మానవులచే సులభముగ పొందదగిన యోగ సేవిత మార్గమును నేనే మూఢులకు నేనే సర్వథా దుర్లభుడను

92 యదా యదా చ ధర్మస్య గ్లానిర్భవతి సత్తమ
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్

మహర్షి! ఎపుడెపుడు ధర్మమునకు హాని, అధర్మమునకు ఉత్థానము కలుగునో అపుడపుడు నేనే స్వయముగ ప్రకటమగుదును (అవతారము నెత్తుదును)

అనంతరము మార్కండేయుడు శిబిచక్రవర్తిని గూర్చి తెలుపుచు పాండవులతో ఇట్లు చెప్పెను—

శిబిరువాచ

93 నైవాహమేతద్ యశసే దదాని
న చార్థ హేతోర్న చ భోగతృష్ణయా
పాపైరనాసేవిత ఏష మార్గ
ఇత్యేవమేతత్ సకలం కరోమి

(శిబి చక్రవర్తి మంత్రులతో ఇట్లు చెప్పెను—)

నేను కీర్తి కొఱకు ఈ దాన మిచ్చుటలేదు ధనము కొఱకు గాని భోగకాంక్ష చేతగాని ఈ దానము చేయలేదు ఇది ధర్మాత్ముల యొక్క మార్గము పాపులు ఈ మార్గముపై పోలేరు ఈ ప్రకారముగ తలంచియే నేను సమస్తము చేయుచున్నాను

ఎమ్మట మార్కండేయుడు కలియుగమును గూర్చియు, కల్కి అవతారమును గూర్చియు చెప్పెను మఱియు ఇంద్రద్యుమ్న రాజును గూర్చియు ఇతర చిరంజీవులను గూర్చియు కూడ తెలియజేయుచు ఇట్లు చెప్పెను—

భవన్తి చాత్ర శ్లోకాః

94 దివం స్పృశతి భూమిం చ
శబ్దః పుణ్యస్య కర్మణః
యావత్ స శబ్దో భవతి
తావత్ పురుష ఉచ్యతే

(మార్కండేయుడు ఋషులకు పాండవులకు ఇట్లు చెప్పెను—)

చిరంజీవిత విషయమున పెద్దలిట్లు చెప్పెదురు—మనుష్యుని పుణ్యకర్మను గూర్చిన శబ్దము ఎంతకాలము భూలోకమును దేవ లోకమును స్పృశించునో అంత వఱకు ఆ రెండు లోకములందును అతని కీర్తి ప్రతిష్ఠితమై యుండును అంత వఱకును అతడు స్వర్గలోక నివాసియని చెప్పబడును

95 అకీర్తిః కీర్త్యతే లోకే
యస్య భూతస్య కస్యచిత్
స పతత్యధమాఁల్లోకాన్
యావచ్ఛబ్దః ప్రకీర్త్యతే

ప్రపంచమున ఏ ప్రాణియొక్కయైనను అపకీర్తి చెప్పబడు చున్నచో అతని అపయశస్సుయొక్క శబ్దము ప్రతిధ్వనించునంత వఱకు అతడు అధమలోకములందు పడుచుండును

96 తస్మాత్ కల్యాణవృత్తిః స్యా-
దనన్తాయ నరః సదా
విహాయ చిత్తం పాపిష్ఠం
ధర్మమేవ సమాశ్రయేత్

కాబట్టి మనుజుడు సదా మంగళప్రదములగు శుభకర్మములందే నిమగ్నుడు కావలెను దీనిచే అనంత ఫలము కలుగును పాపపూర్ణమగు చిత్తమును పరిత్యజించి సదా ధర్మకార్యమునే ఆశ్రయించవలెను

97 తస్మాత్ త్వం సర్వదానాని హిత్వాన్నం సంప్రయచ్ఛహ
న హీదృశం పుణ్యఫలం విచిత్రమిహ విద్యతే

ధర్మరాజా! నీవు తక్కిన దానము లన్నింటికంటె మిన్నగ అన్నదానము చేయుచుండుము ఈ ప్రపంచమున అన్నదానముతో సమానమైన విచిత్రమైన పుణ్యదాయకమైన వేరొక దానము లేదు

98 యేషాం తటాకాని మహోదకాని
వాప్యశ్చ కూపాశ్చ ప్రతిశ్రయాశ్చ
అన్నప్రదానం మధురా చ వాణీ
యమస్య తే నిర్వచనా భవన్తి

అగాధ జలముతో నిండిన చెఱువులు, జలాశయములు త్రవ్వించువారు దిగుడు బావులు ధర్మశాలలు నిర్మింపజేయువారును, అన్నదానము చేయువారును మధుర వాక్యములను పలుకువారును అగువారికి యమదండన వాక్యమును వినవలసిన పని యుండదు (వారికి యముడు వచన మాత్రముచే నైనను దండన చేయజాలడు)

99 వాక్శౌచం కర్మశౌచం చ యచ్చ శౌచం జలాత్మకమ్
త్రిభిః శౌచైరుపేతో యః స స్వర్గీ నాత్ర సంశయః

శౌచము మూడు విధములుగ నుండును— (1) వాక్శౌచము (2) కర్మశౌచము (3) జలశౌచము అని ఈ మూడు

శౌచములు అవలంభించువాడు స్వర్గలోకమునకు నిక్కముగ అధికారి యగును

100 సాయం ప్రాతశ్చ సంధ్యాం యో బ్రాహ్మణోఽభ్యుపసేవతే
ప్రజపఞ్ పావనీం దేవీం గాయత్రీం వేదమాతరమ్

101 స తయా పావితో దేవ్యా బ్రాహ్మణో నష్టకిల్బిషః
న సీదేత్ ప్రతిగృహ్ణానో మహీమపి ససాగరామ్

ఎవడు ప్రాతఃకాలమున, సాయం సమయమందు సంధ్య నాచరించి సర్వులను పవిత్ర మొనర్చునట్టి వేదమాతయగు గాయత్రీదేవి యొక్క మంత్రమును జపించునో అతడు ఆ గాయత్రీదేవియొక్క కృపచే పరమపవిత్రుడు పాపరహితుడు అగును అతడు సముద్ర పర్యంతము గల భూమినంతను దానముగ గ్రహించినను ఏ విధమైన సంకటమున పడకుండును

102 వేదాఢ్యా వృత్తసమ్పన్నా జ్ఞానవన్తస్తపస్వినః
యత్ర తిష్ఠన్తి వై విప్రాస్తన్నామ నగరం నృప

వేదజ్ఞులును సదాచారులును, జ్ఞానులును, తపస్వులును ఎచట నివసించుదురో అదియే నగరము అనబడును

103 పుణ్యతీర్థాభిషేకం చ పవిత్రాణాం చ కీర్తనమ్
సద్భిః సమ్భాషణం చైవ ప్రశస్తం కీర్త్యతే బుధైః

పుణ్యతీర్థములందు స్నానము, పవిత్ర మంత్రముల జపము, ఉత్తములగువారితో సంభాషణము – అను వీనియన్నిటిని పెద్దలు ఉత్తమములని చెప్పిరి

104 యే పాపాని న కుర్వన్తి మనోవాక్కర్మ బుద్ధిభిః
తే తపన్తి మహాత్మానో న శరీరస్య శోషణమ్

మనస్సు వాక్కు బుద్ధి - వీని ద్వారా ఎవరు పాపము చేయకుందురో అట్టివారే మహాత్ములగు తపస్వులు అంతియేకాని శరీరమును శుష్కింపచేయ వాడు తపస్వి కాడు

105 జ్ఞానేన కర్మణా వాఽ జరామరణమేవ చ
వ్యాధయశ్చ ప్రహాయన్తే ప్రాప్యతే చోత్తమం పదమ్

జ్ఞానముచేతను సత్కర్మచేతను వార్ధక్యము మరణము, రోగములు నశించును మఱియు ఉత్తమ పదము (ముక్తి) సంప్రాప్తించును

106 బీజాని వ్యాగ్నిదగ్ధాని న రోహన్తి పునర్యథా
జ్ఞానదగ్ధై స్తథా క్లేశైర్నాత్మా సంయుజ్యతే పునః

వేయించబడిన విత్తనములు తిరిగి మొలవనట్లు జ్ఞానము ద్వారా అవిద్యాది క్లేశములు నశించుటచే ఆత్మకు వానితో తిరిగి సంయోగము కలుగదు

107 ఆత్మానం విన్దతే యేన సర్వభూత గుహాశయమ్
శ్లోకేన యది వార్ధేన క్షీణం తస్య ప్రయోజనమ్

ఒక శ్లోకముచే గాని, లేక అర్ధ శ్లోకముచే గాని సమస్త ప్రాణి కోట్లయొక్క హృదయ ప్రదేశమందు శయనించు పరమాత్మయొక్క జ్ఞానము కలుగుచో, అతనికి సమస్త శాస్త్రముల అధ్యయనముయొక్క ప్రయోజనము సమాప్తమగును

108 ద్వ్యక్షరాదభిసందాయ కేచిచ్ఛ్లోక పదాఙ్కితైః
శతైరన్యైః సహస్రైశ్చ ప్రత్యయో మోక్షలక్షణమ్

కొందఱు తత్త్వమ్ రామ కృష్ణ విష్ణు, శివ మున్నగు రెండక్షరములతోనే పరమాత్మ తత్త్వముయొక్క జ్ఞానమును పొందుచున్నారు మఱికొందఱు శ్లోక, పదములతో కూడిన ఇతర వందల

కొలది, వేలకొలది శాస్త్ర వాక్యములచే పరమాత్మయొక్క స్వరూప మును తెలిసికొనుచున్నారు ఎటయినను బోధయే మోక్షముయొక్క లక్షణమై యున్నది

109 ఇన్ద్రియాణాం ప్రసాదేన తదేతత్ పరివర్జయేత్
తస్మాదనశనం దివ్యం నిరుద్ధేన్ద్రియ గోచరమ్

మనుజుడు ఇంద్రియముల శుద్ధి ద్వారా విషయ భోగములను త్యజించవలెను ఇంద్రియములయొక్క నిర్మలత్వ నిగ్రహములచే ఏర్పడు విషయ అగ్రహణము దివ్యమైనది

110 తపసా స్వర్గగమనం భోగో దానేన జాయతే
జ్ఞానేన మోక్షో విజ్ఞేయస్తీర్థ స్నానానఘక్షయః

తపస్సుచే స్వర్గమున కేగు సౌభాగ్యము కలుగును దానముచే భోగములు సంప్రాప్తించును జ్ఞానముచే మోక్షము కలుగును తీర్థ స్నానములచే పాపము నశించును — అని తెలియవలెను

111 అగ్నేరపత్యం ప్రథమం సువర్ణం
భూర్వైష్ణవీ సూర్యసుతాశ్చ గావః
లోకాస్త్రయస్తేన భవన్తి దత్తా
యః కాఞ్చనం గాశ్చమహీం చ దద్యాత్

సువర్ణము అగ్నియొక్క ప్రథమ సంతానము భూమి భగవంతుడగు విష్ణువుయొక్క పత్ని గోవులు సూర్యభగవానుని కన్యలు కావున ఈ మూడిటిని దానము చేయువానిచే మూడు లోకములయొక్క దానము సంభవించుచున్నది

అనంతరము మార్కండేయుడు ధర్మరాజునకు ఉత్తంకుని యొక్కయు, ఇక్ష్వాకు వంశరాజగు కువలయాశ్వుని (దుంధుమారుని)

యొక్కయు చరిత్రలను చెప్పెను. ఎదప ధర్మరాజ మార్కండేయునితో ఇట్లు పలికెను—

యుధిష్ఠిర ఉవాచ—

112 ప్రత్యక్షమిహ విప్రర్షే దేవా దృశ్యన్తి సత్తమ
సూర్యాచన్ద్రమసౌ వాయుః పృథివీ వహ్నిరేవ చ

113 పితా మాతా చ జగదన్ గురురేవ చ సత్తమ
యచ్చాన్యద్ దేవవిహితం తచ్చాపి భృగునన్దన

(ధర్మరాజు మార్కండేయునితో ఇట్లు చెప్పెను—)

బ్రహ్మర్షీ! ఈ ప్రపంచమున సూర్యుడు చంద్రుడు వాయువు భూమి అగ్ని తండ్రి, తల్లి గురువు - అను ప్రత్యక్ష దేవతలు కనుపించుచున్నారు వీరు కాక ఇతర దేవతల రూపమున దేవ విగ్రహములు కలవు వీరున్ను ప్రత్యక్ష దేవతలలో చేరినవారే (కావున ఆదరింపదగినవారు)

అనంతరము మార్కండేయుడు ధర్మరాజునకు కౌశిక బ్రాహ్మణుని గూర్చిన చరిత్రను చెప్పెను కౌశికుడను బ్రాహ్మణుడు ఒక చెట్టుక్రింద కూర్చొని వేదపఠనము గావించుచుండెను అత్తతి చెట్టుపైన ఉన్న ఒక పక్షి అతనిపై రెట్టవేసెను అపుడతడు కోపముతో ఆ పక్షివంక చూడగా అది క్రిందపడి మరణించెను దానిని చూచి అతడు పశ్చాత్తాపపడెను ఎమ్మట ఆ బ్రాహ్మణుడు భిక్షకై సమీప గ్రామమునకు పోయి ఒక యింటియొద్ద నిలబడి భిక్షపెట్టుడు అని అడుగగా ఇంటిలోనుండి ఒక స్త్రీ కొద్దిసేపు ఆగుడు భిక్షపెట్టెదను అని పలికెను ఆమె పతివ్రతయగు సాధ్వి భర్తకు భోజనము పెట్టి ఆ ఎదప భిక్ష తీసికొని బయటకు రాగా, ఆ బ్రాహ్మణుడు ఆలస్యము జరిగినందులకు కోపపడెను అపుడా పతివ్రత కౌశిక బ్రాహ్మణునితో ఇట్లు చెప్పెను— మహాశయా! నేను మీ కోప దృష్టిచే క్రిందపడి

దగ్ధమైపోయిన పక్షివంటిదానను కాను నేను పతిసేవ చేయుచుంటిని అందుచే ఒకింత ఆలస్యమైనది క్షమించుడు

స్త్ర్యువాచ—

114 బలాకా వా త్వయా దగ్ధా రోషాత్ తద్ విదితం మయా
క్రోధః శత్రుః శరీరస్థో మనుష్యాణాం ద్విజోత్తమ

(పతివ్రత కౌశికుడను ఆ మునితో ఇట్లు చెప్పెను—)

మీరు కోపముతో ఒక పక్షిని దగ్ధమొనర్చిన విషయము నాకు తెలియును మనుజులకు ఒక గొప్ప శత్రువు కలడు అతడు వారి శరీరములందే నివసించుచున్నాడు అతని పేరు క్రోధము

115 యః క్రోధమోహౌ త్యజతి తం దేవా బ్రాహ్మణం విదుః
యో వదేదిహ సత్యాని గురుం సంతోషయేత చ
హింసితశ్చ న హింసేత తం దేవా బ్రాహ్మణం విదుః

క్రోధమును మోహమును త్యజించువానిని దేవతలు బ్రాహ్మణుడు అని నమ్మెదరు సత్యమును పలుకువాడు గురువును సంతుష్టపఱచువాడు, ఒకడు కొట్టినను తిరిగి కొట్టనివాడు, అగువానిని దేవతలు బ్రాహ్మణుడు అని విశ్వసించుదురు

116 యస్య చాత్మసమో లోకో ధర్మజ్ఞస్య మనస్వినః
సర్వధర్మేషు చ రతస్తం దేవా బ్రాహ్మణం విదుః

ధర్మజ్ఞుడును మనస్వియునగు ఎవనికి ఈ సమస్త ప్రపంచము యెడల ఆత్మభావము కలదో అన్ని ధర్మముల యెడల సమానముగ అనురాగము కలదో, అట్టివానిని దేవతలు బ్రాహ్మణుడు అని నమ్మెదరు

117 ధర్మం తు బ్రాహ్మణస్యాహుః స్వాధ్యాయం దమమార్జవమ్
ఇన్ద్రియాణాం నిగ్రహం చ శాశ్వతం ద్విజసత్తమ

స్వాధ్యాయము మనోనిగ్రహము సరళత్వము ఇంద్రియ నిగ్రహము - అనునవి బ్రాహ్మణునకు సనాతన ధర్మములుగ చెప్పబడినవి

118 సత్యార్జవే ధర్మమాహుః పరం ధర్మవిదో జనాః
దుర్జ్ఞేయం శాశ్వతో ధర్మః స చ సత్యే ప్రతిష్ఠితః
శ్రుతిప్రమాణో ధర్మః స్యాదితి వృద్ధానుశాసనమ్

ధర్మజ్ఞులు సత్యమును, సరళత్వమును సర్వోత్తమ ధర్మములుగ పేర్కొనుచున్నారు సనాతన ధర్మముయొక్క స్వరూపమును తెలిసికొనుట చాల కఠినమైనది కాని అది సత్యముపై ప్రతిష్ఠితమై యున్నది వేదముల ద్వారా ప్రమాణితమైనది ఏది కలదో అదియే ధర్మమని పెద్దల ఉపదేశమై యున్నది

మిథిలా పట్టణమున ఒక వ్యాధుడు (ధర్మవ్యాధుడు) కలడు అతడు గొప్ప సుగుణసంపన్నుడు మీరతని యొద్దకు వెళ్ళినచో మీకు ధర్మము ఉపదేశింపగలడు - అని ఈ ప్రకారముగ ఆ ప్రతివతా స్త్రీ పలుకగా కౌశికుడు కృద్ధుడైనందులకు తన్ను తాను నిందించుకొనుచు మిథిలా పట్టణమునకు పోయి ధర్మవ్యాధుని కలసికొనగా అతడు కౌశికునకు ఈ ప్రకారముగ బోధించెను—

వ్యాధ ఉవాచ—

119 విధాత్రా విహితం పూర్వం కర్మ స్వమనుపాలయన్
ప్రయత్నాచ్చ గురూ వృద్ధౌ శుశ్రూషేఽహం ద్విజోత్తమ

(ధర్మవ్యాధుడు కౌశికుడను బ్రాహ్మణునితో ఇట్లు చెప్పెను-)

బ్రహ్మదేవుడు ఈ జన్మ కలుగజేసి నాకు ఏ కార్యము అప్పగించెనో దానిని పాలించుచు, నా యొక్క వృద్ధ మాతా పితరులకు యత్నపూర్వకముగ సేవచేయుచున్నాను

120 సత్యం వదే నాభ్యసూయే యథాశక్తి దదామిచ
దేవతాతిథి భృత్యానామవశిష్టేన వర్తయే

నేను సత్యమును పలుకుదును ఎవరిని నిందింపను శక్తికొలది దానమున్ను చేయుదును దేవతలకు అతిథులకు పోషించుటకు యోగ్యులైన కుటుంబస్థులకు సేవకులకు భోజనముపెట్టి మిగిలిన దానితో నేను నా శరీర నిర్వాహణమును గావించుకొనుచున్నాను

121 అశీలశ్చాపి పురుషో భూత్వా భవతి శీలవాన్
ప్రాణిహింసారతశ్చాపి భవతే ధార్మికః పునః

శీలములేనివాడున్ను ఎప్పుడైన శీలవంతుడు కాగలడు అట్లే ప్రాణులను హింసించుటయందు అనురక్తుడగువాడున్ను ఎప్పుడైన ధర్మాత్ముడు కాగలడు

122 శక్త్యాన్నదానం సతతం తితిక్షా ధర్మనిత్యతా
యథార్హం ప్రతి పూజా చ సర్వభూతేషు వై సదా
త్యాగాన్నాన్యత్ర మర్త్యానాం గుణాస్తిష్ఠన్తి పూరుషే

తనశక్తి ననుసరించి ఇతరులకు సదా అన్నము పెట్టుట ఇతరుల అపరాధములను శీతోష్ణాది ద్వంద్వములను సహించుకొనుట సదా ధర్మమందు దృఢముగ నెలకొనియుండుట సమస్త ప్రాణులందు పూజనీయులగు వారందఱిని యథా యోగ్యముగ పూజించుట - అను ఈ సద్గుణములు స్వార్థత్యాగము లేనిదే మనుజని యందుండ జాలవు

123 మృషా వాదం పరిహరేత్ కుర్యాత్ ప్రియమయాచితః
న చ కామాన్న సంరమ్భాన్న ద్వేషాద్ ధర్మము త్సృజేత్

అబద్ధము మాట్లాడరాదు చెప్పకయే ఇతరులకు ప్రియము చేయవలెను కామ, క్రోధ, ద్వేషములచే ధర్మము నెన్నడును పరిత్యజింపరాదు

124 ప్రియే నాతిభృశం హృష్యే దప్రియే న చ సంజ్వరేత్
న ముహ్యేదర్థకృచ్ఛ్రేషు న చ ధర్మం పరిత్యజేత్

ప్రియ వస్తువు లభించినపుడు ఆనందముతో పొంగరాదు తన మనస్సునకు విపరీతముగ ఏదైన సంభవించినచో దుఃఖింపరాదు ఏదైన సంకటము కలిగినపుడు మోహావశుడు కాక కంగారు పడక ఉండవలెను ఎట్టి పరిస్థితియందైనను తన ధర్మమును విడనాడరాదు

125 న పాపే ప్రతిపాపః స్యాత్ సాధురేవ సదా భవేత్
ఆత్మనైవ హతః పాపో యః పాపం కర్తుమిచ్ఛతి

ఎవరైన తన యెడల చెడ్డగ ప్రవర్తించినచో అతనికి చెడ్డ చేయరాదు సర్వుల యెడల సదా సద్వ్యవహారమే ఆచరించవలెను ఇతరులకు అహితమొనర్చు పాపి స్వయముగనే నశించిపోవును

126 అబువఞ్ కస్య చిన్నిన్దామాత్మ పూజామ వర్ణయన్
న కశ్చిద్ గుణసమ్పన్నః ప్రకాశో భువి దృశ్యతే

ఎవరిని నిందించరాదు తన్ను తాను ప్రశంసించుకొనరాదు పరనింద ఆత్మప్రశంసలను వదలక యే ఏ గుణవంతుడున్ను ఈ ప్రపంచమున సమ్మానితుడు అగుట చూడబడలేదు

127 పాపాన్య బుద్ వేహ పురా కృతాని
ప్రాగ్ ధర్మశీలో ఽవి హన్తి పశ్చాత్
ధర్మో రాజఞ్ నుదతే పూరుషాణాం
యత్ కుర్వతే పాపమిహ ప్రమాదాత్

ధర్మశీలుడగువాడు ఒక వేళ తెలియక ఏదైన పాపము చేసినచో తదుపరి నిష్కామపుణ్యకర్మ ద్వారా ఆ పాపమును నశింప చేయగలడు మనుజుల ధర్మమే ప్రమాదవశమున అతనిచే చేయబడిన పాపమును నశింప జేయును

128 పాపం కృత్వా హి మన్యేత నాహ మస్మీతి పూరుషః
తం తు దేవాః ప్రపశ్యన్తి స్వస్యైవాన్తర పూరుషః

ఎవడైన పాపము చేసియు నేను పాపిని కాను అని తలంచినచో అది సరికాదు ఏలయనగా దేవతలు అతనిని అతని పాపమును చూచుచున్నారు మఱియు అతని యందున్న పరమాత్మయు చూచుచున్నాడు

129 చికీర్షేదేవ కల్యాణం శ్రద్దధానోఽనసూయకః
వసనస్యేవ ఛిద్రాణి సాధూనాం వివృణోతి యః
(అపశ్యన్నాత్మనో దోషాన్ స పాపః ప్రేత్య నశ్యతి)

శ్రద్ధాళువగువాడు ఇతరుల దోషములను చూచుట వదిలిపెట్టి సదాసర్వుల హితమును గావింపవలెను ఏ పాపి తన దోషముల విషయమున కండ్లు మూసికొని సదా ఇతరులగు శ్రేష్ఠుల దోషములనే కాంచి వానిని పెంచి చెప్పునో అతడు మరణానంతరము వినాశమును పొందును పరలోకమున అతనికి ఏ విధమైన సుఖము కలుగనేరదు

130 పాపానాం విద్ధ్యధిష్ఠానం లోభమేవ ద్విజోత్తమ
లుబ్ధాః పాపం వ్యవస్యన్తి నరా నాతి బహుశ్రుతాః

లోభమే పాపములన్నిటికిని అధిష్ఠానము శాస్త్రములను శ్రవణము చేయని లోభయుక్తులే పాపము చేయదలంచుదురు

131 యజ్ఞో దానం తపో వేదాః సత్యం చ ద్విజసత్తమ
పఞ్చైతాని పవిత్రాణి శిష్టాచారేషు సర్వదా

యజ్ఞము దానము తపస్సు వేదముల స్వాధ్యాయము, సత్యభాషణము,—అను ఈ ఐదు పవిత్ర వస్తువులు శిష్టుల ఆచార వ్యవహారములందు సదా కనుపించును

132 కామక్రోధౌ వశే కృత్వా దమ్భం లోభమనార్జవమ్
ధర్మమిత్యేవ సంతుష్టాస్తే శిష్టాః శిష్ట సమ్మతాః

కామము, క్రోధము లోభము, దంభము, కౌటిల్యము — వీనిని వశమందుంచుకొని కేవలము ధర్మమునే అవలంబించి సంతుష్టులగు వారు శిష్టులని చెప్పబడుదురు అట్టివారినే శిష్టులు ఆదరించుదురు

133 గురుశుశ్రూషణం సత్యమక్రోధో దానమేవ చ
ఏతచ్చతుష్టయం బ్రహ్మన్ శిష్టాచారేషు నిత్యదా

శిష్టాచరణ కలవారి యందు గురుసేవ సత్యభాషణము క్రోధము లేకుండుట, దానము—అను ఈ నాలుగు సద్గుణములు సదా ఉండి యుండును

134 వేదస్యోపనిషత్ సత్యం సత్యస్యోపనిషద్ దమః
దమస్యోపనిషత్ త్యాగః శిష్టాచారేషు నిత్యదా

వేదము యొక్క సారము సత్యము సత్యము యొక్క సారము ఇంద్రియ నిగ్రహము ఇంద్రియ నిగ్రహము యొక్క సారము త్యాగము ఈ త్యాగము శిష్టుల ఆచరణయందు సదా విద్యమానమై యుండును

135 కామలోభగ్రహాకీర్ణాం పఞ్చేన్ద్రియజలాం నదీమ్
నావం ధృతిమయీం కృత్వా జన్మ దుర్గాణి సంతర

ఈ శరీరము ఒక నది పంచేంద్రియములు దీనియందలి జలము లోభమను మొసళ్ళు దీనియందు నివసించుచున్నవి జనన, మరణములను దుర్గమ ప్రదేశమున ఆ నది ప్రవహించుచున్నది నీవు ధైర్యమను నావపై కూర్చొని దీని దుర్గమస్థానములగు జనన మరణములను దాటివేయుము

136 అహింసా సత్యవచనం సర్వభూతహితం పరమ్
అహింసా పరమో ధర్మః స చ సత్యే ప్రతిష్ఠితః
సత్యే కృత్వా ప్రతిష్ఠాం తు ప్రవర్తన్తే ప్రవృత్తయః

అహింస, సత్యభాషణము—అనునవి సమస్త ప్రాణులకును అత్యంత హితకరను లైయున్నవి అహింస అన్నిటి కంటెను గొప్ప ధర్మము కాని ఆ అహింస సత్యమందే ప్రతిష్ఠితమైయున్నది సత్యము యొక్క ఆధారము మీదనే ఉత్తములగువారి యొక్క సమస్త కార్యములు ప్రారంభమగును

137 ఆరమ్భో న్యాయయుక్తో యః స హి ధర్మ ఇతి స్మృతః
అనాచారస్త్వ ధర్మేతి ఎతచ్ఛిష్టాను శాసనమ్

ఏ కార్యము న్యాయయుక్తమైనదో, అదియే ధర్మమని చెప్ప బడినది దీనికి విరుద్ధముగ ఏ అనాచారము కలదో అది అధర్మము— అని శిష్టుల కథనము

138 అక్రుద్ధ్యన్తోఽనసూయన్తో నిరహంకార మత్సరాః
ఋజవః శమసమ్పన్నాః శిష్టాచారా భవన్తి తే

ఎవరియందు కోపము లేదో, ఎవరు ఇతరుల దోషములను చూడరో, ఎవరియందు అహంకారము, ఈర్ష్య లేవో, ఎవరు సరళత్వము మనో నిగ్రహము కలిగి యున్నారో, అట్టివారు శిష్టాచారులని చెప్పబడుదురు

139 వేదోక్తః పరమో ధర్మో ధర్మశాస్త్రేషు చాపరః
శిష్టాచారశ్చ శిష్టానాం త్రివిధం ధర్మలక్షణమ్

దేనిని గూర్చి వేదములందు వర్ణింపబడినదో, అది ధర్మము యొక్క మొదటి లక్షణము ధర్మశాస్త్రములందు ఏది ప్రతిపాదింప బడినదో అది ధర్మముయొక్క రెండవ లక్షణము శిష్టాచరణము ధర్మము యొక్క మూడవ లక్షణము ఈ ప్రకారముగ శిష్టులు ధర్మముయొక్క మూడు లక్షణములను స్వీకరించిరి

140 సర్వభూత దయావన్తో అహింసానిరతాః సదా
పరుషం చ న భాషన్తే సదా సన్తో ద్విజప్రియాః

సమస్త ప్రాణుల యెడల దయకలిగి యుండువాడును సదా అహింసా ధర్మముయొక్క పాలనయందు తత్పరుడై యుండువాడును ఎవనితోను ఎపుడును కటు వాక్యమును ఎలుకనివాడను అగు మహానీయుడు సదా ద్విజులందఱికిని ప్రియుడుగా నుండును

141 న్యాయోపేతా గుణోపేతాః సర్వలోక హితైషిణః
సన్తః స్వర్గజితః శుక్లాః సంనివిష్టాశ్చ సత్పథే

త్యాగపరాయణులు సద్గుణ సంపన్నులు సర్వులయొక్క హితమును కోరువారు సన్మార్గమున నడచువారు అగు శ్రేష్ఠులు స్వర్గలోకముపై విజయమును పొందుదురు

142 శ్రీణేవ తు సదాన్యాయాః సతాం వ్రతమనుత్తమమ్
న చైవ ద్రుహ్యేద్ దద్యాచ్చ సత్యం చైవ సదా వదేత్

ఉత్తములగువారు మూడు వాక్యములను మాత్రమే చెప్పుచుందురు (1) ఎవనికిని ద్రోహము చేయరాదు (2) దానము చేయవలెను (3) సదా సత్యమునే పలుకవలెను. ఇది శ్రేష్ఠులగువారి ఉత్తమ వ్రతమైయున్నది

143 శిష్టాచారం నిషేవన్తే నిత్యం ధర్మమనువ్రతాః
ప్రజ్ఞాప్రాసాదమారుహ్య ముచ్యన్తే మహతో భయాత్

144 ప్రేక్షన్తే లోకవృత్తాని వివిధాని ద్విజోత్తమ
అతిపుణ్యాని పాపాని తాని ద్విజవరోత్తమ

ఏ ధర్మాత్ములు సదా శిష్టాచారమును సేవించుచుందురో ప్రజ్ఞయను మేడపై నెక్కి వివిధ లోక చరిత్రలను నిరీక్షించుచుందురో మఱియు పుణ్య పాపములను సమీక్షించుచుందురో, అట్టివారు మహా భయము నుండి విముక్తిని పొందుదురు

145 యథా శ్రుతిరియం బ్రహ్మన్ జీవః కిల సనాతనః
శరీరమధ్రువం లోకే సర్వేషాం ప్రాణినామిహ

శ్రుతిననుసరించి ఈ జీవాత్మ నిక్కముగ సనాతనము మఱియు ఈ ప్రపంచమున సమస్త ప్రాణుల యొక్క శరీరములు నశ్వరములై యున్నవి

146 సంస్కృతస్య చ దాన్తస్య నియతస్య యతాత్మనః
ప్రాజ్ఞస్యానన్తరా వృత్తిరిహ లోకే పరత్ర చ

సత్సంస్కార సంపన్నుడును జితేంద్రియుడును, శౌచాచార పరాయణుడున్ను, మనస్సును నిగ్రహమందుంచుకొనువాడున్ను అగు బుద్ధిమంతునకు ఇహలోక పరలోకములందు సుఖమే కలుగును

147 సర్వత్యాగే చ యతతే దృష్ట్వా లోకం క్షయాత్మకమ్
తతో మోక్షే ప్రయతతే నానుపాయాదుపాయతః

వివేకవంతుడు సమస్త జగత్తును నశ్వరముగ తలంచి, సమస్తమును త్యజించుటకు ప్రయత్నించును ఎదప సరియైన ఉపాయముచే మోక్షమునకై చేష్టసల్పును అంతియే కాని అనుపాయమును (ప్రారబ్ధాదులను) తలంచి ఊరక కూర్చొనడు

148 ఏవం నిర్వేదమాదత్తే పాపం కర్మ జహాతి చ
ధార్మికశ్చాపి భవతి మోక్షం చ లభతే పరమ్

ఈ ప్రకారముగ అతడు వైరాగ్యము నవలంభించి పాపకర్మను వదలిపెట్టును తదుపరి పూర్ణముగ ధర్మాత్ముడై వఱగుచు చివఱకు పరమ మోక్షమును బడయును

149 తపో నిఃశ్రేయసం జన్తోస్తస్య మూలం శమో దమః
తేన సర్వానవాప్నోతి కామాన్ యాన్ మనసేచ్ఛతి

జీవుని శ్రేయస్సునకు సాధనము తపస్సు ఆ తపస్సునకు మూలము శమము (అంతరేంద్రియ నిగ్రహము) దమము

(బాహ్యేంద్రియ నిగ్రహము), మనుజుడు మనస్సు ద్వారా ఏయే అభీష్ట పదార్థములను పొందదలంచునో, వాని యన్నింటిని ఈ తపస్సు చేత అతడు పొందగల్గును

150 ఇన్ద్రియాణాం నిరోధేన సత్యేన చ దమేన చ
బ్రహ్మణః పదమాప్నోతి యత్ పరం ద్విజసత్తమ

ఇంద్రియ నిగ్రహము, సత్యభాషణము, మనోనిగ్రహము— అను వీని ద్వారా మనుజుడు బ్రహ్మము యొక్క పరమ పదమును పొందుచున్నాడు

151 అధర్మస్త్రివిధ స్తస్య వర్తతే రాగదోషజః
పాపం చిన్తయతే చైవ బ్రవీతి చ కరోతి చ
తస్యాధర్మ ప్రవృత్తస్య గుణా నశ్యన్తి సాధవః

రాగరూపదోషము వలన మనుజుడు మూడు విధములుగ అధర్మము నాచరించును—(1) అతడు మనస్సుచే పాపమును గూర్చి చింతన చేయును (2) వాక్కుచే పాపమును గూర్చి పలుకును (3) క్రియద్వారా పాపమును ఆచరించును ఈ ప్రకారముగ అధర్మమున తగుల్కొనుటచే అతని మంచి గుణములన్నియు నశించి పోవును

152 ఇదం విశ్వం జగత్ సర్వమజయ్యం చాపి సర్వశః
మహాభూతాత్మకం బ్రహ్మ నాతః పరతరం భవేత్

పంచ మహాభూతములచే ఏర్పడిన ఈ చరాచర జగత్తంతయు సర్వ విధముల అజేయ బహ్మస్వరూపమై యున్నది బ్రహ్మముకంటె ఉత్కృష్టమైన మఱియొక వస్తువు లేనే లేదు

153 లోకే వితతమాత్మానం లోకం చాత్మని పశ్యతి
పరావరజ్ఞో యః శక్తః స తు భూతాని పశ్యతి

జ్ఞాని సమస్త లోకములను తానుగాను తన యందు సమస్త లోకములు ఉన్నట్లుగను కాంచును ఈ ప్రకారముగ నిర్గుణ బ్రహ్మమును తెలిసికొను సమర్థుడగు జ్ఞాని సమస్త భూతములను, ప్రాణులను ఆత్మరూపముగ గాంచును

154 అనాదినిధనం జన్తుమాత్మయోనిం సదావ్యయమ్
అనౌపమ్యమమూర్తం చ భగవానాహ బుద్ధిమాన్

బుద్ధిమంతుడగు బ్రహ్మదేవుడు జీవుని ఆద్యంత రహితమును స్వయంభువును వికారరహితమును అనుపమమును నిరాకారమును అగు బ్రహ్మముగనే చెప్పెను

155 ఎష యోగవిధిః కృత్స్నో యావదిన్ద్రియ ధారణమ్
ఏతన్మూలం హి తపసః కృత్స్నస్య నరకస్య చ

యోగముయొక్క సంపూర్ణ రూపము అనుష్ఠానమే-మనస్సహితముగ ఇంద్రియము లన్నిటిని వశమందుంచుకొనుటయే సమస్త తపస్సుయొక్క మూలమిదియే ఇంద్రియములను వశమందుంచుకొనక పోవుటయే నరకమునకు కారణము

156 ఇన్ద్రియాణాం ప్రసఙ్గేన దోషమార్చ్ఛత్యసంశయమ్
సంనియమ్య తు తాన్యేవ తతః సిద్ధిం సమాప్నుయాత్

ఇంద్రియములయొక్క సంసర్గము వలననే మనుజుడు నిస్సందేహముగ దుర్గుణ, దురాచారాది దోషములను పొందుచున్నాడు ఆ యింద్రియములను బాగుగ వశమందుంచుకొనినచో, అతనికి సర్వదా సిద్ధి కలుగగలదు

157 రథః శరీరం పురుషస్య దృష్ట
మాత్మా నియన్తేన్ద్రియాణ్యాహురశ్వాన్
తైరప్రమత్తః కుశలీ సదశ్వై
ర్దాన్తైః సుఖం యాతి రథీవ ధీరః

ప్రత్యక్షముగ కానుపించు ఈ స్థూల శరీరము ఒక రథము బుద్ధి సారథి ఇంద్రియములు గుఱ్ఱములు కుశలుడును జాగ్రతకలవాడును అగు సారథి గుఱ్ఱములను తన వశమందుంచుకొని సుఖముగ మార్గమును దాటునట్లు సావధానచిత్తుడును సాధన కుశలుడును అగు మనుజుడు ఇంద్రియములను వశమందుంచుకొని సుఖముగ జీవయాత్రను పూర్తి చేయును

158 ఇన్ద్రియాణాం ప్రసృష్టానాం హయానామివ వర్త్మసు
ధృతిం కుర్వీత సారథ్యే ధృత్యా తాని జయేద్ ధ్రువమ్

మార్గముపై పరుగిడు గుఱ్ఱమువలె విషయములందు సంచరించు ఈ ఇంద్రియములను వశమందుంచుకొనుట కొఱకై ధైర్యపూర్వకముగ ప్రయత్నము చేయవలెను అటు ధైర్యముగ ప్రయత్నించు వానికి వానిపై తప్పక విజయము సిద్ధించును

159 ఇన్ద్రియాణాం విచరతాం యన్మనోఽను విధీయతే
తదస్య హరతే బుద్ధిం నావం వాయురివామ్భసి

నీటిపై పోవు నావను వాయువు హరించునట్లు విషయములందు సంచరించు ఇంద్రియములలో దేనివెంట మనస్సు పోవునో ఆ ఒక్క ఇంద్రియమే ఈ అయుక్తునియొక్క బుద్ధిని హరించివేయును

160 శూద్రయోనౌ హి జాతస్య సద్గుణాను పతిష్ఠతః
వైశ్యత్వం లభతే బ్రహ్మన్ క్షత్రియత్వం తథైవ చ

శూద్రుడుగ జన్మించినను మనుజుడు ఉత్తమ గుణములను ఆశ్రయించినచో అతడు వైశ్య క్షత్రియ భావమును పొందగలడు

161 చిత్తస్య హి ప్రసాదేన హన్తి కర్మ శుభాశుభమ్
ప్రసన్నాత్మాఽఽత్మని స్థిత్వా సుఖమానన్త్యమశ్నుతే

మనుజుడు తన చిత్తముయొక్క పవిత్రతవలననే సమస్త శుభాశుభకర్మలను నశింప (ఫలమొసంగుటకు అసమర్థముగ) చేయు

చున్నాడు ఎవని అంతఃకరణము పవిత్రముగ నుండునో అతడు తన (ఆత్మ) యందే తాను స్థితి కలిగియుండి అక్షయ సుఖమును (మోక్షమును) పొందుచున్నాడు

162 లక్షణం తు ప్రసాదస్య యథా తృప్తః సుఖం స్వపేత్
నివాతే వా యథా దీపో దీప్యేత్ కుశలదీపితః

భోజనాదులచే తృప్తుడైన మనుజుడు సుఖముగ నిద్రించు నట్లును, వాయురవాతమగు స్థానమందు చతురుడగువానిచే వెలిగింపబడిన దీపము నిశ్చలముగ ప్రకాశించునట్లును పవిత్రతతో గూడిన చిత్తము కలవాడు ఇట్టి లక్షణములే కలిగియుండును (ఆనందమును బడయును)

163 పూర్వరాత్రే పరే చైవ యుఞ్జానః సతతం మనః
లఘ్వాహారో విశుద్ధాత్మా పశ్యన్నాత్మాన మాత్మని

164 ప్రదీప్తేనేవ దీపేన మనోదీపేన పశ్యతి
దృష్ట్వాఽఽత్మానం నిరాత్మానం స తదా విప్రముచ్యతే

మనుజుడు కేలిక భోజనము గైకొని అంతఃకరణమును శుద్ధముగ నుంచుకొనవలెను రాత్రియొక్క మొదటి చివ భాగములందు తన మనస్సును పరమాత్మయొక్క చింతనమందు నియోగించవలెను ఈ ప్రకారము నిరంతరము ఎవడు తన హృదయమందు పరమాత్మ సాక్షాత్కారము యొక్క అభ్యాసమును కావించునో అతడు ప్రజ్వలిత దీపమువలె ప్రకాశించు తన మనోమయ దీపముద్వారా నిరాకార పరమేశ్వరునియొక్క సాక్షాత్కారము నొంది తత్క్షణమే ముక్తుడగుచున్నాడు

165 నిత్యం క్రోధాత్ తపో రక్షేద్ ధర్మం రక్షేచ్చ మత్సరాత్
విద్యాం మానాపమానాభ్యామాత్మానం తు ప్రమాదతః

నిత్యము తపస్సును కోపమునుండియు, ధర్మమును ద్వేషము నుండియు విద్యను మానావమానములనుండియు, తన్ను సోమరితనము నుండియు రక్షించవలెను

166 ఆనృశంస్యం పరోధర్మః క్షమా చ పరమం బలమ్
ఆత్మజ్ఞానం పరం జ్ఞానం సత్యం వ్రతపరం వ్రతమ్

క్రూరత్వము లేకుండుట అన్నిటికంటె గొప్ప ధర్మము క్షమ అన్నిటికంటె గొప్ప బలము సత్యము అన్నిటికంటె గొప్ప వ్రతము పరమాత్మతత్త్వము యొక్క జ్ఞానమే అన్నిటికంటె ఉత్తమమైన జ్ఞానము

167 న హింస్యాత్ సర్వభూతాని మైత్రాయణ గతశ్చరేత్
నేదం జీవితమాసాద్య వైరం కుర్వీత కేనచిత్

ఏ ప్రాణిని హింసింపరాదు అందరియందు మిత్రభావము కలిగియుండవలెను దుర్లభమగు ఈ మనుష్య జీవితమును పొంది ఎవరి యెడల వైరము కలిగియుండరాదు

168 పరిగ్రహం పరిత్యజ్య భవేద్ బుద్ధ్యా యతవ్రత
అశోకం స్థానమాశ్రిత్య నిశ్చలం ప్రేత్య చేహ చ

ఇహలోక పరలోక ములందలి సమస్త భోగములను త్యజించి, సర్వ విధముల సంగ్రహించుటను వదలి శోకరహిత నిశ్చల పరంధామమును (ఆత్మను) లక్ష్య మొనర్చుకొని, బుద్ధి ద్వారా మనస్సును ఇంద్రియములను సంయమనము చేయవలెను

169 గుణాగుణమనాసఙ్గమేక కార్యమనన్తరమ్
ఏతత్ తద్ బ్రహ్మణో వృత్తమాహురేక పదం సుఖమ్

గుణములందున్నను, గుణరహితమైనదియు, సర్వథా సంగ రహితమైనదియు, ఏక మాత్రమగు అంతరాత్మ ద్వారాయే సాధ్యమును, అవిద్య లేనిదియు ఏది కలదో అదియే బ్రహ్మము

యొక్క నిత్యసిద్ధపదమై యున్నది మఱియు అదియే నిరతిశయ సుఖమున్ను అయియున్నది

ధర్మవ్యాధుని ఆ బోధను విని కౌశికుడు ఆనందపడి అతనితో ఇట్లు చెప్పెను—

బ్రాహ్మణ ఉవాచ—

170 బ్రాహ్మణః పతనీయేషు వర్తమానో వికర్మను
దామ్భికో దుష్కృతః ప్రాయః శూద్రేణ సదృశో భవేత్

(బ్రాహ్మణుడు ధర్మవ్యాధునితో ఇట్లు చెప్పెను —)
ఎవడు బ్రాహ్మణుడై యుండియు పతనమను గోతియందు బడద్రోయు పాపకర్మలందు తగుల్కొనునో దుష్కర్మ పరాయణుడై పాఖండుడై యుండునో అతడు శూద్రునితో సమానుడే యగును

171 యస్తు శూద్రో దమే నిత్యే ధర్మే చ సతతోత్థితః
తం బ్రాహ్మణమహం మన్యే వృత్తేన హి భవేద్ ద్విజః

ఎవడు శూద్రుడైనను శమ, దమ సత్య ధర్మములను పాలించుటకు ఉద్యుక్తుడై యుండునో అతనిని నేను బ్రాహ్మణుడనియే నమ్ముచున్నాను ఏలయనిన, మనుజుడు సదాచారము చేతనే ద్విజుడగుచున్నాడు

తదుపరి ధర్మవ్యాధుడు కౌశికునితో ఇట్లు పలికెను—

వ్యాధ ఉవాచ—

172 శోచతో న భవేత్ కించిత్ కేవలం పరితప్యతే
పరిత్యజన్తి యే దుఃఖం సుఖం వాప్యుభయం నరాః

173 త ఏవ సుఖమేధన్తే జ్ఞానతృప్తా మనీషిణః
అసంతోషపరా మూఢాః సంతోషం యాన్తి పణ్డితాః

(ధర్మవ్యాధుడు బ్రాహ్మణునితో ఇటు చెప్పెను—)

కేవలము శోకించుటచే ఏమియు ప్రయోజనములేదు దాని వలన సంతాపమే కలుగును జ్ఞానతృప్తులగు మనస్సులు సుఖమును, దుఃఖమును రెండింటిని పరిత్యజించి వేయుచున్నారు అట్టివాడే పరమానందమును బొందుచున్నారు మూఢులు అసంతుష్టులగుచున్నారు జ్ఞానులు సంతుష్టిని పొందుచున్నారు

174 భూతేష్వభావం సంచిన్త్య యే తు బుద్ధేః పరం గతాః
న శోచన్తి కృతప్రజ్ఞాః పశ్యన్తః పరమాం గతిమ్

ప్రపంచమందలి పదార్థములన్నియు అనిత్యములు—అని నిశ్చయించి బుద్ధిని దాటి పరబ్రహ్మమును, పరమాత్మను ఎవరు పొందిరో అట్టి జ్ఞానులగు మహాత్ములు పరమాత్మ యొక్క సాక్షాత్కారము నొందుచు శోకమునందెన్నడును పడకుందురు

పిమ్మట కౌశికుడు ధర్మవ్యాధుని యొద్ద సెలవు గైకొని వెడలి పోయెను అనంతరము మార్కండేయుడు ధర్మరాజునకు స్కందుని వృత్తాంతమును తెలియ జేసెను

ఇక వనమందు పాండవులు ఒక వైపు మహర్షుని బ్రాహ్మణులతో ధర్మచర్చ జరుపుచుండ మఱియొక వైపు ద్రౌపది సత్యభామకు సతీస్త్రీ యొక్క కర్తవ్యమును గూర్చి ఇట్లు తెలిపెను—

175 అహంకారం విహాయాహం కామక్రోధౌ చ సర్వదా
సదారాన్ పాణ్డవాన్ నిత్యం ప్రయతోప చరామ్యహమ్

(ద్రౌపది సత్యభామతో ఇట్లు చెప్పెను—)

నేను అహంకారమును, కామక్రోధములను వదలి సదా మహా జాగరూకతతో పాండవుల యొక్కయు వారి ఇతర స్త్రీల యొక్కయు సేవ చేయుచున్నాను

176 దేవో మనుష్యో గన్ధర్వో యువా చాఽ స్వలంకృతః
ద్రవ్యాఽభిరూపో వా న మేఽన్యః పురుషో మతః

దేవతయైనను మనుష్యుడైనను గంధర్వుడైనను యువకుడైనను గొప్ప ధనవంతుడైనను, మహాసుందరుడైనను, వారెవరిమీదను నా మనస్సు పోదు పాండవుల పైననే నా మనస్సు లగ్నమగును

177 నైతాదృశం దైవతమస్తి సతే
సర్వేషు లోకేషు సదేవకేషు
యదా పతిస్తస్య తు సర్వకామా
లభ్యాః ప్రసాదాత్ కుపితశ్చ హన్యాత్

స్త్రీలకు దేవతా సంఘాతములగు సమస్త లోకములలో పతితో సమానమైన వేరొక దేవత ఎవడును లేడు పతి యొక్క అనుగ్రహముచే స్త్రీ యొక్క కోరికలన్నియు పూర్ణములగును పతి కుపితుడగుచో అతడు స్త్రీ యొక్క కోరికలన్నిటిని నశింపజేయగలడు

తదుపరి కౌరవులు గంధర్వులతో యుద్ధము చేసి ఓడిపోయిరి దుర్యోధనుడు బంధింపబడెను అంతట పాండవులు గంధర్వులతో యుద్ధము చేసి వారిని ఓడించి దుర్యోధనుని విడిపించిరి పిదప కర్ణుడు బయలుదేరి దేశ దేశములందు దిగ్విజయ మొనర్చి వచ్చెను అనంతరము పాండవులు కామ్యకవనమునకు వెడలిరి అపుడు వ్యాసముని పాండవుల యొద్దకు వచ్చి ధర్మోపదేశము చేయుచు ధర్మరాజుతో ఇట్లనెను—

178 నాతప్తతపసో లోకే ప్రాప్నువన్తి మహాసుఖమ్
సుఖదుఃఖే హి పురుషః పర్యాయేణోపసేవతే

(వ్యాసముని ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

ప్రపంచమున తపస్సు చేయనివారు గొప్ప సుఖమును పొంద

లేరు మనుజుడ ఒకపుడు సుఖమును మఱియొకపుడు దుఃఖమును మార్చి మార్చి అనుభవించుచున్నాడు

179 న హ్యనన్తం సుఖం ప్రాప్నోతి పురుషర్షభ
ప్రజ్ఞావాంస్త్వేవ పురుషః సంయుక్తః పరయా ధియా
ఉదయాస్తమనజ్ఞో వా న హృష్యతి న శోచతి

ఈ ప్రపంచమున అంతములేని సుఖమును (జ్ఞాని తప్ప) ఎవడును పొందుటలేదు ఉత్తమ బుద్ధి కల జ్ఞానవంతుడే ఉత్పత్తి స్థితి లయములకు అధిష్ఠానమగు పరమాత్మను ఎఱిగి హర్షశోకముల నెన్నడును పొందకుండును

180 సుఖమాపతితం సేవేద్ దుఃఖమాపతితం వహేత్
కాలప్రాప్తముపాసీత సస్యానామివ కర్షకః

కాబట్టి వివేకవంతుడు ప్రాప్తించిన సుఖమును అనుభవించుచు, స్వతః ఏతెంచిన దుఃఖముయొక్క భారమును ధైర్యముగ సహించుకొనుచునుండుట మంచిది రైతు విత్తనములను నాటి సమయానుసారము ప్రారబ్ధవశమున లభించిన ధాన్యమును గ్రహించునట్లు మనుష్యుడున్ను సమయానుసారము లభించు సుఖదుఃఖములను అనుభవించవలెను

181 తపసో వా పరం నాస్తి తపసా విన్దతే మహత్
నాసాధ్యం తపసః కించిదితి బుధ్యస్వ భారత

తపస్సునకు మించిన మఱియొక సాధన ఏదియును లేదు తపస్సుచే మనుజుడు పరమాత్మ పదమును పొందుచున్నాడు తపస్సుచే అసాధ్యమైనది ఏదియు లేదని యెఱుగుము

182 సత్యమార్జవమక్రోధః సంవిభాగో దమః శమః
అనసూయావిహింసా చ శౌచ మిన్ద్రియ సంయమః
పావనాని మహారాజ నరాణాం పుణ్యకర్మణామ్

సత్యము సరళత్వము కోపము లేకుండుట, దేవతలకు అతిథులకు పెట్టి తదుపరి అన్నమును గ్రహించుట, ఇంద్రియ నిగ్రహము మనస్సంయమము, ఇతరుల దుఃఖములను పోగొట్టుట, హింస చేయకుండుట బాహ్యాభ్యంతరములందు పవిత్రత కలిగి యుండుట ఇంద్రియములన్నిటిని అదుపు నందుంచుకొనుట-పుణ్యాత్ముల యొక్క ఈ సద్గుణములు సర్వులను పవిత్రము చేయునవై యున్నవి

183 అధర్మరుచయో మూఢా స్తిర్యగ్గతి పరాయణాః
కృచ్ఛ్రాం యోనిమనుప్రాప్తా న సుఖం విన్దతే జనాః

అధర్మమందు రుచిగల మూఢులు పశుపక్ష్యాది తిర్యగ్యోను లందు జన్మించుదురు, కష్టదాయకములగు అట్టి జన్మలను పొంది వారెన్నడును సుఖము ను పొందకుందురు

184 ఇహ యత్ క్రియతే కర్మ తత్ పరత్రోపయుజ్యతే
తస్మాచ్ఛరీరం యుఞ్జీత తపసా నియమేన చ

ఈ లోకమున చేయబడు కర్మయొక్క ఫలమును పరలోకమున అనుభవించవలసి వచ్చును కాబట్టి తన శరీరమును తపస్సు నియమములు - వీనియొక్క పాలనమందు నియోగించవలెను

185 సత్యవాదీ లభేతాయురనాయాసమథార్జవమ్
అక్రోధనోఽనసూయశ్చ నిర్వృతిం లభతే పరామ్

సత్యవాదియగు మనుజుడు దీర్ఘాయువును క్లేశరాహిత్యమును (సుఖమును) సరళత్వమును పొందును కోపములేనివాడు ఇతరుల దోషములను చూడనివాడు - అగువానికి పరమానంద ప్రాప్తి చేకూరును

186 దాన్తః శమపరః శాశ్వత్ పరిక్లేశం న విన్దతి
న చ తప్యతి దాన్తాత్మా దృష్ట్వా పరగతాం శ్రియమ్

ఎవడు సదా తన ఇంద్రియములను సంయమమందుంచుకొని మనస్సును నిగ్రహించునో అట్టివానికి ఎన్నడును క్లేశము సంభవించదు తన మనస్సును వశమందుంచుకొనినవాడు ఇతరుల సంపదను చూచి సంతప్తుడు కాకుండును

187 సంవిభక్తా చ దాతా చ భోగవాన్ సుఖవాన్ నరః
భవత్యహింసకశ్చైవ పరమారోగ్యమశ్నుతే

దేవతలకు అతిథులకు వారి భాగమును సమర్పించువాడు భోగ సామగ్రి సంపన్నుడై యుండును దానము చేయువాడు సుఖమును పొందును ఏ ప్రాణికి హింసను చేయనివాడు ఉత్తమ ఆరోగ్యమును ఒడయును

ఎదప వ్యాసముని ధర్మరాజయొక్క ప్రశ్నను పురస్కరించుకొని ముద్గలమహర్షియొక్క వృత్తాంతమును చెప్పెను కురుక్షేత్రమందు ముద్గలుడను ఋషి నివసించుచుండెను అతడు గొప్ప ధర్మాత్ముడు జితేంద్రియుడున్ను అయి యుండెను ముద్గలుడు అన్నమును ఇతరులకు దానము చేసినపుడు మిగిలిన అన్నము పెరిగి పోయి నూతన అతిథులకు వినియోగపడుటకు యోగ్యముగ నగుచుండెను దుర్వాస మహర్షి ముద్గలుని కీర్తి విని పిచ్చివాని వేషముతో ముద్గలుని కడకు వచ్చి అతనివలన సంతృప్తిగ భోజనమును బడసెను ఈ ప్రకారము ఆరు పర్యాయములు వచ్చి అతని పరీక్షించెను కాని ముద్గలుడు ఆతనికి సంతృప్తిగ భోజనమును పెట్టుచునే యుండెను అపుడు దుర్వాసుడు అతని దాతృత్వమును బాగుగ మెచ్చుకొని నీవు సదేహముగ స్వర్గమున కెగెదవు అని చెప్పగనే అచటికి ఒక దేవదూత విమానములో వచ్చి ఈ విమానముపై నెక్కి స్వర్గము నకు రండు అని ముద్గలునితో పలికెను అంతట ముద్గలుడు స్వర్గవాసులకు ఏ యే గుణములుండునో, అచటి స్థితిగతు లెట్టివో వచింపుమని దేవదూత నడుగగా అతడిట్లు చెప్పెను——

దేవదూత ఉవాచ—

188 దేవానామపి మౌద్గల్య కాఙ్క్షితా సా గతిః పరా
దుష్ప్రాపా పరమా సిద్ధిరగమ్యా కామగోచరైః

(దేవదూత ముద్గలునితో ఇట్లు చెప్పెను—)

స్వర్గవాసులగు దేవతలు కూడ పరమగతిని (పరమాత్మ పదమును) పొంద నిచ్ఛించుదురు అది మహా దుర్లభమగు పరాసిద్ధి యొక్క స్థితి విషయభోగేచ్ఛ కలవారు అచటికి పోలేరు

189 బ్రహ్మణః సదనాదూర్ధ్వం తద్ విష్ణోః పరమం పదమ్
శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యద్ విదుః

బ్రహ్మలోకము కంటెను పైన విష్ణువుయొక్క పరమధామము కలదు అది శుద్ధ సనాతన జ్యోతిర్మయ లోకము దానినే పరబ్రహ్మ మనియు అందురు

190 న తత్ర విప్ర గచ్ఛన్తి పురుషా విషయాత్మకాః
దమ్భలోభ మహాక్రోధమోహ ద్రోహైరభిద్రుతాః

విషయములందు మగ్నమగు మనస్సుకలవారచటికి పోలేరు దంభము లోభము, క్రోధము, మోహము ద్రోహముకలవారు కూడ అచటికి పోలేరు

191 నిర్మమా నిరహఙ్కారా నిర్ద్వన్ద్వాః సంయతేన్ద్రియాః
ధ్యానయోగపరాశ్చైవ తత్ర గచ్ఛన్తి మానవాః

మమత్వము అహంకారము లేనివారును, సుఖ దుఃఖాది ద్వంద్వములను దాటినవారును జితేంద్రియులును సదా ధ్యానయోగ తత్పరులును అగువారు మాత్రమే ఆ లోకమునకు వెళ్ళగలరు

192 కృష్ణ కృష్ణ మహాబాహో దేవకీనన్దనావ్యయ

193 వాసుదేవ జగన్నాథ ప్రణతార్తి వినాశన
విశ్వాత్మన్ విశ్వజనక విశ్వహర్తః ప్రభోఽవ్యయ

194 ప్రపన్నపాల గోపాల ప్రజాపాల పరాత్పర
ఆకూతీనాం చ చిత్తీనాం ప్రవర్తక నతాస్మ తే

(ద్రౌపది శ్రీకృష్ణుని యిట్లు ప్రార్థించెను—)

మహాబాహువగు శ్రీకృష్ణా! ఓ దేవకీనందనా! అవినాశియగు ఓ వాసుదేవా! పాదములపై పడియున్న దుఃఖితుల దుఃఖమును తొలగించు ఓ జగదీశ్వరా! మీరే సమస్త జగత్తుయొక్క ఆత్మ అవినాశియగు ప్రభూ! మీరే ఈ జగత్తుయొక్క ఉత్పత్తి, సంహారములను కావించువారు శరణాగతులను రక్షించు ఓ గోపాలా! మీరే సమస్త ప్రజలను పాలించు పరాత్పరుడగు పరమేశ్వరుడు మనస్సును, బుద్ధిని ప్రేరేపించు ఓ పరమాత్మా! నేను మిమ్ము శరణు బొందుచున్నాను

195 వరేణ్య వరదానన్త అగతీనాం గతిర్భవ
పురాణపురుష ప్రాణమనోవృత్త్యాద్యగోచర

196 సర్వాధ్యక్ష పరాధ్యక్ష త్వామహం శరణం గతా
పాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల

సర్వులకు వరదాతలైన అనంతా! రండు! ఎవరికి మీరు తప్ప సహాయ మొనర్చువారు కేఱొకరు లేరో అట్టి అసహాయ భక్తులకు సహాయ మొనర్చుడు పురాణ పురుషా! ప్రాణము మనోవృత్తి మొదలగునవి మీ సమీపమునకు చేరలేవు సర్వులకు సాక్షియగు పరమాత్మా! నేను మిమ్ము శరణుబొందుచున్నాను శరణాగత వత్సలురవగు దేవా! దయచేసి నన్ను కాపాడుడు

197 త్వామేవాహుః పరం బీజం నిదానం సర్వసమ్పదామ్
త్వయా నాథేన దేవేశ సర్వాపద్భ్యో భయం న హి

జ్ఞానులు మిమ్ములనే ఈ జగత్తుయొక్క పరమబీజముగను సమస్త ఉత్తమపదార్థములకును నిధిగను చెప్పుచున్నారు దేవేశ్వరా!

మీరు నా యొక్క రక్షకుల౦డగా నాపై విపత్తులన్నియు విరుచుకు వచ్చి పడినను నాకు వానిచే ఏ భయమున్ను లేదు

ఎదప దుర్యోధనుడు దుర్వాస మహర్షిని అతిథి సత్కారముచే సంతుష్టపఱచి ఆతనిని పాండవుల యొద్దకు పంపెను దుర్వాసుడు ఆ సమయమున పాండవులకడకు ఆతిథ్యమునకు వచ్చి స్నానార్థ మేగగా అంతట ద్రౌపదీ ప్రార్థనచే శ్రీకృష్ణు డచటికి వచ్చి దుర్వాసుని భయమునుండి పాండవులను కాపాడి ద్రౌపదీ సహిత పాండవులకు ఇట్లు చెప్పెను—

శ్రీకృష్ణ ఉవాచ—

198 ధర్మనిత్యాస్తు యే కేచిన్న తే ఎదన్తి కర్హిచిత్
అపృచ్ఛే వో గమిష్యామి నియతం భద్రమస్తు వః

(శ్రీకృష్ణుడు ద్రౌపదీ సహిత పాండవుల కిట్లు చెప్పెను—)

సదా ధర్మమందు తత్పరులై యుండువారు కష్టము నెన్నడును పొందరు ఇక నిపుడు మీ యొద్దనుండి ద్వారకకు వెళ్ళదలంచినాను మీకు శుభమగుగాక!

అనంతరము సింధుదేశపు రాజగు జయద్రథుడు ద్రౌపదిని మోహించి ఆమెను బడయగోరి కామ్యకవనమునకు వచ్చి పాండవులు లేనపుడు ఆమెను అపహరించుకొనిపోయెను పాండవులు ఆశ్రమమునకు తిరిగి వచ్చి వృత్తాంతమంతయు తెలిసికొని జయద్రథుని వెన్నంటి, అతని సేనను ఓడించివేసిరి జయద్రథుడు పారిపోయెను భీముడాతనిని బంధించి తీసికొని వచ్చి ధర్మరాజు యొద్దకు చేర్చెను ధర్మరాజతనితో అధర్మము చేయవలదని చెప్పి అతనిని విడుదల చేయించి పంపివేసెను అతడు గంగా ద్వారమున శివుని గూర్చి తపస్సు చేసి యుద్ధమందు ఒక రోజు అర్జునుని తప్ప తక్కిన నలుగురు పాండవులను నీవు నిరోధించగలవు అను వరమును బడసెను

ఎదప ధర్మరాజు యొక్క ప్రశ్నను పురస్కరించుకొని మార్కండేయుడు శ్రీరామచంద్రుని జీవిత వృత్తాంతమును తెలియ జేసి దుఃఖించుచున్న ధర్మరాజును ఓదార్చి అతనికి ధైర్యమును కలుగ జేసెను పిమ్మట మార్కండేయుడు ధర్మరాజునకు సావిత్రి యొక్క చరిత్రను చెప్పెను అశ్వపతి యను రాజునకు సావిత్రి అను కొమార్తె యుండెను ద్యుమత్సేనుడను రాజు యొక్క కుమారుడగు సత్యవంతుడు ఇంకను ఒక్క సంవత్సరము మాత్రమే ఆయుష్షు కలిగియున్నాడని నారదుడు చెప్పినప్పటికిని సావిత్రి అతనినే వివాహము చేసికొనెను అతడు సద్గుణశీలుడు సరిగా సంవత్సరము పూర్తియగు సరికి యమ ధర్మరాజు సత్యవంతుని ప్రాణములను గొనిపోవుటకు వచ్చి ఆ జీవుని బంధించి వెంట తీసికొని దక్షిణ దిక్కుగ పోవుచుండగా పతివ్రతయగు సావిత్రి అతని వెంబడి ఇట్లు చెప్పెను——

సావిత్ర్యువాచ——

199 నానాత్మవన్తస్తు వనే చరన్తి
ధర్మం చ వాసం చ పరిశ్రమం చ
విజ్ఞానతో ధర్మముదాహరన్తి
తస్మాత్ సన్తో ధర్మమాహుః ప్రధానమ్

(సావిత్రి యమునితో ఇట్లు చెప్పెను——)

తమ మనస్సును ఇంద్రియములను నిగ్రహించని వారు వనమందు ఉండి ధర్మపాలనము గురుకులవాసము కష్టసహనరూపమగు తపస్సు చేయలేరు జితేంద్రియులే ఇవన్నియు చేయగలరు మహాత్ములు వివేక విచారణల చేతనే ధర్మవ్యాప్తి కలుగునని చెప్పుచున్నారు కావున మహాత్ములందరును ధర్మమునే శ్రేష్ఠముగ భావించుచున్నారు

200 సతాం సకృత్సంగతమీప్సితం పరం
తతః పరం మిత్రమితి ప్రచక్షతే

న చాఫలం సత్పురుషేణ సంగతం
తతః సతాం సన్నివసేత్ సమాగమే

సజ్జనుల సాంగత్యము అభీష్టసిద్ధిని కలుగజేయును వారితోటి మైత్రి ఇంకను గొప్పదిగ చెప్పబడుచున్నది సాధుమహాత్ముల సాంగత్యము నిష్ఫలమెన్నడును కాదు కావున సదా సజ్జనుల చెంతనే నివసించవలెను

201 అద్రోహః సర్వభూతేషు కర్మణా మనసా గిరా
అనుగ్రహశ్చ దానం చ సతాం ధర్మః సనాతనః

మనోవాక్కాయములచే ఏ ప్రాణికిని ద్రోహము చేయకుండుట సర్వుల యెడల దయగలిగియుండుట దానము చేయుట—అనునివి సాధుమహాత్ముల సనాతన ధర్మములై యున్నవి

202 న చ ప్రసాదః సత్పురుషేషు మోఘో
న చాప్యర్థో నశ్యతి నాపి మానః
యస్మాదేతన్నియతం సత్సు నిత్యం
తస్మాత్ సన్తో రక్షితారో భవన్తి

సజ్జనుల అనుగ్రహము వ్యర్థమెపుడును కాదు అచట ఎవనికిని స్వార్థహాని కలుగనేరదు మఱియు మాన సమ్మానములు నష్టము కానేరవు ప్రసాదము (అనుగ్రహము) అర్థము మానము —అను ఈ మూగును మహాత్ములయందు నిరంతరము ఉండియే యుండును కనుకనే వారు సమస్త జగత్తునకు రక్షకులై యున్నారు

సావిత్రి యొక్క సౌశీల్యమును పతిభక్తిని చూచి యముడు సంతోషించి వరములను కోరుకొనుమని చెప్పగా తన మామగారికి అంధత్వము తొలగిపోయిన రాజ్యము తిరిగి లభించునట్లును తన మామగారు ధర్మమందు ప్రతిష్ఠితుడై యుండునట్లును తన భర్తయగు సత్యవంతుడు తిరిగి జీవించునట్లును సావిత్రి కోరుకొనెను యమధర్మ

రాజు ఆమె కోరిన వరములన్నిటిని ఇచ్చి సంతాన ప్రాప్తిరూప వరమును కూడ నొసంగెను యమధర్మరాజు యొక్క వరప్రభావముచే సత్యవంతుడు తిరిగి జీవించెను

ఎమ్మట జనమేజయుని ప్రశ్నను పురస్కరించుకొని వైశంపాయనుడు అతనికి కర్ణుని వృత్తాంతమును చెప్పెను ఒకనాడు సూర్యుడు కర్ణునకు స్వప్నమందు బ్రాహ్మణరూపమున కనుపించి ఇంద్రుడడిగి నపుడు అతనికి కవచకుండలములను ఇవ్వవలదని చెప్పెను కాని కర్ణుడు అందులకు అంగీకరింపలేదు వానిని ఇంద్రునకిచ్చి తన కీర్తిని రక్షించు కొనెదనని ఈ ప్రకారముగ చెప్పెను—

కర్ణ ఉవాచ—

203 కీర్తిర్హి పురుషం లోకే సంజీవయతి మాతృవత్
అకీర్తిర్జీవితం హన్తి జీవతోఽపి శరీరిణః

(కర్ణుడు సూర్యునితో ఇట్లు చెప్పెను—)

కీర్తి ఈ ప్రపంచమున తల్లివలె మనుజునకు నూతన జీవనమును ఒసంగుచున్నది అపకీర్తి జీవించియున్న వాని యొక్కయు జీవనమును నశింపజేయుచున్నది

ఒకపుడు వనమందు ధర్మరాజు భావికాల స్థితిని గూర్చి విచారించి సోదరులతో నిట్లనియె —

యుధిష్ఠిర ఉవాచ —

204 నాపదామస్తి మర్యాదా న నిమిత్తం న కారణమ్
ధర్మస్తు విభజత్యర్థముభయోః పుణ్యపాపయోః

(ధర్మరాజు సోదరులతో ఇట్లు చెప్పెను—)

ఆపత్తులకు హద్దుకుని నిమిత్తముగాని, ఏదైన విశేషకారణముగాని కానుపించుటలేదు పూర్వము చేయబడిన పుణ్య పాపరూప

కర్మయే ప్రారబ్ధముగా ఏర్పడి సుఖదుఃఖరూప ఫలములను కలుగ జేయుచున్నది

అనంతరము ధర్మరాజు దాహముతో నున్నవాడై నకులునితో సమీపమునయున్న ఒక జలాశయమునకు వెళ్ళి నీరు తీసుకొని రమ్మని చెప్పగా ఆతడట్లే పాత్ర తీసుకొని వెళ్లెను కాని ఒక యక్షుడు ఆతనిని నిరోధించి తానడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పుమనియు తదుపరి నీరు తీసుకొని వెళ్ళుమనియు పలికెను కాని నకులుడందులకు అంగీక రింపక నీరు త్రాగబోగా క్రిందపడి మూర్ఛనొందెను నకులుడు ఎంత సేపటికి రానందున ధర్మరాజు ఎమ్మట సహదేవుని పంపెను అతడున్ను నకులునివలె ప్రవర్తించగా క్రిందపడి మూర్ఛనొందెను తదుపరి ధర్మరాజు అర్జునుని ఆ తరువాత భీముని పంపెను

వారందరును యక్షుని ప్రశ్నలకు జవాబియ్యనందున అటే క్రిందపడి మూర్ఛనొందిరి చివరకు ధర్మరాజు తానే స్వయముగ ఆ జలాశయము యొద్దకేగగా, అచట మూర్ఛనొంది పడియున్న సోదరులను సమీపమ ననే ఉన్న యక్షుని గాంచెను మీ సోదరుల యొక్క మూర్ఛకు తానే కారకుడనని యక్షుడు ధర్మరాజుతో చెప్పి తానడుగబోవు ప్రశ్నలకు జవాబియ్యవలసినదిగా కోరెను ధర్మరాజు అందుల కంగీకరింపగా అంతట వారిరువురి మధ్య కొన్ని ప్రశ్నోత్తర ములు జరిగెను — యక్షు డిట్లు ప్రశ్నించెను —

యక్ష ఉవాచ —

205 కేనస్వ చ్ఛ్రోత్రియో భవతి కేనస్విద్ విన్దతే మహత్
కేనస్విద్ ద్వితీయివాన్ భవతి రాజన్ కేన చ బుద్ధిమాన్

(యక్షుడు ధర్మరాజును ఇట్లడిగెను —)

మనుజుడు దేనిచే శ్రోత్రియు డగును? దేని ద్వారా మహత్పదమును పొందును? దేనిద్వారా ద్వితీయవంతుడు అగును? దేనిచే బుద్ధిమంతు డగును?

ధర్మరాజు యక్షునితో ఇట్లు చెప్పెను —

యుధిష్ఠిర ఉవాచ —

206 శ్రుతేన శ్రోత్రియో భవతి తపసా విన్దతే మహత్
ధృత్యా ద్వితీయవాన్ భవతి బుద్ధిమాన్ వృద్ధసేవయా

(ధర్మరాజు యక్షునితో ఇట్లు చెప్పెను —)

వేదాధ్యయనముచే మనుజుడు శ్రోత్రియుడగును తపస్సుచే మహత్పదమును బొందును ధైర్యముచే ద్వితీయవంతుడు (సహచరునితో కూడినవాడు) అగును పెద్దల సేవచే బుద్ధిమంతుడగును

207 దేవతాతిథిభృత్యానాం పితౄణామాత్మనశ్చ యః
న నిర్వపతి పఞ్చానాముచ్ఛ్వసన్ న స జీవతి

దేవతలు అతిథులు భరణీయులగు కుటుంబ సభ్యులు, పితరులు ఆత్మ - అను ఈ ఐదుగురిని పోషించనివాడు శ్వాస వదలుచున్నను జీవించియున్నవాడు కాడు

208 దాక్ష్యమేకపదం ధర్మ్యం దానమేకపదం యశః
సత్యమేకపదం స్వర్గ్యం శీలమేకపదం సుఖమ్

ధర్మము యొక్క ముఖ్యస్థానము దక్షత్వము యశస్సు యొక్క ముఖ్యస్థానము దానము స్వర్గము యొక్క ముఖ్యస్థానము సత్యము సుఖము యొక్క ముఖ్యస్థానము శీలము

209 ధన్యానాముత్తమం దాక్ష్యం ధనానాముత్తమం శ్రుతమ్
లాభానాం శ్రేయ ఆరోగ్యం సుఖానాం తుష్టిరుత్తమా

ధన్యులగువారిలో దక్షత్వమే ఉత్తమగుణము ధనములందు శాస్త్రజ్ఞానము ప్రధానమైనది లాభములందు ఆరోగ్యము శ్రేష్ఠమైనది సంతోషమే ఉత్తమసుఖము

210 తపః స్వధర్మవర్తిత్వం మనసో దమనం దమః
క్షమా ద్వన్ద్వసహిష్ణుత్వం హ్రీరకార్య నివర్తనమ్

ధర్మమందు తత్పరుడై యుండుటయే తపస్సు మనస్సును దమన మొనర్చుటయే దమము శీతోష్ణాది ద్వంద్వములను సహించుటయే క్షమ చేయకూడని పనుల నుండి దూరముగ నుండుటయే లజ్జ

211 జ్ఞానం తత్వార్థ సమ్బోధః శమశ్చిత్తప్రశాన్తతా
దయా సర్వసుఖైషిత్వమార్జవం సమచిత్తతా

పరమార్థ తత్త్వము యొక్క యధార్థ బోధియే జ్ఞానము చిత్తము యొక్క శాంతియే శమము సర్వుల యొక్క సుఖమును ఇచ్ఛించుటయే దయ సమచిత్తము కలిగియుండుటయే ఆర్జవము

212 క్రోధః సుదురయః శత్రుర్లోభో వ్యాధిరనన్తకః
సర్వభూతహితః సాధురసాధుర్నిర్దయః స్మృతః

క్రోధము దుర్జయమగు శత్రువు లోభము అనంతమగు వ్యాధి సమస్త ప్రాణులకు హితమొనర్చువాడే సాధువు దయలేని వాడే అసాధువు అని తలంపబడును

213 స్వధర్మే స్థిరతా స్థైర్యం ధైర్యమిన్ద్రియ నిగ్రహః
స్నానం మనోమలత్యాగో దానం వై భూతరక్షణమ్

తన ధర్మమందు నిలుకడగ నుండుటయే స్థిరత్వము ఇంద్రియ నిగ్రహమే ధైర్యము మనస్సుక మాలిన్యమును వదలుటయే స్నానము ప్రాణులను రక్షించుటయే దానవ

214 ధర్మజ్ఞః పణ్డితో జ్ఞేయో నాస్తికో మూర్ఖ ఉచ్యతే
కామః సంసారహేతుశ్చ హృత్తాపో మత్సరః స్మృతః

ధర్మజ్ఞుడే పండితుడని తలంపవలెను నాస్తికుడు మూర్ఖుడు జనన మరణరూప సంసారమునకు కారణము కామము (కామవసం) మాత్సర్యము హృదయ తాపము

215 శృణు యక్షకులం తాత న స్వాధ్యాయో న చ శ్రుతమ్
కారణం హి ద్విజత్వే చ వృత్తమేవ న సంశయః

బ్రాహ్మణత్వమునకు కారణము కులము కాదు స్వాధ్యాయము కాదు శాస్త్ర శ్రవణము కాదు సదాచారమే (శుద్ధాచరణయే) బ్రాహ్మణత్వమునకు కారణము

216 పఠకాః పాఠకాశ్చైవ యే చాన్యే శాస్త్ర చిన్తకాః
సర్వే వ్యసనినో మూర్ఖాయః క్రియావాన్ స పణ్డితః

(ఆచరణ లేక కేవలము) చదువువారు చదివించువారు శాస్త్రమును విచారణ చేయువారు - వీరందఱును వ్యసనము కల వారే శాస్త్రోక్తమగు తన కర్తవ్యము పాలించువాడే పండితుడు

217 చతుర్వేదోఽపి దుర్వృత్తః స శూద్రాదతిరిచ్యతే
యోఽగ్నిహోత్రపరో దాన్తః స బ్రాహ్మణ ఇతి స్మృతః

నాలుగు వేదములు చదివినప్పటికిని దురాచారియై యుండువాడు శూద్రుని కంటెను అధముడు అగ్నిహోత్రమందు తత్పరుడు, జితేంద్రియుడు బ్రాహ్మణుడని చెప్పబడును

218 ప్రియవచనవాదీ ప్రియో భవతి
విమృశితకార్యకరోఽధికం జయతి
బహుమిత్రకరః సుఖం వసతే
యశ్చ ధర్మరతః స గతిం లభతే

మధురవాక్యములను పలుకువాడు అందఱికి ప్రియుడుగా నుండును బాగా ఆలోచించి పనులు జరుపువాడు అధిక సాఫల్యమును పొందును ఎక్కువ మంది మిత్రులను ఏర్పాటు చేసుకొనువాడు సుఖముగ నుండును ధర్మనిష్ఠుడు సద్గతిని పొందును

219 అహన్యహని భూతాని గచ్ఛన్తీహ యమాలయమ్
శేషాః స్థావరమిచ్ఛన్తి కిమాశ్చర్యమతః పరమ్

ప్రపంచమున ప్రతిరోజు ప్రాణులు యమలోకమునకు పోవు చున్నారు కాని తక్కినవారు మేము మాత్రము ఎచటికిని వెళ్ళము మేము స్థిరముగా ఇచటనే యుందుము అని తలంచుట ఏది కలదో అంతకుమించిన ఆశ్చర్యకరమైనది ఏది కలదు ?

220 దర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతః స పన్థా

ధర్మము యొక్క తత్త్వము హృదయ గుహాయందు నిహితమై యున్నది (అతి గూఢమైయున్నది) కాబట్టి ఏ మార్గము ద్వారా మహాత్ములు పయనమైపోయిరో అదియే మార్గము

221 అస్మిన్ మహామోహమయే కటాహే
సూర్యాగ్నినా రాత్రిదివేన్ధనేన
మాసర్తు దర్వీపరీఘట్టనేన
భూతాని కాలః పచతీతి వార్తా

ఈ మహామోహా రూపమగు ప్రపంచమను బాణలియందు కాలుడు సమస్త ప్రాణులను మాస ఋతురూపమగు గరిటెచే ఇటు నటు కదిలించి, సూర్యుడను అగ్నిచేతను రాత్రి దినరూపమగు ఇందనముచేతను వేయించుచున్నాడని వార్త

222 దివం స్పృశతి భూమిం చ శబ్దః పుణ్యేన కర్మణా
యావత్ స శబ్దో భవతి తావత్ పురుష ఉచ్యతే

ఎవని పుణ్యకర్మల యొక్క కీర్తియొక్క శబ్దము స్వర్గమును భూలోకమును ఎంతకాలము వఱకు తాకునో అంతవఱకు అతడు పురుషుడని చెప్పబడును

223 తుల్యే ప్రియాప్రియే యస్య సుఖదుఃఖే తథైవ చ
అతీతానాగతే చోభే స వై సర్వధనీ నరః

ఎవడు ప్రియ అప్రియ, సుఖ దుఃఖ భూతభవిష్యత్ప్రమాప ద్వంద్వములందు సమబుద్ధియుండునో అతడు అందరికంటెను పెద్ద ధనవంతుడు

224 భూతభవ్య భవిష్యేషు నిఃస్పృహః శాన్తమానసః
సుప్రసన్నః సదా యోగీ స వై సర్వధనేశ్వరః

ఎవడు భూత వర్తమాన భవిష్యత్తులందలి సమస్త విషయములందును నిస్పృహుడై యుండునో శాంతచిత్తుడై సుప్రసన్నుడై సదా యోగయుక్తుడై యుండునో అతడు ధనవంతులందరిలోను గొప్ప ధనవంతుడు

ధర్మరాజు చెప్పిన సద్వాక్యములను విని యక్షుడు సంతోషించి ధర్మరాజుతో ఇట్లు పలికెను —

యక్ష ఉవాచ

225 యశః సత్యం దమః శౌచమార్జవం హ్రీరచాపలమ్
దానం తపో బ్రహ్మచర్యమిత్యేతాస్తనవో మమ

(యక్షుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

యశస్సు సత్యము దమము శౌచము సరళత్వము లజ్జ అచంచలత్వము, దానము, తపస్సు బ్రహ్మచర్యము - ఇవి అన్నియు నా యొక్క శరీరములు

226 అహింసా సమతా శాన్తి రానృశంస్య మమత్సరః
ద్వారాణ్యేతాని మే విద్ధి ప్రియో హ్యసి సదా మమ

అహింస సత్యము శాంతి దయ అమత్సరత్వము — ఇవి నా యొద్దకు చేరుటకు ద్వారములని తలంచుము నీవు సదా నాకు ప్రియుడవు

227 వరం వృణీష్వ రాజేన్ద్ర దాతా హ్యస్మి తవానఘ
యే హి మే పురుషా భక్తా న తేషామస్తి దుర్గతిః

పాపరహితుడవగు రాజా! నీవు నీ కిష్టము వచ్చిన వరము కోరుము తప్పక ఒసంగెదను నా భక్తులకు దుర్గతి యెన్నడును కలుగదు

అపుడు ధర్మరాజు యక్షునితో ఇట్లు చెప్పెను —

యుధిష్ఠిర ఉవాచ —

228 జయేయం లోభమోహౌ చ క్రోధం చాహం సదా విభో
దానే తపసి సత్యే చ మనో మే సతతం భవేత్

(ధర్మరాజు యక్షునితో ఇట్లు చెప్పెను—)

ప్రభూ! నేను లోభము మోహము క్రోధము — వీనిని జయించగల్గులాగునను దానము తపస్సు సత్యము — వీనియందు నా మనస్సు సదా తత్పరమైయుండులాగునను వరమొసంగుడు

అనంతరము యక్షుడు ధర్మరాజు యొక్క నలుగురు సోదరులను ఉజ్జీవింపజేసి ఆతనికి అభీష్టమగు వరము నొసంగి అంతర్ధానమొందెను

# 4 విరాటపర్వము

పిదప అజ్ఞాతవాసము కొఱకై పాండవులు విరాటనగరమున ప్రవేశింపదలంచి నగర సమీపమున గల ఒక శమీ వృక్షమునందు తమతమ అస్త్రశస్త్రములను దాచుకొనిరి పిమ్మట ధర్మరాజు దుర్గాదేవిని స్తుతించి ఆమె అనుగ్రహమును బడసెను దుర్గాదేవి పాండవులు సురక్షితముగ నుండగలరనియు యుద్ధమున విజయమును చేబట్టగలరనియు చెప్పి అంతర్ధాన మొందెను అనంతరము పాండవులు ద్రౌపది విరాటనగరమున ప్రవేశించి నూతన వేషములతో రాజభవనమందు రాజుయొక్క అనుమతిచే ఒక్కొక్కరు ఒక్కొక్క కార్యమందు నియోగింపబడిరి ధర్మరాజు రాజ్యకార్యములు చూచుటకు భీముడు వంటపని చేయుటకు అర్జునుడు ఆస్థానమందలి కన్యలకు నృత్యాదులు నేర్పుటకు నకులుడు గుఱ్ఱముల పర్యవేక్షణ సహదేవుడు గోవులను సంరక్షించుటకు ద్రౌపది రాణీవాసమున సేవ చేయుటకు నియోగింపబడిరి

కొంతకాలమునకు భీమునిచే జీమూతుడను గొప్ప మల్లుడు వధింపబడెను విరాటరాజు యొక్క సేనాపతియగు కీచకుడు ద్రౌపది యెడల మోహము కలిగి రాజసభయందు ఆమెను అవమానింప దుఃఖించుచున్న ఆమెతో ధర్మరాజిట్లు పలికెను —

1 క్షమా సత్యం క్షమా దానం క్షమా ధర్మః క్షమా తపః
క్షమావతామయం లోకః పరలోకః క్షమావతామ్

క్షమయే (ఓర్పు సహనము) సత్యము క్షమయే దానము క్షమయే ధర్మము క్షమయే తపస్సు క్షమాశీలురకే ఇహలోకము, పరలోకమున్ను

ఎదప దుర్బుద్ధియగు కీచకుని భీముడు వధించెను అపుడు ద్రౌపదిని బంధించివేసి శ్మశానమునకు గొనిపోయిన ఉపకీచకులను భీముడు చంపివేసి ద్రౌపదిని విడిపించెను అనంతరము త్రిగర్తదేశ సైనికులు కౌరవులు మత్స్యదేశముపై (విరాటరాజు యొక్క దేశముపై) దండెత్తి యుద్ధము చేసిరి త్రిగర్తరాజగు సుశర్మ విరాటుని పట్టుకొని పోగా పాండవులు అతనిని విడిపించిరి భీముడు సుశర్మను బంధించగా ధర్మరాజు అతనిని విడిపింపజేసెను కౌరవులు విరాటుని గోవులను అపహరించగా విరాటుని కుమారుడగు ఉత్తరుడు అర్జునుని సారథిగా నుంచుకొని కౌరవులతో యుద్ధమునకు పోయెను శమీ వృక్షము నుండి తమ అస్త్రశస్త్రములను గైకొని అర్జునుడు యుద్ధమునకు వెడలెను పాండవులతో యుద్ధమునకు తలపడవలదని కృపాచార్యుడు కర్ణునకు బోధించి యిట్లనెను—

కృప ఉవాచ —

2 ఆత్మానం కః సముద్బధ్య కణ్ఠే బద్ధ్వా మహాశిలామ్
సముద్రం తరతే దోర్భ్యాం తత్ర కిం నామ పౌరుషమ్

(పాండవులతో తలపడవద్దని తెలుపుచూ కృపాచార్యుడు కర్ణునితో ఇట్లు చెప్పెను —)

తన్ను తాను బంధనము నందుంచుకొని కంఠమందు పెద్ద రాతిని వ్రేలాడగట్టుకొని రెండు చేతులతో ఈదుచు ఎవ్వైన సముద్రమును దాటగలడా ? దాని యందేమైన పురుషార్థము కలదా ? (అది మూర్ఖత్వమే యగునని భావము)

అర్జునుడు దుర్యోధనుని సేనపై ఆక్రమణము సలిపి వారిని ఓడించి గోవులను తిరిగి తెచ్చెను యుద్ధమందు అర్జునుని ధాటికి తట్టుకొనలేక కర్ణుడు మొదలైన గొప్ప గొప్ప యోధులు పారిపోయిరి భీష్ముడు యుద్ధమందు మూర్ఛపోగా సారథి అతనిని యుద్ధభూమి

నుండి దూరముగ తీసికొని పోయెను దుర్యోధనుడు మొదలైనవారు అర్జునునిచే ఓడిపోయి పలాయనము చిత్తగించిరి. పిదప విరాటుడు తన కొమార్తెయగు ఉత్తరను అర్జునుని కుమారుడగు అభిమన్యున కిచ్చి వివాహము చేసెను.

అనంతరము ద్రుపదుడు పురోహితుని దౌత్యకర్మకై నియోగించి ధృతరాష్ట్రాదులకు ధర్మయుక్తములగు వచనములను చెప్పుటకై హాస్తినాపురమునకు పంపదలంచి ఆతనితో ఇట్లు చెప్పెను —

ఓం

# 5 ఉద్యోగ పర్వము

ద్రుపద ఉవాచ

1 భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేష్వేవ ద్విజాతయః

2 ద్విజేషు వైద్యాః శ్రేయాంసో వైద్యేషు కృతబుద్ధయః
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవాదినః

(ద్రుపదుడు పురోహితునితో ఇట్లు చెప్పెను —)

సమస్త భూతములందును ప్రాణధారులు శ్రేష్ఠులు ప్రాణధారులలో బుద్ధిజీవులు శ్రేష్ఠులు బుద్ధిజీవులలో మనుష్యులు శ్రేష్ఠులు మనుష్యులలో ద్విజులు శ్రేష్ఠులు ద్విజులలో విద్వాంసులు, విద్వాంసులలో సిద్ధాంతమును తెలిసినవారు శ్రేష్ఠులు అట్లు సిద్ధాంతమును తెలిసినవారిలో తదనుసారము ఆచరించువారు శ్రేష్ఠులు అట్లు ఆచరించువారిలో బ్రహ్మవేత్తలు శ్రేష్ఠులు

యుద్ధమున శ్రీకృష్ణుని సహాయమపేక్షించుటకై దుర్యోధనుడు అర్జునుడు ఇరువురును శ్రీకృష్ణుని యొద్దకు వెళ్ళిరి నేను యుద్ధము చేయను శస్త్రము పట్టను అని శ్రీకృష్ణుడు చెప్పెను మొదట అర్జునుని చూచుటవలన నా సైన్యము కావలెనా నేనొక్కడనే కావలెనా కోరుకొనుమని అర్జునునితో శ్రీకృష్ణుడు చెప్పగా అర్జునుడు శ్రీకృష్ణుని ఒక్కరినే కోరుకొనెను దుర్యోధనుడు సైన్యమును కోరుకొనెను అట్లే అగుగాక అని శ్రీకృష్ణుడు చెప్పెను పిదప ధృతరాష్ట్రుడు సంజయునకు శాంతి సందేశమొసంగి ధర్మరాజు యొద్దకు పంపెను సంజయుడు ధృతరాష్ట్రుని యొక్కయు తన యొక్కయు శాంతి సందేశములను ధర్మరాజాదుల కెఱిగించి యుద్ధప్రయత్నమును విరమింపజేయుటకై కృషి సల్పెను ఎన్నోట

7 న హృష్యత్యాత్మసమ్మానె నావమానేన తృప్యతే
గాఙో హ్రద ఇవాక్షోభ్యో యః స పణ్డిత ఉచ్యతే

ఇతరులు ఆదరించుటచే హర్షముతో పొంగనివాడును అనాదరించుటచే బాధపడనివాడును, గంగా జలసరోవరమువలె చిత్తమందు క్షోభలేనివాడును పండితుడనబడును

8 అర్థం మహాన్తమాసాద్య విద్యామైశ్వర్యమేవ వా
విచరత్యసమున్నద్ధో యః స పణ్డిత ఉచ్యతే

ఎవడు అధిక ధనమును విద్యను ఐశ్వర్యమును పొందియు, గర్వము లేకయుండునో అట్టివాడు పండితుడనబడును

9 ఏకయా ద్వే వినిశ్చిత్య త్రీంశ్చతుర్భిర్వశే కురు
పఞ్చ జిత్వా విదిత్వా షట్ సప్త హిత్వా సుఖీభవ

ఒక దానిచే (బుద్ధిచే) రెంటిని (కర్తవ్యమును, అకర్తవ్యమును) నిశ్చయించి, నాల్గింటిచే (సామ దాన భేద దండములచే) మూడింటిని (శత్రు, మిత్ర, ఉదాసీనులను) వశమొనర్చుకొనుము ఐదింటిని (పంచేంద్రియములను) జయించి ఆరు గుణములను (సంధి, విగ్రహ, యాన, ఆసన ద్వైధీభావ, సమాశ్రయములను) ఎఱిగి ఏడింటిని (పరస్త్రీ, జూదము వేట, మద్యము, కఠోరవచనములు కఠోరదండన, అన్యాయపూర్వక ధనార్జన) వదలి సుఖముగ నుండుము

10 ఏకమేవాద్వితీయం తద్ యద్ రాజన్ నావబుధ్యసే
సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌరివ

రాజా! సముద్రమును దాటుటకు నావయే ఏకైక సాధనమైనట్లు స్వర్గమున కేగుటకు సత్యమే ఏకైక సాధనమై యున్నది మఱియొకటి లేదు కాని మీరు ఆ విషయమును తెలిసికొనుట లేదు

11 క్షమా వశీకృతిర్లోకే క్షమయా కిం న సాధ్యతే
శాన్తిఖడ్గః కరే యస్య కిం కరిష్యతి దుర్జనః
అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి

ఈ ప్రపంచమున క్షమ (ఓర్పు) వశీకరణ రూపమైయున్నది క్షమచే ఏది సాధింపదు? శాంతియను ఖడ్గము చేతి యందున్నవానిని ఇక దుష్టుడు ఏమి చేయగలడు? గడ్డిలేని చోట పడిన అగ్ని స్వయముగ శమించిపోవును గదా!

12 ఏకో ధర్మః పరం శ్రేయః క్షమైకా శాన్తిరుత్తమా
విద్యైకా పరమా తృప్తిరహింసైకా సుఖావహా

కేవలము ధర్మమే పరమ కళ్యాణకారకమైయున్నది కేవలము క్షమయే ఏకైక శాంతి సాధనమైయున్నది కేవలము ఒక విద్యయే పరమ సంతృప్తిని కలుగజేయునదై యున్నది కేవలము ఒక అహింసయే సుఖమును కలుగజేయునదియై యున్నది

13 ద్వావిమౌ పురుషౌ రాజన్ స్వర్గస్యోపరి తిష్ఠతః
ప్రభుశ్చ క్షమయా యుక్తో దరిద్రశ్చ ప్రదానవాన్

శక్తివంతుడు అయినప్పటికిని క్షమించువాడు ధనవంతుడు కానప్పటికిని దానము చేయువాడు — అను ఈ యిరువురు స్వర్గము కంటెను పైస్థానమును పొందుదురు

14 న్యాయాగతస్య ద్రవ్యస్య బోద్ధవ్యౌ ద్వావతిక్రమౌ
అపాత్రే ప్రతిపత్తిశ్చ పాత్రే చాప్రతిపాదనమ్

న్యాయముగ సంపాదించిన ధనమునకు రెండు దురుపయోగములు కలవు అవి యేవి యనిన — అపాత్రునకు ఇచ్చుట సత్పాత్రునకు ఇవ్వకుండుట

15 హరణం చ పరస్వానాం పరదారాభిమర్శనమ్
సుహృదశ్చ పరిత్యాగస్త్రయో దోషాః క్షయావహాః

ఇతరుల ధనమును హరించుట ఇతర స్త్రీలతోటి సంసర్గము చేయుట మిత్రులను వదలివేయుట — అను ఈ మూడు దోషములు మనుజుని కీర్తి మొదలైనవానిని క్షయింపజేయునవై యున్నవి

16 త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్ త్రయం త్యజేత్

కామము, క్రోధము, లోభము — అను ఈ మూడును ఆత్మ వినాశకరములును నరకద్వారములును అయియున్నవి కాబట్టి ఆ మూడిటిని వదలివేయవలెను

17 చత్వారి కర్మాణ్యభయంకరాణి
భయం ప్రయచ్ఛన్త్యయథాకృతాని
మానాగ్నిహోత్రముత మానమౌనం
మానేనాధీతముత మానయజ్ఞః

నాలుగు కర్మలు భయమును పోగొట్టును కాని వానిని సరిగా చేయనిచో భయమును కలుగజేయును అవి యేవియనగ — అగ్నిహోత్రము మౌనము స్వాధ్యాయము యజ్ఞానుష్ఠానము

18 పఞ్చాగ్నయో మనుష్యేణ పరిచర్యాః ప్రయత్నతః
పితా మాతాగ్నిరాత్మా చ గురుశ్చ భరతర్షభ

తండ్రి, తల్లి అగ్ని ఆత్మ గురువు – అను ఈ ఐదు అగ్నులను మిగుల ప్రేమతో ప్రయత్నపూర్వకముగ సేవించవలెను

19 పఞ్చైవ పూజయంల్లోకే యశః ప్రాప్నోతి కేవలమ్
దేవాన్ పితౄన్ మనుష్యాంశ్చ భిక్షూనతిథిపఞ్చమాన్

దేవతలు, పితరులు, మనుష్యులు సన్న్యాసులు, అతిథులు — అను ఈ ఐదుగురిని పూజించువాడు ఉత్తమకీర్తిని బడయును

20 షడ్ దోషాః పురుషేణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా
నిద్రా తన్ద్రీ భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా

ఐశ్వర్యమును (ఉన్నతిని) కోరువారు — నిద్ర, మత్తు భయము కోపము, సోమరితనము, అలసత్వము — అను ఈ ఆరు, దోషములను వదలి వేయవలెను

21 షడేవ తు గుణాః పుంసా న హాతవ్యాః కదాచన
సత్యం దానమనాలస్యమనసూయా క్షమా ధృతిః

సత్యము దానము కర్మణ్యత్వము, అసూయ లేమి, క్షమ ధైర్యము — అను ఈ ఆరు సుగుణములను ఎన్నడును వదలరాదు

22 అర్థాగమో నిత్యమరోగితా చ
ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ
వశ్యశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా
షడ్ జీవలోకస్య సుఖాని రాజన్

ధనప్రాప్తి రోగరాహిత్యము, అనుకూలవతి ప్రియభాషిణి యగు భార్య చెప్పిన మాటను ఆదరించు కుమారుడు, ధనోత్పత్తికర మగు విద్య — అను ఈ ఆరున్ను ఈ మనుష్యలోకమున సుఖ దాయకములై యున్నవి

23 షణ్ణామాత్మని నిత్యానామైశ్వర్యం యోఽధిగచ్ఛతి
న స పాపైః కుతోఽనర్థైర్యుజ్యతే విజితేన్ద్రియః

మనస్సు నందెల్లపుడు నివసించు కామ క్రోధ, లోభ మోహ మద మాత్సర్యములను ఆరుగురు శత్రువులను వశ మొనర్చుకొను జితేంద్రియుడు పాపములచే అంటబడడు ఇక ఆ పాపముల వలన కలుగు అనర్థముల విషయము వేరుగ చెప్పనేల!

24 నవద్వారమిదం వేశ్మ త్రిస్థూణం పఞ్చ సాక్షికమ్
క్షేత్రజ్ఞాధిష్ఠితం విద్వాన్ యో వేద స పరః కవిః

తొమ్మిది ద్వారములు (నవరంధ్రములు), మూడు స్తంభ ములు (సత్త్వరజస్తమోగుణములు), ఐదుగురు సాక్షులు

(జ్ఞానేంద్రియములు) ఆత్మయొక్క నివాస స్థానము, అగు ఈ శరీర మను గుహాను యథార్థముగ తెలిసికొనువాడు గొప్ప జ్ఞాని యగును

25 యః సర్వభూతప్రశమే నివిష్టః
సత్యో మృదుర్మానకృచ్ఛుద్ధ భావ
అతీవ స జ్ఞాయతే జ్ఞాతిమధ్యే
మహామణిర్జాత్య ఇవ ప్రసన్నః

సమస్త ప్రాణులకు శాంతి 2 సంగుట యందు తత్పరుడను సత్యవాదియు కోమలుడును ఇతరులను ఆదరించు వ డను పవిత్ర విచారణ కలవాడును గనినుండి వెలువడిన ప్రకాశించు శ్రేష్ఠ రత్నమువలె జనులమందు గొప్ప ప్రసిద్ధిని బడయును

26 విద్యామదో ధనమదస్తృతీయోఽభిజనో మదః
మదా ఎతేఽవలిప్తానామేత ఎవ సతాం దమాః

విద్యామదము, ధనమదము కులమదము అనునివి గర్వులకు మదములు కాని ఇవియే (విద్య ధనము కులీనత్వము) సజ్జనులకు దమము యొక్క సాధనమై యున్నవి

27 శీలం ప్రధానం పురుషే తద్ యస్యేహ ప్రణశ్యతి
న తస్య జీవితేనార్థో న ధనేన న బన్ధుభిః

మనుజులలో శీలమే ప్రధానమైనది అది నశించినవానికి ఈ ప్రపంచమున జీవనము ధనము, వస్తువులు — వీనిచే ఏ ప్రయోజన మున్నను సిద్ధింపదు

28 ప్రాయేణ శ్రీమతాం లోకే భోక్తుం శక్తిర్న విద్యతే
జీర్యన్త్యపి హి కాష్ఠాని దరిద్రాణాం మహీపతే

ఈ ప్రపంచమున ప్రాయఃధనవంతులకు భోజనమును జీర్ణింప చేసికొను శక్తి ఉండదు కాని దరిద్రులు కట్టెలను కూడ జీర్ణింప చేసికొందురు

29 అవృత్తిర్భయమన్త్యానాం మధ్యానాం మరణాద్ భయమ్
ఉత్తమానాం తు మర్త్యానామవమానాత్ పరం భయమ్

అధములకు జీవితము ఎట్లు గడచునా అనుభయముండును మధ్యమ తరగతివారికి మృత్యువును గూర్చిన భయముండును ఉత్తములకు అవమానమును గూర్చిన గొప్ప భయముండును

30 ఐశ్వర్యమదపాపిష్ఠా మదాః పానమదాదయః
ఐశ్వర్యమదమత్తో హి నాపతిత్వా విబుధ్యతే

మాదక వస్తువులను త్రాగుటచే మైపు వర్పడును కాని ఐశ్వర్యము యొక్క మైపు చాల చెడ్డది ఏలయనిన ఐశ్వర్యమదము కలవాడు భ్రష్టుడు కాకుండ ఉండడు అతడు తెలివి లోనికి రాడు

31 ఆత్మానమేవ ప్రథమం ద్వేష్యరూపేణ యో జయేత్
తతోఽమాత్యానమిత్రాంశ్చ న మోఘం విజిగీషతే

ఎవడు మనస్సహితములగు ఇంద్రియములనే శత్రువులుగా తలంచి ముందుగా వానినే జయించునో ఆ పిదపనే మంత్రులను బాహ్య శత్రువులను జయించునో అట్టి వానికి సాఫల్యము కలుగును

32 వశ్యేన్ద్రియం జితాత్మానం ధృతదణ్డం వికారిషు
పరీక్ష్య కారిణం ధీరమత్యన్తం శ్రీర్నిషేవతే

ఇంద్రియములను మనస్సును జయించువాడును అపరాధులకు దండన విధించువాడును జాగ్రతగ ఆలోచించి కార్యమొనర్చువాడును అగు ధీరుని లక్ష్మి బాగుగ సేవించును

33 రథః శరీరం పురుషస్య రాజ
న్నాత్మా నియన్తేన్ద్రియాణ్యస్య చాశ్వాః
తైరప్రమత్తః కుశలీ సదశ్వై
ర్దాన్తైః సుఖం యాతి రథీవ ధీరః

శరీరము ఒక రథము బుద్ధి దాని సారథి ఇంద్రియములు గుఱ్ఱములు (ఇంద్రియమనంబులను) ఆ గుఱ్ఱములను వశమందుంచుకొని జాగ్రతగ ధీరుగ — చతురసారథి గుఱ్ఱములను అదుపునందుంచుకొని మార్గమును దాటునట్లు — ఈ ప్రపంచమార్గమును సుఖముగ దాటివైచును

34 ఆత్మనాఽఽత్మా న మన్విచ్ఛేన్మనో బుద్ధీన్ద్రియైర్యతైః
ఆత్మా హ్యేవాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః

మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అను వీనిని తన వశమందుంచుకొని ఆత్మను తెలిసికొనుటకు ఇచ్ఛగించవలెను ఎలయనిన తన ఇంద్రియములే (జయింపబడని-చో) శత్రువులు

35 క్షుద్రాక్షేణేవ జాలేన ఝషావపి హితావురూ
కామశ్చ రాజన్ క్రోధశ్చ తౌ ప్రజ్ఞానం విలుమ్పతః

సన్నని రంధ్రములు గల వలలో చిక్కుపడిన రెండు ఎద చేపలు ఆ వలను కొఱికి వైచునట్లు కామక్రోధములు రెండును వివేకమును నశింప జేయుచున్నవి

36 రోహతే సాయకైర్విద్ధం వనం పరశునా హతమ్
వాచా దురుక్తం బీభత్సం న సంరోహతి వాక్షతమ్

బాణములచేతను గొడ్డళ్ళచేతను ఛేదింపబడిన వనము తిరిగి అంకురించును కాని కటువచనములచే వాక్కుతో చేయబడిన భయంకరమైన గాయము మానదు

37 యావత్ కీర్తిర్మనుష్యస్య పుణ్యా లోకే ప్రగీయతే
తావత్ స పురుషవ్యాఘ్ర స్వర్గలోకే మహీయతే

ఈ లోకమున ఎంతవఱకు మనుజుని పవిత్ర కీర్తి గానము చేయబడుచుండునో, అంతవఱకును అతడు స్వర్గలోకమున ప్రతిష్ఠితుడై యుండును

38 న దేవా దణ్డమాదాయ రక్షన్తి పశుపాలవత్
యం తు రక్షితుమిచ్ఛన్తి బుద్ధ్యా సంవిభజన్తి తమ్

దేవతను పశుపాలకుని వలె కఱ్ఱ తీసికొని ఎవరిని రక్షింపరు వారు ఎవనినైనను రక్షింపదలంచినచో అతనికి ఉత్తమ బుద్ధి కలుగ జేయుదురు

39 నైనం ఛన్దాంసి వృజినాత్ తారయన్తి
మాయావినం మాయయా వర్తమానమ్
నీడం శకున్తా ఇవ జాతపక్షా
శ్ఛన్దాంస్యేనం ప్రజహత్యన్తకాలే

కపటపూర్ణ వ్యవహార మాచరించు మాయావిని వేదములు పాపముల నుండి విముక్తునిగ చేయవు రెక్కలు రాగానే పక్షులు గూటిని వదలిపోవునట్లు వేదములున్ను అంత్యకాలమున అతనిని వదలి పెట్టును

40 మద్యపానం కలహం పూగవైరం
భార్యాపత్యోరన్తరం జ్ఞాతిభేదమ్
రాజద్విష్టం స్త్రీపుంసయోర్వివాదం
వర్జ్యాన్యాహుర్యశ్చ పన్థాః ప్రదుష్టః

మద్యపానవ కలహము సమూహముతో వైరము పతి పత్నులందు భేదము కలిగించుట, కుటుంబ సభ్యులలో భేదబుద్ధి జనింప చేయుట రాజు యెడల ద్వేషము స్త్రీ పురుషులందు వివాదము కలిగించుట చెడుమార్గము — ఇవి యన్నియు త్యజింపదగినవని చెప్పబడినది

41 అష్టౌ గుణాః పురుషం దీపయన్తి
ప్రజ్ఞా చ కౌల్యం చ దమః శ్రుతం చ
పరాక్రమశ్చా బహుభాషితా చ
దానం యథాశక్తి కృతజ్ఞతా చ

ఎనిమిది గుణములు మనుజుని శోభను అధికము చేయును అవి యేవియనిన — బుద్ధి, కులీనత్వము దమము శాస్త్రజ్ఞానము పరాక్రమము, అధికముగ మాట్లాడకుండుట యథాశక్తి దానము చేయుట, కృతజ్ఞుడై యుండుట

42 అష్టౌ నృపేమాని మనుష్యలోకే
స్వర్గస్య లోకస్య నిదర్శనాని
చత్వార్యేషామన్వవేతాని సద్భి
శ్చత్వారి చైషామనుయాన్తి సన్తః

మనుష్యలోకమున (ఈపై) ఎనిమిది గుణములు స్వర్గలోకమును దర్శింపజేయునవై యున్నవి అందు నాలుగు గుణములు సజ్జనులతో ఎల్లపుడు సంబంధము కలిగియున్నవి తక్కిన నాలుగింటిని సాధు మహాత్ములు అనుసరించుదురు

43 యజ్ఞో దానమధ్యయనం తపశ్చ
చత్వార్యే తాన్యన్వవేతాని సద్భిః
దమః సత్యమార్జవమానృశంస్య
చత్వార్యే తాన్యనుయాన్తి సన్తః

యజ్ఞము దానము, శాస్త్రాధ్యయనము తపస్సు — అనునవి సజ్జనులతో నిత్యము సంబంధము కలిగియుండును ఇంద్రియ నిగ్రహము సత్యము సరళత్వము కోమలత్వము — అను ఈ నాలుగింటిని సాధుమహాత్ములు అనుసరించుదురు

44 ఇజ్యాధ్యయనదానాని తపః సత్యం క్షమా ఘృణా
అలోభ ఇతి మార్గోఽయం ధర్మస్యాష్టవిధః స్మృతః

యజ్ఞము అధ్యయనము దానము సత్యము క్షమ దయ, నిర్లోభత్వము — అనునివి ధర్మము యొక్క ఎనిమిది మార్గములని చెప్పబడినవి

45 న సా సభా యత్ర న సన్తి వృద్ధా
న తే వృద్ధా యే న వదన్తి ధర్మమ్
నాసౌ ధర్మో యత్ర న సత్యమస్తి
న తత్ సత్యం యచ్ఛలేనాభ్యుపేతమ్

పెద్దలులేనిది సభ కాదు ధర్మమును గూర్చి చెప్పనివారు పెద్దలు కారు సత్యము లేనిది ధర్మము కాదు కపటముతో నిండినది సత్యము కాదు

46 సత్యం రూపం శ్రుతం విద్యా కౌల్యం శీలం బలం ధనమ్
శౌర్యం చ చిత్రభాష్యం చ దశేమే స్వర్గయోనయః

సత్యము వినయము శాస్త్రజ్ఞానము విద్య, కులీనత్వము, శీలము, బలము ధనము శూరత్వము చమత్కారపూర్ణములగు మాటలు చెప్పుట — అను ఈ పదిన్ని స్వర్గమునకు హేతువులై యున్నవి

47 ప్రజ్ఞామేవాగమయతి యః ప్రాజ్ఞేభ్యః స పణ్డితః
ప్రాజ్ఞో హ్యవాప్య ధర్మార్థౌ శక్నోతి సుఖమేధితుమ్

బుద్ధిమంతుల నుండి సద్బుద్ధిని బడయువాడే పండితుడు ఏల యనిన బుద్ధిమంతుడే ధర్మమును, అర్థమును పొంది అనాయాసముగ తన ఉన్నతిని బడయుటలో సమర్థుడై యున్నాడు

48 దివసేనైవ తత్ కుర్యాద్ యేన రాత్రౌ సుఖం వసేత్
అష్టమాసేన తత్ కుర్యాద్ యేన వర్షాః సుఖం వసేత్

దేనిచే రాత్రి సుఖముగ నుండగల్గునో అట్టి కార్యమునే పగలంతయు చేయవలెను దేనిచే వర్షాకాలము నాలుగు నెలలు సుఖముగ గడపగల్గునో అట్టి కార్యమునే తక్కిన ఎనిమిది నెలలు చేయవలెను

49 పూర్వే వయసి తత్ కుర్యాద్ యేన వృద్ధః సుఖం వసేత్
యావజ్జీవేన తత్ కుర్యాద్ యేన ప్రేత్య సుఖం వసేత్

దేనిచే వార్ధక్యమున సుఖముగ నుండగల్గునో అట్టి కార్యమునే బాల్య యౌవనములందు చేయవలెను దేనిచే మరణించిన పిదపకూడ (పరలోకమున) సుఖముగ నుండగల్గునో అట్టి కార్యమునే జీవితమంతయు చేయవలెను

50 సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్

శూరుడు విద్వాంసుడు సేవాధర్మము నెరిగినవాడు— అను ఈ మూడు రకముల మనుష్యులు భూమియను తీగె నుండి సువర్ణమయ పుష్పములను ప్రోగుచేసికొనుచున్నారు

51 ఆక్రుశ్యమానో నాక్రోశేన్మన్యురేవ తితిక్షతః
ఆక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విన్దతి

ఇతరులు తన్ను తిట్టినది వినియు తాను వారిని తిట్టరాదు తిట్టును వినువాని యొక్క నిగ్రహింపబడిన క్రోధమే తిట్టిన వానిని దహించి వేయును మఱియు అతని పుణ్యమును గైకొనును

52 అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుః
సత్యం వదేద్ వ్యాహృతం తద్ ద్వితీయమ్
ప్రియం వదేద్ వ్యాహృతం తత్ తృతీయం
ధర్మం వదేద్ వ్యాహృతం తచ్చతుర్థమ్

మాట్లాడుట కంటె మాట్లాడకుండుటయే మంచిదని చెప్పబడినది ఇది వాక్కుయొక్క మొదటి విశేషత్వము ఒకవేళ మాట్లాడవలసి వచ్చినట్లయితే సత్యమును పలుకుట వాక్కుయొక్క రెండవ విశేషత్వము ఆ సత్యమునే ప్రియముగ పలుకుట వాక్కుయొక్క మూడవ విశేషత్వము సత్యప్రియములతో బాటు ధర్మసమ్మతముగ

చెప్పబడినచో అది వాక్కు యొక్క నాలుగవ విశేషత్వము (వీనియందు ఉత్తరోత్తర శ్రేష్ఠత్వముకలదు)

53 యతో యతో నివర్తతే తతస్తతో విముచ్యతే
నివర్తనాద్ధి సర్వతో న వేత్తి దుఃఖమణ్వపి

మనుజుడు ఏయే విషయములనుండి మనస్సును మరలించనో వానివానినుండి అతనికి ముక్తి కలుగుచుండును ఈ ప్రకారముగ అన్నివైపులనుండియు మనస్సుయొక్క నివృత్తి అయినచో అతనికి ఒకింత దుఃఖమైనను కలుగనేరదు

54 తృణాని భూమిరుదకం వాక్ చతుర్థీ చ సూనృతా
సతామేతాని గేహేషు నోచ్ఛిద్యన్తే కదాచన

తృణనిర్మిత ఆసనము భూమి జలము మధురవాక్కు—అను ఈ నాలుగింటియొక్క కొఱత సజ్జనుల గృహములందుండదు

55 సుఖం చ దుఃఖం చ భవాభవౌ చ
లాభాలాభౌ మరణం జీవితం చ
పర్యాయశః సర్వమేతే స్పృశన్తి
తస్మాద్ ధీరో న చ హృష్యేన్న శోచేత్

సుఖ దుఃఖములు ఉత్పత్తి వినాశములు లాభహానులు జీవన మరణములు—అనునవి క్రమముగ సర్వులకును కలుగుచునే యుండును కావున ధీరుడగువాడు వీని కొఱకై హర్ష శోకములను పొందరాదు

56 చలాని హీమాని షడిన్ద్రియాణి
తేషాం యద్ యద్ వర్ధతే యత్ర యత్ర
తతస్తతః స్రవతే బుద్ధిరస్య
ఛిద్రోదకుమ్భాదివ నిత్యమమ్భః

ఆఱు ఇంద్రియములు (పంచేంద్రియములు మనస్సు) మహా చంచలములైనవి ఏ ఇంద్రియము ఏయే విషయములపైకి పరుగిడునో అచటచట బుద్ధియు పగిలిన కుండనుండి నీరు కారిపోవునట్లు క్షీణించి పోవును

7 నాన్యత్ర విద్యా తపసోర్నాన్యత్రేన్ద్రియ నిగ్రహాత్
నాన్యత్ర లోభసంత్యాగాచ్ఛాన్తిం పశ్యామి తేఽనఘ

పాపరహితుడవగు రాజా! విద్య తపస్సు ఇంద్రియనిగ్రహము లోభత్యాగము—అను ఇవితప్ప మీకు శాంతి కలుగు ఉపాయములు మఱివేనిని నేను చూచుటలేదు

58 బుద్ధ్యా భయం ప్రణుదతి తపసా విన్దతే మహత్
గురు శుశ్రూషయా జ్ఞానం శాన్తిం యోగేన విన్దతి

బుద్ధిచే మనుజుడు భయమును పారద్రోలుచున్నాడు తపస్సుచే గొప్ప పదమును బడయుచున్నాడు గురు శుశ్రూషచే జ్ఞానమును పొందుచున్నాడు యోగముచే శాంతిని బడయుచున్నాడు

59 న మనుష్యే గుణః కశ్చిద్ రాజన్ స ధనతామృతే
అనాతురత్వాద్ భద్రం తే మృతకల్పా హి రోగిణః

రాజా! మీకు శుభమగుగాక! మనుజుడు ధనము ఆరోగ్యము —లను వీనిని విడిచి వేఱొక గుణమేదియును లేదు రోగి శవముతో సమానమైనవాడే యగును

60 అవ్యాధిజం కటుకం శీర్షరోగి
పాపానుబన్ధం పరుషం తీక్ష్ణముష్ణమ్
సతాం పేయం యన్న పిబన్త్యసన్తో
మన్యుం మహారాజ పిబ ప్రశామ్య

మహారాజా! రోగము లేకుండగనే ఉత్పన్నమగునదియు, కటువైనదియు నెత్తిపై దురదను కలుగజేయునదియు, పాపముతో కూడి

నదియు, ఘోరమైనదియు తీక్ష్ణమైనదియు తాపముతో కూడినదియగు సజ్జనులు త్రాగివేయునదియు (వారిచే పోగొట్టుకొనబడునదియు) దుర్జనులు త్రాగజాలనిదియునగు క్రోధమను మీరు త్రాగివేసి (పోగొట్టుకొని) శాంతిని పొందుడు

61 జరా రూపం హరతి హి ధైర్యమాశా
మృత్యుః ప్రాణాన్ ధర్మచర్యామసూయా
కామో హ్రియం వృత్తమనార్యసేవా
క్రోధః శ్రియం సర్వమేవాభిమానః

వార్ధక్యము రూపమును హరించును ఆశ ధైర్యమును నశింపజేయును మృత్యువు ప్రాణములను నశింపజేయును ఇతరుల గుణములందు దోషమును చూచుట ధర్మాచరణమును నశింపజేయును కామము లజ్జను నశింపజేయును నీచులను సేవించుట సదాచారమును నశింపజేయును క్రోధము సంపదను నశింపజేయును అభిమానము సర్వస్వమును నశింపజేయును

62 అతిమానోఽతివాదశ్చ తథాత్యాగో నరాధిప
క్రోధశ్చాత్మవిధిత్సా చ మిత్రద్రోహశ్చ తాని షట్

63 ఏత ఏవాసయస్తీక్ష్ణాః కృన్తన్త్యాయూంషి దేహినామ్
ఏతాని మానవాన్ ఘ్నన్తి న మృత్యుర్భద్రమస్తుతే

రాజా! మీకు శుభము కలుగుగాక! ఎక్కువ అభిమానము ఎక్కువగ మాట్లాడుట త్యాగములేమి క్రోధము తన పొట్టనుమాత్రము నింపుకొనుట చింత మిత్రద్రోహము—అను ఈ ఆరు తీక్ష్ణ ఖడ్గములు దేహధారుల ఆయుష్షును నరికివేయుచున్నవి ఇవివే మనుజలను వధించుచున్నవి మృత్యువుకాదు

64 గృహీతవాక్యో నయవిద్ వదాన్యః
శేషాన్నభోక్తా హ్యవిహింసకశ్చ

హానర్థ కృత్యాకులితః కృతజ్ఞః
సత్యో మృదుః స్వర్గముపైతి విద్వాన్

పెద్దల ఆజ్ఞను పాలించువాడు యజ్ఞశేషమగు అన్నమును భుజించువాడు హింసారహితుడు అనర్థకరములగు కార్యములను చేయనివాడు కృతజ్ఞుడు సత్యవాది కోమల స్వభావము కలవాడు అగు బుద్ధిమంతుడు స్వర్గగామి యగును

65 సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః

రాజా! సదా ప్రియవచనములను పలుకువాడు సులభముగ దొరకగలడు కాని అప్రియములైనను హితమును కలుగజేయు వాక్యములను చెప్పువాడు వినువాడు మహా దుర్లభులు

66 త్యజేత్ కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్

కులమును రక్షించుటకై ఒక మనుష్యుని గ్రామమును రక్షించుటకై కులమును దేశమును రక్షించుటకై గ్రామమును, ఆత్మ యొక్క శ్రేయము కొఱకై భూతలమంతను త్యజించవలెను

67 గుణాశ్చ షణ్మితభుక్తం భజన్తే
ఆరోగ్యమాయుశ్చ బలం సుఖం చ
అనావిలం చాస్య భవత్యపత్యం
న చైనమాద్యూన ఇతి క్షిపన్తి

మితభోజనము చేయువానికి ఈ ఆరు గుణములు కలుగును— ఆరోగ్యము ఆయువు, బలము సుఖము, ఉత్తమ సంతానము, ఆక్షేప రాహిత్యము (ఇతడు అధికముగ తినును—అను జనుల ఆక్షేపము లేకుండుట)

68 హితం యత్ సర్వభూతానామాత్మనశ్చ సుఖావహమ్
తత్ కుర్యాదీశ్వరే హ్యేతన్మూలం సర్వార్థ సిద్ధయే

సమస్త ప్రాణులకును హితకరమైనదియు తనకు సుఖప్రదమైనదియు అగు కార్యమును ఈశ్వరార్పణ బుద్ధితో చేయుట—అను నది సమస్త సిద్ధులకును మూలమంత్రమైయున్నది

69 వృద్ధిః ప్రభావస్తేజశ్చ సత్త్వముత్థానమేవ చ
వ్యవసాయశ్చ యస్య స్యాత్ తస్యావృత్తిభయం కుతః

ఎవనియందు వృద్ధి ప్రభావము తేజము పరాక్రమము, ప్రయత్నము కర్తవ్య నిశ్చయము—ఉండునో, అట్టివానికిక జీవిక (బ్రతుకు తెరువు) పోవునను భయమెట్లుండగలదు?

70 అర్థసిద్ధిం పరామిచ్ఛన్ ధర్మమేవాదితశ్చరేత్
న హి ధర్మాదపైత్యర్థః స్వర్గలోకాదివామృతమ్

అర్థము యొక్క పూర్ణసిద్ధిని పొందదలచువాడు మొదట ధర్మమునే ఆచరించవలెను స్వర్గమునుండి అమృతము దూరముగ నుండనట్లు, ధర్మమునుండి అర్థము వేఱుగనుండదు

71 సంనియచ్ఛతి యో వేగముత్థితం క్రోధహర్షయోః
స శ్రియో భాజనం రాజన్ యశ్చాపత్సు న ముహ్యతి

ఎవడు క్రోధ హర్షములయొక్క వేగమును నిరోధించునో, ఆపత్తునందును మోహమును పొందడో అట్టివాడే రాజలక్ష్మియొక్క అధికారి కాగల్గును

72 ధృతిః శమో దమః శౌచం కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధః శ్రియః

ధైర్యము మనో నిగ్రహము ఇంద్రియ నిగ్రహము పవిత్రత దయ కోమల వాక్కు, మిత్రద్రోహరాహిత్యము—అను ఈ ఏడును ఐశ్వర్యమును సంపదను అభివృద్ధి పఱచును

73 యేన ఖట్వాం సమారూఢః పరితప్యేత కర్మణా
అదావేవ న తత్ కుర్యాదధ్రువే జీవితే సతి

ఈ జీవితము క్షణికమైనది కాబట్టి ఏ కార్యమునుచేసినచో చివరకు మంచముపై కూర్చొని పశ్చాత్తాపపడవలసి వచ్చునో దానిని మొదట చేయరాదు

74 అకీర్తిం వినయో హన్తి హన్త్యనర్థం పరాక్రమః
హన్తి నిత్యం క్షమా క్రోధమాచారో హన్త్యలక్షణమ్

వినయము అపకీర్తిని నశింపజేయును పరాక్రమము అనర్థమును తొలగించును క్షమ క్రోధమును సదానశింపజేయును సదాచారము చెడ్డలక్షణములను తొలగించును

75 మార్దవం సర్వభూతానామనసూయా క్షమా ధృతిః
ఆయుష్యాణి బుధాః ప్రాహుర్మిత్రాణాం చావిమాననా

సమస్త ప్రాణికోట్ల యెడల కోమల భావము కలిగియుండుట, గుణములందు దోషము చూడకుండుట, క్షమ ధైర్యము, మిత్రులను అవమానించకుండుట—అను ఈ సద్గుణములు ఆయుస్సును అభివృద్ధి చేయునని విద్వాంసులు చెప్పుదురు

76 అనిర్వేదః శ్రియో మూలం లాభస్య చ శుభస్య చ
మహాన్ భవత్యనిర్విణ్ణః సుఖం చానన్త్య మశ్నుతే

ప్రయత్నమందు నిమగ్నుడగుట దానినుండి విరక్తుడు కాకుండుట, ధనము, లాభము, శ్రేయస్సులకు మూలమైయున్నది కాబట్టి ప్రయత్నము వదలనివాడు గొప్పవాడగును మరియు అనంత సుఖమును పొందును

77 కాన్తారే వనదుర్గేషు కృచ్ఛ్రాస్వాపత్సు సమ్భ్రమే
ఉద్యతేషు చ శస్త్రేషు నాస్తి సత్త్వవతాం భయమ్

ఘోరారణ్యమందు దుర్గమమైన మార్గమందు గొప్ప ఆపత్తు నందు సంభ్రమమునందు ప్రహారము కొరకై శస్త్రము ఎత్తబడి నప్పటికిని సత్త్వగుణ సంపన్నులకు అనగా ఆత్మబలము కలవారికి భయము ఉండదు

78 ఉత్థానం సంయమో దాక్ష్యమప్రమాదో ధృతిః స్మృతిః
సమీక్ష్య చ సమారమ్భో విద్ధి మూలం భవస్య తు

ప్రయత్నము, సంయమము దక్షత్వము జాగ్రతగనుండుట ధైర్యము స్మృతి ఆలోచించి కార్యములను చేయుట —అను వీనిని ఉన్నతికి మూలమంత్రమని యెఱుగుము

79 న తత్పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః
సంగ్రహేణైష ధర్మః స్యాత్ కామాదన్యః ప్రవర్తతే

ఏది తనకు ప్రతికూలముగనుండునో దానిని ఇతరులయెడల కూడ చేయరాదు — ఇదియే సంక్షేపముగ ధర్మము యొక్క స్వరూపమైయున్నది అట్లుకాక ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించి ఒకరికి బాధ కలుగజేయుట అధర్మము

80 అక్రోధేన జయేత్ క్రోధమసాధుం సాధునా జయేత్
జయేత్ కదర్యం దానేన జయేత్ సత్యేన చానృతమ్

అక్రోధముచే క్రోధము జయించవలెను అసాధుత్వమును సద్వ్యవహారముచే వశమొనర్చుకొనవలెను పిసినిగొట్టుతనమును దానముచే జయించవలెను అసత్యముపై సత్యముచే విజయము పొందవలెను

81 అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః
చత్వారి సమ్ప్రవర్ధన్తే కీర్తిరాయుర్యశో బలమ్

సదా పరజనులకు ప్రణమిల్లువాడు వృద్ధుల సేవయందు తత్పరుడై యుండువాడు అగు వానికి కీర్తి ఆయుస్సు యశస్సు బలము వృద్ధి నొందును

82 సహస్రిణోఽపి జీవన్తి జీవన్తి శతినస్తథా
ధృతరాష్ట్ర విముఞ్చేచ్ఛాం న కథంచిన్న జీవ్యతే

రాజా! వేయి (రూపాయలు) కలవారు జీవించుచున్నారు నూరు కలవారున్ను జీవించుచున్నారు కాబట్టి అధికముగ సంపాదింపవలెనను లోభమును విడిచిపెట్టుము అట్లు విడుచుటచే జీవితము నిలువకపోదు

83 యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః
నాలమేకస్య తత్ సర్వమితి పశ్యన్ న ముహ్యతి

ఈ ప్రపంచమున ధాన్యము బంగారము పశువులు స్త్రీలు— అనునవి యెన్ని కలవో, అవి యన్నియు ఒక్క మనుజునికైనను చాలవు (వానిచే అతడు తృప్తి పడడు) — అని ఈ ప్రకారము ఆలోచించువాడు మోహమునందు పడడు

84 ఆలస్యం మదమోహౌ చ చాపలం గోష్ఠిరేవ చ
స్తబ్ధతా చాభిమానిత్వం తథాత్యాగిత్వమేవ చ
ఏతే వై సప్త దోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః

సోమరితనము మద మోహములు చంచలత్వము, వ్యర్థ సంభాషణము స్తబ్ధత్వము అభిమానము స్వార్థత్యాగము లేమి—అను ఈ ఏడును విద్యార్థులకు సదాదోషములని ఎంచబడినవి

85 సుఖార్థినః కుతోవిద్యా నాస్తి విద్యార్థినః సుఖమ్
సుఖార్థీ వా త్యజేద్ విద్యాం విద్యార్థీ వాత్యజేత్ సుఖమ్

సుఖమును కోరువానికి విద్య ఎచట? విద్యకోరువానికి సుఖమెచట? సుఖమును కోరుచో విద్యను త్యజించవలెను విద్యను కోరుచో సుఖమును త్యజించవలెను

89 మృతం పుత్రం దుఃఖపుష్టం మనుష్యా
ఉత్క్షిప్య రాజన్ స్వగృహాన్నిర్హరన్తి
తం ముక్తకేశాః కరుణం రుదన్తి
చితామధ్యే కాష్ఠమివ క్షిపన్తి

ఎవనిని చాల కష్టముతో పోషించిరో, అట్టి పుత్రుడు మరణించిన వెనుక అతనినే వెంటనే లేపి తమ ఇంటినుండి బయటకు చేర్చివేయుచున్నారు మొదట అతని కొరకు జుట్టు విరబోసికొని కరుణాభరస్వరముతో ఏడ్చుచున్నారు పిదప సామాన్యమైన కట్టెవలె అతనిని మండుచున్న చితిపై త్రోసివేయుచున్నారు

90 అన్యో ధనం ప్రేతగతస్య భుఙ్క్తే
వయాంసి చాగ్నిశ్చ శరీరధాతూన్
ద్వాభ్యామయం సహ గచ్ఛత్యముత్ర
పుణ్యేన పాపేన చ వేష్ట్యమానః

మరణించినవాని ధనమును ఇతరులు అనుభవించుచున్నారు అతని శరీరము యొక్క మాంసాదులను పక్షులు తినివేయుచున్నవి లేక అగ్ని కాల్చివేయుచున్నది అతడు పుణ్యపాపములచే బంధింపబడి ఆ రెండిటితో గూడ పరలోకమునకేగుచున్నాడు

91 అగ్నౌ ప్రాస్తం తు పురుషం కర్మాన్వేతి స్వయంకృతమ్
తస్మాత్ తు పురుషో యత్నాద్ ధర్మం సంచినుయాచ్ఛనైః

అగ్నియందు వేయబడిన ఆ మనుజుని వెంట అతడు చేసిన సత్కర్మ దుష్కర్మలే పోవుచున్నవి కాబట్టి మనుజుడు మెల్లమెల్లగ ప్రయత్నపూర్వకముగ ధర్మమునే సంగ్రహించవలెను

92 ఆత్మా నదీ భారత పుణ్యతీర్థా
సత్యోదకా ధృతికూలా దయోర్మిః
అస్యాం స్నాతః పూయతే పుణ్యకర్మా
పుణ్యో హ్యాత్మా నిత్యమలోభ ఎవ

జీవుడు ఒకనది అందు పుణ్యమే జలము సత్యస్వరూపుడగు పరమాత్మనుండి అది బయలుదేరినది ధైర్యమే దీని ఒడ్డు దయ దీని తరంగములు పుణ్యకర్ములు చేయుమనుజుడు దీనియందు స్నానముచేసి పవిత్రుడగును ఏలయనిన లోభరహితమగు ఆత్మ సదాపవిత్రమే అయియున్నది

93 కామక్రోధగ్రాహవతీం పఞ్చేన్ద్రియజలాం నదీమ్
నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర

కామక్రోధాదులను మొసళ్ళతో నిండియున్నదియు పంచేంద్రియములను జలముచే పూర్ణమైనదియునగు ఈ సంసారమను నది యొక్క జనన మరణరూప దుర్గమప్రవాహమును ధైర్యమనునావను నిర్మించుకొని దాటివేయుము

94 ధృత్యా శిశ్నోదరం రక్షేత్ పాణిపాదం చ చక్షుషా
చక్షుః శ్రోత్రే చ మనసా మనో వాచం చ కర్మణా

గుహ్యేంద్రియమును ఉదరమును జాగ్రతగ రక్షించవలెను అనగా కామవేగమును ఆకలి బాధలను ధైర్యముగ అరికట్టవలెను అట్లే చేతులను కాళ్ళను నేత్రములచేతను నేత్రశ్రోత్రములను మనస్సుచేతను మనస్సు వాక్కులను సత్కర్మలచే రక్షించవలెను

95 ధృతరాష్ట్ర కుమారో వై యః పురాణః సనాతనః
సనత్సుజాతః ప్రోవాచ మృత్యుర్నాస్తీతి భారత

ధృతరాష్ట్రా! సనత్సుజాతుడను బ్రహ్మకుమారుడు పరమ ప్రాచీన సనాతనఋషి అతడు మృత్యువు లేనేలేదు అని చెప్పెను

అపుడు విదురుడు సనత్సుజాతుని స్మరింపగా ఆ మహనీయుడు ప్రత్యక్షమయ్యెను అంతట ధృతరాష్ట్రుడు మృత్యువును గూర్చి దానిని జయించుటనుగూర్చి ప్రశ్నింపగా సనత్సుజాతుడాతనికిట్లు బోధించెను—

సనత్సుజాత ఉవాచ

96 అమృత్యుః కర్మణా కేచిన్మృత్యుర్నాస్తీతి చాపరే
శృణు మే బ్రువతో రాజన్ యథైతన్మా విశఙ్కిథా

97 ఉభే సత్యే క్షత్రియైతస్య విద్ధి
మోహాన్మృత్యుః సమ్మతోఽయం కవీనామ్
ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి
తథా ప్రమాదమమృతత్వం బ్రవీమి

(సనత్సుజాతుడు ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను)

మృత్యువుకలదు బ్రహ్మచర్యపాలనరూప కర్మచే మృత్యువు తొలగును—అను ఈ రెండు విషయముల సత్యములేయని నమ్ముము కొందఱు విద్వాంసులు మోహవశమున ఈ మృత్యువు యొక్క సత్తను అంగీకరించిరి కాని నేను చెప్పునది—యేమనగా ప్రమత్తతయే (సోమరితనమె) మృత్యువు అప్రమత్తయే అమృతము

98 ప్రమాదాద్ వై అసురాః పరాభవ
న్నప్రమాదాద్ బ్రహ్మభూతాః సురాశ్చ
నైవ మృత్యుర్వ్యాఘ్ర ఇవాత్తి జన్తూన్
న హ్యస్య రూపముపలభ్యతే హి

ప్రమత్తత వలననే అసురులు (అసుర గుణములు కలవారు) మృత్యువుచే ఓడిపోయిరి అప్రమత్తత వలన దేవతలు (దైవీ గుణములు కలవారు) బ్రహ్మస్వరూపులైరి మృత్యువు పెద్దపులివలె ప్రాణులను తినివేయుటలేదని నిశ్చయము ఏలయన దానికి ఏరూపమున్ను గోచరించుటలేదు

99 యమం త్వేకే మృత్యుమతోఽన్యమాహు
రాత్మావసన్నమమృతం బ్రహ్మచర్యమ్
పితృలోకే రాజ్యమనుశాస్తి దేవ
శివః శివానామ శివోఽశివానామ్

కొందఱు యముని మృత్యువు అని చెప్పదురు మఱియు హృదయముచే దృఢముగ పాలింపబడిన బ్రహ్మచర్యమును అమృత మని తలంచుదురు యముడు ఎత్రలో మున రాజ్యశాసనము చేయు చున్నాడు అతడు పుణ్యాత్ములకు మంగళమయుడును పాపులకు అమంగళమయుడును అయియున్నాడు

100 అస్యాదేశాన్నిఃసరతే నరాణాం
క్రోధః ప్రమాదో లోభరూపశ్చ మృత్యుః
అహంగతేనైవ చరణ్ విమార్గా
న చాత్మనో యోగముపైతి కశ్చిత్

ఈ యముని ఆజ్ఞచేతనే క్రోధ ప్రమత్తతా లోభరూప మృత్యువు మనుజుల వినాశమునకు ప్రవృత్తమగుచున్నది అహం కారమునకు వశుడై విపరీతమార్గమునపోవు ఎవడున్ను పరమాత్మ సాక్షాత్కారమును పొందలేడు

101 తే మోహితాస్తద్వశే వర్తమానా
ఇతః ప్రేతాస్తత్ర పునః పతన్తి
తతస్తాన్ దేవా అనువిప్లవన్తే
అతో మృత్యుర్మరణాఖ్యముపైతి

మనుజులు క్రోధ ప్రమత్తతా లోభములచే మోహితులై అహంకారమునకు అధీనులై ఈ లోకమునుండి వెడలి మరల మరల జనన మరణమను చక్రమందు పడుచున్నారు మరణించిన తరువాత వారి మనస్సు ఇంద్రియములు, ప్రాణమున్ను వెంటపోవుచున్నవి శరీరమునుండి ప్రాణరూపము లగు ఇంద్రియముల యొక్క వియోగ మగుటచే అది మృత్యువను పేరును పొందుచున్నది

102 కర్మోదయే కర్మఫలానురాగా
స్తత్రానుయాన్తి న తరన్తి మృత్యుమ్

ఏదర్థ యోగానవగమాత్ సమన్తాత్
ప్రవర్తతే భోగయోగేన దేహీ

ప్రారబ్ధకర్మ ముదయింప కర్మఫలమందు ఆసక్తికల జనులు దేహత్యాగానంతరము పరలోకమునకు అనుగమన మొనర్చుచున్నారు కనుక వారు మృత్యువును దాటలేకపోవుచున్నారు దేహాభిమానియగు జీవుడు పరమాత్మ సాక్షాత్కారము యొక్క ఉపాయమును తెలిసికొనక పోవుటచే విషయముల యొక్క ఉపభోగమువలన అన్నివైపుల (నానావిధ జన్మలందు) తిరుగాడుచున్నాడు

103 తద్ వై మహామోహనమిన్ద్రియాణాం
మిథ్యార్థ యోగస్య గతిర్హి నిత్యా
మిథ్యార్థ యోగాభిహతాన్తరాత్మా
స్మరన్నుపాస్తే విషయాన్ సమన్తాత్

ఈ ప్రకారము విషయముల భోగము అవశ్యము ఇంద్రియములను మహామోహమందు పడవేయునదై యున్నది ఈ అసత్య విషయములందు రాగము కలిగియుండు మనుజునకు వానివైపు ప్రవృత్తి కలిగియుండుట స్వాభావికమై యున్నది మిథ్యాభోగములందు ఆసక్తి కలిగియుండుటచే అంతఃకరణము యొక్క జ్ఞానశక్తి నశించినవాడు అన్ని వైపుల విషయములనే చింతన చేయుచు మనస్సునందు వానిని ఆస్వాదించుచుండును

104 అభిధ్యా వై ప్రథమం హన్తి లోకాన్
కామక్రోధావనుగృహ్యాశు పశ్చాత్
ఏతే బాలాన్ మృత్యవే ప్రాపయన్తి
ధీరాస్తు ధైర్యేణ తరన్తి మృత్యుమ్

మొదట విషయచింతనమే మనుజులను చంపివేయుచున్నది తదుపరి అది కామక్రోధములను వెంట నిడుకొని తిరిగి శీఘ్రముగ

ప్రహారము సలుపుచున్నది ఈ ప్రకారముగ ఆ విషయచింతనమే వివేకహీనులను మృత్యుసమీపమునకు చేర్చుచున్నది కాని స్థిర బుద్ధి కలవారు ధైర్యముచే మృత్యువును దాటి వేయుచున్నారు

105 సోఽభిధ్యాయన్నుత్పతితాన్ నిహన్యా
దనాదరేణా ప్రతి బుధ్యమానః
నైనం మృత్యుర్మృత్యురివాత్తి భూత్వా
ఏవం విద్వాన్ యో వినిహన్తి కామాన్

కాబట్టి మృత్యువును జయింపదలంచువాడు పరమాత్మను ధ్యానించి విషయములను తుచ్ఛముగ భావించి వానిని లక్ష్య పెట్టక వానిని సంబంధించిన కామనలను ఉత్పన్నమైన వెంటనే నశింపజేయవలెను ఈ ప్రకారముగ ఏ విద్వాంసుడు విషయేచ్ఛను నిర్మూలించుచున్నాడో అతనిని మృత్యువు బాధింపదు (అతడు జనన మరణముల నుండి విముక్తుడగును)

106 కామానుసారీ పురుషః కామానను వినశ్యతి
కామాన్ వ్యుదస్య ధునుతే యత్ కించిత్ పురుషో రజః

కామనల (కోరికల) వెంట పరుగిడువాడు వానితో బాటు నాశ మొందుచున్నాడు కాని జ్ఞానివానిని త్యజించి జననమరణ రూప దుఃఖమునంతను నశింపచేసికొనుచున్నాడు

107 తమోఽప్రకాశో భూతానాం నరకోఽయం ప్రదృశ్యతే
ముహ్యన్త ఇవ ధావన్తి గచ్ఛన్తః శ్వభ్రవత్ సుఖమ్

కామమే సమస్త ప్రాణులకును మోహాత్మకమై యుండుటవలన తమోమయము అజ్ఞానరూపము అయియున్నది మఱియు నరకము వలె దుఃఖప్రదమై యున్నది మద్యపానముచే మోహాతురుడైనవాడు నడచుచు నడమచు గోతివైపు పరుగిడునట్లు కామియగువాడు భోగములందు సుఖముకలదని యెంచి వానివెంట పరుగిడుచున్నాడు

**108** అమూఢవృత్తేః పురుష స్యేహ కుర్యాత్
కిం వై మృత్యుస్తార్ణ ఇవాస్య వ్యాఘ్రః
అహ్యస్యమానః క్షత్రియ కించిదన్య-
న్నాదీయాత నిర్ణుదన్నివాస్య చ యుః

ఎవని చిత్తవృత్తులు విషయభోగములందు ప్రవేశింపక, మోహము నొందకయుండునో, అట్టి జ్ఞానిని ఈ రకమున తృణ నిర్మిత వ్యాఘ్రమువలె మృత్యువు ఏమి బాధింపగలదు? కాబట్టి ఓ రాజా! విషయభోగములు మూల కారణమైన అజ్ఞానము నశింప జేయు ఉద్దేశ్యముతో సాంసారిక పదార్థమును దేనిని ఏమాత్రము లెక్క చేయక, దాని యొక్క చింతను వదలి వేయవలెను

**109** స క్రోధలోభౌ మోహవానన్తరాత్మా
స వై మృత్యుస్త్వ చ్ఛరీరే య ఏషః
ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానే తిష్ఠన్ న బిభేతీహ మృత్యోః
వినశ్యతి విషయే తస్య మృత్యు
ర్మృత్యోర్యథా విషయం ప్రాప్య మర్త్యః

ఈ శరీరము లోపల ఏ అంతరాత్మ కలదో, అది మోహముచే వశీభూతమై క్రోధ లోభ మృత్యురూపమును పొందుచున్నది ఈ ప్రకారం మోహముచే కలుగు మృత్యుస్వరూపమును తెలిసికొని ఎవడు మోహమును త్యజించి జ్ఞాననిష్ఠుడగుచున్నాడో, అట్టివాడిక ఈ లోకమున మృత్యువుచే ఎన్నడును భయపడనేరడు అతని సమీపమునకు వచ్చి మృత్యువు — మృత్యువు యొక్క అధికారమందు వచ్చి నశించు మనుజునివలె — నశించిపోవుచున్నది

**110** ఏవం హ్యావిద్వానుపయాతి అత్ర
తత్రార్థజాతం చ వదన్తి వేదాః

అనీహా ఆయాతి పరం పరాత్మా
।పయాతి మార్గేణ నిహత్య మారాన్

అజ్ఞాని భిన్న భిన్నలోకములందు తిరుగాడుచున్నాడు వేదకర్మ లకు అనేక ప్రయోజనములున్న చెప్పబడుచున్నవి కాని నిష్కామ మనుజుడు జ్ఞానమార్గము ద్వారా ఇతర మార్గములన్నిటిని తొలగించి పరమాత్మ స్వరూపుడే యగుచున్నాడు

111 దోషో మహానత్ర విభేదయోగే
హ్యనాదియోగేన భవన్తి నిత్యాః
తథాస్య నాధిక్యముపైతి కించి -
దనాదియోగేన భవన్తి పుంసః

జీవబ్రహ్మములకు భేదము లేదు వారి యొక్క భేదమును అంగీకరించినచో వేదవిరోధరూపమగు గొప్ప దోషము సంభవిం చును అనాది మాయ యొక్క సంబంధముచే జీవులకు కామ సుఖా దులచే సంబంధము కలుగుచున్నది అట్లున్నను జీవుని మహత్తు నశించుటలేదు పలయనిన మాయయొక్క సంబంధముచే జీవులకు దేహాదులుత్పన్నములగుచున్నవి

112 ఉభయమేవ తత్రోప యుజ్యతే పలం ధర్మస్యైవేతరస్య చ

ధర్మము పాపము అను ఈ రెండిటికి వేరు వేరు ఫలములు కలుగుచున్నవి వానిని చేయువారు ఆయా ఫలములను అనుభవించ వలసియున్నది

113 తస్మిన్ స్థితో వాప్యుభయం హా నిత్యం
జ్ఞానేన విద్వాన్ ప్రతిహాన్తి సిద్ధమ్
తథాన్యథా పుణ్యముపైతి దేహీ
తథాగతం పాపముపైతి సిద్ధమ్

పరమాత్మయందు స్థితుడైన ఎదప జ్ఞాని పరమాత్మ జ్ఞానముచే తన పూర్వకృత పుణ్యాపాపముల రెండిటిని నశింపజేయుచున్నాడు — అను ఈ విషయము సదా ప్రసిద్ధమై యున్నది ఇట్టి స్థితి కలుగనిచో దేహాభిమానియగువాడు ఒకపుడు పుణ్యాఫలమును పొందుచున్నాడు మఱియొకపుడు పాపఫలితమును పొందుచున్నాడు

114 గత్వోభయం కర్మణా యుజ్యతేఽస్థిరం
శుభ స్య పాపస్య స చాపి కర్మణా
ధర్మేణ పాపం ప్రణుదతీహ విద్వాన్
ధర్మో బలీయానితి తస్య సిద్ధిః

దేహాభిమాని పుణ్య పాపముల యొక్క స్వర్గనరకరూపములగు రెండు అస్థిరఫలములను అనుభవించి తిరిగి జన్మించి తదనుసారమైన కర్మలందు నిమగ్నుడగుచున్నాడు కాని కర్మల యొక్క తత్త్వమును తెలిసినవాడు నిష్కామ ధర్మరూప కర్మద్వారా తన పూర్వపాపమును ఇచటనే నశింప చేసికొనుచున్నాడు ఈ ప్రకారముగ ధర్మమే మహా శక్తివంతమైనది కాబట్టి నిష్కామభావముతో ధర్మాచరణ చేయువారికి సమయానుసారము సిద్ధి అవశ్యము సంభవించును

115 యేషాం వ్రతేఽథ విస్పర్ధా బలే బలవతామివ
తే బ్రాహ్మణా ఇతః ప్రేత్య బ్రహ్మలోక ప్రకాశకాః

బలవంతులగు ఇద్దఱు వీరులలో తమ బలమును వృద్ధి చేసికొనుట కొఱకై ఒకనికి మఱియొకనితో స్పర్ధయుండునట్లు నిష్కామ భావముతో యమనియమాదుల పాలనమందు ఎవరు మఱియొకరిని అధిగమించుటకు ప్రయత్నము సలుపుదురో అట్టి బ్రహ్మనిష్ఠులు మరణానంతరము బ్రహ్మలోకమున తమ ప్రకాశమును వ్యాపింప జేయుదురు

116 కో వ్యాస న్తరమాత్మానం బ్రాహ్మణో వాస్తుమర్హతి
నిర్లిఙ్గమచలం శుద్ధం సర్వద్వైతవివర్జితమ్

భేదశూన్యమై, చిహ్నరహితమై, అచంచలమై, శుద్ధమై ద్వైతవర్జితమైనట్టి ఆత్మ యొక్క స్వరూపమును తెలిసికొను ఏ బ్రహ్మవేత్త మాయాజనిత అధఃపతనమును కోరును ?

117 యోఽన్యథా సన్తమాత్మానమన్యథా ప్రతిపద్యతే
కిం తేన న కృతం పాపం చౌరేణాత్మాపహారిణా

ఆత్మ శాశ్వతముగ నిర్వికారముగ నుండ దానిని మఱియొక విధముగ ప్రతిపాదించువాడు ఆత్మను అపహరించు దొంగయే యగును అట్టివాడు ఏ పాపము చేయకున్నాడు ?

118 అశ్రాన్తః స్యాదనాదాతా సమ్మతో నిరుపద్రవః
శిష్టో న శిష్టవత్ స స్యాద్ బ్రాహ్మణో బ్రహ్మవిత్ కవిః

కర్తవ్యపాలనమందు అలసిపోనివాడు దానమును పరిగ్రహించనివాడు సజ్జనులందు సమ్మానింపబడువాడు ఉపద్రవరహితుడు, శిష్టుడైనను తన శిష్టత్వమును వెల్లడి చేసికొననివాడునగు మహనీయుడే బ్రహ్మవేత్తయు, విద్వాంసుడు నగును

119 అనాఢ్యా మానుషే విత్తే ఆఢ్యా దైవే తథా క్రతౌ
తే దుర్ధర్షా దుష్ప్రకమ్ప్యాస్తాన్ విద్యాద్ బ్రహ్మణస్తనుమ్

లౌకికధనము యొక్క దృష్టితో నిర్ధనుడైనను దైవీసంపత్తి యజ్ఞోపాసన మున్నగువానితో కూడినవాడు దుర్ధర్షుడు (తిరస్కరింపదగనివాడు) అతడు ఏ విషయమందును చలింపడు అట్టివానిని సాక్షాత్ బ్రహ్మము యొక్క మూర్తియనియే నమ్మవలెను

120 యమప్రయతమానం తు మానయన్తి స మానితః
న మాన్యమానో మన్యేత న మాన్యమభిసంజ్వరేత్

ఇతరులచే సమ్మానితుడైనను అభిమానము లేనివాడును సమ్మాననీయుని చూచియు బాధపడని వాడును, ప్రయత్నించకున్నను విద్వాంసులు ఎవనిని ఆదరించుదురో అట్టివాడును అగువాడే వాస్తవముగ సమ్మానితుడగును

121 శ్రీః సుఖస్యేహ సంవాసః సా చాఽపరిపన్థినీ
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ

లోకమున ఐశ్వర్యము సుఖము యొక్క స్థానమని అందురు కాని అది యీ శ్రేయఃపథమున శత్రువువలె విఘ్నము కలుగజేయునదై యున్నది బ్రహ్మజ్ఞానమయమగు ఐశ్వర్యము ప్రజ్ఞాహీనునకు సర్వదా మహా దుర్లభమై యున్నది

122 ద్వారాణి తస్యేహ వదన్తి సన్తో
బహుప్రకారాణి దురాధరాణి
సత్యార్జవే హ్రీర్దమశౌచవిద్యాః
యథా న మోహప్రతిబోధనాని

అట్టి బ్రహ్మజ్ఞానమయమగు ఐశ్వర్యమును బడయుటకు మహాత్ములు పెక్కు మార్గములను చెప్పుచున్నారు అవి మోహమును లేపునవి కానివియు అధిక ప్రయత్నముచే పొందదగినవియు అయియున్నవి అవి — సత్యము సరళత్వము లజ్జ, దమము, శౌచము, విద్య — అయియున్నవి

123 యతో న వేదా మనసా సహైన-
మనుప్రవిశన్తి తతోఽథమౌనమ్
యత్రోత్థితో వేదశబ్దస్తథాయం
స తన్మయత్వేన విభాతి రాజన్

ఎచటికి మనస్సహితముగ వాక్కు, వేదములు చేరలేవో అట్టి పరమాత్మయొక్క పేరే మౌనము కాబట్టి ఆ పరమాత్మయే మౌన

స్వరూపుడు లౌకిక వైదిక శబ్దములయొక్క ప్రాదుర్భావము ఎచట నుండి సంభవించినదో అట్టి పరమేశ్వరుడు తన్మయత్వ పూర్వకముగ ధ్యానముచేయుటచే ప్రత్యక్షమగుచున్నాడు

124 నైనం సామాన్యృచో వాఽ న యజూంష్య విచక్షణమ్
త్రాయన్తే కర్మణః పాపాన్నతే మిథ్యా బ్రవీమ్యహమ్

రాజా! నేను మీతో అసత్యము చెప్పుటలేదు ఋక్, యజుస్సామ వేదము లెవ్వియు పాపముచేయు అజ్ఞానిని అతని పాపకర్మ నుండి రక్షించలేవు

125 నచ్ఛన్దాంసి వృజినాత్ తారయన్తి
మాయావినం మాయయా వర్తమానమ్
నీడం శకున్తా ఇవ జాతపక్షా-
శ్ఛన్దాంస్యేనం ప్రజహత్యన్తకాలే

ఎవడు కపట పూర్వకమగు ఆచరణ కలిగియుండునో అట్టి మిథ్యాచారిని వేదములు పాపమునుండి ఉద్ధరింపవు రెక్కలురాగానే పక్షులు గూటిని వదలివేయునటు అంత్యకాలమున వేదములున్ను అట్టి వానిని వదలివేయును

126 తస్మైవ నామాదివిశేషరూపై
రిదం జగత్ భాతి మహానుభావ
నిర్దిశ్య సమ్యక్ ప్రవదన్తి వేదా-
స్తద్ విశ్వవైరూప్యముదాహరన్తి

పరబ్రహ్మమగు పరమాత్మవలననే నామాది విశేషరూపములతో ఈ జగత్తుయొక్క ప్రతీతి సంభవించుచున్నది ఈ విషయమును వేదములు చక్కగ నిర్దేశించి చెప్పుచున్నవి కాని వాస్తవముగ ఆ పరమాత్మయొక్క స్వరూపము ఈ ప్రపంచముకంటె విలక్షణమైయున్నదని చెప్పబడినది

127 తదర్థముక్తం తప ఎతదిజ్యా
తాభ్యామసౌ పుణ్యముపైతి విద్వాన్
పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్
సంజాయతే జ్ఞానవిదీపితాత్మా

ఆ పరమాత్మను పొందు - వేదములందు తెల్పు యజ్ఞములు చెప్పబడినవి వానిద్వారా శ్రోత్రియ విద్వాంసునకు పుణ్యము లభించుచున్నది నిష్కామకర్మ రూపమగు ఆ పుణ్యము చే పాపమును నశింపజేసిన తరువాత అతని అంతఃకరణము జ్ఞానముచె ప్రకాశిత మగుచున్నది

128 జ్ఞానేన చాత్మానముపైతి విద్వా
నథాన్యథా వరఫలానుకాఙ్క్షీ
అస్మిన్ కృతం తత్ పరిగృహ్య సర్వ
మముత్ర భుక్త్వా పునరేతి మార్గమ్

అపుడట్టి జ్ఞానముచే ఆ విద్వాంసుడు పరమాత్మను పొందు చున్నాడు కాని దానికి విలక్షణముగ భోగాభిలాషులగు మనుజులు ధర్మ అర్థ కామ రూప త్రివర్గఫలమును కోరుచున్నారు వారు లోకమున చేయబడిన కర్మలన్నిటిని వెంటనిడుకొని వానిని పరలోకమున అనుభవించుచున్నారు భోగములు పూర్తి అయిన వెనుక మరల ఈ సంసార మార్గమునకు తిరిగి వచ్చుచున్నారు

129 అస్మింల్లోకే తపస్తప్తం ఫలమన్యత్ర భుజ్యతే
బ్రాహ్మణానామిమే లోకా ఋద్ధే తపసి తిష్ఠతామ్

ఈ లోకమున (సకామముగ) చేయబడిన తపస్సుయొక్క ఫలము పరలోకమున అనుభవించబడుచున్నది కాని ఏ బ్రహ్మోపాసకులు ఈ లోకమున నిష్కామ భావముతో గురుతర తపస్సును ఆచరించుదురో వారు ఈ లోకముననే తత్త్వజ్ఞానరూప ఫలమును

పొందుచున్నారు (ముక్తులగుచున్నారు) ఈ ప్రకారముగ ఒకే తపస్సు బుద్ధి, సమృద్ధి భేదములచే రెండు ప్రకారములుగనున్నది

130 క్రోధః కామో లోభమోహౌ విధిత్సా
కృపాఽసూయే మానశోకౌ స్పృహా చ
ఈర్ష్యా జుగుప్సా చ మనుష్యదోషా
వర్జ్యాః సదా ద్వాదశైతే నరాణామ్

కామము క్రోధము లోభము మోహము దోషపూరితమగు ఇచ్ఛ, అసూయ అభిమానము శోకము, ఆశ, ఈర్ష్య నింద—అను ఈ పన్నెండు దోషములు మనుజులు సదా త్యజింపదగియున్నవి

131 ఏకైకః పర్యుపాస్తే హ మనుష్యాన్ మనుజర్షభ
లిప్సమానోఽన్తరం తేషాం మృగాణామివ లుబ్ధకః

బోయవాడు మృగములను చంపుటకై అవసరమును చూచు చుండునట్లు (పైన తెలిపిన) ఈ దోషములలో ప్రతియొక్కటియు అవసరమును చూచి మనుజులపై ఆక్రమణము సలుపుచున్నవి

132 వికత్థనః స్పృహయాలుర్మనస్వీ
బిభ్రత్ కోపం చపలోఽరక్షణశ్చ
ఏతాన్ పాపాః షణ్నరాః పాపధర్మాన్
ప్రకుర్వతే నో త్రసన్తః సుదుర్గే

తన్ను గొప్పగా తలంచి విఱ్ఱవీగువాడు ఇంద్రియలోలుడు, అవమానమును ఒకింతైనను ఓర్చుకొనలేని వాడు, నిరంతరము క్రోధము కలిగియుండువాడు చంచలుడు ఆశ్రితులను రక్షించని వాడు—అను ఈ ఆఱు విధములైన మనుష్యులు పాపులు గొప్ప సంకటమందు పడినను, వారు నిర్భయముగ ఈ పాపకర్మలను చేయు చుందురు

133 సమ్భోగ సంవిద్ విషమోఽతిమానీ
దత్త్వానుతాపీ కృపణో బలీయాన్
వర్గప్రశంసీ వనితాసు ద్వేష్టా
ఏతే పరే సప్త నృశంసవర్గాః

సంభోగమునందే మనస్సును లగ్నమొనర్చువారును విషమత్వము (దోషము కాఠిన్యము) కలవారును, అత్యంత అభిమానము కలవారును, దానమొనర్చి తదుపరి పశ్చాత్తాపపడువారును మహా లోభులును అర్థమును ప్రశంసించువారును స్త్రీలను ద్వేషించువారును—అను ఈ ఏడు విధములైన వారును ఇదివఱకు తెలుపబడిన ఆఱు విధములవారును మొత్తము పదమూడు విధములైనవారు నృశంసవర్గము (క్రూర సముదాయము)నకు చెందినవారని చెప్పబడినది

134 ధర్మశ్చ సత్యం చ దమస్తపశ్చ
అమాత్సర్యం హ్రీస్తితిక్షానసూయా
యజ్ఞశ్చ దానం చ ధృతిః శ్రుతం చ
వ్రతాని వై ద్వాదశ బ్రాహ్మణస్య

ధర్మము సత్యము ఇంద్రియనిగ్రహము తపస్సు మాత్సర్యములేమి లజ్జ సహనశీలత్వము ఇతరుని దోషమును చూడకుండుట, యజ్ఞము చేయుట, దానమొసంగుట, ధైర్యము, శాస్త్రజ్ఞానము—అను ఈ పండ్రెండును బ్రహ్మనిష్ఠుని యొక్క వ్రతములై యున్నవి

ఎవడు ఈ పండ్రెండు వ్రతములపై తన ఆధిపత్యము కలిగి యుండునో, అతడు ఈ సమస్త భూమండలమందలి మనుష్యులను తన అధీనమొనర్చుకొనగలడు వీనిలో మూడు రెండు, ఒకటియైనను గుణములతో కూడియున్నచో అట్టివాని యొద్ద సర్వ విధములైన ధనము లున్నట్లే యని తలంచవలెను

135 శ్రేయాంస్తు షడ్విదస్త్యాగః శ్రియం ప్రాప్య న హృష్యతి
ఇష్టాపూర్తే ద్వితీయం స్యాన్నిత్యవైరాగ్య యోగతః

136 కామత్యాగశ్చ రాజేన్ద్ర స తృతీయ ఇతి స్మృతః
అప్యవాచ్యం వదన్త్యేతం స తృతీయోగుణః స్మృతః

ఆఱు విధములైన సర్వశ్రేష్ఠములగు త్యాగము చెప్పబడు చున్నది ( ) సంపదను పొందియు హర్షము నొందకుండుట (2) యజ్ఞ హోమాదులందు బావులు చెఱువులు తోటలు మొదలైన వానిని నిర్మించుట యందు ధనమును ఖర్చు చేయుట (3) సదా వైరాగ్యముతో కూడుకొని కామమును త్యజించుట మహాత్ములు దీనిని అనిర్వచనీయమగు మోక్షోపాయముగ చెప్పుదురు కావున ఈ మూడవ త్యాగము గొప్ప గుణము కలదిగ చెప్పబడినది

137 అప్రియే చ సముత్పన్నే వ్యథాం జాతు న గచ్ఛతి
ఇష్టాన్ పుత్రాంశ్చ దారాంశ్చ న యాచేత కదాచన

(4) ఏదైన అప్రియమగు సంఘటన జరిగినచో వ్యథను ఎన్నడును పొందరాదు (5) స్త్రీ పుత్రాదులను తన అభీష్ట పదార్థము లను యాచన చేయరాదు

138 అర్హతే యాచమానాయ ప్రదేయం తచ్ఛుభం భవేత్
అప్రమాదీ భవేదేతైః స చాప్యష్టగుణో భవేత్

139 సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్యమేవ చ
అస్తేయం బ్రహ్మచర్యం చ తథా సంగ్రహమేవ చ

( ) సుయోగ్యుడగు యాచకుడు వచ్చినచో అతనికి దానము చేయవలెను ఈ విధములైన ఆఱు త్యాగములచే శ్రేయస్సు కలుగును ఈ త్యాగమయ గుణములచే మనుజుడు అప్రమత్తుడు కాగలడు అట్టి అప్రమత్తునకు ఎనిమిది గుణములు చెప్పబడినవి

అవి — సత్యము దానము ఆధ్యాత్మిక విషయ విచారణ సమాధానము వైరాగ్యము దొంగతనము చేయకుండుట బ్రహ్మచర్యము అపరిగ్రహము — అనునవి అయియున్నవి

140 సత్యాత్మా భవ రాజేన్ద్ర సత్యే లోకాః ప్రతిష్ఠితాః
తాంస్తు సత్యముఖానాహుః సత్యే హ్యమృతమాహితమ్

రాజేంద్రా! నీవు సత్యస్వరూపులు కండు సత్యమందే లోకము తయును ప్రతిష్ఠితమై యున్నది దమము త్యాగము అప్రమత్తత మొదలగు గుణములు కూడ సత్యస్వరూపుడగు పరమాత్మయొక్క ప్రాప్తిని కలుగజేయునవై యున్నవి సత్యమందే అమృతము ప్రతిష్ఠింపబడి యున్నది

141 జ్ఞానం వైనామ ప్రత్యక్షం పరోక్షం జాయతే తపః
విద్యాద్ బహు పఠన్తం తు ద్విజం వై బహుపాఠినమ్

పరమాత్మజ్ఞానము యొక్క ఫలము ప్రత్యక్షమైనది తపస్సుయొక్క ఫలము పరోక్షమైనది ఎక్కువగ చదివిన వానిని కేవలము బహుపాఠిగ తలంచవలెను

142 తస్య పర్యేషణం గచ్ఛేత్ ప్రత్యర్థిషు కదాచన
అవిచిన్వన్నిమం వేదే తపః పశ్యతి తం ప్రభుమ్

ఆత్మయొక్క అనుసంధానము అనాత్మ పదార్థములందు చేయరాదు వేదవాక్యములందును వెతకరాదు కేవలము తపస్సు ద్వారానే ఆ ప్రభువుయొక్క సాక్షాత్కారము గావించుకొనవలెను

143 తూష్ణీమ్భూత ఉపాసీత న చేష్టేన్మనసాపి చ
ఉపావర్తస్వ తద్ బ్రహ్మ అన్తరాత్మని విశ్రుతమ్

వాగాది ఇంద్రియములను చేష్టారహితములుగ నొనర్చి పరమాత్మయొక్క ఉపాసన చేయవలెను మనస్సుచేతగూడ ఏ చేష్టయు

చేయరాదు (నిశ్చలముగనుండవలెను) రాజ ! మీరును మీ యొక్క హృదయాకాశముననున్న ఆ విఖ్యాత పరమాత్మను, బుద్ధిపూర్వకముగ ఉపాసనచేయుడు

**144** మౌనాన్న స మునిర్భవతి నారణ్య వసనాన్మునిః
స్వలక్షణం తు యో వేద స మునిః శ్రేష ఉచ్యతే

కేవలము మౌనముగ నుండుటచేగాని అరణ్యమందు నివసించుట మాత్రముచే గాని ఎవడును ముని కాలేడు ఎవడు తన ఆత్మ స్వరూపము నెఱుఁగునో అతడే శ్రేష్ఠమునియని చెప్పబడును

**145** ధర్మాదిషు స్థితోఽప్యేవం క్షత్రియ బ్రహ్మ పశ్యతి
వేదానాం చానుపూర్వ్యేణ ఎతద్ బుద్ధ్యా బ్రవీమి తే

ధర్మాదులను ఆచరించుటచేతను వేదములను క్రమముగ (విధిప్రకారము) అధ్యయనము చేయుటచేతను మనుజుఁడు పరమాత్మ యొక్క సాక్షాత్కారమును బడయుచున్నాడు ఈ విషయమును స్వబుద్ధిద్వారా విచారణచేసి నేను మీకు చెప్పుచున్నాను

**146** నైతద్ బ్రహ్మ త్వరమాణేన లభ్యం
యన్మాం పృచ్ఛన్నతిహృష్యతీవ
బుద్ధౌ విలీనే మనస ప్రచిన్త్యా
విద్యా హి సా బ్రహ్మచర్యేణ లభ్యా

తొందరపాటు వ్యవహారము వలన బ్రహ్మప్రాప్తి కలుగదు బుద్ధియందు మనస్సులయింప వృత్తులన్నిటిని నిరోధించుస్థితి ఏది కలదో దానిపేరే బ్రహ్మవిద్య అది బ్రహ్మచర్యము యొక్క పాలన వలననే లభించును

**147** అవ్యక్త విద్యామభిధాస్యే పురాణీం
బుద్ధ్యా చ తేషాం బ్రహ్మచర్యేణ సిద్ధామ్

యాం ప్రాప్యైనం మర్త్యలోకం త్యజన్తి
యా వై విద్యా గురువృద్ధేషు నిత్యా

ఇపుడు అవ్యక్త సచ్చిదానంద ఘనబ్రహ్మముతో సంబంధము కల ఆ పురాతన విద్యను వర్ణించుచున్నాను అయ్యది మనుజులకు బుద్ధి, బ్రహ్మచర్యముల ద్వారా కలుగుచున్నది దానిని పొంది విద్వాంసుడు మరణధర్మము గల ఈ శరీరమును శాశ్వతముగ త్యజించి వేయుచున్నాడు మఱియు అది పెద్దల (ు గురుజనులందు సదా విద్యమానమై యున్నది

148 అస్మింల్లోకే వైజయన్తీహ కామాన్
బ్రాహ్మం స్థితిం హ్యనుతితిక్షమాణాః
త ఆత్మానం నిర్హరన్తీహ దేహా-
న్ముఞ్జాదిషీకామివ సత్త్వసంస్థాః

ఈ ప్రపంచమున ఎవరు వర్తమాన స్థితియందున్నను కోరికలన్నిటిని జయించుచున్నారో బ్రాహ్మీస్థితిని పొందుటకై అనేక విధములైన ద్వంద్వములను సహించుకొనుచున్నారో వారు సత్త్వ గుణమందు స్థితులై ముంజ గడ్డినుండి దర్భనువలె ఈ దేహము నుండి ఆత్మను (వివేకము ద్వారా) వేఱు చేయుచున్నారు

149 శరీరమేతౌ కురుతః పితా మాతా చ భారత
ఆచార్యశాస్తా యా జాతిః సా పుణ్యా సాజరామరా

తల్లిదండ్రులు ఈ శరీరమునకు జన్మ ఒసంగినను ఆచార్యుని యొక్క ఉపదేశముచే ఏ (నూతన) జన్మ కలుగుచున్నదో, అది పరము పవిత్రమై అజర అమరమై వెలయుచున్నది

150 గురుం శిష్యో నిత్యమభివాదయీత
స్వాధ్యాయమిచ్ఛేచ్ఛుచిరప్రమత్తః
మానం న కుర్యాన్నాదధీత రోష-
మేష ప్రథమో బ్రహ్మచర్యస్య పాదః

బ్రహ్మచారియగు శిష్యుడు గురువునకు సదా ప్రణామము చేయుచు, బాహ్యాభ్యంతరములందు పవిత్రుడై సోమరితనమును వదలి స్వాధ్యాయమందు మనస్సును లగ్నము చేయవలెను అభిమానము కలిగియుండరాదు మనస్సునందు క్రోధమునకు చోటు ఈయరాదు ఇది బ్రహ్మచర్యము యొక్క మొదటి పాదము.

151 ఆచార్యస్య ప్రియం కుర్యాత్ ప్రాణైరపి ధనైరపి
కర్మణా మనసా వాచా ద్వితీయః పాద ఉచ్యతే

తన ప్రాణమును ధనమును అర్పించియైనను మనోవాక్కర్మలచే ఆచార్యునకు ప్రియమొనర్పవలెను ఇది బ్రహ్మచర్యము యొక్క రెండవ పాదము

152 ఆచార్యేణాత్మకృతం విజానన్
జ్ఞాత్వా చార్థం భావితోఽస్మీత్యనేన
యన్మన్యతే తం ప్రతి హృష్టబుద్ధి
స వై తృతీయో బ్రహ్మచర్యస్య పాదః

ఆచార్యుడు తనకు చేసిన ఉపకారమును జ్ఞాపకము నందుంచుకొని దానివలన ఏ ప్రయోజనము సిద్ధించెనో దానిని కూడ విచారించి మనస్సునందు ప్రసన్నుడై శిష్యుడు ఆచార్యుని యెడల ఇతడు నన్ను గొప్ప ఉన్నతిస్థానమందు చేర్చెను అను భావము కలిగియుండవలెను — ఇది బ్రహ్మచర్యము యొక్క మూడవ పాదము

153 నాచార్యస్యాన పాకృత్య ప్రవాసం
ప్రాజ్ఞః కుర్వీత నైత దహం కరోమి
ఇతీవ మన్యేత న భాషయేత
స వై చతుర్థో బ్రహ్మచర్యస్య పాదః

ఆచార్యుని ఉపకారమును తీర్చకుండా (గురుదక్షిణాదులచే ఆతనిని సంతుష్టిపఱచకుండా) విద్వాంసుడగు శిష్యుడు

అచటి నుండి మఱియొక చోటికి పోరాదు (దక్షిణచే గరు
సేవచే) నేను గురువునకు ఉపకారము చేయుచున్నాను అను
భావము శిష్యుడు మనస్సునందు కలిగియుంటరాదు ఆ ప్రకారము
నోటితో కూడ చెప్పరాదు — ఇది బ్రహ్మచర్యము యొక్క నాల్గవ
పాదము

154 అనామయం తన్మహదుద్యతం యశో
వాచో వికారం కవయో వదన్తి
యస్మిన్ జగత్ సర్వమిదం ప్రతిష్ఠితం
యే తద్ విదురమృతాస్తే భవన్తి

కార్యరూపమగు ఈ జగత్తు వాక్కు యొక్క వికారమాత్రమే
యని పెద్దలు చెప్పుదురు దేనియందు ఈ జగత్తంతయు ప్రతిష్ఠితమై
యున్నదో అట్టి బ్రహ్మము రోగ శోక సంహారాత్మమైనది దాని
కీర్తి సర్వత్ర వ్యాపించియున్నది నిత్య కారణ స్వరూపమైన ఆ
బ్రహ్మమును తెలిసికొనువారు అమరులు (ముక్తులు) అగుచున్నారు

155 శోకః క్రోధశ్చ లోభశ్చ కామో మానః పరాసుతా
ఈర్ష్యా మోహౌ విధిత్సా చ కృపాసూయా జుగుప్సతా
ద్వాదశైతే మహాదోషా మనుష్య ప్రాణనాశనాః

శోకము, క్రోధము లోభము కామము మానము అతినిద్ర,
ఈర్ష్య మోహము తృష్ణ పిరికితనము గుణములందు దోషమును
చూచుట నిందించుట — అను ఈ పండ్రెండు గొప్ప దోషములు
మనుజునకు ప్రాణనాశకములై యున్నవి

156 ధర్మశ్చ సత్యం చ తపో దమశ్చ
అమాత్సర్యం హ్రీస్తితిక్షానసూయా
దానం శ్రుతం చైవ ధృతిః క్షమా చ
మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య

ధర్మము సత్యము తపస్సు ఇంద్రియ నిగ్రహము కలహించ కుండుట లజ్జ సహానశీలత్వము ఎవరి దోషమును చూడకుండుట దానము శాస్త్రజ్ఞానము ధైర్యము క్షమ — అను ఈ పండ్రెండు బ్రహ్మనిష్ఠుని యొక్క వ్రతములై యున్నవి

157 దమస్త్యాగోఽప్రమాద ఇత్యేతేష్వమృతం స్థితమ్
ఏతాని బ్రహ్మ ముఖ్యానాం బ్రాహ్మణానాం మనీషిణామ్

ఇంద్రియ నిగ్రహము త్యాగము అప్రమత్తత — అను వీని యందు అమృతము కలదు బ్రహ్మమే ప్రధాన లక్ష్యముగ కల బుద్ధి మంతులకు ఇవియే ముఖ్య సాధనములై యున్నవి

158 తూష్ణీమేక ఉపాసీత చేష్టేత మనసాపి న
తథా సంస్తుతి నిన్దాభ్యాం ప్రతిరోషౌ వివర్జయేత్

ఏ విధమైన చేష్టయులేక ఏకాంతమున (ఆత్మ) ఉపాసన చేయవలెను మనస్సుకోను ఏ విధమైన చేష్ట సలుపరాదు స్తుతి యందు రాగము నిందయందు ద్వేషము కలిగియుండరాదు

159 అత్రైవ తిష్ఠన్ క్షత్రియ బ్రహ్మ విశతి పశ్యతి
వేదేషు చానుపూర్వ్యేణ ఏతద్ విద్వన్ బ్రవీమి తే

పైన తెలిపిన సాధనలను చేసినచో మనుజుడు ఇచటనే బ్రహ్మము యొక్క సాక్షాత్కారమును బడసి ఆ బ్రహ్మమునందు విలీనమగుచున్నాడు రాజా! వేదములందు క్రమముగ విచారణ సలిపి నేను తెలిసికొనినదానినే నేనిపుడు మీకు తెలుపుచున్నాను

160 ద్వాదశపూగాం సరితం పిబన్తో దేవ రక్షితామ్
మధ్వీక్షన్తశ్చ తే తస్యాః సంచరన్తీహ ఘోరామ్
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

దశేంద్రియములు మనస్సు బుద్ధి — అను ఈ పండ్రెండు వస్తువులతో కూడినదియు పరమాత్మచే సురక్షితమైనదియునగు ఈ

ప్రపంచమను భయంకర నది యొక్క విషయరూప మధురజలమును చూచువారును, త్రాగువారును అగు జనులు దానియందే నిమగ్న లగుచున్నారు దీని నుండి విడుదల పొందదలంచు యోగులు ప్రయత్న పూర్వకముగ ఆ సనాతన పరమాత్మ యొక్క సాక్షాత్కారమును బొందుచున్నారు

161 పూర్ణాత్ పూర్ణాన్యుద్ధరన్తి పూర్ణాత్ పూర్ణాని చక్రిరే
హరన్తి పూర్ణాత్ పూర్ణాని పూర్ణమేవావశిష్యతే
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

పూర్ణుడగు పరమేశ్వరుని నుండి పూర్ణులగు చరాచర ప్రాణులు జనించుచున్నారు పూర్ణమగు సత్తా స్ఫూర్తిచే బడసియే పూర్ణులగు ఆ ప్రాణులు చేష్ట సలుపుచున్నారు తిరిగి పూర్ణ బ్రహ్మమునందు వానియొక్క విలయమగుచున్నది తుదకు ఏక మాత్రమగు పూర్ణబ్రహ్మమే శేషించుచున్నది ఆ సనాతన పరమాత్మను యోగులు సాక్షాత్కరించుకొనుచున్నారు

162 అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
లిఙ్గస్య యోగేన స యాతి నిత్యమ్
తమీశమీడ్యమనుకల్ప మాద్యం
పశ్యన్తి మూఢా న విరాజమానమ్
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

హృదయ ప్రదేశమున నున్న అంగుష్ఠమాత్రుడగు జీవాత్మ సూక్ష్మశరీరము యొక్క సంబంధముచే జనన మరణములను పొందు చున్నట్లు కానుపించుచున్నది సర్వుల యొక్క శాసకుడును స్తుతింపదగినవాడును సర్వసమర్థుడును సర్వుల ఆది కారణుడును సర్వత్ర విరాజమానుడును అగు పరమాత్మను మూఢులగు జీవులు చూడలేరు కాని యోగులు ఆ సనాతన పరమేశ్వరుని సాక్షాత్క రించుకొనుచున్నారు

163 అసాదనా వాఽ ఽసాదనా వా
సమానమేతద్ దృశ్యతే మానుషేషు
సమానమే తదమృతస్యేత రస్య
ముక్తాస్తత్ర మధ్వ ఉత్సం సమాపుః
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

సాధన సంపన్నులైనను సాధన రహితులైనను సమస్త ప్రాణులందును ఆ బ్రహ్మము సమాన రూపముగ వెలయుచున్నది బద్ధుల యందును ముక్తుల యందును గూడ సమానముగ బ్రహ్మము ప్రకాశించుచున్నది భేదమేమనగా వీరిరువురందును ముక్తులు ఆనందము యొక్క మూలస్రోతమగు పరమాత్మను పొందుచున్నారు తక్కిన వారు (అజ్ఞానులు) పొందుటలేదు సనాతనుడగు ఆ భగవంతుని యోగులు సాక్షాత్కరించుకొనుచున్నారు

164 యః సహస్రం సహస్రాణాం పక్షాన్ సంతత్య సమ్పతేత్
మధ్యమే మధ్య ఆగచ్ఛేదపి చేత్ స్యాన్మనోజవః
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

మనోవేగము కలవాడైనను పదిలక్షల రెక్కలు కట్టుకొని ఎగిరినను చివరకు హృదయస్థితుడగు పరమాత్మ యొద్దకే రావలసి యున్నది అట్టి సనాతన పరమాత్మను యోగులు సాక్షాత్కరించు కొనుచున్నారు

165 న దర్శనే తిష్ఠతి రూపమస్య
పశ్యన్తి చైనం సువిశుద్ధ సత్త్వాః
హితో మనీషీ మనసా న తప్యతే
యే ప్రవ్రజేయురమృతాస్తే భవన్తి
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

ఈ పరమాత్మయొక్క స్వరూపము సర్వులకును ప్రత్యక్షము కాదు అంతఃకరణము మహాశుద్ధముగ కలవారే దానిని చూడగలరు,

సర్వులనెక్కా ద్వేషులును మనస్సును వశమందుంచుకొనువారును మనస్సునందెన్నడను దుఃఖము తెలియరును ప్రపంచము యొక్క సంబంధములన్నిటిని పూర్తిగ త్యజించివేయు వారును అగు మహనీయులు ముక్తులగుచున్నారు అట్టి సనాతన పరమాత్మను యోగులు సాక్షాత్కరించుకొనుచున్నారు

166 నాహం సదా సత్కృతః స్యాం న మృత్యు
ర్నచామృత్యురమృతం మే కుతః స్యాత్
సత్యానృతే సత్యసమానబద్ధే
సతశ్చ యోనిరసతశ్చైక ఏవ
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్

నేను ఎన్నడును ఇతరుల అసత్కారమునకు పాత్రుడను కాను నాకు జన్మలేదు మృత్యువులేదు ఇక మోక్షము ఎవనికి ఎట్లుండును? సత్యము అసత్యము (దృశ్యము) అంతయు సనాతన పరబ్రహ్మమగు నాయందు స్థితిగల్గి యున్నది సత్ అసత్తుల ఏకమాత్ర ఉత్పత్తి స్థానము నేనే అయియున్నాను నా స్వరూపమగు ఆ సనాతన పరమాత్మను యోగులు సాక్షాత్కరించుకొనుచున్నారు

167 అఙ్గుష్ఠమాత్రః పురుషో మహాత్మా
న దృశ్యతే సౌహృది సంనివిష్టః
అజశ్చరో దివారాత్రమతన్ద్రితశ్చ
స తం మత్వా కవిరాస్తే ప్రసన్నః

అంగుష్ఠమాత్రుడును అంతర్యామియు నగు ఈ పరమాత్మ అందఱియొక్క హృదయమున స్థితుడై యున్నాడు కాని అందఱికిని కనిపించుటలేదు అతడు జన్మరహితుడు చరాచర స్వరూపుడు రాత్రిందినములు జాగ్రతగ నుండువాడు అయియున్నాడు అతనిని తెలిసికొను జ్ఞాని పరమానందమున నిమగ్నుడగుచున్నాడు

168 అణోరణీయాన్ సుమనాః సర్వభూతేషు జాగ్రతి
పితరం సర్వభూతేషు పుష్కరే నిహితం విదుః

పరమాత్మ మహా సూక్ష్మస్వరూపుడు విశుద్ధమానసుడు అయి యున్నాడు ఆతడే సమస్త ప్రాణికోట్ల యందును అంతర్యామి రూపమున ప్రకాశించుచున్నాడు సమస్తప్రాణికోట్ల యొక్క హృదయకమలమందున్న ఆ పరమాత్మను జ్ఞానులగువారే తెలిసికొనగల్గుచున్నారు

ఈ ప్రకారముగ బోధించిన సనత్సుజాతునితోను సంజయుని తోను సంభాషించుచు ధృతరాష్ట్రుడు ఆ రాత్రియంతయు గడపెను మఱునాటి దినమున రాజులందఱును కౌరవసభకు వచ్చి సంజయుని ద్వారా పాండవులు పంపిన సందేశమును వినిరి భీష్ముడు దుర్యోధనునితో పాండవులతో సంధి కుదుర్చుకొనుమని చెప్పెను ద్రోణుడున్ను ఆ భావవను సమర్థించెను పిదప ధృతరాష్ట్రుడు భీముని బల పరాక్రమములను తలంచుకొని భయపడి సంజయునితో ఇట్లు చెప్పెను—

ధృతరాష్ట్ర ఉవాచ—

169 క్రోశతో మే న శృణ్వన్తి బాలాః పణ్డితమానినః
విషమం న హి మన్యన్తే ప్రపాతం మధుదర్శినః

(ధృతరాష్ట్రుడు సంజయునితో ఇట్లు చెప్పెను—)

(బాగుపడు విధానమును) నేను అఱచి చెప్పుచున్నను తమను పండితులుగ తలంచుచున్న ఈ మూర్ఖపుత్రులు నా మాట వినుట లేదు వారు కేవలము చెట్టుయొక్క పై కొమ్మమీద ఉన్న తేనెను చూచుచున్నారే కాని అచటినుండి పడిపోవు ప్రమాదమును గూర్చి ఆలోచించుటలేదు

ఈమాట కౌరవసభలో ధృతరాష్ట్రుడు యుద్ధభయమువలన శాంతిని ప్రస్తావించెను సంజయుడు ధృతరాష్ట్రునకు పాండవుల శక్తి సామర్థ్యములను వర్ణించి చెప్పెను అంతట ధృతరాష్ట్రుడు దుర్యో

ధనునితో సంధి విషయమై నొక్కి చెప్పగా దుర్యోధనుడు అందుల కంగీకరించక యుద్ధమునే బలపఱచెను అపుడు విదురుడు దమమును గూర్చి దుర్యోధనునికి ఇట్లు బోధించెను—

విదుర ఉవాచ—

170 దమస్తేజో వర్ధయతి పవిత్రం దమ ఉత్తమమ్
విపాప్మా వృద్ధతేజాస్తు పురుషో విన్దతే మహత్

(విదురుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—)

దమము (ఇంద్రియ నిగ్రహము) తేజస్సును అభివృద్ధిపఱచును దమము పవిత్ర ఉత్తమ సాధనము దమముచే పాపరహితుడును, తేజ సంపన్నుడగు అగు మనుజుడు పరబ్రహ్మమును పరమాత్మను పొందును

171 క్షమా ధృతిరహింసా చ సమతా సత్యమార్జవమ్
ఇన్ద్రియాభిజయో ధైర్యం మార్దవం హ్రీరచాపలమ్

172 అకార్పణ్యమసంరమ్భః సంతోషః శ్రద్ధధానతా
ఏతాని యస్య రాజేన్ద్ర స దాన్తః పురుషః స్మృతః

ఎవనియందు క్షమ ధైర్యము అహింస సమదర్శిత్వము సత్యము సరళత్వము ఇంద్రియ నిగ్రహము అహింస మృదుత్వము లజ్జ స్థిరత్వము ఉదారత్వము అక్రోధము సంతృప్తి శ్రద్ధ—అను ఈ సుగుణములుండునో అతడు దాంతుడు (ఇంద్రియ జయము కల వాడు) అని ఎంచబడును

173 అభయం యస్య భూతేభ్యః సర్వేషామభయం యతః
స వై పరిణతప్రజ్ఞః ప్రఖ్యాతో మనుజోత్తమః

ఎవనికి సమస్త ప్రాణుల యెడల నిర్భయత్వము కలిగినదో, ఎవని వలన సమస్త ప్రాణుల యొక్క భయము తొలగిపోయినదో, అట్టి పరిపక్వ బుద్ధికలవాడు మనుజులలో శ్రేష్ఠుడని చెప్పబడినది

174 సర్వభూతహితో మైత్రస్తస్మాన్నోద్విజతే జనః
సముద్ర ఇవ గమ్భీరః ప్రజ్ఞా తృప్తః ప్రశామ్యతి

సమస్త ప్రాణుల యొక్క హితమును కోరువాడు అందరి యెడల మైత్రీభావము కలిగియుండువాడు అగువాని యెడల ఎవనికిని ఉద్వేగము (భయము) కలుగదు

సముద్రమువలె గంభీరముగా నున్నవాడును ఉత్కృష్టమగు జ్ఞానమను అమృతముచే తృప్తుడును అగువాడే పరమశాంతిని బడయును

ఎదప సంజయుడు ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణుని మహిమను గూర్చియు ఆ భగవంతుని పొందు మార్గమును గూర్చియు ఇట్లు వర్ణించెను

సంజయ ఉవాచ—

175 ఏకతో వా జగత్ కృత్స్నమేకతో వా జనార్దనః
సారతో జగతః కృత్స్నాదతిరిక్తో జనార్ద

(సంజయుడు ధృతరాష్ట్రునకు ఇట్లు చెప్పెను—)

ఒకవైపు సమస్తజగత్తు, మఱియొకవైపు భగవంతుడగు ఒక్క శ్రీ కృష్ణుడు ఉండుచో సారభూత బలముయొక్క దృష్టిచే ఆ జనార్దనుడే సమస్త జగత్తుకంటెను అధికుడని సిద్ధించగలదు

176 భస్మ కుర్యాజ్జగదిదం మనసైవ జనార్దనః
న తు కృత్స్నం జగచ్ఛక్తం భస్మ కర్తుం జనార్దనమ్

శ్రీ కృష్ణుడు తన మానసిక సంకల్ప మాత్రముచే ఈ సమస్త జగత్తునున్న భస్మము చేయగలడు కాని ఈ సమస్త జగత్తున్న వారిని భస్మము చేయుచేదు

177 యతః సత్యం యతో ధర్మో యతో హ్రీరార్జవం యత
తతో భవతి గోవిన్దో యతః కృష్ణస్తతో జయః

ఏ వైపు సత్యము ధర్మము లజ్జ సరళత్వము ఉండునో ఆ వైపే శ్రీ కృష్ణ డుండును ఎచట శ్రీ కృష్ణుడుండునో అచట విజయ ముండును

178 పృథివీం చాన్తరిక్షం చ దివం చ పురుషోత్తమః
విచేష్టయతి భూతాత్మా క్రీడన్నివ జనార్దనః

సమస్త ప్రాణులయొక్క ఆత్మయైన శ్రీ కృష్ణుడు ఆటవలె ఈ భూమి అంతరిక్షము స్వర్గలోకము—వీనిని సంచాలన మొనర్చుచున్నారు

179 కాలచక్రం జగచ్చక్రం యుగచక్రం చ కేశవః
ఆత్మయోగేన భగవాన్ పరివర్తయతేఽనిశమ్

ఆ కేశవుడే తన యోగశక్తిచే నిరంతరము కాలచక్రమును సంసార చక్రమును యుగ చక్రమును త్రిప్పుచున్నారు

180 కాలస్య చ హి మృత్యోశ్చ జఙ్గమస్థావరస్య చ
ఈశతే భగవానేకః సత్యమేతద్ బ్రవీమి తే

నేను మీతో సత్యము చెప్పుచున్నాను ఒక్క శ్రీ కృష్ణుడే కాలమునకు మృత్యువునకు, చరాచర జగత్తునకు ఏకమాత్ర ప్రభువై యున్నారు

181 తేన వఞ్చయతే లోకాన్ మాయాయోగేన కేశవః
యే తమేవ ప్రపద్యన్తే న తే ముహ్యన్తి మానవాః

ఆ కేశవుడు తన మాయా ప్రభావముచే—ఈ జగత్తును పరిపాలించుచున్నారు కాని ఎవరు కేవలము ఆ పరమాత్మనే శరణు పొందుదురో వారు మాయచే మోహితులు కానేరరు

182 ఏష ఏకాయనః పన్థా యేన యాన్తి మనీషిణః
తం దృష్ట్వా మృత్యుమత్యేతి మహాంస్తత్ర న సజ్జతి

జ్ఞానమార్గ మొకటియే పరమాత్మను (తత్త్వణము) పొందింప జేయునదై యున్నది జ్ఞానులు నడచు ఆ మార్గమును తెలిసికొని మనుజుడు జనన మరణ రూప సంసారమును దాటిపోయుచున్నాడు అట్టి మహనీయుడు ఈ సంసారమందు తగుల్కొనడు

183 నాకృతాత్మా కృతాత్మానం జాతు విద్యాజ్జనార్దనమ్
ఆత్మనస్తు క్రియోపాయో నాన్యత్రేన్ద్రియ నిగ్రహాత్

ఎవడు తన మనస్సును వశమొనర్చుకొనలేడో, అతడు నిత్యసిద్ధ పరమాత్మయగు శ్రీ కృష్ణుని పొందలేడు తన ఇంద్రియములన్నిటిని వశమొనర్చుకొనుట తప్ప మఱియొక కర్మయేదియు పరమాత్మను పొందుటకు ఉపాయము కాజాలదు

184 ఏతజ్జ్ఞానం విదుర్విప్రా ధ్రువమిన్ద్రియధారణమ్
ఏతజ్జ్ఞానం చ పన్థాశ్చ యేన యాన్తి మనీషిణః

ఇంద్రియములను దృఢముగ నిగ్రహించవలెను పెద్దలు దీనినే జ్ఞానమని నమ్ముదురు మహనీయులగువారు అనుసరించు మార్గ మదియే

185 అప్రాప్యః కేశవో రాజన్నిన్ద్రియైరజితైర్నృభిః
ఆగమాధిగమాద్ యోగాద్ వశీ తత్త్వే ప్రసీదతి

మనుజులు తమ ఇంద్రియములను వశమొనర్చుకొననిచో భగవంతుడగు శ్రీ కృష్ణుని పొందలేరు ఎవడు శాస్త్రజ్ఞాన యోగముల ప్రభావము చే తన మనస్సును ఇంద్రియములను వశమందుంచుకొనునో ఆతడే తత్త్వజ్ఞానమును బడసి ప్రసన్నుడగును

186 వసనాత్ సర్వభూతానాం వసుత్వాద్ దేవయోనితః
వాసుదేవస్తతో వేద్యో బృహత్త్వాద్ విష్ణురుచ్యతే

భగవంతుడు సమస్త ప్రాణికోటియొక్క నివాస స్థానము వారు సమస్త ప్రాణులందును నివసించుచున్నారు కాబట్టి వారు వసువు అని చెప్పబడుచున్నారు అట్లే దేవతలయొక్క ఉత్పత్తి స్థానమగుట చేతను సమస్త దేవతలు వారియందు నివసించుట చేతను దేవుడు అని చెప్పబడుచున్నారు కనుక వారి పేరు వాసుదేవుడు అని తెలియపలెను వ్యాపకులైయుండుటచే వారు విష్ణువని చెప్పబడుచున్నారు

187 మౌనాద్ ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత మాధవమ్
సర్వతత్త్వమయత్వాచ్చ మధుహా మధుసూదనః

మౌన ధ్యాన యోగములచే వారి యొక్క జ్ఞానము సాక్షాత్కారము సిద్ధించుచున్నది కావున వారు మాధవుడు అని చెప్పబడుచున్నారు మధు శబ్దములచే ప్రతిపాదితములైన పృథివి మొదలగు తత్త్వములన్నిటియొక్క ఉపాదానము, అధిష్ఠానము అగుటచే మధుసూదనుడగు శ్రీకృష్ణుడు మధుహా అని చెప్పబడెను

188 కృషిర్భూవాచకః శబ్దో ణశ్చ నిర్వృతివాచకః
విష్ణుస్తద్భావయోగాచ్చ కృష్ణో భవతి సాత్వతః

కృష్ ధాతువునకు సత్తి అని అర్థము అట్లే ణ అను శబ్దమునకు ఆనందమని అర్థము కలదు ఈ రెండు భావములతో కూడియుండుటచే యదుకులమున అవతరించిన నిత్యానంద స్వరూపుడగు విష్ణువు కృష్ణుడని చెప్పబడెను

189 పుణ్డరీకం పరంధామ నిత్యమక్షయమవ్యయమ్
తద్భావాత్ పుణ్డరీకాక్షో దస్యుత్రాసాజ్జనార్దనః

నిత్యమై అక్షయమై నాశరహితమైనట్టి పరమ భగవద్ధామమునకు పేరు పుండరీకము దానియందుండు అక్షుతభావముతో విరాజిల్లుచుండుటచే భగవంతుడు పుండరీకాక్షుడు అని చెప్పబడెను (లేక

అక్షి వారి నేత్రములు పుండరీకము అనగా కమలమువలె నుండుట చేతను పుండరీకాక్షుడని పేరు వచ్చెను) దుష్టులను అర్దనము (శిక్ష) ఒసంగువారు కాబట్టి జనార్దనుడు అని చెప్పబడెను

190 యతః సత్త్వాన్న చ్యవతే యచ్చ సత్త్వాన్న హీయతే
సత్త్వతః సాత్వతస్తస్మాదార్షభాద్ వృషభేక్షణః

వారు సత్యమునుండి జారరు సత్త్వమునుండి వేఱు కానేరరు కనుక వారి సత్వతుడు అని పేరు వచ్చెను ఆర్షమనగా వేదము దానిచే భాసితుడగుటచే భగవంతునకు ఆర్షభుడు అని పేరు కలిగెను ఆర్షభముయొక్క యోగముచేతనే వారు వృషభేక్షణుడు అని చెప్పబడెను (వృషభమనగా వేదము అది ఈక్షణము అనగా నేత్రమువలె వారిని చూపును జ్ఞాపకము చేయును—కావున వృషభేక్షణుడు అనియు చెప్పవచ్చును)

191 న జాయతే జనిత్రాయమజస్తస్మాదనీకజిత్
దేవానాం స్వప్రకాశత్వాద్ దమాద్ దామోదరో విభుః

శత్రుసేనలపై విజయమును సాధించు ఆ (శ్రీ) కృష్ణుడు ఎవరి ద్వారాను జన్మను పొందిలేదు కాబట్టి అజుడు అని చెప్పబడెను అట్లే ఉత్కృష్టరూపముతో ప్రకాశించువారు కాబట్టి వారు ఉదరుడు అని చెప్పబడెను దమము అనగా ఇంద్రియ నిగ్రహము అను గుణముతో కూడినవారు కాబట్టి దాముడని చెప్పబడెను మఱియు దామ ఉదర మను రెండు పదములయొక్క సంయోగముచే (శ్రీ) కృష్ణుడు దామోదరుడని చెప్పబడెను చిన్నప్పుడు యశోదచే త్రాటచే కట్టిబడుటచేతనుగూడ దామోదరుడను పేరు గల్గెను

192 హర్షాత్ సుఖాత్ సుఖైశ్వర్యాద్ హృషీకేశత్వమశ్నుతే
బాహుభ్యాం రోదసీ బిభ్రన్మహాబాహురితి స్మృతః

హర్షము అనగా సుఖముతో కూడియుండుటచే హృషీకుడనియు ఐశ్వర్య సంపన్నుడగుటచే ఈశుడనియు చెప్పబడెను ఈ ప్రకారముగ భగవంతునకు హృషీకేశుడను పేరు కలిగియుండెను తన రెండు బాహువులచే భగవంతుడు భూమిని ఆకాశమును ధరించుచున్నారు కాబట్టి వారికి మహాబాహువు అను పేరు కలిగెను

193 అధో న క్షీయతే జాతు యస్మాత్ తస్మాదధోక్షజః
నరాణామయనాచ్చాపి తతో నారాయణః స్మృతః

శ్రీ కృష్ణుడు ఎన్నడును క్రిందపడి నశింపడు కాబట్టి అధోక్షజుడని వారు చెప్పబడిరి నరులయొక్క అనగా జీవాత్మలయొక్క అయనము అనగా ఆశ్రయము కాబట్టి వారు నారాయణుడు అని పేర్కొనబడిరి

194 పూరణాత్ సదనాచ్చాపి తతోఽసౌ పురుషోత్తమః
అసతశ్చ సతశ్చైవ సర్వస్య ప్రభవాప్యయాత్
సర్వస్య చ సదా జ్ఞానాత్ సర్వమేతం ప్రచక్షతే

వారు సర్వత్ర పరిపూర్ణులు సర్వులయొక్క నివాసస్థానము కాబట్టి పురుషుడనియు పురుషులందరిలో ఉత్తముడు కాబట్టి పురుషోత్తముడనియు చెప్పబడిరి వారు సత్తు అసత్తులన్నిటియొక్క ఉత్పత్తి లయములకు స్థానము వారు సర్వదా వానియన్నిటియొక్క జ్ఞానము కలిగియుండుచున్నారు కావున వారు సర్వుడు అని చెప్పబడిరి

195 సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమత్ర ప్రతిష్ఠితమ్
సత్యాత్సత్యం తు గోవిన్ద స్తస్మాత్ సత్యోఽపి నామతః

శ్రీ కృష్ణుడు సత్యమందు ప్రతిష్ఠితులైయున్నారు సత్యము వారియందు ప్రతిష్ఠితమైయున్నది ఆ గోవిందుడు సత్యముకంటెను ఉత్కృష్టమైన సత్యము కాబట్టి వారికి సత్యము అను పేరు కలదు

196 విష్ణుర్విక్రమణాద్ దేవో జయనాజ్జిష్ణురుచ్యతే
శాశ్వతత్వా దనన్తశ్చ గోవిన్దో వేదనాద్ గవామ్

విక్రమణము (మూడులోకముల ఆక్రమణము) కలిగియుండుటచే వారు విష్ణువు అని చెప్పిరి సర్వులపై విజయము సాధించుటచే జిష్ణువు అనియు శాశ్వతుడగుటచే అనంతుడనియు గోవులయొక్క (ఇంద్రియములయొక్క) జ్ఞాత ప్రకాశకుడు అగుటచే (గో-విన్దతి అను వ్యుత్పత్తి ప్రకారము) గోవిందుడనియు భగవానుడు చెప్పబడుచున్నారు

అనంతరము ధర్మరాజు శ్రీకృష్ణునితో కౌరవులకు శాంతి సందేశమిమ్మని ప్రార్థించి ఇట్లు చెప్పెను—

యుధిష్ఠిర ఉవాచ —

19 న చాపి వైరం వైరేణ కేశవ వ్యుపశామ్యతి
హవిషాగ్నిర్యథా కృష్ణ భూయ ఎవాభివర్ధతే

(ధర్మరాజు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను—)

కృష్ణా! నేయి పోయుటచే నిప్పు చల్లారక యింకను మిక్కిలి అధికముగ ప్రజ్వలించునట్లు వైరముచే వైరమెన్నటికి శమించదు పైపెచ్చు ఇంకను వృద్ధియగుచుండును

శ్రీకృష్ణుడు కౌరవులకు శాంతిసందేశ మొసంగుట అంగీకరించి హస్తినాపురమునకు వెళ్లెను ధృతరాష్ట్రాదులు వారికి స్వాగత సత్కారములను గావించిరి పిదప శ్రీకృష్ణుడు కుంతియొద్దకు వెళ్ళగా ఆమె తన దుఃఖములను తలంచుకొని విలపించుచు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను—

198 తస్యాం సంసది సర్వేషాం క్షత్తారం పూజయామ్యహమ్
వృత్తేన హి భవత్యార్యో న ధనేన న విద్యయా

(కుంతీదేవి శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను—)

మహాత్మా! నేను ఆ కౌరవ సభయందు అందరికంటె అధిక ఆదరము విదురునకు ఇచ్చుచున్నాను (ద్రౌపదికి చేయబడిన అన్యాయమును ప్రకటరూపమున విరోధించెను కావున) మనుజుడు తన సదాచారముతోనే శ్రేష్ఠుడగును కాని ధనముచె గాని విద్యచే గాని కాదు

శ్రీకృష్ణుడు కుంతీదేవికి ఆశ్వాసన మొసంగెను. ఎదప శ్రీకృష్ణుడు దుర్యోధనుని ఇంటికి వెళ్ళి ఆతనితో ఇట్లు చెప్పెను—

199 నాహం కామాన్న సంరమ్భాన్న ద్వేషాన్నార్థ కారణాత్
న హేతువాదాల్లోభాద్ వా ధర్మం జహ్యాం కథంచన

(శ్రీకృష్ణుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—)

నేను కామముచే గాని క్రోధముచే గాని ద్వేషముచే గాని స్వార్థవశమున గాని మోహముచేగాని లోభముచే గాని ఏ ప్రకారమున్ను ధర్మమును వదలజాలను

200 కామక్రోధానువర్తీ హి యో మోహాద్ విరురుత్సతి
గుణవన్తం చ యో ద్వేష్టి తమాహుః పురుషాధమమ్

ఎవడు కామ క్రోధములకు వశీభూతుడై మోహావశమున గుణవంతునితో విరోధము కలుగజేసికొనదలంచునో అతడు మనుజులలో అధముడని చెప్పబడును

దుర్యోధనునితో మాట్లాడిన తరువాత శ్రీకృష్ణుడు విదురుని ఇంటియందు ఆతిథ్యమును స్వీకరించెను. కౌరవ పాండవులకు సంధి కుదుర్చుటయే మంచిదని విదురుడు తన అభిప్రాయమును వెల్లడించెను అపుడు శ్రీకృష్ణుడు విదురునితో ఇట్లు చెప్పెను—

శ్రీ భగవానువాచ—

201 ధర్మకార్యం యతఞ్ఛక్త్యా నో చేత్ ప్రాప్నోతి మానవః
ప్రాప్తో భవతి తత్ పుణ్యమత్ర మే నాస్తి సంశయః

(శ్రీ కృష్ణుడు విదురునితో ఇట్లు చెప్పెను—

మనుజుడు తన శక్తికొలది ఏదేని ధర్మకార్యమును చేయుచు అందు సఫలత్వమును పొందజాలకున్నను అతడు దాని పుణ్యము తప్పక లభించును ఈ విషయమున నాకు సందేహము లేదు

ఎదప దుర్యోధనుని ఆహ్వానమును పురస్కరించుకొని శ్రీకృష్ణుడు కౌరవ సభలోని వచ్చి శాంతిసందేశమును సర్వులకును వినిపించి చక్కని హితోపదేశము చేసెను

అనంతరము నారదుడు దుర్యోధనునకు హితమును బోధించుచు ఇట్లు పలికెను —

నారద ఉవాచ

202 దుర్లభో వై సుహృచ్ఛ్రోతా దుర్లభశ్చ హితః సుహృత్
తిష్ఠతే హి సుహృద్ యత్ర న బన్ధుస్తత్ర తిష్ఠతే

(నారదుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను —)

అకారణముగనే హితమొనర్పదలంచు సుహృత్తు యొక్క వాక్యములను మనస్సు లగ్నముచేసి వినువాడు దుర్లభుడు హితైషి యగు సుహృత్తున్ను దుర్లభుడు విపత్తునిన మహా సంకటమున సుహృత్తే నిలచును గాని సోదరులు బంధువులు కాదు

నారదుడు ఎవని గరుడుని వృత్తాంతమును తెలియజేసెను ఋషభ పర్వత శిఖరముపై తపస్వినియగు శాండిలి గాలవమహర్షితో గరుడునితో ఇట్లు చెప్పెను —

203 ఆచారః ఫలతే ధర్మమాచారః ఫలతే ధనమ్
ఆచారాచ్ఛ్రియమాప్నోతి ఆచారో హన్త్యలక్షణమ్

(తపస్విని గరుడ గాలవులతో ఇట్లు చెప్పెను —)

సదాచారమే ధర్మమును సఫలమొనర్చుచున్నది సదాచారమే ధనమును ఫలము నొసంగుచున్నది సదాచారముచే మనుజునకు

సంపత్తి ప్రాప్తించుచున్నది సదాచారమే అశుభలక్షణములను నశింపజేయుచున్నది

ఎదో నారదుడు దుర్యోధనునకు యయాతి వృత్తాంతమును తెలియజేసెను ఇక కౌరవ సభయందు శ్రీకృష్ణుడు భీష్ముడు ద్రోణుడు విదురుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు ధర్మవిషయమై కర్తవ్యవిషయమై ఎంత నచ్చచెప్పినప్పటికిని దుర్యోధనుడు పాండవులకు రాజ్యమొసంగుటకు అంగీకరింపలేదు అనంతరము కౌరవ సభయందు శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును చూపి అటనుండి వెడలిపోయెను శ్రీకృష్ణుని ప్రశ్నను పురస్కరించుకొని కుంతీదేవి పాండవులకు ఉత్సాహము కలుగజేయుటకై వారితో చెప్పవలసిన సందేశమొసంగుచు విదులోపాఖ్యానమును చెప్పెను రణరంగము నుండి పారిపోయి వచ్చిన తన పుత్రునితో విదుల ఈ ప్రకారముగ చెప్పెను —

విదులోవాచ

204 ముహూర్తం జ్వలితం శ్రేయో న చ ధూమాయితం చిరమ్

(విదులుడు తన పుత్రునితో ఇట్లు చెప్పెను —)

రెండు ఘడియలైనను ప్రజ్వలించుట మంచిది కాని దీర్ఘకాలము పొగపట్టి మండకుండుట మంచిది కాదు

205 అలబ్ధ్వా యదివా లబ్ధ్వా నానుశోచతి పణ్డితః
అనన్తర్యం చారభతే న ప్రాణానాం ధనాయతే

బుద్ధిమంతుడు అభీష్టఫలము ప్రాప్తించినను ప్రాప్తింపకున్నను దాని కొరకై శోకింపడు అతడు తన యావచ్ఛక్తిని వినియోగించి ప్రాణపర్యంతము నిరంతరము ప్రయత్నించును మఱియు తన ప్రాణ ధనమును ఇచ్ఛగింపడు,

206 యస్య వృత్తం న జల్పన్తి మానవా మహాదద్భుతమ్
రాశివర్ధనమాత్రం స నైవ స్త్రీ న పునః పుమాన్

ఎవని యొక్క గొప్ప అద్భుత పురుషార్థమును చరిత్రను జనులందఱును చర్చింపరో అట్టివాడు తన ద్వారా జనసంఖ్యను అభివృద్ధి పఱచువాడు మాత్రమే యగును నా దృష్టి యందతడు స్త్రీ కాడు పురుషుడు కాడు

207 దానే తపసి సత్యే చ యస్య నోచ్చరితం యశః
విద్యాయామర్థలాభే వా మాతురుచ్చార ఏవ సః

దానము తపస్సు సత్యభాషణము విద్య ధనోపార్జనల యందు ఎవని యొక్క ఉత్తమ కీర్తి యొక్క వర్ణనము జరుగకుండునో అట్టివాడు తన తల్లి యొక్క పుత్రుడు కాడు, మల మాత్రము మాత్రమే యగును

208 శ్రుతేన తపసా వాపి శ్రియా వా విక్రమేణ వా
జనాన్ యోఽభిభవత్యన్యాన్ కర్మణా హి స వై పుమాన్

ఎవడు శాస్త్రజ్ఞానము తపస్సు ధనసంపత్తి పరాక్రమముల ద్వారా ఇతరులను ఓడించి వేయునో అతడు అట్టి శ్రేష్ఠ కర్మ ద్వారానే పురుషుడని చెప్పబడును

209 సంతోషో వై శ్రియం హన్తి తథానుక్రోశ ఏవ చ
అనుత్థానభయే చోభే నిరీహో నాశ్నుతే మహత్

ప్రయత్నరాహిత్యము, భయము సంపత్తిని నశింపజేయునవియై యున్నవి నిశ్చేష్టుడగు మనుజుడు మహత్వపూర్ణమ పదమును ఎన్నడును పొందలేడు

210 పరం విషహతే యస్మాత్ తస్మాత్ పురుష ఉచ్యతే
తమాహుర్వ్యర్థనామానం స్త్రీవద్ య ఇహ జీవతి

శత్రువును ఎదుర్కొని అతని వేగమును సహించకొనువాడే అట్టి పురుషార్థము వలన పురుషుడని చెప్పబడును కాని ఎవడీ ప్రపంచమున భీరుత్వముతో కూడిన జీవితమును గడపునో అట్టివాని పురుషుడను పేరు వ్యర్థ గాని చెప్పబడినది

211 యస్య శూరస్య విక్రాన్తైరేధన్తే బాన్ధవాః సుఖమ్
త్రిదశా ఇవ శక్రస్య సాధు తస్యేహ జీవితమ్

పక్వఫలములు కల వృక్షము వలె ఎవనిని ఆశ్రయించి ప్రాణులందఱు జీవించుదురో అతని జీవితమే సార్థకమైనది

212 ఉదచ్ఛేదేవ న నమే దుద్యమో హ్యేవ పౌరుషమ్
అప్యపర్వణి భజ్యేత న నమేతేహ కస్యచిత్

ఎల్లపుడు ప్రయత్నము చేయవలెను ఎవని ముందును తల వంచరాదు ప్రయత్నము చేయుటయే పురుషార్థ అసమయము నశించిపోయినను పరవాలేదు కాని ఎవని ముందును నతమస్తకుడు కారాదు

అట ఎన్నోట కౌరవ పాండవులు తమ తమ సేనలను యుద్ధమునకు సన్నద్ధ పఱచి కురుక్షేత్ర రణరంగమునకు చేరి కౌరవులకు భీష్ముడు పాండవులకు ద్రుపదుని పుత్రుడగు ధృష్టద్యుమ్నుడు సేనానాయకులుగ నుండిరి దుర్యోధనుడు ఉలూకుడను దూతద్వారా పాండవులకు యుద్ధమునకు సిద్ధముగ నుండుడని సందేశమ ఎంపగా అర్జునుడు ధృష్టద్యుమ్నాది సేనాపతులతో ఇట్లు వచించెను ——

213 శ్వోభూతే కత్థితస్యాస్య ప్రతి వాక్యం చమూముఖే
గాణ్డీవేనాభిధాస్యామి క్లీబా హి వచనోత్తరాః

(అర్జునుడు ధృష్టద్యుమ్నాది సేన పతులతో ఇట్లు చెప్పెను ——)

మీ సమ్మతి అయినచో, రేపు ఉదయమే దుర్యోధనుని దోషపూరితవాక్యములకు సరియైన ప్రత్యుత్తరము గాండీవ ధనస్సు ద్వారా

ఒసంగెదను ఏలయనగా కేవలము మాటలలో పరాక్రమము జవ బ
చెప్పువారు నపుంసకులే యందురు

ఇదుల అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను —

214 స్వవీర్యే య సమాశ్రిత్య సమాహ్వాయతి వై పరాన్
అభీతో యుధ్యతే శత్రూన్ స వై పురుష ఉచ్యతే

(అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను —)

ఎవడు తన బలము పై విశ్వాసముంచి అధైర్యాన్ని ఆశ్రయించి
శత్రువులను ఆహ్వానించి వారితో నిర్భయముగ యుద్ధము చేయునో
అట్టివాడే పురుషుడని చెప్పబడును

రణరంగమున కర్ణుడు భీష్ముడు రోషపూర్వకముగ సంభాషించు
కొనిరి తత్ప్రసంగమున కర్ణుడు భీష్మునితో ఇట్లు చెప్పెను—

కర్ణ ఉవాచ—

215 బలజ్యేష్ఠం స్మృతం క్షత్రం మన్త్రజ్యేష్ఠా ద్విజాతయః
ధనజ్యేష్ఠాః స్మృతా వైశ్యాః శూద్రాస్తు వయసాధికాః

(కర్ణుడు భీష్మునితో ఇట్లు చెప్పెను—)

బ్రాహ్మణుడు వేదమంత్రముల జ్ఞానముచేతను క్షత్రియుడు
బలముచేతను వైశ్యుడు అధికధనముచేతను శూద్రుడు అధిక ఆయుష్షు
చేతను గొప్పవారుగ తలంచబడుచున్నారు

తాను యుద్ధమున శిఖండిని ఎందులకు వధింపనో కారణము
దుర్యోధనాదులకు తెలుపుచు భీష్మాచార్యుడు అంబోపాఖ్యానము
పరశురామునితోటి యుద్ధము మున్నగు విషయములను తెలియ
జేసెను తత్కథా సందర్భమున భీష్మ పరశురామ సంవాదమందు
భీష్ముడు పరశురామునితో ఇట్లు చెప్పెను—

భీష్మ ఉవాచ—

216 అర్థే వా యది వా దర్మే సమర్థో దేశకాల విత్
అర్థ సంశయమాపన్నః శ్రేయాన్నిః సంశయో నరః

(భీష్ముడు పరశురామునితో ఇట్లు చెప్పెను—)

ధర్మార్థముల వివేచనమందు కుశలుడును దేశకాలముల తత్త్వము తెలిసినవాడును అగు మనుజుడు అర్థ విషయమున సంశయము కలిగినచో దానిని వదలి సంశయరహితమగు హృదయముతో కేవలము ధర్మమునే అనుష్ఠించినయెడల అతడు శ్రేష్ఠుడని యెంచబడుచున్నాడు

అంతట వేదవ్యాసముని సంజయునకు దివ్యదృష్టిని అనుగ్రహించెను తదుపరి వ్యాసముని ధృతరాష్ట్రునితో సంభాషించుచు ఇట్లు పలికెను—

ఓమ్

# 6 భీష్మ పర్వము

వ్యాస ఉవాచ—

1 అల్పయాం వా మహత్యాం వా సేనా యామితి నిశ్చయః
హర్షో యోధగణస్యైకో జయలక్షణ ముచ్యతే

(వ్యాసముని ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను—)

సేన చిన్నదికాని, పెద్దదికాని అందు పాల్గొన్న సైనికుల యొక్క హర్షమే నిశ్చితరూపమున సేనయొక్క విజయమునకు లక్షణ మని చెప్పబడినది

2 ఉపాయ విజయం శ్రేష్ఠ మాహుర్భేదేన మధ్యమమ్
జఘన్య ఏష విజయో యో యుద్ధేన విశాంపతే

సామదానములను ఉపాయములచే యుద్ధమందు విజయమును పొందుట శ్రేష్ఠమనియు భేదోపాయముచే విజయమును పొందుట మధ్యమమనియు యుద్ధముచేసి జనసంహార మొనర్చి, శత్రువును ఓడించి విజయమును పొందుట—అధమశ్రేణికి చెందినదనియు చెప్పబడినది

3 మహాదోషః సంనిపాతస్తతస్స్యాద్వ్యః క్షయ ఉచ్యతే
పరస్పరజ్ఞా సంహృష్టా వ్యవధూతాః సునిశ్చితాః

4 పఞ్చాశదపి యే శూరా మృద్నన్తి మహతీం చమూమ్
అపి వా పఞ్చ షట్ సప్త విజయన్త్యని వర్తినః

యుద్ధము గొప్ప దోషముల నిలయము ఆ దోషములలో అన్నిటికంటె ముఖ్యమైనది జన సంహారము ఒకరు మఱియొకరిని తెలిసికొనువారు హర్ష ఉత్సాహములతో నిండియున్నవారు దేని యందును ఆసక్తులు కాక విజయప్రాప్తికై దృఢనిశ్చయము కలిగి యుండువారు శౌర్యసంపన్నులు అగు ఏబదిమంది సైనికులైనను ఉన్నచో వారు పెద్దసేనను మట్టుపెట్టగలరు పాదము వెనుకకు పెట్టని

ఐదు ఆరు ఏడుమందియైనను యోధులున్నచో వారు నిక్కముగ విజయమును చేబట్టగలరు

ధృతరాష్ట్రుని ప్రశ్నను పురస్కరించుకొని సంజయుడు భూమి యొక్క మహత్త్వమును తెలుపుచు ఇట్లనెను—

సంజయ ఉవాచ—

5 పఞ్చేమాని మహారాజ మహాభూతాని సంగ్రహాత్
జగతీస్థాని సర్వాణి సమాన్యాహుర్మనీషిణః

(సంజయుడు ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను—)

ఈ భూమిపై ఏయే పదార్థములు కలవో అవియన్నియు సంక్షేపముగ పంచ మహాభూతములయొక్క స్వరూపములే అయి యున్నవి కనుకనే విజ్ఞులు వానిని సమములని చెప్పిరి

6 అచిన్త్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ సాధయేత్
ప్రకృతిభ్యః పరం యత్ తు తదచిన్త్యస్య లక్షణమ్

అచింత్యమైనదానిని తర్కముచే సిద్ధింపజేసికొనుటకు ప్రయత్నింపరాదు ప్రకృతికంటె పరమైనదే అచింత్య స్వరూపమైయున్నది

7 తపముగ్ర తపసః సిద్ధాః సువ్రతాః సత్యవాదినః
పశ్యన్తి న వా దుర్వృత్తైః శక్యో ద్రష్టుం మహేశ్వరః

గొప్ప తపస్సంపన్నులును, ఉత్తమ వ్రతములను పాలించువారును, సత్యవాదులునగు సిద్ధపురుషులే పరమేశ్వరుని దర్శించుదురు దురాచారులగు వారికి భగవంతుడగు మహేశ్వరుని దర్శనము కాజాలదు

యుద్ధరంగమున అపార కౌరవసేనను చూచి నిరుత్సాహము చెందిన ధర్మరాజును ఉత్సాహపరచుచు అర్జునుడు పూర్వము దేవాసుర యుద్ధమందు బ్రహ్మదేవుడు ఇంద్రాది దేవతల నుద్దేశించి చెప్పిన ఈ వాక్యములను ఉదహరించెను—

8 న తథా బలవీర్యాభ్యాం జయన్తి విజిగీషవః
యథా సత్యానృశంసాభ్యాం ధర్మేణైవోద్యమేన చ

(అర్జునుడు ధర్మరాజుతో బ్రహ్మదేవుని ఈ వాక్యములను చెప్పెను—)

సత్యము సజ్జనత్వము ధర్మము ఉత్సాహము—వీనిచె ఎటి విజయమును జనులు పొందుదురో అట్టి విజయమును కోరిన ఇచ్ఛ గలవారైన శూరవీరులు తమ బల, పరాక్రమములచే అద్దానిని పొంద జాలరు

9 త్యక్త్వాధర్మం చ లోభం చ మోహం చోద్యమమాస్థితాః
యుధ్యధ్వమనహంకారా యతో ధర్మస్తతో జయః

దేవతలారా! అధర్మము, లోభము మోహములను వదలి ప్రయత్నశీలురై అహంకారరహితులై యుద్ధమొనర్పుడు ఏ పక్షమున ధర్మముండునో ఆ పక్షమే విజయమును పొందును

10 ఏవం రాజన్ విజానీహి ధ్రువోఽస్మాకం రణే జయః
యథా తు నారదః ప్రాహ యతః కృష్ణస్తతో జయ

కావున ఓ రాజా! ఇట్టి నియమము ననుసరించి మీరున్న యుద్ధమందు పాండవపక్ష విజయము తప్పక సంభవించునని నిశ్చయముగ ఎఱుంగుడు ఎచట (శ్రీ) కృష్ణుడుండునో అచట విజయముండునని నారదుడు చెప్పెను గదా!

11 గుణభూతో జయః కృష్ణే పృష్ఠతోఽభ్యేతి మాధవమ్
తద్ యథా విజయశ్చాస్య సన్నతిశ్చాపరో గుణః

విజయము (శ్రీ) కృష్ణునియొక్క ఒక గుణము కాబట్టి అది వారి వెనువెంటనే వెళ్ళును విజయమెట్లు వారి గుణమో అట్లే వినయమున్ను వారి రెండవ గుణమై యున్నది

12 అనన్తతేజా గోవిన్దః శత్రుపూగేషు నిర్వ్యథః
పురుషః సనాతనమయో యతః కృష్ణస్తతో జయః

గోవిందుని (శ్రీ కృష్ణుని) తేజము అనంతమైనది వారు శత్రు సమూహామందును ఎన్నడును వ్యథకలిగి యుండరు ఏలయనిన, వారు సనాతనుడగు పరమాత్మ కావున ఎచట శ్రీ కృష్ణుడుండునో అచట విజయముండును

13 యత్ర దర్మో ద్యుతిః కాన్తిర్యత్ర హ్రీః శ్రీస్తథా మతిః
యతో దర్మస్తతః కృష్ణో యతః కృష్ణస్తతో జయః

ఎచట న్యాయోచితమగు నడవడిక తెజము కాంతియుండునో లజ్జ జ్ఞానసంపద బుద్ధి ధర్మము ఉండునో అచటనే శ్రీ కృష్ణుడుండును ఎచట శ్రీ కృష్ణుడుండునో అచట విజయముండును

యుద్ధరంగమున ఏమేమి జరిగినది చెప్పుమని ధృతరాష్ట్రుడు సంజయుని అడుగగా సంజయు డిట్లు వర్ణించి చెప్పెను—

ధృతరాష్ట్ర మహారాజా! రణరంగమున శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునకు ఉత్సాహము ధైర్యము కలిగించుటకై ఈ ప్రకారముగ ఆధ్యాత్మిక బోధ కావించెను—

శ్రీ భగవ నువాచ—

14 క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప!

(శ్రీ భగవానుడు చెప్పెను—)

ఓ అర్జునా! అధైర్యమును పొందకుము ఇది నీకు తగదు నీచమగు ఈ మహాదుర్బలత్వమును వీడి యుద్ధము చేయుటకు లెమ్ము

15 న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామ స్సర్వే వయమతః పరమ్

అర్జునా! నేనుగాని, నీవుగాని (యుద్ధభూమియందుగల) రాజులుగాని ఒకప్పుడును లేనివారము కాము ముందును లేకపోవువారము కాము

16 అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి

ఓ అర్జునా! ఈ సమస్త ప్రపంచమున్ను ఏ పరమాత్మచేత వ్యాపింపబడియున్నదో అది నాశరహితమైయున్నదని యెఱుఁగుము అవ్యయమగు అట్టి ఆత్మకు వినాశము నెవడును కలుగజేయజాలడు

17 న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితావా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే

ఈ ఆత్మ ఎప్పుడును పుట్టుటలేదు చచ్చుటలేదు ఇదివఱకు లేకుండ మరల క్రొత్తగా కలుగువాడు కాడు (ఉండి మరల లేకుండు వాడును కాడు) ఈతడు జనన మరణములు లేనివాడు శాశ్వతుడు పురాతనుడు శరీరము చంపబడినను ఈతడు చంపబడుటలేడు

18 అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఎవ చ
నిత్యస్సర్వగతస్స్థాణు రచలోఽయం సనాతనః

ఈ ఆత్మ ఛేదింపబడజాలడు దహింపబడజాలడు, తడుపబడజాలడు ఎండింపబడజాలడు ఇతడు నిత్యుడు సర్వవ్యాపి స్థిర స్వరూపుడు నిశ్చలుడు పురాతనుడు

19 దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి

అర్జునా! సమస్త ప్రాణికోట్లయొక్కయు దేహములందు వసించియున్న ఈ ఆత్మ యెన్నడును చంపబడడు కావున ఏ ప్రాణిని గూర్చియు నీవు శోకింపదగదు

20 కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూర్మాతే సఙ్గోఽస్త్వకర్మణి

అర్జునా! నీకు కర్మనుచేయుటయందే అధికారము కలదు కర్మ ఫలముల నాశించుటయందేనాడును నీకధికారములేదు కర్మఫల ములకు నీవు కారణభూతుడవు కాకుము మఱియు కర్మలు మానుట యందును నీకాసక్తి కలుగకుండుగాక!

21 యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ!
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే

ఓ అర్జునా! నీవు యోగనిష్ఠయందుండి సంగమును త్యజించి కార్యము ఫలించినను, ఫలించకపోయినను సమానముగ నున్నవాడవై కర్మలను జేయుము అట్టి సమత్వబుద్ధియే యోగమనబడును

22 ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే

ఓ అర్జున! ఎపుడు మనుజుడు తన మనస్సునందున్నట్టి కోరిక లన్నిటిని సంపూర్ణముగ వదలివేయునో, మఱియు ఆత్మయందే ఆత్మచే (నిర్మల చిత్తముతో) నిరంతరము సంతుష్టుని బొందుచుండునో అప్పు డాతడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును

23 ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి

విషయములందు ప్రవర్తించుచున్న ఇంద్రియములలో నెద్దా నిని మనస్సు అనుసరించిపోవునో అయ్యది మనుజుని యొక్క వివేక మును - జలమందు ఓడను ప్రతికూలవాయువు పెడదారికిలాగుకొని పోవునట్లు హరించివేయుచున్నది

24 తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా

కాబట్టి ఓ అర్జునా! ఎవడు తన యింద్రియములను విషయముల పైకి పోనీయక సర్వవిధముల అరికట్టుచున్నాడో ఆతని జ్ఞానమే మిగుల స్థిరమైయుండును

25 విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః
నిర్మమో నిరహంకారః స శాన్తి మధిగచ్ఛతి

ఎవడు సమస్తములైన కోరికలను శబ్దాదివిషయములను త్యజించి వానియందే మాత్రము ఆశలేక అహంకార మమకార వర్జితుడై ప్రవర్తించునో అట్టివాడె శాంతిని పొందుచున్నాడు

26 యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చమానవః
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే

ఎవడు కేవలము ఆత్మయందే క్రీడించుచు ఆత్మయందే తృప్తి బొందుచు ఆత్మయందే సంతోషపడుచుండునో అట్టి ఆత్మజ్ఞానికిక చేయదగినపని (విధి) యేదియును లేదు

27 ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః

(దేహాదుల కంటె) ఇంద్రియములు గొప్పవి ఇంద్రియముల కంటె మనస్సు గొప్పది మనస్సుకంటె బుద్ధి గొప్పది బుద్ధికంటె గొప్పవాడెవడో ఆతడే ఆత్మ - అనియిట్లు పెద్దలు చెప్పుదురు

28 ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్

గొప్ప బాహువులుకల ఓ అర్జునా! ఈ ప్రకారముగ బుద్ధి కంటె అతీతమైన దానినిగా ఆత్మ నెఱిగి (వివేకముతో గూడిన) బుద్ధిచేత మనస్సును బాగుగ నరికట్టి జయించుటకు కష్టసాధ్యమైనట్టి ఈ కామమను శత్రువును నశింపజేయుము

29 పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

సాధుసజ్జనుల సంరక్షించుట కొఱకును దుర్మార్గులను వినాశ మొనర్చుటకొఱకును ధర్మమును లెస్సగ స్థాపించుటకొఱకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును

30 వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః

అనురాగము భయము క్రోధము వీడిన వారును నాయందే గన్న చిత్తముకలవారును నన్నే ఆశ్రయించినవారునగు అనేకులు ఇట్టి జ్ఞానతపస్సుచే పవిత్రులై నాస్వరూపమును (మోక్షమును) పొందియుండిరి

31 యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః

ఎవనికి సమస్త కర్మలు కోరిక సంకల్పము అనునవి లేక యుండునో జ్ఞానమను అగ్నిచేత దగ్ధమైన కర్మములుగల అట్టివానిని పండితుడని పెద్దలు పేర్కొందురు

32 త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః

ఎవడు కర్మఫలములందాసక్తిని విడనాడి నిరంతరము సంతృప్తిగలవాడై దేనిని ఆశ్రయించకుండునో అట్టివాడు కర్మములందు ప్రవర్తించినను ఒకింతైనను చేయనివాడే యగును

33 బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా

యజ్ఞమునందలి హోమసాధనములు హోమద్రవ్యములు హోమాగ్ని హోమము చేయువాడు హోమము చేయబడినది — అన్నియును బ్రహ్మస్వరూపములే యనెడి ఏకాగ్రభావముతో ఆ యాజ్ఞాది కర్మలను జేయు మనుజుడు బ్రహ్మమునే పొందగలడు

34 తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః

ఓ అర్జునా! అట్టి జ్ఞానమును నీవు తత్త్వవేత్తలగు జ్ఞానులకు సాష్టాంగనమస్కారము చేసియు సమయముచూచి వినయముగ ప్రశ్నించియు, సేవచేసియు వారివలన నెఱుగుము వారు తప్పక నీకుపదేశింపగలరు

35 యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి

ఓ అర్జునా! దేనిని తెలిసికొనినచో మరలనట్టి మోహమును నీవు పొందకుందువో మఱియు దేనిచే సమస్తప్రాణులను నీయందును, నాయందును గూడ చూడగలవో అట్టి జ్ఞానమును తత్త్వవేత్తలవలన తెలిసికొనుము

36 యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా

అర్జునా! బాగుగ ప్రజ్వలింపజేయబడిన అగ్ని కట్టెలనే ప్రకారము బూడిదగా జేయునో ఆ ప్రకారమే జ్ఞానమను అగ్ని సమస్తకర్మములను భస్మమొనర్చివైచుచున్నది

37 న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి

ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది ఏదియును లేదు అట్టి జ్ఞానమును (కర్మ) యోగస్థితిని బొందినవాడు కాలక్రమమున తనయందే స్వయముగ పొందుచున్నాడు

38 శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి

(గురు శాస్త్రవాక్యములందు) శ్రద్ధ గలవాడును (ఆధ్యాత్మిక సాధనలందు) తదేకనిష్ఠతో కూడిన వాడును ఇంద్రియములను లెస్సగ జయించినవాడు నగు మనుజుడు జ్ఞానమును పొందుచున్నాడు అట్లు జ్ఞానమును బొందినవాడై యతడు పరమశాంతిని శీఘ్రముగ బడయగల్గుచున్నాడు

39 సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్

ఇంద్రియ నిగ్రహము గల దేహ ధారి మనస్సుచే సమస్తకర్మములను (కర్మఫలములను) పరిత్యజించి ఏమియుచేయనివాడై చేయింపనివాడై తొమ్మిది ద్వారములుగల పట్టణమగు శరీరమందు హాయిగా ఉండుచున్నాడు

40 ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః

ఎవనియొక్క మనస్సు సమభావమందు (నిశ్చల సత్స్థితియందు లేక సర్వప్రాణులందును ఆత్మను సమముగ చూచుటలో) స్థిరముగ నున్నదో అట్టి వారీజన్మమునందే జనన మరణరూప సంసారమును జయించిన వారగుదురు పరిపూర్ణమైన బ్రహ్మము దోషరహితమైనది సమమైనది కావున (సమత్వమందు స్థితిగల) వారు బ్రహ్మమునందున్న వారేయగుదురు

41 బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే

బాహ్యములగు శబ్దాది విషయములం దాసక్తి లేనివాడు ఆత్మయందెట్టి (నిరతిశయ) సుఖము కలదో అట్టి సుఖమునే పొందుచున్నాడు అతడు బ్రహ్మనిష్ఠయను సమాధితో గూడుకొనినవాడై (బ్రహ్మానుసంధానపరుడై) అక్షయమగు సుఖమును బడయుచున్నాడు

42 యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే
ఆద్యన్తవన్త కౌన్తేయ న తేషు రమతే బుధః

ఓ అర్జునా! (ఇంద్రియ) విషయ సంయోగమువలన గలుగు భోగములు దుఃఖహేతువులును అల్ప కాలముండునవియు నయి యున్నవి కావున విజ్ఞుడగు వాడు వానియందు క్రీడింపడు (ఆసక్తి గొనడు)

43 శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః

ఎవడు శరీరమును విడుచుటకు పూర్వమే యిచ్చోటనే (ఈ జన్మయందే) కామక్రోధముల వేగమును అరికట్ట గలుగుచున్నాడో అతడు యోగియు (చిత్తోపరతిగలవాడును) సుఖవంతుడునగును

14 యోఽన్తః సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి

ఎవడు లోన ఆత్మయందే సుఖించుచు ఆత్మయందే క్రీడించుచు ఆత్మయందే ప్రకాశము కలవాడై యుండునో అట్టి యోగి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందును

45 కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్

కామక్రోధాదులు లేనివారును మనోనిగ్రహము కలవారును ఆత్మతత్త్వము నెఱిగిన వారునగు యత్నశీలురకు బ్రహ్మ సాయుజ్యము (మోక్షము బ్రహ్మానందము) అంతటను (శరీరమున్న పుడును లేనపుడును సర్వత్ర) వెలయుచునే యున్నది

46 ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః

తన్నుతానే యుద్ధరించుకొనవలయును తన్ను అధోగతిని బొందించుకొన రాదు (ఇంద్రియ మనంబులను జయించినచో) తనకు తానే బంధువున్ను (జయించనిచో) తనకు తానే శత్రువున్ను అగును

47 సమం కాయశిరోగ్రీవం ధారయన్న చలం స్థిర
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్

48 ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతే స్థితః
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః

(ధ్యానము చేయువాడు) శరీరము శిరస్సు కంఠము, సమముగ (తిన్నగ) నిలిపి కదలక స్థిరముగ నున్నవాడై దిక్కులను జూడక, నాసికాగ్రమును వీక్షించుచు ప్రశాంత హృదయుడై నిర్భయచేతస్కుడై బ్రహ్మచర్యవ్రతనిష్ఠ గలిగి మనస్సును బాగుగ నిగ్రహించి నాయందు చిత్తముగలవాడై నన్నే పరమగతిగ నమ్మి, సమాధి (ధ్యాన) యుక్తుడై యుండవలెను

49 యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః
శాన్తిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి

మనోనిగ్రహముగల యోగి ఈ ప్రకారముగ ఎలపుడును మనస్సును ఆత్మధ్యానమందు నిలిపి, నాయందున్నట్టిదియు (నా

స్వరూపమైనదియు) ఉత్కృష్ట మోక్షరూపమైనదియు (పరమానంద రూపమైనదియు) నగు శాంతిని పొందుచున్నారు

50 యతో యతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్

చంచలస్వభావము గలదియు నిలుకడలేనిదియునగు మనస్సు యెచటెచట (ఏయే విషయముల యందు) సంచరించునో అచటచట నుండి దానిని మరలించి ఆత్మయందే స్థాపితము చేయవలెను ఆత్మక ధీనముగ నొనర్పవలెను

51 ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్

ప్రశాంతచిత్తుడును (కామక్రోధాది) రజోగుణ వికారములు లేనివాడును బ్రహ్మరూపమును పొందినవాడును దోషరహితుడునగు ఈ ధ్యానయోగిని సర్వోత్తమమగు సుఖము (ఆత్మానందము) పొందు చున్నది గదా! (అట్లు పొందుట శాస్త్రప్రసిద్ధమని భావము)

52 సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః

యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు (ఆత్మైక్యము నొందిన యోగి) సమస్త చరాచర ప్రాణికోట్ల యందును సమదృష్టి గలవాడై తన్ను సర్వభూతము లందున్నవానిగను సర్వభూతములు తనయందున్నవిగను చూచుచున్నాడు

53 ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః

ఓ అర్జునా! సమస్త ప్రాణులయందును సుఖమును గాని, దుఃఖ మును గాని, తనతోడ పోల్చుకొనుచు (తన ఆత్మవంటిదే తక్కిన ఆత్మ

లనెడి భావముతో) తనవలె సమానముగ ఎవడు చూచునో అట్టియోగి శ్రేష్ఠుడని తలంపబడుచున్నాడు

54 అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే

గొప్ప బాహువులుగల ఓ అర్జునా! మనస్సును నిగ్రహించుట కష్టమే మరియు మనస్సు చంచలమైనదే ఇట ఏలాంటి సంశయము లేదు అయినను అభ్యాసముచేతను వైరాగ్యముచేతను అది నిగ్రహింపబడగలదు

55 పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి

ఓ అర్జునా! అట్టి యోగభ్రష్టునకీ లోకమందుగాని పరలోకమందుగాని వినాశము కలుగనే కలుగదు నాయనా! మంచికార్యములు చేయువాడెవడును దుర్గతిని పొందడుగదా!

56 ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్

పట్టుదలతో ప్రయత్నించునట్టి యో పాపరహితుడై అనేక జన్మలందు చేయబడిన అభ్యాసముచే యోగసిద్ధిని బ ందినవాడై, ఆ పిదప సర్వోత్తమమగు (మోక్షు) గతిని బడయుచున్నాడు

57 మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ

ఓ అర్జునా! నాకంటె వేఱుగ మరియొకటి ఏదియు లేనేలేదు దారమందు మణులవలె నాయందే సమస్త ప్రపంచము కూర్చబడినది,

58 దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే

ఏలయనగా దైవసంబంధమైనదియు (అలౌకిక సామర్థ్యము కలదియు) త్రిగుణాత్మకమైనదియునగు ఈ నాయొక్క మాయ (ప్రకృతి) దాటుటకు కష్టసాధ్యమైనది (అయినను) ఎవరు నన్నే శరణుబొందుచున్నారో వారీ మాయను దాటివేయగలరు

59 యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః

పుణ్యకార్య తత్పరులగు ఏ జనులయొక్క పాపము నశించి పోయినదో అట్టివారు (సుఖదుఃఖాది) ద్వంద్వరూపమగు అజ్ఞానము నుండి విడువబడినవారై దృఢవ్రతులై నన్ను సేవించుచున్నారు

60 అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః

ఎవడు మరణకాలమందుకూడ నన్నే స్మరించుచు శరీరమును విడిచిపోవుచున్నాడో, అతడు నా స్వరూపమును పొందుచున్నాడు ఇట సంశయమేమియును లేదు

61 తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్యస్య సంశయః

కాబట్టి ఎల్లకాలములందును నన్ను స్మరించుచు (నీ స్వధర్మమగు) యుద్ధమునుకూడ జేయుము ఈ ప్రకారముగ నాయందు సమర్పింపబడిన మనోబుద్ధులు గలవాడవైనచో నీవు నన్నే పొందగలవు ఇట సంశయము లేదు

62 అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్

ఓ అర్జునా! అభ్యాసమను యోగముతో గూడినదియు ఇతర విషయములపైకి పోనిదియునగు మనస్సుచేత అప్రాకృతుడైన (లేక స్వయంప్రకాశ స్వరూపుడైన) సర్వోత్తముడగు పరమపురుషుని మరల మరల స్మరించుచు మనుజుడు అతనినే పొందుచున్నాడు

63 ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్

ఎవడు ఇంద్రియద్వారము లన్నిటిని బాగుగ అరికట్టి మనస్సును హృదయమందు(ఆత్మయందు) లెస్సగా స్థాపించి శిరస్సునందు (బ్రహ్మ రంధ్రమందు) ప్రాణవాయువును ఉంచి ఆత్మనుగూర్చిన ఏకాగ్ర చింతనము (యోగధారణ) గలవాడై పరబ్రహ్మమునకు వాచకమైన ఓమ్ అను ఒక అక్షరమును వదలునో అతడు సర్వోత్తమ స్థానమును (మోక్షమును) బొందుచున్నాడు

64 అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః

ఓ అర్జునా! ఎవడు అనన్యచిత్తుడై నన్ను గూర్చి ప్రతిదినము నిరంతరము స్మరించుచుండునో, అట్టి నిరంతర ధ్యానపరునకు నేను సులభముగ పొందబడువాడనై యున్నాను

65 మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః

సర్వోత్తమమైన మోక్షమును పొందిన మహాత్ములు నన్ను పొందినవారై మరల దుఃఖనిలయమై అనిత్యమైనట్టి-జన్మను ఎన్నటికిని పొందనేరరు

66 పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా
యస్యాన్తః స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్

ఓ అర్జునా! ఎవనియందీ ప్రాణికోట్లన్నియు నివసించుచున్న ఎవనిచే ఈ సమస్త జగత్తును వ్యాపింపబడియున్నదో, అట్టి పరమ పురుషుడు (పరమాత్మ) అనన్యమగు (అచంచలమగు) భక్తిచేతనే పొందబడగలడు

67 వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్

యోగియైనవాడు దీనిని (ఈ అధ్యాయమున చెప్పబడిన అక్షర పరబ్రహ్మతత్త్వము మున్నగువానిని) ఎఱిఁగి వేదములందును యజ్ఞము లందును, తపస్సులందును ఏ పుణ్యఫలము చెప్పబడి యున్నచో దాని నంతను అతిక్రమించుచున్నాడు (దానిని మించిన పుణ్యఫలమును బొందుచున్నాడు) మఱియు అనాదియగు సర్వోత్తమ (బ్రహ్మ) స్థానమును బొందుచున్నాడు

68 అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని

ఓ అర్జునా! ఈ (ఆత్మజ్ఞానమను) ధర్మమునందు శ్రద్ధలేనట్టి మనుజులు నన్ను పొందనివారై మృత్యురూపమైన సంసారమార్గము నందే మఱలుచున్నారు (తిరుగుచున్నారు లేక నిక్కముగ వర్తించు చున్నారు)

69 మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః

ఈ సమస్తప్రపంచము అవ్యక్తరూపుడనగు నాచే వ్యాపింపబడి యున్నది సమస్తప్రాణికోట్లు నాయందున్నవి నేను వానియందుండుట లేదు (నాకవి ఆధారములు కావు)

70 మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్

ఓ అర్జునా! మహాత్ములైతే దైవీప్రకృతిని (దేవసంబంధమైన స్వభావమును) ఆశ్రయించి వారలై నన్ను సమస్త ప్రాణులకును ఆది కారణునిగను, నాశరహితునిగను ఎఱిగి వేఱొకదానియందు మనస్సు నుంచని వారలై నన్నే సేవించుచున్నారు

71 అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్

ఎవరు ఇతరభావములు లేనివారై నన్నుగూర్చి చింతించుచు ఎడతెగక ధ్యానించుచున్నారో ఎల్లప్పుడు నా యందే నిష్ఠగలిగియుండు నట్టి వారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను

72 పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః

ఎవడు నాకు భక్తితో ఆకునుగాని, పువ్వునుగా , పండునుగాని, జలమునుగాని సమర్పించుచున్నాడో, అట్టిపరిశుద్ధాంతఃకరణునియొక్క (లేక పరమార్థ యత్నశీలునియొక్క) భక్తిపూర్వకముగ నొసంగబడిన ఆ పత్రపుష్పాదులను నేను ప్రీతితో ఆరగించుచున్నాను (అనుభవించుచున్నాను)

73 యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్

ఓ అర్జునా! నీ వేదిచేసినను తినినను హోమము నొనర్చినను దానము చేసినను తపస్సు చేసినను దానిని నాకర్పింపుము

74 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః

నాయందే మనస్సుగలవాడవును నా భక్తుడవును పూజించువాడవును అగుము నన్నే నమస్కరింపుము ఈ ప్రముగ చిత్తమును నాయందే నిలిపి నన్నే పరమగతిని నెన్నుకొవాడవై తుదకు నన్నే పొందగలవు

75 తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే

ఎల్లప్పుడు నాయందును మనస్సుగలవారై ప్రీతితో భజించునట్టి వారికి దేనిచే వారు నన్ను పొందగలరో అట్టి జ్ఞానయోగమును (ఆత్మానాత్మ వివేచనా శక్తిని) ప్రసాదించుచున్నాను

76 తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా

వారలకు(అట్టిభక్తులకు) దయజూపుటకొఱకు నేనే వారి యంకరణమునందు నిలచి ప్రకాశమానమగు జ్ఞానదీపముచేత, అజ్ఞానజమగు అంధకారమును నశింపజేయుచున్నాను

77 అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ

ఓ అర్జునా! సమస్త ప్రాణులయొక్క హృదయమునందు ప్రత్యగాత్మను నేనే అయియున్నాను మఱియు ప్రాణులయొక్క మధ్యాంతములున్ను (సృష్టిస్థితి లయములున్ను) నేనే అయియున్నా

78 యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సమ్భవమ్

(ఈ ప్రపంచమున) ఐశ్వర్యయుక్తమైనదియు కాంతివంమైనదియు (నిర్మలమైనదియు), ఉత్సాహముతో కూడినదియు (శవంతమైనదియు)నగు వస్తువు (లేక ప్రాణి) ఏది యేది కలదో అదియనా తేజస్సుయొక్క అంశమువలన కలిగిన దానినిగ నీవెఱుంగుము

79 భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప

శత్రువులను తపింపజేయువాడా! ఓ అర్జునా! ఈ విధమగు రూపముగల నేను అనన్యభక్తిచేత మాత్రమే యథార్థముగ తెలిసికొనుటకును చూచుటకును ప్రవేశించుటకును, సాధ్యమైనవాడనగుచున్నాను

80 మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ

అర్జునా! ఎవడు నాకొఱకే కర్మలఁజేయునో [లేక నా సంబంధమైన (దైవ సంబంధమైన) కార్యములనే జేయునో] నన్నే పరమప్రాప్యముగ నమ్మియుండునో నాయందే భక్తిగలిగియుండునో, సమస్త దృశ్యపదార్థములందును సంగమును (ఆసక్తిని మమత్వమును) విడిచివేయునో సమస్త ప్రాణులయందును ద్వేషము లేకయుండునో అట్టివాడు నన్ను పొందుచున్నాడు

81 సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తేప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః

ఎవరు ఇంద్రియములన్నిటిని బాగుగ నిగ్రహించి (స్వాధీనపఱచుకొని) ఎల్లెడల సమభావముగలవారై సమస్త ప్రాణులకును హితమొనర్చుటయందాసక్తి గలవారై ఇట్టిదని నిర్దేశింప శక్యముకానిదియు ఇంద్రియములకు గోచరము కానిదియు చింతింపనలవికానిదియు నిర్వికారమైనదియు చలింపనిదియు నిత్యమైనదియు, అంతటను వ్యాపించియున్నదియు నగు అక్షరబ్రహ్మము నెవరు ధ్యానించుచున్నారో వారు నన్ను పొందుచున్నారు

82 మయ్యేవ మన అధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః

నా యందే మనస్సును స్థిరముగా నిలుపుము నాయందే బుద్ధిని ప్రవేశపెట్టుము ఎమ్మట నాయందే నివసింతువు సందేహము లేదు

83 అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ

84 సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్తస్స మే ప్రియః

సమస్త ప్రాణుల యెడల ద్వేషము లేనివాడును మైత్రికరుణ గలవాడును అహంకార మమకారములు లేనివాడును సుఖదుఃఖము లందు సమభావముగలవాడును ఓర్పుగలవాడును ఎల్లప్పుడు సంతృప్తితో గూడియుండువాడును యోగయుక్తుడును మనస్సును స్వాధీనపఱచుకొనినవాడును దృఢమైన నిశ్చయము గలవాడును నాయందు సమర్పింపబడిన మనోబుద్ధులు గలవాడును నాయందు భక్తి గలవాడును ఎవడు కలడో అతడు నాకు ఇష్టుడు

85 యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియా

ఎవరైతే శ్రద్ధావంతులై నన్నే పరమగతిగ నమ్మి (నాయందాసక్తి గలవారై) ఈ అమృతరూపమగు (మోక్షసాధనమైన) ధర్మమును (ఇప్పుడు చెప్పబడిన ప్రకారము) అనుష్ఠించుదురో అట్టి భక్తులు నాకు మిక్కిలి ఇష్టులు

శ్రీ భగవానువాచ

86 ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః

శ్రీ భగవంతుడు చెప్పెను — కుంతీ పుత్రుడవగు ఓ అర్జునా! ఈ శరీరమే క్షేత్రమనబడుచున్నది ఈదీనిని తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడని క్షేత్ర క్షేత్రజ్ఞుల నెఱిగినవారు చెప్పుదురు

87 క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ

అర్జునా ! సమస్త క్షేత్రములందును (శరీరములందును) నన్ను క్షేత్రజ్ఞునిగ కూడ నెఱుఁగుము క్షేత్ర క్షేత్రజ్ఞులను గూర్చిన జ్ఞానమేది కలదో అదియే వాస్తవమగు జ్ఞానమని నా యభిప్రాయము

88 అమానిత్వమదమ్భిత్వ మహింసా క్షాన్తిరార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః

89 ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్

90 అసక్తిరన భిష్వఙ్గః పుత్రదార గృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు

91 మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వ మరతిర్జన సంసది

92 అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతజ్జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా

తన్ను తాను పొగడుకొనకుండుట డంబము లేకుండుట, (మనోవాక్కాయములచే)పరప్రాణులను బాధింపకుండుట,ఓర్పు గలిగియుండుట ఋజుత్వము (శుద్ధి) గలిగియుండుట, సన్మార్గమున (మోక్షమార్గమున) స్థిరముగా నిలబడుట, మనస్సును బాగుగా నిగ్రహించుట ఇంద్రియ విషయములగు శబ్దస్పర్శాదులందు విరక్తి గలిగియుండుట, అహంకారము లేకుండుట, పుట్టుక చావు, ముసలితనము రోగము - అనువానివలన కలుగు దుఃఖమును, దోషమును మాటిమాటికి స్మరించుట కొడుకులు (సంతానము) భార్య ఇల్లు మున్నగు వానియందు ఆసక్తి లేకుండుట, మఱియు వానియందు తగులము లేకుండుట (వారికి కలుగు సుఖదుఃఖ

ములు తనకే కలిగినట్లు అభిమానింపకుండుట) ఇష్టానిష్టములు (శుభాశుభములు) సంప్రాప్తించినపు డెల్లపుడును సమబుద్ధి గలిగియుండుట నా యందు (భగవంతుని యందు) అనన్యమైన (నిశ్చల) భక్తిగలిగి యుండుట ఏకాంత ప్రదేశమును (ప్రతిబంధము లేని చోటును) ఆశ్రయించుట జనసమూహమునందు ప్రీతి లేకుండుట అధ్యాత్మ జ్ఞానము (ఆత్మనిష్ఠ) నిరంతరము గలిగియుండుట తత్త్వజ్ఞానము యొక్క గొప్ప ప్రయోజనమును తెలిసికొనుట అను నిదియంతయు జ్ఞానమని చెప్పబడును దీనికి వ్యతిరేకమైనది అజ్ఞానము (అని తెలియదగినది)

93 ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే

ఆత్మను (ప్రత్యగాత్మను లేక పరమాత్మను) కొందఱు శుద్ధ మగు మనస్సుచే ధ్యానయోగము ద్వారా తమ యందు గాంచు చున్నారు (సాక్షాత్కరించుకొనుచున్నారు) అట్లే మఱికొందఱు సాంఖ్యయోగముచేతను ఇంక కొందఱు కర్మయోగముచేతను చూచు చున్నారు (అనుభూత మొనర్చుకొనుచున్నారు)

94 సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వ వినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి

సమస్త ప్రాణులందును సమముగనున్నట్టి పరమాత్మను, ఆయా ప్రాణుల దేహాదులు నశించినను నశింపనివానినిగ ఎవడు చూచు చున్నాడో (తెలిసికొనుచున్నాడో) అతడే నిజముగ చూచు వాడగును (విజ్ఞుడని భావము)

95 అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే

ఓ అర్జున ! ఆదిలేనివాడు (కారణరహితుడు) అగుటచేతను (త్రి) గుణరహితుడగుట వలనను ఈ పరమాత్మ శరీరమందున్నప్పటికిని ఏమియు చేయకయు దేనిచేతను అంటబడకయు నున్నాడు

96 యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే

సర్వత్ర వ్యాపించియున్న ఆకాశము సూక్ష్మముగుటవలన ఏ ప్రకారముగ (ధూళి మున్నగు వానిచే) అంటబడదో ఆ ప్రకారమే శరీరమంతటను (లేక సకలశరీరములందును) వెలయుచున్న పరమాత్మ (శరీర గుణదోషములచే) అంటబడకయున్నాడు.

97 యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత

ఓ అర్జునా! సూర్యుడొక్కడే ఈ సమస్త లోకమును ఎట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ ఈ సమస్త క్షేత్రమును ప్రకాశింపజేయుచున్నాడు

98 నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి

ఎప్పుడు వివేకవంతుడు (సత్త్వాది) గుణముల కంటె నితరమును కర్తగా నెంచడో, మఱియు తన్ను గుణముల కంటె వేఱుగు వానినిగ తెలిసికొనుచున్నాడో అపుడాతడు నా స్వరూపమును (మోక్షమును) బొందుచున్నాడు

99 గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే

జీవుడు దేహోత్పత్తికి కారణభూతములగు ఈ మూడు గుణములను దాటి (దాటినవాడై) పుట్టుక, చావు ముసలితనము దుఃఖములు —

అను వానిచేతి లెస్సగ విడువబడినవాడై మోక్షమును (మరణరహిత
ఆత్మస్థితిని) బొందుచున్నాడు

100 మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే

ఎవడు నన్నే అచంచలమైన భక్తియోగముచేత సేవించుచున్నాడో అతడు గుణములన్నిటిని లెస్సగా దాటివైచి బ్రహ్మముగా నగుటకు (జీవన్ముక్తుడగుటకు) సమర్థుడగుచున్నాడు

101 బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ

ఏలయనగా నేను నాశరహితమును నిర్వికారమును శాశ్వత ధర్మస్వరూపమును (దుఃఖమిశ్రితము కాని) నిరతిశయ (అచంచల) ఆనందస్వరూపమును అగు బ్రహ్మమునకు ఆశ్రయమును (అనగా బ్రహ్మముయొక్క స్వరూపమును) అయి యున్నాను

102 నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛన్త్యమూఢాః
పదమవ్యయం తత్

అభిమానము (లేక అహంకారము) అవివేకము లేనివారును సంగము దృశ్యపదార్థములందాసక్తి అను దోషమును జయించిన వారును నిరంతరము ఆత్మజ్ఞానము (బ్రహ్మనిష్ఠ) గలవారును కోరికలన్నియు లెస్సగ (వాసనాసహితముగ) తొలగినవారును సుఖదుఃఖములగు ద్వంద్వములనుండి బాగుగ విడువబడినవారును అగు జ్ఞానులు అట్టి అవ్యయమగు బ్రహ్మపదమును (మోక్షమును) బొందుచున్నారు

103 మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి

నాయొక్కయే అనాదియగు (నిత్యమగు) అంశము జీవలోకమందు జీవుడై ప్రకృతియందున్న త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణ మనంబులను ఆఱు ఇంద్రియములను ఆకర్షించుచున్నది

104 శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్

(దేహేంద్రియాది సంఘాతమునకు) ప్రభువగు జీవుడు శరీరమును విడుచుచున్నప్పుడును నూతన శరీరమును పొందుచున్నపుడును— పుష్పాది స్థానములనుండి గాలివాసనలను గ్రహించిపోవు చందమున పంచేంద్రియములు మనస్సు అను ఆఱింటిని గ్రహించి వెడలుచున్నాడు

105 యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః

(ఆత్మ సాక్షాత్కారమునకై) ప్రయత్నము చేయుచున్న యోగులు తమయందున్నట్టి ఈ ఆత్మను చూచుచున్నారు (అనుభూతమొనర్చుకొనుచున్నారు) అట ప్రయత్నము చేయుచున్నవారైనను చిత్తశుద్ధిలేని అవివేకులు ఈ ఆత్మను చూడజాలకున్నారు

106 గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా
పుష్ణామి చౌషధీస్సర్వాః సోమో భూత్వా రసాత్మకః

మఱియు నేను భూమిని ప్రవేశించి శక్తిచేత సమస్త ప్రాణికోట్లను ధరించుచున్నాను (నిలుపుచున్నాను) రసస్వరూపుడగు చంద్రుడనై సస్యములన్నింటిని పోషించుచున్నాను

107 అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్

నేను వైశ్వానరుడను జఠరాగ్నిగానము ప్రాణులయొక్క శరీరమును ఆశ్రయించి ప్రాణాపానవాయువులతో గూడుకొని నాలుగు విధములగు అన్నమును పచనము చేయుచున్నాను

108 సర్వస్య చాహం హృది సన్నివిష్టోమత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్

నేను సమస్తప్రాణులయొక్క హృదయమందున్నవాడను నా వలననే (జవులకు) జ్ఞాపకశక్తి జ్ఞానము (తెలివి) మఱపు కలుగు చున్నవి వేదములన్నిటిచేతను తెలియదగినవాడను నేను అయి యున్నాను మఱియు వేదము నెఱిగినవాడను కూడ నేనే అయి యున్నాను

109 అభయం సత్త్వ సంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితి
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్

110 అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాన్తిర పైశునమ్
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్

111 తేజః క్షమాధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత

శ్రీ భగవంతుడు చెప్పెను —

ఓ అర్జునా! (1) భయము లేకుండుట (2) అంతఃకరణశుద్ధి (3) జ్ఞానయోగమునందుండుట (4) దానము (5) బాహ్యేంద్రియ నిగ్రహము (6) (జ్ఞాన) యజ్ఞము (7) వేదశాస్త్రాదుల అధ్యయనము (8) తపస్సు (9) ఋజుత్వము (కపటము లేకుండుట) (10) ఏ ప్రాణి కిన్ని బాధ గలుగజేయకుండుట (అహింస) (11) సద్వస్తువగు పర మాత్మనాశ్రయించుట, లేక నిజముపలుకుట (సత్యము) (12) కోపము లేకుండుట (13) త్యాగబుద్ధి గలిగియుండుట (14) శాంతిస్వభావము (15) కొండెములు చెప్పకుండుట (16) ప్రాణులందు దయ గలిగి యుండుట (17) విషయలోలత్వము లేకుండుట, అనగా విషయములం దాసక్తి లేకుండుట దానిచే చలింపకుండుటయు (18) మృదుత్వము (క్రౌర్యము లేకుండుట) (19) (ధర్మవిరుద్ధ కార్యములందు) సిగ్గు,

(20) చంచలస్వభావము లేకుండుట (21) ప్రతిభ(లేక బ్రహ్మతేజస్సు) (22) ఓర్పు (కష్టసహిష్ణుత) (23) ధైర్యము (24) బాహ్యాభ్యంతర శుచిత్వము (25) ఎవనికిని ద్రోహము చేయకుండుట ద్రోహచింతమున లేకుండుట (26) స్వాతిశయ లేకుండుట (తాను పూజింపదగినవాడనను అభిమానము గర్వము లేకుండుట) అగు నీ సుగుణములు దైవసంపత్తి యందు పుట్టినవానికి కలుగుచున్నవి (అనగా దైవసంపత్తిని పొందదగి పుట్టిన వారికి కలుగుచున్నదని భావము)

112 దమ్భోదర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థసమ్పదమాసురీమ్

ఓ అర్జునా! డంబము గర్వము అభిమానము (దురహంకారము), కోపము (వాక్కు మున్నగువానియందు) కాఠిన్యము, అవివేకము అను ఈ దుర్గుణములు అసురసంపదయందు పుట్టినవానికి కలుగుచున్నవి (అనగా అసురసంపత్తిని పొందదగి జన్మించినవారికి కలుగుచున్నవని భావము)

113 తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు

(ఆ ప్రకారము) సమస్తప్రాణులలోగల ఆత్మయగు నన్ను ద్వేషించువారును క్రూరులును అశుభ (పాప) కార్యములను జేయువారునగు అట్టి మనుజాధములను నేను జననమరణరూపములగు ఈ సంసారమార్గములందు అసురసంబంధమైన నీచజన్మలందే యెల్లప్పుడు త్రోసివైచెదను

114 త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామః క్రోధస్తథాలోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్

కామము, క్రోధము, లోభము అను నీ మూడును మూడు విధములగు నరకద్వారములు ఇవి తనకు (జీవునకు) నాశము గలుగ

జేయును—కాబట్టి ఈ మూడింటిని విడనాడవలెను [లేక కామము, క్రోధము లోభము] అను మూడు విధములగు ఈ అసురసంపద నరకమునకు ద్వారము - అనియు చెప్పవచ్చును

115 యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్

ఎవడు శాస్త్రోక్తమగు విధిని విడిచిపెట్టి తన యిష్టము వచ్చినట్లు ప్రవర్తించునో అట్టివాడు పురుషార్థసిద్ధినిగాని సుఖమునుగాని ఉత్తమగతియగు మోక్షమునుగాని పొందనేరడు

116 తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హ స

కావున నీకు చేయదగినదియు చేయరాదనియు నిర్ణయించునపుడు శాస్త్రము ప్రమాణమైయున్నది శాస్త్రమునందు చెప్పబడిన దానిని తెలిసికొని దానిననుసరించి నీవీ ప్రపంచమున కర్మమును జేయదగును

117 దేవద్విజగురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే

దేవతలను బ్రహ్మనిష్ఠులను, గురువులను జ్ఞానులను (మహాత్ములను బ్రహ్మజ్ఞానముగల పెద్దలను) పూజించుట, బాహ్యాభ్యంతర శుద్ధిగలిగియుండుట ఋజుత్వముతో గూడియుండుట (కుటిలత్వము లేకుండుట మనోవాక్కాయములతో ఏకరీతిగా వర్తించుట) బ్రహ్మచర్య వ్రతమును పాలించుట ఏ ప్రాణిని హింసింపకుండుట శారీరక (శరీరసంబంధమైన) తపస్సని చెప్పబడుచున్నది

118 అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే

ఇతరుల మనస్సునకు బాధగలిగింపనిదియు, సత్యమైనదియు, ప్రియమైనదియు, మేలు గలిగించునదియు నగు వాక్యమును వేదాదు యొక్క అధ్యయనమును అభ్యసించుట (వేదము ఉపనిషత్తులు భగవద్గీత భారత భాగవత రామాయణాదులు మున్నగువానిని అధ్యయనము చేయుట ప్రణవ దిమంత్రములను జపించుట) వాచిక తపస్సని చెప్పబడుచున్నది

119 మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానస ముచ్యతే

మనస్సును నిర్మలముగానుంచుట (కలతనొందనీయక స్వచ్ఛముగా నుంచుట) ముఖప్రసన్నత్వము (క్రూరభావము లేకుండుట) పరమాత్మను గూర్చిన మననము (దైవధ్యానము) గలిగియుండుట [లేక దృశ్యసంకల్పము లెవ్వియు లేక ఆత్మయందే స్థితిగలిగియుండుట అను (వాఙ్మౌన సహిత) మనోమౌనము] మనస్సును బాగుగ నిగ్రహించుట పరిశుద్ధమగు భావము గలిగియుండుట (మోసము మున్నగునవి లేకుండుట) అను నివి మానసిక తపస్సని చెప్పు చున్నది

120 ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా

పరబ్రహ్మమునకు ఓమ్ అనియు తత్ అనియు సత్ అనియు మూడు విధములగ పేర్లు చెప్పబడినవి ఆ నామత్రయము వలననే (దాని యుచ్చారణచేతనే) పూర్వము బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు) వేదములు యజ్ఞములు నిర్మింపబడినవి

121 అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ

ఓ అర్జునా! అశ్రద్ధతో చేయబడిన హోమముగాని, దానముగాని, తపస్సుగాని, ఇతర కర్మలుగాని అసత్తని చెప్పబడును అవి ఇహలోక

ఫలమును (సుఖమును) గాని, పరలోక ఫలమును(సుఖమును) గాని కలుగ జేయవు

122 కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః

కామ్యకర్మలను వదలుటయే సన్న్యాసమని కొందఱు పండితులు చెప్పుదురు మఱికొందఱు పండితులు సమస్త కర్మల యొక్క ఫలమును త్యజించుటయే త్యాగమని వచించుదురు

123 యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్

యజ్ఞము దానము తపస్సు అనెడి కర్మములు త్యజింపదగినవి కావు చేయదగినవియే యగును ఏలయనిన ఆ యజ్ఞదాన తపంబులు బుద్ధిమంతులకు పవిత్రతను (చిత్తశుద్ధిని) కలుగజేయునవై యున్నవి

124 సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్

విభజింపబడి వేఱు వేఱుగనున్న సమస్త చరాచర ప్రాణులందును ఒక్కటైన నాశరహితమగు ఆత్మవస్తువును (దైవముయొక్క ఉనికిని) విభజింపబడక (ఏకముగ) నున్నట్లు ఏ జ్ఞానముచేత నెఱుఁగుచున్నాడో అట్టి జ్ఞానము సాత్త్వికమని తెలిసికొనుము

125 నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్
అఫల ప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే

శాస్త్రముచే నియమింపబడినదియు, ఫలాపేక్షగాని, ఆసక్తి (సంగము) అభిమానముగాని రాగద్వేషములుగాని లేకుండ చేయబడునదియు సాత్త్విక కర్మ మనబడును

126 ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే

సంగమము (ఆసక్తిని) ఫలాపేక్షను విడిచినవాడును నేను కర్తనను అభిమానము, అహంభావము లేనివాడును ధైర్యముతోను, ఉత్సాహముతోను గూడియున్నవాడును కార్యము సిద్ధించినను సిద్ధింపకున్నను వికారమును జెందనివాడునగు కర్త సాత్వికకర్తయని చెప్పబడుచున్నాడు

127 యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః

ఎవనివలన ప్రాణులకు ఉత్పత్తి మొదలగు ప్రవర్తనము (ప్రవృత్తి) కలుగుచున్నదో ఎవనిచేత ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో ఆతనిని (అట్టి పరమాత్మను) మనుజుడు స్వకీయకర్మముచే నారాధించి జ్ఞానయోగ్యతారూపసిద్ధిని పొందుచున్నాడు

128 బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ

129 వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః

130 అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే

అతి నిర్మలమైన బుద్ధితో గూడినవాడును, ధైర్యముతో మనస్సును నిగ్రహించువాడును శబ్ద స్పర్శాది విషయములను విడిచిపెట్టువాడును, రాగద్వేషములను పరిత్యజించువాడును, ఏకాంతస్థలము నందు నివసించువాడును మితాహారమును సేవించువాడును వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనము చేసికొనినవాడును,

ఎల్లప్పుడును ధ్యానయోగతత్పరుడై యుండువాడును వైరాగ్యమును లెస్సగ నవలంబించినవాడును అహంకారమును బలమును (కామ క్రోధాది సంయుక్తమగు బలమును లేక మొండిపట్టును) డంబమును కామమును(విషయాసక్తిని)క్రోధమును వస్తుసంగ్రహణమును బాగుగ విడచిపెట్టినవాడును మమకారము లేనివాడును శాంతుడును అయి యుండువాడు బ్రహ్మస్వరూపము నొందుటకు (బ్రహ్మైక్యమునకు మోక్షమునకు) సమర్థుడగుచున్నాడు

131 భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్

భక్తిచేత మనుజుడు నేనెంతటివాడనో, ఎట్టివాడనో యథార్థముగ తెలిసికొనుచున్నాడు ఈ ప్రకారముగ నన్ను గూర్చి వాస్తవముగా నెఱింగి అనంతరము నాయందు ప్రవేశించుచున్నాడు

132 ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా

ఓ అర్జునా! జగన్నియామకుడగు పరమేశ్వరుడు (అంతర్యామి) మాయచేత సమస్త ప్రాణులను యంత్రము నారోహించిన వారివలె (కీలుబొమ్మలను వలె) త్రిప్పుచు సమస్త ప్రాణుల యొక్క హృదయమున వెలయుచున్నాడు

133 తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్

ఓ అర్జునా! సర్వవిధముల ఆ (హృదయస్థుడగు) ఈశ్వరునే శరణుబొందుము అతని యనుగ్రహముచే సర్వోత్తమమగు శాంతిని శాశ్వతమగు మోక్షపదవిని నీవు పొందగలవు

134 మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతి జానే ప్రియోఽసి మే

నాయందు మనస్సునుంచుము నా యెడల భక్తి గలిగి యుండుము నన్నారాధించుము నాకు నమస్కరింపుము అట్లు కావించెదవేని నీవు నన్నే పొందగలవు నీవు నాకిష్టుడవై యున్నావు కాబట్టి యథార్థముగా ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను

135 సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

సమస్త ధర్మములను విడిచిపెట్టి నన్నొక్కని మాత్రము శరణు బొందుము నేను సమస్త పాపముల నుండియు నిన్ను విముక్తునిగ జేసెదను

136 య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః

ఎవడు అతిరహస్యమైన ఈ గీతాశాస్త్రమును నా భక్తులకు చెప్పునో అట్టివాడు నాయందుత్తమ భక్తిగలవాడై సంశయరహితుడై (లేక నిస్సందేహముగ) నన్నే పొందగలడు

137 న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి

మనుజులలో అట్టివానికంటె నాకు మిక్కిలి ప్రియము నొనర్చు వాడెవడును లేడు మఱియు అతనికంటె నాకు మిక్కిలి ఇష్టుడైన వాడు ఈ భూలోకమున మఱియొకడు కలుగబోడు

138 శ్రద్ధావాన నసూయశ్చ శృణుయాదపి యో నరః
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్య కర్మణామ్

ఏ మనుజుడు శ్రద్ధతోగూడిన వాడును అసూయలేనివాడునునై ఈ గీతాశాస్త్రమును వినునో, అట్టివాడును పాపవిముక్తుడై పుణ్యకార్యములను చేయున వారియొక్క పుణ్యలోకములను పొందును,

139 కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ త్వయైక్యాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రనష్టస్తే ధనంజయ

ఓ అర్జునా! నాయీబోధను నీవు ఏకాగ్ర మనస్సుతో వింటివా? అజ్ఞానజనితమగు నీయొక్క భ్రమ (దానిచే) సంపూర్ణముగా నశించినదా?

అర్జున ఉవాచ —

140 నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ

(అర్జునుడు చెప్పెను —)

ఓ శ్రీకృష్ణా! నీ యనుగ్రహమువలన నా యజ్ఞానము నశించినది జ్ఞానము (ఆత్మస్మృతి) కలిగినది, సంశయములు తొలగినవి ఇక నీ యాజ్ఞను నెఱవేర్చెదను

సంజయ ఉవాచ —

141 యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ

సంజయుడు చెప్పెను —

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడున్ను ఎచట ధనుర్ధారియగు అర్జునుడున్ను ఉందురో అచట సంపదయు విజయమున్ను ఐశ్వర్యమున్ను దృఢమగు నీతియు ఉండునని నా యభిప్రాయము

వైశంపాయనుడు జనమేజయుని కిట్లు చెప్పెను —

వైశమ్పాయన ఉవాచ

142 గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర సంగ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్ వినిఃసృతా

(వైశంపాయనుడు జనమేజయునితో ఇట్లు చెప్పెను —)

ఇతర అనేక శాస్త్రములను సంగ్రహించవలసిన పని యేమి? భగవద్గీతనే చక్కగ పఠించవలెను ఏలయనిన అది స్వయముగ సాక్షాత్ భగవంతుడగు పద్మనాభుని ముఖకమలము నుండి వెలువడనది

143 సర్వశాస్త్రమయీ గీతా సర్వదేవ మయో హరిః
సర్వతీర్థమయీ గఙ్గా సర్వవేదమయో మనుః

భగవద్గీత సర్వశాస్త్రమయమైనది శ్రీహరి సర్వదేవమయుడు గంగ సర్వతీర్థమయి, మనువు సర్వవేదమయుడు

144 గీతా గఙ్గా చ గాయత్రీ గోవిన్దేతి హృది స్థితే
చతురకారసంయుక్తే పునర్జన్మ న విద్యతే

గీత గంగ గాయత్రి, గోవిందుడు — అను గ కార యుక్తములగు ఈ నాలుగు నామములను హృదయమందు ధారణ్యయొనర్చుకొనినచో మనుజునకిక ఈ సంసారమున తిరిగి జన్మ కలుగదు (అతడు జన్మరాహిత్యము నొందును)

145 భారతామృత సర్వస్వగీతాయా మథితస్య చ
సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్

భారతమను అమృతరాశిని మథించి దాని సర్వస్వము, సారమునగు గీతను తీసి శ్రీకృష్ణుడు అర్జునుని ముఖమునందు వైచెను

యుద్ధప్రారంభసమయమున పాండవులు భీష్మద్రోణాదులకు నమస్కరించి యుద్ధమునకు అనుజ్ఞ గైకొనుటకై వారి యొద్దకు వచ్చినపుడు ద్రోణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

ద్రోణ ఉవాచ

146 యతో ధర్మస్తతః కృష్ణో యతః కృష్ణస్తతో జయః
యుధ్యస్వగచ్ఛ కౌన్తేయ పృచ్ఛ మాం కిం బ్రవీమితే

(ద్రోణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ఎచట ధర్మముండునో అచట శ్రీకృష్ణుడుండును ఎచట శ్రీకృష్ణుడుండునో అచటనే విజయముండును కుంతీ కుమారా! పొమ్ము! యుద్ధము చేయుము ఇంకను ఏమి చెప్పవలయునో అడుగుము

అపుడు శల్యుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

శల్య ఉవాచ

147 అర్థస్య పురుషో దాసో దాసస్త్వర్థో న కస్యచిత్
ఇతి సత్యం మహారాజ బద్ధోఽస్మ్యర్థేన కౌరవైః

(శల్యుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

మనుజుడు అర్థమునకు దాసుడు అర్థము దేని యొక్కయు దాస కాదు ఇది సత్యమైన వాక్యము కౌరవులచే నేను అర్థముచే బంధింపబడియున్నాను

అంతట ఇరుసేనల మధ్య ఘోరయుద్ధము ప్రారంభమయ్యెను భీష్మునితో అభిమన్యుడు తలపడెను శల్యుడు ఉత్తర కుమారుని వధించెను శ్వేతుడు గొప్ప పరాక్రమమును చూపెను కాని భీష్మునిచే అతడు వధింపబడెను ఈ వార్తలు వినుచు ధృతరాష్ట్రుడు దుర్యోధనుని వలన పాండవుల మనంబున జనించిన అశాంతిని తలంచుకొని నపుడు తనకు చాల పరితాపము కలుగుచున్నదని తెలుపగా అపుడు సంజయుడతనితో ఇట్లు చెప్పెను —

సంజయ ఉవాచ

148 గతోదకే సేతుబన్ధో యాదృక్ తాదృఙ్మతి స్తవ
సందీప్తే భవనే యద్వత్ కూపస్య ఖననం తథా

(సంజయుడు ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను —)

నీటి ప్రవాహము పోయిన వెనుక వారధి కట్టినట్లుగను, ఇంటికి నిప్పంటుకొని మండుచుండగా దానిని చల్లార్చుటకు బావిని త్రవ్వినట్లుగను నున్నది మీ యొక్క అభిప్రాయము

ఎమ్మట భీష్మునకు అర్జునునకు యుద్ధము జరిగెను ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యునితో తలపడెను భీముని ద్వారా అనేక మంది కౌరవ సైనికులు వధింపబడిరి భీష్ముడు గొప్ప పరాక్రమమును చూపెను అభిమన్యుడు యుద్ధమున లెస్సగ విజృంభించెను ఎదప భీష్మునకు, భీమునకు గొప్ప యుద్ధము జరిగెను అనంతరము భీష్మునకు విరాటునకు అర్జునునకు అశ్వత్థామకు భీమునకు దుర్యోధనునకు, అభిమన్యునకు లక్ష్మణునకు ద్వంద్వయుద్ధము జరిగెను అర్జునుని చే భీష్ముడు పడగొట్టబడెను అపుడు కర్ణుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—

ఓమ్

వసుదేవ నందనుడును అయిన శ్రీ కృష్ణుడు శ్రేష్ఠుడు చక్రములలో సుదర్శనము శ్రేష్ఠము

అపుడు ధృతరాష్ట్రుడు సంజయునితో ఇట్లనెను—

ధృతరాష్ట్ర ఉవాచ—

3 మత్కృతే చాప్యనుప్రాప్తః కురూణామేష సంక్షయః
పక్వానాం హి వధే సూత వజ్రాయన్తే తృణాన్యత

(ధృతరాష్ట్రుడు సంజయునితో ఇట్లు చెప్పెను—)

నావలననే కౌరవుల వినాశము సంభవించినది కాలముచె పరిపక్వమైన వారిని వధించుటకు తృణములుకూడ వజ్రములవలె పని చేయును

యుద్ధమున అభిమన్యుడు లెన్నక విజృంభించెను పాండవులతో జయద్రథుడు యుద్ధము చేసెను అభిమన్యుడు యుద్ధమందు అత్యంత పరాక్రమమును జూపి పెక్కుమంది కౌరవ రాజకుమారులను వధించెను ఎట్టకేలకు యుద్ధమున అభిమన్యుడు అన్యాయముగ వధింపబడెను ఆతని మరణవార్త విని ధర్మరాజు విలపించుచుండ అచటికి వ్యాసమునివచ్చి అకంపన నారద సంవాదమును గూర్చి ఆతనికి చెప్పి ఆశ్వాసనమును కలుగజేసెను పూర్వకాలము నారదుడు అకంపనునితో సంభాషించుచు ఇట్లు చెప్పెను—

నారద ఉవాచ—

4 వాయుర్భీమో భీమనాదో మహౌజా
బేత్తా దేహాన్ ప్రాణినాం సర్వగోఽసౌ
నో వాఽఽవృత్తిం నైవ వృత్తిం కదాచిత్
ప్రాప్నోత్యుగ్రోఽనన్త తేజో విశిష్టః

(నారదుడు అకంపనరాజుతో ఇట్లు చెప్పెను—)

భయంకర శబ్దము చేయునదియు, గొప్ప బలశాలియు భయానకమైనదియు నగు వాయువు ప్రాణుల శరీరములనే ఛేదించుచున్నది

చేతనమగు ఆత్మను కాదు ఏలయనిన, ఆ ఆత్మ సర్వవ్యాపకమై మహా ప్రభావశాలియై సమస్త తేజస్సంపన్నమై యున్నది దానికి ఎన్నడును ఆవాగమనములు ఉండవు

ఎదప వ్యాసముని ధర్మరాజనకు నారదఋషి సృంజయరాజునకు చెప్పిన అనేక మహనీయుల చరిత్రలను తెలియజేసెను నారదుడు సృంజయునకు సుహోత్ర పౌరవ బి, శ్రీరామ భగీరథ దిలీప మాంధాత యయాతి అంబరీష శశబిందు గయ రన్తి దేవ భరత పృథు పరశురాముల చరిత్రలను చెప్పి వారి మహత్వము వర్ణించెను ఎమ్మట అర్జునుడు జయద్రథుని వధించుటకై ప్రతిజ్ఞను పూనెను అర్జునుడు తన ప్రతిజ్ఞను కాపాడుటగాఱకై చింతన చేయుచు నుండ నిద్ర వచ్చెను నిదలో శ్రీ కృష్ణుడు అర్జునుని యొద్దకు వచ్చి అర్జునునితో ఇట్లు పలికెను—

5 కిమర్థం చ విషాదస్తే తద్ బ్రూహి ద్విపదాం వర
న శోచ్యం విదుషాం శ్రేష్ఠ శోకః కార్యవినాశనః

(శ్రీ కృష్ణుడు అర్జునునితో ఇట్ల చెప్పెను—)

శ్రేష్ఠుడవగు అర్జునా! నీకు శోకమేల కలిగెనో చెప్పుము నీవు శోకింపరాదు ఏలయనిన శోకము సమస్తకార్యములను వినాశన మొనర్చును

6 యత్ తు కార్యం భవేత్ కార్యం కర్మణా తత్ సమాచర
హీన చేష్టస్య యః శోకః స హి శత్రుర్ధనంజయ

ఏ కార్యము చేయవలెనో, దానిని ప్రయత్నపూర్వకముగ చేయుము ప్రయత్న రహితునియొక్క శోకము అతనికి శత్రువై యున్నది

స్వప్నమందు అర్జునుడు శ్రీ కృష్ణునితో కూడ శివునియొద్దకు వెళ్ళి వారిని స్తుతించెను ఇక యుద్ధమున కౌరవయోధులు పెక్కురు మర

ణించినందువలన ధృతరాష్ట్రుడు విలపించుచు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—

ధృతరాష్ట్ర ఉవాచ —

7 ధర్మాపేక్షీ నరో నిత్యం సర్వత్ర లభతే సుఖమ్
ప్రేత్యభావే చ కల్యాణం ప్రసాదం ప్రతిపద్యతే

(ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—)

ధర్మమును అపేక్షించు మనుజుడు సదా సర్వత్ర సుఖమునే అనుభవించును మరణానంతరముకూడ అతనికి శుభము ప్రసన్నత కలుగును

యుద్ధమందు సాత్యకి విజృంభించి అనేకమంది శత్రువులను హాత మార్చెను భీముడు కర్ణుని ఓడించెను అర్జునుడు జయద్రధుని వధించెను ఆ వార్త విని ధర్మరాజు శ్రీ కృష్ణునితో ఇట్లు పలికెను—

8 కిం తు నాత్యద్భుతం తేషాం యేషాం నస్త్వం సమాశ్రయః
న తేషాం దుష్కృతం కించిత్ త్రిషు లోకేషు విద్యతే

9 సర్వలోక గురుర్యేషాం త్వం నాథో మధుసూదన
త్వత్ప్రసాదాద్ధి గోవిన్ద వయం జేష్యామహే రిపూన్

(ధర్మరాజు శ్రీ కృష్ణునితో ఇట్లు చెప్పను—)

కృష్ణా! ఎవరికి మీరు ఆశ్రయమో అట్టి మాకు విజయము సౌభాగ్యము కలుగుట గొప్ప అద్భుతమైన విషయము కాదు మధుసూధనా! సమస్త జగత్తునకు గురువైన మీరు ఎవరి రక్షకులో, వారికి ముల్లోకములందును దుష్కరమైనది ఎచటను ఏమియును లేదు గోవిందా! మేము మీయొక్క కృపచే యుద్ధమున తప్పక విజయమును పొందగలము

ఎమ్మట కర్ణుని గూర్చి శ్రీ కృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను—

శ్రీ వాసుదేవ ఉవాచ—

10 బ్రహ్మణ్యః సత్యవాదీ చ తపస్వీ నియతవ్రతః
రిపుష్వపి దయావాంశ్చ తస్మాత్ కర్ణో వృషః స్మృతః

(శ్రీ కృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను—)

కర్ణుడు బ్రహ్మనిష్ఠుల యెడల భక్తికలవాడు సత్యవాది, తపస్వి నియమ వ్రతపాలకుడు శత్రువుల యెడలకూడ దయకలవాడు అయి యున్నాడు కనుకనే అతడు వృషుడు (ధర్మాత్ముడు) అని చెప్పబడెను

11 యే వై ధర్మస్య లోప్తారో వధ్యాస్తే మమ పాణ్డవ
ధర్మసంస్థాపనార్థం హి ప్రతిజ్ఞైషా మమావ్యయా

12 బ్రహ్మ సత్యం దమః శౌచం ధర్మో హ్రీః శ్రీర్ధృతిః క్షమా
యత్ర తత్ర రమే నిత్యమహం సత్యేన తే శపే

అర్జునా! ధర్మమును ఉల్లంఘించువారు నాచే వధ్యులగుదురు ధర్మస్థాపనకొఱకే నేనిట్టి దృఢప్రతిజ్ఞను గావించితిని నేను శపథము చేసి చెప్పుచున్నాను—వినుము—ఎచట వేదము సత్యము దమము శౌచము ధర్మము లజ్జ జ్ఞానసంపద ధైర్యము క్షమ ఉండునో, అచట నేను సదా సుఖపూర్వకముగ ఉందును

ధర్మరాజు శ్రీ కృష్ణునితో ఇట్లు పలికెను—

13 విదితా మే మహాబాహో ధర్మాణాం పరమా గతిః
బ్రహ్మహత్యా ఫలం తస్య యైః కృతం నావబుధ్యతే

(ధర్మరాజు శ్రీ కృష్ణునితో ఇట్లు చెప్పెను—)

ధర్మముయొక్క శ్రేష్ఠగతి నాకు తెలియును ఎవడైన ఇతరుడు చేసిన ఉపకారమును మఱచిపోయినచో, అతనికి బ్రహ్మహత్యయొక్క పాపము తగులుకొనును

ఎదప యుద్ధమున ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్నునిచే వధింపబడెను అశ్వత్థామ పాండవసైన్యముపై నారాయణాస్త్రమును ప్రయోగించెను కాని శ్రీ కృష్ణుడు దానిని శాంతింపజేసెను ఎమ్మట అశ్వత్థామ ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను కాని శ్రీ కృష్ణార్జునులపై దాని ప్రభావము ఏమియు లేకపోవుటచే చింతించుచున్న అశ్వత్థామతో వ్యాసముని ఇట్లు చెప్పెను—

వ్యాస ఉవాచ—

14 స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్ర సమ్భవః
కృష్ణ ఏవ హి యష్టవ్యో యజ్ఞైశ్చైవ సనాతనః

(వ్యాసముని అశ్వత్థామతో ఇట్లు చెప్పెను—)

శ్రీ కృష్ణుడు శంకరుని భక్తుడు శంకరుని నుండియే వారు ప్రకటమైరి కావున యజ్ఞములద్వారా సనాతన పురుషుడగు శ్రీ కృష్ణునే ఆరాధించవలెను

ద్రోణాచార్యుని మరణానంతరము కర్ణుడు సేనాపతిగ నియోగింపబడెను అర్జునుడు అశ్వత్థామను ఓడించెను సహదేవుడు దుశ్శాసనుని ఓడించెను దుర్యోధనుడు ధర్మరాజుచే పరాజితుడయ్యెను శల్యుడు కర్ణునకు సారథిగా నుండెను కర్ణుడు శల్యునితో ఇట్లు చెప్పెను—

# 8 కర్ణ పర్వము

1 న నూనమస్త్రాణి బలం పరాక్రమః
క్రియాః సునీతం పరమాయుధాని వా
అలం మనుష్యస్య సుఖాయ వర్తితుం
తథా హి యుద్ధే నిహతః పరైర్గురుః

(కర్ణుడు శల్యునితో ఇట్లు చెప్పెను—)

నిశ్చయముగ అస్త్రములు బలము పరాక్రమము క్రియ ఉత్తమ నీతి ఉత్తమ ఆయుధము మనుజునకు సుఖము నొసంగుటకు చాలవు పలయనిన ఇన్ని సాధనలన్నియు ఉన్నను, ద్రోణాచార్యుని శత్రువులు యుద్ధమందు వధించివైచినారు

శల్యుడు అర్జునుని పరాక్రమమును గూర్చి చెప్పుచు కర్ణుని ఆక్షేపించుచు ఇట్లు పలికెను—

2 శృగాలోఽపి వనే కర్ణ శశైః పరివృతో వసన్
మన్యతే సింహ మాత్మానం యావత్ సింహం న పశ్యతి

(శల్యుడు కర్ణునితో ఇట్లు చెప్పెను—)

అరణ్యమున కుందేళ్ళతో నుండు నక్క సింహమును చూడనంతవఱకు తన్ను సింహముగనే తలంచుచుండును

శల్యుని ఆ వాక్యములను విని కర్ణుడిట్లనెను—

కర్ణ ఉవాచ—

3 గుణాన్ గుణవతాం శల్య గుణవాన్ వేత్తి నాగుణః
త్వం తు శల్య గుణైర్హీనః కిం జ్ఞాస్యసి గుణాగుణాన్

(కర్ణుడు శల్యునితో ఇట్లు చెప్పెను—)

గుణవంతులయొక్క గుణములను గుణవంతుడే ఎఱుంగునుగాని

గుణహీనుడు కాదు నీవు గుణరహితుడవు మఱి గుణ అవగణము లను నీ వెట్లెఱుఁగ గలవు?

అపుడు శల్యుడు తిరిగి కర్ణునితో ఇట్లు పలికెను—

శల్య ఉవాచ—

4 పరవాచ్యేషు నిపుణః సర్వో భవతి సర్వదా
ఆత్మవాచ్యం న జానీతే జానన్నపి చ ముహ్యతి

(శల్యుడు కర్ణునితో ఇట్లు చెప్పెను—)

ఇతరుల దోషములను చెప్పుటలో అందఱు సదాచాల నిపుణులై యుందురు కాని తమతమ దోషములనుగూర్చి తెలియకుందురు ఒకవేళ తెలిసినను తెలియనట్లుందురు

కర్ణుడు శిఖండిని ఓడించెను దుర్యోధనుడు భీమునిచే పరాజితుడయ్యెను అర్జునుడు అశ్వత్థామను పీడించెను ఎదప శ్రీకృష్ణుడు అర్జునునకు ఈ హిత వాక్యములను చెప్పెను—

శ్రీకృష్ణ ఉవాచ—

5 అకార్యాణాం క్రియాణాం చ సంయోగం యః కరోతి వై
కార్యాణామక్రియాణాం చ స పార్థ పురుషాధమః

(శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను—)

చేయుటకు యోగ్యములైనప్పటికిని అసాధ్యములును సాధ్యములైనను నిషిద్ధములునగు కార్యములతో సంబంధము గలిగియుండువారు అధములని తలంచబడుచున్నారు

6 ప్రాణినామవధస్తాత సర్వజ్యాయాన్ మతో మమ

అర్జునా! ప్రాణులను హింసింపకుండుట నా దృష్టిలో అన్ని ధర్మములకంటెను ఉత్తమమైనది

7 యత్ స్యాదహింసా సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః
అహింసార్థాయ భూతానాం ధర్మప్రవచనం కృతమ్

ఏ కార్యమందు హింస యుండదో అదియే ధర్మము ఇది సిద్ధాంతము మహర్షులు ప్రాణులకు హింస కలుగకుండ ఉండుటకె ఉత్తమ ధర్మమును ప్రవచించిరి

8 యదా మానం లభతే మాననార్హ —
స్తదా స వై జీవతి జీవలోకే
యదావమానం లభతే మహాన్తం
తదా జీవన్మృత ఇత్యుచ్యతే సః

ఈ ప్రపంచమున మనుజుడు ఎంతవఱకు సమ్మానమును పొందునో అంతవఱకు అతడు జీవించియున్నవాడే యగును కాని ఎపుడతడు గొప్ప అవమానమును పొందునో అపుడు జీవించియున్నను మరణించినవాడేయని చెప్పబడును

ఇరు సేనలమధ్య తీవ్రముగు యుద్ధము జరుగుచుండెను భీముడు దుశ్శాసనుని వధించివైచెను ఎదప అర్జునుడు కర్ణుకు యుద్ధమునకు తలపడిరి వారిలో ఎవరు విజయమును పొందుదురని ఇంద్రుడు ప్రశ్నింప శివుడు, బ్రహ్మదేవుడు ఇట్లు చెప్పిరి—

9 మహాత్మా ఫాల్గునశ్చాపి సత్యధర్మరతః సదా
విజయస్తస్య నియతం జాయతే నాత్ర సంశయః

(బ్రహ్మదేవుడు శివుడు ఇంద్రునితో యిట్లు చెప్పిరి—)

మహాత్ముడగు అర్జునుడు సదా సత్య ధర్మములందు తత్పరుడై యుండువాడు కాబట్టి ఆతని విజయము తప్పక సంభవించును ఇందు సంశయము లేదు

సంధి చేసుకొనుట మంచిదని అశ్వత్థామ దుర్యోధనునికి చెప్పినను అతడు తిరస్కరించెను తత్సందర్భమున అశ్వత్థామ దుర్యోధనున కిట్లు చెప్పెను—

10 రక్ష దుర్యోధనాత్మానమాత్మా సర్వస్య భాజనమ్
జీవనే యత్నమాతిష్ఠ జీవన్ భద్రాణి పశ్యతి

(అశ్వత్థామ దుర్యోధనునితో ఇట్లు చెప్పెను—)

మీరు స్వయముగనే మిమ్ములను రక్షించుకొనుడు ఆత్మయే అన్ని సుఖములకును నిలయము జీవితమును రక్షించుకొనుటకై మీరు ప్రయత్నింపుడు జీవించువాడే శుభమును చూచును

11 వదన్తి మిత్రం సహజం విచక్షణా—
స్తథైవ సామ్నా చ ధనేన చార్జితమ్
ప్రతాపతశ్చోపనతం చతుర్విధం
తదస్తి సర్వం తవ పాణ్డవేషు

పెద్దలు నాలుగురకముల మిత్రులను చెప్పుదురు ఒకడు సహజమైన మిత్రుడు సంధి చేసుకొని ఏర్పాటు చేసుకొను మిత్రుడు రెండవవాడు డబ్బిచ్చి స్నేహిత మొనర్చుకొను మిత్రుడు మూడవవాడు ప్రబల ప్రతాపముచే ప్రభావితుడై శరణుజొచ్చువాడు నాల్గవవాడు పాండవులతో మీకు ఈ అన్నివిధములైన మిత్రత్వము సంభవమై యున్నది

ఎడవ అర్జునునకు కర్ణునకు భయంకరయుద్ధము జరిగెను సర్పముఖ బాణమునుండి శ్రీ కృష్ణుడు అర్జునుని రక్షించెను తుదకు అర్జునుడు కర్ణుని వధించివేసెను భీముడు వేలకొలది కౌరవసైనికులను సంహరించెను

ఓమ్

# 9 శల్య పర్వము

సంధి చేసికొనుటకై కృపాచార్యుడు దుర్యోధనునకు చెప్పగను అతడు వినలేదు. దుర్యోధనుడు కృపాచార్యునితో ఇట్లు చెప్పెను (దుర్యోధనుడు కృపాచార్యునకిట్లు చెప్పెను—)

1 న ధ్రువం సుఖమస్తీతి కుతో రాష్ట్రం కుతో యశః

(దుర్యోధనుడు కృపాచార్యునకిట్లు చెప్పెను)
ప్రపంచమున ఏ సుఖమున్ను ఎల్లప్పుడు ఉండదు ఇక రాజ్యము కీర్తి స్థిరముగ నెట్లుండగలవు?

కీర్తినే ఆర్జించవలెననియు ఆ కీర్తి యుద్ధముచేతనే లభించగలదనియు కావున సంధి ప్రస్తావ వలదనియు దుర్యోధనుడు కృపాచార్యునితో చెప్పెను. అనంతరము శల్యుడు సేనాపతిగ నియమించబడెను. భీమునిచేతను ధర్మరాజుచేతను శల్యుడు చంపబడెను. పాండవపక్షమువారు పరస్పరము మాట్లాడుకొనుచు ఇట్లు చెప్పదొడగిరి —

2 యేషాం చ జగతీనాథో నాథః కృష్ణో జనార్దనః
కథం తేషాం జయో న స్యాద్ యేషాం ధర్మో వ్యపాశ్రయః

(పాండవ పక్షమువారు పరస్పరము ఇట్లు చెప్పుకొనదొడగిరి —)
సమస్త జగత్తుయొక్క ప్రభువగు జనార్దనుడు (శ్రీకృష్ణుడు) ఎవరియొక్క రక్షకుడో ఎవరికి ధర్మముయొక్క ఆశ్రయము లభించినదో వారికి విజయము ఎందుకు కలుగదు?

గద యుద్ధమందు సహదేవునిచే శకుని వధింపబడెను. అంతట దుర్యోధనుడు ఒక సరోవరమునకు పోయి అందు దాగు

కొనెను అప్పుడు పాండవులు శ్రీకృష్ణుడు ఆ సరోవరము యొద్దకు వెళ్ళిరి అప్పుడు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో కార్యకౌశలత్వముచేతనే ఎందరో మహానీయులు కార్యసిద్ధిని బడసిరని చెప్పుచు ఇట్లు పలికెను—

వాసుదేవ ఉవాచ—

3 క్రియా బలవతీ రాజన్ నాన్యత్ కించిద్ యుధిష్ఠిర

(శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

రాజా! కార్యకుశలత్వమే బలవత్తరమైనది కాని మఱియే వస్తువున్ను కాదు

పిమ్మట ధర్మరాజు దుర్యోధనుని ఉద్దేశించి లెమ్ము! సరోవరము నుండి బయటకు రమ్ము నీ పౌరుషమును చూపుము యుద్ధముచేయుము అని పలికెను అప్పుడు దుర్యోధనుడు సరస్సునుండి బయటకు వచ్చి భీమునితో గదాయుద్ధము చేయుటకు సిద్ధమాయెను

అత్తఱి బలరాముడు తీర్థయాత్ర చేయుచు అచ్చోటికి రాగా పాండవులాతని పూజించిరి ఈ సందర్భమున జనమేజయుని ప్రశ్నను పురస్కరించుకొని వైశంపాయనుడు అనేక పుణ్యతీర్థములు గూర్చి, వాని మహిమను గూర్చి వర్ణించెను బలరాముని సలహా మేరకు అందఱును కురుక్షేత్రమందలి సమస్త పంచక తీర్థమునకు వెళ్ళిరి అచ్చోట భీమునకు, దుర్యోధనునకు గదాయుద్ధము జరిగెను అర్జునుని సంకేతమునుసరించి భీముడు గదాయుద్ధమున దుర్యోధనుని తొడపై గదతో ప్రహారము సలపగా దుర్యోధనుడు క్రిందపడిపోయెను తత్సందర్భమున శ్రీకృష్ణుడు పాండవులతో ప్రసంగించుచు ఇట్లు పలికెను—

4 సద్భిశ్చానుగతః పన్థాః స సర్వైరను గమ్యతే

(శ్రీ కృష్ణుడు పాండవులతో ఇట్లు చెప్పెను—)

శ్రేష్ఠులగువారు ఏ మార్గముపై నడచిరో దానినే అందఱును అనుసరించుదురు

అటుపిమ్మట అశ్వత్థామ కౌరవసేనకు సేనాపతిగ నియమింపబడెను అపుడు కృపాచార్యుడు అశ్వత్థామకు హితము చెప్పుచు ఇట్లనెను—

ఓమ్

# 10 సౌప్తిక పర్వము

కృప ఉవాచ—

1 ఆబద్ధా మానుషాః సర్వే నిబద్ధాః కర్మణోర్ద్వయోః
దైవే పురుషకారే చ పరం తాభ్యాం న విద్యతే

(కృపాచార్యుడు అశ్వత్థామకు ఇట్లు చెప్పెను—)

మనుజులందఱు ప్రారబ్ధము పురుషప్రయత్నము —అను రెండు విధములైన కర్మలచే బంధింపబడియున్నారు ఈ రెంటికి తప్ప మఱేవియు లేవు

2 అనారమ్భాత్ తు కార్యాణాం నార్థః సమ్పద్యతే క్వచిత్
కృతే పురుషకారే తు యేషాం కార్యం న సిద్ధ్యతి
దైవేనోపహతాస్తే తు నాత్ర కార్యా విచారణా

కార్యమును ఆరంభించనిచో ఎచటను ఏ ప్రయోజనము నున్న సిద్ధింపదు కాని పురుషప్రయత్నము చేసినను కార్యము సిద్ధించనిచో వారు నిక్కముగ ప్రారబ్ధముచే కొట్టబడినవారే యగుదురు ఇటు వేఱు ఆలోచన చేయనక్కఱలేదు

అనంతరము అశ్వత్థామ శివునిస్తోత్రము చేయగా శివుడాతనితో ఇట్లు చెప్పెను—

3 సత్యశౌచార్జవ త్యాగైస్తపసా నియమేన చ
క్షాన్త్యా భక్త్యా చ ధృత్యా చ బుద్ధ్యా చ వచసా తథా

4 యథావదహమారాద్ధః కృష్ణే నాక్లిష్ట కర్మణా
తస్మాదిష్ట తమః కృష్ణాదన్యో మమ న విద్యతే

(శివుడు అశ్వత్థామతో ఇట్లు చెప్పెను—)

అనాయాసముగ గొప్పకార్యములను చేయు శ్రీ కృష్ణుడు

సత్యము, శౌచము సరళత్వము త్యాగము తపస్సు నియమము క్షమ భక్తి ధైర్యము బుద్ధి వా క్కులవ్యాపా నా రాయె క్క యథో చితమగు ఆరాధన సలిపియుండెను కావున శ్రీ కృష్ణుని మించి మతి యొక దేవదును నాకు ప్రియుడు లేడు

అశ్వత్థామ రాత్రి వేళ పాండవులశిబిరమునకు ప్రవేశించి నిద్రించు చున్న పాండవపుత్రులను (పాంచాలురను) వధించెను పాంచాలుర మరణవార్తను విని దుర్యోధనుడు ప్రసన్నుడయ్యెను గదాయుద్ధమున తొడలు విరిగిన దుర్యోధనుడు కొంతసేపటికి మరణించెను అశ్వాతి మచె తన పుత్రులు చంపబడిన వార్తను ధృష్టద్యుమ్నుని సారథివలన విని ధర్మరాజు శోకాకులుడై విలపించుచు అజాగ్రతవలన మనుజులు సంక టములను పొందుదురని తెలుపుచు ఇట్లు వచించెను

5 న వా ప్రమాదాత్ పరమస్తి కశ్చిద్
వధో నరాణామిహ జీవలోకే
ప్రమత్తమర్థా హి నరం సమన్తాత్
త్యజ న్త్యన ర్థాశ్చ సమావిశన్తి

(ధర్మరాజు పుత్రుల మరణవార్త విని విలపించుచు ఇటు నుడివెను—)
ప్రమత్తత (సోమరితనము)ను మించి మతియొక మృత్యువేదియు ఈ ప్రపంచమున మనుజులకు లేదు ప్రమత్తత గలవానిని సమస్త పదార్థములు అన్నివైపుల నుండియు త్యజించివేయును మఱియు అనర్థము లన్నియు అతని యొద్దకు వచ్చిచేరును

6 న వా ప్రమత్తేన నరేణ శక్యం
విద్యా తపః శ్రీర్విపులం యశో వా
పశ్య ప్రమాదేన నిహత్య శత్రూన్
సర్వాన్ మహేన్ద్రం సుఖమేధమానమ్

ప్రమత్తత కలవాగు విద్య తపస్సు వైభవము, గొప్ప కీర్తి ఎన్నటి ని పొందలేడు దేవరాజగు ఇంద్రుడును ప్రమత్తతను వదలివేసి నందువలననే తన శత్రువులందఱిని సంహరించి సుఖముగ ఉన్నతిని పొందుచున్నాడు

ఎమ్మట అశ్వత్థామ బ్రహ్మాస్త్రమును ప్రయోగింప అర్జును డున్ను అతనిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను ఆ సమయమున నారదుడు వ్యాసముని అచటికి విచ్చేసిరి వ్యాసమునియొక్క అభి ప్రాయము ననుసరించి అర్జునుడు తన బ్రహ్మాస్త్రమును ఉపసంహరించెను కాని అశ్వత్థామ దానిని ఉపసంహరింపలేక పాండవుల గర్భములపైకి మరలించెను వ్యాసమునియొక్క ఆదేశముచే అశ్వత్థామ తన శిరస్సుపై ఉన్న దివ్యమణిని పాండవుల కిచ్చెను శ్రీ కృష్ణుని శాపముచే అశ్వత్థామ వనమునకు పోయెను పాండవులు మణిని ద్రౌపది కిచ్చి జరిగిన విషయములను తెలిపి పుత్రశోకముచే దుఃఖించుచున్న ఆమెను శాంతపఱచిరి ద్రౌపది కథనానుసారము ధర్మరాజు ఆ మణిని తన శిరస్సుపై ధరించెను ధర్మరాజుయొక్క ప్రశ్నను పురస్కరించుకొని శ్రీ కృష్ణుడు అశ్వత్థామ శివుని శరణు బొంది వారి అనుగ్రహముచే గొప్పశక్తిని బడసి యుద్ధమందు విజృం భించెనని చెప్పి శివునియొక్క మహిమను గూర్చి వెల్లడించెను ఆ ప్రసంగమున శ్రీ కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు పలికెను—

శ్రీ భగవానువాచ—

7 లోక యజ్ఞః క్రియాయజ్ఞో గృహయజ్ఞ సనాతనః
పఞ్చభూత నృయజ్ఞశ్చ జజ్ఞే సర్వమిదం జగత్

(శ్రీ కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

లోకయజ్ఞము క్రియాయజ్ఞము సనాతనమగు గృహయజ్ఞము పంచభూత యజ్ఞము మనుష్య యజ్ఞము—అను ఈ ఐదు విధములైన యజ్ఞములచే ఈ జగత్తంతయు ఉత్పన్నమగుచున్నది

# 11 స్త్రీ పర్వము

దుర్యోధనుడు ఇతర కౌరవయోధులు యుద్ధమందు మడసరగ విని శోకించుచున్న ధృతరాష్ట్రుని ఓదార్చుచు సంజయుడు తత్ప్రసంగమున ఆతనితో ఇట్లు చెప్పెను—

1 ఆదావేవ మనుష్యేణ వర్తితవ్యం యథాక్షమమ్
యథా నాతీతమర్థం వై పశ్చాత్తాపేన యుజ్యతే

(సంజయుడు ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను—)

దేనినిగూర్చి మున్ముందు పశ్చాత్తాప పడవలసిన అవసరము లేకుండునో ఆ విధముగ మనుజుడు యథాయోగ్యముగ ప్రవర్తించవలెను

2 మధు యః కేవలం దృష్ట్వా ప్రపాతం నానుపశ్యతి
స భ్రష్టో మధులోభేన శోచత్యేవం యథా భవాన్

ఎవడు ఉన్నతస్థానమందున్న తేనెపైనే దృష్టినుంచుకొని అచటినుండి పడిపోవు విషయము యోచింపడో, అతడు ఆ తేనెయెడల ఆసక్తిచే అచటినుండి క్రిందపడి మీవలె దుఃఖింపవలసి యుండును

3 అర్థాన్న శోచన్ ప్రాప్నోతి న శోచన్ విన్దతే ఫలమ్
న శోచన్ శ్రియమాప్నోతి న శోచన్ విన్దతే పరమ్

శోకించువాడు తన అభీష్ట వస్తువులను పొందజాలడు శోకపరాయణుడు ఏ ఫలములను పొందనేరడు శోకించువానికి సంపదకాని, పరమాత్మకాని లభించకుండును

4 స్వయముత్పాద యిత్వాగ్నిం వస్త్రేణ పరివేష్టయన్
దహ్యమానో మనస్తాపం భజతే న స పణ్డితః

ఎవడు స్వయముగ నిప్పు రగుల్కొలిపి దానిని గుడ్డయందు చుట్టునో కాలిన వెనుక మనస్సునందు సంతాపమును అనుభవించునో, అతడు బుద్ధిమంతుడని చెప్పబడడు

అపుడు విదురుడు ధృతరాష్ట్రునకు ధైర్యమును కలుగజేయుచు అనేక ధర్మవిషయములను వాతవాక్యములను ఈ ప్రకారముగ వచించెను—

విదుర ఉవాచ—

5 సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రియాః
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్

(విదురుడు ధృతరాష్ట్రునితో ఇటు చెప్పెను—)

సంగ్రహించినవన్నియు ఒకానొక సమయమున నశించిపోవును భౌతిక ఉన్నతుల ఒకానొకపుడు పతనమైపోవును సంయోగము లన్నియు ఒకపుడు వియోగములై పోవును అట్లే జీవితము ఏనాటి కైనను మృత్యువుపాలై పోవును

6 అయుధ్యమానో మ్రియతే యుధ్యమానశ్చ జీవతి
కాలం ప్రాప్య మహారాజ న కశ్చిదతివర్తతే

ఎవడు యుద్ధము చేయడో అతడును మరణించుచున్నాడు యుద్ధమునందు పాల్గొనువాడు ఒకానొకడు జీవించుచున్నాడు కాలమును పొంది దానిని ఎవడును ఉల్లంఘింప జాలడు

7 అభావాదీని భూతాని భావమధ్యాని భారత
అభావనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా

ప్రాణులందఱును జన్మించుటకు పూర్వము అవ్యక్తముగ నున్నారు జన్మించిన ఎదప వ్యక్తమగుచున్నారు మరణించిన ఎదప తిరిగి అవ్యక్తముగ నుండుచున్నారు ఇట్టి స్థితిలో వారికొఱకు దుఃఖించుట ఎందులకు?

8 న శోచణ్ మృతమన్వేతి న శోచణ్ మ్రియతే నరః
ఏవం సాంసిద్ధికే లోకే కిమర్థమనుశోచస

శోకించువాఁడు మరణించినవానితోఁ పోలేఁడు మరణించనూ లేఁడు ప్రపంచముయొక్క స్వాభావిక స్థితి ఇట్లున్నపుడు ఇఁక మీరు ఎందులకు శోకించుచున్నారు?

9 కాలః కర్షతి భూతాని సర్వాణి వివిదాన్యుత
న కాలస్య ప్రియః కశ్చిన్న ద్వేష్య కురుసత్తమ

కాలము సమస్త ప్రాణులను ఈడ్చివేయుచున్నది దానికి ఒకఁడు ప్రియుఁడుకాని మఱియొకఁడు అప్రియుఁడుకాని లేఁడు

10 ఏకసార్థ ప్రయాతానాం సర్వేషాం తత్ర గామినామ్
యస్య కాలః ప్రయాత్యగ్రే తత్ర కా పరిదేవనా

ఈ సంసార యాత్రయందు పాల్గొనుటకై కలసవచ్చిన వారందఱును ఒకనాఁడు తిరిగి పరలోకమునకు పోవలసినవారే వారిలో ఎవని కాలము మొదట ముగియునో అతఁడు ముందుగా పోవును ఇట్టి స్థితిలో ఇక ఎవరి గుఱించి ఎందులకు శోకించవలెను?

11 మాతాపితృ సహస్రాణి పుత్రదార శతాని చ
సంసారేష్వనుభూతాని కస్య తే కస్య వా వయమ్

మనము ప్రపంచమున మఱలమఱల జన్మించి వేలకొలఁది తల్లిదండ్రులను వందలకొలఁది స్త్రీ పురుషులయొక్క సుఖమును అనుభవించితిమి కాని నేఁడు వారెచట? లేక మనకు వారికి ఏమి సంబంధము?

12 శోకస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ
దివసే దివసే మూఢమావిశన్తి న పణ్డితమ్

శోకముయొక్క వేలకొలఁది స్థానములు భయముయొక్క వందలకొలఁది స్థానములు ప్రతిదినము మూఢునిపై తమ ప్రభావమును చూపునేకాని బుద్ధిమంతునిపై కాదు

13 న కాలస్య ప్రియః కశ్చిన్న ద్వేష్యః కురుసత్తమ
న మధ్యస్థః క్వచిత్కాలః సర్వం కాలః ప్రకర్షతి

కాలమునకు ఒకనిపై ప్రేమకాని ఒకనిపై ద్వేషముకాని లేదు ఒకనిపై ఉదాసీన భావమున్ను లేదు అది అందఱిని తన యొద్దకు ఈడ్చుకొని పోవుచున్నది

14 అనిత్యం యౌవనం రూపం జీవితం ద్రవ్యసంచయః
ఆరోగ్యం ప్రియసంవాసో గృధ్యేదేషు న పణ్డితః

రూపము యౌవనము జీవనము ధనసంచయము ఆరోగ్యము ప్రియజనులు ఒకచోట నివసించుట—ఇవియన్నియు ననిత్యములు కావున బుద్ధిమంతుడు వీనియందన్నిటను ఆసక్తుడు కాకుండగావలెను।

15 అశోచన్ ప్రతికుర్వీత యది పశ్యేత్ పరాక్రమమ్
భైషజ్యమేతద్ దుఃఖస్య యదేతన్నాను చిన్తయేత్
చిన్త్యమానం హి న వ్యేతి భూయశ్చాపి ప్రవర్ధతే

తనయందు పరాక్రమమున్న యెడల శోకింపక శోకమునకు కారణమెద్దియో దానిని నివారింపవలయును దుఃఖమును పోగొట్టుకొనుటకు అన్నిటికంటె మంచిమందు—దానిని గూర్చిన చింతనను విడిచిపెట్టుటయే యగును దానిని గూర్చి చింతించుచుండుటచే దుఃఖము తగ్గకపోగా పైపెచ్చు పెరిగిపోవును

16 అన్యామన్యాం ధనావస్థాం ప్రాప్య వైశేషికీం నరాః
అసంతుష్టాః ప్రముహ్యన్తి సంతోషం యాన్తి పణ్డితాః

ధనముయొక్క భిన్నభిన్న అవస్థావిశేషములను పొంది అసంతుష్టులై మోహమును పొందుదురు కాని బుద్ధిమంతులు సదా సంతుష్టులై యే యుందురు

17 ప్రజ్ఞయా మానసం దుఃఖం హన్యాచ్ఛారీరమౌషధైః
ఏతద్ విజ్ఞాన సామర్థ్యం న బాలైః సమతామియాత్

మనుజుడు తన మానసిక దుఃఖమును బుద్ధి విచారణ ద్వారాను, శారీరిక కష్టమును ఓషధుల ద్వారాను పోగొట్టుకొనవలెను ఇదియే విజ్ఞానముయొక్క సామర్థ్యము అతడు బాలకునివలె అవివేక పూర్ణమైన కార్యము చేయరాదు

18 శయానం చానుశేతే హి తిష్ఠన్తం చానుతిష్ఠతి
అనుధావతి ధావన్తం కర్మ పూర్వకృతం నరమ్

మనుజుని పూర్వకృతకర్మ అతడు నిద్రించినచో తోడనే నిద్రించును లేచినచో తోడనే లేచును పరుగెత్తినచో కూడనే పరుగెత్తును

19 ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః
ఆత్మైవ హ్యాత్మనః సాక్షీ కృతస్యాప్య కృతస్య చ

మనుజుడు తనకు తానే బంధువు తనకు తానే శత్రువు తనకు తానే శుభాశుభ కర్మలకు సాక్షి

20 శుభేన కర్మణా సౌఖ్యం దుఃఖం పాపేన కర్మణా
కృతం భవతి సర్వత్ర నాకృతం విద్యతే క్వచిత్

మనుజునకు శుభకర్మచే సుఖమున్ను అశుభకర్మచే దుఃఖమున్ను కలుగుచున్నది ఎక్కడైనను చేసిన కర్మకే ఫలము కలుగునుగాని చేయనికర్మకు కాదు

21 అశాశ్వతమిదం సర్వం చిన్త్యమానం నరర్షభ
కదలీసంనిభో లోకః సారో హ్యస్య న విద్యతే

నరశ్రేష్ఠా! విచారించినచో ఈ జగత్తంతయు అనిత్యముగనే తెలియబడును ఈ విశ్వమంతయు అరటిస్తంభమువలె సారహీనమైనది ఇట సారమైనది ఏదియును లేదు

22 యథా జీర్ణమజీర్ణం వా వస్త్రం త్యక్త్వా తు పూరుషః
అన్యద్ రోచయతే వస్త్రమేవం దేహాః శరీరిణామ్

మనుజుడు పాత వస్త్రము ను వదలి నూతన వస్త్రము ను ధరించు నట్లు దేహధారులచే శరీరములు అప్పుడప్పుడు వదలివేయబడుచు, గ్రహింపబడుచు నున్నవి

23 యథా తు సలిలం రాజా క్రీడార్థమను సంతరత్
ఉన్మజ్జేచ్చ నిమజ్జేచ్చ కించిత్ సత్త్వం నరాధిప

24 ఏవం సంసారగహనే ఉన్మజ్జన నిమజ్జనే
కర్మభోగేన బధ్యన్తే క్లిశ్యన్తే చాల్పబుద్ధయః

రాజా! జలక్రీడలందు ఒకడు మునుగుచు, ఒకడు తేలుచు ఒకడు బయటకు వెడలుచు నుండునట్లు అగాధమైన ఈ సంసార సముద్రమందు జీవులు మునుగుచు తేలుచు (మరణించుచు జన్మించుచు) నున్నారు మందబుద్ధి కలవాడీ ఇచట కర్మభోగముచే బంధింపబడి కష్టముల నొందుచున్నాడు

25 యే తు ప్రాజ్ఞాః స్థితాః సత్త్వే సంసారేఽస్మిన్ హితైషిణః
సమాగమజ్ఞా భూతానాం తే యాన్తి పరమాం గతిమ్

ఏ బుద్ధిమంతులు ఈ ప్రపంచమున సత్త్వగుణముతో కూడి యుందురో, సర్వులయొక్క హితమును కోరుదురో, ప్రాణులయొక్క సమాగమమును కర్మానుసారమని తలంచుదురో అట్టివారు ఉత్తమ గతిని పొందుదురు

26 తథైవ పరిరక్షన్తి యే ధ్యాన పరినిష్ఠితాః
అయం న బుధ్యతే తావద్ యమలోక మథా గతమ్

ఎవరు భగవంతుని ధ్యానమందు తత్పరులై యుందురో, వారే శాస్త్రానుసారము వ్యవహరించి తమ్ములను రక్షించుకొనగలుగుచున్నారు సామాన్యజీవుడు తన యెదుటకు వచ్చిన యమలోకమునుగూడ తెలిసి కొన లేకున్నాడు

32 తేషాం హయానాం యో వేగం ధావతామను దావతి
స తు సంసార చక్రేఽస్మిం శ్చక్రవత్ పరివర్తతే

ఈ శరీరమే ఒక రథము బుద్ధి సారథి ఇంద్రియములు గుఱ్ఱములు మనస్సు పగ్గము స్వేచ్ఛగా పరుగిడుచున్న ఆ గుఱ్ఱముల యొక్క వేగము ను ఎవడు అనుసరించునో అతడు ఈ సంసార చక్రమున తగుల్కొని తిరుగాడుచ ండును—అని పెద్దలు చెప్పుదురు

33 యతేన్ద్రియో నరో రాజన్ క్రోధ లోభ నిరాకృతః
సంతుష్టః సత్యవాదీ య స శాన్తి మధిగచ్ఛతి

ఎవడు జితేంద్రియుడై క్రోధ లోభరహితుడై సంతోషియై సత్యవాదియై యుండునో అట్టివానికి శాంతి లభించును

34 సాధుః పరమ దుఃఖానాం దుఃఖభైషజ్యమాచరేత్
జ్ఞానౌషద మవాప్యేహా దూరపారం మహౌషదమ్
చిన్ద్యాద్ దుఃఖ మహావ్యాదిం నరః సంయుత మానసః

సాధువగువాడు తన మనస్సును వశమందుంచుకొని జ్ఞానమను మహా దుర్లభమైన గొప్ప ఓషధిని పొందవలెను దానితో అతడు తన మహా దుఃఖములకు చికిత్స గావించుకొనవలెను ఆ జ్ఞానమను ఓషధిచే దుఃఖమను గొప్ప వ్యాధిని నశింపజేసికొనవలెను

35 న విక్రమో న చాప్యర్థో న మిత్రం న సుహృజ్జనః
తథోన్మోచయతే దుఃఖాద్ యథాఽఽత్మా స్థిరసంయమః

దృఢముగ నిగ్రహింపబడిన తన మనస్సు ఎట్టి దుఃఖమును పోగొట్టునో అట్టి దుఃఖమును పరాక్రమముగాని ధనముగాని మిత్రులు గాని సుహృత్తులుగాని పోగొట్టలేరు

36 తస్మాన్మైత్రం సమాస్థాయ శీలమాపద్య భారత
దమస్త్యాగోఽప్రమాదశ్చ తే త్రయో బ్రహ్మణో హయాః

37 శీలరశ్మి సమాయుక్తః స్థితో యో మానసే రథే
త్యక్త్వా మృత్యుభయం రాజన్ బ్రహ్మలోకం స గచ్ఛతి

కావున సర్వత్ర మైత్రీభావమును కలిగియుండి సచ్ఛీలమును బడయవలెను దమము త్యాగము అప్రమత్తత—అను ఈ మూడును పరమాత్మయొద్దకు గొనిపోవు గుఱ్ఱములు ఎవడు సచ్ఛీలమను కళ్ళెము పట్టుకొని ఈ మూడు గుఱ్ఱములను తోలుకొని మనస్సను రథముపై వెడలునో అతడు మృత్యువుయొక్క భయమును వదలి బ్రహ్మలోకమునకు పోవుచున్నాడు

38 అభయం సర్వభూతేభ్యో యో దదాతి మహీపతే
స గచ్ఛతి పరం స్థానం విష్ణోః పదమనామయమ్

సమస్త ప్రాణులకును అభయదానమొసంగువాడు విష్ణువుయొక్క నాశరహితమగు పరమ ధామమును పొందును

39 న హ్యాత్మనః ప్రియతరం కించిద్ భూతేషు నిశ్చితమ్
అనిష్టం సర్వభూతానాం మరణం నామ భారత
తస్మాత్ సర్వేషు భూతేషు దయా కార్యా విపశ్చితా

ప్రాణులకు తమ ఆత్మకంటె వేఱుగ ప్రియమైన వస్తువేదియు లేదని నిశ్చయముగ చెప్పవచ్చును కాబట్టి మరణించుట ఏ ప్రాణికిన్ని ఇష్టము ఉండదు అందుచే బుద్ధిమంతుడు సమస్తప్రాణులయెడల దయ కలిగి యుండవలెను

40 అధ్రువే జీవలోకే చ స్థానే వా శాశ్వతే సతి
జీవితే మరణాన్తే చ కస్మాచ్ఛోచసి భారత

రాజ! జీవుడు, జగత్తు అనిత్యములైనపుడు, సనాతన పరమపదము నిత్యమైనపుడు ఈ జీవితముయొక్క అంతము మృత్యువునందే కలదు అని తెలిసికొనినపుడు మీరేల ఇక ఈశరీరములకై శోకించుచున్నారు?

41 అభావా దీని భూతాని భావమధ్యాని భారత
అభావ నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా

రాజా! ప్రాణులందఱును పుట్టకపూర్వము అవ్యక్తులై యుండిరి. మధ్యలో వ్యక్తులైరి చివరకు మరణానంతరము మరల అవ్యక్తులగుదురు ఇట్టి స్థితియందు వారికై శోకింపనేల?

42 న శోచన్ మృతమన్వేతి న శోచన్ మ్రియతే నరః
ఏవం సాంసిద్ధికే లోకే కిమర్థమను శోచసి

శోకించువాడు చనిపోయిన వారివెంట వెళ్ళుటలేదు స్వయముగ మరణించుటయు లేదు లోకముయొక్క ఇట్టి స్వాభావికస్థితి ఇట్లుండ ఇక మీరేల మరలమరల శోకించుచున్నారు?

ఎమ్మట పాండవులు శ్రీ కృష్ణుడు ధృతరాష్ట్రుని యొద్దకు వెళ్ళిరి అతను పుత్రశోకముతో కూడుకొనియుండెను పాండవులాతనికి నమస్కరించిరి తన పుత్రులను వధించిన భీమునిపై క్రుద్ధుడై ధృతరాష్ట్రుడు అతనిని చంపదలంచగా ఆ విషయము శ్రీ కృష్ణుడెఱింగి భీముని ప్రక్కకు తొలగించి ఆతని స్థానమందు భీముని ఇనుప విగ్రహమును ఉంచెను ధృతరాష్ట్రుడు ఆ విగ్రహమును విరచివైచెను తదుపరి శ్రీ కృష్ణుడు ధృతరాష్ట్రునకు అది భీముని లోహవిగ్రహమనియు, అసలు భీముడు కాదనియు తెలిపి, శాంతిస్థాపన కొఱకైన ప్రయత్నములను ఆమోదించవలెననియు శోకమును వీడుమనియు చెప్పెను వ్యాసమునియొక్క వరముచే దివ్యదృష్టిని బడసి గాంధారి యుద్ధమందు మడసిన దుర్యోధనాది యోధులను, విలపించుచున్న తన కోడళ్ళను చూచి దుఃఖింప దొడగెను తరువాత యుద్ధమందు అసువులు బాసినవారికి దహనసంస్కారములు కావింపబడెను

ఓమ్

# 12 శాంతి పర్వము

అనంతరము ధర్మరాజు అర్జునునకు తన వేదమును ప్రకటించుచు రాజ్యమును వదలి వనమునకు పోవదలంచినట్లు చెప్పి ఇట్లనెను—

యుధిష్ఠిర ఉవాచ—

1 సాదు క్షమా దమః శౌచం వైరాగ్యం చాప్యమత్సరః
అహింసా సత్యవచనం నిత్యాని వనచారిణామ్

(ధర్మరాజ అర్జునునితో ఇట్లు చెప్పెను—)

క్షమ మనస్సు ఇంద్రియముల సంయమము బాహ్యాభ్యంతర శుద్ధి వైరాగ్యము ఈర్ష్య లేకుండుట అహింస సత్యభాషణము— అను వనవాసులయొక్క ఈ నిత్యధర్మములు శ్రేష్ఠములైయున్నవి

2 ధనంజయ కృతం పాపం కల్యాణే నోప హన్యతే
ఖ్యాపనేనాను తాపేన దానేన తపసాపి వా

అర్జునా! చేయబడిన పాపము చెప్పుకొనుటచేతను, శుభ(పుణ్య) కర్మ నాచరించుటచేతను పశ్చాత్తాప పడుటచేతను దానము చేయుట చేతను తపస్సుచేతనుకూడ నశించును

3 వనమామన్త్ర్య వః సర్వాన్ గమిష్యామి పరంతప
నహి కృత్స్నతమో ధర్మః శక్యః ప్రాప్తుమితి శ్రుతిః
పరిగ్రహవతా తన్మే ప్రత్యక్షమరిసూదన

శత్రుసూదనా! నేను మీ అందరివద్ద సెలవు తీసికొని వనమునకేగెదను సంగ్రహణ పరిగ్రహము లందు తగుల్కొనినవాడు పూర్ణ ధర్మమగు మోక్షమును పొందలేడని శ్రుతి చెప్పుచున్నది ఈ విషయమును గూర్చి నాకు ప్రత్యక్షముగు అనుభవము కలుగుచున్నది

4 జన్మమృత్యు జరావ్యాది వేదనాభి రభిద్రుతమ్
అపారమివ చాస్వ స్థం సంసార త్యజతః సుఖమ్

ఈ ప్రపంచమున ఒక్కయు మృత్యువు — వార్ధక్యము వ్యాధి శోకానాశము — వీని యొక్క ఆక్రమణము జరుగుచున్నది వీనిచే పీడితము కాని వస్తువు స్థిరముగ నుండుటలేదు అపార గ శోకించుచున్న ఈ సంసారమును ఎవరు త్యజించివేయుదురో (గృహస్థభావనను త్యజించి ఆత్మను ఆశ్రయింతురో) అట్టివానికే సుఖము కలుగును

5 దివః పతన్తి దేవేషు స్థానేభ్యశ్చ మహర్షిషు
కో హి నామ భవేనార్థీ భవేత్ కారణతత్త్వవిత్

దేవతలున్ను స్వర్గమునుండి క్రిందకు పడుచుండ మహర్షులున్ను (స్థాన చ్యుతులై) వారివారి స్థానములనుండి చలించుచుండ కారణ తత్త్వము నెరిగిన ఏ మనుష్యుడు జననమరణరూపమగు ఈ సంసారమునందు ఏ ప్రయోజనమును కలిగియుండును?

ధర్మరాజు యొక్క వనవాసమునకు సోదరులు ఇష్టపడలేదు రాజ్యమును ధర్మపూర్వకముగ పాలించుటయే మంచిదని వారు నుడివిరి తత్సందర్భమున భీముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—

భీముడు ఉవాచ —

6 నేమే మృగాః స్వర్గజితో న వరాహా న పక్షిణః
అథాన్యేన ప్రకారేణ పుణ్యమాహుర్వ్రతం జనాః

(భీముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

సదా వనమందు విహరించుట మాత్రముచే ఈ మృగములు ఎందును ఎన్నడు స్వర్గలోకముపై అధికారమును పొందగల్గినవా? పుణ్యప్రాప్తి ఇతర పద్ధతులద్వారా చెప్పబడినది శ్రేష్ఠులు కేవలము వనవాసమునే పుణ్యకార్యముగ భావింపరు

అప్పుడు నకులుడు ధర్మరాజుతో ఇట్లు వచించెను —

నకుల ఉవాచ—

7 అన్తర్బహిశ్చ యత్ కించిన్మనో వ్యాసఙ్గకారకమ్
పరిత్యజ్య భవేత్ త్యాగీ న హిత్వా ప్రతి తిష్ఠతి

(నకులుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

బాహ్యమున అభ్యంతరమందు మనస్సును బంధించు పదార్థములను వదలుటచేతనే మనుజుడు త్యాగి అగుచున్నాడు కేవలము ఇట్లు విడిచిపోవుటచే త్యాగముయొక్క సిద్ధి కలుగనేరదు

ఎమ్మట సహదేవుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—

సహదేవ ఉవాచ—

8 ద్వ్యక్షరస్తు భవేన్మృత్యుస్త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వతమ్
మమేతి చ భవేన్మృత్యుర్న మమేతి చ శాశ్వతమ్

(సహదేవుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

రెండక్షరముల పదమగు మమ (ఇది నాది) అనునది మృత్యువు మూడక్షరముల పదమగు నమమ (ఇది నాదికాదు) అనునదియే అమృతము, సనాతన బ్రహ్మము, మోక్షము

9 బ్రహ్మమృత్యూ తతో రాజన్నాత్మన్యేవ సమాశ్రితౌ
అదృశ్యమానౌ భూతాని యోధయేతామ సంశయమ్

రాజా! కావున మృత్యువు, అమృతము (బ్రహ్మము) రెండను శరీరములోననే అదృశ్యరూపముననున్నవి మృత్యురూపమగు మమ (నాది) అను భావనయే లోన ఉండి జనులను కలహించుకొనునట్లు చేయుచున్నది ఇందు సంశయము లేదు

10 అథవా వసతో రాజన్ వనే వన్యేన జీవతః
ద్రవ్యేషు యస్య మమతా మృత్యోరాస్యే స వర్తతే

రాజా! వనమందు నివసించుచు, వనమందలి ఫలాదులచే జీవించు చున్నను ఎవనికి పదార్థములందు మమత్వము కలిగియే యుండునో అట్టివాడు మృత్యువుయొక్క ముఖమందున్నవాడే యగును

11 బాహ్యాన్తరం చ భూతానాం స్వభావం పశ్య భారత
యే తు పశ్యన్తి తద్ భూతం ముచ్యన్తే తే మహాభయాత్

జనుల బాహ్యస్వభావము ఒక రకముగను అభ్యంతర స్వభావము మఱియొకరకముగను ఉండుచున్నది మీరు దానిని గమనించుడు ఎవరు అందఱియొక్క లోపల విరాజమానుడైయున్న పరమాత్మను చూచుచున్నారో వారు గొప్ప భయమునుండి విముక్తులగుచున్నారు

అర్జున ఉవాచ—

12 అవధ్యః సర్వభూతానామన్తరాత్మా న సంశయః
అవధ్యే చాత్మని కథం వధ్యో భవతి కస్యచిత్

(అర్జునుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

సమస్త ప్రాణులయొక్క అంతరాత్మ వధింపబడనేరదు ఇందు సంశయములేదు ఆత్మయొక్క వధ కావింపబడజాలదు కావున అది దేనిచేత వధ్యము కాగలదు?

13 యథా హి పురుషః శాలాం పునః సమ్ప్రవిశేన్నవామ్
ఏవం జీవః శరీరాణి తాని తాని ప్రపద్యతే

14 దేహాన్ పురాణానుత్సృజ్య నవాన్ సమ్ప్రతిపద్యతే
ఏవం మృత్యుముఖం ప్రాహుర్జనా యే తత్త్వదర్శినః

మనుజుడు నూతన గృహములందు ప్రవేశించులాగున జీవుడు భిన్నభిన్న శరీరములను ప్రవేశించుచున్నాడు పాత శరీరములను వదలి క్రొత్త శరీరములను ధరించుచున్నాడు దీనినే తత్త్వదర్శులు మృత్యువుయొక్క ముఖమని చెప్పుచున్నారు

ఎదప భీముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—

15 ద్వివిధో జాయతే వ్యాధిః శారీరో మానస స్తథా
పరస్పరం తయోర్జన్మ నిర్ద్వన్ద్వం నోపలభ్యతే

(భీముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

మనుజునకు రెండు విధములైన వ్యాధులు కలుగుచున్నవి — అవి శారీరక మానసిక వ్యాధులు ఈ రెండిటియొక్క ఉత్పత్తియందు ఒకదానికి మఱియొకటి ఆశ్రితమైయున్నది ఒకటి లేనిచో మఱియొకటి సంభవించదు

16 శారీరం మానసం దుఃఖం యోఽతీతమను శోచతి
దుఃఖేన లభతే దుఃఖం ద్వావనర్థౌ చ విన్దతి

ఎవడు గతించిన మానసిక శారీరక దుఃఖములను మరలమరల శోకించునో అతడు ఒక దుఃఖమునుండి మఱియొక దుఃఖమును పొందును అతడు రెండురెండు అనర్థములను అనుభవించవలసి వచ్చును

17 శీతోష్ణే చైవ వాయుశ్చ త్రయః శారీరజా గుణాః
తేషాం గుణానాం సామ్యం యత్తదాహు స్స్వస్థలక్షణమ్

శీతము ఉష్ణము వాయువు (కఫ పిత్త వాతములు)—అను ఈ మూడును శారీరక గుణములు ఇది సామ్యావస్థ యందుండుటయె ఆరోగ్యముయొక్క లక్షణమని చెప్పబడుచున్నది

సోదరులు ఎంత చెప్పినను ధర్మరాజు రాజ్యపాలనకు ఇష్టపడక భీమునితో ఇట్లు వచించెను—

యుధిష్ఠిర ఉవాచ—

18 నాప్నో పూరయితుం శక్యాం న మాసై ర్భరతర్షభ
అపూర్యాం పూరయన్నిచ్ఛామాయుషాపి న శక్నుయాత్

(ధర్మరాజు భీమునితో ఇట్లు చెప్పెను—)

ఏ చక్రవర్తి ఈ భూమినంతను ఒకడే పాలించుచున్నాడో,

అట్టివానికికూడ ఒకే పట్టు కలదు కదా! కావున ఇక నీవు ఎందులకీ రాజ్యమును ప్రశంసించుచున్నావు?

19 అపి గాథాం పురా గీతాం జనకేన వదన్త్యుత
నిర్ద్వన్ద్వేన విముక్తేన మోక్షం సమను పశ్యతా

పూర్వము జనకచక్రవర్తి చెప్పిన ఒక గాథను జనులు చెప్పు చుందురు జనకుడు ద్వంద్వరహితుడును జీవన్ముక్తుడును అయి యున్నాడు అతడు మోక్షస్వరూపమైన పరమాత్మ తత్త్వమును సాక్షాత్కరించుకొనెను

20 అనన్తం బత మే విత్తం యస్య మే నాస్తి కిఞ్చన
మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కిఞ్చన

(ఆ గాథ యేమి యనిన—) జనకు డిట్లు చెప్పెను—ఇతరుల దృష్టిలో నా యొద్ద చాల ధనము కలదు కాని దానియందు నాది ఒకం తైనను లేదు మిథిలానగరమంతయు నిప్పంటుకొనినను నాది యేమియు కాలదు

21 ప్రజ్ఞా ప్రాసాదమారుహ్య అశోచ శ్శోచతో జనాన్
జగత స్థానివాద్రిస్థో మన్ద బుద్ధీ నవేక్షతే

పర్వతశిఖరముపై నున్న మనుజుడు క్రింద నేలపైనున్న ప్రాణు లను కేవలము చూచునే కాని వారిచే ప్రభావితుడు కాడు అట్లే బుద్ధి యను మేడపై ఎక్కియున్న మనుజుడు శోకించు మందబుద్ధులైన జను లను చూచునేకాని స్వయముగ వారివలె దుఃఖము నొందడు

22 దృశ్యం పశ్యతి యః పశ్యన్ స చక్షుష్మాన్ స బుద్ధిమాన్
అజ్ఞాతానాం చ విజ్ఞానాత్ సమ్బోధాద్ బుద్ధి రుచ్యతే

ఎవడు ద్రష్ట రూపమున వేరుగనుండి ఈ దృశ్యప్రపంచమును చూచునో, అతడే నేత్రములు కలవాడు అతడే బుద్ధిమంతుడు అజ్ఞాత

తత్త్వముల యొక్క జ్ఞానమును సమ్యక్-బోధను కలిగించునది యగుటచే అంతఃకరణముయొక్క ఒక వృత్తిని బుద్ధియని చెప్పుదురు

23 యస్తు వాచం విజానాతి బహుమాన మియాత్ స వై
బ్రహ్మ భావప్రపన్నానాం వైద్యానాం భావితాత్మనామ్

ఎపుడు మనుజుడు ప్రాణులయొక్క వేఱువేఱు సత్తను ఏకమగు పరమాత్మయందే ఉన్నట్లు చూచునో, మఱియు ఆ పరమాత్మనుండియే ఈ సమస్త ప్రాణులయొక్క విస్తారము సంభవించినదని తలంచునో, అపుడతడు సచ్చిదానంద పరబ్రహ్మను పొందుచున్నాడు

24 తే జనాస్తాం గతిం యాన్తి నా విద్వాంసోఽల్పచేతసః
నా బుద్ధయో నాఽతపసః సర్వం బుద్ధౌ ప్రతిష్ఠితమ్

బుద్ధిమంతుడును తపస్వియునగువాడే అట్టి బ్రహ్మస్థితిని పొందుచున్నాడు అజ్ఞాని మందబుద్ధి శుద్ధబుద్ధిరహితుడు తపస్సు లేనివాడు బ్రహ్మమును పొందలేడు ఏలయనిన అంతయు బుద్ధియందు ప్రతిష్ఠితమై యున్నది

అత్తఱి అర్జునుడు ధర్మరాజుతో ఈ ప్రకారముగ చెప్పెను—

అర్జున ఉవాచ

25 త్యాగాన్న భిక్షుకం విద్యాన్న మౌఢ్యాన్న చ యాచనాత్
ఋజుస్తు యోఽర్థం త్యజతి నసుఖం విద్ధి భిక్షుకమ్

(అర్జునుడు ధర్మరాజున కిట్లు చెప్పెను —)

కేవలము త్యాగముచేతను యాచన చేయుటచేతను ఎవనిని భిక్షువుగ తలంపరాదు, ఎవడు సరళభావముతో స్వార్థమును త్యజించునో విషయ సుఖము నందాసక్తుడు కాడో అట్టివానినే భిక్షువని తలంచుడు

26 అసక్తః సక్తవద్ గచ్ఛన్ నిఃసఙ్గో ముక్త బన్ధనః
సమః శత్రౌ చ మిత్రే చ స వై ముక్తో మహాపతే

ఎవడు ఆసక్తిరహితుడై ఆసక్తునివలె సంచరించునో, ఎవడు సంగరహితుడై సమస్త బంధనములను తెంచివేయునో ఎవనికి శత్రువునందు మిత్రుని యందు సమభావము కలదో, అతడు సదా ముక్తుడే అయియున్నాడు

27 ఎరివ్రజన్తి దానార్థం ముణ్డాః కాషాయ వాససః
ఎతా బహువిధైః పాశైః సంచిన్వన్తో వృథామిషమ్

కొందఱు దానము తీసికొనుటకొఱకై తలగొరిగించుకొని కాషాయవస్త్రమును ధరించి ఇల్లు విడచిపోవుచున్నారు వారు అనేక బంధనములచే బంధింపబడుటచే వ్యర్థ భోగములనే వెతకుచునున్నారు

28 అనిష్కషాయే కాషాయమీహార్థమితి విద్ధితమ్
ధర్మధ్వజానాం ముణ్డానాం వృత్త్యర్థమితి మే మతిః

హృదయమందలి రాగాది దోషములు తొలగనిచో కేవలము కాషాయ వస్త్రమును ధరించుట స్వార్థసాధన యొక్క చేష్టకొఱకే యని తలంచవలెను ధర్మమును నటనచేయు వారి కొఱకే ఇది జీవికను నడుపుటకొఱకై ఒక తంతు మాత్రమేయని నా విశ్వాసము

అంతట ధర్మరాజు అర్జునునితో ఇట్లు పలికెను —

యుధిష్ఠిర ఉవాచ

29 తపస్త్యాగోఽవిధి రితి నిశ్చయస్త్వేష ధీమతామ్
ఎరం పరం జ్యాయ ఎషాం యేషాం నైశ్రేయస మతిః

(ధర్మరాజు అర్జునునితో ఇట్లు చెప్పెను —)

ఏ మహానుభావులయొక్క బుద్ధి పరమశ్రేయమునందు లగ్నమై యున్నదో అట్టి బుద్ధిమంతుల యొక్క నిర్ణయ మీ ప్రకారముగ నున్నది— తపస్సు త్యాగము, అతీతమగు బ్రహ్మజ్ఞానము — అను వీని యందు ఉత్తరోత్తరములు శ్రేష్ఠములై యున్నవి

30 ఉత్తరేణ తు పన్థానమారాః విషయ నిగ్రహాత్
అబుద్ధి జం తమస్త్యక్త్వా లోకాం స్త్యాగపతాం గతా

అనేక మంది ఆర్యులు ఇంద్రియములను వాని విషయముల నుండి నిగ్రహించి అవివేక జనితమగు అజ్ఞానమును వదలి ఉత్తర మార్గము (దేవయానము) ద్వారా త్యాగుల లోకములకు వెడలిరి

31 అనిర్దేశాః గతి సా తు యాం ప్రపశ్యన్తి మోక్షిణః
తస్మాద్ యోగ ప్రదానేషః న తు దుఃఖం ప్రవేదితుమ్

మోక్షమార్గమున పయనించువారు ఏ సద్గతిని సాక్షాత్కరించు చున్నారో అది అనిర్దేశ్యమై యున్నది కావున జ్ఞానయోగమే అన్ని సాధనములందు ప్రధానమును అభీష్టమును అయియున్నది కాని దాని స్వరూపమును తెలిసికొనుట చాల కఠినము

32 వేదవాదానతిక్రమ్య శాస్త్రాణ్యారణ్యకాని చ
విహాయ కదలీస్తమ్భం నారం దదృశిరే న తే

వేదము యొక్క సమస్త వాక్యములను శాస్త్రములను వేదాంత గ్రంథములను చదివినవారికి — అరటి స్తంభములను విడదీసి చూచినచో అందు సారమేమియు గోచరించనట్లు ఈ ప్రపంచ మునందు సారవస్తువు గోచరించుట లేదు

33 అగ్రాహ్యం చక్షుషా సూక్ష్మమనిర్దేశ్యం చ తదిరా
కర్మ హేతు పురస్కారం భూతేషు పరివర్తతే

ఆత్మస్వరూపము మహాసూక్ష్మమైనది అది నేత్రములచే చూడబడజాలదు వాక్కు ద్వారా దాని యొక్క ఏ లక్షణమున్ను చెప్పబడజాలదు అది సమస్త ప్రాణులందును కర్మకు హేతుభూత మైన అవిద్యను ముందుంచుకొని దాని ద్వారా తన స్వరూపమును దాచి యుంచి వెలయుచున్నది

అపుడు దేవస్థానుడను ముని ధర్మరాజును యజ్ఞానుష్ఠానమున ప్రేరేపించుచు ఇట్లు నుడివెను—

దేవస్థాన ఉవాచ—

34 సంతోషో వై స్వర్గ తమః సంతోషః పరమం సుఖమ్
తుష్టేర్న కించిత్ పరతః సా సమ్యక్ ప్రతి తిష్ఠతి

(దేవస్థాన ముని ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)
మనుజుని మనస్సునందు సంతుష్టియుండుట స్వర్గప్రాప్తికంటెను గొప్పది. సంతుష్టియే అన్నిటికంటెను గొప్ప సుఖము. సంతుష్టి మనస్సునందు చక్కగ ప్రతిష్ఠింపబడినచో దానికంటె మించినది ప్రపంచమున ఏదియును లేదు

35 యదా సంహరతే కామాన్ కూర్మోఽఙ్గానీవ సర్వశః
తదాఽఽత్మజ్యోతిరచిరాత్ స్వాత్మనేవ ప్రసీదతి

తాబేలు తన అవయవములన్నిటిని లోనికి ముడుచుకొనునట్లు మనుజుడెపుడు తన కోరికలన్నిటిని అన్నివైపులనుండియు ఉపసంహరించుకొనునో అపుడు వెంటనే జ్యోతిస్స్వరూపుడగు ఆత్మ అతని అంతఃకరణమందు ప్రకాశితమగుచున్నది

36 న బిభేతి యదా చాయం యదా చాస్మాన్న బిభ్యతి
కామద్వేషౌ చ జయతి తదాఽఽత్మానం చ పశ్యతి

మనుజుడెప్పుడు దేనినుండియు భయమును పొందడో ఏ ప్రాణియు అతనివలన భయమును పొందదో ఎపుడతడు రాగద్వేషములను జయించివేయునో అపుడతడు ఆత్మస్వరూపమును చక్కగా సాక్షాత్కారమును పొందును

37 యదాసౌ సర్వభూతానాం న ద్రుహ్యతి న కాఙ్క్షతి
కర్మణా మనసా వాచా బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎపుడు మనుజుడు మనోవాక్కర్మలద్వారా సమస్త ప్రాణుల యెడల ద్రోహము చేయకుండునో మఱియు దేనినిగూర్చి అభిలాషయు లేకుండునో అపుడతడు పరబ్రహ్మరూప పరమాత్మను పొందును

38 ఎతత్ సర్వం సమాలోక్య బుధానామేష నిశ్చయః
అద్రోహేణైవ భూతానాం యో ధర్మః స సతాం మతః

అన్ని విషయములను విచారించి పెద్దలు ఇట్టి నిశ్చయమునకు వచ్చిరి— మనుజుడు ఏ ప్రాణికి ద్రోహము చేయక ఏ ధర్మమును పాలించునో అదియే సాధుమహాత్ముల దృష్టియందు ఉత్తమ ధర్మమై యున్నది

39 అద్రోహః సత్యవచనం సంవిభాగో దయా దమః
ప్రజనం స్వేషు దారేషు మార్దవం హ్రీరచాపలమ్
ఎవం ధర్మం ప్రధానేష్టం మనుః స్వాయంభువోఽబ్రవీత్

ఎవరియెడలను ద్రోహము చేయకుండుట సత్యము పలుకుట సమస్తప్రాణులకు యథాయోగ్యముగ వాని భాగమును సమర్పించుట, సర్వులయెడల దయకలిగి యుండుట మనస్సును ఇంద్రియములను నిగ్రహించుట, ఏకపత్నీవ్రతము, మృదుత్వము, లజ్జ అచంచలత్వము అను ఈ గుణములను కలిగియుండుట—ఇవి శ్రేష్ఠ అభీష్ట ధర్మములని స్వాయంభువ మనువు చెప్పియుండెను

అంతట వ్యాసముని ధర్మరాజునకు రాజోచిత కర్తవ్యమును పాలించుట మంచిదని బోధించి ఆతనితో ఇట్లు పలికెను—

వ్యాస ఉవాచ—

40 ఆత్మాऽపి చాయం న మమ సర్వాపి పృథివీ మమ
యథా మమ తథాన్యేషామితి పశ్యన్ న ముహ్యతి

(వ్యాసముని ధర్మరాజుతో ఇట్లుచెప్పెను—)

ఈ శరీరము తనది కాదు ఈ భూతలమంతయు తనది కాదు

'ఇది ఏ విధముగ నాదియో అట్లే ఇతరులది కూడను'—ఇట్టి దృష్టి కలిగియుండువాడు మోహమున ఎన్నటికిని తగుల్కొనడు

41 సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యానన్తరం సుఖమ్
న నిత్యం లభతే దుఃఖం న నిత్యం లభతే సుఖమ్

సుఖము తరువాత దుఃఖము దుఃఖము తరువాత సుఖము కలుగుచున్నవి ఎవడును సదా దుఃఖమును గాని సదా సుఖమును గాని పొందుటలేదు

42 సుఖం వా యది వా దుఃఖం ప్రియం వా యది వా ప్రియమ్
ప్రాప్తం ప్రాప్తముపాసీత హృదయేనాపరాజితః

సుఖము గాని దుఃఖము గాని ప్రియము గాని అప్రియము గాని ఏది లభించినను దానిని ఆనందముతో స్వీకరించవలెను తన హృదయముతో దానిముందు పరాజయము స్వీకరించరాదు (ధైర్యము కోల్పోవరాదు)

43 సుఖం చ దుఃఖం చ భవాభవౌ చ
లాభాలాభౌ మరణం జీవితం చ
పర్యాయతః సర్వమవాప్నువన్తి
తస్మాద్ ధీరో నైవ హృష్యేన్న శోచేత్

సుఖదుఃఖములు, ఉత్పత్తి వినాశములు లాభనష్టములు జీవన మరణములు—అనునివి అపుడపుడు క్రమముగ అందరికిని కలుగుచుండును కావున ధీరులగువారు వీనికొఱకై హర్ష, శోకములను కలిగియుండరాదు

వ్యాసప్రోక్తములగు ధర్మములను శ్రద్ధగా విని ఆ సందర్భమున ధర్మరాజు అర్జునునితో ఇట్లు చెప్పెను—

44 తుష్టేర్న కిఞ్చిత్ పరమం సా సమ్యక్ ప్రతితిష్ఠతి
వినీతక్రోధహర్షస్య సతతం సిద్ధిరుత్తమా

(ధర్మరాజ అష్టకునితో ఇటు చెప్పెను—)

సంతుష్టిని మించినది మరేదియు లేదు ఎవడు క్రోధమును హర్షమును జయించెనో అతని హృదయమందే పరమ వైరాగ్యరూపమగు సంతుష్టియొక్క ఉత్తమ ప్రతిష్ఠ సంభవించుచున్నది మరియు అట్టివానికే ఉత్తమసిద్ధి సంప్రాప్తించుచున్నది

45 యదా చాయం న బిభేతి యదా చాస్మాన్న బిభ్యతి
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎపుడును మనుజుడు దేనిని చూచియు భయపడడో అతనిని చూచి ఏదియు భయము పొందదో దేనిని అతడు కోరడో దేనిని ద్వేషింపకుండునో అపుడతడు బ్రహ్మభావమును పొందును

46 యదా న భావం కురుతే సర్వభూతేషు పాపకమ్
కర్మణా మనసా వాచా బ్రహ్మసమ్పద్యతే తదా

ఎపుడు మనుజుడు మనస్సు వాక్కు క్రియలద్వారా సమస్త ప్రాణికోట్లయెడల పాపబుద్ధిని త్యజించివేయునో అపుడతడు పరబ్రహ్మమును పరమాత్మను పొందును

47 వినీతమానమోహశ్చ బహుసఙ్గవివర్జితః
తదాఽఽత్మజ్యోతిషః సాధోర్నిర్వాణముపపద్యతే

మానము మోహము తొలగిపోయినవాడును నానావిధములైన ఆసక్తులు లేనివాడును ఆత్మజ్ఞానమును బడసినవాడును అగు సాధు మహాత్మునకు మోక్షము సంప్రాప్తించును

48 అధనః కస్య కిం వాచ్యో విముక్తః సర్వశః సుఖీ
దేవస్వముపగృహ్యైవ ధనేన న సుఖీ భవేత్

నిర్ధనునితో ఎవడు ఏమి చెప్పగలడు? అతడు అన్ని విధములైన భయములు తొలగి సుఖముగ నుండును దేవతలసంపద కలిగియున్నను ధనముచే ఎవడును సుఖవంతుడు కాజాలడు

49 లబ్ధస్య త్యాగమిత్యాహుర్న భోగం న చ సంచయమ్
తస్య కిం సంచయేనార్థః కార్యే జ్యాయసి తిష్ఠతి

ప్రాప్తించిన ధనమును దానము చేయుట మంచిదని చెప్ప బడినది దానిని భోగములకై వినియోగించుట లేక ప్రోగుచేసికొని యుండుట మంచిదికాదు ఎవనియొద్ద యజ్ఞము మొదలైన గొప్ప కార్యములు కల అట్టివానికి ధనమును ప్రోగుచేసికొని యుండుట వలన ఏమి ఫలము?

శోకవశమున ధర్మరాజు శరీరత్యాగము చేయదలంచగా వ్యాస ముని ఆ కార్యమును నివారించి ధర్మరాజుతో తిరిగి ఇట్లు వచించెను—

వ్యాస ఉవాచ—

50 సంయోగా విప్రయోగాన్తాః జాతానాం ప్రాణినాం ధ్రువమ్
బుద్బుదా ఇవ తోయేషు భవన్తి న భవన్తి చ

(వ్యాసముని ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

నీటియందు బుడగలు పుట్టుచు గిట్టుచు నుండును అట్లే ప్రపంచమున ప్రాణికోట్ల యొక్క సంయోగముల యొక్క అంతము నిశ్చయముగ వియోగమందు సంభవించుచున్నది

51 సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్

సంగ్రహణము లన్నిటియొక్క అంతము వినాశమైయున్నది ఉన్నతులన్నిటియొక్క అంతము పతనమైయున్నది సంయోగముల అంతము వియోగమైయున్నది జీవితముయొక్క అంతము మరణమై యున్నది

2 సుఖం దుఃఖాన్తమాలస్యం దాక్ష్యం దుఃఖోదయమ్
భూతిః శ్రీర్హ్రీర్ధృతిః కీర్తిర్దక్షే వసతి నాలసే

అలసత్వము (సోమరితనము) సుఖరూపముగ కనిపించుచున్నది కాని దాని అంతము దుఃఖమైయున్నది అట్లే కార్యదక్షత్వము దుఃఖ రూపముగ గోచరించుచున్నది కాని దానిచే సుఖము కలుగుచున్నది ఐశ్వర్యము సంపద లజ్జ ధైర్యము కీర్తి—అనునివి కార్యదక్షుని యందే నివసించుచున్నవి అలసత్వము కలవానియందు కాదు

ప్రసంగవశమున వ్యాసముని ధర్మరాజనకు అశ్మాఋషి జనక సంవాదమును వివరించెను అశ్మాఋషి జనకునితో ఇట్లు చెప్పెను —

అశ్మోవాచ —

53 మానసానాం పునర్యోనిర్దుఃఖానాం చిత్తవిభ్రమః
అనిష్టోపనిపాతో వా తృతీయం నోపపద్యతే

(అశ్మాఋషి జనకునితో ఇట్లు చెప్పెను—)

మనుజులకు మాటిమాటికి కలుగు మానసిక దుఃఖములకు కారణములు రెండు—(1) చిత్తము యొక్క భ్రమణము (2) అనిష్టప్రాప్తి ఈ రెండుతప్ప వేరొక కారణము లేదు

54 జరామృత్యూ హి భూతానాం ఖాదితారౌ వృకావివ
బలినాం దుర్బలానాం చ హ్రస్వానాం మహతామపి

వార్ధక్యము, మరణము—అను ఈ రెండును తోడేళ్ళ వంటివి ఇవి బలవంతులను దుర్బలురను చిన్నవారిని పెద్దవారిని—అందఱిని తినివేయుచున్నవి

55 న కశ్చిజ్జాత్వతిక్రామేజ్జరామృత్యూ హి మానవః
అపి సాగరపర్యన్తాం విజిత్యేమాం వసున్ధరామ్

సముద్రపర్యంతము ఈ భూతలమంతటిపై విజయము పొంది యున్నను ఆ వార్ధక్య మరణములను ఎవడును దాటలేడు,

56 సుఖం వా యది వా దుఃఖం భూతానాం పర్యుపస్థితమ్
ప్రాప్తవ్యమవశైః సర్వం పరిహారో న విద్యతే

ప్రాణులచెంతకు ఏ సుఖము దుఃఖము వచ్చుచున్నవో వాని యన్నింటిని అతడు వివశుడై సహించవలసియుండును ఏలయనిన వానిని పరిహరించుటకు (విజ్ఞానముతప్ప వేఱుగు) ఉపాయమున్న లేదు

57 ప్రాయేణ శ్రీమతాం లోకే భోక్తుం శక్తిర్న విద్యతే
కాష్ఠాన్యపి వా జీర్యన్తే దరిద్రాణాం చ సర్వశః

లోకమున ఎ మాన్యముగ ధనవంతులకు తినుటకు జీర్ణించు కొనుటకుకూడ శక్తి ఉండదు దరిద్రుల పొట్టయందు కట్టెలుకూడ జీర్ణమైపోవుచున్నవి

58 యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహోదధౌ
సమేత్య చ వ్యపేయాతాం తద్వద్ భూతసమాగమః

మహాసముద్రమున ఒక కట్టె ఒకవైపునుండి మఱియొకటి మఱి యొకవైపునుండి వచ్చి రెండును కొంతసేపు ఒకచోట కలిసికొని మఱల విడిపోవుచున్నవి ఆ ప్రకారమే ఈ ప్రపంచమున ప్రాణులయొక్క సంయోగ వియోగములు కలుగుచున్నవి

59 మాతాపితృసహస్రాణి పుత్రదారశతాని చ
సంసారేష్వనుభూతాని కస్య తే కస్య వా వయమ్

ఈ ప్రపంచమున మనము అనేక పర్యాయములు జన్మలెత్తి వేలకొలది తల్లిదండ్రులను వందలకొలది స్త్రీ పుత్రులను అనుభ వించితిమి కాని ఇప్పుడు వారందఱు ఎవరివారు? లేక మనము వారం దఱిలో ఎవరి వారము?

60 నైవాస్య కశ్చిద్ భవితా నాయం భవతి కస్యచిత్
పథి సఙ్గతమేవేదం దారబన్ధు సుహృజ్జనైః

ఈ జీవునకు ఎ సంబంధియు లేదు లేక ఇతడు ఎవనియొక్కయు సంబంధి కాడు మార్గమున పోవువారిని మార్గమునపోవు మఱికొందఱు కలసికొనునట్లు ఇచట సోదరులు బంధువులు స్త్రీలు పురుషులు మిత్రులు మున్నగువారియొక్క కలయిక సంభవించుచున్నది

61 క్వాసే క్వ చ గమిష్యామి కో న్వహం కిమిహాస్థితః
కస్మాత్ కిమనుశోచేయ మిత్యేవం స్థాపయేన్మనః

కావున వివేకవంతుడు తన మనస్సునందు ఈ ప్రకారముగ చింతన చేయవలెను— నే నెవరను? ఎచట నున్నాను? ఎచటికి పోవుదును? ఇచటికి ఎందుకొఱకు వచ్చియున్నాను? ఎందుకొఱకు ఎవరికై శోకించుదును?

62 అనిత్యే ప్రియసంవాసే సంసారే చక్రవదతౌ
పథి సంగతమేవైతద్ భ్రాతా మాతా పితా సఖా

ఈ సంసారము చక్రమువలె తిరుగుచున్నది దీనియందు ప్రియజనులయొక్క సహవాసము అనిత్యమైయున్నది ఇచట సోదరులు, మిత్రులు తండ్రులు తల్లులు— మున్నగువారి కలయిక మార్గమందలి ప్రయాణీకుల కలయిక వంటిదేయగును

63 న దృష్టపూర్వం ప్రత్యక్షం పరలోకం విదుర్బుధాః
ఆగమాంస్త్వనతిక్రమ్య శ్రద్ధాతవ్యం బుభూషతా

పరలోకము కండ్లయెదుట లేదు ఇదివఱకు చూడలేదు—అని కొందఱు విద్వాంసులు చెప్పినను తన శ్రేయమును కోరువాడు శాస్త్రముల ఆజ్ఞను ఉల్లంఘించక వాని వాక్యములందు విశ్వాసము కలిగియుండవలెను

64 సంనిమజ్జే జ్జగదిదం గమ్భీరే కాలసాగరే
జరామృత్యు మహాగ్రాహే న కశ్చిదవబుధ్యతే

వార్ధక్యము మృత్యువు—అను పెద్దపెద్ద మొసళ్ళుగల గంభీర కాల సముద్రమున ఈ ప్రపంచమంతయు మునుగుచున్నను ఈ విష యమును ఎవరును తెలిసికొనుటలేదు

65 న హ్యహాని నివర్తన్తే న మాసా న పునః క్షపాః
జాతానాం సర్వభూతానాం న పక్షా న పునః క్షపాః

ప్రపంచమున జన్మించు సమస్తప్రాణులకు పగళ్ళు రాత్రులు, పర్వములు మాసములు పక్షములు ఒకసారిగ వచ్చిపోయినవి అవి వచ్చుటలేదు

66 నాయమత్యన్తసంవాసో లభ్యతే జాతు కేనచిత్
అపి స్వేన శరీరేణ కిముతాన్యేన కేనచిత్

ఎవనికిని ఎవరితోను ఎల్లప్పుడు ఒకచోట నివసించు సుయోగము కలుగుటలేదు తన శరీరముతోనే ఎల్లప్పుడు సంబంధము లేకయుండ ఇక ఇతరులతో ఎల్లకాలము ఎట్లుండగలడు?

67 క్వ ను తేఽద్య పితా రాజన్ క్వ ను తేఽద్య పితామహాః
న త్వం పశ్యసి తానద్య న త్వాం పశ్యన్తి తేఽనఘ

పాపరహితుడవగు ఓ రాజా! ఇపుడు మీ తండ్రి ఎచట నున్నాడు? మీ తాత ఇపుడెచటికి పోయినాడు? ఇపుడు మీరు వారిని చూచుటలేదు వారు మిమ్ములను చూచుటలేదు

ఎదప శ్రీ కృష్ణుడు ధర్మరాజును నారద-సృంజయ సంవాద రూపమైన పదునారు రాజుల ఉపాఖ్యానమును తెలియజేసి అతని శోకమును నివారించ ప్రయత్నించెను వ్యాసముని శ్రీ కృష్ణుల ప్రబోధముచే ధర్మరాజు తిరిగి నగరమందు ప్రవేశించెను అంతట ధర్మరాజునకు రాజ్యాభిషేకము జరిగెను అతడు ధృతరాష్ట్రుని అధీన మందే యుండి రాజ్యవ్యవస్థకొరకై సోదరులను ఇతర ప్రజలను విభిన్న కార్యములందు నియోగించెను ఎదప ధర్మరాజు శ్రీ కృష్ణుని స్తుతిం

చెను శ్రీకృష్ణుడు ధర్మరాజాదులను భీష్మునియొద్ద కేగులాగున చెప్పెను తదుపరి భీష్ముడు శ్రీకృష్ణుని ఇట్ల స్తుతించెను—

భీష్మ ఉవాచ—

68 నారాయణః పరం బ్రహ్మ నారాయణపరం తపః
నారాయణః పరో దేవ స్సర్వం నారాయణః సదా

(భీష్ముడు శ్రీకృష్ణుని ఇట్లు స్తుతించెను—)

నారాయణుడే పరబ్రహ్మ నారాయణుడే దేవతలందఱిలోను గొప్పవాడు నారాయణుడే అంతయునై యున్నాడు

ఎదప శ్రీకృష్ణుడు పంచపాండవులు కృపాచార్యుడు ఇంకను పెక్కురు భీష్మాచార్యునియొద్దకు పయనమైరి త్రోవలో శ్రీకృష్ణుడు ధర్మరాజాదులకు పరశురాముని వృత్తాంతమును చెప్పెను పిమ్మట అందఱును భీష్ముని కడకు చేరిరి భీష్ముడు మరల శ్రీకృష్ణుని స్తుతించెను అపుడు శ్రీకృష్ణుడు భీష్ముని ప్రశంసించుచు ధర్మరాజనకు ధర్మోపదేశము చేయులాగున ఆతనితో చెప్పెను ప్రసంగవశమున శ్రీకృష్ణుడు భీష్మునితో ఇట్లు చెప్పెను—

వాసుదేవ ఉవాచ—

69 నహ్యభక్తాయ రాజేన్ద్ర భక్తాయానృజవే న చ
దర్శయామ్యహమాత్మానం న చాశాన్తాయ భారత

(శ్రీకృష్ణుడు భీష్మునితో ఇట్లు చెప్పెను—)

నా భక్తుడు కానివాడును భక్తుడైనను సరళస్వభావము లేని వాడును, మనస్సునందు శాంతిలేనివాడును అగు వానికి నా స్వరూపమును దర్శింపజేయను

ఎదప ధర్మరాజుయొక్క ప్రశ్నను పురస్కరించుకొని భీష్మాచార్యుడు రాజధర్మములు, మొదలైన వానిని ఈ ప్రకారముగ బోధించెను—

భీష్మ ఉవాచ—

70 నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే
బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్

(భీష్ముడు ధర్మరాజాదులతో ఇట్లు చెప్పెను—)

మహత్తరమగు ధర్మమునకు నమస్కారము విశ్వవిధాతయగు శ్రీకృష్ణునకు నమస్కారము ఇప్పుడు బ్రహ్మనిష్ఠులకు నమస్కారము గావించి సనాతనధర్మములను చెప్పనారంభించుచున్నాను

71 ఉత్థానేన సదా పుత్ర ప్రయతేథా యుధిష్ఠిర
న హ్యుత్థానమృతే దైవం రాజ్ఞామర్థం ప్రసాదయేత్

ధర్మరాజా! మీరు సదా పురుషప్రయత్నము గావింపుడు పురుషప్రయత్నము లేక కేవలము ప్రారబ్ధము రాజుల ప్రయోజనమును సిద్ధింపచేయజాలదు

72 సాధారణం ద్వయం హ్యేతద్ దైవముత్థానమేవ చ
పౌరుషం హి పరం మన్యే దైవం నిశ్చితముచ్యతే

కార్యసిద్ధికి ప్రారబ్ధము పురుష ప్రయత్నము – అను రెండును సాధారణముగ కారణములని తలంచబడినను, నేను వానిలో పురుషప్రయత్నమునే ప్రధానముగ నెంచుచున్నాను ప్రారబ్ధము మొదటనే నిశ్చితమైనట్లు చెప్పబడినది

73 విపన్నే చ సమారమ్భే సంతాపం మా స్మ వై కృథాః
ఘటస్వైవ సదాఽఽత్మానం రాజ్ఞామేష పరో నయః

ప్రారంభించిన కార్యము పూర్తి కానిచో లేక, దానియందే దైన అవాంతరము కలిగినచో, దానికొరకై మీరు మనస్సునందు దుఃఖింపరాదు మీరు సదా పురుషప్రయత్నమందే నిమగ్నులుకండు ఇదియే రాజుల సర్వోత్తమ నీతి అయియున్నది

74 ఋషీణామపి రాజేన్ద్ర సత్యమేవ పరం ధనమ్
తథా రాజ్ఞాం పరం సత్యాన్నాన్యద్ విశ్వాసకారణమ్

ఋషులకున్ను సత్యమే పరమధనమైయున్నది రాజులకు సత్యమును మించిన సాధనము మఱియొకటి లేదు దానివలననే ప్రజలకు రాజుపై విశ్వాసము కలుగును

75 గుణవాఞ్ఛీలవాన్ దాన్తో మృదుర్ధర్మ్యో జితేన్ద్రియః
సుదర్శః స్థూలలక్ష్యశ్చ న భ్రశ్యేత సదా శ్రియః

ఏ రాజు గుణవంతుడు శీలవంతుడు మనస్సును ఇంద్రియములను నిగ్రహించువాడు కోమల స్వభావము కలవాడు ధర్మపరాయణుడు జితేంద్రియుడు ప్రసన్నముఖుడు దానాదుల నొసంగువాడు ఉదారచిత్తుడు అయియుండునో అట్టివానికి రాజ్యలక్ష్మి భ్రష్టము కానేరదు

76 ఉత్థానేనామృతం లబ్ధముత్థానేనాసురా హతాః
ఉత్థానేన మహేన్ద్రేణ శ్రైష్ఠ్యం ప్రాప్తం దివీహ చ

దేవరాజగు ఇంద్రుడు ప్రయత్నము చేతనే అమృతమును పొందెను ప్రయత్నముచేతనే అసురులను సంహరించెను ప్రయత్నముచేతనే దేవలోకమునందు ఇహలోకమునందు శ్రేష్ఠత్వమును పొందెను

ఈ సందర్భమున భీష్ముడు ధర్మరాజాదులకు పృథుచక్రవర్తి యొక్క చరిత్రను చెప్పి తరువాత బోధను ఇట్లు కొనసాగించెను—

77 అక్రోధః సత్యవచనం సంవిభాగః క్షమా తథా
ప్రజనః స్వేషు దారేషు శౌచమద్రోహ ఏవ చ

78 ఆర్జవం భృత్యభరణం నవైతే సార్వవర్ణికాః
బ్రాహ్మణస్య తు యో ధర్మస్తం తే వక్ష్యామి కేవలమ్

ఎవనిపైనను కోపగించకుండుట సత్యము పలుకుట ధనమును ఇతరులకు పంచిపెట్టి అనుభవించుట క్షమాభావము కలిగియుండుట, ఏకపత్నీవ్రతము బాహ్యాభ్యంతరములందు పవిత్రుడై యుండుట ఎవనికిని ద్రోహము చేయకుండుట సరళభావము కలిగియుండుట పోషించదగిన వ్యక్తులను పోషించుట — అను ఈ తొమ్మిది ధర్మములున్న అన్ని వర్ణముల వానికిని ఉపయోగకరములైనవి ఇక ఇపుడు కేవలము బ్రాహ్మణుని యొక్క ధర్మములను చెప్పెదను —

79 దమమేవ మహారాజ ధర్మమాహుః పురాతనమ్
స్వాధ్యాయాభ్యసనం చైవ తత్ర కర్మ సమాప్యతే

ఇంద్రియ నిగ్రహము బ్రాహ్మణుల ప్రాచీన ధర్మమని చెప్ప ఒడినది ఇదికాక వారు సదా వేదశాస్త్రముల స్వాధ్యాయము గావించవలెను ఏలయనగా దీనిచేతనే వారి సమస్త కర్మల యొక్క పూర్తి సంభవించుచున్నది

80 క్షత్రియస్యాపి యో ధర్మస్తం తే వక్ష్యామి భారత
దద్యాద్ రాజన్ న యాచేత యజేత న చ యాజయేత్

రాజా! ఇక క్షత్రియ ధర్మమును చెప్పుచున్నాను వినుము క్షత్రియుడు దానము చేయవలెను ఎవనిని యాచింపరాదు స్వయముగ యజ్ఞములను చేయువలెను అంతియే కాని పురోహితుడై ఇతరుల యజ్ఞములను చేయించరాదు

81 వైశ్యస్యాపి హి యో ధర్మస్తం తే వక్ష్యామి శాశ్వతమ్
దానమధ్యయనం యజ్ఞః శౌచేన ధనసంచయః

ఇక వైశ్యుని యొక్క సనాతన ధర్మము చెప్పుచున్నాను వినుము — దానము అధ్యయనము యజ్ఞము పవిత్ర మార్గమున ధనమును సంపాదించుట — ఇవి వైశ్యుని ధర్మములు

82 ప్రజాపతిర్హి వర్ణానాం దాసం శూద్రమకల్పయత్
తస్మాచ్ఛూద్రస్య వర్ణానాం పరిచర్యా విధీయతే

ప్రజాపతి సేవకరూపమున శూద్రుని సృష్టించెను కాబట్టి సేవ చేయుట శూద్రుని యొక్క శాస్త్ర విహిత కర్మమై యున్నది

83 చరితబ్రహ్మచర్యస్య బ్రాహ్మణస్య విశాంపతే
భైక్షచర్యాస్వధీకారః ప్రశస్త ఇహ మోక్షిణః

బ్రహ్మచర్యమును పాలించినట్టి బ్రహ్మచారి మనస్సునందు మోక్షమును గోర్చిన అభిలాష తీవ్రముగ కలిగినచో అతనికి బ్రహ్మచర్యాశ్రమము నుండియే సంన్యాసమును గ్రహించు ఉత్తమ అధికారము లభించును

84 యత్రాస్తమితశాయీ స్యాన్నిరాశీరనికేతనః
యథోపలబ్ధజీవీ స్యాన్మునిర్దాన్తో జితేన్ద్రియః

సంన్యాసియగువాడు తన మనస్సును ఇంద్రియములను నిగ్రహించుచు మునివృత్తి కలిగియుండవలెను ఏ వస్తువును కోరరాదు అతడు అనికేతుడై సంచరించుచు సూర్యాస్తమైన చోట ఆగుచు ప్రారబ్ధ వశమున లభించిన దానితో జీవన నిర్వహణము గావింపవలెను

85 దాన్తో విధేయో హవ్యకవ్యేఽప్రమత్తో
హ్యన్నస్య దాతా సతతం ద్విజేభ్యః
అమత్సరీ సర్వలిఙ్గప్రదాతా
వైతానసత్యశ్చ గృహాశ్రమీ స్యాత్

గృహస్థుడు ఇంద్రియ నిగ్రహము కలవాడై గురుజనుల యొక్క శాస్త్రముల యొక్క ఆజ్ఞను పాలించవలెను దేవతల యొక్క పితరుల యొక్క తృప్తికొఱకై హవ్యాదులను సమర్పించవలెను బ్రహ్మనిష్ఠులకు సదా అన్నదానము చేయవలెను ఈర్ష్య

ద్వేషము లేకుండవలెను ఇతర ఆశ్రమముల వారికి భోజనము పెట్టుచు వారి వలన పోషణ చేయవలెను సదా యజ్ఞయాగాదులను గావించు చుండవలెను

86 బ్రహ్మచారీ వ్రతీ నిత్యం నిత్యం దీక్షాపరో వశీ
పరిచార్య తథా వేదం కృత్యం కుర్వన్ వసేత్ సదా

బ్రహ్మచారి నిరంతరము మనస్సును ఇంద్రియములను వశమందుంచుకొనుచు వ్రతమును దీక్షను పాలించవలెను వేదముల యొక్క స్వాధ్యాయమును గావించుచు సదా కర్తవ్య కర్మలను పాలించుచు నుండవలెను

87 అహింసా సత్యవచనమానృశంస్యం దమో ఘృణా
ఏతత్ తపో విదుర్ధీరా న శరీరస్య శోషణమ్

ఏ ప్రాణిని హింసింపకుండుట సత్యము పలుకుట క్రూరత్వము వదలుట మనస్సును ఇంద్రియములను నిగ్రహించుట సర్వుల యెడల దయ కలిగియుండుట అను వీనిని గురువులు తపస్సని పలచిరి కేవలము శరీరమును ఎండగొట్టుట తపస్సు కాదు

88 అప్రామాణ్యం చ వేదానాం శాస్త్రాణాం చాభిలఙ్ఘనమ్
అవ్యవస్థా చ సర్వత్ర తద్ వై నాశనమాత్మనః

వేదమును అప్రామాణికముగ చెప్పుట శాస్త్రముల ఆజ్ఞను ఉల్లంఘించుట అంతట అవ్యవస్థను కలుగజేయుట – అను ఈ దుర్గుణములన్నియు మనుజునకు తన యొక్క వినాశమునే కలుగజేయును

89 సర్వం జిహ్మం మృత్యుపదమార్జవం బ్రహ్మణః పదమ్
ఏతావాఞ్జ్ఞానవిషయః కిం ప్రలాపః కరిష్యతి

కుటిలత్వమంతయు మృత్యువు యొక్క స్థానము సరళత్వము పరబ్రహ్మ ప్రాప్తియొక్క స్థానము ఇంతియే జ్ఞానము తక్కిన

దంతయు ప్రలాపమాత్రమే యగును అది (ప్రలాపము) దే ఉపయోగించును ?

ఎదప భీష్మాచార్యుడ ఉతథ్యఋషి మాంధాత చక్రవ బోధించిన విషయములను ఈ ప్రకారముగ చెప్పెను —

ఉతథ్య ఉవాచ

90 వృషో హి భగవాన్ ధర్మో యస్తస్య కురుతేహ్యలమ్
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం వివర్ధయేత్

(ఉతథ్యఋషి మాంధాత చక్రవర్తితో ఇటు చెప్పెను —)

వృష అనగా భగవంతుడు ధర్మము ఎవడు ధర్మవిష మున అలమ్ (చాలును) అని చెప్పునో అతనిని దేవత వృషలుడు అని తలంచెదరు ధర్మమును అభివృద్ధి చేయువా రాజు కావున ధర్మమును సదా వృద్ధిపఱచవలెను

91 ధర్మే వర్ధతి వర్ధన్తి సర్వభూతాని సర్వదా
తస్మిన్ హ్రాసతి హ్రీయన్తే అస్మాద్ ధర్మం న లోపయేత్

ధర్మమగ వృద్ధి కాగా సమస్త ప్రాణికోట్ల యొక్క అ దయము సంభవించును ధర్మము క్షీణించినచో సమసము క్షీ చును కాబట్టి ధర్మము లోపించకుండ చూడవలెను

92 ధనాత్ స్రవతి ధర్మో హి ధారణాద్ వేతి నిశ్చయ
అకార్యాణాం మనుష్యేన్ద్ర స సమాన్తకరః స్మృతః

ధనముచే ధర్మము యొక్క ఉత్పత్తి యగుచున్నది సమ మును ధారణ యొనర్చుటచే అది ధర్మమని చెప్పబడినది ఆ ధర్మ అకర్తవ్యమును (పాపమును) నశింపజేయునదిగా తలంచబడినది

అనంతరము భీష్ముడు పూర్వము వామదేవుడు వసుమ రాజునకు బోధించిన ధర్మములను ధర్మరాజాదులకు ఇట్లు వివరిం చెప్పెను —

వాసుదేవ ఉవాచ

93 ధర్మమేవానువర్తస్వ న ధర్మాద్ విద్యతే పరమ్
ధర్మేస్థితా హి రాజానో జయన్తి పృథివీమిమామ్

(వాసుదేవుడు వసుమనారాజుతో ఇట్లు చెప్పెను —)

ధర్మమును అనుసరింపుము ధర్మమును మించినది మఱియొక వస్తువేదియు లేదు ధర్మమందు నెలుకడ కలిగియున్న రాజు ఈ భూమినంతను జయించచున్నాడు

94 మృషావాదం పరిహరేత్ కుర్యాత్ ప్రియమయాచితః
న కామాన్న చ సంరమ్భాన్న ద్వేషాద్ ధర్మముత్సృజేత్

మిథ్యాభాషణమును వదలివేయవలెను అడుగకుండగనే ఇతరులకు ప్రియ మొనర్పవలెను కామముచే గాని క్రోధముచే గాని ద్వేషముచే గాని ధర్మమును త్యజింపరాదు

95 నాధర్మశ్చరితో రాజన్ సద్యః ఫలతి గౌరివ
మూలాని చ ప్రశాఖాశ్చ దహన్ సమధిగచ్ఛతి

భూమియందు నాటబడిన విత్తనము యొక్క ఫలము వెంటనే లభించనట్లు చేయబడిన పాపము యొక్క ఫలము వెంటనే లభించదు లభించునపుడు మూలమును శాఖలను గూడ కాల్చి భస్మ మొనర్చివేయును

96 మహాద్యృతిరివాధ్మాతః సుకృతే నైవ వర్తతే
అతః సమూలో హ్రీయతే నదీం కూలాదివ ద్రుమః

తోలు సంచి గాలితో నింపబడినపుడు ఉబ్బిపోవునట్లు పాపముచే ఉబ్బిపోవును అతడు పుణ్యకార్యమందు ప్రవృత్తుడే కాడు తదుపరి నది ఒడ్డున ఉన్న చెట్టు ప్రవాహ వేగముచే మూలసహితముగ క్రింద పడిపోయి నీటిలో కొట్టుకొని పోవునట్లు ఆ పాపియు సమూలముగ నశించిపోవును

97 న హి శౌర్యాత్ పరం కించిత్ త్రిషు లోకేషు విద్యతే
శూరః సర్వం పాలయతి సర్వం శూరే ప్రతిష్ఠితమ్

శౌర్యమునకు మించిన వస్తువు మఱేదియు ముల్లోకములందును లేదు శూరుడు అందఱిని పాలించును మఱియు జగత్తంతయు అతని యొక్క ఆధారముపైననే నిలచియున్నది

ఎన్నొట కాలకవృక్షీయముని కోసలరాజు యొక్క కుమారుడగు క్షేమదర్శికి బోధించిన ధర్మములను భీష్ముడు ఈ ప్రకారముగ సెలవిచ్చెను —

98 నిర్విద్యతి నరః కామాన్నిర్విద్య సుఖమేధతే
త్యక్త్వా ప్రతించ శోకం చ లబ్ధ్వా బుద్ధిమయం వసు

(కాలకవృక్షీయ ముని కోసలరాజ కుమారునితో ఇట్లు చెప్పెను —)
మనుజన కెప్పుడ విషయభోగముల యెడ వైరాగ్యము కలుగునో అప్పుడు విరక్తుడైనపుడు అతడు హర్షశోకములను త్యజించి వైచి జ్ఞాన ధనమును పొంది నిత్యసుఖమును అనుభవించచొడగుచున్నాడు

99 యద్ధి భూతం భవిష్యం చ సర్వం తన్న భవిష్యతి
ఏవం విదిత్వా వేద్యత్వమధర్మేభ్యః ప్రమోక్ష్యసే

ఏ వస్తువును ఇది కలదు అని నమ్ముచున్నారో ఆ వస్తువును ఇది లేదు అని భావించుము ఇట్లు తలంచు బుద్ధిమంతుడు మహాకఠినమైన విపత్తునందు పడినప్పటికి దుఃఖితుడు కాకుండును

100 యచ్చ పూర్వం సమాహారే యచ్చ పూర్వం పరే పరే
సర్వం తన్నాస్తి తే చైవ తజ్జ్ఞాత్వా కోఽనుసంజ్వరేత్

ఏ వస్తువు పూర్వము గొప్ప గొప్ప వారి అధీనమందుండెనో ఏది ఒకరి తరువాత మఱియొకరిది అయియుండెనో, అది **అంతయు**

మీది కూడ కాదు — అని యిట్లు లెస్సగ తెలిసికొనినచో ఇక ఎవరికి మరల మరల దుఃఖము కలుగును ?

101 క్వ ను తేఽద్య పితా రాజన్ క్వ ను తేఽద్య పితామహః
న త్వం పశ్యసి తానద్య న త్వాం పశ్యన్తి తేఽపి చ

రాజా ! మీ తండ్రి ఇపు డెచటనున్నాడు ? మీ తాత ఇపు డెచట నున్నాడు ? చెప్పుము ఇపుడు మీరు వారిని చూచుటలేదు వారు మిమ్ములను చూచుట లేదు

102 ఆత్మనోఽధ్రువతాం పశ్యంస్తాంస్త్వం కిమను శోచసి
బుద్ధ్యా చైవానుబుధ్యస్వ ధ్రువం హి న భవిష్యసి

ఈ శరీరము అనిత్యము ఈ విషయమును మీరు చూచుచు తెలిసికొనుచున్నారు ఇక మీ పూర్వుల కొఱకై నిరంతరము ఏల శోకించుచున్నారు ? ఒకింత బుద్ధి ఉపయోగించి ఆలోచింపుడు నిక్కముగ మీరున్ను ఎల్లపుడు ఇచట ఉండజాలరు

103 అహం చ త్వం చ నృపతే సుహృదః శత్రవశ్చ తే
అవశ్యం న భవిష్యామః సర్వం చ న భవిష్యతి

నేను మీరు మీ మిత్రులు శత్రువులు — అందఱు ఇచట ఎల్లపుడు ఉండరు ఇది (ఈ దృశ్యము) యంతయు కొంత కాలమునకు నశించిపోవును

104 అపి చేన్మహతో విత్తాన్ ప్రముచ్యేత పూరుషః
నైతన్మమేతి తన్మత్వా కుర్వీత ప్రియమాత్మనః

ఇట్టి స్థితియందు మనుజునకు గొప్ప సంపద ఉన్నప్పటికిని, ఇది నాది కాదు అని తలంచి తన శ్రేయమును అవశ్యము కలుగజేసి కొనవలెను

105 స్త్రియం చ పుత్రపౌత్రం చ మనుష్యా ధర్మచారిణః
యోగధర్మవిదో ధీరాః స్వయమేవ త్యజన్త్యుత

మోక్షధర్మము లెఱిగిన ధర్మాత్ములగు గీటులు తమ సంపదను పుత్ర పౌత్రాదులను వాడ స్వయముగనే త్యజించి వైచుచున్నారు

106 తాం బుద్ధిముపజిజ్ఞాసుస్త్వమేవైతాః పరిత్యజ
అనర్థాశ్చార్థరూపేణ హ్యర్థాశ్చానర్థరూపిణః

మీరు అట్టి పరమార్థబుద్ధిని తెలిసికొనుటకు ప్రయత్నించునపుడు మఱియు ఈ భోగములను త్యజించివేయుడు ఈ భోగములు అర్థ రూపమున కనుపించు అనర్థములు ఏలయనిన వాస్తవముగ భోగము లన్నియు అనర్థ స్వరూపములే అయియున్నవి

107 ధర్మమేకేఽభిపద్యన్తే కల్యాణాభిజనా నరాః
పరత్ర సుఖమిచ్ఛన్తో నిర్విద్యేయుశ్చ లౌకికాత్

ఉత్తమ కులమున జన్మించిన కొందఱు ధర్మమును శరణు బొందుచు పరలోక సుఖమపేక్షించి సమస్త లౌకిక వ్యవహారము లను విరమించుకొనుచున్నారు

108 సంచయే చ వినాశాన్తె మరణాన్తె చ జీవితే
సంయోగే చ వియోగాన్తె కో ను విప్రణయేన్మనః

సంచయము యొక్క అంతము వినాశమే, జీవితము యొక్క అంతము మృత్యువే సంయోగము యొక్క అంతము వియోగమే ఇట్లుండ ఇక ఎవడు వీని వైపు మనస్సును లగ్నమొనర్చును ?

109 ధనం వా పురుషో రాజన్ పురుషం వా పునర్ధనమ్
అవశ్యం ప్రజహాత్యేవ తద్ విద్వాన్ కోఽనుసంజ్వరేత్

మనుజుడు ధనమును విడిచినను విడువకున్నను ధనమే మనుజుని విడిచిపెట్టుట యనునది ఒకానొక దినమున తప్పక సంభవించును ఈ విషయమును తెలిసినవాడిక ధనమునకై ఏల చింతించును ?

110 నియచ్ఛ యచ్ఛ సంయచ్ఛ ఇన్ద్రియాణి మనో గిరమ్
ప్రతిషేద్ధా న చాప్యేషు దుర్బలేష్వహితేష్వపి

ఇంద్రియములను నియమించుము మనస్సును వశమందుంచుకొనుము వాక్కును నిగ్రహించి స్వాధీనముగ నుంచుకొనుము ఇంద్రియములు దుర్బలములు అహితకారకములు అంత సమాధానపరచి విషయముల వైపునకు పోనీయక అరికట్టువాడు తాను తప్ప మరియొకరెవరును కాండు

తదుపరి భీష్మాచార్యుడు ధర్మరాజునకు ఈ ప్రకారముగ బోధించెను —

భీష్మ ఉవాచ

111 మాతాపిత్రోర్గురూణాం చ పూజా బహుమతా మమ
ఇహ యుక్తో నరో లోకాన్ యశశ్చ మహదశ్నుతే

(భీష్ముడు ధర్మరాజునకిట్లు చెప్పను —)

తల్లి తండ్రి గురుజనులు వీరి పూజయే (వీరిని పూజించుటయే) గొప్ప మహత్వముతో కూడిన వస్తువుగ నాకు తోచుచున్నది ఈ లోకమున ఈ పుణ్యకార్యమందు నిమగ్నుడైన మనుజుడు గొప్ప కీర్తిని శ్రేష్ఠమగు లోకమును పొందును

112 పితా వై గార్హపత్యోఽగ్నిర్మాతాగ్నిర్దక్షిణః స్మృతః
గురురాహవనీయస్తు సాగ్నిత్రేతా గరీయసీ

తండ్రి గార్హపత్యాగ్ని స్వరూపుడు తల్లి దక్షిణాగ్ని స్వరూపురాలు గురువు ఆహవనీయాగ్ని స్వరూపుడు లౌకికాగ్నుల కంటె మాతాపితరులు గురువు అను త్రివిధాగ్నుల యొక్క గౌరవము అధికమైనది

113 సర్వే తస్యాదృతా లోకా యస్యైతే త్రయ ఆదృతాః
అనాదృతాస్తు యస్యైతే సర్వాస్తస్యాఫలాః క్రియాః

ఈ ముగ్గురిని ఆదరించువాడు సమస్త లోకములను ఆదరించినట్లే వారిని అనాదరించు వానియొక్క కర్మలు నిష్ఫలములై పోవును

114 తేభ్య ఎవ వా యత్ సర్వం కృత్వా చ విసృజామ్యహమ్
తదాసన్మే శతగుణం సహస్రగుణమేవ చ
తస్మాన్మే సంప్రకాశన్తే త్రయో లోకా యుధిష్ఠిర

నేను చేయు శుభకర్మనంతను ఈ ముగ్గురికే సమర్పించి వేయుదును దీనివలన ఆ శుభకర్మలన్నిటి యొక్క పుణ్యము నూఱురెట్లు వెయ్యిరెట్లు పెరిగిపోయినది దీనిచే ముల్లోకములు నా దృష్టి ముందు ప్రకాశితములగుచున్నవి

115 దశైవ తు సదాఽఽచార్యః శ్రోత్రియానతిరిచ్యతే
దశాచార్యానుపాధ్యాయ ఉపాధ్యాయాన్ పితా దశ

116 పితౄన్ దశ తు మాతైకా సర్వాం వా పృథివీమపి
గురుత్వేనాభిభవతి నాస్తి మాతృసమో గురుః

ఆచార్యుడు పది మంది శ్రోత్రియుల కంటె గొప్పవాడు ఉపాధ్యాయుడు (విద్యా గురువు) పది మంది ఆచార్యుల కంటె అధికమైన మహత్త్వము గలిగియున్నాడు తండ్రి పది మంది ఉపాధ్యాయుల కంటె అధికుడు తల్లియొక్క మహత్త్వము పది మంది తండ్రుల కంటెను గొప్పది ఆమె ఒక్కతెయే తన గౌరవము ద్వారా సమస్త భూమండలమును తిరస్కృత మొనర్చి వేయగలదు కావున తల్లితో సమానమైన గురువు మఱియొక డెవడును లేడు

117 గురురరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః
ఉభౌ వా మాతాపితరౌ జన్మన్యేవోపయుజ్యతః

కాని గురువు యొక్క స్థానము తల్లిదండ్రుల స్థానము కంటె గొప్పది ఎలయనన తల్లిదండ్రులు ఆ శరీరమునకు జన్మ యొసంగుటకె ఉపయోగపడ చున్నారు

118 శరీరమేవ సృజతః పితా మాతా చ భారత
ఆచార్య శ్టా యా జాతిః సా దివ్యా సాజరామరా

తల్లిదండ్రలు కేవలము శరీరమునకె జన్మ కొసంగ చున్నారు కాని గురువు యొక్క ఉపదేశమును పొందుటచే ఏ రెండవ జన్మ లభించుచున్నదో అది దివ్యమైనది అజరమైనది అమరమైనది

119 యశ్చావృణోత్యవితథేన కర్మణా
ఋతం బ్రువన్ననృతం సంప్రయచ్ఛన్
తం వై మన్యేత పితరం మాతరం చ
తస్మై న ద్రుహ్యేత్ కృతమస్య జానన్

సత్యకర్మ ద్వారా శిష్యుని కవచమువలె కప్పువాడును, సత్యస్వరూపమైన వేదమును ఉపదేశించువాడును అసత్యమును నిరోధించువాడును అగు గురువునే తల్లిగా తండ్రిగా తలంచుము మఱియు అతని ఉపకారము నెఱిగి ఎన్నడును అతనికి ద్రోహము చేయరాదు

120 మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య గురుఘాతినః
చతుర్ణాం వయమేతేషాం నిష్కృతిం నానుశుశ్రుమ

మిత్ర ద్రోహము కృతఘ్నత స్త్రీహత్య గురుహత్య—అను ఈ నాలుగు పాపములకు ప్రాయశ్చిత్తమును మేము విన లేదు (లేదని భావము)

121 ప్రభవార్థాయ భూతానాం ధర్మప్రవచనం కృతమ్
యః స్యాత్ ప్రభవసంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః

ప్రాణుల యొక్క అభ్యుదయ శ్రేయస్సుల కొఱకే ధర్మము యొక్క ప్రవచనము కావింపఁబడినది కాబట్టి దేనిచే అభ్యుదయము శ్రేయస్సు కలుగునో అదియె ధర్మమని శాస్త్రవేత్తల యొక్క నిశ్చయము

122 అహింసా సత్యమక్రోధస్తపో దానం దమో మతిః
అనసూయాప్యమాత్సర్యమనీర్ష్యా శీలమేవ చ
ఏష ధర్మః కురుశ్రేష్ఠ కథితః పరమేష్ఠినా
బ్రహ్మణా దేవదేవేన అయం చైవ సనాతనః
అస్మిన్ ధర్మే స్థితో రాజన్ నరో భద్రాణి పశ్యతి

అహింస సత్యము అక్రోధము తపస్సు దానము ఇంద్రియ మనస్సంయమన విశుద్ధబుద్ధి ఇతరుల దోషమును చూడకుండుట ఎవరితోను కలహింపకుండుట ఉత్తమ శీలస్వభావము యొక్క పరిచయ మొసంగుట — అనునివి ధర్మములు ఎవడీ సనాతన ధర్మమందు స్థితుడై యుండునో, అట్టివానికె శ్రేయము కలుగును

123 స్వకర్మణా హతం హన్తి హత ఏవ స హన్యతే

పాపియగువాడు తన కర్మచేతనే చనిపోయియున్నాడు కాబట్టి అతనిని చంపుతాడు చచ్చినవానినే చంపుచున్న వాడగును

యథా కాకాశ్చ గృధ్రాశ్చ తథైవోపధిజీవినః
ఊర్ధ్వం దేహవిమోక్షాత్తే భవన్త్యేతాసు యోనిషు

కపటముతో జీవితము కొనసాగించువారు కాకులవలె గద్దలవలె నుందురు వారు మరణించిన వెనుక అట్టి నీచజన్మలందే జన్మింతురు

అపుడు ధర్మరాజ భీష్ముని ఇట్లు ప్రశ్నించెను —

యుధిష్ఠిర ఉవాచ

124 క్లిశ్యమానేషు భూతేషు తైస్తైర్భావైస్తతస్తతః
దుర్గాణ్యతితరేద్ యేన తన్మే బ్రూహి పితామహ

(ధర్మరాజు భీష్ముని ఇట్లడిగెను —)

ఓ తాతా! ప్రపంచములో జనులు భిన్నభిన్న భావముల ద్వారా నానావిధములగు కష్టములను అనుభవించుచున్నారు. ఏ ఉపాయముచే మనుజుడు ఈ దుఃఖములను తప్పించుకొనగలడో దయ చేసి చెప్పుడు.

అంతట భీష్ముడు ధర్మరాజున కిట్లు బోధింపదొడగెను —

భీష్మ ఉవాచ

125 ఆశ్రమేషు యథోక్తేషు యథోక్తం యే ద్విజాతయః
వర్తన్తే సంయతాత్మానో దుర్గాణ్యతితరన్తి తే

(భీష్ముడు ధర్మరాజున కిట్లు చెప్పెను —)

ఎవరు తమ మనస్సును అదుపులో నుంచుకొని శాస్త్రోక్తము లగు నాలుగు ఆశ్రమములందును వసించుచు శాస్త్రోక్తముగ నడవడిక గలిగి వ్యవహరించుదురో వారు దుఃఖములను దాటి వేయుచున్నారు.

126 యే దమ్భాన్నాచరన్తి స్మ యేషాం వృత్తిశ్చ సంయతా
విషయాంశ్చ నిగృహ్ణన్తి దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు దంభయుక్తమగు ఆచరణ కలిగియుండరో, నియమాను కూలమగు జీవిక కలవారై యుందురో విషయముల కొఱకై వృద్ధి నొందుచున్న ఇచ్ఛను అరికట్టుచున్నారో అట్టివారు దుఃఖములను దాటివేయుచున్నారు.

127 ప్రత్యాహుర్నోచ్యమానా యే న హింసన్తి చ హింసితాః
ప్రయచ్ఛన్తి న యాచన్తే దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు ఇతరులు తిట్టినను, నిందించినను, ప్రత్యుత్తరము నివ్వక యుందురో, దెబ్బలు తిన్నను ఇతరులను కొట్టరో ఇతరులకు ఇచ్చు దురే కాని ఇతరులను అడుగరో అట్టివారు దుఃఖములను దాటి వేయుదురు.

128 వాసయన్త్యతిథీన్ నిత్యం నిత్యం యే చానసూయకాః
నిత్యం స్వాధ్యాయశీలాశ్చ దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు అతిథులను ప్రతిదినము తన ఇంటి యందు సత్కార పూర్వకముగ ఆదరించుదురో ఎన్నడును ఎవని యొక్క దోషములను చూడకుందురో నిత్యము నియమపూర్వకముగ వేదాది సద్గ్రంథములను అధ్యయనము చేయుదురో వారు దుర్గమములగు సంకటములను దాటివేయుచున్నారు

129 మాతాపిత్రోశ్చ యే వృత్తిం వర్తన్తే ధర్మకోవిదాః
వర్జయన్తి దివా స్వప్నం దుర్గాణ్యతితరన్తి తే

ఏ ధర్మజ్ఞులగువారు తల్లిదండ్రుల యొక్క సేవయందు నిమగ్నులై యుందురో పగటి యందెన్నడును నిదురింపరో వారు దుఃఖములన్నిటిని దాటి వేయుచున్నారు

130 యే వా పాపం న కుర్వన్తి కర్మణా మనసా గిరా
నిక్షిప్తదణ్డా భూతేషు దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు మనస్సు వాక్కు క్రియల ద్వారా పాపమెన్నడును చేయకనుందురో ఏ ప్రాణికీ కష్టమును కలుగజేయరో, అట్టివారు దుఃఖముల నుండి విముక్తులగుచున్నారు

131 యే వదన్తీహ సత్యాని ప్రాణత్యాగేఽప్యుపస్థితే
ప్రమాణభూతా భూతానాం దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు ప్రాణము పోవు సమయమందైనను సత్యమును పలుకుటను విడనాడరో వారు సమస్త ప్రాణులకు విశ్వాస పాత్రులై దుఃఖములన్నిటిని దాటి వేయుచున్నారు

132 కర్మాణ్యకుహకార్థాని యేషాం వాచశ్చ సూనృతాః
యేషామర్థాశ్చ సమ్బద్ధా దుర్గాణ్యతితరన్తి తే

ఎవరియొక్క శుభకర్మలు ప్రకటన నిమిత్తము కానేరవో ఎవరు సదా తియ్యటి వాక్యములనే పలుకుదురో ఎవరి యొక్క ధనము సత్కర్మల నిమిత్తమే వినియోగింపబడునో అట్టివారు దుఃఖములను దాటి వేయుచున్నారు

133 యే తపశ్చ తపస్యన్తి కౌమారబ్రహ్మచారిణః
విద్యావేదవ్రతస్నాతా దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు తపస్సు చేయుదురో కుమారావస్థ నుండియే బ్రహ్మచర్య పాలనమందు తత్పరులై యుందురో విద్యాధ్యయన వేదాధ్యయన సంబంధమగు వ్రతము పూర్ణమైన విదపయే స్నాతకులగుదురో, వారు దుస్తరములగు దుఃఖములను దాటి వేయుచున్నారు

134 యే చ సంశాన్తరజసః సంశాన్తతమసశ్చ యే
సత్త్వే స్థితా మహాత్మానో దుర్గాణ్యతితరన్తి తే

రజోగుణ తమోగుణములు శమించినవారును విశుద్ధ సత్త్వ గుణమందు స్థితి నొందియున్న వారును అగు మహాత్ములు దుర్గమ సంకటములను దాటి వేయుచున్నారు

135 యేషాం న కశ్చిత్ త్రసతి న త్రసన్తి హి కస్యచిత్
యేషామాత్మసమో లోకో దుర్గాణ్యతితరన్తి తే

ఎవరిని చూచి జనులు భయపడరో ఎవరు స్వయముగ ఎవనిని చూచియు భయపడరో ఎవరి దృష్టి యందీ జగత్తంతయు తమ ఆత్మతో తుల్యమైనదిగ నుండునో అట్టివారు దుఃఖములను దాటి వేయుచున్నారు

136 పరశ్రియా న తప్యన్తి యే సన్తః పురుషర్షభాః
గ్రామ్యాదర్థాన్నివృత్తాశ్చ దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు ఇతరుల సంపత్తి చూచి ఈర్ష్యవలన మండిపడరో అల్పములగు విషయభోగముల నుండి నివృత్తులగుదురో మనుష్య

లలో శ్రేష్ఠులగు అట్టి సాధుమహాత్ములు దుస్తరములగు విపత్తులను దాటి వేయుచున్నారు

137 సర్వాన్ దేవాన్ నమస్యన్తి సర్వధర్మాంశ్చ శృణ్వతే
యే శ్రద్దధానాః శాన్తాశ్చ దురాణ్యతితరన్తితే

దేవతలందఱికిని ప్రణమిల్లువారును ధర్మములన్నిటిని విని ఆచరించువారును శ్రద్ధ శాంతి కలవారును సమస్త దుఃఖముల నుండి విడివడుచున్నారు

138 యే న మానిత్వ మిచ్ఛన్తి మానయన్తి చ యే పరాన్
మాన్య మానాన్ నమస్యన్తి దుర్గాణ్యతితరన్తి తే

ఇతరుల నుండి సన్మానమును కోరనివారును, స్వయముగ ఇతరులకు సమ్మానము నొసంగువారును సమ్మాననీయులగు మహనీయులకు నమస్కరించువారును దుర్లంఘ్యమగు సంకటములను దాటివేయుచున్నారు

139 యే క్రోధం సంనియచ్ఛన్తి క్రుద్ధాన్ సంశమయన్తి చ
న చ కుప్యన్తి భూతానాం దురాణ్యతితరన్తి తే

కోపమును నిగ్రహించువారును కోపము కలవారిని శాంతింపజేయువారును ఏ ప్రాణి యెడలను కోపము లేనివారును, దుఃఖములన్నిటిని దాటివేయుచున్నారు

140 మధు మాంసం చ యే నిత్యం వర్జయన్తీహ మానవాః
జన్మప్రభృతి మద్యం చ దురాణ్యతితరన్తి తే

పుట్టుక నుండియే మధువును మాంసమును మద్యమును కూడా విర్జించి వేయువారు దుఃఖములన్నిటిని దాటివేయుచున్నారు

141 యాత్రార్థం భోజనం యేషాం సంతానార్థం చ మైథునమ్
వాక్ సత్యవచనార్థాయ దుర్గాణ్యతితరన్తి తే

ఎవరి భోజనము రుచి కొఱకు కాక శరీర నిర్వాహణము కొఱకు మాత్రమే యగునో, ఎవరు విషయ వాసనా తృప్తి కొఱకు కాక సంతానోత్పత్తి కొఱకు మాత్రమే మైథునమందు ప్రవృత్తులగుదురో ఎవరు సదా సత్యమునే పలుకుదురో అట్టివారు దుఃఖములన్నిటిని దాటి వేయుచున్నారు

142 ఈశ్వరం సర్వభూతానాం జగతః ప్రభవాప్యయమ్
భక్తా నారాయణం దేవం దుర్గాణ్యతితరన్తి తే

సమస్త ప్రాణికోటకు ప్రభువును జగత్తు యొక్క సృష్టి ప్రళయములకు హేతుభూతుడును అగు భగవంతుడైన నారాయణుని యందు భక్తి భావము కలవారు దుస్తర దుఃఖముల నుండి విడవడు చున్నారు

143 అస్మిన్నర్పితకర్మాణః సర్వభావేన భారత
కృష్ణే కమలపత్రాక్షే దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు కమల నేత్రుడగు ఈ శ్రీకృష్ణునకు సంపూర్ణమగు భక్తిభావముతో తమ సమస్త కర్మలను అర్పించుదురో అట్టివారు దుర్గమ సంకటములను దాటి వేయగలరు

144 త్వమప్యేవం విధం జ్ఞాత్వా యోగేన నియతేన్ద్రియః
వర్తస్వ బుదిమూలం తు విజయం మనురబ్రవీత్

మీరు అలసత్వము (సోమరితనమును) వదలివేసి ఇంద్రియము లను వశమందుంచుకొనుచు బుద్ధిపూర్వకముగ వ్యవహరించుట మంచిది విజయమునకు మూలము బుద్ధియే (వివేకమే) అని మనువు చెప్పెను

145 అరుష్యన్ క్రుశ్యమానస్య సుకృతం నామ విన్దతి
దుష్కృతం చాత్మనో మర్షీ రుష్యత్యేవాపమార్ష్టి వై

నిందించువానిని కోపగించనిచో అతడు నిందించువాని పుణ్యమును పొందును ఈ సహనశీలుని పాపమును ఆ నిందించువాడు పొందుచున్నాడు

146 టిట్టిభం తముపేక్షేత వాశమానమివాతురమ్
లోకవిద్వేషమాసన్న నిష్ఫలం ప్రతిపద్యతే

ఉత్తముడు రోగివంట ఆ నిందించు వ్యక్తిని ఉపేక్షించవలెను దీనిచే ఆ నిందించువాడు సర్వుల ద్వేషమునకు పాత్రుడగును, మఱియు అతని సత్కార్మ నిష్ఫలమై పోవును

147 ప్రాకృతో వా ప్రశంసయా వా నిన్దయా వా కిం కరిష్యతి
వనే కాక ఇవాబుధిర్వాశమానో నిరర్థకమ్

అరణ్యమున కాకి వ్యర్థముగ కా కా అని అరచునట్లు మూర్ఖుడు అకారణముగనే నిందించుచున్నాడు అతడు నిందించినను ప్రశంసించినను ఎవనికి చెడ్డగాని మంచి గాని చేయగలడు?

148 ఏవమేతన్మనుష్యేన్ద్రి శూరైః ప్రాజ్ఞైర్బహుశ్రుతైః
కులీనైః సహా శక్యేత కృత్స్నా జేతుం వసున్ధరా

నరేంద్రా! శూరవిరులు విద్వాంసులు బహుశ్రుతులు కులీనులు మున్నగువారితో డ నుండి మనుజుడు భూమి యంతటిపై విజయమును సాధించవచ్చును

149 ధృతిర్దాక్ష్యం సంయమో బుద్ధిరాత్మా
ధైర్యం శౌర్యం దేశకాలాప్రమాదః
అల్పస్య వా బహునో వా వివృద్ధౌ
ధనస్యైతాన్యష్ట సమిన్ధనాని

ధారణ శక్తి చాతుర్యము సంయమము బుద్ధి శరీరము ధైర్యము శౌర్యము దేశకాల పరిస్థితుల యెడల సావధానుడై యుండుట — అను ఈ ఎనిమిది గుణములును కొద్దిగ గాని, ఎక్కు

వగ గాని ధనమును వృద్ధి చేయుటకు ముఖ్య సాధనములు అనగా ధనమను అగ్నిని ప్రజ్వలింపజేయుటకు ఇంధనములై (కట్టెలై) యున్నవి

150 విద్యా తపో వా విపులం ధనం వా
సర్వం హ్యేతద్ వ్యవసాయేన శక్యమ్
బుద్ధాఽయత్తం తన్నివసేద్ దేహావత్సు
తస్మాద్ విద్యాద్ వ్యవసాయం ప్రభూతమ్

విద్య తపస్సు, అధికధనము — అనునివి యన్నియు ప్రయత్నముచే లభించుచున్నవి ఆ ప్రయత్నము జనుల బుద్ధికి అధీనమై యుండును కావున ప్రయత్నమునే సమస్త కార్యములు సిద్ధికై గొప్ప సాధనమని యెఱుగవలెను

ఓ ధర్మరాజా! ఇది వఱకు నీవు ఇంద్రప్రస్థమందు రాజసూయ యాగము చేయు సందర్భమున నీ సంపత్తిని చూచి ఓర్వలేక దుర్యోధనుడు తన తండ్రియగు ధృతరాష్ట్రునకు తన చింతను వ్యక్తము చేయగా అపుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజాదుల వైభవమునకు కారణము వారి శీలమే యని వచించి ఇట్లు పలికెను —

ధృతరాష్ట్ర ఉవాచ
151 శీలేన వా త్రయో లోకాః శక్యా జేతుం న సంశయః
న హి కించిదసాధ్యం వై లోకే శీలవతాం భవేత్

(ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను —)
శీలము ద్వారా మూడు లోకములపై జయమును పొందవచ్చును ఇవ్విషయమున సంశయము లేదు శీలవంతులకు ప్రపంచమున అసాధ్యమైనదేదియును లేదు

ఈ ప్రసంగమున ధృతరాష్ట్రుడు పూర్వము లక్ష్మీదేవి ప్రహ్లాదునితో ఇట్లు చెప్పెనని వచించెను —

శ్రీరువాచ

152 ధర్మః సత్యం తథా వృత్తం బలం చైవ తథాప్యహమ్
శీలమూలా మహాప్రాజ్ఞ సదా నాస్త్యత్ర సంశయః

(లక్ష్మీదేవి ప్రహ్లాదునితో ఇట్లు చెప్పెను —)

ధర్మము సత్యము సదాచారము బలము సంపద — అనునివి యన్నియు శీలము యొక్కయే ఆధారముపై యున్నవి శీలమే వీని యన్నిటి యొక్క మూలమై యున్నది ఈ విషయమున సంశయము లేదు

ఎమ్మట భీష్ముడు (ధర్మరాజాదులకు) తన బోధనిట్లు కొనసాగించెను — ధర్మరాజా! అనంతరము ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు ఇట్లు తెలిపెను —

ధృతరాష్ట్ర ఉవాచ

153 అద్రోహః సర్వభూతేషు కర్మణా మనసా గిరా
అనుగ్రహశ్చ దానం చ శీలమేతత్ ప్రశస్యతే

(ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను —)

మనోవాక్కర్మ ద్వారా ఏ ప్రాణికిని ద్రోహము చేయకుండుట అందఱిపై దయ కలిగియుండుట యథాశక్తి దానము చేయుట — ఇవియే శీలమని చెప్పబడుచున్నవి వానిని అందఱును ప్రశంసించుచున్నారు

154 యదన్యేషాం హితం న స్యాదాత్మనః కర్మ పౌరుషమ్
అపత్రపేత వా యేన న తత్ కుర్యాత్ కథంచన

తన యొక్క ఏ కార్యము ఇతరులకు హితకరమైనది కాదో దేనిని ఆచరించుటయందు సంకోచము కలుగునో అట్టి దానిని ఎన్నడును ఏ విధముగనైనను చేయరాదు

భీష్ముడు ధర్మరాజునకు ఆశౌత్యాగమును గూర్చి వచించుచు యమ గౌతమ సంవాదమును వివరించెను ఆ సంవాదమున యముడు గౌతముడను మునితో ఇట్లు చెప్పెను

యమ ఉవాచ

155 తపఃశౌచవతా నిత్యం సత్యధర్మరతేన చ
మాతాపిత్రోరహరహః పూజనం కార్యమఞ్జసా

(యముడు గౌతమునితో ఇట్లు చెప్పెను —)

మనుజుడు తపస్సు చేయవలెను బాహ్యాభ్యంతరములందు పవిత్రుడుగ నుండవలెను సదా సత్యభాషణ రూపమగు ధర్మమందు తత్పరుడై యుండవలెను ఇవియన్నియు ఆచరించుచు తల్లిదండ్రుల యొక్క సేవ పూజ చేయుచుండవలెను

పిదప భీష్మాచార్యులు ధర్మరాజునకిట్లు ప్రబోధించెను —

భీష్మ ఉవాచ

156 న వాచ్యః పరివాదోఽయం న శ్రోతవ్యః కథఞ్చన
కర్ణావపి పిధాతవ్యౌ ప్రస్థేయం వాన్యతో భవేత్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ఎవనిని నిందించరాదు ఆ నిందను వినరాదు కూడను ఎవరైన ఇతరుని నిందించుచుండిన చో అచట తన చెవులను మూసి కొనవలెను లేక ఆ చోటు విడిచియైన పోవలెను

157 అసతాం శీలమేతద్ వై పరివాదోఽథ పైశునమ్
గుణానామేవ వక్తారః సన్తః సత్సు నరాధిప

ఇతరులను నిందించుట లేక చాడీలు చెప్పుట — దుష్టుల యొక్క స్వభావమే అయియున్నది ఉత్తములు సజ్జనుల సమీపమున ఇతరుల గుణములనే చెప్పుచుందురు

158 నాయం లోకోఽస్తి న పర ఇతి వ్యవసితో జనః
నాలం గన్తుం హి విశ్వాసం నాస్తికే భయశఙ్కితే

ప్రపంచమున కొందఱు ఈ లోకము లేదు పరలోకము లేదు — అను నిశ్చయము కలిగియుందురు అట్టి నాస్తికులు భయప్రదులు వారిపై విశ్వాసము కలిగియుండరాదు

159 అనాగతవిధాతా చ ప్రత్యుత్పన్నమతిశ్చ యః
ద్వావేవ సుఖమేధేతే దీర్ఘసూత్రీ వినశ్యతి

సంకటము రాక పూర్వమే తన్ను రక్షించుకొను ఉపాయమును గావించుకొనువాడు అనాగత విధాత అనబడును ఎవనికి సరిగా సంకట సమయమున ఆత్మరక్షణోపాయము స్ఫురించునో అట్టివాడు ప్రత్యుత్పన్నమతి అనబడును ఎవడు ప్రతికార్యమందును ఆలస్యము చేయునో అట్టి దీర్ఘసూత్రి నశించిపోవును

160 పరీక్ష్యకారీ యుక్తశ్చ స సమ్యగుపపాదయేత్
దేశకాలావభిప్రేతౌ తాభ్యాం ఫలమవాప్నుయాత్

ముందు వెనుక బాగుగ ఆలోచించి పనిచేయువాడు ఎల్లప్పుడు సావధాన చిత్తుడై యుండువాడు అభీష్టములగు దేశకాలములను సరిగా ఉపయోగించుకొనుచు మఱియు వాని సహయోగముచే ఇచ్ఛానుసారము ఫలమును పొందును

161 న హి బుద్ధ్యాన్వితః ప్రాజ్ఞో నీతిశాస్త్ర విశారదః
నిమజ్జత్యాపదం ప్రాప్య మహతీం దారుణామపి

బుద్ధిమంతుడు విద్వాంసుడు నీతిశాస్త్ర నిపుణుడు అగువాడు భయంకర విపత్తునందు పడినప్పటికిని దాని యందు మునిగిపోడు దాని నుండి విడుదల పొందు ప్రయత్నము చేయును

162 అకాలే కృత్యమారబ్ధం కర్తుర్నార్థాయ కల్పతే
తదేవ కాల ఆరబ్ధం మహతేఽర్థాయ కల్పతే

అకాలమున ప్రారంభించిన పని ఎని చేయువానికి లాభదాయకముగ నుండదు అదియే సకాలమున ప్రారంభించినచో గొప్ప ప్రయోజనమును సిద్ధింపజేయును

అనంతరము భీష్ముడు శత్రువు యెడల సదా జాగరూకుడై యుండవలెనను విషయమును తెలుపుట కొఱకై బ్రహ్మదత్తుడను రాజునకు పూజనీ అను పక్షికి జరిగిన సంభాషణమును గూర్చి చెప్పెను పూజనీ పక్షి రాజునకు ఇట్లు తెలిపెను —

పూజన్యువాచ

163 తరసా యే న శక్యన్తే శస్త్రైః సునిశితైరపి
సామ్నా తేఽపి నిగృహ్యన్తే గజా ఇవ కరేణుభిః

(పూజనీ బ్రహ్మదత్తునితో ఇట్లు చెప్పెను —)

బలపూర్వకముగ తీక్ష్ణశస్త్రములు ప్రయోగించుటచే కూడ వశము కాని వారును ఆడ ఏనుగులచే మగ ఏనుగు వశమగు ట్లు— మధుర వచనములచే వశము కాగలరు

164 న విత్తేన న పారుష్యైర్న సాన్త్వేన న చ శ్రుతైః
కోపాగ్నిః శామ్యతే రాజంస్తోయాగ్నిరివ సాగరే

బడబాగ్ని సముద్రమందు ఏ విధముగను శమించనట్లు, క్రోధాగ్నియు ధనముచే గాని కఠోరత్వము చూపుటచే గాని తియ్యటి మాటల ద్వారా నచ్చ చెప్పుటచే గాని శాస్త్ర జ్ఞానముచే గాని శాంతింపదు

165 దైవం పురుషకారశ్చ స్థితావన్యోన్య సంశ్రయాత్
ఉదారాణాం తు సత్కర్మ దైవం క్లీబా ఉపాసతే

అదృష్టము పురుష ప్రయత్నము — అను ఈ రెండును ఒకదానికొకటి సహాయపడుచుండును కాని ఉదారమగు విచారణ కల్గ

—వారు సదా శుభకార్యములనే ఆచరించుచుందురు నపుంసకులు (దుర్బలులు) అదృష్టమును నమ్మి నిద్రింతురు

166 అస్మాత్ సర్వం వ్యపోహ్యేదం కార్య ఎవ పరాక్రమః
సర్వస్వమపి సంత్యజ్య కార్యమాత్మహితం నరైః

కావున కాలము అదృష్టము స్వభావము మున్నగు సమస్త పదార్థములను గూర్చిన సంకల్పమును వదలి పరాక్రమము (కార్యసాధకత్వము) నవలంబింపవలెను మనుజులు తన సర్వస్వమును వదలి యైనను తనకు హితమును కలుగజేయు దానిని సాధింపవలెను

167 విద్యా శౌర్యం చ దాక్ష్యం చ బలం ధైర్యం చ పంచమమ్
మిత్రాణి సహజాన్యాహుర్వర్తయన్తీహ తైర్బుధాః

విద్య శూరవీరత్వము దక్షత్వము బలము—అను ఈ ఐదును మనుజుని యొక్క స్వాభావిక మిత్రులని చెప్పబడినవి బుద్ధిమంతుడు వీనిద్వారా ప్రపంచమందు సమస్త కార్యములను గావించుచున్నాడు

168 సా భార్యా యా ప్రియం బ్రూతే స పుత్రో యత్ర నిర్వృతిః
తన్మిత్రం యత్ర విశ్వాసః స దేశో యత్ర జీవ్యతే

ప్రియ వచనములను చెప్పు భార్య ఉత్తమురాలు సుఖమును కలుగజేయు పుత్రుడు ఉత్తముడు విశ్వసింపదగిన మిత్రుడు ఉత్తముడు ఎచట జీవిక చక్కగా జరుగునో అట్టి దేశము ఉత్తమమైనది

తరువాత ధర్మపాలన విషయమై చెప్పుచు భీష్ముడు భారద్వాజ కణికునకు శత్రుంజయుడను రాజునకు జరిగిన సంభాషణను వివరించి చెప్పెను అందు శత్రుంజయునకు ఇట్లు బోధించెను—

భారద్వాజ కణిక ఉవాచ—

169 నాలసాః ప్రాప్నువన్త్యర్థాన్ న క్లీబా నాభిమానినః
న చ లోకరవాద్ భీతా న వై శశ్వత్ ప్రతీక్షిణః

(భారద్వాజ కణికుడు శత్రుంజయ రాజునకు చెప్పిన నీతి —)

సోమరి ఎరికిరాడు అభిమాని లోకచరిత్రము తెలిసి సమయమును ప్రతీక్షించుచు కూర్చునువాడు — వీరు అభీష్ట పదార్థములను పొందజాలరు

170 ఋణశేషమగ్నిశేషం శత్రుశేషం తథైవ చ
పునః పునః ప్రవర్ధన్తే తస్మాచ్ఛేషం న ధారయేత్

ఋణము శత్రువు అగ్ని — అనువానిలో ఏదేని కొంచెము మిగిలియున్నచో అది మరల మరల వృద్ధి నొందుచుండును కాబట్టి వీనిలో దేనియొక్కయు శేషము వదలరాదు

171 నాసమ్యక్ కృతకారీ స్యాదప్రమత్తః సదా భవేత్
కణ్టకోఽపి హి దుశ్ఛిన్నో వికారం కురుతే చిరమ్

ఏ కార్యమైనను బాగుగ నెరవేరువరకు వదలరాదు సదా సావధానముగ నుండవలెను శరీరమునకు గుచ్చుకొనిన ముల్లును పూర్తిగ తీసివేయనిచో దానిలోని కొంత భాగము శరీరములోనే మిగిలియుండినచో అది చిరకాలము వరకు బాధను కలుగజేయును

172 యథా యథైవ జీవేద్ధి తత్ కర్తవ్యమహేలయా
జీవితం మరణాచ్ఛ్రేయో జీవన్ ధర్మమవాప్నుయాత్

దేనిదేనిచే జీవితము సురక్షితముగ నుండునో దానిదానిని అవహేళన లేక తప్పక చేయవలెను మరణించుటకంటె జీవించుట శ్రేష్ఠము — ఏలయనిన జీవించువాడు తిరిగి ధర్మమును ఆచరింపగలడు

సంకట కాలమున జీవన నిర్వహణ మెట్లు చేయవలెనను విషయమును తెలుపుటకై భీష్ముడు విశ్వామిత్ర చాండాల సంవాదమును వివరించెను అందు విశ్వామిత్రుడు చాండాలునితో ఇట్లు చెప్పెను —

విశ్వామిత్ర ఉవాచ—

173 ఎబన్త్యేవోదకం గావో మణ్డూకేషు రువత్స్వపి

(విశ్వామిత్రుడు చండాలునితో ఇట్లు చెప్పెను—)

చెఱువునందు కప్పలు అఱచుచున్నను ఆవులు నీళ్ళు త్రాగుచునే యుండును (ఇతరులేమి చెప్పినను విజ్ఞుడు తాను చేయదలంచిన కార్యమును చేయును)

ఎదప భీష్ముడు ధర్మరాజున కిట్లు బోధించెను —

భీష్మ ఉవాచ

174 ఏవం విద్వానదీనాత్మా వ్యసనస్థో జిజీవిషుః
సర్వోపాయైరుపాయజ్ఞో దీనమాత్మాన ముద్ధరేత్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

సంకటమందు పడి జీవితమును రక్షించుకొనదలచిన బుద్ధిమంతుడు దీనచిత్తుడు కాక ఏదైన ఉపాయమును వెతుకవలెను మఱియు అన్ని ఉపాయములచే ఆపత్కాలమందు పరిస్థితి నుండి తన్నుతాను ఉద్ధరించుకొనవలెను

175 ఏతాం బుద్ధిం సమాస్థాయ జీవితవ్యం సదా భవేత్
జీవన్ పుణ్యమవాప్నోతి పురుషో భద్రమశ్నుతే

ఇట్టి బుద్ధియొక్క సహాయమును గైకొని జీవించుటకు సదా ప్రయత్నము చేయవలెను ఏలయనిన జీవించువాడు పుణ్యము చేయుటకు అవకాశమును బొంది శ్రేయస్సును బడయగలడు

176 అమిథ్యాజ్ఞానినః కేచిన్మిథ్యా విజ్ఞానినః పరే
తద్వై యథాయథం బుద్ధ్వా జ్ఞానమాదదతే సతామ్

కొందఱు యథార్థ జ్ఞానులై యుందురు మఱికొందఱు మిథ్యా జ్ఞానులై యుందురు ఈ విషయమును బాగుగ తెలిసికొని

రాజ సత్యజ్ఞాన సంపన్నులగు సజ్జనుల నుండియే జ్ఞానమును పొందుచున్నాడు

శరణాగతుని రక్షించు విషయమై వేటగాడు పావురముల కథను భీష్ముడు చెప్పెను ఒక చెట్టుపై ఒక పావురము తన భార్యతో గూడ నివసించుచుండెను ఒకనాడు ఆడపావురము ప్రొద్దుననే మేతకై వెడలి మరల చాలసేపటివఱకు తిరిగి రాలేదు అపుడు మగపావురము చాల దిగులు పడి భార్యకొఱకై విలపించుచు ఇట్లు చెప్పెను

177 న గృహం గృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే
గృహం తు గృహిణీహీనమరణ్య సదృశం మతమ్

(మగపావురము ఇట్లు చెప్పెను —)

వాస్తవముగ గృహము గృహమని చెప్పబడదు గృహిణియే (గృహస్థుని భార్యయే) గృహమని చెప్పబడును

178 యస్య భార్యా గృహే నాస్తి సాధ్వీ చ ప్రియవాదినీ
అరణ్యం తేన గన్తవ్యం యథారణ్యం తథా గృహమ్

ఈ ప్రపంచమున భార్యతో సమానమైన బంధువు గాని ఆశ్రయముగాని ధర్మసంపాదన యందు సహాయకులుగాని మఱి యెవరును లేరు

ఈ ప్రకారము విలపించుచున్న మగపావురముతో వల యందు చిక్కుకొనిన ఆడపావురము బోయవానికి అతిథి సత్కారము చేయుమని చెప్ప ఇట్లు పలికెను —

కపోత్యువాచ

179 యో హి కశ్చిద్ ద్విజం హన్యాద్ గాం చ లోకస్య మాతరమ్
శరణాగతం చ యో హన్యాత్ తుల్యం తేషాం చ పాతకమ్

(ఆడపావురము తన భర్తతో ఇట్లు చెప్పెను —)

ఎవడు బ్రాహ్మణుని గోవును శరణాగతుని వధించుదురో ఆ ముగ్గురి ని పాపము సమ సమముగ తగులును

భార్య యొక్క ఆ వాక్యములను విని మగపావురము చాల సంతోషించి బోయవానికి అతిథి సత్కారము చేయదలంచి ఆతనితో ఇట్లు చెప్పెను —

180 అరావప్యుచితం కార్యమాతిథ్యం గృహమాగతే
చేత్తుమప్యాగతే ఛాయాం నోపసంహరతే ద్రుమః

శత్రువైనను ఇంటికి వచ్చినపుడు అతని ఆదర సత్కారమును గావింపవలెను ఛేదించుటకు వచ్చిన వానికి గూడ వృక్షము నీడ నిచ్చుచున్నది కదా!

అపుడు మగపావురము బోయవాడు చలికాచుకొనుట కొఱకై నిప్పును తెచ్చి ఆకులు వేసి చలిమంట ఏర్పాటుచేసె, బోయవానికి ఆహారము అగు నిమిత్తము తన్ను ఆ మంటలో ఆహుతి చేసికొనెను ఆ మహా త్యాగమును చూచి బోయవాడు ఇట్లనుకొనెను —

181 అహో దేవప్రదానేన దర్శితాతిథి పూజనా
తస్మాద్ ధర్మం చరిష్యామి ధర్మో హి పరమా గతిః
దృష్టో ధర్మో హి ధర్మిష్ఠే యాదృశో విహగోత్తమే

(వేటగాడు తనలో ఇట్లనుకొనెను —)

ఆహా! ఆ పావురము తన శరీరమును దానమొనర్చి నా యెదుట అతిథి సత్కారము యొక్క ఉజ్జ్వల ఆదర్శమును చూపెను కాబట్టి నేను కూడ ఇపుడు ధర్మము నాచరించెదను ఏలయనిన ధర్మమే పరమగతియై యున్నది ధర్మాత్ముడగు ఆ శ్రేష్ఠ పక్షియందు ఎట్టి ధర్మము గాంచబడినదో, అట్టిది నాకు కూడ అభీష్టమైయున్నది

ఈ ప్రకారముగ తలంచి వేటగాడు ధర్మమార్గము నవలంబించి, వలలో బంధించిన ఆడపావురమును వదలి వైచెను అపుడు పతివ్రత యగు ఆడపావురము తన యొక్క పతిరపాతస్థితిని జూచి విలపించుచు ఇట్లనెను —

182 మితం దదాతి హి పితా మితం భ్రాతా మితం సుతః
అమితస్య హి దాతారం భర్తారం కా న పూజయేత్

తండ్రి సోదరుడు పుత్రుడు - వీరందఱును స్త్రీకి మితమైన సుఖము నిచ్చెదరు కేవలము పతియే స్త్రీకి అపరిమిత సుఖము నిచ్చును అట్టి పతిని ఏ స్త్రీ పూజించదు ?

ఈ ప్రకారముగ తలంచుచూని ఆ ఆడపావురము తుదకు అచట నున్న అగ్నిలో పడి ప్రాణత్యాగము చేసెను ఆ పావురములు రెండును వేటగాడున్ను సద్గతిని పొందిరి

పిమ్మట భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ

183 యుధిష్ఠిర మహానేష ధర్మో ధర్మభృతాం వర
గోఘ్నేష్వపి భవేదస్మిన్నిష్కృతిః పాపకర్మణః

(భీష్ముడు ధర్మరాజతో ఇట్లు చెప్పెను —)

ధర్మాత్ములలో శ్రేష్ఠుడవగు ధర్మరాజా ! శరణాగతుని రక్షించుట అనునది గొప్ప ధర్మమై యున్నది దానిని ఆచరించుటచే అది గోవధ చేసిన వారి పాపమునకుకూడ ప్రాయశ్చిత్తము కాగలదు

ఈ సందర్భమున భీష్ముడు శౌనక ఇంద్రోతముని జనమేజయ రాజునకు బోధించిన ధర్మములను వివరించుచు చెప్పెను — శౌనక ఇంద్రోతుడు ఇట్లు పలికెను —

శౌనక ఇంద్రోత ఉవాచ

184 యజ్ఞోదానం దయా వేదాః సత్యం చ పృథివీపతే
పఞ్చైతాని పవిత్రాణి షష్ఠం సుచరితం తపః

(శౌనక ఇంద్రోతముని జనమేజయునితో ఇట్లు చెప్పెను —)

యజ్ఞము, దానము దయ వేదము సత్యము — అను ఈ ఐదును పవిత్రములని చెప్పబడినవి వీనితోబాటు చక్కగా ఆచరింపబడిన తపస్సు ఆఱవ పవిత్ర కర్మగా ఎంచబడినది

185 పుణ్యాదేశాభిగమనం పవిత్రం పరమం స్మృతమ్

పుణ్యతీర్థములకు యాత్ర సలుపుట పవిత్రమైనదని చెప్పబడినది

186 వికర్మణా తప్యమానః పాపాద్ విపరిముచ్యతే
నైతత్ కార్యం పునరితి ద్వితీయాత్ పరిముచ్యతే

ఎవడైన శాస్త్రవిరుద్ధమైన కర్మ చేసినచో, దానికి పశ్చాత్తాప పడినచో ఆ పాపము నుండి విముక్తుడగును మఱల రెండవసారి పాపము చేసినచో ఇక మీదట మరల ఇట్టి పాపకార్యమును చేయను, — అని ప్రతిజ్ఞ చేసినచో ఆ పాపము నుండియు అతడు విముక్తుడు కాగల్గును

187 కల్యాణమనుకర్తవ్యం పురుషేణ బుభూషతా
యే సుగన్ధీని సేవన్తే తథాగన్ధా భవన్తి తే

188 యే దుర్గన్ధీని సేవన్తే తథాగన్ధా భవన్తి తే
తపశ్చర్యాపరః సద్యః పాపాద్ విపరిముచ్యతే

సుఖమును అభిలషించువాడు శ్రేయస్కరములగు కార్యములనే చేయవలెను సుగంధ పదార్థములను సేవించువాని శరీరము నుండి సుగంధమే వెలువడును దుర్గంధ పదార్థములను సేవించువాని శరీరము

నుండి దుర్గ ధర్మ తెలువడును ఎవడు తపస్సునందు తత్పరుడై యుండునో అతడు సమస్త పాపముల నుండియు విడివడును

తన ప్రసంగమున శౌనకు ఇంద్రోతకు ని పూర్వమ బృహస్పతి దేవతలకు అసురులకు బోధించిన ధర్మములను చెప్పెను బృహస్పతి ఇటు పలికెను

బృహస్పతి రువాచ

189 కృత్వా పాపం పూర్వమబుద్ధిపూర్వం
పుణ్యాని చేత్కురుతే బుద్ధిపూర్వమ్
స తత్ పాపం నుదతే కర్మశీలో
వాసో యథా మలినం క్షారయుక్తమ్

(బృహస్పతి దేవతలతో అసురులతో ఇట్లు చెప్పెను —)

మనుజుడు మొదట తెలియక పాపముచేసి పిదప తెలిసి పుణ్య కర్మలనాచరించినచో అట్టి సత్కర్మ పరాయణుడు క్షారము (సబ్బు మొదలైనవి) వస్త్రముల మురికిని పోగొట్టునట్లు తన పాపమును తొలగించి వేయును

190 పాపం కృత్వాభిమన్యేత నాహమస్మీతి పూరుషః
తచ్చికీర్షతి కల్యాణం శ్రద్దధానోఽనసూయకః

పాపము చేసినవాడు అభిమానము అహంకారము లేనివాడై, శ్రద్ధాపూర్వకముగ దోష దృష్టిని పరిత్యజించి శ్రేయోదాయకమగు ధర్మము యొక్క అనుష్ఠానమునే ఇచ్ఛగించవలెను

191 యథాదిత్యః ప్రాతరుద్యంస్తమః సర్వం వ్యపోహతి
కల్యాణమాచరన్నేవం సర్వపాపం వ్యపోహతి

సూర్యుడు ప్రాతఃకాలమున ఉదయించి చీకటినంతను నశింప జేయునట్లు శుభకర్మను (పుణ్యకర్మను) ఆచరించువాడు తన సమస్త పాపములను నశింపజేయుచున్నాడు

అనంతరము భీష్ముడు ధర్మరాజు యొక్క ప్రశ్నను పురస్కరించుకొని మరణించిన వానియొక్క పునర్జీవనప్రాప్తి విషయమై ఒక బ్రాహ్మణబాలుడు మృతినొంది మరల జీవించిన గాథను గూర్చి ఇట్లు చెప్పెను — ఒకానొక బ్రాహ్మణునకు ఒక కుమారుడు కలడు అతడు చిన్నప్పుడే మరణించెను ఆ మరణించిన పిల్లవానిని తీసికొని తండ్రి బంధువులు శ్మశానభూమికి వెళ్ళి ఆ బాలుని కొఱకై ఏడ్చుచు పిల్లవాని యెడల ప్రేమచే అచ్చోటు వదలి వెళ్ళలేకపోయిరి అపుడచటికి ఒక గ్రద్ద వచ్చి మీరెందుల కేడ్చెదరు? ఏడ్చినందువలన పిల్లవాడు బ్రతుకునా? కావున తిరిగి పొండు అని చెప్పుచు ఇట్లు పలికెను —

గృధ్ర ఉవాచ

192 పఞ్చేన్ద్రియ పరిత్యక్తం శుష్కం కాష్ఠత్వమాగతమ్
కస్మాచ్ఛోచథ తిష్ఠన్తమాత్మానం కిం న శోచథ

(గ్రద్ద బ్రాహ్మణ బంధువులతో ఇట్లు చెప్పెను —)

ఈ పిల్లవాని శరీరము పంచేంద్రియములచే పరిత్యజింపబడి ఎండిన కట్టెవలె మీ యెదుట పడియున్నది మీరు దీనికై ఏల శోకించుచున్నారు? ఒక దినమున మీకు కూడ ఇట్టి దశ సంభవించును మఱి మీ కొఱకై మీరు ఏల శోకించుటలేదు?

193 ధనం గావః సువర్ణం చ మణిరత్నమథాపి చ
అపత్యం చ తపోమూలం తపోయోగాచ్చ లభ్యతే

ధనము గోవులు బంగారము, మణులు రత్నములు పుత్రులు - వీని యన్నిటి యొక్క మూలకారణము తపస్సే అయి యున్నది తపస్సు వలననే ఇవి లభించుచున్నవి

194 యథాకృతా చ భూతేషు ప్రాప్యతే సుఖదుఃఖితా
గృహీత్వా జాయతే జన్తుర్దుఃఖాని చ సుఖాని చ

జీవుడు తన పూర్వజన్మ యొక్క కర్మల ననుసరించి సుఖ దుఃఖములను వెంట తీసికొని జన్మించుచున్నాడు ప్రాణులందఱకి సుఖదుఃఖములు వారివారి కర్మల ననుసరించియే సంభవించును

195 న కర్మణా పితుః పుత్రః పితా వా పుత్రకర్మణా
మార్గేణాన్యేన గచ్ఛన్తి బద్ధాః సుకృతదుష్కృతైః

తండ్రి యొక్క కర్మతో కుమారునకు గాని కుమారుని కర్మతో తండ్రికి గాని ఏ విధమైన సంబంధము లేదు తమతమ పుణ్య పాప బంధనమందు బంధింపబడిన జీవులు కర్మానుసారము విభిన్న మార్గములందు పయనించుదురు

196 ధర్మం చరత యత్నేన న చాధర్మే మనః కృథాః
వర్తధ్వం చ యథాకాలం దైవతేషు ద్విజేషు చ

మీరు ప్రయత్నపూర్వకముగ ధర్మము నాచరింపుడు అధర్మ మందెన్నడును మనస్సును ప్రవేశింపనీయకుడు దేవతల యొక్కయు బ్రహ్మనిష్ఠుల యొక్కయు సేవయందును యథా సమయమున తత్పరులై యుండుడు

197 ధర్మం సత్యం శ్రుతం న్యాయ్యం మహతీం ప్రాణినాం దయామ్
అజిహ్మత్వమశాఠ్యం చ యత్నతః పరిమారత

మీ యందఱును ధర్మము సత్యము శాస్త్రజ్ఞానము న్యాయ పూర్ణముగ నడవడిక సమస్త ప్రాణులందును మిగుల దయ కలిగి యుండుట కుటిలత్వము లేకుండుట శఠత్వము త్యజించుట — అను ఈ సద్గుణము లను ప్రయత్నపూర్వకముగ అనుష్ఠించుడు

ఇంతలో ఒక నక్క అచటికి వచ్చి ఆ బంధువులతో ఈ గ్రద్ధ మీ పుత్రస్నేహమును భంగ మొనర్చుచున్నది కావున సూర్యాస్త సమయము వఱకు ఇక్కడే యుండి శోకింపుడు అని చెప్పదొడగెను బంధువులు ఏమియు తోచక అచటనే ఉండిపోయిరి ఇంతలో అచట

శివుడు ప్రత్యక్షమై వారిని వరము కోరుకొనుడనగా వారు ఆ మృత బాలుని జీవింపజేయుడని ప్రార్థించిరి శివుడందులకు సమ్మతించి ఆ బాలుని బ్రతికింపజేసెను

ఈ కథను పురస్కరించుకొని భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ

198 అనిర్వేదేన దీర్ఘేణ నిశ్చయేన ధ్రువేణ చ
దేవదేవప్రసాదాచ్చ క్షిప్రం ఫలమవాప్యతే

(భీష్ముడు ధర్మరాజతో ఇట్లు చెప్పెను —)

ధర్మరాజా! మనుజుడు దిగులుపడక దృఢమై ప్రబలమైనట్టి నిశ్చయముతో ప్రయత్నము చేయుచుండినచో, దేవాధి దేవుడగు శివుని అనుగ్రహముచే శీఘ్రముగ మనోవాంఛిత ఫలమును పొందును

ఎదప భీష్ముడు ధర్మరాజునకు వాయు దేవ శాల్మలీ వృక్షముల యొక్క సంవాదమును తెలియజేసెను పూర్వము హిమాలయ పర్వతముపై ఒక పెద్ద శాల్మలీ వృక్షము (బూరుగ చెట్టు) కలదు ఆ చెట్టు చాల విశాలముగ దృఢముగ నుండెను ఒకనాడు నారదుడు అచటికి వచ్చి వాయుదేవుడు నీకు మిత్రుడుగా నున్నట్లు తోచుచున్నది కనుకనే ఇతర చెట్లనువలె నిన్ను క్రింద పడద్రోయక ఉన్నాడు అని పలుక అంతట శాల్మలీ వృక్షము నాకెవరును మిత్రులు లేరు, నాకు వాయుదేవుని కంటెను ఎక్కువ బలము కలదు అని అహంకారముతో పలికెను నారదుడు ఆ విషయమును వాయుదేవునకు తెలుపగా అతడు ఆ వృక్షముకడకు వచ్చి పూర్వము బ్రహ్మదేవుడు ఈ వృక్షము క్రింద విశ్రాంతిని గైకొనెను కనుకనే నేను నీపై దయ కలిగియుంటిని కాని నీవు నన్ను గూర్చి అవమాన పూర్వకముగ పలుకుచున్నావు అని చెప్పగా అంతట శాల్మలీ

వృక్షము వాయుదేవునితో — నేను నీ బలమున కేమియు భయ పడను నీ శక్తిని చూపుకొనుము అని చెప్పి ఇట్లు వచించెను —

199 యే తు బుద్ధ్యా హి బలినస్తే భవని బలీయసః
ప్రాణమాత్రబలా యే వై నైవతే బలినః మతాః

(శాల్మలీ వృక్షము వాయుదేవునితో ఇట్లు చెప్పెను —)

బుద్ధిబలము కలవారే బలిష్ఠులని ఎంచబడుచున్నారు ఎవరి యందు కేవలము శారీరక బలము మాత్రము కలదో వారు వాస్తవముగ బలవంతులని ఎంచబడరు

అపుడు వాయుదేవుడు రేపటి దినము నా పరాక్రమమును చూపెదను — అని చెప్పి వెడలిపోయెను అతడు వెడలిన పిదప ఆ వృక్షము తన తప్పిదమును గుర్తెరిగి తన అల్పబలమును గూర్చి ఆలోచించి పశ్చాత్తాప పడి వాయుదేవుని రాక పూర్వము తానే తన కొమ్మలను ఆకులను క్రిందకు పడవేసికొనెను కావున దుర్బలుడు బలవంతునితో వైరము కలిగియుండునేని శాల్మలీ వృక్షము వలె సంతాపమును పొందవలసివచ్చును అని వచించి భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ

200 న హి వైరం మహాత్మానో వివృణ్వన్త్యపకారిషు
శనైః శనైర్మహారాజ దర్శయన్తి స్మ తే బలమ్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను) —

మహాత్ములు తమకు చెడ్డచేయువారి యెడల వైరభావము కలిగియుండరు వారు నెమ్మది నెమ్మదిగనే తమ బలమును చూపుదురు

201 న హి బుద్ధ్యా సమం కించిద్ విద్యతే పురుషే నృప
తథా బలేన రాజేన్ద్ర న సమోఽస్తీహ కశ్చన

ధర్మరాజా! మనుజుని యందు బుద్ధితో సమానమైనది మఱియొకటి ఏదియు లేదు ప్రపంచమున బుద్ధిబలముతో కూడిన వానితో సమానముగ ఎవరును లేరు

అపుడు ధర్మరాజు భీష్ముని ఇట్లడిగెను —

యుధిష్ఠిర ఉవాచ

202 పాపస్య యదధిష్ఠానం యతః పాపం ప్రవర్తతే
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం తత్త్వేన భరతర్షభ

(ధర్మరాజు భీష్ముని యిట్లడిగెను —)

భరతశ్రేష్ఠా! పాపము యొక్క అధిష్ఠానమేది? దేని నుండి అది ప్రవృత్తమగుచున్నది? అను విషయమును యథార్థ రూపముగ నేను వినదలంచుచున్నాను

అంతట భీష్ముడు ధర్మరాజున కిట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ

203 పాపస్య యదధిష్ఠానం తచ్ఛృణుష్వ నరాధిప
ఏకో లోభో మహాగ్రాహో లోభాత్ పాపం ప్రవర్తతే

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

రాజా! పాపము యొక్క అధిష్ఠానమును వినుము లోభ మొకటియే పాపము యొక్క అధిష్ఠానము ఇది మనుజుని మ్రింగి వేయునట్టి పెద్ద మొసలి లోభము వలననే పాపము యొక్క ప్రవృత్తి సంభవించుచున్నది

204 లోభాత్ క్రోధః ప్రభవతి లోభాత్ కామః ప్రవర్తతే
లోభాన్మోహశ్చ మాయా చ మానః స్తమ్భః పరాసుతా

లోభము వలననే కామము ప్రకటమగుచున్నది లోభము వలననే కామము యొక్క ప్రవృత్తి సంభవించుచున్నది లోభము

వలననే మాయ మోహము అభిమానము ఉద్దండత్వము పరాధీనత్వము — మొదలైన దోషములు ప్రకటమగుచున్నవి

205 ఏ లోభః సహ మోహేన విజేతవ్యో జితాత్మనా
దమ్భో ద్రోహశ్చ నిన్దా చ పైశున్యం మత్సరస్తథా
భవన్త్యేతాని కౌరవ్య లుబ్ధానామకృతాత్మనామ్

తన మనస్సును ఇంద్రియములను నిగ్రహించినవాడు మోహసహితముగ ఈ లోభమును జయించవలెను దంభము ద్రోహము, నింద చాడీలు చెప్పుట మాత్సర్యము – అను ఈ దోషములన్నియు అజితాత్ములగు లోభుల యందే ఉండును

206 యేష్వలోభస్తథా మోహో యే చ సత్యార్జవే స్థితాః
తేషు కౌన్తేయ రజ్యేథా యేషాం న భ్రశ్యతే పునః

రాజా! లోభము మోహము లేనివారును సత్యమునందు సరళత్వమునందు స్థిరులైనవారును సదాచారము నుండి ఎన్నడును భ్రష్టులు కానివారును అగు మహనీయుల యెడల మీరు ప్రేమ (భక్తి) కలిగియుండవలెను

207 యే న హృష్యన్తి లాభేషు నాలాభేషు వ్యథన్తి చ
నిర్మమా నిరహంకారాః సత్త్వస్థాః సమదర్శినః

208 లాభాలాభౌ సుఖదుఃఖే చ తాత
ప్రియాప్రియే మరణం జీవితం చ
సమాని యేషాం స్థిరవిక్రమాణాం
బుభుత్సతాం సత్త్వపథే స్థితానామ్

209 ధర్మప్రియాంస్తాన్ సుమహానుభావాన్
దాన్తోఽప్రమత్తశ్చ సమర్చయేథాః
దైవాత్ సర్వే గుణవన్తో భవన్తి
శుభాశుభే వాక్ప్రలాపాస్తథాన్యే

లాభమునందు సంతోషముతో పొంగిపోనివారును నష్టమునందు దుఃఖముతో క్రుంగి పోనివారును, మమత్వము అహంకారము లేనివారును సదా సత్త్వగుణము కలిగియుండువారును సమదృష్టి కలవారును లాభాలాభములందు సుఖదుఃఖములందు ప్రియాప్రియములందు జీవన మరణములందు సమదృష్టి కలవారును సుదృఢమగు పరాక్రమము కలవారును ఆధ్యాత్మిక ఉన్నతిని కాంక్షించువారును సత్త్వమయ మార్గమునందుండు వారును ధర్మప్రియులును అగు మహానుభావులను మీరు సావధానులై, జితేంద్రియులై సేవ చేయుడు వారిని సత్కరింపుడు ఆ మహనీయులందఱును స్వభావముగనే గుణవంతులైయున్నారు శుభ అశుభ విషయములందు వారి వాక్కు యథార్థముగ నుండును ఇతరులు కేవలము వాక్ప్రలాపము కలిగియుందురు

210 అజ్ఞానాద్ధి లోభో వా లోభాదజ్ఞానమేవ చ
సర్వదోషాస్తథా లోభాత్ తస్మాల్లోభం వివర్జయేత్

మూఢునకు అజ్ఞానముచే లోభము లోభముచే అజ్ఞానము కలుగుచున్నవి లోభము నుండియే అన్ని దోషములు ఉత్పన్నమగుచున్నవి కావున లోభమును త్యజించి వేయవలెను

211 జనకో యువనాశ్వశ్చ వృషాదర్భిః ప్రసేనజిత్
లోభక్షయాద్ దివం ప్రాప్తాస్తథైవాన్యే నరాధిపాః

జనకుడు యువనాశ్వుడు వృషాదర్భి ప్రసేనజిత్తు ఇంకను అనేక రాజులు లోభమును నశింపజేసియే దివ్యలోకమున కేగిరి

212 ధర్మస్య విధయో నైకే యే వై ప్రోక్తా మహర్షిభిః
స్వం స్వం విజ్ఞానమాశ్రిత్య దమస్తేషాం పరాయణమ్

మహర్షులు వారివారి జ్ఞానము ననుసరించి ధర్మమునకు ఒకటి కాదు అనేక విధులను చెప్పిరి కాని వాని యన్నిటి యొక్క ఆధారము దమమే (ఇంద్రియ నిగ్రహమే) అయియున్నది

213 సుఖం దాన్తః ప్రస్వపితి సుఖం చ ప్రతిబుధ్యతే
సుఖం పరేతి లోకాంశ్చ మనశ్చాస్య ప్రసీదతి

ఎవడు తన మనస్సును ఇంద్రియములను దమన మొనర్చునో నిగ్రహించునో) అతడు సుఖముగ నిద్రించును సుఖముగ మేల్కొనును సుఖపూర్వకముగ లోకమున సంచరించును ఆతని మనస్సు సదా ప్రసన్నముగ నుండును

214 క్షమా ధృతిరహింసా చ సమతా సత్యమార్జవమ్
ఇన్ద్రియాభిజయో దాక్ష్యం మార్దవం హ్రీరచాపలమ్

215 అకార్పణ్యమసంరమ్భః సంతోషః ప్రియవాదితా
అవిహింసానసూయా చాప్యేషాం సముదయో దమః

క్షమ ధీరత్వము అహింస సమత్వము సత్యవాదిత్వము, సరళత్వము ఇంద్రియ విజయము, దక్షత్వము కోమలత్వము, లజ్జ స్థిరత్వము ఉదారత్వము క్రోధరాహిత్యము సంతృప్తి ప్రియ వచనములను మాట్లాడు స్వభావము, ఏ ప్రాణికిని కష్టము కలుగ జేయకుండుట, ఇతరుల దోషములను చూడకుండుట — అను ఈ సద్గుణములు ఉదయించుటయే దమమని చెప్పబడును

216 జ్ఞానారామస్య బుద్ధస్య సర్వభూతాఽవిరోధినః
నావృత్తి భయమస్తీహ పరలోకభయం కుతః

ఎవనికి ఏ ప్రాణితోడను విరోధము లేదో ఎవడు జ్ఞాన స్వరూపమగు ఆత్మయందు స్థితి గల్గియుండునో అట్టి జ్ఞానికి ఈ లోకమున తిరిగి జన్మించుటను గూర్చిన భయము ఉండదు ఇక పరలోకమును గూర్చిన భయమెట్లుండును?

217 దాన్తస్య కిమరణ్యేన తథాదాన్తస్య భారత
యత్రైవ నివసేద్ దాన్తస్తదరణ్యం స చాశ్రమః

భారతా! ఇంద్రియ సంయమము కలవానికి వనమునకు పోవలసిన ఆవశ్యకత ఏమి కలదు? సంయమము లేనివాడు వనమునకేగినను ఏమి లాభము? సంయమము కలవాడు ఎచట ఉండునో అదియే అతనికి వనము ఆశ్రమము అయియున్నది

218 ప్రజాపతిరిదం సర్వం తపసైవాసృజత్ ప్రభుః
అథైవ వేదానృషయస్తపసా ప్రతిపేదిరే

ప్రజాపతి తపస్సుచేతనే ఈ ప్రపంచమునంతను సృష్టి చేసెను ఋషులు తపస్సుచేతనే వేదముల జ్ఞానమును పొందిరి

219 సత్యం ధర్మస్తపో యోగః సత్యం బ్రహ్మ సనాతనమ్
సత్యం యజ్ఞః పరః ప్రోక్తః సర్వం సత్యే ప్రతిష్ఠితమ్

సత్యమే ధర్మము తపస్సు యోగము సత్యమే సనాతన బ్రహ్మము సత్యమే పరమ యజ్ఞమని చెప్పబడినది సమస్తము సత్యముపైననే నిలబడియున్నది

220 సత్యం చ సమతా చైవ దమశ్చైవ న సంశయః
అమాత్సర్యం క్షమా చైవ హ్రీస్తితిక్షానసూయతా

221 త్యాగో ధ్యానమథార్యత్వం ధృతిశ్చ సతతం స్థిరా
అహింసా చైవ రాజేన్ద్ర సత్యాకారాస్త్రయోదశ

రాజా! సత్యము సమత్వము దమము మాత్సర్యము లేకుండుట క్షమ లజ్జ తితిక్ష (సహనశీలత్వము) అసూయారాహిత్యము త్యాగము పరమాత్మధ్యానము ఆర్యత్వము (ఉత్తమ ఆచరణ) నిరంతరము స్థిరముగ నుండు ధైర్యము అహింస — అను ఈ పదమూడు సత్యము యొక్కయే స్వరూపములు — ఇట సంశయము లేదు

222 సత్యం నామావ్యయం నిత్యమవికారి తథైవ చ
సర్వధర్మావిరుద్ధేన యోగేనైతదవాప్యతే

నిత్యము ఏకరూపమై నాశరహితమై నిర్వికారమై యుండుటయే (అట్టి ఆత్మయందు నిలుకడ గలిగియుండుటయే) సత్యము యొక్క లక్షణము సమస్త ధర్మములకు అనుకూలముగ కర్తవ్యపాలన చేయుట అను యోగము ద్వారా ఈ సత్యము సంప్రాప్తించుచున్నది

223 త్యాగః స్నేహస్య యత్ త్యాగో విషయాణాం తథైవ చ
రాగద్వేష ప్రహీణస్య త్యాగో భవతి నాన్యథా

విషయాసక్తిని వదలుటయే నిజమైన త్యాగము రాగద్వేష రహితుడైనపుడే త్యాగము యొక్క సిద్ధి సంభవించును లేనిచో సంభవించదు

224 ఆర్యతా నామ భూతానాం యః కరోతి ప్రయత్నతః
శుభం కర్మ నిరాకారో వీతరాగస్తథైవ చ

ఎవడు తన్ను ప్రకటించుకొనకుండ ప్రయత్నపూర్వకముగ ప్రాణులకు మేలు చేయుట అను కార్యమును చేయునో అతని యొక్క ఆ శ్రేష్ఠమగు భావము ఆచరణ యొక్క పేరే ఆర్యత్వము ఇది ఆసక్తి యొక్క త్యాగముచే లభించును

225 ధృతిర్నామ సుఖే దుఃఖే యథా నాప్నోతి విక్రియామ్
తాం భజేత సదా ప్రాజ్ఞో య ఇచ్ఛేద్ భూతిమాత్మనః

సుఖము దుఃఖము కలిగినను మనస్సునందు ఏ విధమైన వికారము లేకుండుట ధృతి (ధైర్యము) తన ఉన్నతిని కోరు బుద్ధిమంతుడు ఈ ధృతిని తప్పక సేవించవలెను

226 అద్రోహః సర్వభూతేషు కర్మణా మనసా గిరా
అనుగ్రహశ్చ దానం చ సతాం ధర్మః సనాతనః

మనస్సు వాక్కు క్రియల ద్వారా సమస్త ప్రాణుల యెడల ఏ విధమైన ద్రోహబుద్ధి లేకుండుట దయ దానము — అనునివి శ్రేష్ఠ మనుజుల యొక్క సనాతన ధర్మములు

227 ఏతే త్రయోదశాకారాః పృథక్ సత్యైకలక్షణాః
భజన్తే సత్యమేవేహ బృంహయన్తే చ భారత

ఈ విధముగ వేఱువేఱుగ పదమూడు రూపములందు చెప్పబడిన ధర్మములు ఒక్క సత్యమునే చూపునవై యున్నవి ఇవి సత్యమునే ఆశ్రయించుచు దానియొక్కయే వృద్ధిని, పుష్టిని కలుగజేయుచున్నవి

228 అశ్వమేధ సహస్రం చ సత్యం చ తులయా ధృతమ్
అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే

త్రాసు యొక్క ఒక పళ్ళెములో ఒక వెయ్యి అశ్వమేధ యజ్ఞములను మఱియొక పళ్ళెములో ఒకే ఒక సత్యమును ఉంచి తూచినచో సత్యమే బరువైనదని (అధిక మహత్త్వ కలదని) తెలియగలదు

అంతట ధర్మరాజు భీష్ముని యిట్లు ప్రశ్నించెను —

యుధిష్ఠిర ఉవాచ

229 యతః ప్రభవతి క్రోధః కామో వా భరతర్షభ
శోకమోహౌ విధిత్సా చ పరాసుత్వం తథా మదః

230 లోభో మాత్సర్యమీర్ష్యా చ కుత్సాసూయా కృపా తథా
ఏతత్ సర్వం మహాప్రాజ్ఞ యాథాతథ్యేన మే వద

(ధర్మరాజు భీష్ముని ఇట్లడిగెను —)

మహాప్రాజ్ఞా! క్రోధము కామము శోకము, మోహము విధిత్స (శాస్త్ర విరుద్ధకార్యము చేయు కోరిక) పరాసుత్వము (ఇతరులను బాధింపు కోరిక) మదము, లోభము మాత్సర్యము,

ఈర్ష్య నింద దోషదృష్టి దైన్యభావము — అను ఈ పదమూడు దోషములు కేననుండి ఉత్పన్నమగుచున్నవి? చక్కగా తెలుప ప్రార్థన

అపుడు భీష్ముడు ధర్మరాజున కిట్లు ప్రత్యుత్తరము చెప్పెను—

భీష్మ ఉవాచ

231 త్రయోదశైతేఽతిబలాః శత్రవ ప్రాణినాం స్మృతాః
ఉపాసన్తే మహారాజ సమన్తాత్ పురుషానిహ

(భీష్ముడు ధర్మరాజున కిట్లు చెప్పెను —)

ధర్మరాజా! మీరు చెప్పిన ఈ పదమూడు దోషములు జీవుల యొక్క ప్రబల శత్రువులని తలంపబడినవి అవి మనుజులను అన్ని వైపుల నుండి చుట్టివేయుచున్నవి

232 లోభాత్ క్రోధః ప్రభవతి పరదోషైరుదీర్యతే
క్షమయా తిష్ఠతే రాజన్ క్షమయా వినివర్తతే

క్రోధము లోభము నుండి ఉత్పన్నమగుచున్నది ఇతరుల దోషమును చూచుటచే అది వృద్ధి నొందుచున్నది క్షమ కలిగి యుండుటచే అది శమించి తొలగిపోవుచున్నది

233 సంకల్పాజ్జాయతే కామః సేవ్యమానో వివర్ధతే
యదా ప్రాజ్ఞో విరమతే తదా సద్యః ప్రణశ్యతి

కామము సంకల్పము చే జనించుచున్నది సంకల్పమును సేవించుటచే వృద్ధి నొందుచున్నది బుద్ధిమంతుడు విరక్తి నొందునపుడు అది తక్షణమే నశించిపోవుచున్నది

234 పరాసుతా క్రోధలోభాదభ్యాసాచ్చ ప్రవర్తతే
దయయా సర్వభూతానాం నిర్వేదాత్ సా నివర్తతే
అవద్యదర్శనాదేతి తత్త్వజ్ఞానాచ్చ ధీమతామ్

క్రోధముచే లోభముచే అట్టి దుర్గుణముల అభ్యాసముచే ఇతరు ను బాధించ ఇచ్ఛ కలుగుచున్నది సమస్త ప్రాణుల యెడల దయ కలిగియుండుటచేతను వైరాగ్యముచేతను అది తొలగి పోవుచున్నది

235 అజ్ఞానప్రభవో మోహః పాపాభ్యాసాత్ ప్రవర్తతే
యదా ప్రాజ్ఞేషు రమతే తదా సద్యః ప్రణశ్యతి

మోహము అజ్ఞానము వలన కలుగుచున్నది పాపమును మరల మరల చేయుటచే అది పెరుగుచున్నది జ్ఞానుల యందు అనురాగము కలిగియుండుటచే మోహము వెంటనే నశించిపోవుచున్నది

236 విరుద్ధానీహ శాస్త్రాణి యే పశ్యన్తి కురూద్వహ
విదిత్వా జాయతే తేషాం తత్త్వజ్ఞానాన్నివర్తతే

ధర్మవిరుద్ధములగు గ్రంథములను చూచుటచేత, జనుల మనస్సునందు అనుచిత కర్మ చేయు కోరిక కలుగుచున్నది ఇది తత్త్వజ్ఞానముచే తొలగిపోవుచున్నది

237 ప్రీత్యా శోకః ప్రభవతి వియోగాత్ తస్య దేహినః
యదా నిరర్థకం వేత్తి తదా సద్యః ప్రణశ్యతి

ఎవనిపై ప్రేమ యుండునో ఆతని వియోగముచే శోకము ప్రకటమగుచున్నది కాని శోకము వ్యర్థమని మనుజుడెప్పుడు తెలిసికొనునో దానివలన లాభమేమియు లేదని యెఱుగునో అపుడది శీఘ్రముమే శమించిపోవుచున్నది

238 సత్యత్యాగాత్ తు మాత్సర్యమహితానాం చ సేవయా
ఎతత్ తు క్షీయతే తాత సాధూనాముపసేవనాత్

సత్యమును త్యజించుటచేతను దుష్టులతో సాంగత్యము చేయుటచేతను మాత్సర్యము జనించుచున్నది ఉత్తములగు వారి యొక్క సేవా సాంగత్యములచే ఆ దోషము నశించిపోవును

239 కులాజ్ఞానాత్ తథైశ్వర్యాన్మదో భవతి దేహినామ్
ఏభిరేవ తు విజ్ఞాతైః స ఏవ సద్యః ప్రణశ్యతి

తన యొక్క ఉత్తమ కులము ఉత్కృష్ట జ్ఞానము ఐశ్వర్యము — వీని యొక్క అభిమానముచే మనుజులందు మదము కలుగుచున్నది కాని వాని యొక్క యథార్థ జ్ఞానము కలుగగా ఆ మదము తత్క్షణమే నశించిపోవుచున్నది

240 ఈర్ష్యా కామాత్ ప్రభవతి సంహర్షాచ్చైవ జాయతే
ఇతరేషాం తు సత్త్వానాం ప్రజ్ఞయా సా ప్రణశ్యతి

మనస్సునందు కోరిక కలుగుటచేతను ఇతరుల సంపదను, ఆనందమును చూచుటచేతను మనుజుని యందు ఈర్ష్య జనించుచున్నది కాని వివేకవంతమగు బుద్ధి ద్వారా అది నశించిపోవుచున్నది

241 విభ్రమాల్లోకబాహ్యానాం ద్వేష్యైర్వాక్యైరసమ్మతైః
కుత్సా సంజాయతే రాజల్లోకాః ప్రేక్ష్యాభిశామ్యతి

సమాజముచే బహిష్కరింపబడిన నీచుల ద్వేషపూర్ణ అప్రామాణిక వచనములను విని భ్రమయందు పడుటచే నింద మోపుట అలవాటు కలుగును కాని ఉత్తముల యొక్క సాంగత్యముచే ఆ దోషము నశించును

242 ప్రతికర్తుం న శక్తా యే బలస్థాయాపకారిణే
అసూయా జాయతే తీవ్రా కారుణ్యాద్ వినివర్తతే

తనకు చెడ్డచేయు బలవంతులను ఎదుర్కొను సామర్థ్యము లేని వారి యందు తీవ్రమగు అసూయ (దోష దర్శన ప్రవృత్తి) జనించుచున్నది కాని దయాభావము వృద్ధియగుటచే అది తొలగిపోవుచున్నది

243 కృపణానాం సతతం దృష్ట్వా తత సంజాయతే కృపా
ధర్మనిష్ఠాం యదా వేత్తి తదా శామ్యతిసా కృపా

సదా లోభులను చూచుచుండుటచే తన యందును లోభ బుద్ధి కలుగుచున్నది ధర్మనిష్ఠుల యొక్క ఔదారభావమును యెఱుగుటచె ఆ దోషము తొలగిపోవుచున్నది

244 అజ్ఞానప్రభవో లోభో భూతానాం దృశ్యతే సదా
అస్థిరత్వం చ భోగానాం దృష్ట్వా జ్ఞాత్వా నివర్తతే

ప్రాణులందు భోగముల యెడల ఏ లోభము (ఆశ) గాంచబడు చున్నదో అది అజ్ఞానమువలననే కలుగుచున్నది భోగములయొక్క క్షణ భంగురత్వమును చూచుటచేతను తెలిసికొనుటచేతను ఆ దోషము నశించుచున్నది

245 ఎతాన్యేవ జితాన్యాహుః ప్రశమాచ్చ త్రయోదశ
ఏతే హి ధార్తరాష్ట్రాణాం సర్వే దోషా త్రయోదశ
త్వయా సత్యార్థినా నిత్యం విజితా జ్యే ష్ఠసేవనాత్

ఈ పదమూడు దోషములు శాంతి కలిగియుండుటచే తొలగి పోవునని పెద్దలు చెప్పుదురు ధృతరాష్ట్రుని పుత్రులందు ఈ దోషము లన్నియు కలవు మీరు సత్యమును గ్రహించ మొనర్పదలంచినారు కాబట్టి శ్రేష్ఠుల యొక్క సేవనముచే ఈ దోషములన్నిటిపైనను మీరు విజయమును పొందిరి

246 శ్రద్దధానః శుభాం విద్యాం హీనాదపి సమాప్నుయాత్
సువర్ణమపి చామేధ్యాదాద దీతా విచారయన్

హీనులైనవారి యొద్ద కూడ ఉత్తమ విద్య యున్నచో దానిని శ్రద్ధతో పొందవలయును బంగారము అపవిత్ర స్థానమందున్నను సంకోచింపక దానిని గ్రహించవలెను

247 అధర్మకారీ ధర్మేణ తపసా హన్తి కిల్బిషమ్

పాప ధర్మాచరణము తపస్సు చేసినచో వానిచే తన పాపమును నశింపజేసికొనును

ఈ ప్రకారముగ బోధించి భీష్ముడు తన భాషణమును విరమించగా ధర్మరాజు తన గృహమునకు వెళ్ళి అచట తన నలుగురు సోదరులతోను విదురునితోను ధర్మార్థ కామములనుగూర్చి ప్రశ్నింపగా విదురుడిట్లు చెప్పెను —

విదుర ఉవాచ

218 బాహుశ్రుత్యం తపస్త్యాగః శ్రద్ధా యజ్ఞక్రియా క్షమా
భావశుద్ధిర్దయా సత్యం సంయమశ్చాత్మ సమ్పదః

(విదురుడు ధర్మరాజతో ఇట్లు చెప్పెను —)

అనేక శాస్త్రముల పరిశీలనము తపస్సు త్యాగము శ్రద్ధ యజ్ఞకర్మ క్షమ భావశుద్ధి దయ సత్యము సంయమము—అనునివి యన్నియు ఆత్మయొక్క సంపత్తి అయియున్నవి

249 ఏతదేవాభిపద్యస్వ మా తేఽభూచ్చలితం మనః
ఏతన్మూలౌ హి ధర్మార్థావేతదేకపదం హి మే

మీరు వీనినే పొందుడు వీనినుండి మీ మనస్సు చలింపరాదు ధర్మ అర్థములకు ఇవియే మూలము నా అభిప్రాయమందు ఇవియే ఉత్తమ పదము

250 ధర్మేణైవర్షయస్తీర్ణా ధర్మే లోకాః ప్రతిష్ఠితాః
ధర్మేణ దేవా వవృధుర్ధర్మే చార్థః సమాహితః

ధర్మముచేతనే ఋషులు సంసార సముద్రమును దాటివైచిరి ధర్మమునందనే లోకములన్నియు నిలబడియున్నవి ధర్మముచేతనే దేవతల యొక్క ఉన్నతి సంభవించినది ధర్మమందే ముఅర్థము యొక్కయు స్థితి కలదు

251 తస్మాద్ ధర్మప్రధానేన భవితవ్యం యతాత్మనా
తథా చ సర్వభూతేషు వర్తితవ్యం యథాత్మని

కావున మనస్సును వశమునందుంచుకొని ధర్మమును మిక్కిలి ప్రధాన ధ్యేయముగ నుంచుకొనవలెను మఱియు సమస్త ప్రాణుల యెడల, తన యెడల ఎట్టి భావము కలిగియుండునో — అట్టి భావము కలిగి ఆ ప్రకారమే ఆచరించవలెను

మ్మట ధర్మరాజు వారందఱతో ఇట్లు పలికెను —

యుధిష్ఠిర ఉవాచ

252 స్నేహేన యుక్తస్య న చాస్తి ముక్తి
రితి స్వయమ్భూ ర్భగవానువాచ
బుధాశ్చ నిర్వాణపరా భవన్తి
తస్మాన్న కుర్యాత్ ప్రియమప్రియం చ

(ధర్మరాజు సోదరులతో ఇట్లు చెప్పను —)

పూర్వము స్వయంభువగు భగవంతుడైన బ్రహ్మదేవుడు ఇట్లు చెప్పెను — ఎవని మనస్సునందు ఆసక్తియుండునో అతనికి మోక్షము కలుగదు ఆసక్తి రహితులగు జ్ఞానులే మోక్షమును పొందుచున్నారు కావున ముముక్షువులు ఆసక్తి లేకుండవలెను

అనంతరము ధర్మరాజాదులు తిరిగి భీష్ముని సన్నిధికి వెళ్ళిరి అంతట ధర్మరాజు భీష్మునితో ఇట్లు చెప్పెను —

యుధిష్ఠిర ఉవాచ

253 దుర్లభో హి సుహృచ్ఛ్రోతా దుర్లభశ్చ హితః సుహృత్

(ధర్మరాజు భీష్మునితో ఇట్లనెను —)

హితమైన వాక్యములను విను మిత్రుడు దుర్లభుడు హితకారి యగు మిత్రుడున్ను దుర్లభుడే యగును

అటు పిమ్మట భీష్మాచార్యులు ధర్మరాజాదుల కిట్లు బోధించెను —

భీష్మ ఉవాచ

254 బ్రహ్మఘ్నే చ సురాపే చ చౌరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా రాజన్ కృతఘ్నే నాస్తి నిష్కృతిః

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

బ్రహ్మహత్య చేయువాడు, కల్లు త్రాగువాడు వ్రతభంగము చేయువాడు — అను వీరి కొఱకై శాస్త్రమందు ప్రాయశ్చిత్తము చెప్పబడినది కాని కృతఘ్నుని ఉద్ధారము కొఱకు అందు ఏ ఉపాయము న్ను చెప్పబడలేదు

255 మిత్రద్రోహీ నృశంసశ్చ కృతఘ్నశ్చ నరాధమః
క్రవ్యాదైః కృమిభిశ్చైవ న భుజ్యన్తే హి తాదృశాః

మిత్రద్రోహి, క్రూరుడు నరాధముడు కృతఘ్నుడు — అను ఇట్టి మనుజులయొక్క మాంసమును మాంస భక్షులగు జీవజంతువులు పురుగులు కూడ తినవు

256 యథా యథా చ పర్యేతి లోకతన్త్రమసారవత్
తథా తథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః

మనుజుడు ప్రపంచమందలి పదార్థములను ఏయే రీతిగ సారహీనములుగ తలంచునో ఆయా రీతిగ వానియందు అతనికి వైరాగ్యము కలుగుచుండును ఇందు సంశయము లేదు

257 ఏవం వ్యవసితే లోకే బహుదోషే యుధిష్ఠిర
ఆత్మమోక్షనిమిత్తం వై యతేత మతిమాన్ నరః

ధర్మరాజా! ఈ ప్రకారము ఈ జగత్తు అనేక దోషములతో కూడియున్నదని నిశ్చయించి బుద్ధిమంతుడు తన మోక్షము కొఱకై ప్రయత్నించవలెను

ఎదప భీష్ముడు ధర్మరాజు యొక్క శోకయుక్తమగు చిత్తము శాంతించుట కొఱకై సేనజిత్ రాజుయొక్కయు బ్రాహ్మణుని యొక్కయు సంవాదమును గూర్చి అతనికి చెప్పెను ఒకానొక బ్రాహ్మణుడు సేనజిత్ అను రాజు యొద్దకు వెళ్ళి అతనికి సదుపదేశము చేసెను బ్రాహ్మణుడు రాజుతో ఇట్లనెను —

258 త్వం చైవాహం చ యే చాన్యే త్వాముపాసన్తి పార్థివ
సర్వే తత్ర గమిష్యామో యత ఎవాగతా వయమ్

(బ్రాహ్మణుడు సేనజిత్తు రాజుతో ఇట్లు చెప్పెను —)

రాజా! మీరు నేను ఇపుడు మీ యొద్ద కూర్చునిన ఇతరులు అందఱము ఎచటి నుండి (ఏ పరమాత్మ నుండి) వచ్చితిమో అచటి కేగెదము

ప్రసంగ సందర్భమున సేనజిత్ రాజు ఆ బ్రాహ్మణుని ఇట్లు ప్రశ్నించెను —

సేనజదువాచ

259 కా బుద్ధిః కిం తపో విప్ర కః సమాధిస్తపోధన
కిం జ్ఞానం కిం శ్రుతం చైవ యత్ ప్రాప్య న విషీదసి

(సేనజిత్తు రాజు బ్రాహ్మణుని ఇటడిగెను —)

తపోధనా! దేనిని పొంది మీరేవిధమైన దుఃఖము లేక యున్నారో అట్టి బుద్ధి తపస్సు సమాధి జ్ఞానము, శాస్త్రము మీ యొద్ద ఏమి కలదు?

అది విని బ్రాహ్మణుడిట్లు ప్రత్యుత్తరము చెప్పెను —

బ్రాహ్మణ ఉవాచ

260 అహమేకో న మే కశ్చిన్నాహమన్యస్య కస్యచిత్
న తం పశ్యామి యస్యాహం తం న పశ్యామి యో మమ

(బ్రాహ్మణుడు సేనజిత్తుతో ఇట్లు చెప్పెను —)

నేను ఒంటరిగ ఉన్నాను ఇతరుడెవడు నా వాడు లేడు నేను ఇతరుల వాడనుకాను నేనెవని వాడనో ఇతరు డెవడు నా వాడో అట్టివానిని నేను గాంచుట లేదు

261 అత్మాఽపి చాయం న మమ సర్వా వా పృథివీ మమ
యథా మమ తథాఽన్యేషామితి చిన్త్య న మే వ్యథా
ఏతాం బుద్ధిమహం ప్రాప్య న ప్రహృష్యే న చ వ్యథే

ఈ శరీరమున్ను నాది కాదు ఈ భూమి యంతయు కూడ నాది కాదు ఈ వస్తువులన్నియు నావి ఎట్లో అట్లే ఇతరులవి కూడను — ఇట్లు తలంచుకొనుటచే నా మనస్సునందు ఏ విధమైన దుఃఖము కలుగుట లేదు ఇట్టి బుద్ధియే కలిగియుండుటచే నాకు హర్షముగాని, శోకము గాని లేకున్నవి

262 యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహోదధౌ
సమేత్య చ వ్యపేయాతాం తద్వద్భూత సమాగమః

సముద్రమందు కొట్టుకొని పోవు రెండు కట్టెలు అప్పుడప్పుడు కలిసికొనుచు మరల విడిపోవుచు నుండునట్లు ఈ ప్రపంచమున ప్రాణికోట్లు యొక్క కలయిక ఉండును

263 ఏవం పుత్రాశ్చ పౌత్రాశ్చ జ్ఞాతయో బాన్ధవా స్తథా
తేషాం స్నేహో న కర్తవ్యో విప్రయోగో ధ్రువో హి తైః

అట్లే పుత్రులు పౌత్రులు జాతి బంధువులు మొదలైనవారు కలసికొనుచుందురు వారి యెడల ఆసక్తిని ఎన్నడును పెంచుకొన గూడదు ఏలయనిన ఒక దినమున వారితో వియోగము నొందుట నిశ్చితమైయున్నది

264 తృష్ణార్తి ప్రభవం దుఃఖం దుఃఖార్తిప్రభవం సుఖమ్
సుఖాత్ సంజాయతే దుఃఖం దుఃఖమేవం పునః పునః

ప్రపంచమున విషయతృష్ణచే కలుగు వ్యాకులత్వము పేరే దుఃఖము ఆ దుఃఖము యొక్క వినాశమే సుఖము ఆ సుఖము తరువాత మరల (కామనా జనితమగు) దుఃఖము కలుగును ఈ ప్రకారము మరల మరల దుఃఖము కలుగుచున్నది

265 యే చ మూఢతమా లోకే యే చ బుద్ధేః పరం గతాః
తే నరాః సుఖమేధన్తే క్లిశ్యత్యన్తరితో జనః

ఈ ప్రపంచమున అత్యంత మూఢులు సుఖముగ నున్నట్లు తోచుచున్నారు బుద్ధిని దాటినవారు—పరమ సుఖముగ నున్నారు ఇక మధ్యనున్న వారందఱు కష్టముల ననుభవించుచున్నారు (అత్యంత మూఢులు సుఖముగ నున్నట్లు తోచుచున్నారే కాని వాస్తవముగ సుఖముగ లేరు కావున ఆ స్థితి పనికిరాదు)

266 సుఖం దుఃఖాన్తమాలస్యం దుఃఖం దాక్ష్యం సుఖోదయమ్
భూతిస్త్వేవం శ్రియా సార్ధం దక్షే వసతి నాలసే

ప్రారంభమున అలసత్వము (సోమరితనము) సుఖముగ కనృట్టును కాని అది తుదకు దుఃఖమును కలుగజేయును కార్య కౌశలము మొదట దుఃఖముగా నుఎంచినను తుదకు మహాసుఖమును కలుగజేయును కార్యకుశలుని యందే సంపద ఐశ్వర్యము నివసించును గాని సోమరియందు కాదు

267 సుఖం వా యది వా దుఃఖం ప్రియం వా యది వాప్రియమ్
ప్రాప్తం ప్రాప్తముపాసీత హృదయేనాపరాజితః

కావున బుద్ధిమంతుడు సుఖముగాని దుఃఖము గాని, ప్రియము గాని అప్రియముగాని ఏది లభించినను దానికి హృదయముతో స్వాగతము చెప్పవలెను ధైర్యమును సడలించరాదు

268 బుద్ధిమన్తం కృతప్రజ్ఞం శుశ్రూషుమనసూయకమ్
దాన్తం జితేన్ద్రియం చాపి శోకో న స్పృశతే నరమ్

బుద్ధిమంతుడు ఊహాపోహ కుశలుడు శిక్షితబుద్ధి కలవాడు అధ్యాత్మ శాస్త్రమును శ్రవణము చేయ తూహలము కలవాడు ఎవని యొక్కయు దోషమును చూడనివాడు మనస్సును వశమందుంచుకొనువాడు జితేంద్రియుడు — అగువానిని శోకము తాకనైన తాకజాలదు

269 యిద్ యత్త్యజతి కామానాం తత్ సుఖస్యాభిపూర్యతే
కామానుసారీ పురుషః కామాననువినశ్యతి

మనుజుడు ఎంతెంత కోరికలను త్యజించుచుండునో అంతంత సుఖమును బడయుచుండును కోరికలను అనుసరించువాడు వాని వెనుకనే వినాశమును పొందుచుండును

270 యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్ సుఖమ్
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్

ఈ ప్రపంచమున కామసుఖమేది కలదో స్వర్గమున గొప్ప సుఖమేది కలదో అది యంతయు తృష్ణాక్షయము వలన కలుగు సుఖములో పదునారవ భాగముతో సమానముగనైనను ఉండదు

271 ఏతాం బుద్ధిం సమస్థాయ సుఖమాస్తే గుణాన్వితః
సర్వాన్ కామాన్ జుగుప్సేత కామాన్ కుర్వీత పృష్ఠతః

ఇట్టి బుద్ధిని ఆశ్రయించి కోరికలను త్యజించు గుణముతో కూడిన మనుజుడు సుఖముగ నుండును కావున సమస్త భోగముల యెడల విరక్తి కలిగి వానిని వెనుకకు నెట్టివేయవలెను

272 యదా సంహరతే కామాన్ కూర్మోఽఙ్గానీవ సర్వశః
తదాఽఽత్మజ్యోతిరాత్మాయమాత్మన్యేవ ప్రపశ్యతి

తాబేలు తన అవయవములన్నిటిని లోనికి ముడుచుకొనునట్లు ఎవడు తన కోరికలన్నిటిని ఎప్పుడు ఉపసంహరించుకొనునో, అప్పుడతడు

తన విశుద్ధాంతఃకరణమందే స్వయంప్రకాశ స్వరూపుడగు పరమాత్మ యొక్క సాక్షాత్కారమును బడయును

273 న బిభేతి యదా చాయం యదా చాస్మాన్న బిభ్యతి
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎప్పుడు మనుజుడు నెవరికిని భయపడడో అతని వలన ఎవనికిని భయము ఉండదో ఏ వస్తువును కోరకయు ద్వేషింపకను ఉండునో అపుడతడు పరమాత్మ సాక్షాత్కారమును బొందును

274 యదా న కురుతే ధీరః సర్వభూతేషు పాపకమ్
కర్మణా మనసా వాచా బ్రహ్మ సమ్పద్యతే తదా

ధైర్యసంపన్నుడగు మనుజుడు ఎపుడు ఏ ప్రాణి యెడలను మనోవాక్కర్మల ద్వారా పాపపూర్ణము ప్రవర్తన కలిగియుండడో అపుడతడు పరబ్రహ్మను పొందును

275 యా దుస్త్యజా దుర్మతిభిర్యా న జీర్యతి జీర్యతః
యోఽసౌ ప్రాణాన్తికో రోగస్తాం తృష్ణాం త్యజతః సుఖమ్

దుష్టబుద్ధి కలవానికి త్యజించుటకు కష్టసాధ్యమైనదియు, మనుజుడు శారీరకముగ జీర్ణదశ నొందినను తాను మాత్రము జీర్ణము (శిథిలము) కానిదియు ప్రాణాంతకము రోగము వంటిదియు అగు తృష్ణను త్యజించువానికే సుఖము కలుగును

276 సుఖం నిరాశః స్వపితి నైరాశ్యం పరమం సుఖమ్
ఆశామనాశాం కృత్వా హి సుఖం స్వపితి పిఙ్గలా

వాస్తవముగ ఎవనికి ఏ విధమైన ఆశలేదో అట్టివాడే హాయిగ నిద్రించును ఆశ లేకుండుటయే పరమ సుఖము చూడుము, ఆశను నిరాశారూపమున పరిణత మొనర్చి పింగళయనునామె సుఖముగ నిద్రింపగల్గెను

బ్రాహ్మణుని యొక్క ఆ వాతోపదేశమును విని సేనజిత్ రాజు యొక్క చిత్తము స్థిరత్వము పొందెను అతడు శోకమును విడిచి సుఖముగ నుండెను ఎమ్మట భీష్ముడు తన యొక్క శ్రేయస్సును అభిలషించు మానవుడు ఏమి చేయవలెనో ఆ విషయమును గూర్చి ఒకానొక కుమారుడు తన తండ్రికి చెప్పిన వాక్యములను ఉటంకించెను పూర్వము ఒకానొక బ్రాహ్మణునకు మేధావి యను పుత్రుడుండెను అతడు తన తండ్రి కిట్లు బోధించెను —

పుత్ర ఉవాచ

277 మృత్యునాభ్యాహతో లోకో జరయా పరివారితః
అహోరాత్రాః పతన్త్యేతే నను కస్మాన్న బుధ్యసే

(పుత్రుడు తండ్రికి ఇట్లు బోధించెను —)

ఈ ప్రపంచమంతయు మృత్యువుచే వినాశమొనర్పబడు చున్నది వార్ధక్యము మానవుని నలువైపుల చుట్టివేయుచున్నది ఈ రాత్రింబగళ్ళు ప్రాణుల యొక్క ఆయుస్సును అపహరించు చున్నవి ఈ విషయమును మీరేల తెలిసికొనుట లేదు ?

278 అమోఘా రాత్రయశ్చాపి నిత్యమాయాన్తి యాన్తి చ
యదాహమేతజ్జానామి న మృత్యుస్తిష్ఠతీతి హ
సోఽహం కథం ప్రతీక్షిష్యే జాలేనాపి హతశ్చరన్

అమోఘములగు ఈ రాత్రులు వచ్చుచున్నవి పోవుచున్నవి మృత్యువు క్షణకాలమైనను ఆగదనియు దాని వలలో చిక్కుకొని నేను చరించుచున్నాననియు నేను తెలిసికొనినపుడు ఇక నేను కొంచెము సేపైనను ఎట్లు ప్రతీక్షించగలను ? (దైవచింతన చేయక ఉండగలను ?)

279 రాత్ర్యాం రాత్ర్యాం వ్యతీతాయామాయురల్పతరం యదా
గాధోదకే మత్స్య ఇవ సుఖం విన్దేత కస్తదా

ఎప్పుడు ఒక్కొక్క రాత్రి గడచిన కొలది ఆయుస్సు తగ్గిపోవుచున్నదో అప్పుడిక కొలది జలమందున్న చేపవలె ఎవడు సుఖము నొందగలడు ?

280 (యస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం న కించిచ్ఛుభమాచరేత్)
తదైవ వన్ధ్యం దివసమితి విద్యాద్ విచక్షణః
అనవాప్తేషు కామేషు మృత్యురభ్యేతి మానవమ్

శుభకర్మచేయక ఒక్క రాత్రియైనను గడచినచో ఆ దినము వ్యర్థమై పోయినదని బుద్ధిమంతులు తలంచవలెను మనుజుని కోరికలు పూర్తికాకమునుపే మృత్యువు వాని యొద్దకు వచ్చుచున్నది

281 శష్పాణీవ విచిన్వన్త మన్యత్రగతమానసమ్
వృకీవోరణమాసాద్య మృత్యురాదాయ గచ్ఛతి

గడ్డి మేయుచున్న గొఱ్ఱెను పెద్ద పులి అకస్మాత్తుగ మీద పడి కొనిపోవునట్టు మనుజుని మనస్సు మఱియొకవైపు లగ్నమైయుండ అపుడు అకస్మాత్తుగ మృత్యువు వచ్చి అతనిని గొనిపోవుచున్నది

282 అద్యైవ కురు యచ్ఛ్రేయో మా త్వాం కాలోఽత్యగాదయమ్
అకృతేష్వేవ కార్యేషు మృత్యుర్వై సమ్ప్రకర్షతి

కావున శుభకార్యమును నేడే చేసివేయుము మీ యొక్క ఈ సమయము చేతి నుండి జారిపోకుండుగాక ఏలయనిన పని యంతయు సగముకానే నిలచిపోవును మృత్యువు వచ్చి ఈడ్చుకొని పోవును

283 శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్
న హి ప్రతీక్షతే మృత్యుః కృతమస్య న వా కృతమ్

రేపు చేయవలసిన పనిని ఈరోజే చేయవలెను మధ్యాహ్నము చేయవలసిన పనిని ప్రొద్దునే చేయవలెను ఏలయనిన మృత్యువు ఈతని పని పూర్తి అయినదా లేదా యని చూడదు

284 కో హి జానాతి కస్యాద్య మృత్యుకాలో భవిష్యతి
స మృత్యునా మన్త్ర్యతే హర్తుం కామో జగత్ప్రభుః
అబుద్ధ ఏవాక్రమతే మీనా మీనగ్రహో యథా

ఎవని మృత్యుకాలము నేడే సంభవించునమో ఎవడెఱుగ గలడు? సమస్త జగత్తుపై అధికారము గలవు మృత్యువు ఎవనినైన హరించి తీసికొని పోవునపుడు ముందుగా ఆహ్వానము పంపదు జాలరి వాడు అకస్మాత్తుగా వచ్చి నీటిలోని చేపలను పట్టుకొని పోవునట్లు మృత్యువు కూడ అజ్ఞాతముగ నుండి ఆక్రమణము సలుపుచున్నది

285 యువైవ ధర్మశీలః స్యాదనిత్యం ఖలు జీవితమ్
కృతే ధర్మే భవేత్ కీర్తిరిహ ప్రేత్య చ వై సుఖమ్

కావున యౌవనమందే సర్వులు ధర్మమును ఆచరించవలెను జీవితము నిస్సందేహముగ అనిత్యమైయున్నది ధర్మాచరణముచే ఈ లోకమున మనుజుని కీర్తి వ్యాపించుచున్నది పరలోకమున సుఖము కలుగుచున్నది

286 ఇదం కృతమిదం కార్యమిదమన్యత్ కృతాకృతమ్
ఏవమీహా సుఖాసక్తం కృతాన్తః కురుతే వశే

ఈ పని పూర్తి అయినది ఈ పని చేయవలెను ఈ పని సగము అయినది — అని ఇట్లు మనుజుడు తలంచుచున్నాడు ఇట్టి చేష్టాజనిత సుఖమందాసక్తుడై యున్న అతనిని మృత్యువు తన వశమొనర్చుకొనుచున్నది

287 జాతమేవాన్తకోఽన్తాయ జరా చాన్వేతి దేహినమ్
అనుషక్తా ద్వయేనైతే భావాః స్థావరజఙ్గమాః

మనుజుడు పుట్టుటతోడనే మృత్యువు వార్ధక్యము అతని వెనువెంటనే ఉండుచున్నవి సమస్త చరాచర ప్రాణులు ఈ రెంటిచే బంధింపబడియున్నవి

288 అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితమ్
మృత్యు మాపద్యతే మోహాత్ సత్యేనాపద్యతేఽమృతమ్

అమృతము (మోక్షము) మృత్యువు — అను ఈ రెండును దేహమందు ప్రతిష్ఠితములై యున్నవి అజ్ఞానముచే మృత్యువును సత్యముచే అమృతత్వమును (మోక్షమును) జీవుడు పొందుచున్నాడు

289 సోఽహం హ్యహింస్రః సత్యార్థీ కామక్రోధ బహిష్కృతః
సమదుఃఖసుఖ క్షేమీ మృత్యుం హాస్యామ్య మర్త్యవత్

కావున ఇకనిపుడు నేను హింసను దూరీకరించి సత్యమును వెతకుదును కామక్రోధములను హృదయము నుండి తొలగించి సుఖదుఃఖములందు సమభావము గలిగియుందును సర్వులకు హితమొనర్చుచు దేవతలవలె మృత్యుభయము నుండి విముక్తుడనగుదును

290 నాస్తి విద్యాసమం చక్షుర్నాస్తి సత్యసమం తపః
నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం సుఖమ్

ప్రపంచమున జ్ఞానముతో సమానమైన నేత్రము లేదు సత్యముతో సమానమైన తపస్సు లేదు రాగము (ఆశ)తో సమానమైన దుఃఖము లేదు త్యాగముతో సమానమైన సుఖము లేదు

పుత్రుని ఆ సద్బోధను ఆలకించి తండ్రి సత్యధర్మములను అనుష్ఠింపసాగెను ఎమ్మట భీష్ముడు శంపాకుడను బ్రాహ్మణుడు తనకు త్యాగము యొక్క మహిమను గూర్చి చెప్పిన బోధను ధర్మరాజున కిట్లు వివరించి చెప్పెను —

భీష్మ ఉవాచ

291 అకించనః పరిపతన్ సుఖమాస్వాదయిష్యసి
అకించనః సుఖం శేతే సముత్తిష్ఠతి చైవ హి

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

వీరు అంతయు వదలి ఏ వస్తువు యొక్క సంగ్రహాణము గావింపనిచో ఎల్లెడల సంచరించుచున్నను సుఖమునే అనుభవించ గలరు ఏలయనగా అకించనుడై యుండువాడు ఏమియు లేనివాడు సుఖముగ నిద్రించును సుఖముగ మేల్కొనును

292 ఆకించన్యం సుఖం లోకే పథ్యం శివమనామయమ్
అనమిత్రపథో హ్యేష దుర్లభః సులభో మతః

ప్రపంచములో అకించనత్వమే (ఏమియు లేక యుండుటయే) సుఖము అదియే హితకరమును శ్రేయోదాయకమును నిరాపదమును అయి యున్నది ఈ మార్గమున శత్రువు కూడ మెదలడు అది దుర్లభమైనను సులభమే అయియున్నది.

293 అకించనస్య శుద్ధస్య ఉపపన్నస్య సర్వతః
అవేక్షమాణస్త్రీంల్లోకాన్ న తుల్యమిహ లక్షయే

నేను మూడు లోకములందును దృష్టిని ఉంచి చూచుచున్నాను నాకు అకించనుడు శుద్ధుడు అన్ని విధముల వైరాగ్య సంపన్నుడు— అగువానితో సమానమైన మఱియొకడెవడును కానుపించుట లేదు

294 ఆకించన్యం చ రాజ్యం చ తులయా సమతోలయమ్
అత్యరిచ్యత దారిద్ర్యం రాజ్యాదపి గుణాధికమ్

నేను అకించనత్వమును (ఏమియు లేకుండుటను) రాజ్యమును బుద్ధియను త్రాసునందుంచి తూచగా గుణములందధికమగుటచే అకించనత్వమే బరువుగా (శక్తివంతముగా) నున్నట్లు తేలినది

295 నైవాస్యాగ్నిర్న వారిష్టో న మృత్యుర్న చ దస్యవః
ప్రభవన్తి ధనత్యాగాద్ విముక్తస్య నిరాశిషః

మనుజుడు ధనమును త్యజించి దానిని గూర్చిన ఆసక్తిని వదలిన చో మనస్సునందు ఏ విధమైన కోరికయు లేనిచో, అతనిపై

అగ్ని యొక్క ప్రతాపము చెల్లనేరదు. అరిష్టకరములగు గ్రహాములు కాని, మృత్యువు కాని దొంగలు కాని అతనిని ఏమియు చేయజాలరు

296 నాత్యక్త్వా సుఖమాప్నోతి నాత్యక్త్వా విన్దతే పరమ్
నాత్యక్త్వా చాభయః శేతే త్యక్త్వా సర్వం సుఖీ భవ

ఎవడును త్యాగము చేయనిచో సుఖమును పొందడు. త్యాగము చేయనిచో పరమాత్మను పొందలేడు. త్యాగము చేయుచో నిర్భయముగ నిదురించ కేడు. కాబట్టి మీరు అంతయు వదలి సుఖవంతులు కండు

297 సర్వసామ్యమనాయాసం సత్యవాక్యం చ భారత
నిర్వేదశ్చావివిత్సా చ యస్యస్యాత్ స సుఖీ నరః

సర్వుల యెడల సమభావము వ్యర్థమగు పరిశ్రమ లేకుండుట, సత్యభాషణము ప్రపంచము యెడల వైరాగ్యము కర్మాస క్తి లేకుండుట — అను ఈ ఐదున్ను ఎవని యందుండునో, అతడు సుఖవంతుడగును

298 ఏతాన్యేవ పదాన్యాహుః పఞ్చ వృద్ధాః ప్రశాన్తయే
ఏష స్వర్గశ్చ ధర్మశ్చ సుఖం చానుత్తమం మతమ్

జ్ఞానవృద్ధులు ఈ ఐదింటిని శాంతికి కారణములుగా చెప్పుచున్నారు. ఇదియే స్వర్గము ఇదియే ధర్మము ఇదియే సర్వో త్తమ సుఖముగా తలంచబడినది

తరువాత భీష్ముడు ధనము యొక్క తృష్ణచే దుఃఖమును, దానిని త్యజించుటచే సుఖము కలుగునని మంకి చరిత్రను ఉదహరించుచు చెప్పెను. మంకి యను ముని ధనసంపాదనకై పెక్కు ప్రయత్నములను చేసి విఫలుడై తుదకు వైరాగ్యమును బొంది తన భావములను శ్లోకముల కిట్లు వెల్లడించెను —

299 యః కామానాప్నుయాత్ సర్వాన్ యశ్చైతాన్ కేవలాంస్త్యజేత్
ప్రాపణాత్ సర్వకామానాం పరిత్యాగో విశిష్యతే

(మంకి యను ముని వైరాగ్యము గలిగి యిటు చెప్పను —)

ఎవడు తన సమస్త కామనలను (కోరికలను) బడయునో ఎవడు సమస్త కామనలను కేవలము త్యజించివైచునో— ఈ ఇరువురి కార్యములలో సమస్త కామనలను పొందుట కంటె సమస్త కామనలను త్యజించుటయే శ్రేష్ఠము

300 నాన్తం సర్వవిధిత్సానాం గతపూర్వోఽస్తి కశ్చన
శరీరే జీవితే చైవ తృష్ణా మన్యస్య వర్ధతే

ఇంతవఱకు ఎవడును ధనాదుల కొఱకై కావించు ప్రవృత్తుల యొక్క అంతమును పొందలేకుండెను శరీరము కొఱకు జీవనము కొఱకు మూర్ఖునకే తృష్ణ పెరిగిపోవుచున్నది

301 నివర్తస్వ విధిత్సాభ్యః శామ్య నిర్విద్య కాముక
అసకృచ్చాసి నికృతో న చ నిర్విద్యసే తతః

కామనలకు (కోరికలకు) దాసుడవగు ఓ మనస్సా! నీవు చేష్టలన్నిటిని విడిచిపెట్టి వైరాగ్యపూర్వకముగ శాంతిని కలిగియుండుము నీవు ధనము కొఱకై చేష్టలు సలుపుచు మరల మరల మోసపోయితివి అయినను దాని యెడల నీకు వైరాగ్యము కలుగట లేదు

302 యది నాహం వినాశ్యస్తే యద్యేవం రమసే మయా
మా మాం యోజయ లోభేన వృథా త్వం విత్తకాముక

ధనమును గూర్చిన కోరికగల ఓ మనస్సా! నీవు నా యొక్క వినాశమును చేయని దానవైనచో నాతోగూడ ఆనందపూర్వకముగ నివసింపదలచుచో, నన్ను వ్యర్థముగ లోభమునందు తగుల్కొన నీయకుము

303 అహో ను మమ బాలిశ్యం యోఽహం క్రీడనకస్తవ
కిం నైవం జాతు పురుషః పరేషాం ప్రేష్యతామియాత్

ఆహా! నేను నీ చేతిలో కీలుబొమ్మగనైతిని — ఇదినా యొక్క ఎంత తెలివి తక్కువ తనము? కానిచో తెలివి గలవాడెవడైన ఇతరుల దాసత్వమును స్వీకరింపగలడా?

304 కామ జానామి తే మూలం సంకల్పాత్ కిల జాయసే
న త్వాం సంకల్పయిష్యామి సమూలో న భవిష్యసి

కామమా! నేను నీ యొక్క మూలమును తెలిసికొంటిని నిక్కముగ నీవు సంకల్పము నుండియే పుట్టుచున్నావు కావున ఇక మీదట నిన్ను నేను సంకల్పించను అత్తఱి నీవు సమూలముగ నశించిపోగలవు

305 ఈహా ధనస్య న సుఖా లబ్ధ్వా చిన్తా చ భూయసీ
లబ్ధనాశే యథా మృత్యుర్లబ్ధం భవతి నైవ వా

ధనమును కోర్చిన కోరిక, చేష్ట సుఖప్రదము కాదు ఒక వేళ ధనము లభించనను దాని రక్షణాదులకై చింత పెరిగిపోవును ఒకసారి లభించి నష్టమైనచో మృత్యువుతో సమానమైన గొప్ప కష్టము కలుగును ప్రయత్నము చేసినను ధనము లభించునో లేదో నిశ్చయమున్ను లేదు

306 యద్ యత్ త్యజతి కామానాం తత్ సుఖస్యాభిపూర్యతే
కామస్య వశగో నిత్యం దుఃఖమేవ ప్రపద్యతే

మనుజుడు ఏయే కామనలను (కోరికలను) త్యజించుచున్నాడో, వాని వాని త్యాగము వలన అతడు సుఖవంతుడగుచున్నాడు కోరికలకు వశుడగువాడు సదా దుఃఖమునే పొందును

307 కామానుబన్ధం నుదతే యత్ కించిత్ పురుషో రజః
కామక్రోధోద్భవం దుఃఖమహ్రీరరతిరేవ చ

303 అహో ను మమ బాలిశ్యం యో౽హం క్రీడనకస్తవ
కిం నైవం జాతు పురుషః పరేషాం ప్రేష్యతామియాత్

ఆహా! నేను నీ చేతిలో కీలుబొమ్మగనైతిని — ఇదినా యెక్క ఎంత తెలివి తక్కువ తనము? కానిచో తెలివి గలవాడెవడైన ఇతరుల దాసత్వమును స్వీకరింపగలడా?

304 కామ జానామి తే మూలం సంకల్పాత్ కిల జాయసే
న త్వాం సంకల్పయిష్యామి సమూలో న భవిష్యసి

కామమా! నేను నీ యొక్క మూలమును తెలిసికొంటిని నిక్కముగ నీవు సంకల్పము నుండియే పుట్టుచున్నావు కావున ఇక మీదట నిన్ను నేను సంకల్పించను అత్తఱి నీవు సమూలముగ నశించిపోగలవు

305 ఈహా ధనస్య న సుఖా లబ్ధ్వా చిన్తా చ భూయసీ
లబ్ధనాశే యథా మృత్యుర్లబ్ధం భవతి నాన వా

ధనమును కూర్చిన కోరిక, చేష్ట సుఖప్రదము కాదు ఒకవేళ ధనము లభించినను దాని రక్షణాదులకై చింత పెరిగిపోవును ఒకసారి లభించి నష్టమైనచో మృత్యువుతో సమానమైన గొప్ప కష్టము కలుగును ప్రయత్నము చేసినను ధనము లభించునో లేదో నిశ్చయమున్ను లేదు

306 యద్ యత్ త్యజతి కామానాం తత్ సుఖస్యాభిపూర్యతే
కామస్య వశగో నిత్యం దుఃఖమేవ ప్రపద్యతే

మనుజుడు ఏయే కామనలను (కోరికలను) త్యజించుచున్నాడో, వాని వాని త్యాగము వలన అతడు సుఖవంతుడగుచున్నాడు కోరికలకు వశుడగువాడు సదా దుఃఖమునే పొందును

307 కామానుబన్ధం నుదతే యత్ కించిత్ పురుషో రజః
కామక్రోధోద్భవం దుఃఖమహ్రీరరతిరేవ చ

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

రాజా! బోధ్యునకు తన గురువుల ద్వారా ఏ ఉపదేశము లభించెనో అది ఈ విధముగ నున్నది — ఆశ చాల ప్రబలమైనది అదియే సర్వులకు దుఃఖమును కలుగజేయుచున్నది నిరాశయే పరమ సుఖము ఆశను నిరాశారూపముగ పరిణత మొనర్చి పింగళ అనువేశ్య సుఖముగ నిదురించెను (ఆశాత్యాగమును గూర్చిన ఉపదేశమామెవలన లభించుటచే పింగళను బోధ్యుడు తన గురువుగా భావించెను)

311 సామిషం కురరం దృష్ట్వా వధ్యమానం నిరామిషైః
ఆమిషస్య పరిత్యాగాత్ కురరః సుఖమేధతే

తన ముక్కునందు మాంసపు ముక్కల నుంచకొని ఎగురుచున్న కురరపక్షిని చూచి ఇతర పక్షులు దానిని బాధింపదొడగెను అపుడది తన మాంసపు ముక్కను వదలిపెట్టెను అంతట ఇతర పక్షులు దానిని బాధింపక వదలివేసెను ఈ ప్రకారముగ మాంసపు ముక్కను వదలి కురరపక్షి సుఖముగ నుండెను (భోగముల పరిత్యాగమును గూర్చి తెలియజేయుటవలన కురరపక్షి గురువు అయ్యెను)

312 గృహారమ్భో హి దుఃఖాయ న సుఖాయ కదాచన
సర్పః పరకృతం వేశ్మ ప్రవిశ్య సుఖమేధతే

ఇల్లు కట్టుకొను ప్రయత్నము దుఃఖమునకు కారణమగుచున్నది దానిచే సుఖము లభించదు సర్పము ఇతరులు నిర్మించిన గృహమందు (బిలమందు) ప్రవేశించి సుఖముగ నుండుచున్నది (కేవలము గృహాదుల నిర్మాణమందే సమయమును శక్తిని ధారబోయకుమని సర్పము బోధించుచున్నది)

313 సుఖం జీవన్తి మునయో భైక్ష్యవృత్తిం సమాశ్రితాః
అద్రోహేణైవ భూతానాం సారంగా ఇవ పక్షిణః

సారంగపక్షులు ఏ ప్రాణితోను వైరము లేక భిక్షావృత్తిచే తమ జీవితమును గడపుకొనుచున్నవి. అట్లే మునులు ఏ ప్రాణికి ద్రోహము చేయక భిక్షావృత్తి నాశ్రయించి సుఖముగ జీవితమును గడపుచున్నారు. వైరము లేకుండుట (ద్రోహము చేయకుండుట) అను బోధ గావించుట వలన సారంగపక్షి గురువయ్యెను.

314 ఇషుకారో నరః కశ్చిదిషావాసక్తమానసః
సమీపేనాపి గచ్ఛన్తం రాజానం నావబుద్ధవాన్

బాణములు తయారుచేయు వాడొకడు తన కార్యమందు దత్తచిత్తుడై సమీపమున నుండి పోవుచున్న రాజు యొక్క ఊరేగింపును కూడ చూడకుండెను. (ఏకాగ్రతను బోధించుటవలన బాణకారుడు గురువయ్యెను)

315 బహూనాం కలహో నిత్యం ద్వయోః సంకథనం ధ్రువమ్
ఏకాకీ విచరిష్యామి కుమారీశంఖకో యథా

అనేకులు ఒక చోట ఉండుచో కలహము సంభవించును. ఇద్దరున్నప్పటికిని సంభాషణాదులు జరుగును. కాబట్టి కుమారి యొక్క చేతులకు గల ఒక్కొక్క కంకణము (గాజు) వలె ఏకాకిగ ఉండుట (ధ్యానాదులకు) శ్రేయస్కరము. (ఏక కంకణము ద్వారా ఏకాంతమును బోధించుటచే కుమారి గురువయ్యెను)

పిదప భీష్ముడు ధర్మరాజునకు ఇంద్ర, కాశ్యప సంవాదమును వివరించెను. పూర్వమొకపుడు ఇంద్రుడు కాశ్యపుడను మునితో ఈ ప్రకారముగ చెప్పెను —

316 మనుష్యా హ్యాఢ్యతాం ప్రాప్య రాజ్యమిచ్ఛన్త్యనన్తరమ్
రాజ్యాద్ దేవత్వమిచ్ఛన్తి దేవత్వాదిన్ద్రతామపి

(ఇంద్రుడు కాశ్యపముని ఇట్లు చెప్పెను —)

మనుజులు ధనవంతులైనచో రాజ్యమును పొంద నభిలషించు చున్నారు రాజ్యమును పొందినచో దేవత్వమును కోరుచున్నారు దేవత్వమును పొందినచో ఇంద్ర పదవిని పొందగోరుచున్నారు (జనుల ఆశకు అంతులేదు)

317 న తృప్తిః ప్రియలాభేఽస్తి తృష్ణా నాద్భిః ప్రశామ్యతి
సంప్రజ్వలతి సా భూయ సమిద్భిరివ పావకః

ప్రియవస్తువులను పొందుటచే తృప్తి ఎన్నడును కలుగదు పెరుగుచున్న తృష్ణ నీటిచే చల్లారదు కట్టెలు వేయుచుండుటచే వృద్ధి నొందు అగ్నివలె (విషయసేవనముచే) తృష్ణ ఇంకను పెరిగి పోవును

318 పరిచ్ఛిద్యైవ కామానాం సర్వేషాం చైవ కర్మణామ్
మూలం బుద్ధీన్ద్రియ గ్రామం శకున్తానివ పఞ్జరే

బుద్ధి ఇంద్రియములు కోరికలన్నిటికిని కర్మలన్నిటికిని మూలము వానిని పంజరమందు పక్షులవలె తన వశమందుంచు కొనినచో ఇక ఏ భయమున్ను ఉండదు

319 ఆత్మనానర్థయుక్తేన పాపే నివిశతే మనః
స్వకర్మకలుషం కృత్వా కృచ్ఛ్రే లోకే విధీయతే

కామక్రోధాది దోషములతో కూడిన బుద్ధి యొక్క ప్రేరణచే మనస్సు పాపకర్మయందు ప్రవృత్తమగుచున్నది ఈ ప్రకారము మనుజుడు తన యొక్క యే కార్యముల ద్వారా పాపము చేసి దుఃఖమయములగు లోకములందు (నరకములందు) పడుచున్నాడు

320 బాలో యువా చ వృద్ధశ్చ యత్ కరోతి శుభాశుభమ్
తస్యాం తస్యామవస్థాయాం తత్ ఫలం ప్రతిపద్యతే

ఆవుదూడ వేలకొలది ఆవులలో తన తల్లిని గుర్తించి దానిని పొందునట్లు ఇదివఱకు చేయబడిన కర్మయు తన కర్త యొద్దకు చేరుచున్నది

321 సమున్నమగ్రతో వస్త్రం పశ్చాచ్ఛుద్ధ్యతి కర్మణా
ఉపవాసైః ప్రతప్తానాం దీర్ఘం సుఖమనన్తకమ్

క్షారాదులందు నానబెట్టబడిన వస్త్రమును తదుపరి ఉతుకుటచే శుద్ధపడునట్లు ఉపవాసపూర్వకముగ తపస్సు చేయువారికి ఎన్నడును సమాప్తము కాని గొప్ప సుఖము లభించును

తదుపరి భీష్ముడు భృగు భరద్వాజ సంవాదమును తెలియజేసెను పూర్వము భరద్వాజుడు జగదుత్పత్తి మొదలైన విషయములను గూర్చి ప్రశ్నింప భృగుమహర్షి యిట్లు వచించెను —

భృగురువాచ
322 న పశ్చ సాధారణమత్ర కించి
చ్ఛరీరమేకో వహతేఽన్తరాత్మా
స వేత్తి గన్ధాంశ్చ రసాన్ శ్రుతీశ్చ
స్పర్శంచ రూపం చ గుణాశ్చ యేఽన్యే

(భృగుమహర్షి భరద్వాజున కిట్లు చెప్పెను —)

మునీ! మనస్సు డ పాంచభౌతికమైన దే కావున అది పంచభూతములకంటె వేఱైన తత్త్వము కాదు ఒక్క అంతరాత్మయే ఈ శరీరము యొక్క భారమును వహించుచున్నది అదియే రూప రస, గంధ స్పర్శ శబ్దములను ఇంకను ఇతర గుణములను అనుభవించుచున్నది

323 పాఞ్చాత్మకే పఞ్చగుణప్రదర్శీ
స సర్వగాత్రానుగతోఽన్తరాత్మా
స వేత్తి దుఃఖాని సుఖాని చాత్ర
తద్విప్రయోగాత్ తు న వేత్తి దేహః

ఆ అంతరాత్మ పంచేంద్రియముల గుణములను ధరించు మనస్సు యొక్క ద్రష్ట అయియున్నది మరియు అదియే ఈ పాంచభౌతిక శరీరము యొక్క సమస్త ఇంద్రియములందును వ్యాపించి సుఖ దుఃఖములను అనుభవించుచున్నది ఎపుడు దానికి శరీరముతోటి సంబంధము వదలిపోవుచున్నదో అపుడీ శరీరమునకు సుఖదుఃఖముల అనుభవము కలుగదు (దీనిచే మనస్సు యొక్క సాక్షియగు ఆత్మ యొక్క సమస్త సత్త స్వతఃసిద్ధమైనదని తోచుచున్నది)

324 ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః
తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః

ఆత్మ ప్రాకృత గుణములతో కూడియున్నచో అపుడు దానిని క్షేత్రజ్ఞుడని చెప్పెదరు ఆ గుణముల నుండి విముక్తమైనపుడు అదియే పరమాత్మ యని చెప్పబడుచున్నది

325 ఆత్మానం తం విజానీహి సర్వలోక హితాత్మకమ్
తస్మిన్ యః సంశ్రితో దేహే హ్యబ్బిన్దురివ పుష్కరే

మీరు క్షేత్రజ్ఞుని ఆత్మయనియే తలంచుడు అది సర్వలోక హితకారియై యున్నది ఈ శరీరమందు ఉండియు అది తామరాకు పైని జలబిందువు వలె వాస్తవముగ దానికంటె వేఱుగనే ఉన్నది

326 న జీవనాశోఽస్తి హి దేహభేదే
మిథ్యైతదాహుర్మ్రియత ఇత్యబుద్ధాః
జీవస్తు దేహాన్తరితః ప్రయాతి
దశార్ధతైవాస్య శరీరభేదః

దేహము నశించినను జీవుడు నశింపడు జీవుడు మరణించినాడని చెప్పువారు అజ్ఞానులు వారు చెప్పునది మిథ్య అయియున్నది జీవుడు ఈ మృతదేహమును వదలి వేఱొక శరీరమును గ్రహించు

చున్నాడు శరీరము యొక్క పంచతత్త్వములు వేఱు వేఱగుటయే శరీరము యొక్క నాశము

327 ఏవం సర్వేషు భూతేషు గూఢశ్చరతి సంవృతః
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా తత్త్వదర్శిభిః

ఈ ప్రకారముగ ఆత్మ సమస్త ప్రాణులందు వారి హృదయ గుహాయందు నిగూఢముగ దాగియున్నది అది తత్త్వదర్శులద్వారా తీక్ష్ణసూక్ష్మబుద్ధిచే సాక్షాత్కరింపబడుచున్నది

328 తం పూర్వాపరరాత్రేషు యుఞ్జానం సతతం బుధః
లఘ్వాహారో విశుద్ధాత్మా పశ్యత్యాత్మానమాత్మని

ఏ బుద్ధిమంతుడు మితాహారమును స్వీకరించుచు రాత్రి యొక్క మొదటి చివరి భాగములందు సదా ధ్యానమును అభ్యాసము చేయునో (ఆత్మానుభూతికై యత్నము చేయునో) అతడు అంతఃకరణము శుద్ధమైన ఎడల తన హృదయమందే ఆత్మ యొక్క సాక్షాత్కారమును బడయు చున్నాడు

329 చిత్తస్య వా ప్రసాదేన హిత్వా కర్మ శుభాశుభమ్
ప్రసన్నాత్మాఽఽత్మని స్థిత్వా సుఖమానన్త్య మశ్నుతే

చిత్తము శుద్ధమైన ఎడల అది శుభాశుభ కర్మలతో తన సంబంధమును వదలుకొని ప్రసన్నమై ఆత్మస్వరూపమున స్థితిని పొందుచున్నది మఱియు అనంతానందమును అనుభవించుచున్నది

330 సర్వోపాయైస్తు లోభస్య క్రోధస్య చ వినిగ్రహః
ఏతత్ పవిత్రం జ్ఞానానాం తథా చైవాత్మసంయమః

అన్ని ఉపాయములచేతను లోభమును క్రోధమును జయించవలెను ఇదియే జ్ఞానములలో పవిత్రమైన జ్ఞానము ఇదియే ఆత్మ సంయమము అయియున్నది

**331** వార్యో సర్వాత్మనా తౌ హి శ్రేయోఘాతార్థముచ్ఛ్రితౌ
నిత్యం క్రోధాచ్ఛ్రియం రక్షేత్ తపో రక్షేచ్చ మత్సరాత్
విద్యాం మానాపమానాభ్యామాత్మానం తు ప్రమాదతః

క్రోధము లోభము మనుజుని శ్రేయస్సునకు బాధ కలుగ జేయుటకై సదా సిద్ధముగ నున్నవి కాబట్టి యీవిచ్ఛక్తిని వినియోగించి ఆ రెంటిని నివారించవలెను ధనసంపత్తిని క్రోధము యొక్క ఆఘాతము నుండి రక్షించవలెను తపస్సును మాత్సర్యము యొక్క ఆఘాతము నుండి రక్షించవలెను అట్లే విద్యను మాన అపమానము నుండియు తన్నుతాను ప్రమత్తత (సోమరితనము) యొక్క ఆక్రమణము నుండియు రక్షించుకొనవలెను

**332** నిర్వేదాదేవ నిర్వాణం న చ కిఞ్చిద్ విచిన్తయేత్
సుఖం వై బ్రాహ్మణో బ్రహ్మ నిర్వేదేనాధిగచ్ఛతి

వైరాగ్యముచే నిర్వాణపదము (మోక్షము) లభించుచున్నది ఆ వైరాగ్యమును పొంది మనుజుడు ఇతరమైన అనాత్మపదార్థమును చింతన చేయకుండను బ్రహ్మనిష్ఠుడు ప్రపంచమున వైరాగ్యము కలిగిన మీదట సుఖస్వరూపముగ పరమాత్మను పొందుచున్నాడు

**333** సత్యం బ్రహ్మ తపః సత్యం సత్యం విసృజతే ప్రజాః
సత్యేన ధార్యతే లోకః స్వర్గం సత్యేన గచ్ఛతి

సత్యమే బ్రహ్మము సత్యమే తపస్సు సత్యమే ప్రజాసృష్టి కావించుచున్నది సత్యము యొక్క ఆధారము పైననే ప్రపంచము నిలిచియున్నది సత్యము యొక్క ప్రభావముచేతనే మనుజుడు స్వర్గమున కేగుచున్నాడు

**334** అనృతం తమసో రూపం తమసా నీయతే హ్యధః
తమోగ్రస్తా న పశ్యన్తి ప్రకాశం తమసాఽఽవృతాః

అసత్యము అంధకారస్వరూపము అది మనుజని క్రిందకు పడ ద్రోయుచున్నది అజ్ఞానాంధకారముచే చుట్టబడిన మనుజుడు తమోగుణముచే గ్రసింపబడి జ్ఞానప్రకాశమును చూడజాలకున్నాడు

335 తత్ర యత్ సత్యం స ధర్మో యో ధర్మః స
ప్రకాశో యః ప్రకాశస్తత్ సుఖమితి తత్ర
యదనృతం సోఽధర్మో యోఽధర్మస్తత్ తమోయత్
తమస్తద్ దుఃఖమితి

ఏది సత్యమో అదియే ధర్మము ఏది ధర్మమో అదియే ప్రకాశము ఏది ప్రకాశమో అదియే సుఖము అట్లే అసత్యమే అధర్మము అధర్మమే అంధకారము అంధకారమే దుఃఖము

336 హుతేన శామ్యతే పాపం స్వాధ్యాయైః శాన్తిరుత్తమా
దానేన భోగానిత్యాహుస్తపసా స్వర్గమాప్నుయాత్

హోమాది పుణ్యకార్యములచే పాపము శమించును స్వాధ్యాయముచే ఉత్తమశాంతి లభించును దానముచే సంపదప్రాప్తి చెప్పబడినది తపస్సుచే మనుజుడు స్వర్గలోకమును పొందును

శ్లోకౌ చాత్ర భవత

337 వాత్సల్యాత్సర్వభూతేభ్యో వాచ్యాః శ్రోత్ర సుఖా గిరః
పరితాపోపఘాతశ్చ పారుష్యం చాత్ర గర్హితమ్

ఈ విషయమున ఈ రెండు శ్లోకములు ప్రసిద్ధమైయున్నవి —

ప్రాణుల యెడల స్నేహము నిండియున్నట్లును, వినునపుడు చెవులకు ఆనందముగ నుండునట్లును మాట్లాడవలెను ఇతరులకు బాధ కలుగజేయుట వారిని కొట్టుట కటువచనములను పలుకుట—అనునవి నిషిద్ధములైయున్నవి

338 అవజ్ఞానమహంకారో దమ్భశ్చైవ విగర్హితః
అహింసా సత్యమక్రోధః సర్వాశ్రమగతం తపః

ఇతరులను అనాదరించుట అహంకారము వ్యక్తము చేయుట డంబము—అను ఈ దుర్గుణములు లెస్సగ గర్హింపబడినవి ఏ ప్రాణిని హింసింపకుండుట సత్యము పలుకుట మనస్సునందు క్రోధమును రానీయకుండుట — అన్ని ఆశ్రమములవారికి ఉపయోగమైన తపస్సు అయియున్నది

అట పిమ్మట భీష్ముడు ధర్మరాజున కిట్లు బోధించెను —

భీష్మ ఉవాచ

339 సాయం ప్రాతర్మనుష్యాణామశనం వేదనిర్మితమ్
నాన్తరా భోజనం దృష్టముపవాసీ తథా భవేత్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

మనుజులు ప్రాత కాలమున సాయంకాలము రెండువేళలందే భోజనము చేయులాగున శాస్త్రమునందు చెప్పబడినది మధ్యలో భోజనము చేయు విధి అచట చెప్పబడలేదు ఈ నియమమును పాలించువానికి ఉపవాసము చేసిన ఫలము లభించును

340 తీర్థానాం హృదయం తీర్థం శుచీనాం హృదయం శుచిః
సర్వమార్యకృతం చౌక్ష్యం వాలసంస్పర్శనాని చ

తీర్థములలో శ్రేష్ఠతీర్థము పవిత్ర హృదయము పవిత్ర వస్తువులలో అతి పవిత్రమైనది విశుద్ధ హృదయమే శిష్టుడు దేనిని ఆచరించునో అట్టి ఆచరణయే సర్వశ్రేష్ఠమైనది గోవు యొక్క తోక యందలి రోమముల స్పర్శనము పవిత్రమైనది

341 పాపం కృతం న స్మరతీహ మూఢో
వివర్తమానస్య తదేతి కర్తుః
రాహుర్యథా చన్ద్రముపైతి చాపి
తథాబుధం పాపముపైతి కర్మ

మూర్ఖుడు తాను చేసిన పాపమును జ్ఞాపకముంచుకొనుట లేదు కాని పాపము చేసిన కర్త యొక్క ఆ పాపము స్వయముగనే అతని వెంట వచ్చును రాహువు చంద్రుని యొద్దకు స్వయముగనే వచ్చునట్లు ఆ మూఢుని యొద్దకు అతని పాపము కూడ వచ్చి చేరుచున్నది

342 ఎక ఏవ చరేద్ ధర్మం నాస్తి ధర్మే సహాయతా
కేవలం విధిమాసాద్య సహాయః కిం కరిష్యతి

కేవలము వేదవిధిని సహాయముగ గైకొని మనుజుడు ఒంటరిగనే ధర్మమును ఆచరించవలెను దానియందు ఒకరి సహాయమవసరము లేదు వేరొక సహాయకుడు వచ్చి ఏమి చేయగలడు?

343 ధర్మో యోనిర్మనుష్యాణాం దేవానామమృతం దివి
ప్రేత్యభావే సుఖం ధర్మాచ్ఛశ్వత్తైరుపభుజ్యతే

ధర్మమే మనుజులకు మూలము అదియే స్వర్గమున దేవతల యొక్క అమృతము ధర్మాత్ముడగువాడు మరణించిన ఎదప ధర్మము యొక్క బలముచే సదా సుఖమును అనుభవించును

344 ఇతి తన్మయమేవైతత్ సర్వం స్థావరజఙ్గమమ్
ప్రలీయతే చోద్భవతి తస్మాన్నిర్దిశ్యతే తథా

ఈ చరాచర ప్రపంచమంతయు బుద్ధి ఉదయించిన మీదట ఉత్పన్నమగుచున్నది బుద్ధి లయింప ప్రపంచమున్ను లయించిపోవు చున్నది కావున ఈ ప్రపంచమంతయు బుద్ధిమయమైయున్నది అందుచే శ్రుతియు ప్రపంచము బుద్ధిరూపమని వచించినది

345 ప్రీతిః సత్త్వం రజః శోకస్తమో మోహస్తు తే త్రయ
యే యే చ భావా లోకేఽస్మిన్ సర్వేష్వేతేషు వైత్రిషు

ప్రసన్నత్వము సత్త్వగుణము యొక్క కార్యము శోకము రజోగుణరూపము మోహము తమోగుణరూపము ఈ ప్రపంచమున

ఏ యే భావములు కల అవి యన్నియు ఈ మూడింటికి అంతర్గతములై యున్నవి

346 న గుణా విదురాత్మానం స గుణాన్ వేత్తి సర్వశః
పరిద్రష్టా గుణానాం తు సంస్రష్టాన్మన్యతే తథా

సత్త్వాది గుణములు జడములగుటచే ఆత్మను తెలిసికొనజాలవు ఆత్మ చైతన్యముగ టచే ఈ ణములను సర్వవిధముల తెలిసికొను చున్నది ఆత్మ ఈ గుణములకు సాక్షి కావున వానికంటె వేఱుగ నున్నను (జీవుని అజ్ఞానదశలో) తన్ను వానితో కలసిన దానినిగ భావించుచున్నది

347 ఇన్ద్రియైస్తు ప్రదీపార్థం కురుతే బుద్ధి సప్తమైః
నిర్విచేష్టై రజానద్భిః పరమాత్మా ప్రదీపవత్

కుండ యందుంచబడిన దీపము ఆ కుండ యొక్క రంధ్రముల నుండి తన ప్రకాశమును వ్యాపింపజేసి వస్తువుల యొక్క జ్ఞానము కలుగజేయునటు ఆత్మ శరీరములో నుండి చేష్టా జ్ఞాన శూన్యములగు ఇంద్రియములు మనస్సు బుద్ధి — అను ఈ ఏడింటి ద్వారా సమస్త పదార్థముల యొక్క అనుభవమును గావింపజేయుచున్నది

348 త్యక్త్వా యః ప్రాకృతం కర్మ నిత్యమాత్మ రతిర్మునిః
సర్వభూతాత్మ భూతస్స్మాత్ స గచ్ఛేదుత్తమాం గతిమ్

ఎవడు సాంసారిక కార్యములను పరిత్యజించి సదా తన (ఆత్మ) యందే తాను అనురక్తుడై యుండునో అట్టి మనన శీలుడగు ముని సమస్త భూతకోట్ల యొక్క ఆత్మయై పరమగతిని పొందును

349 ఇతీమం హృదయగ్రన్థిం బుద్ధిభేదమయం దృఢమ్
విముచ్య సుఖమాసీత న శోచేచ్ఛిన్న సంశయః

బుద్ధి ద్వారా కల్పింపబడిన భేదమే హృదయము యొక్క గట్టి ముడి (గ్రంథి) దానిని ఛేదించి సంశయరహితుడై జ్ఞానవంతుడు సుఖముగ నుండుగాక! ఇతరుడును దుఃఖించకుండుగాక!

350 మహానద్యాం హి పారజ్ఞస్తప్యతే న తదన్యథా
న తు తప్యతి తత్త్వజ్ఞః ఫలే జ్ఞాతే తరత్యుత

మహానది యొక్క ఒడ్డును తెలియనివాడు కేవలము తెలిసికొనుట మాత్రముచే కృతకృత్యుడు కానేరడు. నావ మున్నగు వానిద్వారా ఆ నదిని దాటి ఒడ్డు చేరనంతవరకు అతడు చింతాగ్రస్తుడై యుండును. కాని తత్త్వజ్ఞాన మాత్రముచేతనే ఈ సంసార సాగరమును దాటివేయుచున్నాడు. అతనికి సంతాపమేమియు కలుగుటలేదు. ఏలయనిన ఆ జ్ఞానమే స్వయముగ వారధి వంటిది.

351 ఏవం యో విదురాధ్యాత్మం కేవలం జ్ఞానముత్తమమ్
ఏతాం బుద్ధ్వా నరః సర్వాం భూతానామాగతిం గతిమ్
అవేక్ష్య చ శనైర్బుద్ధ్యా లభతే శమనం తతః

ఎవడు బుద్ధిచే జీవుల యొక్క ఈ జనన మరణములను గూర్చి నెమ్మదిగ విచారణచేసి విశుద్ధ ఉత్తమ ఆత్మజ్ఞానమును పొందునో, అతడు పరమశాంతిని బడయును.

352 త్రివర్గో యస్య విదితః ప్రేక్ష్య యశ్చ విముఞ్చతి
అన్విష్య మనసా యుక్తస్తత్త్వదర్శీ నిరుత్సుకః

ఎవనికి అర్థకామాదులను గూర్చిన సరియైన జ్ఞానము కలదో, ఎవడు బాగుగ విచారించి వానిని పరిత్యజించునో (దృశ్యభావన చేయునో) ఎవడు మనస్సు ద్వారా ఆత్మతత్త్వమును అనుసంధానమొనర్చి, యోగయుక్తుడై యుండునో ఆత్మకంటె వేరైన వస్తువులందు ఉత్సుకత్వమును వదలివేయునో అతడే తత్త్వదర్శి

353 విషయేభ్యో నమస్కుర్యాద్ విషయాన్న చ భావయేత్
సామ్యముత్పాద్య మనసా మనస్యేవ మనో దధత్

విషయములకు ఎల్లరము నుండియే నమస్కరించవలెను (వానిని త్యజించవలెను) ఎన్నడును వానిని మనస్సునందు చింతన చేయరాదు మనస్సుతో సమత్వమును భావించి మనస్సును మనస్సునందే లయింపజేయవలెను

అనంతరము భీష్ముడు మనువు బృహస్పతికి చెప్పిన ఆత్మబోధను తెలియజేసెను పూర్వము మనువు బృహస్పతికిట్లు బోధించెను —

మనురువాచ

354 న స్త్రీ పుమాన్ నాపి నపుంసకం చ
న సన్న చాసత్ సదసచ్చ తన్న
పశ్యన్తి యద్ బ్రహ్మవిదో మనుష్యా
స్తదక్షరం న క్షరతీతి విద్ధి

(మనువు బృహస్పతితో ఇట్లు చెప్పెను —)

ఆత్మ స్త్రీ కాదు పురుషుడు కాదు, నపుంసకుడు కాదు (దృశ్య) సత్తు కాదు, అసత్తు కాదు సదసత్తు (ఉభయ రూపము) కాదు బ్రహ్మజ్ఞానులే దానిని సాక్షాత్కరించుకొనుచున్నారు అది యెపుడును క్షయము కాదు కావుననే ఆ అవినాశియగు పరబ్రహ్మ పరమాత్మ అక్షరమని చెప్పబడుచున్నది ఈ విషయమును బాగుగ తెలిసికొనుడు

355 యథా చ కశ్చిత్ పరశుం గృహీత్వా
ధూమం న పశ్యేజ్జ్వలనం చ కాష్ఠే
తద్వచ్ఛరీరోదరపాణి పాదం
ఛిత్త్వా న పశ్యన్తి తతో యదన్యత్

గొడ్డలి తీసికొని కట్టెలను చీల్చినచో దానియందు అగ్నిగాని పొగగాని కన్పించుట లేదు అట్లే శరీరమును చీల్చినగాని చేతులు కాళ్ళు నఱికిన గాని శరీరము కంటె వేరైన అంతరాత్మను ఎవడును దానియందు గాంచుట లేదు

356 తాన్యేవ కాష్ఠాని యథా విమథ్య
ధూమం చ పశ్యేజ్జ్వలనం చ యోగాత్
తద్వత్ సబుద్ధిః సమమిన్ద్రియాత్మా
బుధః పరం పశ్యతి తం స్వభావమ్

కాని ఆ కట్టెలనే యుక్తిపూర్వకముగ మథించినచో వాని యందు అగ్ని పొగ కనుపించుచున్నవి అట్లే యోగము ద్వారా మనస్సు ఇంద్రియములను బుద్ధి సహితముగ ఏకాగ్ర పఱచి బుద్ధి మంతుడగు జ్ఞాని వీని యన్నిటికంటె పరమ శ్రేష్ఠమగు జ్ఞానమును ఆత్మను సాక్షాత్కరించుకొనుచున్నాడు.

357 యథాత్మనోఽఙ్గం పతితం పృథివ్యాం
స్వప్నాన్తరే పశ్యతి చాత్మనోఽన్యత్
శ్రోత్రాదియుక్తః సుమనాః సుబుద్ధి
ర్లిఙ్గాత్తథా గచ్ఛతి లిఙ్గమన్యత్

స్వప్నమందు మనుజుడు తన శరీరము యొక్క విరిగిన అవయవమును తన కంటె వేఱుగ భూమిపై పడియున్నట్లు చూచు విధమున దశేంద్రియములు పంచప్రాణములు, మనస్సు బుద్ధి — అను ఈ పదునేడు తత్త్వముల సముదాయము యొక్క అభిమాని శుద్ధ మనస్సు బుద్ధికల మనుష్యుడు శరీరమును తన కంటె వేఱుగ తెలిసికొనవలెను అట్లు తెలిసికొననివాడే ఒక శరీరము నుండి మఱి యొక శరీరమును పొందుచుండును (పెక్కు జన్మలను బడయు చుండును)

358 ఉత్పత్తి వృద్ధి వ్యయం సంనిపాతై
ర్న యుజ్యతేఽసౌ పరమః శరీరీ
అనేన లింగేన తు లింగమన్యద్
గచ్ఛత్యదృష్టః ఫలసంనియోగాత్

ఆత్మ శరీరము కంటె సర్వదా భిన్నమైనది అది దీని ఉత్పత్తి వృద్ధి క్షయము మృత్యువు మున్నగు దోషములతో ఎన్నడును అంటదు కాని అజ్ఞాని పూర్వకృత కర్మల ఫలము యొక్క సంబంధముచే సూక్ష్మశరీరసహితముగ మఱియొక శరీరమందు ప్రవేశించుచున్నాడు

359 న చక్షుషా పశ్యతి రూపమాత్మనో
న చాపి సంస్పర్శముపైతి కించిత్
న చాపి తైః సాధయతే తు కార్యం
తే తం న పశ్యన్తి స పశ్యతే తాన్

ఎవడును ఈ చర్మనేత్రముచే ఆత్మస్వరూపమును చూడజాలడు తన చర్మముచే ఆత్మను తాకజాలడు ఇంద్రియములచే ఆత్మను తెలిసికొను ఏ కార్యమున్ను చేయబడజాలదు ఈ ఇంద్రియములు ఆత్మను చూడజాలవు కాని ఆత్మ ఆ ఇంద్రియాదులన్నిటిని చూచుచున్నది.

360 న హి ఖల్వనుపాయేన కశ్చిదర్థోఽభిసిద్ధ్యతి
సూత్రజాలైర్యథా మత్స్యాన్ బధ్నన్తి జలజీవినః

361 మృగైర్మృగాణాం గ్రహణం పక్షిణాం పక్షిభిర్యథా
గజానాం చ గజైరేవ జ్ఞేయం జ్ఞానేన గృహ్యతే

సరియైన ఉపాయము కావించనిచో ఏ ప్రయోజనమున్ను సిద్ధించదు చేపలు పట్టువాడు వల ద్వారా చేపలను పట్టుచున్నాడు అట్లే మృగముల ద్వారా మృగములను, పక్షుల ద్వారా పక్షులను,

ఏనుగుల ద్వారా ఏనుగులను పట్టుకొనుచున్నారు ఆ ప్రకారమే జ్ఞేయవస్తువగు ఆత్మ జ్ఞానము ద్వారా పొందబడుచున్నది

362 యథా చన్ద్రో హ్యమావాస్యామలిఙ్గత్వాన్న దృశ్యతే
న చ నాశోఽస్య భవతి తథా విద్ధి శరీరిణమ్

చంద్రుడు అమావాస్య యందు కనుపించడు అయినను ఆ సమయమున అతడు నశించుట లేదు అట్లే శరీరధారియగు ఆత్మ విషయముకూడను అని తెలిసికొనవలెను ఆత్మ కనుపించకపోయినను అది లేదని తలంచరాదు ఉండియే యున్నది

363 యథా చన్ద్రార్కసంయుక్తం తమస్తదుపలభ్యతే
తద్వచ్ఛరీరసంయుక్తః శరీరీత్యుపలభ్యతే

సూర్యగ్రహణకాలమున చంద్రుడు సూర్యునితో సంయుక్తమై యున్నను సూర్యుని యందు ఛాయా రూపమున రాహువు యొక్క దర్శనమగునట్లు, శరీరముతో సంయుక్తము కాగా శరీరధారియగు ఆత్మ యొక్క ఉపలబ్ధి సంభవించుచున్నది

364 యథాప్సు ప్రసన్నే తు రూపం పశ్యతి చక్షుషా
తద్వత్ప్రసన్నేన్ద్రియత్వా జ్ఞేయం జ్ఞానేన పశ్యతి

స్వచ్ఛమై స్థిరమైయున్న జలమందు మనుజుడు నేత్రముల ద్వారా తన ప్రతి బింబమును చూచునట్లు మనస్సు ఇంద్రియములు శుద్ధములై స్థిరములై యుండ మనుజుడు జ్ఞానదృష్టిచే జ్ఞేయస్వరూపమగు ఆత్మ యొక్క సాక్షాత్కారము చేసికొనగలడు

365 స ఏవ లులితే తస్మిన్ యథారూపం న పశ్యతి
తథేన్ద్రియాకులీభావే జ్ఞేయం జ్ఞానే న పశ్యతి

అతడే కదలుచున్న నీటి యందు తన ప్రతి బింబమును చూడజాలనట్లు మనస్సు, ఇంద్రియములు చంచలములు కాగా అతడు జ్ఞేయస్వరూపమగు ఆత్మ యొక్క దర్శనము చేసికొనజాలడు

366 జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః
యథాఽఽదర్శతలే ప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని

పాపము క్షయించినంతటనే మనుజుని అంతఃకరణమందు జ్ఞానముదయించుచున్నది నిర్మలమగు అద్దమునందే మనుజుడు తన ప్రతి బింబమును చక్కగ కూడగలడు కదా!

367 ప్రసృతైరిన్ద్రియైర్దుఃఖీ తైరేవ నియతైః సుఖీ
తస్మాదిన్ద్రియరూపేభ్యో యచ్ఛేదాత్మానమాత్మనా

విషయములపైపు ఇంద్రియములు పరువెత్తుటచే మనుజుడు దుఃఖము పొందుచున్నాడు వానినే సంయమన మొనర్చినచో సుఖమును బడయుచున్నాడు కాబట్టి ఇంద్రియముల యొక్క విషయములనుండి మనస్సును బుద్ధి ద్వారా నిగ్రహింపవలెను

368 విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే

ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహింపకుండుటచే, మనుజునకు ఆ విషయములు తొలగుచున్నవి కాని మనస్సునందు వానిని గూర్చిన ఆసక్తి ఉండుచున్నది పరమాత్మ యొక్క సాక్షాత్కారము కలిగిన మీదట ఆ ఆసక్తియు మనుజునకు తొలగి పోవుచున్నది

369 బుద్ధిః కర్మగుణైర్హీనా యదా మనసి వర్తతే
తదా సమ్పద్యతే బ్రహ్మ తత్రైవ ప్రలయం గతమ్

బుద్ధి కర్మజనితగుణముల నుండి విడివడి ఎప్పుడు హృదయమందుండుచున్నదో అపుడు జీవాత్మ బ్రహ్మమునందు లీనమై బ్రహ్మమే యగుచున్నది

370 దుఃఖోపఘాతే శారీరే మానసే చాప్యుపస్థితే
యస్మిన్ న శక్యతే కర్తుం యత్నస్తం నానుచిన్తయేత్

ఏది కలిగినచో ఇక సాధన చేయుట అశక్యమో అట్టి శారీరకమైన గాని మానసికమైన గాని దుఃఖము మనుజునకు కలిగినచో అపుడు ఆ దుఃఖమును గూర్చి చింతించుటను మాని వేయవలెను

371 భైషజ్యమేతద్ దుఃఖస్య యదేతన్నాను చిన్తయేత్
చిన్త్యమానం హి చాభ్యేతి భూయశ్చాపి ప్రవర్తతే

దుఃఖమును గూర్చిన చింతనను వదలివేయుటయే దుఃఖమును తొలగించుటకు చక్కని ఔషధమైయున్నది ఏలయనగా చింతన చేయుటచే ఆ దుఃఖము ఎదుటకు వచ్చును మఱియు అధికముగా పెరిగిపోవును

372 ప్రజ్ఞయా మానసం దుఃఖం హన్యాచ్ఛారీరమౌషధైః
ఏతద్ విజ్ఞానసామర్థ్యం న బాలైః సమతామియాత్

కావున మానసిక దుఃఖమును బుద్ధిచేతను, విచారణ చేతను శారీరక దుఃఖమును ఓషధుల ద్వారాను తొలగించుకొనవలెను ఇదియే విజ్ఞానము యొక్క సామర్థ్యము దీనిచె మనుజుడు దుఃఖము నందు పడినను ఎల్లలవలె కూర్చొని ఏడ్వడు

373 అనిత్యం యౌవనం రూపం జీవితం ద్రవ్యసంచయః
ఆరోగ్యం ప్రియసంవాసో గృధ్యేత్ తత్ర న పణ్డితః

యౌవనము రూపము జీవితము ధనసంగ్రహణము, ఆరోగ్యము ప్రియజనుల కలయిక — అనునివి యన్నియు అనిత్యములు వివేకవంతులు వీనియందు ఆసక్తులు కాగూడదు

374 పరిత్యజతి యో దుఃఖం సుఖం వాప్యుభయం నరః
అభ్యేతి బ్రహ్మ సోఽత్యన్తం న తే శోచన్తి పణ్డితాః

సుఖదుఃఖముల రెండిటిని వదలివేయువాడు అక్షరపరబ్రహ్మమును పొందును కావున జ్ఞానులు ఎన్నటికిని దుఃఖింపరు

375 అవ్యక్తస్యేహ విజ్ఞానే నాస్తి తుల్యం నిదర్శనమ్
యత్ర నాస్తి పదన్యాసః కస్తం విషయమాప్నుయాత్

అవ్యక్తమగు బ్రహ్మమును గూర్చి బోధించుటకొఱకు ఈ ప్రపంచమున యోగ్యమగు దృష్టాంతమేదియును లేదు ఎచట వాక్కు యొక్క వ్యాపారమే లేదో అట్టి వస్తువును ఎవడు వర్ణన విషయము కావించగలడు

376 పురుషః ప్రకృతిర్బుద్ధిర్విషయాశ్చేన్ద్రియాణి చ
అహంకారోఽభిమానశ్చ సమూహో భూతసంజ్ఞకః

పురుషుడు ప్రకృతి, బుద్ధి పంచవిషయములు, దశేంద్రియములు అహంకారము మనస్సు పంచ మహాభూతములు — అను ఈ ఇరువదియైదు తత్త్వముల సమూహమే ప్రాణియను పేరుతో చెప్పబడుచున్నది

377 ధర్మాదుత్కృష్యతే శ్రేయస్తథాశ్రేయోఽప్యధర్మతః
రాగవాన్ ప్రకృతిం హ్యేతి విరక్తో జ్ఞానవాన్ భవేత్

ధర్మమాచరించుటచే శ్రేయస్సు వృద్ధి నొందును అధర్మమాచరించుటచే మనుజునకు అమంగళము కలుగును విషయాసక్తుడు ప్రకృతిని పొందును విరక్తుడు ఆత్మజ్ఞానమును పొంది ముక్తుడగుచున్నాడు

378 యదా తైః పఞ్చభిః పఞ్చ యుక్తాని మనసా సహ
అథ తత్ ద్రక్ష్యతే బ్రహ్మ మణౌ సూత్రమివార్పితమ్

ఎప్పుడు మనుజుడు శబ్దాది పంచ విషయసహితములగు పంచేంద్రియములను మనస్సును అదుపులోనుంచుకొనునో అప్పుడు మణులందు ఓతప్రోతమైయున్న దారమువలె సర్వత్ర వ్యాపించియున్న పరబ్రహ్మము యొక్క సాక్షాత్కారమును బడయుచున్నాడు

379 అనాదిత్వాద మధ్యత్వా దనన్తత్వాచ్చ సోఽవ్యయః
ఆత్యేతి సర్వదుఃఖాని దుఃఖం హ్యన్తవదుచ్యతే

ఆత్మ ఆది మధ్యాంతరహితముగుటచే నాశరహితమైనది కావున దుఃఖములన్నిటికిని పరమైయున్నది నాశవంతమగు వస్తువే దుఃఖరూపమైయుండును

380 సూక్ష్మేణ మనసా విద్మో వాచా వక్తుం న శక్నుమః
మనో వా మనసా గ్రాహ్యం దర్శనేన చ దర్శనమ్

మనము ధ్యానము ద్వారా శుద్ధ, సూక్ష్మమనస్సుచే పరమాత్మ స్వరూపమును తెలిసికొనవచ్చును కాని వాక్కు ద్వారా అద్దానిని వర్ణింపలేము ఏలయనిన (శుద్ధ) మనస్సుచేతనే (సూక్ష్మ) మానసిక విషయము యొక్క గ్రహణము సంభవింపను జ్ఞానము ద్వారానే జ్ఞేయము (ఆత్మ) తెలిసికొనబడగలదు

381 అనాగతం సుకృతవతాం పరాం గతిం
స్వయమ్భువం ప్రభవనిధానమవ్యయమ్
సనాతనం యదమృతమవ్యయం ధ్రువం
నిచాయ్య తత్ పరమమృతత్వమశ్నుతే

ఒక చోటినుండి రానిదియు ఎల్లపుడు ఉండియే యున్నదియు పుణ్యవంతుల పరమగతియు స్వయంభువును సమస్తము యొక్క ఉత్పత్తి లయస్థానమును నాశరహితమైనదియు సనాతనమైనదియు, అమృతము, నిర్వికారము అచలము అయినదియు అగు పరమాత్మ యొక్క జ్ఞానమును పొంది మనుజుడు పరమ మోక్షమును బడయుచున్నాడు

తరువాత భీష్ముడు పూర్వము విష్ణు భగవానుడు నారదునకు బోధించిన తత్త్వవిషయములను ధర్మరాజునకు చెప్పెను విష్ణు భగవానుడు నారదునకిట్లు బోధించెను —

శ్రీ భగవానువాచ

382 ఓఙ్కారమగ్రతః కృత్వా మాం నమస్కృత్య నారద
ఏకాగ్రః ప్రయతో భూత్వా ఇమం మన్త్రముదీరయేత్
ఓ నమో భగవతే వాసుదేవాయేతి

(విష్ణు భగవానుడు నారదునితో ఇట్లు చెప్పెను —)

మొదట ఓంకారము నుచ్చరించి నాకు నమస్కారము చేసి ఏకాగ్రచిత్తుడై పవిత్ర మనస్కుడై ఓమ్ నమో భగవతే వాసుదేవాయ — అను ఈ మంత్రమును ఉచ్చరించవలెను

383 యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనుష్యాణామ్
యజ్ఞం దానం తపస్తస్మాత్ కుర్యాదాశీర్వివర్జితః

యజ్ఞము దానము తపస్సు — అనునివి మనుజుని పవిత్రము చేయునవై యున్నవి కావున వీనిని నిష్కామభావముతో అనుష్ఠించవలెను

384 నమ ఇత్యేవ యో బ్రూయాన్మద్భక్తః శ్రద్ధయాన్వితః
తస్యాక్షయో భవేల్లోకః శ్వపాకస్యాపి నారద

ఏ నా భక్తుడు శ్రద్ధాపూర్వకముగ నా కొఱకు కేవలము నమస్కారమాత్రము కావించునో అతడు చండాలుడైనను అతనికి అక్షయ లోకప్రాప్తి కలుగును

385 కర్మాణ్యాద్యన్తవన్తీహ మద్భక్తో నాన్తమశ్నుతే
మామేవ తస్మాద్ దేవర్షే ధ్యాహి నిత్యమతన్ద్రితః
అవాప్స్యసి తతః సిద్ధిం ద్రక్ష్యస్యేవ పదం మమ

నారదా! సమస్త కర్మలు, వాని ఫలములు అంతము కలవి కాని నా భక్తుడు అంతముకల (నాశము కల) ఫలమును అనుభవించడు కావున మీరు సదా అలసత్వరహితులై నన్నే

ధ్యానింపుడు దానిచే మీకు పరమసిద్ధి లభించును మఱియు మీకు నా యొక్క పరమధామమును దర్శింపగలరు

అనంతరము భీష్ముడు ధర్మరాజున కిట్లు ప్రబోధించెను —

భీష్మ ఉవాచ

386 కిం తస్య బహుభిర్మన్త్రైర్భక్తిర్యస్య జనార్దనే
నమో నారాయణాయేతి మన్త్రః సర్వార్థసాధకః

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ఎవనికి జనార్దనుని యందు భక్తికలదో అతనికి అనేక మంత్రముల ద్వారా ఏమి ప్రయోజనము? ఓమ్ నమో నారాయణాయ అను ఒక్క మంత్రమే సమస్త మనోరథములను సిద్ధింపజేయునదై యున్నది

387 నాశుద్ధమాచరేత్ తస్మాదభీప్సన్ దేహయాపనమ్
కర్మణా వివరం కుర్వన్న లోకానాప్నుయాచ్ఛుభాన్

దేహబంధనము నుండి విడుదల పొందదలంచువాడు అశుద్ధ ఆచరణ నెన్నడును చేయరాదు అతడు నిష్కామ కర్మద్వారా మోక్షద్వారమును తెఱవవలెను అంతియే కాని స్వర్గాది పుణ్య లోకములను పొందుటకు ఎన్నడను వాంఛింపరాదు

388 లోహయుక్తం యథా హేమ విపక్వం న విరాజతే
తథాపక్వకషాయాఖ్యం విజ్ఞానం న ప్రకాశతే

లోహయుక్తమగు సువర్ణము నిప్పు యందు పడి శుద్ధముకానిచో తన నిజస్వరూపముతో ప్రకాశించనట్లు చిత్తమునందు రాగాది దోషములు నశింపనిచో దానియందు జ్ఞానస్వరూపమగు ఆత్మ ప్రకాశింపదు

389 అస్మాత్ సమ్యక్ పరీక్షేత దోషానజ్ఞానసమ్భవాన్
అజ్ఞానప్రభవం దుఃఖమహంకారం పరిత్యజేత్

కావున వివేకసంపన్నుడు అజ్ఞానజనిత దోషములను బాగుగ పరీక్షించి ఆ అజ్ఞానమువలన కలుగు దుఃఖమును అహంకారమును త్యజించవలెను

390 మహాభూతానీన్ద్రియాణి గుణాః సత్త్వం రజస్తమః
త్రైలోక్యం సేశ్వరం సర్వమహంకారే ప్రతిష్ఠితమ్

పంచమహాభూతములు ఇంద్రియములు శబ్దాది గుణములు, సత్త్వరజస్తమస్సులు లోకపాలసహితములగు ముల్లోకములు —ఇవి యన్నియు అహంకారమందే ప్రతిష్ఠితములై యున్నవి

391 దుఃఖం విద్యాదుపాదానా దభిమానాచ్చ వర్ధతే
త్యాగాత్ తేభ్యో నిరోధః స్యాన్నిరోధజ్ఞో విముచ్యతే

శరీరము యొక్క గ్రహణ మాత్రముచే దుఃఖప్రాప్తి నిశ్చితమని యెఱుగవలెను. శరీరమందు అభిమానము గలిగియుండుటచే ఆ దుఃఖము పెరిగిపోవుచున్నది అభిమానమును వదలుటచే ఆ దుఃఖములు నశించిపోవుచున్నవి దుఃఖములను నశింపజేయు ఈ కళను ఎఱుగువాడు ముక్తుడగుచున్నాడు

392 జ్ఞానేన్ద్రియాణీన్ద్రియార్థాన్నోపసర్పన్త్యతర్షులమ్
హీనైశ్చ కరణైర్దేహీ న దేహం పునరర్హతి

ఎవని యందు తృష్ణ లేదో అట్టివాని జ్ఞానేంద్రియములు విషయప్రాప్తిని కలుగజేయవు ఇంద్రియములు విషయాసక్తి రహితములైన యెడల దేహి తిరిగి శరీరమును ధరింపడు

393 నేత్రహీనో యథా హ్యేకః కృచ్ఛ్రాణి లభతేఽధ్వని
జ్ఞానహీనస్తథా లోకే తస్మాజ్జ్ఞానవిదోఽధికాః

కన్నులు లేనివాడు మార్గమున ఒంటరిగ పోవునప్పుడు అనేక దుఃఖములను పొందునట్లు ప్రపంచమున జ్ఞానహీనుడగు మనుజునకు

కూడ అనేక విధములుగ కష్టములు అనుభవించవలసి వచ్చును
కావున జ్ఞానియే అందఱి కంటెను శ్రేష్ఠుడు

394 సుదుష్కరం బ్రహ్మచర్యముపాయం తత్ర మే శృణు
సంప్రవృద్ధముదీర్ణం చ నిగృహ్ణీయాద్ ద్విజో రజః

ధర్మజా ! బ్రహ్మచర్యపాలన మహాకఠినమైనది దానికి ఉపాయమును వినుము రజోగుణ వృత్తి ప్రకటమైనపుడు వృద్ధి నొందునపుడు దానిని (విచారణచే) నిరోధించవలెను

395 మధ్యే చ హృదయస్యైకా శిరా తత్ర మనోవహా
శుక్రం సంకల్పజం నృణాం సర్వగాత్రైర్విముఞ్చతి

హృదయము యొక్క మధ్యభాగమున మనోవహా అను నాడి కలదు పురుషులందు కామవిషయక సంకల్పము ద్వారా అది శరీర మంతటి నుండి వీర్యమును లాగికొని బయటకు ఎంపివేయును

396 దురన్తేష్విన్ద్రియార్థేషు సక్తాః సీదన్తి జన్తవః
యే త్వసక్తా మహాత్మానస్తే యాన్తి పరమాం గతిమ్

ఇంద్రియములు విషయములను దాటుట (అరికట్టుట) చాల కఠినమైనది ఎవరు వాని యందు ఆసక్తులై యుందురో వారు దుఃఖముల ననుభవింతురు ఏ మహాత్ములు వానియందు ఆసక్తి లేకయున్నారో వారు పరమగతిని (మోక్షమును) పొందుదురు

397 జన్మమృత్యుజరాదుఃఖైర్వ్యాధిభిర్మానసక్లమైః
దృష్ట్వైవ సంతతం లోకం ఘటేన్మోక్షాయ బుద్ధిమాన్

ఈ జగత్తు జన్మ మృతు వార్ధక్యముల దుఃఖములచే నానా విధములైన రోగములచే మానసిక చింతలచే వ్యాప్తమైయున్నది ఇట్లు తలంచి బుద్ధిమంతుడు మోక్షమును కొఱకె ప్రయత్నించవలెను,

398 అహింసా సత్యవచనం సర్వభూతేషు చార్జవమ్
క్షమా చైవాప్రమాదశ్చ యస్యైతే స సుఖీ భవేత్

అహింస సత్యభాషణము సమస్త ప్రాణికోట్ల యెడల సరళత్వముతో కూడిన ప్రవర్తన క్షమ ప్రమత్తత లేకుండుట—అను ఈ సద్గుణములు ఎవని యందుండునో అతడు సుఖవంతుడగును

399 యస్త్వేతం పరమం ధర్మం సర్వభూతసుఖావహమ్
దుఃఖాన్నిఃసరణం వేద సర్వజ్ఞః స సుఖీ భవేత్

ఎవడు ఈ అహింసాది ధర్మములు సమస్త ప్రాణికోట్లకు సుఖదాయములనియు దుఃఖనివారకములనియు తెలిసికొనునో అట్టివాడే సర్వజ్ఞుడు ఆతడే సుఖవంతుడు

400 తస్మాత్ సమాహితం బుద్ధ్యా మనో భూతేషు ధారయేత్
నాపధ్యాయేన్న స్పృహయేన్నాబద్ధం చిన్తయేదసత్

401 అథామోఘప్రయత్నేన మనోజ్ఞానే నివేశయేత్
వాచామోఘప్రయత్నేన మనోజ్ఞం తత్ ప్రవర్తతే

కావున బుద్ధిద్వారా మనస్సును ఏకాగ్రపఱచి సమస్తప్రాణికోట్ల యందున్న పరమాత్మ యందు స్థాపింపవలెను ఎవనికిని అహితము చేయరాదు అసంభవమైన వస్తువును కోరరాదు మిథ్యాపదార్థముల యొక్క చింతన చేయరాదు సఫలమగు ప్రయత్నమాచరించి మనస్సును జ్ఞాన సాధన యందు లగ్నము చేయవలెను వేదాంత వాక్యముల యొక్క శ్రవణముచేతను సుదృఢ ప్రయత్నము చేతను ఉత్తమ జ్ఞానము కలుగగలదు

402 సత్యధర్మమనీహో వై ముక్తః సర్వపరిగ్రహైః
వివిక్తచారీ లఘ్వాశీ తపస్వీ నియతేన్ద్రియ

403 జ్ఞానదగ్ధపరిక్లేశః ప్రయోగరతిరాత్మవాన్
నిష్ప్రచారేణ మనసా పరం తదధిగచ్ఛతి

ఏ విధమైన సంగ్రహాణము లేనివాడును నిశ్చలుడును కోరికలు లేనివాడును ఏకాంతవాసయు అల్పాహారియు తపస్వియు జితేంద్రియుడును, క్లేశములన్నిటిని జ్ఞానాగ్ని యందు దగ్ధమొనర్చిన వాడును, యోగానుష్ఠానమందు ప్రీతి కలవాడును మనస్సును వశమందుంచుకొనినవాడును అగు మనుజుడు తన నిశ్చల చిత్తము ద్వారా పరమాత్మను నిస్సందేహముగ పొందుచున్నాడు

404 ప్రవృత్తం నోపరున్ధేత శనైరగ్నిమివేన్ధయేత్
జ్ఞానాన్వితం తదా జ్ఞానమర్కవత్ సంప్రకాశతే

సాధన మొదలుపెట్టిన తరువాత దానిని మధ్యలో ఆపగూడదు (విసరుటచే) అగ్ని మెల్లమెల్లగ తేజోవంతమగునటు జ్ఞాన సాధనను నెమ్మదిగా ఉద్దీపిత మొనర్పవలెను అట్లు చేయుటచే జ్ఞానము సూర్యునివలె ప్రకాశింపదొడగును

405 హేతుమచ్ఛక్యమాఖ్యా తు మేతావజ్జ్ఞాన చక్షుషా
ప్రత్యాహారేణ వా శక్యమక్షరం బ్రహ్మ వేదితుమ్

జ్ఞానమయ దృష్టికల మహానుభావులె బ్రహ్మవిషయమగు యుక్తి సంగతమగు వాక్యములను చెప్పగలరు మనస్సును, ఇంద్రియములను విషయముల నుండి మరలించి ఏకాగ్రచిత్తముగ చింతన చేయుటచేతను బ్రహ్మము యొక్క సాక్షాత్కారము కలుగగలదు

406 శ్రియం దివ్యామభిప్రేప్సుర్వర్ష్మవాన్ మనసా శుచిః
శారీరైర్నియమైరుగ్రైశ్చరేన్నిష్కల్మషం తపః

దివ్యసంపదయగు బ్రహ్మజ్ఞానమును పొందదలంచువాడు తన మనస్సును శుద్ధముగ నుంచుకొనవలెను మఱియు శరీరముచే తీవ్ర నియమములను పాలించుచు నిర్దుష్టమగు తపస్సు అనుష్ఠించవలెను

407 ప్రకాశస్తపసో జ్ఞానం లోకే సంశబ్దితం తపః
రజస్తమోఘ్నం యత్ కర్మ తపసస్తత్ స్వలక్షణమ్

లోకమున తపస్సు అను పదము చాల విఖ్యాతమైయున్నది ఆ తపస్సు యొక్క ఫలము జ్ఞానస్వరూపమగు ప్రకాశము రజోగుణ తమోగుణములను నాశమొనర్చు నిష్కామ కర్మమే తపస్సు యొక్క స్వరూపమును బోధించు లక్షణము

408 బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే
వాఙ్మనో నియమః సమ్యఙ్మానసం తప ఉచ్యతే

బ్రహ్మచర్యము అహింస శారీరక తపస్సని చెప్పబడును మనస్సు వాక్కులచే లెస్సగ గావింపబడిన సంయమము మానసిక తపస్సని చెప్పబడును

409 అన్తకాలే బలోత్కర్షాచ్ఛనైః కుర్యాదనాతురః
ఏవం యుక్తేన మనసా జ్ఞానం యదుప పద్యతే

యోగయుక్తమగు మనస్సు ద్వారా ఏ జ్ఞానము పొందబడు చున్నదో దానిని జీవితము యొక్క అంత్యకాలము వఱకు యావచ్ఛక్తిని వినియోగించి మెల్లమెల్లగ పొందవలెను ఇకార్య మున ధైర్యమును వదలరాదు

410 అదేహాదప్రమాదాచ్చ దేహాన్తాద్ విప్ర ముచ్యతే
హేతుయుక్తః సదా సర్గో భూతానాం ప్రలయస్తథా

దేహత్యాగపర్యంతరము ప్రమత్తత లేకయున్నచో యోగి దేహావసానము పిదప మోక్షమును పొందుచున్నాడు బంధనమునకు హేతుభూతమగ అజ్ఞానముతో కూడినవారు సదా జనన, మరణము లను పొందుచుందురు

411 ఇమం గుణసమాహార మాత్మ భావేన పశ్యతః
అసమ్యగ్దర్శనైర్దుఃఖమనన్తం నోప శామ్యతి

ఎవరు గుణముల సంఘాత రూపమగు ఈ శరీరమునే ఆత్మగా భావించుదురో వారికి మిథ్యాజ్ఞానము వలన అనంత దుఃఖములు కలుగును ఆ దుఃఖపరంపర ఎన్నడును శమించదు

**412** త్యాగ ఎవ వా సర్వేషాం యుక్తానామపి కర్మణామ్
నిత్యం మిథ్యా వినీతానాం క్లేశో దుఃఖవహో మతః

మోక్షము కొఱకు ప్రయత్నశీలురగువారు అందఱును సమస్త కర్మలందును అహంభావము మమత్వము, ఆసక్తి కామన (కోరిక) - వీనిని త్యజించవలెను వీనిని త్యజింపక ఇతర కార్యములను చేయు వారికి అవిద్యాది దుఃఖదాయకములగు క్లేశములు సంభవించును

**413** ప్రహర్షః ప్రీతిరానన్దః సుఖం సంశాన్తచిత్తతా
అకుతశ్చిత్ కుతశ్చిద్ వా చిన్తితః సాత్త్వికో గుణః

హర్షము ప్రీతి ఆనందము సుఖము చిత్తశాంతి — అను భావములు స్వతః కలిగినను ఏదైన కారణము వలన కలిగినను సాత్త్వికగుణములని తలంచబడుచున్నవి

**414** అతుష్టిః పరితాపశ్చ శోకో లోభస్తథాక్షమా
లిఙ్గాని రజసస్తాని దృశ్యన్తే హేత్వహేతుతః

అసంతృప్తి సంతాపము శోకము లోభము అసహన శీలత్వము — అనునివి ఏదైన కారణముచే గలిగినను అకారణముగ గలిగినను రజోగుణ చిహ్నములై యున్నవి

**415** అవివేక స్తథా మోహః ప్రమాదః స్వప్న తన్ద్రితా
కథంచిదపి వర్తన్తే వివిధా స్తామసా గుణాః

అవివేకము మోహము ప్రమత్తత స్వప్నము అలసత్వము (సోమరితనము) — అనునివి ఎట్లు కలిగినను తమోగుణము యొక్క వివిధరూపములై యున్నవి

416 శ్రుతి ప్రమాణాగమ మఙలైశ్చ
శేతే జరామృత్యు భయాదభీతః
క్షీణే చ పుణ్యే విగతే చ పాపే
తతో నిమిత్తే చ ఫలే వినష్టే
అలేపమాకాశ మలింగమేవ —
మాస్థాయ పశ్యన్తి మహత్య సక్తాః

శ్రుతి ప్రతిపాదితములగు ప్రమాణముల యొక్క విచారణ చేతను శాస్త్రమునందు చెప్పబడిన మంగళమగు సాధనలను అనుష్ఠించుట చేతను, మనుజుడు వార్ధక్యమరణముల భయము నుండి విముక్తుడై సుఖముగ నిదురించును ఎపుడు మనుజునకు పుణ్య పాపముల క్షయము దానివలన లభించు సుఖదుఃఖాది ఫలముల నాశము సంభవించునో అపుడతడు సమస్త పదార్థముల యెడల ఆసక్తి లేనివాడై ఆకాశము వలె నిర్లేపమై, నిర్గుణమైనట్టి పరమాత్మ యందు స్థితిగలిగి అట్టి పరమాత్మను సాక్షాత్కరించుకొనుచున్నాడు

417 యథా రురుః శృఙ్గ మథో పురాణం
హిత్వా త్వచం వాప్యురగో యథా చ
విహాయ గచ్ఛత్యనవేక్షమాణ
స్తథా విముక్తో విజహాతి దుఃఖమ్

రురు వను మృగము తన పాతకొమ్మును సర్పము తన కుబుసమును వదలివైచి దాన్నివైపు చూడక నే వెడలిపోవునట్లు, మమత్వము అభిమానము లేని మనుజుడు సంసారబంధనముల నుం విముక్తుడై తన సమస్త దుఃఖములను దూరీకరించుచున్నాడు.

418 ప్రదీప్యమానాం మిథిలాం దృష్ట్వా రాజాన కమ్పితః
జనైః స పరిపృష్టస్తు వాక్యమేత దువాచ హ

419 అనన్తం బత మే విత్తం భావ్యం మే నాస్తి కించన
మిథిలాయాం ప్రదీప్తాయాం నమే కించన దహ్యతే

మిథిలాపట్టణము కాలిపోవుచుండుట చూచి జనక మహారాజు ఏమాత్రము కింతైనను చలించలేదు జనులు అడుగగా అతడీ ప్రకారము వచించెను

— నా యొద్ద ఆత్మజ్ఞానమను అనంత ధనము కలదు కావున ఇపుడు నాకు పొందదగినది ఏదియు ఒకింతైనను శేషించి యుండలేదు ఈ మిథిలాపట్టణము కాలిపోయినను నాది (నా వస్తువగు ఆత్మ) ఏమియు కాలుటలేదు

420 దమస్తేజో వర్ధయతి పవిత్రం దమ ఉచ్యతే
విపాప్మా నిర్భయో దాన్తః పురుషో విన్దతే మహత్

దమముచే (ఇంద్రియ నిగ్రహముచే) తేజస్సు వృద్ధి యగును దమము పరమ పవిత్రమైనదని చెప్పబడినది మనస్సును ఇంద్రియములను సంయమ మొనర్చువాడు పాపము నుండి భయము నుండి, విముక్తుడై, మహత్పదమును (పరబ్రహ్మమును) పొందుచున్నాడు

421 మాస పక్షోప వాసేన మన్యన్తే యత్ తపో జనాః
ఆత్మ తన్త్రోప ఘాతస్తు న తపస్తత్సతాం మతమ్

సామాన్య జనులు నెల లేక ఎదునైదు రోజులు ఉపవాసము చేసి దానిని తపస్సు అందురు వారి ఆ కార్యము ధర్మమునకు సాధనభూతమైన శరీరమును శోషణ మాత్రము చేయునదై యున్నది కావున ఉత్తముల దృష్టి యందది తపస్సు కానేరదు

422 త్యాగశ్చ సంనతిశ్చైవ శిష్యతే తప ఉత్తమమ్
సదోపవాసి చ భవేద్ బ్రహ్మచారీ సదా భవేత్

పెద్దల దృష్టి యందు త్యాగము వినయము — ఇవియే ఉత్తమ తపస్సు వీనిని పాలించువాడు నిత్యోపవాసి, మఱియు సదా బ్రహ్మచారి అయియున్నాడు

423 అన్తరా ప్రాతరాశం చ సాయమాశం తథైవ చ
సదోపవాసీ స భవేద్ యో న భుఙ్క్తేఽన్తరా పునః

ఎవడు ప్రాతఃకాలమున మరల సయంత్రము మాత్రము భుజించునో మధ్య ఏమియు తినకుండునో, అతడు నిత్యోపవాసము చేయువాడగును

424 న భక్షయేత్ తథా మాంసమమాంసాశీ భవత్యుత
దాననిత్యః పవిత్రశ్చ అస్వప్నశ్చ దివాస్వపన్

ఎవడు మాంసము నెన్నడును భక్షింపడో అతడు అమాంసాహారి యగును నిత్యము దాన మొనర్చువాడు పవిత్రుడని ఎంచబడును పగలు నిద్రింపనివాడు ఎల్లపుడు మేలుకొనువాడని చెప్పబడును

ఇమ్మాట భీష్ముడు పూర్వము సనత్కుమారుడు కొందఱు బ్రాహ్మణులకు చెప్పిన బోధను ఈ ప్రకారముగ వివరించెను సనత్కుమారుడు బ్రాహ్మణుల కిట్లు బోధించెను —

425 దినే దినేఽస్తమభ్యేతి పునరుదచ్ఛతే దిశః
తావుభౌ న రవౌ చాస్తాం తథా విత్త శరీరిణమ్

(సనత్కుమారుడు బ్రాహ్మణులతో ఇట్లు చెప్పెను —)

విప్రులారా! సూర్యుడు ప్రతిదినము అస్తమించుచు మరల తూర్పు దిక్కున ఉదయించుచున్నాడు కాని ఆ ఉదయాస్తములు రెండును సూర్యుని యందు లేవు అట్లే శరీరాంతర్గతమగు అంతర్యామి (ఆత్మ) రూపమున వెలుగుచున్న అసంగుడగు భగవంతుడైన పరమాత్మను తెలిసికొనుడు

426 పతితే విత్త విపేన్ద్రౌ భక్షితో చరణో పరః
ఊర్ధ్వమేకస్తథాధస్తాదేకస్త్విషతి చాపరః

ఓ విప్రవర్యులారా! యీరు పడునపుడు, లేచునపుడు, నడచునపుడు తిరుగునపుడు తినునపుడు ఏ కార్యము చేయునపుడైనను పైన క్రింద దేశ దిశలందు భగవంతుడైన పరమాత్మ ఒకడే సర్వత్ర విరాజమానుడై యున్నాడు — అను అనుభవమును పొందుడు

427 న చక్షుషా పశ్యతి కశ్చనైనం
హృదా మనీషా పశ్యతి రూపమస్య
ఇజ్యతే యస్తు మన్త్రేణ యజమానో ద్విజోత్తమః

ఆ పరమాత్మను ఎవడును తన చర్మ నేత్రముచే చూడజాలడు అంతకరణమున ఉన్న నిర్మల బుద్ధి ద్వారాయే ఆతని రూపమును జ్ఞాని చూడగల్గుచున్నాడు ఆ పరమాత్మను మంత్రము ద్వారా యజింప (ధ్యానింప) వచ్చును ఉత్తములగువారే ఆ పరమాత్మను యజించుచున్నారు

అనంతరము భీష్ముడు ప్రహ్లాద ఇంద్ర సంవాదమును ప్రస్తావించెను ప్రహ్లాదుడు ఇంద్రున కిట్లు బోధించెను —

ప్రహ్లాద ఉవాచ —

428 వేద ధర్మవిధిం కృత్స్నం భూతానాం చాప్యనిత్యతామ్
తస్మాచ్ఛక్ర న శోచామి సర్వం హ్యేవేదమన్తవత్

(ప్రహ్లాదుడు ఇంద్రునితో ఇట్లు చెప్పెను —)

ధర్మము యొక్క పూర్ణమగు విధిని సమస్త భూతముల యొక్క అనిత్యత్వమును నేను ఎఱిగియున్నాను కావుననే ఇది యంతయు నాశవంతమైనది అని యెఱిగి నేను దేని కొఱకును శోకింపను

429 అర్థవేనాప్రమాదేన ప్రసాదేనాత్మవత్తయా
వృద్ధశుశ్రూషయా శక్ర పురుషో లభతే మహత్

సరళత్వము అప్రమత్తత బుద్ధిమై కఁ నిర్మలత్వము చిత్తము స్థిరత్వము పెద్దలను సేవించుట — అను ఈ సద్గుణములు కలిగి యుండుట వలన మనుజునకు మహత్వదము సంప్రాప్తించుచున్నది

ఎదప భీష్ముఁగు బలిచక్రవర్తి ఇంద్రునకు బోధించిన ధర్మములను ధర్మరాజునకు చెప్పెను బలిచక్రవర్తి ఇంద్రున కిట్లు ప్రబోధించెను —

బలిరువాచ

430 అనిత్యముఎలక్ష్యే వా కాలపర్యాయ ధర్మతః
తస్మాచ్ఛక్ర న శోచామి సర్వం హ్యేవేదమన్తవత్

(బలి ఇట్లు చెప్పను —)

కాలచక్రము స్వభావముగనే పరివర్తన శీలమైయున్నది కావున ప్రతి వస్తువు అనిత్యమని నేను తలంచుచున్నాను అందుచే నేనెన్నడును శోకించుటలేదు ఏలయనిన ఈ ప్రపంచమంతయు వినాశ శీలమైయున్నది

తదుపరి భీష్ముఁగు నముచి ఇంద్ర సంవాదమును జెప్పఁ నెను నముచి అను దైత్యరాజు రాజ్యభ్రష్టుడైనను నిశ్చింతగ నుండుచుండెను ఒకపుడు ఇంద్రుడు అతనిని సమీపించి మీ పరిస్థితి యెట్లున్నది ? మీకు శోకము కలుగుచున్నదా అని ప్రశ్నింప, నముచి యిట్లు సమాధానము చెప్పెను —

నముచి రువాచ

431 తస్మాచ్ఛక్ర న శోచామి సర్వం హ్యేవేదమన్తవత్
సంతాపాద్ భ్రశ్యతే రూపం సంతాపాద్ భ్రశ్యతే శ్రియః

(నముచి ఇంద్రునితో ఇట్లు చెప్పెను —)

నేను శోకించుట లేదు ఏలయనిన ఈ సంపూర్ణవైభవము నాశవంతమైనది సంతాపము నొందుటచే రూపము నశించును కాంతి తగ్గిపోవును సంతాపముచే ఆయుస్సు ధర్మముకూడ నశించును,

432 న పణ్డితః క్రుద్ధ్యతి నాభిపద్యతే
న చాపి సంసీదతి న ప్రహృష్యతి
న చార్థకృచ్ఛ్రవ్యసనేషు శోచతే
స్థితః ప్రకృత్యా హిమవానివాచలః

బుద్ధిమంతులు ఎన్నడును కోపగించరు. ఎచటను ఆసక్తులు కారు. అనిష్టము సంభవించినప్పుడు దుఃఖమునుగాని వ్యాకులత్వమును గాని పొందరు. ఏదైన ప్రియవస్తువును పొందినప్పుడు అత్యంత హర్షమును పొందరు. ఆర్థిక సంకటము సంభవించినప్పుడు కూడ అతడు శోకగ్రస్తుడు కాడు. హిమవత్పర్వతము వలె నిశ్చలుడై యుండును.

433 యమర్థసిద్ధిః పరమా న మోహయేత్
తథైవ కాలే వ్యసనం న మోహయేత్
సుఖం చ దుఃఖం చ తథైవ మధ్యమం
నిషేవతే యః స ధురంధరో నరః

ఉత్తమ అర్థసిద్ధి ఎవనిని మోహమందు పడవేయదో, ఎవడు సంకటమునందును ధైర్యమును వివేకమును పోగొట్టుకొనడో, ఎవడు సుఖమును గాని దుఃఖమును గాని, ఆ రెంటి మధ్య స్థితిని గాని సమాన భావముతో సేవించునో అతడే గొప్ప కార్యభారమును వహింపగల శ్రేష్ఠ మానవుడని తలంచబడుచున్నాడు.

అంతట భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ

434 విశోకతా సుఖం ధత్తే ధత్తే చారోగ్యముత్తమమ్
ఆరోగ్యాచ్చ శరీరస్య స పునర్విన్దతే శ్రియమ్

(భీష్ముడు ధర్మరాజునకిట్లు చెప్పెను —)
శోకరాహిత్యము సుఖమును ఉత్తమ ఆరోగ్యమును కలుగ

జేయును శరీరము రోగరహితముగ నుండుటచే మనుజుకు తిరిగి సంపదను ఉపార్జించును

పిదప భీష్ముడు ధర్మరాజునకు ఇంద్ర బలి సంవాదమును గూర్చి తెలిపెను ఒకపుడు ఇంద్రుడు త్రిలోకములందు సంచారము చేయుచు బలిచక్రవర్తిని కలిసికొని అతడు రాజ్యభ్రష్టుడైనను నిర్వికారముగ, ప్రశాంతముగ నుండుటకు కారణమేమి యని అడుగగా అపుడు బలిచక్రవర్తి ఇంద్రునితో ఇట్లు చెప్పెను —

బలిరువాచ

435 నాగామినమనర్థం హి ప్రతిఘాతశతైరపి
శక్నువన్తి ప్రతివ్యోఢుమృతే బుద్ధిబలాన్నరాః

బలిచక్రవర్తి ఇంద్రునితో ఇట్లు చెప్పెను —)

మనుజుడు బుద్ధిబలముచే తప్ప మఱి ఏ ఉపాయముచేతను, వందల కొలది ఆఘాతముల నొనర్చుచు వచ్చు అనర్థమును ఆపలేడు

436 శోకకాలే శుచో మా త్వం హర్షకాలే చ మా హృషః
అతీతానాగతం హిత్వా ప్రత్యుత్పన్నేన వర్తయ

ఇంద్రా! మీరు శోక పరిస్థితి యందును శోకింపకుడు హర్ష పరిస్థితి యందును హర్షింపకుడు భూతకాల భవిష్యత్కాలములను గూర్చిన చింతను వదలి వర్తమాన కాలమున ఏ వస్తువు లభించునో దానితో జీవిత నిర్వహణమును గావింపుడు

ఆ వాక్యములను విని ఇంద్రుడు బలి చక్రవర్తితో ఇట్లు చెప్పెను —

437 ధ్రువం న వ్యథసేఽద్య త్వం ధైర్యాత్ సత్యపరాక్రమ
కో హి విశ్వాసమర్థేషు శరీరే వా శరీరభృత్
కర్తుముత్సహతే లోకే దృష్ట్వా సంప్రస్థితం జగత్

(ఇంద్రుడు బలిచక్రవర్తితో ఇట్లు చెప్పెను —)

సత్య పరాక్రమశీలుడా! ధీరుడా! మీరు నిక్కముగ ధైర్యము వలననే సంతాపరహితులుగ నున్నారు. ఈ సమస్త జగత్తును వినాశము వైపునకు పోవుచుండుట చూచి శరీరధారియై ఎవడు ధనవైభవ విషయభోగముల వెంట పరుగెత్తును? మఱియు తన శరీరముపై విశ్వాసము కలిగియుండగలను?

438 ఇదమద్య కరిష్యామి శ్వః కర్తాస్మీతి వాదినమ్
కాలో హరతి సమ్ప్రాప్తో నదీవేగ ఇవ ద్రుమమ్

నదీ జలము యొక్క వేగము అకస్మాత్తుగ పెరిగి ఒడ్డున ఉన్న చెట్టును పడద్రోయునట్లు ఈ పనిని ఈ రోజు చేసెదను ఆ పనిని రేపు చేసెదను — అని ఇట్లు పలుకు మనుజుని కాలము (మృత్యువు) అకస్మాత్తుగ వచ్చి హరించి వేయుచున్నది

శ్రీరువాచ

439 ధర్మనిత్యే మహాబుద్ధౌ బ్రహ్మణ్యే సత్యవాదిని
ప్రశ్రితే దానశీలే చ సదైవ నివసామ్యహమ్

(లక్ష్మీదేవి ఇంద్రునితో ఇట్లు చెప్పెను —)

నిత్యము ధర్మాచరణము చేయువాడును మహాబుద్ధిమంతుడును బ్రహ్మనిష్ఠుడును సత్యవాదియును వినయసంపన్నుడును దానశీలుడునగు మనుజుని యందు నేను సదా నివసించుదును

440 స్వధర్మమనుతిష్ఠత్సు ధైర్యాదచలితేషు చ
స్వర్గమార్గాభిరామేషు సత్త్వేషు నిరతా హ్యహమ్

తమ ధర్మమును పాలించువారును ధైర్యమును ఎన్నడును వీడనివారును స్వర్గప్రాప్తి యొక్క సాధనలందు సదా తత్పరులై యుండువారునగు ప్రాణులందు నేను సదా నివసించుదును

441 యత్రాహం తత్ర మత్కాన్తా మద్విశిష్టా మదర్పణాః
సప్త దేవ్యో జయాష్టమ్యో వాసమేష్యన్తి తేఽష్టదా

442 ఆశా శ్రద్ధా ధృతిః శాన్తి ర్విజితిః సంనతిః క్షమా
లక్ష్మీ వృత్తిరేతాసాం పురోగా పాకశాసన

నేను ఎచట ఉందునో అచట ఎడు మంది దేవులు ఇంకను ఉందురు వారందఱి ముందు ఎనిమిదవది యగు జయా దేవియు ఉంకును ఈ ఎనిమిది మంది దేవులు నాకు మిక్కిలి ప్రియులు వారు నా కంటె శ్రేష్ఠులు నాకు ఆత్మ సమర్పణము కావించినవారు వారి పేర్లు చెప్పుచున్నాను వినుము — (దైవసంపద యెడల) ఆశ శ్రద్ధ ధైర్యము శాంతి విజితి సంనతి క్షమ వృత్తి (జయ) ఈ ఎనిమిదవ దేవి తక్కిన ఏడు మంది దేవులకు అగ్రగామినియై యుండును

అనంతరము భీష్ముడు ధర్మరాజున కిట్లు ప్రబోధించెను —

భీష్మ ఉవాచ

443 మోక్షధర్మేషు నియతో లఘ్వాహారో జితేన్ద్రియః
ప్రాప్నోతి బ్రహ్మణః స్థానం తత్పరం ప్రకృతేర్ధ్రువమ్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ఎవడు మితాహారియై జితేంద్రియుడై మోక్షోపయోగకరమగు ధర్మములను పాలించుట యందు సంలగ్నుడై యుండునో అట్టివాడె ప్రకృతికి పరమై నాశరహితమైనట్టి బ్రహ్మపదమును పొందును

ఎదప భీష్ముడు ధర్మరాజునకు జైగీషవ్యునకు అసిత దేవల మునికి జరిగిన సంభాషణమును గూర్చి చెప్పెను — ఒకపుడు ధర్మవేత్త శాస్త్రవేత్త హర్ష శోకరహితుడునగు జైగీషవ్య మునిని అసిత దేవలుడను నతడు నీవు నిందా స్తుతులందు సమభావము ఎట్లు కలిగియున్నారని ప్రశ్నింప అమ్మునీశ్వరుడిట్లు చెప్పెను —

జైగీషవ్య ఉవాచ

444 అమృతస్యేవ సంతృప్యేదవమానస్య తత్త్వవిత్
విషస్యేవోద్విజేన్నిత్యం సమ్మానస్య విచక్షణ

(జైగీషవ్య ముని అసితదేవలునితో ఇట్లు చెప్పెను —)

తత్త్వవేత్త అపమానమును అమృతమువలె తలంచి దానిచే దానిచే సంతుష్టుడు కావలెను మఱియు అట్టి బుద్ధిమంతుడు సమ్మానమును విషమువలె భావించి దానిని గూర్చి సదా భీతి నొందవలెను

445 అవజ్ఞాతః సుఖం శేతే ఇహ చాముత్ర చాభయమ్
విముక్తః సర్వదోషేభ్యో యోఽవమన్తా స బధ్యతే

సమస్త దోషముల నుండి విముక్తుడైన మహాత్ముడు అపమానితుడైనను ఇహలోక పరలోకములందు నిర్భయుడై హాయిగ నిదురించును దాని అతనికి అపమానము చేయువాడు పాపబంధమున పడిపోవుచున్నాడు

అటుతరువాత భీష్ముడు ధర్మరాజునకు వ్యాసముని తన పుత్రుడగు శుకునకు బోధించిన ధర్మములను విశదముగ తెలిపెను ఒకపుడు శుకుడు తన తండ్రియగు వ్యాసమునిని ధర్మవిషయమై తత్త్వవిషయమై ప్రశ్నింప వ్యాసముని యిట్లు బోధించెను —

వ్యాస ఉవాచ

446 హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే
తద్భావితాః ప్రపద్యన్తే తస్మాత్ తత్ తస్య రోచతే

(వ్యాసముని శుకునితో ఇట్లు చెప్పెను —)

ఒక జన్మయందు మనుష్యుడు అహింస — హింస కోమలత్వము — కఠోరత్వము ధర్మము — అధర్మము సత్యము — అసత్యము — ఇత్యాది గుణదోషములలో దేనిని పొందియుండునో మఱియొక

జన్మయందును అతడు వాని సంస్కారములచే ప్రభావితుడై ఆ గుణములనే లేక దోషములనే ఇష్టపడుచు ఆ విధముగనే కార్యముల నాచరించును

447 ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి

బ్రహ్మము రెండు స్వరూపముల గలవు — ఒకటి శబ్ద బ్రహ్మము రెండవది పరబ్రహ్మము ఎవరు శబ్ద బ్రహ్మము నెఱుగునో అనగా వేదము యొక్క పూర్ణజ్ఞానము నొందునో అతడు సులభముగ పరబ్రహ్మము యొక్క సాక్షాత్కారమును ఒడయును

448 వీతహర్షమదక్రోధో బ్రాహ్మణో నావసీదతి
దానమధ్యయనం యజ్ఞస్తపో హ్రీరార్జవం దమః
ఏతైర్వర్ధయితే తేజః పాప్మానం చాపకర్షతి

ఏ బుద్ధిమంతుడు హర్ష మద క్రోధ రహితుడై యుండునో అతనికి దుఃఖమెన్నటికిని కలుగదు దానము వేదాధ్యయనము యజ్ఞము తపస్సు లజ్జ సరళత్వము ఇంద్రియ నిగ్రహము - అను ఈ సద్గుణములచే మనుజుడు తన తేజస్సు యొక్క అభివృద్ధిని పాపము యొక్క వినాశమును కలుగ జేసికొనును

449 క్రియావాఞ్ఛ్రద్దధానో హి దాన్తః ప్రాజ్ఞోఽనసూయకః
ధర్మాధర్మ విశేషజ్ఞః సర్వం తరతి దుస్తరమ్

తన ధర్మము ననుసరించి కార్యమొనర్చువాడును శ్రద్ధాళువును, మనస్సు ఇంద్రియములను వశమొనర్చుకొనువాడును, బుద్ధిమంతుడును ఎవని దోషమును చూడనివాడును ధర్మాధర్మముల విశేషజ్ఞానము చక్కగ కలిగియున్నవాడును సమస్త దుఃఖములను దాటివేయుచున్నాడు

450 యచ్ఛేద్ వాఙ్మనసీ బుద్ధ్యాయ ఇచ్ఛేజ్జ్ఞానముత్తమమ్
జ్ఞానేన యచ్ఛేదాత్మానం య ఇచ్ఛేచ్ఛాన్తిమాత్మనః

ఉత్తమ జ్ఞానమును పొందదలంచువాడు బుద్ధిచే మనస్సును వాక్కును జయించవలెను శాంతిని కోరువాడు జ్ఞానము ద్వారా బుద్ధిని పరమాత్మ యందు నిలుపవలెను

451 నిర్మమశ్చానహఙ్కారో నిర్ద్వన్ద్వశ్ఛిన్న సంశయః
నైవ క్రుద్ధ్యతి న ద్వేష్టి నానృతా భాషతే గిరః

452 ఆక్రుష్టస్తాడితశ్చైవ మైత్రేణ ధ్యాతి నాశుభమ్
వాగ్దణ్డకర్మమనసాం త్రయాణాం చ నివర్తకః
సమః సర్వేషు భూతేషు బ్రహ్మాణమభివర్తతే

మమత్వము అహంకారము — వీనిని త్యజించినవాడును శీతోష్ణాది ద్వంద్వములను సమభావముతో సహించగలవాడును సంశయములు తొలగినవాడును, క్రోధము ద్వేషము ఎన్నడు లేనివాడును, అసత్యము పలుకనివాడును తిట్టబడినను కొట్టబడినను వారి అహితమును కోరనివాడును సర్వుల యెడల మిత్రభావమే కలిగి యుండవాడును వాక్కుచేతను కర్మచేతను ఏ ప్రాణిని కష్టమును కలిగించనివాడును సమస్త ప్రాణుల యెడలను సమాన భావము కలిగియుండువాడును అగు యోగి బ్రహ్మభావమును పొందును

453 యదా యోగాద్ విముచ్యన్తే కారణైర్యైర్నిబోధ తత్
యోగైశ్వర్యమతిక్రాన్తో యో నిష్క్రామతి ముచ్యతే

పుత్రకా! యోగి ఏ ప్రకారము, ఏ కారణములచే యోగము యొక్క ఫలస్వరూపమగు మోక్షమును పొందునో చెప్పుచున్నాను — వినుము ఎవడు తీవ్రవైరాగ్యము యొక్క బలముచే యోగజనిత ఐశ్వర్యమును దాటి దాని హద్దును దాటి ఆవలికి పోవునో అతడే ముక్తి నొందును

454 అథ జ్ఞానప్లవం ధీరో గృహీత్వా శాన్తిమాత్మనః
ఉన్మజ్జంశ్చ నిమజ్జంశ్చ జ్ఞానమేవాభిసంశ్రయేత్

ధీరుడగువాడు ఎవేకమును నౌకను ఆశ్రయించి సంసారసాగరమున తన పరమశాంతి కొఱకై వాస్తవిక జ్ఞానము నాశ్రయించి అట్టి భవసాగరమును దాటిపోయవలెను

455 అన్తఃస్థం చ బహిష్ఠం చ సాధి యజ్ఞాధిదైవతమ్
జ్ఞానాన్వితా హి పశ్యన్తి తే దేవాస్తాత తే ద్విజాః

ఎవరు జ్ఞానవంతులై బాహ్యమున అభ్యంతరమున వ్యాప్తమై యున్న అధియజ్ఞమును (పరమాత్మను) అధిదైవమును (పరమ పురుషుని) సాక్షాత్కరించుకొనుచున్నారో వారే దేవతలు వారే ద్విజులు

456 నాన్యత్ర విద్యాతపసోర్నాన్యత్రేన్ద్రియనిగ్రహాత్
నాన్యత్ర సర్వసంత్యాగాత్ సిద్ధిం విన్దతి కశ్చన

విద్య తపస్సు ఇంద్రియనిగ్రహము సర్వస్వత్యాగము — అనునివి లేక ఎవడును (మోక్ష) సిద్ధిని బడయజాలడు

457 ఇన్ద్రియాణి మనో యుఙ్క్తే వశ్యాన్ యన్తేవ వాజినః
మనశ్చాపి సదా యుఙ్క్తే భూతాత్మా హృదయాశ్రితః

సారథి గుఱ్ఱములను తన వశమందుంచుకొని వానిని తన ఇచ్ఛానుసారము ఎట్లు నడిపించునో అట్లే మనస్సు ఇంద్రియములను తన వశమందుంచుకొని వానిని తన యిచ్ఛచొప్పున విషయముల వైపు ప్రేరేపించుచున్నది కాని హృదయమునందున్న జీవాత్మ సదా ఆ మనస్సుపైన కూడ శాసనము నొనర్చును

458 ఇన్ద్రియాణాం తథైవైషాం సర్వేషామీశ్వరం మనః
నియమే చ విసర్గే చ భూతాత్మా మానసస్తథా

మనస్సు ఇంద్రియములన్నిటికిని రాజు అది వానిని విషయముల వైపునకు పంపుటకు గాని నిరోధించుటకు గాని సమర్థమైనది అట్లే హృదయ స్థితుడగు జీవాత్మయు మనస్సునకు ప్రభువు అది మనస్సు యొక్క నిగ్రహ అనుగ్రహములకు సమర్థమైనది

459 ఏవం సప్తదశం దేహే వృతం షోడశభిర్గుణైః
మనీషీ మనసా విప్రః పశ్యత్యాత్మాన మాత్మని

బుద్ధిమంతుడగు బ్రహ్మనిష్ఠుడు ఈ శరీరమందు (పంచేంద్రియములు పంచవిషయములు (ప్రతిబింబ)చేతన మనస్సు ప్రాణము అపానము జీవుడు — అను ఈ) పదునారు తత్త్వములచే ఆవృతుడైన పదునేడవదియైన పరమాత్మను బుద్ధిద్వారా అంతఃకరణమునందు సాక్షాత్కరించుకొనుచున్నాడు

460 న హ్యయం చక్షుషా దృశ్యో న చ సర్వైరపీన్ద్రియైః
మనసా తు ప్రదీపేన మహానాత్మా ప్రకాశతే

ఈ పరమాత్మ యొక్క దర్శనము నేత్రములచే గాని తక్కిన ఇంద్రియములన్నిటిచే గాని కానేరదు ఇది పరిశుద్ధ మనస్సను దీపముచేతనే బుద్ధియందు ప్రకాశించును

461 విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః

విజ్ఞులు విద్య ఉత్తమ కులము గల బ్రాహ్మణుని యందు ఆవు యందు ఏనుగునందు కుక్కయందు చండాలుని యందు సమభావముతోనున్న బ్రహ్మమును దర్శించుదురు

462 స ఏష సర్వేషు భూతేషు జఙ్గమేషు ధ్రువేషు చ
వసత్యేకో మహానాత్మా యేన సర్వమిదం తతమ్

ఎవనిచే ఈ సమస్త జగత్తు వ్యాపింపబడి యున్నదో అట్టి పరమాత్మయే సమస్త చరాచర ప్రాణులందును నివసించుచున్నాడు,

463 సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
యదా పశ్యతి భూతాత్మా బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎప్పుడు జీవాత్మ (జీవుడు) సమస్త ప్రాణులందును తనను తన యందు సమస్త ప్రాణులను ఉన్నట్టులకాంచునో అపుడది బ్రహ్మ భావమును పొందును

464 తదేతదుపశాన్తేన దాన్తేనాధ్యాత్మ శీలినా
ఆత్మారామేణ బుద్ధేన బోద్ధవ్యం శుచికర్మణా

ఆ పరమాత్మను పొందుటకై సాధకుడు మనస్సు అన్ని వైపుల నుండి మరలించి శమదమాది సాధనములతో గూడి ఆత్మతత్త్వమును చింతన చేయవలెను ఏకే పరమాత్మ యందే స్థితి గల్గియుండవలెను జ్ఞానవంతుడైన వానినుండి జ్ఞానమును పొందవలెను శాస్త్రవిహితము లైన పవిత్ర కర్తవ్య కర్మలను నిష్కామభావముతో అనుష్ఠించి జ్ఞాతవ్యమగు ఆత్మతత్త్వమును ఎఱుఁగవలెను

465 యోగదోషాన్ సముచ్ఛిద్య పఞ్చ యాన్ కవయో విదుః
కామం క్రోధం చ లోభం చ భయం స్వప్నం చ పఞ్చమమ్

466 క్రోధం శమేన జయతి కామం సంకల్పవర్జనాత్
సత్త్వసంసేవనాద్ ధీరో నిద్రాముచ్ఛేత్తుమర్హతి

విజ్ఞులు యోగమునకు ప్రతిబంధకములైన కామ క్రోధ, లోభ భయ స్వప్నము (అధిక నిద్ర)లను ఏ ఐదు దోషములను చెప్పిరో వానిని పూర్తిగ తొలగించవలెను వీనిలో క్రోధమును శమము ద్వారా జయించవలెను అట్లే కామమును సంకల్ప త్యాగము ద్వారా జయించవలెను ధీరుడు సత్త్వగుణమును సేవించుటచే (అధిక) నిద్రను జయించగలడు

467 ధృత్యా శిశ్నోదరం రక్షేత్ పాణిపాదం చ చక్షుషా
చక్షుఃశ్రోత్రే చ మనసా మనోవాచం చ కర్మణా
అప్రమాదాద్ భయం జహ్యాద్ దమ్భం ప్రాజ్ఞోపసేవనాత్

ధైర్యము యొక్క సహాయమును గైకొని జననేంద్రియ ఉదరములను అదుపులో నుంచుకొనవలెను నేత్రముల సహాయముచే చేతులను, కాళ్ళను మనస్సు ద్వారా నేత్ర కర్ణములను ఉత్తమ కర్మ ద్వారా మనస్సును వాక్కును రక్షించవలెను (శుద్ధమొనర్చవలెను) సావధానముచే (జాగ్రతగ నుండుట ద్వారా) భయమును మహాత్ములను సేవించుట ద్వారా దంభమును త్యజించవలెను

468 మనస్తు పూర్వమాదద్యాత్ కుమీన మివ మత్స్యహా
తతః శ్రోత్రం తతశ్చక్షుర్జిహ్వాం ఘ్రాణం చ యోగవిత్

చేపలను పట్టువాడు వలను గోరికి వేయు చేపను వల నుండి ముందుగా పట్టుకొనునట్లు యోగవేత్త యగు సాధకుడు మొదట తన మనస్సును వశము చేసికొనవలెను తదుపరి చెవిని ఎమ్మట నేత్రమును, తరువాత జిహ్వాను ఘ్రాణాదులను వశము చేసికొనవలెను

469 ఏవం పరిమితం కాలమాచరణ్ సంశితవ్రతః
ఆసీనో హి రహస్యేకో గచ్ఛేదక్షరసాత్మతామ్

ఏ యోగి ప్రతి దినము నియమిత సమయము వఱకు ఏకాంత స్థలమందు ఒంటరిగ కూర్చొని నియమములను చక్కగ పాలించుచు ఈ ప్రకారము యోగాభ్యాసము చేయునో అతడు అక్షరబ్రహ్మతో సమత్వమును బొందును

470 నాభిష్వజేత్ పరం వాచా కర్మణా మనసాపి వా
ఉపేక్షకో యతాహారో లబ్ధాలబ్ధే సమో భవేత్

యోగమును సాధించువాడు మనస్సు వాక్కు, క్రియల ద్వారా దేని యందు ఆసక్తుడు కారాదు అందఱి యెడల, అన్ని

వస్తువుల యెడల ఉపేక్షాభావము గలిగియుండవలెను నియమిత భోజనము గావింపవలెను లాభము హాని — వీని యందు సమ భావము కలిగియుండవలెను

471 కర్మణః ఫలమాప్నోతి సుఖదుఃఖే భవాభవౌ
విద్యయా తదవాప్నోతి యత్ర గత్వా న శోచతి

కర్మ యొక్క ఫలము సుఖదుఃఖములు జనన మరణములు కర్మ ద్వారా మనుజుడు వీనిని పొందుచున్నాడు కాని జ్ఞానము ద్వారా అతనికి పరమాత్మ పదము సంప్రాప్తించుచున్నది అచటి కేగినచో జీవుడు శాశ్వతముగ శోకము నుండి విముక్తుడగుచున్నాడు

472 యత్ర గత్వా న మ్రియతే యత్ర గత్వా న జాయతే
న పునర్జాయతే యత్ర యత్ర గత్వా న వర్తతే

ఆ పరమాత్మ పదమును బొందినచో ఇక జీవుడు తిరిగి మృత్యువును పొందకుండును అచట పునర్జన్మను గూర్చిన భయము ఉండదు అచటి కేగినవాడు తిరిగి ఈ ప్రపంచమునకు రాడు

473 యద్ బ్రాహ్మణస్య కుశలం తదేవ సతతం వదేత్
తూష్ణీమాసీత నిన్దాయాం కుర్వాణో భైషజ్యమాత్మనః

దేనిచే జనులకు హితము కలుగునో అట్టి వాక్యములనే సదా ఉచ్చరించవలెను తనను ఎవ్వరైన నిందించుచుండినను ఊరకయుండ వలెను ఇట్టి మౌనావలంబనను సంసార రోగము నుండి విముక్తి నొందుటకు ఔషధమని తలంచి దీనిని సేవించుచుండవలెను

374 యేన పూర్ణమివాకాశం భవత్యేకేన సర్వదా
శూన్యం యేన జనాకీర్ణం తం దేవా బ్రాహ్మణం విదుః

ఎవడు సదా తన సర్వవ్యాపక స్వరూపములో నుండుట వలన ఒక్కడే సమస్త ఆకాశమునందు పరిపూర్ణుడై యుండునో, అసంగు డగుట వలన జనులతో నిండిన ప్రదేశమును గూడ శూన్యముగ

తలంచునో అట్టివానినే దేవతలు బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) అని అందురు

475 అహేరివ గణాద్ భీతః సౌహిత్యాన్నరకాదివ
కుణపాదివ చ స్త్రీభ్యస్తం దేవా బ్రాహ్మణం విదుః

ఎవడు జన సముదాయమును సర్పము వలె తలంచి దాని సమీపమునకు వచ్చుటకు భయపడునో రుచికర భోజనజనిత తృప్తిని నరకము వలె భావించి దాని నుండి దూరముగ నుండునో స్త్రీల శరీరములను శవములవలె తలంచి వాని యెడల విరక్తుడై యుండునో, అట్టివానిని దేవతలు బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) అని అందురు

476 అభయం సర్వభూతేభ్యో భూతానామభయం తతః
తస్య మోహాద్ విముక్తస్య భయం నాస్తి కుతశ్చన

ఎవడు సమస్త ప్రాణుల నుండి అభయమును పొందునో ఎవని వలన ఏ ప్రాణికిని భయము కలుగదో అట్టి మోహరహితుడగు వానికి ఎవరి వలనను దేనివలనను భయము ఉండదు

477 జీవితం యస్య ధర్మార్థం ధర్మో హర్యర్థమేవ చ
అహోరాత్రాశ్చ పుణ్యార్థం తం దేవా బ్రాహ్మణం విదుః

ఎవని యొక్క జీవితము ధర్మము కొఱకే యగునో ధర్మము భగవంతుడగు శ్రీహరి కొఱకే యగునో ఎవని యొక్క రాత్రింబగళ్ళు ధర్మపాలనమందే గడచునో అతనిని దేవతలు బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) అని చెప్పుదురు

478 ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యః పరమం మనః
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః

ఇంద్రియముల కంటె వాని విషయములు బలవత్తరములైనవి విషయముల కంటె మనస్సు బలవత్తరమైనది మనస్సు కంటె బుద్ధి బలవత్తరమైనది బుద్ధి కంటె ఆత్మ బలవత్తరమైనది

479 ఏవం సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః

ఈ ప్రకారముగ సమస్త ప్రాణుల యందు వారి హృదయ గుహలో దాగియున్న పరమాత్మ ఇంద్రియముల వలన ప్రకాశమునకు రాకున్నది సూక్ష్మదర్శులగు జ్ఞాని మహాత్ములే తమ సూక్ష్మ శ్రేష్ఠ బుద్ధి ద్వారా అద్దానిని దర్శించుచున్నారు

480 లక్షణం తు ప్రసాదస్య యథా స్వప్నే సుఖం స్వపేత్
నివాతే వా యథా దీపో దీప్యమానో న కమ్పతే

నిద్రా సమయమున మనుజుడెట్టు సుఖముగ నిద్రించునో గాలి వీచని చోట దీపము ఎట్లు నిశ్చలముగ ప్రకాశించునో అదియే విధముగ మనస్సు నిశ్చలముగ నుండవలెను చంచలముగ నుండరాదు అదియే దాని నిర్మలత్వము యొక్క లక్షణము

481 ఎవం పూర్వాపరే కాలే యుఞ్జన్నాత్మాన మాత్మని
లఘ్వాహారో విశుద్ధాత్మా పశ్యత్యాత్మాన మాత్మని

ఎవడు మితాహారియై శుద్ధచిత్తము కలవాడై రాత్రి యొక్క మొదటి, చివరి భాగములలో పైవిధముగ మనస్సును పరమాత్మ యందు లగ్నము చేయునో అట్టివాడే అంతఃకరణమున పరమాత్మ యొక్క దర్శనము చేసికొనును

482 యద్యప్యస్య మహాం దద్యాద్ రత్నపూర్ణామిమాం నరః
ఇదమేవ తతః శ్రేయ ఇతి మన్యేత తత్త్వవిత్

ఎవడైన రత్నములతో నిండియున్న ఈ భూమినంతను ఇచ్చినను తత్త్వవేత్త ఆ ధనమంతటి కంటెను జ్ఞానమే శ్రేష్ఠమైనదని తలంచును

483 ఇన్ద్రియాణి నరే పఞ్చ షష్ఠం తు మన ఉచ్యతే
సప్తమీం బుద్ధిమేవాహుః క్షేత్రజ్ఞం పునరష్టమమ్

మనుజుని శరీరమున ఐదు ఇంద్రియములు కలవు ఆఱవ తత్త్వము మనస్సు ఏడవ తత్త్వము బుద్ధి ఎనిమిదవది క్షేత్రజ్ఞుడు అని చెప్పబడినది

484 న చాత్మా శక్యతే ద్రష్టుమిన్ద్రియైః కామగోచరైః
ప్రవర్తమానైరనయే దుష్కరైరకృతాత్మభిః

దుష్కర్మ పరాయణులు, అశుద్ధ అంతఃకరణము కలవారును అజ్ఞానులు అన్యాయ పూర్వకముగ మనోవాంఛిత విషయములందు సంచరించు ఇంద్రియముల ద్వారా ఆత్మను చూడజాలరు

485 తేషాం తు మనసా రశ్మీన్ యదా సమ్యజ్ నియచ్ఛతి
తదా ప్రకాశతేఽస్యాత్మా దీపదీప్తా యథాఽఽకృతిః

కాని ఎప్పుడు మనుజుడు తన మనస్సు ద్వారా ఇంద్రియములగు గుఱ్ఱముల యొక్క పగ్గములను సదా పట్టుకొనియే యుండి వానిని బాగుగ వశమందుంచుకొనునో అపుడతనికి జ్ఞానము యొక్క ప్రకాశ మందు — దీపప్రకాశమునందు వస్తువు యొక్క ఆకృతి స్పష్టముగ గోచరించునట్లు ఆత్మ యొక్క దర్శనము స్పష్టముగా అగును

486 త్యక్త్వా పూర్వకృతం కర్మ రతిర్యస్య సదాఽఽత్మని
సర్వభూతాత్మ భూతస్య గుణవర్గేష్వ సజ్జతః

ఎవడు తన పూర్వకృత కర్మల యొక్క సంస్కారములను త్యజించి సదా పరమాత్మయందే అనురాగము కలిగియుండునో అతడు సమస్త ప్రాణికోటి యొక్క ఆత్మ అగుచున్నాడు మఱియు అతడు విషయములందు ఎన్నడును ఆసక్తుడు కాకుండును

487 మనసశ్చేన్ద్రియాణాం చాప్యైకాగ్ర్యం పరమం తపః
అజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే

మనస్సుయొక్క ఇంద్రియములయొక్క ఏకాగ్రతయే అన్ని తపస్సులకంటెను గొప్పది అదియే అన్నిధర్మములకంటెను శ్రేష్ఠతమ మరియు, పరమ ధర్మమనియు చెప్పబడినది

488 గోచరేభ్యో నివృత్తాని యదా స్థాస్యన్తి వేశ్మని
తదా త్వమాత్మనాఽఽత్మానం పరం ద్రక్ష్యసి శాశ్వతమ్

ఎపుడు ఇంద్రియములు తమ విషయములనుండి మరలి తమ నివాసస్థానమందు ఉండునో అపుడు నీవు స్వయముగనే సనాతన పరమాత్మయొక్క దర్శనమును గావించుకొందువు

489 జ్ఞాన దీపేన దీప్తేన పశ్యత్యాత్మాన మాత్మని
దృష్ట్వా త్వమాత్మనాఽఽత్మానం నిరాత్మా భవ సర్వవిత్

మనుజుడు ప్రజ్వలిత జ్ఞానమయ ప్రదీపము ద్వారా తనయందే పరమాత్మను సాక్షాత్కరించుకొనుచున్నాడు అట్లే (పుత్రకా!) నీవును ఆత్మద్వారా (శుద్ధ మనస్సుద్వారా) పరమాత్మను సాక్షాత్కరించుకొని సర్వజ్ఞుడవును స్వాభిమానరహితుడవును కమ్ము

490 సర్వతఃస్రోతసం ఘోరాం నదీం లోకప్రవాహినీమ్
పఞ్చేన్ద్రియగ్రాహవతీం మనఃసంకల్పరోధసమ్

491 లోభమోహతృణచ్ఛన్నాం కామక్రోధసరీసృపామ్
సత్యతీర్థానృతక్షోభాం క్రోధ పఙ్కాం సరిద్వరామ్

492 అవ్యక్తప్రభవాం శీఘ్రాం దుస్తరామకృతాత్మభిః
ప్రతరస్వ నదీం బుద్ధ్యా కామగ్రాహసమాకులామ్

493 సంసారసాగరగమాం యోనిపాతాలదుస్తరామ్
ఆత్మకర్మోద్భవాం తాత జిహ్వావర్తాం దురాసదామ్

ఈ సంసారము భయంకరమైన ఒక నది వంటిది ఇది సమస్త లోకములందును అన్ని దిక్కులందును ప్రవహించుచున్నది ఐదు

జ్ఞానేంద్రియములు మొసళ్ళు మనస్సు యొక్క సంకల్పములే దీని తీరములు లోభము మోహము అను గడ్డిచే పాచిచే ఇది కప్పబడి యున్నది కామము క్రోధము అను సర్పములు దీని యందు నివసించుచున్నవి సత్యము దీని యందలి తీర్థఘట్టము అసత్యము దీని యందలి క్షోభ క్రోధము బురద ఇది అవ్యక్తరూపమైన ప్రకృతి యను పర్వతము నుండి ప్రకటితమైనది దీని జలము యొక్క వేగము చాల తీవ్రమైనది అజితాత్ములు దీనిని దాటుట చాల కష్టము దీనియందు కామమను మొసళ్ళు ఎల్లెడల వర్తించు చున్నవి ఈ నది సంసార సాగరమున కలియుచున్నది వాసనలను లోతైన గుంటలు దీనియందుండుటవలన దీనిని దాటుట చాల కష్టము ఇది వారివారి కర్మల నుండియే జనించినది జిహ్వేంద్రియము ఇందలి సుడిగుండము ఈ నదిని దాటుట చాల కష్టము నీవు నీ విశుద్ధ బుద్ధి ద్వారా ఈ నదిని దాటివేయుము

494 నైఅజ్ఞాత్వా పుమాన్ స్త్రీ వా పునర్భవమవాప్నుతే
అభవప్రతిపత్త్యర్థమేతద్ ధర్మం విధీయతే

పురుషుడైనను, స్త్రీయైనను బ్రహ్మమును తెలిసికొనినచో అతని తిరిగి ఈ సంసారమున జన్మ కలుగదు జీవుడు అపునర్భవ స్థితిని పొందుట కొఱకే ఈ బ్రహ్మజ్ఞానరూప ధర్మము యొక్క విధానము గావింపబడినది

495 కామబన్ధనమేవైకం నాన్యదస్తీహ బన్ధనమ్
కామబన్ధన ముక్తో హి బ్రహ్మభూయాయ కల్పతే

ఈ ప్రపంచమున కామమే ఏకైక బంధనము మఱియొక బంధనము లేదు కామబంధనము నుండి విముక్తుడగువాడు బ్రహ్మ భావమును పొందుటకు సమర్థుడగుచున్నాడు

496 ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్ కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ

నదుల యొక్క జలము పరిపూర్ణమై చలింపని ప్రతిష్ఠతో గూడుకొనిన సముద్రమందు దానిన మాత్రము చలింపచేయకుండగనే ప్రవేశించునట్లు ఏ స్థితప్రజ్ఞుని యందు విషయములు ఆతనికి ఏ విధమైన వికారమును కలుగజేయకయే ప్రవేశించుచున్నవో, ఆతడే పరమశాంతిని పొందును గాని భోగములను కోరువాడు కాదు

497 వేదస్యోపనిషత్ సత్యం సత్యస్యోపనిషద్ దమః
దమస్యోపనిషద్ దానం దానస్యోపనిషత్ తపః

498 తపసోపనిషత్ త్యాగస్త్యాగస్యోపనిషత్ సుఖమ్
సుఖస్యోపనిషత్ స్వర్గః స్వర్గస్యోపనిషచ్ఛమః

వేదముల యొక్క సారము సత్యవచనము సత్యము యొక్క సారము ఇంద్రియముల సంయమము సంయమము యొక్క సారము దానము దానము యొక్క సారము తపస్సు తపస్సు యొక్క సారము త్యాగము త్యాగము యొక్క సారము సుఖము సుఖము యొక్క సారము స్వర్గము స్వర్గము యొక్క సారము శాంతి

499 క్లేదనం శోకమనసోః సంతాపం తృష్ణయా సహ
సత్త్వమిచ్ఛసి సంతోషాచ్ఛాన్తి లక్షణ ముత్తమమ్

మనుజుడు సంతుష్టుడై యుండి శాంతికి ఉత్తమ ఉపాయమైన సత్త్వగుణమును పొందుటకు ప్రయత్నించవలెను సత్త్వగుణము మనస్సు యొక్క తృష్ణను శోకమును సంకల్పమును దగ్ధమొనర్చి నశింపజేయుచున్నది

500 విశోకో నిర్మమః శాన్తః ప్రసన్నాత్మా విమత్సరః
షడ్భిర్లక్షణవానేతైః సమగ్రః పునరేష్యతి

శోకరహితుడు మమత్వవర్జితుడు శాంతుడు ప్రసన్నచిత్తుడు మాత్సర్యరహితుడు సంతుష్టుడు — (అను ఈ ఆఱు లక్షణములతో గూడిన) మనుష్యుడు పూర్ణముగ జ్ఞానముచె తృప్తుడై మోక్షమును పొందును

501 అకృత్రిమమసంహార్యం ప్రాకృతం నిరుపస్కృతమ్
అధ్యాత్మం సుకృతం ప్రాప్తః సుఖమవ్యయమశ్నుతే

ఎవడు ఉత్పత్తి వినాశరహితమై స్వభావసిద్ధమై సంస్కారశూన్యమై శరీరముసందున్నదియై సుకృతమను పేరుతో ప్రసిద్ధమైనట్టి బ్రహ్మమును పొందునో అతడు అక్షయ సుఖమును బడయును

502 నిష్ప్రచారం మనః కృత్వా ప్రతిష్ఠాప్య చ సర్వశః
యామయం లభతే తుష్టిం సా న శక్యాఽఽత్మనోఽన్యథా

తన మనస్సును ఇటునటు పోనీయక అరికట్టి ఆత్మయందు సంపూర్ణముగ స్థాపించిన ఎడప మనుజునకు ఎట్టి సంతుష్టి సుఖము కలుగునో, అట్టి సుఖము ఇతరము ఏ ఉపాయముచేతను పొందుట అసంభవము

503 యేన తృప్యత్యభుఞ్జానో యేన తృప్యత్యవిత్తవాన్
యేనాస్నేహో బలం ధత్తే యస్తం వేద స వేదవిత్

దేనిచే భోజనము లేకయే మనుజుడు తృప్తిని పొందునో దేని వలన నిర్ధనునకు కూడ పరమసంతుష్టి కలుగునో దేని ఆశ్రయము లభించినచో ఘృతాదిస్నిగ్ధ పదార్థమును సేవింపకనే మనుజుడు తి యందు అనంతబలము యొక్క అనుభవమును బడయునో అట్టి బ్రహ్మమును ఎవడెఱుగునో అతడే వేదముల యొక్క తత్త్వమును ఎఱిగినవాడు

504 హృది కామద్రుమశ్చిత్రో మోహసంచయ సమ్భవ
క్రోధమానమహాస్కన్ధో విధిత్సాపరిషేచనః

505 తస్య చాజ్ఞానమాధారః ప్రమాదః పరిషేచనమ్
సోఽభ్యసూయాపలాశో హి పురా దుష్కృతసారవాన్

506 సమ్మోహచిన్తా విటపః శోకశాఖో భయాఙ్కురః
మోహనీభిః పిపాసాభిర్లతాభిరనువేష్టితః

మనుజుని యొక్క హృదయమను భూమి యందు మోహమను బీజమునుండి ఉత్పన్నమైన ఒక విచిత్రమైన వృక్షము కలదు దానిపేరు కామము క్రోధము అభిమానము దాని గొప్ప స్కంధములు ఇచ్ఛ (కోరిక) దానికి నీరు పోయు పాత్ర అజ్ఞానము దాని వేరు ప్రమత్తత దానిని తడుపు జలము ఇతరుల దోషములను చూచుట ఆ చెట్టు యొక్క ఆకులు, పూర్వజన్మయందు చేయబడిన పాపము దాని సార భాగము శోకము దాని కొమ్మ మోహము చింత దాని చిన్న కొమ్మలు భయము దాని అంకురము మోహమునందు పడవైచు తృష్ణ దానిపై అల్లుకొనిన తీగెలు

507 ఉపాసతే మహావృక్షం సులుబ్ధాస్తత్ఫలేప్సవః
ఆయసైః సంయుతాః పాశైః ఫలదం పరివేష్ట్య తమ్

లోభులు ఇనుప సంకెళ్ళచే వలె వాసనలను బంధనములచే బంధింపబడి దుఃఖరూప ఫలదాయకమగు ఆ మహావృక్షము చెంత కూర్చొని దాని (దుఃఖరూప) ఫలమును పొందదలంచుచున్నారు

508 యస్తాన్ పాశాన్ వశే కృత్వా తం వృక్షమపకర్షతి
గతః స దుఃఖయోరన్తం జరామరణయోర్ద్వయోః

ఎవడు ఆ వాసనలను బంధనములను వశమొనర్చుకొని వైరాగ్యమను శస్త్రముచే ఆ కామరూప వృక్షమును ఛేదించి

వేయుచున్నాడో, అతడు వ ర్థక్య మరణాజనిత దుఃఖములను దాటి వేయుచున్నాడు

509 సంరోహాత్య కృతప్రజ్ఞః సదా యేన వా పాదపమ్
స తమేవ తతో హాన్తి విషగ్రన్థిరివాతురమ్

ఏ మూర్ఖుడు ఫలము యొక్క లోభముచే సదా ఆ వృక్షము పై నొక్కుచుండునో, అతనిని ఆ వృక్షమే – విషపుమాత్ర రోగిని చంపునట్లు – చంపి వేయుచున్నది

510 తస్యానుగతమూలస్య మూలముద్ధ్రియతే బలాత్
యోగప్రసాదాత్ కృతినా సామ్యేన పరమాసినా

ఆ కామరూప వృక్షము యొక్క వేళ్ళు చాల దూరమువఱకు వ్యాపించియున్నవి బుద్ధి యోగముచే సమత్వమను ఉత్తమ ఖడ్గము ద్వారా బలపూర్వకముగ ఆ చెట్టును మూలోచ్ఛేద మొనర్చి వేయుచున్నాడు

511 ఏవం యో వేద కామస్య కేవలస్య నివర్తనమ్
బన్ధం వై కామశాస్త్రస్య స దుఃఖాన్యతివర్తతే

ఈ ప్రకారముగ ఎవడు కేవలము కామనలను తొలగించుటకు ఉపాయము నెఱిగియున్నాడో భోగాదులు బంధకరములని తెలిసికొనుచున్నాడో, అతడు దుఃఖములన్నిటిని దాటివేయుచున్నాడు

512 శరీరం పురమిత్యాహుః స్వామినీ బుద్ధిరిష్యతే
తత్ర బుద్ధేః శరీరస్థం మనో నామార్థచిన్తకమ్

513 ఇన్ద్రియాణి మనః పౌరాస్తదర్థం తు పరాకృతిః
తత్ర ద్వౌ దారుణౌ దోషౌ తమో నామ రజస్తథా
తదర్థముపజీవన్తి పౌరాః సహా పురేశ్వరైః

ఈ శరీరము ఒక నగరమని చెప్పుదురు బుద్ధి ఈ నగరము యొక్క రాణి శరీరములోన నుండు మనస్సు నిశ్చయాత్మిక బుద్ధి

రూపకారణ యొక్క ప్రయోజనమును సిద్ధింపజేయుటను గూర్చి విచారించు మంత్రి ఇంద్రియములు ఈ నగరమందు నివసించు ప్రజలు వారు మనస్సను మంత్రి యొక్క అధీనమందుందురు ఆ ప్రజల యొక్క రక్షణకొఱకు మనస్సు పెద్ద పెద్ద పనులను చేయవలసివచ్చుచున్నది అచట రజస్సు తమస్సు అను పేర్లు గల గొప్ప దోషములు రెండు కలవు ఆ నగరము యొక్క స్వామురైన మనస్సు బుద్ధి జీవుడు — అను ఈ ముగ్గురితో గూడ సమస్త పురవాసులను ఇంద్రియములు మనస్సు ద్వారా ఎదుట నుంచబడిన శబ్దాది విషయములను అనుభవించుచున్నవి

ఎదప భీష్మాచార్యుడు ధర్మరాజునకిట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ —

514 న చ పాపకృతః పాపాన్ముచ్యన్తే కేచిదాపది
అపాపవాదీ భవతి యదా భవతి ధర్మకృత్
ధర్మస్య నిష్ఠా త్వాచారస్తమేవాశ్రిత్య భోత్స్యసి

(భీష్ముడు ధర్మరాజునకిట్లు చెప్పెను —)

పాపాత్ములు ఆపత్తికాలమున కష్టమనుభవించుచుండగా పాపకార్యమును విడుచుట లేదు ధర్మాచరణము చేయువారు ఆపత్తికాలమందును పాపమును సమర్థింపరు సదాచారమే ధర్మమునకు ఆధారము కావున ధర్మరాజా! మీరు అట్టి సదాచారము నాశ్రయించియే ధర్మము యొక్క యథార్థస్వరూపమును తెలిసికొనగలరు

515 జీవితుం యః స్వయం చేచ్ఛేత్ కథం సోఽన్యం ప్రఘాతయేత్
యద్ యదాత్మని చేచ్ఛేత తత్ పరస్యాపి చిన్తయేత్

ఎవడు తాను స్వయముగ జీవించదలంచునో అట్టివాడు ఇతరుల ప్రాణముల నెట్లు హరింపగలడు ? మనుజుడు తన కొఱకై

ఏయే సుఖములను అనుకూలములను కోరునో వానిని ఇతరులకు గూడ లభించు ఉపాయమును ఆలోచించవలెను

516 అతిరిక్తైః సంవిభజేద్ భోగైరన్యాన కించనాన్

తన ఆవశ్యకతలకు మించి తన యొద్దగల పదార్థములను ఇతరులకు పంచిపెట్టవలెను

517 సర్వం ప్రియాభ్యుపగతం ధర్మమాహుర్మనీషిణః
పశ్యైతం లక్షణోద్దేశం ధర్మాధర్మే యుధిష్ఠిర

అందరితో ప్రేమపూర్వకమైన ప్రవర్తన కలిగియుండుటచే ఏది లభించునో అది యంతయు ధర్మమని పెద్దలు చెప్పుదురు దీనికి వ్యతిరిక్తమైనది అంతయు అధర్మము ధర్మరాజా! ధర్మము యొక్కయు అధర్మము యొక్కయు సంక్షేపముగ ఇదియే లక్షణమని మీరు తెలిసికొనుడు

అనంతరము భీష్ముడు ధర్మరాజునకు జాజలి తులాధార సంవాదమును తెలియజేసెను పూర్వము జాజలియను గొప్ప తపస్సంపన్నుడైన బ్రాహ్మణుడుండెను తాను ధర్మవేత్తలలో అగ్రగణ్యుడని అతడు తలంచుచుండెను కాని అతని కంటె గొప్ప ధర్మవేత్త తులాధారుడను వైశ్యుడు కాశీపట్టణమందు కలడని ఒకపుడతనికి ఆకాశవాణి వినిపించెను ఆ వాక్యములను విని జాజలి అతనిని చూడదలంచి కాశీపురమునకు పోయి తులాధారుని కలిసి కొనెను అపుడు తులాధారుడు జజలిని సత్కరించి అతని రాక విషయమై తనకు ముందుగనే తెలియునని చెప్పి ఆతనికిట్లు బోధించెను —

తులాధార ఉవాచ

518 సర్వేషాం యః సుహృన్నిత్యం సర్వేషాం చ హితే రతః
కర్మణా మనసా వాచా స ధర్మం వేద జాజలే

(తులాధారుడు జాజలితో ఇట్లు చెప్పెను —)

ఎవడు సర్వజీవులకు మిత్రుడైయుండునో, మనోవాక్క్రియల ద్వారా సర్వుల యొక్క హితమందే నిమగ్నమైయుండునో అట్టి వాడే వాస్తవముగ ధర్మము నెఱుంగుచున్నాడు

519 నాహం పరేషాం కృత్యాని ప్రశంసామి న గర్హయే
ఆకాశస్యేవ విప్రేన్ద్ర పశ్యఁల్లోకస్య చిత్రతామ్

నేను ఆకాశము వలె అసంగుడనై జగత్తు యొక్క కార్యముల వైచిత్ర్యమును చూచుచు ఇతరుల కార్యములను ప్రశంసించను నిందించను

520 యదా చాయం న బిభేతి యదా చాస్మాన్న బిభ్యతి
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎపుడు మనుజుడు ఇతరుల వలన భీతి నొందడో తన వలన ఇతరులకు భీతి కలుగకుండ జేయునో దేనిని ఇచ్ఛగింపడో, దేనిని ద్వేషింపడో అపుడాతడు బ్రహ్మమును పొందును

521 యదా న కురుతే భావం సర్వభూతేషు పాపకమ్
కర్మణా మనసా వాచా బ్రహ్మ సమ్పద్యతే తదా

ఎపుడు మనుజునకు సమస్త ప్రాణికోట్ల యెడల మనోవాక్క్రియల ద్వారా చెడ్డ భావములు లేకుండునో, అపుడతడు బ్రాహ్మమును పొందును

522 న భూతానామ హింసాయా జ్యాయాన్ ధర్మోఽస్తి కశ్చన
యస్మాన్నోద్విజతే భూతం జాతు కించిత్ కథంచన
సోఽభయం సర్వభూతేభ్యః సమ్ప్రాప్నోతి మహామునే

ప్రాణులను హింసింపకుండుటచే ఏ ధర్మము సిద్ధించుచున్నదో దానిని మించిన గొప్ప ధర్మము మఱియొకటి లేనేలేదు ఎవని వలన

ఏ ప్రాణియు ఏ విధమైన భయమును పొందదో అతడు సమస్త ప్రాణుల నుండి అభయమును బడయును

523 యథా సర్వరసైః తృప్తో నాభినన్దతి కించన
తథా ప్రజ్ఞాన తృప్తస్య నిత్యతృప్తిః సుఖోదయా

అన్ని రసములతో తృప్తినొందినవాడు ఏ రసమును అభినందించనట్లు జ్ఞానానందముచే పరితృప్తి నొందినవానికిని అక్షయ సుఖమొసంగునట్టి నిత్యతృప్తి ఉండియుండును

524 నిరాశిషమనారమ్భం నిర్నమస్కారమస్తుతిమ్
అక్షీణం క్షీణకర్మాణం తం దేవా బ్రాహ్మణం విదుః

ఎవని మనస్సునందు ఏ కోరికయు లేదో ఎవడు ఫలమును కోరి కార్యములను చేయడో నమస్కారము స్తుతి — వీని నుండి వేఱుగనుండునో ఎవనికి ధర్మము నశింపకయుండునో కర్మబంధము క్షయించెనో అట్టివానినే దేవతలు బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) అందురు

525 అశ్రద్ధా పరమం పాపం శ్రద్ధా పాపప్రమోచినీ
జహాతి పాపం శ్రద్ధావాన్ సర్పో జీర్ణామివ త్వచమ్

అశ్రద్ధ అన్ని పాపముల కంటె పెద్ద పాపము శ్రద్ధ పాపము నుండి తప్పింపజేయునది అయియున్నది పాము తన కుబుసమును వదలునట్లు శ్రద్ధాళువు పాపమును పరిత్యజించును

పిమ్మట భీష్ముడు గౌతముడను మహర్షి యొక్క వృత్తాంతమును చెప్పెను గౌతముడను మహర్షికి చిరకారి అను కుమారుడుండెను అతడు (చిరకారి) ఏ కార్యమైనను నిదానముగ యోచించి చేయుచుండుట చూచి తండ్రి చాల సంతోషించినవాడై ఈ ప్రకారముగ లోకమునకు వెల్లడించెను —

526 రాగే దర్పే చ మానే చ ద్రోహే పాపే చ కర్మణి
అప్రియే చైవ కర్తవ్యే చిరకారీ ప్రశస్యతే

(గౌతముడను మహర్షి ఇట్లు చెప్పెను —)

రాగము దర్పము అభిమానము ద్రోహము పాపాచరణము ఒకరికి అప్రియ మొనర్చుట — అను వీనియందు విలంబము (ఆలస్యము) చేయువాడు ప్రశంసించబడును (ఆ దుర్గుణములనుగూర్చి బాగుగ విచారించి వానిని తొలగించుకొనవలెనని భావము)

అనంతరము భీష్ముడు కపిల స్యూమరశ్మి సంవాదమును గూర్చి ధర్మరాజునకు తెలియజేసెను పూర్వము కపిల మహర్షి స్యూమరశ్మి యను ఋషికి ఈ ప్రకారము బోధించెను —

కపిల ఉవాచ

527 చతుర్ద్వారం పురుషం చతుర్ముఖం
చతుర్ధా చైనముపయాతి వాచా
బాహుభ్యాం వాచ ఉదరాదుపస్థాత్
తేషాం ద్వారం ద్వారపాలో బుభూషేత్

(కపిలుడు స్యూమరశ్మితో ఇట్లు చెప్పెను —)

మనుజులకు చేతులు, కాళ్ళు వాక్కు, ఉదరము, ఉపస్థ (జననేంద్రియము) — అను ఈ నాలుగున్న నాలుగు ద్వారములు వీనికి ద్వారపాలకుడుగ నుండవలెను (వానిని సంయమము గావింపవలెను) అతడు శాస్త్రవాక్యములను అనుసరించి ఈ నాలుగు ద్వారముల సంయమముచే పొందబడు — ఋక్, యజుస్, సామ, అథర్వరూప చతుర్ముఖముఖములతో కూడిన — పరమ పురుషుని భక్తియోగ జ్ఞానయోగ కర్మయోగ, అష్టాంగ యోగములను నాలుగు ఉపాయములచే పొందును,

528 ద్వారాణి యస్య సర్వాణి సుగుప్తాని మనీషిణః
ఉపస్థముదరం హస్తౌ వాక్ చతుర్థీ స వై ద్విజః

ఎవనికి ఉపస్థ ఉదరము హస్తములు పాదములు వాక్కు — అను ఈ ద్వారములు పూర్ణముగ రక్షింపబడియుండునో అట్టివాడే వాస్తవముగ బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞుడు) అయియున్నాడు

529 ఆనృశంస్యం క్షమా శాన్తి రహింసా సత్యమార్జవమ్
అద్రోహో౽నభిమానశ్చ హ్రీస్తితిక్షా శమస్తథా

530 ఏతానీ బ్రహ్మణస్త్వేతే ఏతైః ప్రాప్నోతి యత్పరమ్
తద్ విద్వాననుబుధ్యేత మనసా కర్మనిశ్చయమ్

సమస్త ప్రాణుల యెడల దయ క్షమ శాంతి అహింస సత్యము సరళత్వము అద్రోహము, నిరభిమానము లజ్జ తితిక్ష (ఓర్పు) శమము — అనునవి పరబ్రహ్మమును పొందుటకు మార్గములు వీనిద్వారా మనుజుడు పరబ్రహ్మమును (పరమాత్మను) పొందుచున్నాడు ఈ ప్రకారముగ బుద్ధిమంతుడు మనస్సు ద్వారా కర్మముయొక్క వాస్తవ పరిణామమును గూర్చిన నిశ్చయమును ఎఱుఁగవలెను

531 యైషైవ నిషా సర్వత్ర యత్ తదస్తి చ నాస్తి చ
ఏతదన్తం చ మధ్యం చ సచ్చాసచ్చ విజానతః

సమస్త శాస్త్రముల యొక్క ఏకైక తాత్పర్యము ఏమనగా — ఏయే దృశ్యపదార్థములు కలవో అవి ప్రతీతి కాలమున మాత్రముండును పరమార్థ జ్ఞాన స్థితియందు బాధితములగుటచే లేకుండును జ్ఞాని యొక్క దృష్టియందు స్వరూపబ్రహ్మమే ఈ జగత్తు యొక్క ఆదిమధ్యాంతములు అయియున్నది

532 సమాప్తం త్యాగ ఇత్యేవ సర్వవేదేషు నిష్ఠితమ్
సంతోష ఇత్యనుగతమపవర్గే ప్రతిష్ఠితమ్

సమస్తమును త్యాగమొనర్చుటచేతనే ఆ బ్రహ్మము పొందబడుచున్నది ఈ విషయమే వేదములన్నిటి యందును నిశ్చయింపబడియున్నది ఆ బ్రహ్మము తన ఆనంద స్వరూపముతో అందరి యందును అనుగతమై మోక్షమందు ప్రతిష్ఠితమైయున్నది

533 తేజః క్షమా శాన్తి రనామయం శుభం
తథావిధం వ్యోమ సనాతనం ధ్రువమ్
ఏతైః సర్వైరమ్యతే బుద్ధినేత్రై
స్తస్మై నమో బ్రహ్మణే బ్రాహ్మణాయ

ఆకాశము వలె అసంగమై నాశరహితమై సదా ఏకరసమై యుండు అట్టి బ్రహ్మతత్త్వమును జ్ఞాననేత్రములు కలవారందఱును తేజస్సు క్షమ శాంతి అను శుభ సాధనముల ద్వారా సాక్షాత్కరించుకొనుచున్నారు ఏది వాస్తవముగ బ్రహ్మవేత్త కంటె భిన్నము కానిదై యున్నదో అట్టి పరబ్రహ్మమునకు నమస్కారము

ఎదప భీష్ముడు ధర్మరాజున కిట్లు ప్రబోధించెను —

భీష్మ ఉవాచ

534 ఆశాయా స్తనయోఽధర్మః క్రోధోఽసూయాసుతః స్మృతః
లోభః పుత్రో నికృత్యాస్తు కృతఘ్నో నార్హతి ప్రజామ్

(భీష్ముడు ధర్మరాజున కిట్లు చెప్పెను —)

ఆశ యొక్క పుత్రుడు అధర్మము అసూయ యొక్క పుత్రుడు క్రోధము శఠత్వము యొక్క పుత్రుడు లోభము కాని కృతఘ్నుడు సంతానమును పొందుటకు యోగ్యుడు కాడు (కృతఘ్నత అతి నీచ గుణమని భావము)

535 సుప్రసన్నా హి తే దేవా యత్రై ధర్మే రతా మతిః
ధనే సుఖకలా కాచిద్ ధర్మే తు పరమం సుఖమ్,

ధర్మరాజా! మీ యెడల దేవతలు చాల ప్రసన్నులై యున్నారు దానిచే మీ బుద్ధి ధర్మమందు తత్పరమైయున్నది ధనము వలన సుఖము లేశమాత్రము కలుగుచున్నది కాని పరమ సుఖము ధర్మమందే కలదు

536 పూర్వే సముద్రే యః పన్థాః స న గచ్ఛతి పశ్చిమమ్
ఏకః పన్థా హి మోక్షస్య తన్మే విస్తరతః శృణు

ధర్మరాజా! తూర్పు సముద్రము వైపునకు పోవుమార్గము పశ్చిమ సముద్రము వైపునకు పోదు అట్లే మోక్షమునకు ఒకే మార్గము కలదు దానిని చెప్పుచున్నాను వినుము

537 క్షమయా క్రోధముచ్ఛిన్ద్యాత్ కామం సంకల్ప వర్జనాత్
సత్త్వసంసేవనాద్ ధీరో నిద్రాం చ చ్ఛేత్తు మర్హతి

ముముక్షువు క్షమచే క్రోధమును, నశింపజేయవలెను సంకల్పముల త్యాగముచే కామమును తొలగించవలెను ధీరుడగు వాడు జ్ఞాన ధ్యానాది సాత్త్వికగుణముల సేవనముచే నిద్రను క్షయింప జేయవలెను

538 అప్రమాదాద్ భయం రక్షే చ్ఛ్వాసం క్షేత్రజ్ఞ శీలనాత్
ఇచ్ఛాం ద్వేషం చ కామం చ ధైర్యేణ వినివర్తయేత్

అప్రమత్తతచే భయమును తొలగించవలెను ఆత్మ చింతనముచే శ్వాసను రక్షించుకొనవలెను (జీవితమును సార్థకము చేసుకొనవలెను) ధైర్యముచే ఇచ్ఛను ద్వేషమును కామమును తొలగించుకొనవలెను

539 భ్రమం సమ్మోహ మావర్తమభ్యాసాద్ వినివర్తయేత్
నిద్రాం చ ప్రతిభాం చైవ జ్ఞానాభ్యాసేన తత్త్వవిత్

తత్త్వవేత్త శాస్త్రాభ్యాసముచే భ్రమ, మోహము సంశయములను తొలగించుకొనవలెను మఱియు అలసత్వ,

విషయబుద్ధులను రెండు దోషములను జ్ఞానాభ్యాసముచే నివ రించు కొనవలెను

540 ఉపద్రవాం స్తథా రోగాన్ హితజీర్ణ మితాశనాత్
లోభం మోహం చ సంతోషాద్ విషయాం స్తత్త్వ దర్శనాత్

శారీరక ఉపద్రవములను రోగములను హితకర సుపాచ్య పరిమిత భోజనముచేతను, మోహమును సంతుష్టిచేతను విషయము లను తాత్త్వికదృష్టిచేతను తొలగించుకొనవలెను

541 అనుక్రోశాదధర్మం చ జయేద్ ధర్మమవేక్షయా
ఆయత్యా చ జయేదాశామర్థం సంగవివర్జనాత్

అధర్మములను దయచేత తొలగించుకొనవలెను ధర్మమును విచారణాపూర్వకముగ పాలించవలెను భవిష్యత్తును గూర్చి విచ రణ సలుపుటచే ఆశపైనను ఆసక్తిని వదలుటచే అర్థము (ధనాశ)పైనను విజయమును పొందవలెను

542 అనిత్యత్వేన చ స్నేహం క్షుధాం యోగేన పణ్డితః
కారుణ్యేనాత్మనో మానం తృష్ణాం చ పరితోషతః

బుద్ధిమంతుడు వస్తువుల యొక్క అనిత్యత్వమును చింతన చేయుట ద్వారా రాగమును యోగాభ్యాసము ద్వారా క్షుధను (ఆకలిని) కరుణచే అభిమానమును, సంతృప్తిచే తృష్ణను జయించవలెను

543 ఉత్థానేన జయేత్ తన్ద్రీం వితర్కం నిశ్చయాజ్జయేత్
మౌనేన బహుభాష్యం చ శౌర్యేణ భయం త్యజేత్

అలసత్వమును ప్రయత్నముచేతను, విపరీత తర్కమును శాస్త్రము యెడల విశ్వాసముచేతను జయించవలెను మౌనము ద్వారా ఎక్కువగ మాట్లాడు అలవాటును, శూరవీరత్వము ద్వారా భయమును జయించవలెను,

544 యచ్ఛేద్ వాఙ్మనస బుద్ధ్యా తాం యచ్ఛేజ్ఞాన చక్షుషా
జ్ఞానమాత్మావ బోధేన యచ్ఛేదాత్మాన మాత్మనా

మనస్సును వాక్కును మనస్సువా త సమస్త ఇంద్రియములను బుద్ధి ద్వారా వశమొనర్చుకొనవలెను బుద్ధిని వివేకమను నేత్రము ద్వారా శాంతపఱచవలెను ఆత్మజ్ఞానవ ద్వారా ఆత్మను పరమాత్మ యందు లయింపజేయవలెను ఈ ప్రకారముగ పవిత్ర ఆచార విచారణలతో గూడిన సాధకుడు ఎల్లెడల ఉపరతిని బొంది శాంత భావముచే పర మాత్మ యొక్క సాక్షాత్కారమును పొందవలెను

తరువాత జీవుడు దేహాభిమానము నుండి విముక్తుడగు విషయ మును గూర్చి భీష్ముడు నారద అసిత దేవలుని సంవాదమును పెర్కొనెను పూర్వము అసిత దేవలుడను బ్రహ్మర్షి దేవర్షియగు నారదున కిట్లు చెప్పెను —

అసిత ఉవాచ

545 తత్ర నైవానుతప్యన్తే ప్రాజ్ఞా నిశ్చిత నిశ్చయాః
కృపణాస్త్వనుపత్యన్తే జనాః సమ్బన్ధ దర్శినః

(అసిత దేవలుడు నారదునితో ఇటు చెప్పెను —)

ఆత్మ శరీరము కంటె వేఱని అసంగమని నాశరహితమని బుద్ధిమంతులు నిశ్చయముగ తెలిసికొనుచున్నారు కావున శరీరము యొక్క వియోగమైనను వారు ఒకింతైనను చింతింపరు కాని అజ్ఞానులు దేహముతో తమ సంబంధము కలదని నమ్ముచుండుటచే దేహ వియోగముచే వారికి చాల దుఃఖము కలుగుచున్నది

546 న హ్యాయం కస్యచిత్ కశ్చిన్నాస కశ్చన విద్యతే
భవత్యేకో హ్యయం నిత్యం శరీరే సుఖదుఃఖభాక్

ఈ జీవుడు వాస్తవముగ దేనికి సంబంధించినవాడు కాడు ఏదియు అతనికి సంబంధించినది కాదు అతడు వాస్తవముగ

ఒంటరిగనే ఉన్నాడు కాని శరీరమందుండి దానిని తనదిగ భావించుట వలననే అతడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు

547 నైవ సంజాయతే జన్తుర్న చ జాతు విపద్యతే
యాతి దేహ మయం ముక్త్వా కదాచిత్పరమాం గతిమ్

జీవుడు ఎన్నడును పుట్టుటలేదు మరణించుట లేదు ఎపుడితనికి తత్త్వజ్ఞానము కలుగునో — అపుడు దేహాభిమానమును వదలి పరమ గతిని (మోక్షమును) పొందుచున్నాడు

548 పుణ్యపాప క్షయార్థం వా సాంఖ్యజ్ఞానం విధీయతే
తత్క్షయే హ్యస్య పశ్యన్తి బ్రహ్మభావే పరాంగతిమ్

పుణ్యపాపముల క్షయము కొఱకే జ్ఞాన యోగ సాధన చెప్ప బడినది వాని క్షయమగుటచే యెపుడు జీవాత్మ బ్రహ్మ భావమును పొందుచున్నదో అపుడు బుద్ధిమంతులు దానినే పరమగతియని నమ్మెదరు

ఎమ్మట భీష్ముడు ధర్మరాజున కిట్లు బోధించెను —

భీష్మ ఉవాచ
549 అర్థాఃఖలు సమృద్ధా వా బాఢం దుఃఖం విజానతామ్
అసమృద్ధా స్త్వపి సదా మోహ యన్త్య విచక్షణాన్

(భీష్ముడు ధర్మరాజున కిట్లు చెప్పెను —)

వివేకవంతునకు సమృద్ధి సంపన్నములగు విషయములు కూడ దుఃఖరూపములుగనే కన్పట్టును అజ్ఞానులకు తుచ్ఛవిషయములు కూడ గొప్ప మోహమందు పడద్రోయుచున్నవి

550 యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్
తృష్ణా క్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్

ఈ ప్రపంచమున కామసుఖమేది కలదో స్వర్గమ దలి దివ్య సుఖమేది కలదో అది యంతయు తృష్ణాక్షయజనిత సుఖములో పదునాఱవ భాగమంతకూడ నుండదు

551 యథైవ శృఙ్గం గోః కాలే వర్ధమానస్య వర్ధతే
తథైవ తృష్ణా విత్తేన వర్ధమానేన వర్ధతే

ఆవు పెరిగిన కొద్దీ దాని కొమ్ముకూడ పెరుగునట్లు, పెరుగు చున్న ధనముతో గూడ, దాని తృష్ణయు పెరుగుచుండును

552 కించిదేవ మమత్వేన యదా భవతి కల్పితమ్
తదేవ పరితాపాయ నాశే సమ్పద్యతే పునః

ఏ వస్తువైనను దాని యందు మమత్వము కలిగియుండుట చేతను, ఆ వస్తువు తనదని నమ్ముటచేతను అది నశించినపుడు అదియే మనుజునకు సంతాప కారణమగుచున్నది

553 న కామాననురుద్ధ్యేత దుఃఖం కామేషు వై రతిః
ప్రాప్యార్థముపయుఞ్జీత ధర్మం కామాన్ వివర్జయేత్

కావున కోరికలను భోగములను వృద్ధి నొందింపరాదు భోగములందలి ఆసక్తి దుఃఖరూపమే అయియున్నది ధనమున్నను దానిని ధర్మమందే వినియోగించవలెను కామ భోగములను పూర్తిగ విడనాడవలెను

554 చారిత్రమాత్మనః పశ్యం శ్చన్ద్రశుద్ధమనామయమ్
ధర్మాత్మా లభతే కీర్తిం ప్రేత్య చేహ యథా సుఖమ్

ఎవడు తన సదాచారమును చంద్రుని వలె విశుద్ధముగను, ఉజ్జ్వలముగను నిర్వికారముగను ఒనర్చుకొనునో అట్టి ధర్మాత్ముడు ఇహ పరలోకములందు కీర్తిని, సుఖమును పొందుచున్నాడు

అటు ఎదప శరీర ప్రపంచముల యొక్క అనిత్యత్వమును గూర్చియు ఆత్మశ్రేయస్సునకై ఒనర్చవలసిన కర్తవ్యమును గూర్చియు తెలియజేయు నిమిత్తము భీష్ముడు పితాపుత్రుల సంవాదమును ధర్మరాజునకు తెలియజేసెను మేధావి అను ఒకానొక పుత్రుడు తన తండ్రికి ఈ విధముగ బోధించెను —

పుత్ర ఉవాచ

555 రాత్ర్యాం రాత్ర్యాం వ్యతీతా యామాయురల్పతరం యదా
గాధోదకే మత్స్య ఇవ సుఖం విన్దేత కస్తదా

(మేధావి అను పుత్రుడు తన తండ్రితో ఇట్లు చెప్పెను —)

ఒక్కొక్క రాత్రి గడచుటతోడనే ఆయుస్సు కొంచెము కొంచెము క్షీణించుచుండగా కొద్ది నీరున్న చెఱువులోని చేపవలె ఎవడు సుఖమును పొందగలడు ?

556 పుష్పాణీవ విచిన్వన్త మన్యత్ర గతమానసమ్
అనవాప్తేషు కామేషు మృత్యు రభ్యేతి మానవమ్

మనుజుడు వనమందు పుష్పములు కోసికొనుచుండగా ఒక హింసకజీవి వచ్చి మీద పడినటు మనుజుని మనస్సు అన్యత్ర (విషయాదులందు) లగ్నమైయున్నపుడు అతని కోరిక ఇంకను నెర వేరకయున్నపుడే తత్క్షణమే మృత్యువు వచ్చి అతనిని మ్రింగి వేయుచున్నది

557 శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్
న హి ప్రతీక్షతే మృత్యుః కృతం వాస్య నవా కృతమ్

కాబట్టి రేపు చేయవలసిన పనిని ఈరోజే చేయవలెను మధ్యాహ్నము చేయవలసిన పనిని ప్రొద్దుననే చేయవలెను ఏలయనిన పని పూర్తి అయినను, లేకున్నను మృత్యువు అతని కొఱకై వేచి యుండదు

558 అద్యైవ కురు యచ్ఛ్రేయో మాత్వాం కాలో౽త్యగాన్మహాన్
కో హి జానాతి కస్యాద్య మృత్యుకాలో భవిష్యతి

తండ్రీ! శుభకార్యమును మీరు ఈ దినమే చేసివేయుడు మహాకాలుడు మిమ్ములను క్రమింగి వేయకమునే కార్యమును పూర్తి చేయవలెను ఎవనికి మృత్యుకాలము ఎప్పుడు సంభవించునో ఎవడు తెలిసికొనగలడు ?

559 అకృతేష్వేవ కార్యేషు మృత్యుర్వై సంప్రకర్షతి
యువైవ ధర్మశీలః స్యాదనిమిత్తం హి జీవితమ్

పనులన్నియు సగములో నిలిచిపోవుచున్నవి మృత్యువు తన వైపునకు లాగివేయుచున్నది కావున యౌవనమునందే మనుజుడు ధర్మమును ఆచరించవలెను ఏలయనిన జీవితమునకు ఒక నిలుకడ లేదు

560 న మృత్యుసేనా మాయాన్తీం జాతు కశ్చిత్ ప్రబాధతే
బలాత్ సత్యమృతే త్వేకం సత్యే హ్యమృత మాశ్రితమ్

ఒక్క సత్యము తప్ప మరెవడును ఎదురుగా వచ్చుచున్న మృత్యువు యొక్క సేనను బలపూర్వకముగ ఎదురించలేడు ఏలయనిన సత్యమునందే అమృతము (బ్రహ్మము) ప్రతిష్ఠితమైయున్నది

561 అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితమ్
మృత్యురాపద్యతే మోహాత్ సత్యేనా పద్యతే౽మృతమ్

అమృతము మృత్యువు — ఈ రెండును శరీరమునందు కలవు మోహమువలన మృత్యువు కలుగుచున్నది సత్యమువలన అమృత పదము (మోక్షము) లభించుచున్నది

562 నాస్తి విద్యాసమం చక్షుర్నాస్తి విద్యాసమం ఫలమ్
నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం సుఖమ్

ప్రపంచమున బ్రహ్మవిద్యతో సమానమైన నేత్రము లేదు బ్రహ్మవిద్యతో సమానమైన ఫలమున్ను లేదు రాగము (ఆశ)తో సమానమైన దుఃఖము లేదు త్యాగముతో సమానమైన సుఖము లేదు

అనంతరము భీష్ముడు ధర్మరాజునకీ ప్రకారము ప్రబోధించెను-

భీష్మ ఉవాచ

563 న చక్షుషా న మనసా న వాచా దూషయే దపి
న ప్రత్యక్షం పరోక్షం వా దూషణం వ్యాహరేత్ క్వచిత్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

నేత్రముచేతను మనస్సుచేతను ఇతరుల దోషములను చూడరాదు తలంచరాదు చెప్పరాదు ఒకని యెదుట గాని పరోక్షమందుగాని ఇతరుల దోషములను గూర్చిన చర్చ చేయరాదు

564 న హింస్యాత్ సర్వభూతాని మైత్రాయణగతశ్చరేత్
నేదం జీవితమాసాద్య వైరం కుర్వీత కేనచిత్

సమస్త ప్రాణికోట యందును దేనిని హింసింపరాదు దేనిని బాధించరాదు అన్నిటితో మిత్రభావము గలిగియుండవలెను నశ్వరమగు ఈ జీవితమునందు దేని యెడలను శత్రుత్వము గలిగియుండరాదు

565 వాచో వేగం మనసః క్రోధవేగం
హింసా వేగముదరోపస్థ వేగమ్
ఏతాన్ వేగాన్ విషహేద్ వై తపస్వీ
నిన్దా చాస్య హృదయం నోపహన్యాత్

మనుజుడు తపస్వియై వాక్కు, మనస్సు క్రోధము, హింస, ఉదరము ఉపస్థ (జననేంద్రియము) — వీని యొక్క వేగములను సహించుకొనుచు, వానిని వశపరచుకొనవలెను ఇతరులు

కావించు నింద తన హృదయమందు ఏ విధమైన వికారమును కలుగ జేయకుండుగాక !

566 జ్ఞానేన వా యదా జన్తు రజ్ఞాన ప్రభవం తమః
వ్యపోహతి తదా బ్రహ్మ ప్రకాశతి సనాతనమ్

ఎపుడు జీవుడు తత్త్వజ్ఞానము ద్వారా అజ్ఞాన జనితమగు అంధకారమును దూరీకరించుచున్నాడో అపుడతని హృదయమందు సనాతన బ్రహ్మము ప్రకాశించుచున్నది

ఎదప బ్రహ్మప్రాప్తికి వలసిన ఉపాయమును గూర్చి చెప్పుచు భీష్ముడు తత్సందర్భమున వృత్రాసుర శుక్రాచార్య సంవాదమును పేర్కొనెను పూర్వమొకపుడు వృత్రాసురుడు శుక్రాచార్యునితో ఇట్లు చెప్పెను —

వృత్ర ఉవాచ

567 తిర్య గ్యోని సహస్రాణి గత్వా నరకమేవ చ
నిరచ్ఛన్త్యవశా జీవాః కామబన్ధన బన్ధనాః

(వృత్రాసురుడు శుక్రాచార్యునితో ఇట్లు చెప్పెను —)

కామమను బంధనమందు బంధింపబడి వివశులై ఎందరో జీవులు వేల పర్యాయములు పశుజన్మలందును, నరకమునందును పడి మరల అచటి నుండి బయలుదేరి అనేక జన్మల నొందుచున్నారు

అంతట శుక్రాచార్యుడు వృత్రాసురునితో ఇట్లు వచించెను —

ఉశనోవాచ

568 లీలయాల్పం యథా గాత్రాత్ ప్రమృజ్యాదాత్మనో రజః
బహుయత్నేన మహతా దోష నిర్హరణం తథా

(శుక్రాచార్యుడు వృత్రాసురునితో ఇట్లు చెప్పెను —)

శరీరమందు తగుల్కొనిన దుమ్మును మనుజుడు ప్రయత్నముచే సులభముగ తొలగించి వేయునట్లు, మరల మరల చేయబడిన గొప్ప

ప్రయత్నముచే అతడు తన రాగద్వేషాది దోషములను కూడ తొలగించి వేయగలడు

తరువాత భీష్ముడు నారద సమంగ సంవాదమును ధర్మరాజునకు చెప్పెను పూర్వము సమంగుడను మహాత్మునకు నారదున కిటు వచించెను —

సమఙ్గ ఉవాచ —

569 యస్మై ప్రజ్ఞా కథయన్తే మనుష్యాః
ప్రజ్ఞామూలం హీన్ద్రియాణాం ప్రసాదః
ముహ్యన్తి శోచన్తి తథేన్ద్రియాణి
ప్రజ్ఞాలాభో నాస్తి మూఢేన్ద్రియస్య

(సమంగుడు నారదునితో ఇట్లు చెప్పెను —)

జ్ఞానులు చెప్పునట్టి ప్రజ్ఞకు మూలము ఇంద్రియముల యొక్క నిర్మలత్వము ఎవని ఇంద్రియములు మోహ శోకములందు లగ్నమై యున్నవో, అట్టి మోహాచ్ఛన్న ఇంద్రియములు కలవానికి ప్రజ్ఞ లభించనేరదు

570 న బాన్ధవా న చ విత్తం న కౌలీనం
న చ శ్రుతం న చ మన్త్రా న వీర్యమ్
దుఃఖాత్ త్రాతుం సర్వ ఏవోత్సహన్తే
పరత్ర శీలేన తు యాన్తి శాన్తిమ్

బంధువులు ధనము ఉత్తమ కులము, శాస్త్రాధ్యయనము మంత్రములు పరాక్రమము — అనునవి యన్నియు కలిసి కూడ ఒకనిని దుఃఖము నుండి విముక్తిని పొందింపలేవు ఉత్తమ స్వభావము వలననే మనుజుడు ఇహ పరలోకములందు శాంతిని పొందును

571 నాస్తి బుద్ధిరయుక్తస్య నాయోగాద్ విన్దతే సుఖమ్
ధృతిశ్చ దుఃఖత్యాగశ్చేత్యుభయం తు సుఖం నృప

యోగయుక్తమగు చిత్తము లేనివానికి సమత్వబుద్ధి కలుగదు యోగము లేనిచో ఎవడును సుఖమును పొందజాలడు దుఃఖములతో సంబంధమును వదలుట ధైర్యము — అను ఈ రెండే సుఖమునకు కారణములు

తదుపరి భీష్ముడు ధర్మరాజునకు తన బోధను ఈ ప్రకారము కొనసాగించెను —

భీష్మ ఉవాచ

572 గురుపూజా చ సతతం వృద్ధానాం పర్యుపాసనమ్
శ్రవణం చైవ శాస్త్రాణాం కూటస్థం శ్రేయ ఉచ్యతే

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పను —)

సదా గురుజనులను పూజించుట పెద్దలను సేవించుట శాస్త్రములను శ్రవణము చేయుట — అను ఈ మూడును శ్రేయమునకు అమోఘ సాధనములని చెప్పబడినవి

573 నివృత్తిః కర్మణః పాపాత్ సతతం పుణ్యశీలతా
సద్భిశ్చ సముదాచారః శ్రేయ ఏతదసంశయమ్

పాపకర్మ నుండి దూరముగ నుండుట, పుణ్యకార్యములందు తత్పరులైయుండుట సజ్జన సాంగత్యము గలిగి సదాచారమును చక్కగా పాలించుట — నిక్కముగ శ్రేయస్సునకు మార్గమైయున్నది

574 నక్తం చర్యాం దివా స్వప్నమాలస్యం పైశునం మదమ్
అతి యోగమయోగం చ శ్రేయసోఽర్థీ పరిత్యజేత్

శ్రేయస్సును కోరువాడు రాత్రి సంచారము చేయుట పగలు నిద్రించుట సోమరితనము మత్తుపదార్థములను సేవించుట ఆహారాదులను అధికముగ సేవించుట, వానిని పూర్తిగ సేవించకుండుట — అను వీనిని త్యజించవలెను

ఎవ్విధముగ మోక్షము భీష్ముడు వైరాగ్యోత్పాదకమగు మోక్షవిషయమును గూర్చి తెలుపుచు అరిష్టనేమి సగరుల సంవాదమును గూర్చి చెప్పెను పూర్వము సగర మహారాజు యొక్క ప్రశ్నను పురస్కరించుకొని గొప్ప శాస్త్రవేత్తయగు అరిష్టనేమి అతనికీ ప్రకారముగ బోధించెను —

తార్క్ష్య ఉవాచ —

575 సుఖం మోక్షసుఖం లోకే న చ మూఢోఽవ గచ్ఛతి
ప్రసక్తః పుత్రపశుషు ధనధాన్య సమాకులః

(తార్క్ష్యుడు (అరిష్టనేమి) సగరునితో ఇట్లు చెప్పెను —)

ప్రపంచమున మోక్షసుఖమే వాస్తవమైన సుఖము కాని ధన ధాన్యముల సంపాదనమునందే వ్యగ్రుడైనవాడు పుత్ర పశ్వాదులందు ఆసక్తి గలవాడునగు మూఢునకు దానిని గూర్చిన యథార్థజ్ఞానము ఉండదు

576 భోజనాచ్ఛాదనే చైవ మాతా పితా చ సంగ్రహమ్
స్వకృతే నాధిగచ్ఛన్తి లోకే నాస్త్యకృతం పురా

మనుజునకు పూర్వజన్మ కర్మల ననుసరించియే భోజనము, వస్త్రము తల్లిదండ్రులచే సంగ్రహింపబడిన ధనము ప్రాప్తించును ప్రపంచమున ఏది లభించనో అది పూర్వకృత కర్మల ఫలితము కాక మఱియేమియు కాదు

577 క్షుత్పిపాసాదయో భావా జితా యస్యేహ దేహినః
క్రోధో లోభస్తథా మోహః సత్త్వవాన్ ముక్త ఏవ సః

ఎవడు ఆకలి, దప్పిక, క్రోధము లోభము, మోహము మున్నగు భావములపై విజయమును పొందెనో అట్టి సత్త్వసంబంధ మనుజుడు సదా ముక్తుడే యగును

578 ప్రస్థం వాహా సహస్రేషు యాత్రార్థం చైవ కోటిషు
ప్రాసాదే మఞ్చకం స్థానం యః పశ్యతి స ముచ్యతే

అనేక అన్నరాసులలో కడుపు నిండుటకు కావలసిన రెండు మూడు ముద్దల అన్నమును మాత్రమే ఎవడు తన జీవిత నిర్వాహణమునకై చాలునని తలంచి వానినుండి గ్రహించునో ప్రపంచమున తాను పరుండుటకు అవసరమైన నేలను మాత్రమే చాలునని తలంచి అంతమాత్రము గ్రహించునో అట్టివాడు ముక్తుడగును

579 పర్యఙ్కశయ్యా భూమిశ్చ సమానే యస్య దేహినః
శాలయశ్చ కదన్నం చ యస్య స్యాన్ముక్త ఏవ సః

ఎవనికి రమణీయమగు మంచము నేల రెంటును సమముగ తోచునో, రుచికరమైన భోజనము సామాన్యమగు అన్నము-రెంటును ఎవనికి సమానముగ తోచునో అట్టివాడు ముక్తుడే యగును

580 శాస్త్రైర్లోకైశ్చ యో బుద్ధః సర్వం పశ్యతి మానవః
అసారమివ మానుష్యం సర్వథా ముక్త ఏవ సః

ఎవడు శాస్త్రాధ్యయనము చేతను లౌకిక అనుభవము చేతను జ్ఞానసంపన్నుడై సమస్త మానవ జగత్తును సారహీనముగ చూచునో అట్టివాడు ముక్తుడే యగును

తరువాత భీష్ముడు ధర్మరాజునకు పరాశరుడు జనకునకు ఉపదేశించిన ధర్మములను బోధించెను సమస్త ప్రాణులకును ఇహలోక పరలోకములందు శ్రేయస్సును కలుగజేయు వస్తువేది యని జనకమహారాజు ప్రశ్నింప, పరాశర మునీంద్రుడిట్లు వచించెను—

పరాశర ఉవాచ

581 నాభిజ్ఞాయతే కించిన్నాకృత్వా సుఖమేధతే
సుకృతైర్విన్దతే సౌఖ్యం ప్రాప్య దేహక్షయం నరః

(పరాశరుడు జనక చక్రవర్తితో నిట్లనెను — )

విత్తనములేక చెట్టు మొలవనట్లు పుణ్యకర్మ చేయక ఎవఁడును సుఖమందుడు కాని సమృద్ధిశాలి కాని కానేరడు దేహాత్యాగానంతరము కూడ మనుజుడు పుణ్యకర్మల ఫలములచేతనే సుఖము నొందును

582 దమః క్షమా ధృతి స్తేజః సంతోషః సత్యవాదితా
హ్రీరహింసా వ్యసనితా దాక్ష్యం చేతి సుఖావహాః

ఇంద్రియ నిగ్రహము క్షమ ధైర్యము తేజస్సు సంతుష్టి సత్యభాషణము లజ్జ అహింస దుర్వ్యసనములు లేకుండుట, దక్షత్వము— అనునవి యన్నియు సుఖము నొసంగునవియై యున్నవి

583 భీరూ రాజన్యో బ్రాహ్మణః సర్వభక్షో
వైశ్యోఽనీహావాన్ హానవర్ణోఽలసశ్చ
విద్వాం శ్చాశీలో వృత్తహీనః కులీనః
సత్యాద్ విభ్రష్టో ధార్మిక స్త్రీ చ దుష్టా

584 రాగీయుక్తః పచమానోఽఽత్మహేతి —
ర్మూర్ఖో వక్తా నృపహీనం చ రాష్ట్రమ్
ఏతే సర్వే శోచ్యతాం యాన్తి రాజన్
యశ్చాయుక్తః స్నేహహీనః ప్రజాసు

పిరికివాఁడైన క్షత్రియుడు సర్వభక్షుడైన బ్రాహ్మణుడు, అకర్మణ్యుడగు వైశ్యుడు సోమరియగు శూద్రుడు ఉత్తమగుణములు లేని విద్వాంసుడు సదాచారమును పాలింపని కులీనుడగు మనుజుఁడు, సత్యమునుండి భ్రష్టుడైన ధార్మికుడు దురాచారిణియగు స్త్రీ విషయాసక్తుడగు యోగి కేవలము తనకొఱకు మాత్రమే అన్నము వండుకొనువాడు మూర్ఖుడగు వక్త రాజులేని రాష్ట్రము, అజితేంద్రియుడు ప్రజలయెడల స్నేహములేని వాడగు రాజు - వీరందఱును శోకమును పొందుదురు

585 ఆయుర్న సులభం లబ్ధ్వా నావకర్షేద్ విశామ్పతే
ఉత్కర్షార్థం ప్రయతేత నరః పుణ్యేన కర్మణా

మనుష్య శరీరము ఆయుస్సు దుర్లభములైనవి వానిని పొంది ఆత్మను కిందకు పడవేయరాదు మనుజుడు పుణ్యకర్మానుష్ఠానము ద్వారా ఆత్మయొక్క ఉద్ధానము కొఱకె సదా ప్రయత్నించుచుండవలెను

586 దమాన్వితః పురుషో ధర్మశీలో
భూతాని చాత్మానమివానుపశ్యేత్
గరీయసః పూజయే దాత్మ శక్త్యా
సత్యేన శీలేన సుఖం నరేన్ద్ర

మనుజుడు ఇంద్రియ నిగ్రహము కలవాడు ధర్మాత్ముడు అయి సమస్త ప్రాణికోట్లను తనవలెనే చూడవలెను విద్య తపస్సు వయస్సునందు తనకంటె అధికులైన వారిని లేక గురుస్థానమునకు చెందినవారిని అందఱిని యథాశక్తి పూజించవలెను సత్యభాషణము ఉత్తమ ఆచార విచారణ —వీనిచేతనే శాంతి లభించను

587 యేఽర్థా ధర్మేణ తే సత్యా యేఽధర్మేణ ధిగస్తుతాన్
ధర్మం వై శాశ్వతం లోకే న జహ్యాద్ ధనకాఙ్క్షయా

ధర్మమును పాలించుచు సంపాదించిన ధనమే నిజమైన ధనము. అధర్మముచే సంపాదించు ధనము ధిక్కారయోగ్యమైనది ప్రపంచమున ధనేచ్ఛచే శాశ్వత ధర్మమును ఎన్నడును త్యజించరాదు

588 అగ్నిరాత్మా చ మాతా చ పితా జనయితా తథా
గురుశ్చ నరశార్దూల పరిచర్యా యథాతథమ్

అగ్ని, ఆత్మ తల్లి తండ్రి - వీరందఱిని యథాయోగ్యముగ పూజించుచుండవలెను

28

589 తపః సర్వగతం తాత హానస్యాపి విధీయతే
జితేన్ద్రియస్య దాన్తస్య స్వర్గమార్గ ప్రవర్తకమ్

తపస్సునందు అందఱికిని అధికారము కలదు జితేంద్రియుడును మనోనిగ్రహ సంపన్నుడును హీనవర్ణమునకు చెందినను అట్టివానికి తపస్సుయొక్క విధానమునందు అధికారము కలదు ఎలయనగ తపస్సు మనుజుని స్వర్గ మార్గమునకు తీసికొని వెళ్లునది అయి యున్నది

590 ఇషుప్రపాతమాత్రం వా స్పర్శయోగే రతిః స్మృతా
రసనే దర్శనే ఘ్రాణే శ్రవణే చ విశామ్పతే

బాణము ధనుస్సునుండి బయలుదేరి భూమిపై పడుటకు ఎంత సమయము పట్టునో అంత సమయము స్పర్శేంద్రియము జిహ్వా, నేత్రము నాసిక కర్ణము (చెవి) విషయముల ననుభవించుటలో పట్టును (అనగా విషయసుఖములు క్షణికములని భావము)

591 ఏకః శత్రుర్న ద్వితీయోఽస్తి శత్రు
రజ్ఞానతుల్యః పురుషస్య రాజన్
యేనావృతః కురుతే సమ్ప్రయుక్తో
ఘోరాణి కర్మాణి సుదారుణాని

మనుజునకు ఒకే శత్రువు కలదు అతనితో సమానమైన శత్రువు మఱియొకడు లేడు అతడు అజ్ఞానము ఆ అజ్ఞానముచే ఆవృతుడై మఱియు ప్రేరేపింపబడి జీవుడు అత్యంత క్రూరత పూర్ణములగు కార్యములను చేయును

592 కథం న విప్రణశ్యేమ యోనితోఽస్యా ఇతి ప్రభో
కుర్వన్తి ధర్మం మనుజాః శ్రుతిప్రామాణ్యదర్శనాత్

దేనిచే మనము ఈ మనుష్య జన్మనుండి క్రిందకు పడమో, అట్టి దానిని ఆలోచించి వైదిక ప్రమాణములను చక్కగా విచారించి ధర్మమును అనుష్ఠించవలెను

593 యో దుర్లభతరం ప్రాప్య మానుష్యం ద్విషతే నరః
ధర్మావమన్తా కామాత్మా భవేత్స ఖలు వఞ్చ్యతే

ఎవడు అత్యంత దుర్లభమగు ఈ మానవ జన్మను పొందియు ఇతరుల యెడల ద్వేషము కలిగి యుండుచున్నాడో ధర్మమును అనాదరించుచున్నాడో కోరికలతో సక్తుడై యుండుచున్నాడో అట్టివాడు గొప్ప లాభమును పోగొట్టుకొనుచున్నాడు

594 అసక్తిః శ్రేయసో మూలం జ్ఞానం చైవ పరా గతిః
చీర్ణం తపో న ప్రణశ్యేద్వాపః క్షేత్రే న నశ్యతి

ఆసక్తి లేకుండుట అనునదే శ్రేయస్సునకు మూలకారణము జ్ఞానమే అన్నిటికంటెను ఉత్తమమైనది న్యాయముగ నొనర్చిన తపస్సు పాత్రమున నిచ్చిన దానము — ఇవి ఎన్నడును నశింపవు

595 యో దదాతి సహస్రాణి గవామశ్వశతాని చ
అభయం సర్వభూతేభ్యః సదా తమభివర్తతే

సమస్త ప్రాణులకును అభయదానము నొసంగుట, వెయ్యి ఆవులను నూఱు గుఱ్ఱములను దానము చేయుట కంటె గొప్పది

596 జహాతి దారాంశ్చ జహాతి సమ్పదః
పదం చ యానం వివిధాశ్చ యాః క్రియాః
త్రివిష్టపే జాతమతిర్యదా నరః
తదాస్య బుద్ధిర్విషయేషు భిద్యతే

ఎప్పుడు మనుజుడు సర్వోత్తమ (ఆత్మ) పదమును పొందుటకు ఉత్సుకత్వము కలిగియుండునో అప్పుడతని బుద్ధి విషయముల నుండి తొలగిపోవును మఱియు అతడు స్త్రీ ధన పద పదవి వాహనము వివిధ క్రియలు — వీనియందలి ఆసక్తిని త్యజించును

597 న ధర్మకాలః పురుషస్య నిశ్చితో
న చాపి మృత్యుః పురుషం ప్రతీక్షతే
సదా హి ధర్మస్య క్రియైవ శోభనా
యదా నరో మృత్యుముఖేఽభివర్తతే

మనుజునకు ధర్మమాచరించుటకు ఒక విశేష సమయమనునది లేదు ఏలయనిన మృత్యువు ఎవనికొఱకును ప్రతీక్షింపదు ఎప్పుడు మనుజుడు సదా మృత్యుముఖమందే ఉండుచున్నాడో అప్పుడతనికి నిరంతరము ధర్మము నాచరించుటయే శ్రేయస్కరమై యున్నది

598 అహోరాత్రమయే లోకే జరారూపేణ సంచరన్
మృత్యుర్గ్రసతి భూతాని పవనం పన్నగో యథా

పగళ్ళు రాత్రులతో కూడిన ఈ ప్రపంచమున వార్ధక్యమను రూపమును ధరించి తిరుగుచున్న మృత్యువు సమస్త ప్రాణులను— పాము గాలినివలె - భక్షించుచున్నది

599 న మాతా న పితా కించిత్ కస్యచిత్ ప్రతిపద్యతే
దానపథ్యోదనో జన్తుః స్వకర్మఫలమశ్నుతే

తల్లిగాని, తండ్రికాని కూడ పరలోక సంబంధమున ఎవనికిని ఏ సహాయమున్ను చేయజాలరు పరలోక మార్గమున తాను నరిగిన దానము లేక త్యాగమే దారిబత్తెముగ ఉపయోగించును ప్రతి జీవుడు తన కర్మ యొక్క ఫలముచే అనుభవించుచున్నాడు

తదుపరి భీష్మాచార్యుడు ధర్మరాజునకు హంసగీతను బోధించెను పూర్వమొకపుడు బ్రహ్మదేవుడు హంసరూపమున సాధ్యుల కిట్లు ప్రబోధించెను—

హంస ఉవాచ

600 వేదస్యోపనిషత్ సత్యం సత్యస్యోపనిషద్ దమః
దమస్యోపనిషన్మోక్ష ఏతత్ సర్వానుశాసనమ్

హంస (రూపమున బ్రహ్మదేవుడు) సాధ్యులకిట్లు చెప్పెను—

వేదాధ్యయనము యొక్క సారము సత్యభాషణము సత్య భాషణము యొక్క సారము ఇంద్రియ నిగ్రహము ఇంద్రియ నిగ్రహము యొక్క సారము మోక్షము ఇదియే సమస్త శాస్త్రముల యొక్క ఉపదేశము

601 వాచో వేగం మనసః క్రోధవేగం
విధిత్సావేగముదరోపస్థవేగమ్
ఎతాన్ వేగాన్ యో విషహేదుదీర్ణాం
స్తం మన్యేఽహం బ్రాహ్మణం వై మునిం చ

ఎవడు వాక్కుయొక్క వేగము మనస్సు యొక్క వేగము, క్రోధము యొక్క వేగము తృష్ణ యొక్క వేగము ఉదర జననేంద్రియముల వేగము— ఈ ప్రచండ వేగములన్నిటిని సహించుకొని వానిని అరికట్టునో అట్టివానినే నేను బ్రహ్మవేత్త అని ముని అని చెప్పుదును

602 అక్రుశ్యమానో నాక్రుశ్యేన్మన్యురేనం తితిక్షతః
ఆక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విన్దతి

ఎవడు ఒకనిచే తిట్టబడినను తిరిగి వానిని తిట్టడో అట్టి క్షమాశీలునిచే అణచబడిన క్రోధమే ఆ తిట్టినవానిని దహించివేయును మఱియు అతని పుణ్యమును కూడ గైకొనును

603 అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుః
సత్యం వదేద్ వ్యాహృతం తద్ ద్వితీయమ్
వదేద్ వ్యాహృతం తత్ తృతీయం
ప్రియం ధర్మం వదేద్ వ్యాహృతం తచ్చతుర్థమ్

వ్యర్థముగ మాట్లాడుటకంటె మౌనముగనుండుట శ్రేష్ఠమని చెప్పబడినది ఇది వాక్కుయొక్క మొదటి విశేషము సత్యము

వచనకుట వాక్కుయొక్క రెండవ విశేషము ప్రియముగ మాట్లాడుట వాక్కుయొక్క మూడవ విశేషము ధర్మసమ్మతముగ మాట్లాడుట వాక్కుయొక్క నాలుగవ విశేషము

ఎదప భీష్ముడు ధర్మరాజునకిట్లు బోధించెను—

భీష్మ ఉవాచ

604 రాగం మోహం తథా స్నేహం కామం క్రోధం చ కేవలమ్
యోగాచ్ఛిత్త్వా తతో దోషాన్ పఞ్చైతాన్ ప్రాప్నువన్తితత్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

యోగులు కేవలము యోగబలముచేతనే రాగము, మోహము స్నేహము (మమత్వము) కామము క్రోధం — అను ఈ ఐదు దోషములను సమూలముగ నశింపజేసి పరమాత్మ పదమును పొందుచున్నారు

605 యథా చానిమిషాః స్థూలా జాలం ఛిత్త్వా పునర్జలమ్
ప్రాప్నువన్తి తథా యోగాస్తత్ పదం వీతకల్మషాః

పెద్ద పెద్ద చేపలు వలను కొఱికివేసి తిరిగి జలమందు ప్రవేశించు నట్లు యోగులు తమ పాపములను నశింపజేసి పరమాత్మ పదమును పొందుచున్నారు

606 న యమో నాన్తకః క్రుద్ధో న మృత్యుర్భీమ విక్రమః
ఈశతే నృపతే సర్వే యోగస్యామితతేజసః

అమిత తేజస్వియగు యోగిపైని క్రుద్ధుడైన యముని యొక్క— అంతకుని యొక్క— భయంకర పరాక్రమము చూపు మృత్యువు యొక్క శాసనము చెలదు

607 అప్రమత్తో తథా ధన్వీ లక్ష్యం హన్తి సమాహితః
యుక్తః సమ్యక్ తథా యోగీ మోక్షం ప్రాప్నోత్యసంశయమ్

సదా సావధాన చిత్తుడై మనస్సును ఏకాగ్రపఱచి బాణమును వదలు ధనుర్ధరుడైన వీరుడు లక్ష్యమును తప్పక ఛేదించునట్లు మనస్సును పరమాత్మ ధ్యానమందు లగ్నమొనర్చు యోగి నిస్సందేహముగ మోక్షమును పొందును

608 ఛినన్తి క్షమయా క్రోధం కామం సంకల్పవర్జనాత్
సత్త్వసంసేవనాన్నిద్రామప్రమాదాద్ భయం తథా
ఛిన్దన్తి పఞ్చమం శ్వాసమల్పాహారతయా నృప

సజ్జనులు క్షమచే క్రోధమును సంకల్ప త్యాగముచే కామమును సత్త్వగుణ సేవనముచే నిద్రను, ప్రమత్తతా త్యాగముచే భయమును అల్పాహార సవనముచే ఐదవదియగు శ్వాసదోషమును జయించుచున్నారు

అనంతరము భీష్ముడు ధర్మరాజునకు వసిష్ఠ మునీంద్రుడు కరాల జనకరాజునకు బోధించిన తత్త్వమును తెలిపెను పూర్వము కరాల జనకుడను రాజు వసిష్ఠమునీంద్రుని పరమార్థతత్త్వ విషయమై ప్రశ్నింప అతడిట్లు ప్రబోధించెను —

వసిష్ఠ ఉవాచ

609 సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి

(వసిష్ఠుడు కరాలజనకునితో ఇట్లు చెప్పెను —)

పరమాత్మ యొక్క చేతులు కాళ్ళు నేత్రములు శిరస్సులు ముఖములు, చెవులు అంతటను కలవు అతడు ప్రపంచమంతటను వ్యాపించి యున్నాడు

610 తామసా నిరయం యాన్తి రాజసా మానుషానథ
సాత్త్వికా దేవలోకాయ గచ్ఛన్తి సుఖభాగినః

జీవరాసులలో తమోగుణముగల ప్రాణులు నరకమున ఎడుచున్నారు రాజసగుణముకలవారు మనుష్యలోకమున కేగుచున్నారు సుఖభాగులకు సాత్త్వికజీవులు దేవలోకమునకు పోవుచున్నారు

611 నిష్కేవల్యేన పాపేన తిర్యగ్యోనిమవాప్నుయాత్
పుణ్యపాపేన మానుష్యం పుణ్యేనైకేన దేవతాః

కేవలము అత్యంత పాపకర్మల యొక్క ఫలస్వరూపముగ జీవులు పశు పక్ష్యాది తిర్యగ్జన్మలను పొందుచున్నారు పుణ్య పాప సమ్మిశ్రమముచే మనుష్యలోకము లభించుచున్నది కేవలము పుణ్యముచే జీవులు దేవలోకమునకు పోవుచున్నారు

612 ఏవమవ్యక్తవిషయం క్షరమాహుర్మనీషిణః
పఞ్చవింశతియో యోఽయం జ్ఞానాదేవ ప్రవర్తతే

ఈ ప్రకారముగ ప్రకృతిచే ఉత్పన్నములగు పదార్థములను జ్ఞానులు క్షరములందురు ఇరువదినాలుగు తత్త్వముల కంటె వేరైన ఇరువది ఐదవ తత్త్వము పరమాత్మయని చెప్పబడినది ఆతడే అక్షరుడు ఆతడు జ్ఞానము చేతనే పొందబడుచున్నాడు

613 అహమేతాని వై సర్వం మయ్యేతానీన్ద్రియాణి హ
నిరిన్ద్రియో హి మన్యేత వ్రణవానస్మి నిర్వ్రణః

జీవుడు వాస్తవముగ ఇంద్రియరహితుడు అయినను అతడు నేనే సమస్తకర్మలను ఆచరించుచున్నాను నాయందే ఇంద్రియము లన్నియు కలవు - అని తలంచుచున్నాడు ఈ ప్రకారముగ అతడు వాస్తవముగ ఛిద్రరహితుడైనను ఛిద్రసహితునిగ తన్ను తలంచుకొనుచున్నాడు

614 అమృత్యుర్మృత్యుమాత్మానమచరశ్చరమాత్మనః
అక్షేత్రః క్షేత్రమాత్మానమసర్గః సర్గమాత్మనః

జీవుడు వాస్తవముగ సర్వథా మృత్యురహితుడైనను తన్ను మృత్యుసహితుడుగ తలంచుచున్నారు అచలుడైనను తన్ను తిరుగు వానిగ తలంచుచున్నారు క్షేత్రము కంటె వేరైనప్పటికి తన్ను క్షేత్రముగ తలంచుచున్నారు సృష్టితో తనకేమియు సంబంధము లేకున్నను సృష్టిని తనదిగనే భావించుచున్నారు

తదుపరి భీష్ముడు యాజ్ఞవల్క్యుడు విశ్వావసువను గంధర్వ రాజునకు బోధించిన ఆధ్యాత్మిక విషయములను గూర్చి తెలిపెను పూర్వము యాజ్ఞవల్క్య ముని విశ్వావసువు కిట్లు బోధించెను —

యాజ్ఞవల్క్య ఉవాచ

615 అక్షయత్వాత్ ప్రజననే అజమత్రాహురవ్యయమ్
అక్షయం పురుషం ప్రాహుః క్షయో హ్యస్య న విద్యతే

(యాజ్ఞవల్క్యుడు విశ్వావసువను గంధర్వునితో ఇట్లు చెప్పెను —)

జన్మను గ్రహించినప్పటికిని క్షయరహితుడగుటచే పురుషుని (జీవుని) వాస్తవముగ జన్మరహితుడని నాశరహితుడని అక్షయుడని చెప్పబడెను ఏలయనిన అతని క్షయము ఎప్పుడును లేదు

616 జాయన్తే చ మ్రియన్తే చ యస్మిన్నేతే యతశ్చ్యుతాః
వేదార్థం యే న జానన్తి వేద్యం గన్ధర్వసత్తమ

సమస్త భూతకోట్లు దేనియందు స్థితి గలిగియున్నవో దేని యందు ఉత్పన్నమగుచు లయించుచున్నవో అట్టి వేద ప్రతిపాదిత మగు జ్ఞేయ పరమాత్మను ఎవరు తెలిసికొనరో వారు పరమార్థము నుండి భ్రష్టులై జనన మరణముల నొందుచుందురు

అటు తరువాత భీష్ముడు ధర్మరాజున కిట్లు ఉపదేశించెను —

భీష్మ ఉవాచ

617 ఆత్మా హ్యేవాత్మనో హ్యేకః కో౽న్యస్తస్మాత్పరో భవేత్
ఏవం మన్యస్వ సతతమన్యథా మా విచిన్తయ

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

రాజా! ఒక్క పరమాత్మయే తనవాడు ఆతనిని మించి మఱి యొకడెవడు ఆత్మీయుడు ఉండగలడు? మీరు సదా ఇట్లే విశ్వసించి దీనికి ఎలక్షణమైన మఱి ఏ యితర విషయమును చింతన చేయరాదు

618 ఏతన్మయా౽౽ప్తం జనకాత్ పురస్తాత్
తేనాపి చాప్తం నృప యాజ్ఞవల్క్యాత్
జ్ఞానం విశిష్టం న తథా హి యజ్ఞా
జ్ఞానేన దుర్గం తరతే న యజ్ఞైః

ఈ జ్ఞానము పూర్వము జనక మహారాజు వలన నాకు లభించినది జనకునకు యాజ్ఞవల్క్యుని ద్వారా లభించినది జ్ఞానము అన్నిటికంటె ఉత్తమమైన సాధన యజ్ఞములు దీనితో సమానములు కాజాలవు జ్ఞానముచే మనుజుడు దుర్గమమగు ఈ సంసార సముద్రమును దాటగలడు యజ్ఞములచే కాదు

619 నైవాస్య కశ్చిద్ భవతి నాసౌ భవతి కస్యచిత్
పథి సఙ్గతమేవేదం దారైరన్యైశ్చ బన్ధుభిః
నాయమత్యన్తసంవాసో లబ్ధపూర్వో హి కేనచిత్

ఇచట జీవునకు నాది అనునది ఏదియు లేదు ఇతడు కూడ ఎవరివాడును కాడు దారిలో కలిసికొను బాటసారులవలె, మనుజుడు పత్ని బంధువులు - వీరితో కలిసికొనుచున్నాడు కాని ఇచట ఎవడును ఎవని తోడను చిరకాలమువఱకు సహవాస సుఖమును అనుభవించుట లేదు

620 జరామృత్యూ హి భూతానాం ఖాదితారౌ వృకావివ
బలినాం దుర్బలానాం చ హ్రస్వానాం మహతామపి

బలవంతుడైనను దుర్బలుడైనను పెద్దవాడైనను చిన్నవాడైనను సమస్త ప్రాణులను వార్ధక్య మరణములు తోడేలువలె భక్షించివేయుచున్నవి

621 వైరాగ్యం పునరేతస్య మోక్షస్య పరమో విధిః
జ్ఞానాదేవ చ వైరాగ్యం జాయతే యేన ముచ్యతే

వైరాగ్యమే మోక్షమునకు ప్రధాన కారణము జ్ఞానము చేతనే ఆ వైరాగ్యముదయించుచున్నది దానిచే మనుజుడు ముక్తుడగుచున్నాడు

622 కాషాయధారణం మౌణ్డ్యం త్రివిష్టబ్ధం కమణ్డలుమ్
లిఙ్గాన్యుత్పథభూతాని న మోక్షాయేతి మే మతిః

కాషాయ వస్త్రమును ధరించుట తల గొరిగించుకొనుట త్రిదండమును కమండలువును ధరించుట, మున్నగునవి ఉత్కృష్టమగు సన్న్యాస మార్గము యొక్క పరిచయమొసంగు చిహ్నములు మాత్రమే యగును. వీని ద్వారా మోక్షమెప్పుడును సిద్ధింపదు

623 ఇచ్ఛతశ్చ రక్తత యో లాభః స్త్రీపుంసోరమృతోపమః
అలాభశ్చాప్య రక్తస్య సోఽపి దోషో విషోపమః

స్త్రీ పురుషులు పరస్పరము అనురక్తులై యున్నచో వారి దాంపత్య సుఖము అమృతమువలె నుండును అట్లు అనురక్తులు కానిచో ఆ దోషము విషమువలె భయంకరమైనది

అనంతరము భీష్ముడు ధర్మరాజునకు వ్యాసమునీంద్రుడు తన కుమారుడగు శుకునకు బోధించిన ఆధ్యాత్మిక విషయములను గూర్చి తెలిపెను వ్యాసముని శుకున ప్రకారముగ బోధసలిపెను —

వ్యాస ఉవాచ

624 ఫేనమాత్రోపమే దేహే జీవే శకునివత్ స్థితే
అనిత్యే ప్రియసంవాసే కథం స్వపిషి పుత్రక

(వ్యాసముని శుకునకిటు చెప్పెను —)

పుత్రకా! ఈ శరీరము నీటిపై నురుగువలె క్షణభంగురమైనది దీనియందు జీవుడు పక్షివలె నివసించుచున్నాడు ప్రియజనులతో సహవాసమున్ను ఎల్లకాలము ఉండునది కాదు అయినను నీవేల నిద్రించుచు పడియున్నావు ?

625 కామం క్రోధం చ మృత్యుం చ పఞ్చేన్ద్రియజలాం నదీమ్
నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర

కామము క్రోధము మృత్యువు పంచేంద్రియములు అను జలముతో నిండియున్నట్టి విషయ సక్తి యను నదిని నీవు సాత్త్విక ధైర్యమను నావను ఆశ్రయించి దాటివేయుము ఈ ప్రకారముగ జన్మ మృత్యురూప దుర్గమ సంకటమును దాటివేయుము

626 తిష్ఠన్తం చ శయానం చ మృత్యురన్వేషతే యదా
నిర్వృత్తిం లభతే కస్మాదకస్మాన్మృత్యునాశితః

మనుష్యుడు నిలబడియున్నను పరుండినను మృత్యువాతనిని వెన్నంటుచున్నది ఈ ప్రకారముగ మృత్యువు అకస్మాత్తుగ గ్రహించునది అయియుండ ఇట్టి నీవేల నిశ్చింతగ, శాంతముగ కూర్చొని యున్నావు ?

627 సంచిన్వానకమేవైనం కామానామవితృప్తకమ్
వృకీవోరణమాసాద్య మృత్యురాదాయ గచ్ఛతి

మనుజుడు భోగసామగ్రిని కూడబెట్టుకొనుటలో నిమగ్నుడై యుండుచు వానిచే తృప్తిని బడయకున్నాడు ఇంతలో గొఱ్ఱెపిల్లను

తోడేలు తీసుకొని పోవునట్లు మృత్యువాతనిని చంకన పెట్టుకొని పోవుచున్నది

628 బ్రాహ్మణ్యం బహుభిరవాప్యతే తపోభి
స్తల్లబ్ధ్వా న రతిపరేణ హేలితవ్యమ్
స్వాధ్యాయే తపసి దమే చ నిత్యయుక్తః
క్షేమార్థీ కుశలపరః సదా యతస్వ

బహుకాలము గొప్ప తపస్సు చేయుటచే బ్రహ్మనిష్ఠకు అనువైన దేహము లభించుచున్నది దానిని పొంది విషయానురాగమందు తగుల్కొని జీవితమును వ్యర్థము చేయరాదు కావున నీవు నీ శ్రేయస్సును కోరుకో కుశల ప్రదమగు కర్మయందు సంలగ్నుడవై సదా స్వాధ్యాయము తపస్సు ఇంద్రియ నిగ్రహములందు పూర్ణముగ తత్పరుడవై యుండుటకు ప్రయత్నింపుము

629 పురా సమూలబాన్ధవం ప్రభుర్హరత్యదుఃఖవిత్
తవేహ జీవితం యమో న చాస్తి తస్య వారకః

యముడు అందఱి యొక్క ప్రభువు అతడు బంధు సహితముగ నీ ప్రాణములను హరించివేయును అతనిని అడ్డుపెట్టువారెవరును లేరు అట్టి సమయము రాకపూర్వమే నీవు నిన్ను రక్షించుకొనుటకై ప్రయత్నింపుము

630 పురాభివాతి మారుతో యమస్య యః పురఃసరః
పురైక ఏవ నీయసే కురుష్వ సామ్పరాయికమ్

యమునకు ముందుగా ప్రచండ కాలమను వాయువు పోవుచుండును అది ఒంటరిగనే నిన్ను అచటికి లేవగొట్టుకొని పోవును కావున నీవు మొదటనే పరలోకమున సుఖమొసగు ధర్మమును ఆచరింపుము,

631 పురా శరీరమన్తకో భినత్తి రోగసారథిః
ప్రసహ్య జీవితక్షయే తపో మహత్ సమాచర

రోగము ఎవని సారథియో అట్టి కాలుడు అకస్మాత్తుగ నీ శరీరమును విదీర్ణమొనర్చివేయును కావున ఈ జీవితము నాశమగుటకు పూర్వమే నీవు గొప్ప తపస్సును ఆచరించుము

632 పురా వృకా భయంకరా మనుష్యదేహగోచరా
అభిద్రవన్తి సర్వతో యతస్వ పుణ్యశీలనే

ఈ మనుష్య శరీరమందుండు కామక్రోధాదులను భయంకరమైన తోడేళ్ళు నీపై నలువైపుల ఆక్రమణము సలుపుచున్నవి కావున మొదటి నుండియే నీవు పుణ్య సంచయమునకై ప్రయత్నము చేయుము

633 ధనస్య యస్య రాజతో భయం న చాస్తి చోరతః
మృతం చ యన్న ముఞ్చతి సమర్జయస్వ తద్ ధనమ్

ఏ ధనమునకు రాజువలనగాని చోరులవలనగాని భయము లేదో మరణించిన వెనుక కూడ ఏది జీవుని వెంట వుండునో అట్టి ధర్మమను ధనమును సంపాదించుము

634 సర్వత్ర యేన జీవ్యతే తదేవ పుత్ర దీయతామ్
ధనం యదక్షరం ధ్రువం సమర్జయస్వ తత్ స్వయమ్

దేనిచే పరలోకమున కూడ జీవిత నిర్వాహణము సంభవించునో అట్టి నాశరహిత స్థిర ధనమగు పుణ్యమునే నీవు దానము చేయుము దానినే స్వయముగ ఆర్జించుము

635 న యావదేవ పచ్యతే మహాజనస్య యావకమ్
అపక్వ ఎవ యావకే పురా ప్రలీయసే త్వర

గృహమునకు వచ్చిన అతిథి కొఱకై వండబడు అన్నాదికము ఎంతసేపటిలో పూర్తియగునో అంతకు ముందుగనే నీ యొక్క

మృత్యువు సంభవించవచ్చును కావున జ్ఞానరూప ధనమును ఉపార్జించుటకు నీవు తొందరపడుము

636 న మాతృ పుత్రబాన్ధవా న సంస్తుత ప్రియో జనః
అనువ్రజన్తి సంకటే వ్రజన్తమేకపాతినమ్

జీవుడు ఒంటరిగనే పరలోక మార్గమున పయనించునపుడు ఆ సంకట సమయమున తల్లిగాని కుమారుడుగాని సోదరులుగాని బంధువులుగాని అత్యంత ప్రశంసితులగు ప్రియజనులు గాని అతని వెంట పోరు

637 యదేవ కర్మ కేవలం పురా కృతం శుభాశుభమ్
తదేవ పుత్ర సార్థికం భవత్యముత్ర గచ్ఛతః

పరలోకమున పోవునపుడు తానిదివరకు చేసిన శుభ అశుభ కర్మలే వెంటవచ్చును

638 ఇహాగ్ని సూర్యవాయవః శరీరమాశ్రితాస్త్రయః
త ఏవ తస్య సాక్షిణో భవన్తి ధర్మదర్శినః

ఈ లోకమున అగ్ని, వాయువు సూర్యుడు అను ఈ ముగ్గురు దేవతలు ఎపుడు శరీరమును ఆశ్రయించుకొని యుందురు వారే అతని ధర్మాచరణమును చూచువారై యున్నారు మఱియు వారే పరలోకమున అతనికి సాక్షులుగా నుందురు

639 అనుగమ్య వినాశాన్తే నివర్తన్తే హ బాన్ధవాః
అగ్నౌ ప్రక్షిప్య పురుషం జ్ఞాతయః సుహృదస్తథా

మరణించిన వెనుక సోదరులు బంధువులు కుటుంబ సభ్యులు మిత్రులు శ్మశానము వఱకు వెనుక వచ్చెదరు తదుపరి మృతుని దేహమును చితిపై నుంచి వెడలి పోవుదురు

640 న దేహభేదే మరణం విజానతాం
న చ ప్రణాశ స్వనుపాలితే పథి
ధర్మం హి యో వర్ధయతే స పణ్డితో
య ఏవ ధర్మాచ్చ్యవతే స ముహ్యతి

శరీరము నశించినను తనకు వినాశము లేదని ఎవరెఱుంగుదురో మఱియు శిష్టులద్వారా పాలింపబడిన ధర్మమార్గమున నడచువారికి వినాశమెన్నడును లేదని ఎవరు తెలిసికొందురో వారే బుద్ధిమంతులు ధర్మము నుండి జారిపోవువాడు మోహగ్రస్తుడు లేక మూఢుడు

641 సోపానభూతం స్వర్గస్య మానుష్యం ప్రాప్య దుర్లభమ్
తథాఽఽత్మానం సమాదధ్యాద్ భ్రశ్యతే న పునర్యథా

దుర్లభమగు ఈ మానవ దేహము స్వర్గమును చేరుటకు నిచ్చెన వంటిది దీనిని పొంది తిరిగి స్వర్గమునుండి క్రిందకు పడకుండునట్లుగ ధర్మమునందు ఏకాగ్రత నిలుకడ గలిగి యుండవలెను

642 యస్తు భోగాన్ పరిత్యజ్య శరీరేణ తపశ్చరేత్
న తేన కించిన్న ప్రాప్తం తన్మే బహుమతం ఫలమ్

ఎవడు భోగములను పరిత్యజించి తపోవనమునకు పోయి శరీరముతో తపస్సు చేయునో అట్టివానికి ప్రాప్తింపని పదార్థము లేదు అదియే గొప్ప ఫలమని నేను తలంచుచున్నాను

643 మాతాపితృసహస్రాణి పుత్రదారశతాని చ
అనాగతాన్యతీతాని కస్య తే కస్య వా వయమ్

వేలకొలది తల్లిదండ్రులు వందలకొలది స్త్రీ పురుషులు క్రిందటి జన్మలందు గడచిపోయిరి భావికాలమున ఎందరో వుండబోవుదురు వారు మనలో ఎవనివారు ? లేక మనము వారిలో ఎవని వారము ?

644 దత్తేన కిం యన్న దదాతి నాశ్నుతే
ఎలేన కిం యేన రిపుం న బాధతే
శ్రుతేన కిం యేన న ధర్మమాచరేత్
కిమాత్మనా యో న జితేన్ద్రియో వశీ

తాను అనుభవించినట్టియు, ఒకనికి ఇవ్వనట్టియు ధనముతో ఏమి ప్రయోజనము? శత్రువులను జయింపజాలనట్టి బలముతో ఏమి లాభము? దేనిద్వారా మనుజుడు ధర్మాచరణమును చేయజాలకున్నాడో అట్టి శాస్త్రజ్ఞానముచే ఏమి ప్రయోజనము? జితేంద్రియుడు కానట్టియు మనస్సును వశమందుంచజాలనట్టియు జీవునిచే ఏమి ప్రయోజనము?

తరువాత భీష్ముడు ధర్మరాజునకిట్లు బోధించెను —

భీష్మ ఉవాచ
645 దుర్భిక్షాదేవ దుర్భిక్షం క్లేశాత్ క్లేశం భయాద్ భయమ్
మృతేభ్యః ప్రమృతా యాన్తి దరిద్రాః పాపకర్మిణః

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

పాపకర్మ చేయునట్టి దరిద్రులు దుర్భిక్షము నుండి దుర్భిక్షమును, క్లేశము నుండి క్లేశమును భయము నుండి భయమును పొందుచు మరణించిన వారికంటెను అధికముగ మృతతుల్యులు అగుచున్నారు

646 ఉత్సవాదుత్సవం యాన్తి స్వర్గాత్ స్వర్గం సుఖాత్ సుఖమ్
శ్రద్దధానాశ్చ దాన్తాశ్చ ధనస్థా శుభకారిణః

శ్రద్ధాళువులు జితేంద్రియులు (జ్ఞాన) ధనసంపన్నులు శుభకర్మ పరాయణులు అగువారు ఉత్సవముకంటె అధిక ఉత్సవమును స్వర్గముకంటె అధిక స్వర్గమును సుఖముకంటె అధిక సుఖమును పొందుచున్నారు

647 సుశీఘ్రమపి ధావన్తం విధానమనుధావతి
శేతే సహ శయానేన యేన యేన యథాకృతమ్

648 ఉపతిష్ఠతి తిష్ఠన్తం గచ్ఛన్తమనుగచ్ఛతి
కరోతి కుర్వతః కర్మ ఛాయేవానువిధీయతే

ఏ దే మనుష్యుడు ఏ యే కర్మను చేసియుండెనో అది వాని వెను వెంటనే వుండును మనుజుడు వేగముగా పరుగెత్తినచో ఆ కర్మయు అంతియే వేగముతో వానివెంట పోవును అతడు నిద్రించినచో ఆ కర్మ ఫలమున్ను అతని వెంట నిదురించును అతడు నిలబడుచో ఆ కర్మయు నిలబడును అతడు నడచుచో ఆ కర్మ ఫలమున్ను అతని వెంట నడచును ఇంతియే కాదు, ఏదియైన కర్మను చేయునపుడు కూడ కర్మ సంస్కారము అతనిని వదలదు నీడవలె అది సదా అతని వెంటనే వుండును

649 జ్యోతిరాత్మని నాన్యత్ర సర్వజన్తుషు తత్ సమమ్
స్వయం చ శక్యతే ద్రష్టుం సుసమాహితచేతసా

తన లోపలనే ఆత్మజ్యోతి యొక్క ప్రకాశము కలదు ఇతరత్ర కాదు ఆ జ్యోతి సమస్త ప్రాణికోట్ల యందును సమాన రూపమున నున్నది తన చిత్తమును బాగుగ ఏకాగ్ర పఱచువాడు ఆ ప్రకాశమును స్వయముగ చూడగలడు

650 సంయోజ్య మనసాఽఽత్మానమీర్ష్యాముత్సృజ్య మోహనీమ్
త్యక్త్వా కామంచ మోహం చ తదా బ్రహ్మత్వమశ్నుతే

మోహమునందు పడవైచు ఈర్ష్య కామము మోహములను త్యజించి సాధకుడెపుడు తన మనస్సును ఆత్మయందు స్థాపించునో అపుడాతడు బ్రహ్మమును పొందును

ఈ సందర్భమున భీష్ముడు ధర్మరాజునకు శుకునకు నారద మహర్షి బోధించిన పరమార్థ తత్త్వమును చెప్పెను ఒకపుడు

నారదునిని శుకుడు ఈ లోకమున పరమ శ్రేయస్సునకు సాధనమైన దేదియో వచించుడని యడుగగా అ మునీశ్వరుడిట్లు పలికెను —

నారద ఉవాచ

651 నాస్తి విద్యాసమం చక్షుర్నాస్తి సత్య సమం తపః
నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం సుఖమ్

(నారదుడు శుకున ట్లు చెప్పెను —)

విద్యకు సమానమైన నేత్రము లేదు సత్యముతో సమాన మైన తపస్సు లేదు రాగముతో సమానమైన దుఃఖము లేదు త్యాగ ముతో సమానమైన సుఖము లేదు

652 నివృత్తిః కర్మణః పాపాత్ సతతం పుణ్యశీలతా
సద్వృత్తిః సముదాచారః శ్రేయ ఏతదనుత్తమమ్

పాపకార్యములను చేయకుండుట పుణ్య కార్యములను చేయుట మహాత్ముల నడవడి కలిగి యుండుట సదాచారమును పాలించుట అనునవి సర్వోత్తమ శ్రేయస్సు బడయుటకు సాధన ములై యున్నవి

653 మానుష్యమసుఖం ప్రాప్య యః సజతి స ముహ్యతి
నాలం స దుఃఖమోక్షాయ సంయోగో దుఃఖలక్షణమ్

(అజ్ఞాన ఫలితముగ) సుఖములేని ఈ మానవజన్మను పొందు విషయముల యందు ఆసక్తుడగువాడు మోహమును పొందును విషయ సంయోగము దుఃఖరూపమై యున్నది కావున అది దుఃఖము లను పోగొట్టజాలదు

654 సర్వోపాయాత్ తు కామస్య క్రోధస్య చ వినిగ్రహః
కార్యః శ్రేయోఽర్థినా తౌ హి శ్రేయో ఘాతార్థముద్యతౌ

శ్రేయస్సును బడయదలంచువాడు అన్ని ఉపాయములచే కామక్రోధములను నిగ్రహించవలెను ఏలయనిన ఈ రెండు దోషములు శ్రేయస్సును నాశమొనర్చుటకు ఉద్యమించును

655 నిత్యం క్రోధాత్ తపో రక్షేచ్ఛ్రియం రక్షేచ్చ మత్సరాత్
విద్యాం మానావమానాభ్యామాత్మానం తు ప్రమాదతః

మనుజుడు తపస్సును కోపము నుండియు సంపదను మాత్సర్యము నుండియు విద్యను మానావమానముల నుండియు తన్ను తాను ప్రమత్తత నుండియు సదా రక్షించుకొనవలెను

656 ఆనృశంస్యం పరో ధర్మః క్షమా చ పరమం బలమ్
ఆత్మజ్ఞానం పరంజ్ఞానం న సత్యాద్ విద్యతే పరమ్

క్రూరస్వభావమును త్యజించుట అన్నిటికంటె గొప్ప ధర్మము క్షమ అన్నిటికంటె గొప్ప బలము ఆత్మజ్ఞానము అన్ని జ్ఞానముల కంటెను గొప్ప జ్ఞానము సత్యమును మించినది మఱేమియును లేదు

657 సర్వారమ్భపరిత్యాగీ నిరాశీర్నిష్పరిగ్రహః
యేన సర్వం పరిత్యక్తం స విద్వాన్ స చ పణ్డితః

కార్యారంభమును గూర్చిన సంకల్పములన్నిటిని పరిత్యజించిన వాడును ఆశలు కోరికలు లేనివాడును, ఏ వస్తువును సంగ్రహణ మొనర్చనివాడును అంతయును త్యజించినవాడను అగువాడే విద్వాంసుడు ఆతడే పండితుడు

658 నిరామిషా న శోచన్తి త్యజేదామిషమాత్మనః
పరిత్యజ్యామిషం సౌమ్య దుఃఖతాపాద్ విమోక్ష్యసే

ధర్మరాజా! భోగములను త్యజించినవారు శోకమునెన్నడును పొందరు కావున ప్రతివ్యక్తియును భోగాసక్తిని పరిత్యజించవలెను

భోగములను త్యజించుటచే మీరు దుఃఖము నుండి సంతాపము నుండి విముక్తి నొందెదరు

659 అనాదినిధనం జన్తుమాత్మని స్థితమవ్యయమ్
అకర్తారమమూర్తం చ భగవానాహ తీర్థవిత్

మోక్షోపాయము నెఱిగిన భగవంతుడగు నారాయణుడు ఇట్లు చెప్పెను — ఆద్యంత రహితమైనదియు నాశరహితమైనదియు అకర్తయు నిరాకారమును అగు ఆత్మ ఈ శరీరము నందున్నది

660 అశోకం శోకనాశార్థం శాస్త్రం శాన్తికరం శివమ్
నిశమ్య లభతే బుద్ధిం తాం లబ్ధ్వా సుఖమేధతే

శాస్త్రము శోకమును పోగొట్టునదియు శాంతికారకమును శ్రేయోదాయకమును అయియున్నది ఎవడు తన శోకమును పోగొట్టుకొనుటకై శాస్త్రములు శ్రవణము చేయునో అతడు ఉత్తమ బుద్ధినొంది సుఖవంతుడగును

661 నాశ్రు కుర్వన్తి యే బుద్ధ్వా దృష్ట్వా లోకేషు సంతతిమ్
సమ్యక్ ప్రపశ్యతః సర్వం నాశ్రుకర్మోపపద్యతే

ఎవరు ప్రపంచమున తన సంతానము మరణించుట చూచియు కన్నీళ్ళు కార్చరో (దుఃఖింపరో) వారే ధీరులు అన్ని వస్తువులను గూర్చి చక్కగ విచారించినచో దేనికొఱకును దుఃఖించుట సంగతము కాదని నిశ్చితమగుచున్నది

662 భైషజ్యమేతద్ దుఃఖస్య యదేతన్నానుచిన్తయేత్
చిన్త్యమానం హి న వ్యేతి భూయశ్చాపి ప్రవర్ధతే

దుఃఖమును తొలగించుటకు అన్నిటికంటె ఉత్తమమైన ఔషధము దానిని స్మరించి మాటిమాటికి తలంచకుండుటయే యగును తలంచుచుండుటచే ఆ దుఃఖము పెరుగునే కాని తరగదు

663 సంచిన్వానకమేవైనం కామానామ వితృప్తకమ్
వ్యాఘ్రః పశుమివాసాద్య మృత్యురాదాయ గచ్ఛతి

అరణ్యమందు పచ్చిగడ్డిని వెతకుచు సంచరించుచున్న అతృప్త పశువు యొద్దకు పెద్దపులి అకస్మాత్తుగ వచ్చి మీద పడునట్లు విషయ భోగములను వెతకుటలో నిమగ్నుడైన అతృప్త మానవుని మృత్యువు లేవనెత్తుకొని పోవుచున్నది

664 శబ్దే స్పర్శే చ రూపే చ గన్ధేషు చ రసేషు చ
నోపభోగాత్ పరం కించిద్ ధనినో వాధనస్య చ

ధనవంతుడైనను దరిద్రుడైనను సర్వులకు అనుభవకాలమందే శబ్ద స్పర్శరూప రసగంధములందు ఒకింత సుఖము యొక్క ప్రతీతి కలుగుచున్నది కాని అనుభవానంతరము కాదు

665 ధృత్యా శిశ్నోదరం రక్షేత్ పాణిపాదం చ చక్షుషా
చక్షుః శ్రోత్రే చ మనసా మనో వాచం చ విద్యయా

మనుజుడు ధైర్యము ద్వారా జననేంద్రియ ఉదరములను నేత్రముల ద్వారా చేతులు కాళ్ళను మనస్సు ద్వారా నేత్ర కర్ణములను సద్విద్య ద్వారా మనోవాక్కులను రక్షించుకొనవలెను (సంయమన మొనర్చుకొనవలెను)

666 యే తు తద్భావితా లోకే హ్యేకాన్తిత్వం సమాస్థితాః
ఏతదభ్యధికం తేషాం యత్ తే తం ప్రవిశన్త్యుత

ఎవరు సదా పరమాత్మను స్మరించుచు అనన్యభావముతో ఆతనిని శరణు బొందుచున్నారో వారికి అన్నిటికంటె గొప్ప లాభము కలుగుచున్నది అది యేదియనిన వారు ఆ పరమాత్మ యొక్క స్వరూపములో ప్రవేశించుచున్నారు

ఇదప భీష్ముడు నారదునకు భగవనుడు కావించిన సదుప దేశమును వివరించి చెప్పెను పూర్వము శ్వేతద్వీపమందు నారదునకు భగవానుడిట్లు బోధించెను —

667 నిత్యం హి నాస్తి జగతి భూతం స్థావరజంగమమ్
ఋతే తమేకం పురుషం వాసుదేవం సనాతనమ్

(భగవానుడు నారదునితో ఇట్లు చెప్పెను —)

ప్రపంచమున సనాతన పురుషుడగు వాసుదేవుడొకడు తప్ప చరాచర భూతములెవ్వియు నిత్యములు కావు

668 శృణు నారద తత్త్వేన ప్రాదుర్భావాన్ మహామునే
మత్స్యః కూర్మశ్చ వరాహశ్చ నరసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కి చ తే దశ

మహా మునివరుడు ఓ నారదా! మీరు నా అవతారములను వినుడు — మత్స్య కూర్మ వరహ నరసింహ వామన, పరశురామ, శ్రీరామ బలరామ, శ్రీకృష్ణ కల్కి — అను ఈ పది నాయొక్క అవతారములు

669 యదా వేదశ్రుతిర్నష్టా మయా ప్రత్యాహృతా పునః
సవేదాః సశ్రుతీకాశ్చ కృతాః పూర్వం కృతేయుగే

ఎప్పుడెప్పుడు వేద - శ్రుతి లుప్తమగునో అప్పుడప్పుడు నేను అవతారమెత్తి దానిని ప్రకాశమునకు తెచ్చెదను నేనే మొదట కృతయుగమున వేదసహితములగు శ్రుతులను ప్రకటించితిని

ఎదప భీష్ముడు శ్రీకృష్ణుడర్జునునకు గావించిన మహత్తర ఉపదేశమును వివరించెను శ్రీకృష్ణుడర్జునునకిట్లు ప్రబోధము గావించెను —

శ్రీ భగవానువాచ

670 రుద్రో నారాయణశ్చైవ సత్త్వమేకం ద్విధాకృతమ్
లోకే చరతి కౌన్తేయ వ్యక్తిస్థం సర్వకర్మసు

(శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను —)

రుద్రుడు నారాయణుడు ఒకే స్వరూపము అది రెండు స్వరూపములను ధరించి భిన్నభిన్న వ్యక్తులందుండి ప్రపంచమున యజ్ఞాది సమస్త కర్మలందును ప్రవృత్తమగుచున్నది (ఆ రెండు స్వరూపముల ద్వారా భగవానుడొకడే ప్రకటమగుచున్నాడు)

671 నమస్వ హవ్యదం విష్ణుం తథా శరణదం నమ
వరదం నమస్వ కౌన్తేయ హవ్యకవ్యభుజం నమ

అర్జునా! నీవు హవ్యదాతయగు విష్ణువునకు నమస్కరింపుము శరణదాతయగు శ్రీహరికి తల వంచుము వరదాతయగు విష్ణువునకు వందన మొనర్పుము హవ్యకవ్యభోక్తయగు భగవానునకు ప్రణమిల్లుము

672 నాస్తి సత్యాత్ పరో ధర్మో నాస్తి మాతృసమో గురుః
బ్రాహ్మణేభ్యః పరం నాస్తి ప్రేత్య చేహ చ భూతయే

సత్యమునకు మించి వేఱొక ధర్మము లేదు తల్లితో సమాన మైన వేఱొక గురువెవడును లేడు బ్రాహ్మణులను (బ్రహ్మనిష్ఠులను) మించి ఇహలోకః పరలోకములందు శ్రేయస్సును కలుగ జేయువారు వేఱెవరును లేరు

సూతపుత్రుడగు సౌతి శౌనకాదులకిట్లు చెప్పెను — జనమేజయుడు వ్యాసమహర్షితో ఇట్లు విన్నవించెను —

జనమేజయ ఉవాచ

673 ఇదం శతసహస్రాద్ధి భారతాఖ్యాన విస్తరాత్
అమన్థ్య మతిమన్థేన జ్ఞానోదదిమనుత్తమమ్

(జనమేజయుడు వ్యాసమునితో ఇట్లనెను —)

మహాత్మా! లక్ష శ్లోకములతోగూడ విస్తృతమైయున్న మహాభారతమను ఇతిహాసము నుండి లాగి మీరు వినిపించిన కథ

బుద్ధియను కవ్వము ద్వారా జ్ఞానమను ఉత్తమ సముద్రమును మథించి తీసిన అమృతము వలె నున్నది

వైశంపాయనుడు జనమేజయునకి చెప్పెను —

వైశమ్పాయన ఉవాచ

674 మనీషిణో హి యే కేచిద్ యతయో మోక్షధర్మిణః
తేషాం విచ్ఛిన్నతృష్ణానాం యోగక్షేమవహో హరిః

(వైశంపాయనుడు జనమేజయునితో ఇట్లనెను —)

మోక్ష ధర్మమందు తత్పరులైయున్నవారును తృష్ణ పరిపూర్ణముగ నాశమొనర్చినవారు బుద్ధిమంతుల యత్నశీలుర యొక్క యోగక్షేమముల భారము స్వయముగ నారాయణుడే వహించుచున్నాడు

675 సుసూక్ష్మం సత్త్వసంయుక్తం సంయుక్తం త్రిభిరక్షరైః
పురుషః పురుషం గచ్ఛేన్నిష్క్రియః పఞ్చవింశకః

అత్యంత సూక్ష్మమై సత్త్వగుణముతో కూడినదై అకార ఉకార మకారములను మూడక్షరములతో కూడినదైనటి ప్రణవ స్వరూపము (పరమాత్మ) ఏది కలదో అట్టి పరమపురుషుని పరమాత్మను జీవుడు కర్తృత్వము అహంకారము తొలగినపుడు పొందును

676 నిఃసంశయేషు సర్వేషు నిత్యం వసతి వై హరిః
ససంశయాన్ హేతుబలాన్ నాధ్యావసతి మాధవః

జ్ఞాన బలముచే సంశయములు తొలగిన వారందరియందును శ్రీహరి సదా నివసించుచుండును (అనుభూతమగుచుండును) కాని కుతర్కముచే సంశయములతో కూడిన వారిలో భగవంతుడగు మాధవుడు నివసింపడు (వారిచే అనుభూతుడు కాడు)

ఎన్నోట భీష్ముడు ధర్మరాజునకు, పూర్వము నారదుడు ఇంద్రునకు చెప్పిన ఒకానొక బ్రాహ్మణుని కథను వివరించెను తత్కథా సందర్భమున నాగరాజగు పద్మనాభుని సదాచారములు నాగరాజ, నాగపత్నీ సంవాదము తెలుపబడినవి ఒకపుడు నాగరాజుని ప్రశ్నను పురస్కరించుకొని నాగపత్ని ఆతని కిట్లు చెప్పెను —

నాగభార్యోవాచ

677 అహం కస్య కుతో వాఽ కః కో మే హ భవేదితి
ప్రయోజనమతిర్నిత్యమేవం మోక్షాశ్రమే వసేత్

(నాగపత్ని నాగరాజుతో ఇట్లు చెప్పెను —)

నేను ఎవనివాడను ? ఎచటి నుండి వచ్చితిని ? నా వారు ఎవరు ? ఈ జీవితము యొక్క ప్రయోజనమేమి? ఈ మొదలైన విషయములను సదా విచారణ చేయుచు మోక్షప్రయత్నము చేయుచు నుండవలెను

678 మౌనే జ్ఞానఫలావాప్తి ర్దానేన చ యశో మహత్
వాగ్మిత్వం సత్యవాక్యేన పరత్ర చ మహీయతే

మౌనముగ నుండుటచే జ్ఞానమను ఫలము లభించుచున్నది దానమొసంగుటచే కీర్తి బాగుగ వృద్ధి నొందును సత్యము పలుకుటచే వాక్కు యొక్క పటుత్వము, పరలోకమున ప్రతిష్ఠ సంభవించును

ఓమ్

# 13 అనుశాసన పర్వము

బంధువియోగముచే ధర్మరాజు చింతాగ్రస్తుడై యుండ అతనిని ఓదార్చుటకై భీష్ముడు గౌతమీ వ్యాధ సంవాదము నన్నగువానిని చెప్పెను పూర్వము గౌతమి యను వృద్ధ బ్రాహ్మణి యుండెను ఒకనాడామెకుమారుని ఒక పాము కరవగా అతడు మరణించెను ఇంతలో ఒక బోయవాడు ఆ పామును పట్టి తెచ్చి ఆ బ్రాహ్మణితో దీనిని చంపివేయుదును అని చెప్పగా ఆ బ్రాహ్మణి అందులకు సమ్మతింపక దానిని వదలివేయుమని చెప్పి అతనితో నిట్లనెను —

గౌతమ్యువాచ

1 ప్లవన్తే ధర్మలఘవో లోకేఽమ్భసి యథా ప్లవాః
మజ్జన్తి పాపగురవః శస్త్రం స్కన్నమివోదకే

(గౌతమీ బ్రాహ్మణి వ్యాధునితో ఇట్లు చెప్పెను —)

ప్రపంచమున ధర్మాచరణము గావించి (పాపభారరహితులై యుండువారు) నీటిపై నావవలె సంసార సాగరమును దాటివేయుచున్నారు పాపభారముచే బరువెక్కి యున్నవారు నీటియందు విసరబడిన శస్త్రమువలె సంసార సముద్రమున మునిగిపోవుదురు

తరువాత భీష్ముడు దయాళువు రొుక్క శ్రేష్ఠత్వమును సమభావమును తెలుపుట కొఱకై ధర్మరాజునకు ఇంద్ర శుక పక్షి సంవాదమును చెప్పెను ఒకానొక అరణ్యమున ఒక బోయవాడు ఒక మృగముపై బాణము వేయగా గురితప్పి ఆ బాణము ఒక చెట్టునకు తగిలెను బాణము చివరగల విషము ఆ చెట్టునకు సోకి, అది శిథిలము కాజొచ్చెను బహుకాలము నుండి ఆ చెట్టుతొఱ్ఱలో ఒక చిలుక కాపురముండుచుండెను వృక్షము శిథిలమైనను ఆ చిలుక అచటి నుండి కదలక ఆ తొఱ్ఱయందే ఉండుచు సుఖదుఃఖములందు

సమదృష్టి కలిగియుండెను ఇంద్రుడు ఆ పక్షి యొక్క సమభావమును గమనించి దాని యొద్దకు వచ్చి చెట్టు శిథిలమైనను ఆ చెట్టు తొర్రను ఏల విడిపోలేదని ఆ పక్షిని అడుగగా ఆ శుకపక్షి ఇట్లు సమాధానము చెప్పెను —

2 అనుక్రోశో హి సాధూనాం మహాద్ధర్మస్య లక్షణమ్
అనుక్రోశశ్చ సాధూనాం సదా ప్రీతిం ప్రయచ్ఛతి

(శుకపక్షి దేవేంద్రునితో ఇట్లు చెప్పెను —)

ఉత్తములకు ఇతరుల యెడల దయ కలిగియుండుటయే గొప్ప ధర్మము యొక్క సూచకమైయున్నది దయాభావముగల శ్రేష్ఠులు సదా ఆనందమునే కలుగజేయుచుందురు

అంతట పురుషప్రయత్నమును గురించి ధర్మరాజు ప్రశ్నింపగా భీష్ముడు బ్రహ్మదేవ వసిష్ఠ సంవాదము నెఱిగించెను పూర్వ మొకపుడు వసిష్ఠుడు బ్రహ్మదేవుని పురుషప్రయత్నమును గూర్చి అడుగగా చతుర్ముఖుడిట్లు వచించెను —

బ్రహ్మోవాచ

3 యాదృశం వపతే బీజం క్షేత్రమాసాద్య కర్షక
సుకృతే దుష్కృతే వాపి తాదృశం లభతే ఫలమ్

(బ్రహ్మదేవుడు వసిష్ఠునితో ఇట్లనెను —)

రైతు పొలములో విత్తనములు నాటును దాని ననుసరించి అతనికి ఫలము లభించును అట్లే మనుజుడు పుణ్యము పాపము అను ఏ కర్మను చేయునో తదనుసారము అట్టి ఫలితమే అతనికి కలుగును (పుణ్యముచే సుఖము, పాపముచే దుఃఖము కలుగును)

4 శుభేన కర్మణా సౌఖ్యం దుఃఖం పాపేన కర్మణా
కృతం ఫలతి సర్వత్ర నాకృతం భుజ్యతే క్వచిత్.

పుణ్యకర్మ (శుభకర్మ) చేయుటచే సుఖమున్ను, పాపకర్మ (అశుభకర్మ) చేయుటచే దుఃఖమున్ను కలుగుచున్నది తనచే చేయబడిన కర్మ సర్వత్ర ఫలము నొసంగుచున్నది చెయ్యని కర్మ యొక్క ఫలము అనుభవింపబడదు

5 కృతీ సర్వత్ర లభతే ప్రతిష్ఠాం భాగ్యసంయుతామ్
అకృతీ లభతే భ్రష్టః క్షతే క్షారావసేచనమ్

పురుషప్రయత్నము చేయువాడు భాగ్యము ననుసరించి సర్వత్ర ప్రతిష్ఠను బడయుచున్నాడు అకర్మణ్యుడు (ఏ కర్మను చేయనివాడు) సమ్మానము నుండి భ్రష్టుడై పుండుపై ఉప్పు చల్లిన విధముగ సర్వత్ర సహింపరాని దుఃఖమును పొందుచున్నాడు

6 యేన లోకాస్త్రయః సృష్టా దైత్యాః సర్వాశ్చ దేవతాః
స ఏష భగవాన్ విష్ణుః సముద్రే తప్యతే తపః

ఏ మహానీయుడు మూడు లోకములను దైత్యులను దేవతలను కూడ సృష్టించెనో ఆ విష్ణుభగవానుడు సముద్రమునందుండి తపస్సు చేయుచున్నాడు

7 విపులమపి ధనౌఘం ప్రాప్య భోగాన్ స్త్రియో వా
పురుష ఇహ న శక్తః కర్మహీనో హి భోక్తుమ్
సునిహితమపి చార్థం దైవతై రక్ష్యమాణం
పురుష ఇహ మహాత్మా ప్రాప్నుతే నిత్యయుక్తః

ప్రయత్నము చేయనివాడు ఎక్కువ ధనము అనేక విధములైన భోగములు స్త్రీలు — వీనిని పొందినప్పటికిని అనుభవించలేడు ఎల్లపుడు ప్రయత్నము చేయు మహనీయుడు దేవతల ద్వారా సురక్షితమైన నిధిని (ధనమును) పొందుచున్నాడు

అటు పిదప భీష్ముడు ధర్మరాజున కిట్లుపదేశించెను —

భీష్మ ఉవాచ

8 ధనం లభేత దానేన మౌనేనాజ్ఞాం విశాంపతే
ఉపభోగాంశ్చ తపసా బ్రహ్మచర్యేణ జీవితమ్

(భీష్ముడు ధర్మరాజుతో ఇటు చెప్పెను —)

మనుజుడు దానము చేయుటచే ధనమును పొందుచున్నాడు మౌనవ్రతమును పాలించుటచే ఇతరులచే ఆజ్ఞాపాలన మొనర్పింప జేయు శక్తిని బడయుచున్నాడు తపస్సుచే ఉపభోగములను బ్రహ్మచర్యముచే ఆయుస్సును పొందుచున్నాడు.

9 రూపమైశ్వర్య మారోగ్యమహింసాఫలమశ్నుతే

అహింస ధర్మము—దీనిని ఆచరించుటచే రూపము ఐశ్వర్యము ఆరోగ్యము అను ఫలితములను మనుజుడు పొందుచున్నాడు

10 యథా ధేనుసహస్రేషు వత్సో విన్దతి మాతరమ్
ఏవం పూర్వకృతం కర్మ కర్తారమనుగచ్ఛతి

దూడ వేలకొలది ఆవులలో తన తల్లిని కనిపెట్టునట్లు, చేయబడిన కర్మయు కర్తను గుర్తెరిగి అతనిని అనుసరించిపోవును

11 జీర్యన్తి జీర్యతః కేశాదన్తా జీర్యన్తి జీర్యతః
చక్షుః శ్రోత్రే చ జీర్యేతే తృష్ణైకా న తు జీర్యతే

వార్ధక్యమున మనుజునకు వెంట్రుకలు నెరసిపోవుచున్నవి పళ్లు ఊడిపోవుచున్నవి నేత్రములు శ్రోత్రములు శిథిలములగుచున్నవి కాని తృష్ణ మాత్రము శిథిలముకాక పైపెచ్చు పెరిగిపోవుచున్నది

12 యేన ప్రీణాతి పితరం తేన ప్రీతః ప్రజాపతిః
ప్రీణాతి మాతరం యేన పృథివీ తేన పూజితా
యేన ప్రీణాత్యుపాధ్యాయం తేన స్యాద్ బ్రహ్మపూజితమ్

మనుజుడు ఏ కార్యముచే తండ్రిని సంతోషపెట్టుచున్నాడో ఆ కార్యముచే ప్రజాపతి ప్రసన్నుడగుచున్నాడు ఏ ప్రవర్తనచే అతడు తల్లిని సంతుష్టి పఱచుచున్నాడో దానిచే భూదేవి యొక్కయు పూజ గావింపబడుచున్నది దేనిచే అతడు ఉపాధ్యాయుని తృప్తపఱచుచున్నాడు దానిచే అతడు పరమాత్మ పూజ గావించినవాడగుచున్నాడు

13 స్పృహయామి ద్విజాతిభ్యో యేషాం బ్రహ్మ పరం ధనమ్
యేషాం స్వప్రత్యయః స్వర్గస్తపః స్వాధ్యాయసాధనమ్

ఎవరికి బ్రహ్మమే పరమధనమైయున్నదో ఆత్మజ్ఞానమే స్వర్గమైయున్నదో వేదము యొక్క స్వాధ్యాయమే శ్రేష్ఠమగు తపస్సు అయియున్నదో అట్టి బ్రాహ్మణులను (బ్రహ్మనిష్ఠులను) నేను వాంఛించుచున్నాను

ఎమ్మట భీష్ముడు ధర్మరాజు యొక్క ప్రశ్నను పురస్కరించుకొని లక్ష్మీరుక్మిణీ సంవాదమును తెలియజేసెను ఒకపుడు రుక్మిణీదేవి లక్ష్మీదేవిని మీరు ఏ ప్రాణులందు నివసించుదురు అని అడుగగా ఆ శ్రీదేవి ఇట్లు చెప్పెను —

శ్రీరువాచ

14 వసామి నిత్యం సుభగే ప్రగల్భే
దక్షే నరే కర్మణి వర్తమానే
అక్రోధనే దేవపరే కృతజ్ఞే
జితేన్ద్రియే నిత్యముదీర్ణసత్త్వే

(లక్ష్మీదేవి రుక్మిణీదేవితో ఇట్లు చెప్పెను —)

ఎవడు సౌభాగ్యశాలియు నిర్భయుడు కార్యకుశలుడు కర్మపరాయణుడు, క్రోధరహితుడు దేవారాధన తత్పరుడు కృతజ్ఞుడు, జితేంద్రియుడు అధిక సత్త్వగుణయుక్తుడు అయియున్నాడో అట్టి వానియందు నేను ప్రతిదినము నివసించుచున్నాను

15 కాయేన త్రివిధం కర్మ వాచా చాట చతుర్విధమ్
మనసా త్రివిధం చైవ దశకర్మపథాం స్త్యజేత్

శరీరముచే మూడు విధములైన కర్మలు వాక్కుచే నాలుగు విధములైన కర్మలు మనస్సుచే మూడు విధములైన కర్మలు మొత్తము పది విధములైన కర్మలను త్యజించి వేయవలెను

16 ప్రాణాతిపాతః స్తైనేం ద పరదారానథాఽ చ
త్రీణి పాపాని కాయేన సర్వతః పరివర్జయేత్

ఇతరుల ప్రాణనాశము గావించుట దొంగతనము చేయుట పరస్త్రీ సంసర్గము — అను ఈ మూడు శరీరముచే చేయబడు పాపములు — వీనిని త్యజించవలెను

17 అసత్ప్రలాపం పారుష్యం పైశున్యమనృతం తథా
చత్వారి వాచా రాజేన్ద్ర న జల్పేన్నానుచిన్తయేత్

నోటితో చెడ్డమాటలు పలుకుట కఠినముగ మాట్లాడుట చాడీలు చెప్పుట — అను ఈ నాలుగు వ గ్దోషములు వీనిని పలుకరాదు మనస్సుతోను ఆలోచించరాదు

18 అనభిధ్యా పరస్వేషు సర్వసత్త్వేషు సౌహృదమ్
కర్మణాం ఫలమస్తీతి త్రివిధం మనసా చరేత్

ఇతరుల ధనమును గైకొనుటకై ఆలోచింపకుండుట, సమస్త ప్రాణుల యెడల మైత్రీభావము గలిగియుండుట కర్మలఫలము తప్పక లభించునను విశ్వాసము గలిగియుండుట — అను ఈ మూడును మనస్సుచే చేయదగిన కార్యములు వీనికి విరుద్ధములైనవి మనస్సుచే త్యజింపదగిన కార్యములు

అనంతరము ధర్మరాజు జీవయాత్ర నిర్వహించువాడు ఎట్టి స్వభావము గలిగియుండవలెనని ప్రశ్నించినపుడు భీష్ముడు విష్ణు గరుడ

సంవాదమును వివరించి చెప్పెను పూర్వ మొకపుడు విష్ణువు గరుత్మంతున కిట్లు దేపశించెను —

శ్రీ భగవానువాచ

19 యో మాం యదా వేదయతి తస్య తస్యాస్మి కాశ్యప
మనోబుద్ధిగతః శ్రేయో విదధామి విహఙ్గమ

(విష్ణు భగవానుడు గరుత్మంతునితో ఇట్లు చెప్పెను —)

ఎవడు నన్ను ఎట్లు తెలిసికొనునో అతనికి నేను అట్లే ఉందును నేను అందరి యొక్క మనస్సునందు బుద్ధియందు ఉండి సర్వులకు హితము చేయుచున్నాను

20 మయా సర్వమిదం వ్యాప్తం మయిసర్వం ప్రతిష్ఠితమ్
అహం సర్వజగద్బీజం సర్వత్రగతిరవ్యయః

నేను ఈ సమస్త జగత్తును వ్యాపించియున్నాను జగత్తంతయు నా యందే ప్రతిష్ఠితమైయున్నది ఈ జగత్తంతటి యొక్క బీజము నేనే అయియున్నాను సర్వత్ర నేను వెలయుచున్నాను నేను నాశరహితుడను

21 సత్త్వయుక్తా మతిర్యేషాం కేవలాఽఽత్మవినిశ్చితా
తే పశ్యన్తి స్వమాత్మానం పరమాత్మానమవ్యయమ్

సత్త్వగుణముతో కూడిన బుద్ధికలవారును ఆత్మతత్త్వమును నిశ్చయించి దాని చింతనమందే లగ్నమైన బుద్ధికలవారును తమ ఆత్మరూపమే యగు నాశరహిత పరమాత్మను దర్శించుచున్నారు

అంతట భీష్ముడు శివుని మాహాత్మ్యమును గూర్చి ధర్మరాజునకు చెప్పుడని శ్రీకృష్ణుని అర్థింపగా శ్రీకృష్ణుడు శివుని మాహాత్మ్యమును ధర్మరాజునకు తెలియజేయుచు ఉపమన్యువు శివుని స్తుతించుట మొదలగు విషయములను కూడ తెలిపెను తత్సందర్భమున

శ్రీకృష్ణుడు ధర్మరాజునకు ఉపమన్యువు ఒకపుడు ఇంద్రునకు బోధించిన విషయముల నిట్లు తెలిపెను —

22 జన్మ శ్వపాకమధ్యేఽపి
మేఽస్తు హరచరణవన్దనరతస్య
మా వానీశ్వరభక్తో
భవాని భవనేఽపి శక్రస్య

(ఉపమన్యువు ఇంద్రునితో ఇట్లు చెప్పెను —)
శంకరుని పాదపద్మములకు నమస్కరించు అవకాశము దొరికినచో నేను చండాలురందు జన్మించినను సంతోషముగా అట్టి జన్మను స్వీకరించుదును శివుని యెడల అనన్యభక్తి లేక నేను ఇంద్రుని భవనమందు కూడ స్థానమును పొంద నభిలషించను

23 అలమన్యాభిస్తేషాం
కథాభిరప్యన్యధర్మయుక్తాభిః
యేషాం న క్షణమపి రుచితో
హరచరణస్మరణ విచ్ఛేదః

ఎవరికి క్షణకాలమైనను శివుని చరణారవిందముల స్మరణ యొక్క వియోగము ఇష్టపడదో అట్టివారికి ఇతర ధర్మములతో కూడిన కథలన్నియు వ్యర్థములే యగును

24 హరచరణనిరతమతినా
భవితవ్యమనార్జవం యుగం ప్రాప్య
సంసారభయం న భవతి
హరభక్తిరసాయనం పీత్వా

కుటిలమగు కలియుగమును పొందిన మనుజులందఱు తమ మనస్సులను శివుని చరణారవిందముల చింతనమందే లగ్నమొనర్ప వలెను శివభక్తిరూప అమృతమును త్రాగినచో సంసారమను రోగమును గూర్చిన భయమిక ఉండదు

25 న నాకపృషం న చ దేవరాజ్యం
న బ్రహ్మలోకం న చ నిష్కలత్వమ్
న సర్వకామానఖిలాన్ వృణోమి
హరస్య దాసత్వమహం వృణోమి

నేను స్వర్గలోకమును కోరుటలేదు దేవతల రాజ్యమును పొంద నభిలషించుటలేదు బ్రహ్మలోకమును నేను వాంఛించుట లేదు నిర్గుణబ్రహ్మము యొక్క సాయుజ్యమును నేను పొందదలంచుట లేదు భూమండలము యొక్క సమస్త కామనలను పదార్థములను నేను పొందదలంచుట లేదు నేను కేవలము శివుని దాసత్వమునే అభిలషించుచున్నాను

26 దివసకరశశాఙ్కవహ్నిదీప్తం
త్రిభువనసారమసారమాద్యమేకమ్
అజరమమర మప్రసాద్య రుద్రం
జగతి పుమానిహ కోలభతే శాన్తిమ్

ఎవరు (ప ర మ శి వు డు) తన నేత్రములగు సూర్య చంద్రాగ్నులచే భాసించుచున్నారో ఎవరు ముల్లోకములందును సారరూపులో ఎవరిని మించి సారతత్త్వము మఱియొకటి లేదో, ప్రపంచమునకు ఆదికారణుడును అద్వితీయుడును అజరుడును అమరుడును అగు ఆ రుద్రుని భక్తిభావముతో ప్రసన్నునిగ చేయక ఎవడీ ప్రపంచమున శాంతిని పొందగలడు ?

27 యది నామ జన్మ భూయో
భవతి మదీయైః పునర్దోషైః
తస్మింస్తస్మిన్జన్మని
భవే భవేన్మే౽క్షయా భక్తిః

నా యొక్క దోషములచే నేను మరల మరల ఈ ప్రపంచమున జన్మించవలసి వచ్చినను ఆయా ప్రతి జన్మయందును శివుని యెడల

నాకు అక్షయమైన భక్తియుండుగాక ! — అనునది నా యొక్క అభీష్టము

ఉపమన్యువు శివుని స్తుతింప శివుడు ప్రత్యక్షముకాగా ఉపమన్యువు అమ్మహాదేవునితో భక్తిపూర్వకముగ ఇట్లు పలికెను —

ఉపమన్యురువాచ —

28 యది దేయో వరో మహ్యం యది తుష్టోఽసిమే ప్రభో
భక్తిర్భవతు మే నిత్యం త్వయి దేవ సురేశ్వర

(ఉపమన్యువు శివునికో ఇట్లు చెప్పెను —)

ప్రభూ ! మీరు నా యెడల సంతుష్టులగుచో నాకు వర మొసంగదలంచుచో దేవా ! సురేశ్వరా ! మీ యందు సదా నాకు భక్తి కలిగియుండునట్లు అనుగ్రహింపుడు

29 నాస్తి శర్వసమో దేవో నాస్తి శర్వసమా గతిః
నాస్తి శర్వసమో దానే నాస్తి శర్వసమో రణే

శివునితో సమానమైన దేవత ఎవడున్ను లేడు శివునితో సమానమైన గతి యేదియు లేదు దానము చేయుటలో శివునితో సమానమైన వాడెవడున్ను లేడు యుద్ధమందు శివునితో సమాన మైన వీరుడెవడున్ను లేడు

ఉపమన్యువు తనతో ఇట్లు చెప్పెనని శ్రీకృష్ణుడు ధర్మరాజున కెఱిగించెను —

ఉపమన్యురువాచ

30 జన్మకోటి సహస్రేషు నానాసంసార యోనిషు
జన్తోర్విగతపాపస్య భవే భక్తిః ప్రజాయతే

---

* ఉపమన్యువు ఈ సందర్భమున కావించిన శివసహస్ర నామ స్తోత్రము గ్రంథారంభమున 158 వ పేజీలో ప్రకటింపబడినది

(ఉపమన్యువు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను —)

కోటివేల జన్మలవఱకు నానావిధ సాంసారిక జన్మలందు తిరుగుచు తిరుగుచు ఒకానొక జీవుఁడు సర్వపాపరహితుడు కాగా అపుడాతనికి శివుని యందు భక్తి కలుగును

31 ఉత్పన్నా చ భవే భక్తిరనన్యా సర్వభావతః
భావినః కారణే చాస్య సర్వయుక్తస్య సర్వథా

భాగ్యముచే సర్వసాధన సంపన్నుడైనవానికి జగత్కారణుడగు శివుని యందు సంపూర్ణభావముతో సర్వథా అనన్యభక్తి కలుగును

32 అస్యైవ చ ప్రసాదేన భక్తిరుత్పద్యతే నృణామ్
యేన యాన్తి పరాం సిద్ధిం తద్భాగవతచేతసః

దేనిచే జనులు తమ చిత్తమును శంకరుని చింతనమందు లగ్న మొనర్చి పరమసిద్ధిని పొందుచున్నారో అట్టి అనన్యభక్తి శంకరుని కృపచేతనే మనుజల హృదయమందు కలుగుచున్నది

33 యే సర్వభావానుగతాః ప్రపద్యన్తే మహేశ్వరమ్
ప్రపన్నవత్సలో దేవః సంసారాత్ తాన్ సముద్ధరేత్

ఎవరు సంపూర్ణభావముతో మహేశ్వరుని శరణు పొందుచున్నారో వారి ఉద్ధారమును శరణాగత వత్సలుడగు మహాదేవుడే ఈ ప్రపంచమున కావించును

అటు పిదప శ్రీకృష్ణుడు ధర్మరాజున కిట్లు చెప్పెను —

వాసుదేవ ఉవాచ

34 సర్వలక్షణహీనోఽపి యుక్తో వా సర్వపాతకైః
సర్వం తుదతి తత్పాపం భావయఞ్ఛివమాత్మనా

(శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ఉత్తమ లక్షణము లెవ్వియు లేనివాడును సమస్త పాపములతో కూడిన వాడను అగు మనుజుడైనను తన హృదయమందు శివుని ధ్యానించుచో, అతడు తన పాపములన్నిటిని నశింపజేసికొనును

అంతట భీష్ముడు నారద మార్కండేయ సంవాదమును గూర్చి ధర్మరాజునకు ఉద్బోధించెను పూర్వమొకపుడు మార్కండేయుని ప్రశ్నను పురస్కరించుకొని నారదుడు ఆతనికిట్లు సమాధానము చెప్పెను —

నారద ఉవాచ

35 దేవర్షిపితృతీర్థాని బ్రాహ్మం మధ్యేఽథ వైష్ణవమ్
నృణాం తీర్థాని పఞ్చాహుః పాణౌ సంనిహితాని వై

(నారదుడు మార్కండేయునితో ఇట్లు చెప్పెను—)

మనుజుల చేతియందే ఐదు తీర్థములుకలవని పెద్దలు చెప్పుదురు అవి యేవియనిన— దేవతీర్థము ఋషితీర్థము పితృతీర్థము బ్రహ్మతీర్థము వైష్ణవతీర్థము (వ్రేళ్ళ చివరిభాగమున దేవతీర్థము కలదు చిటికెన వ్రేలు ఉంగరపువ్రేళ్ళయొక్క మూలభాగమున ఋషితీర్థము కలదు బొటనవ్రేలు చూపుడువ్రేళ్ళమధ్య భాగములో పితృతీర్థము కలదు బొటనవ్రేలి మూలభాగమున బ్రహ్మతీర్థముకలదు అరచేతి మధ్యభాగమున వైష్ణవతీర్థము కలదు)

36 అర్థాశ్చ నార్యశ్చ సమానమేత-
చ్ఛ్రేయాంసి పుంసామిహ మోహయన్తి
రతిప్రమోదాత్ ప్రమదా హరన్తి
భోగైర్ధనం చాప్యుపహన్తి ధర్మాన్

ధనము కామము–రెండిటియొక్క ప్రభావము ఒకే విధముగ నుండును ఆ రెండును మనుజునకు శ్రేయోమార్గమున ఆటంకమును కలుగజేయును. అవి అతనిని మోహాంపజేయును రతిజనిత మోదముచే కామము ఆటంకము కలుగజేయుచున్నది ధనము భోగముల ధర్మమును నాశనము చేయుచున్నది

అనంతరము భీష్ముడు ధర్మరాజునకిట్లు చెప్పెను—

భీష్మ ఉవాచ

37 శ్రద్ధాపూతో నరస్తాత దురాత్మాఽపి న సంశయః
పూతో భవతి సర్వత్ర కిముత త్వం మహాద్యుతే

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

మనుష్యుడు జితేంద్రియుడు కాకున్నను శ్రద్ధామాత్రముచే పవిత్రుడగుచున్నాడు దీనియందు సందేహము లేదు బ్రహ్మతేజస్వి యగు రాజా! శ్రద్ధతో కూడిన మనుజుడు సర్వత్ర పవిత్రుడుగనే యుండును ఇక మీ వంటి ధర్మాత్ముడు పవిత్రుడగుటలో సందేహము లేదు

అత్తరి కాశ్యపుడు ధర్మరాజునకిట్లు బోధించెను—

కాశ్యప ఉవాచ

38 సర్వే చ వేదాః సహ షడ్భిరంగైః
సాంఖ్యం పురాణం చ కులే చ జన్మ
నైతాని సర్వాణి గతిర్భవన్తి
శీలవ్యపేతస్య నృప ద్విజస్య

(కాశ్యపుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

శీలము లేనివానికి అంగసహితముగ వేదములుగాని సాంఖ్య, పురాణముల జ్ఞానముగాని ఉత్తమకులమందు జన్మగాని, అవియన్నియు చేరి కాని ఉత్తమగతి నొసంగజాలవు

ఎదప మార్కండేయుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—

మార్కండేయ ఉవాచ

39 అశ్వమేధసహస్రం చ సత్యం చ తులయా ధృతమ్
నాంభిజానామి యద్యస్య సత్యస్యార్ధమవాప్నుయాత్

(మార్కండేయుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

క్రతువుయొక్క ఒక పళ్ళెమునందు ఒక వెయ్యి అశ్వమేధ యజ్ఞములను మఱియొక పళ్ళెమునందు సత్యమును ఉంచి చూచినచో ఆ యజ్ఞములన్నియు కలసి సత్యముయొక్క అర్ధభాగమునకైనను సరి తూగగలవో లేవో నాకు తెలియదు (సరితూగలేవని భావము)

అనంతరము భీష్ముడు ధర్మరాజునకిట్లు ప్రబోధించెను —

భీష్మ ఉవాచ

40 అహింసా సత్యమక్రోధ ఆనృశంస్యం దమస్తథా
అర్జవం చైవ రాజేన్ద్ర నిశ్చితం ధర్మలక్షణమ్

(భీష్ముడు ధర్మరాజునకిట్లు జెప్పెను—)

అహింస సత్యము, అక్రోధము, కోమలత్వము, ఇంద్రియ నిగ్రహము సరళత్వము—ఇవి ధర్మముయొక్క నిశ్చితములగు లక్షణములై యున్నవి

ఎమ్మట భీష్ముడు ఒకానొక సిద్ధునకును శిలవృత్తితో, జీవించు ఒకానొక గృహస్థునకున్ను జరిగిన సంభాషణమును వివరించి చెప్పెను పవిత్రస్థానములను గూర్చి తీర్థములను గూర్చి గృహస్థుడు ప్రశ్నింప సిద్ధుడిట్లు చెప్పెను—

సిద్ధ ఉవాచ

41 వర్ణాశ్రమా యథా సర్వే ధర్మజ్ఞానవివర్జితాః
క్రతవశ్చ యథాసోమాస్తథా గఙ్గాం వినా జగత్

(సిద్ధుడు శిల్పవృత్తిగల గృహస్థునితో ఇట్లు చెప్పెను—)

ధర్మము జ్ఞానము లేనిచో అన్నివర్ణములకు ఆశ్రమములకు శోభ ఎట్లులేదో సోమ రసములేనిచో యజ్ఞమెట్లు శోభించదో అట్లే గంగానదిలేనిచో జగత్తునకే శోభ ఉండదు

తరువాత ధర్మరాజు ప్రపంచమున పూజ్యులెవరు అని ప్రశ్నింప భీష్మాచార్యుడు నారద శ్రీకృష్ణసంవాదమును పేర్కొనెను ఒకప్పుడు శ్రీకృష్ణుడు నారదుని లోకమున పూజ్యులెవరో తెలుపుడని ప్రశ్నింప నారదుడిట్లు సమాధానము చెప్పెను—

నారద ఉవాచ

42 వరుణం వాయుమాదిత్యం పర్జన్యం జాతవేదసమ్
స్థాణుం స్కన్దం తథా లక్ష్మీం విష్ణుం బ్రహ్మాణమేవ చ

43 వాచస్పతిం చన్ద్రమసమపః పృథ్వీం సరస్వతీమ్
సతతం యే నమస్యన్తి తాన్ నమస్యామ్యహం విభో

(నారదుడు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పెను—)

ఎవరు వరుణుడు వాయువు ఆదిత్యుడు అగ్ని రుద్రుడు కార్తికేయస్వామి లక్ష్మి విష్ణువు బ్రహ్మదేవుడు బృహస్పతి చంద్రుడు జలము పృథివి సరస్వతీదేవి—వీరికి సదా ప్రణమిల్లు చుందురో, అట్టి పుణ్యాత్ములకు నేను శిరస్సు వంచి నమస్కరించుకొను

44 సర్వాన్ దేవాన్ నమస్యన్తి యే చైకం వేదమాశ్రితాః
శ్రద్దధానాశ్చ దాన్తాశ్చ దుర్గాణ్యతితరన్తి తే

ఎవరు సమస్తదేవతలకు ప్రణమిల్లుదురో వేదమునే ఆశ్రయించుదురో శ్రద్ధ కలిగియుందురో ఇంద్రియములను నిగ్రహించుదురో అట్టివారు దుస్తరసంకటముల నుండి విముక్తిని బొందుచున్నారు

45 అక్రోధః సత్యవచనమహింసా దమ ఆర్జవమ్
అద్రోహోఽనభిమానశ్చ హ్రీస్తితిక్షా దమః శమః

46 యస్మిన్నేతాని దృశ్యన్తే న చాకార్యాణి భారత
స్వభావతో నివిష్టాని తత్పాత్రం మానమర్హతి

క్రోధము లేకుండుట సత్యభాషణము అహింస ఇంద్రియ నిగ్రహము సరళత్వము ద్రోహరాహిత్యము అభిమాన శూన్యత్వము, లజ్జ సహనశీలత్వము దమము మనోనిగ్రహత్వము - అను ఈ సద్గుణములు ఎవని యందు స్వభావముగనే కనుపించునో వారు దానమునకు ఉత్తమ పాత్రలును సమ్మానమునకు అధికారులును (అర్హులును) అయియున్నారు

47 లోకయాత్రా చ ద్రష్టవ్యా ధర్మశ్చాత్మహితాని చ
ఏవం నరో వర్తమానః శాశ్వతీర్వర్ధతే సమాః

మనుజుడు జగత్తు యొక్క వ్యవహారములపై దృష్టి నుంచి ఆలోచించవలెను ధర్మమును తన శ్రేయస్సును అభివృద్ధి పఱచుటకు ఉపాయములను ఆలోచించవలెను అట్లు చేయు మనుజుడు సదా అభ్యుదయశీలుడై యుండును

తదుపరి భీష్ముడు దేవశర్మ యను గురువు — విపులుడను తన శిష్యునకు బోధించిన ధార్మిక విషయములను తెలియజేసెను దేవశర్మ విపులున కిట్లు బోధించెను —

దేవశర్మోవాచ

48 న మాం కశ్చిద్ విజానీత ఇతికృత్వా న విశ్వసేత్
నరో రహసి పాపాత్మా పాపకం కర్మ వై ద్విజ

49 కుర్వాణం హి నరం కర్మ పాపం రహసి సర్వదా
పశ్యన్తి ఋతవశ్చాపి తథా దిననిశేఽప్యుత

(దేవశర్మ విపులునితో ఇట్లు చెప్పెను —)

పాపయుసుడు ఏకాంతమున పాపముచేసి నన్నెవరును చూచుటలేదు అని విశ్వసించరాదు ఏలయనిన, ఏకాంతముగ పాప కర్మ చేయు వానిని ఋతువులు రాత్రిందినములు చూచుచునే యున్నవి

50 సాధూనాం పునరాచారో గరీయాణ ధర్మలక్షణః

మహాత్ములగు ఉత్తముల ఆచరణమే ధర్మము యొక్క లక్షణమైయున్నది

51 స్త్రియో యత్ర చ పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః
అపూజితాశ్చ యత్రైతాః సర్వాస్తత్రాఫలాః క్రియాః

ఎచట స్త్రీలకు ఆదరసత్కారము గావింపబడునో అచట దేవతలు ప్రసన్నతాపూర్వకముగ నివసించుదురు స్త్రీలకెచట అనాదారము గావింపబడునో అచటి సమస్త క్రియలు నిష్ఫలములై పోవును

52 విదేహోరాజదుహితా చాత్ర శ్లోకమగాయత
నాస్తి యజ్ఞక్రియా కాచిన్నశ్రాద్ధం నోపవాసకమ్
ధర్మః స్వభర్తృశుశ్రూషా తయా స్వర్గం జయన్త్యుత

విదేహరాజగు జనకుని పుత్రిక గానముచేసిన శ్లోకమొకటి కలదు దాని భావమేమనగా - స్త్రీకి ఏదియైన యజ్ఞాది కర్మము గాని శ్రాద్ధము గాని ఉపవాసన చేయుటగాని ఆవశ్యకత లేదు ఆమె ధర్మము భర్తను సేవించుట దానిచే స్త్రీలు స్వర్గలోకముపై విజయమును పొందుచున్నారు

53 శ్రియ ఎతాః స్త్రియో నామ సత్కార్యా భూతిమిచ్ఛతా
పాలితా నిగృహీతా చ శ్రీః స్త్రీ భవతి భారత

స్త్రీలే గృహము యొక్క లక్ష్మి స్వరూపులు అయియున్నారు ఉన్నతిని అభిలషించు పురుషులు స్త్రీలను తెస్సగ సత్కరించవలెను తమ వశమందుంచుకొని వారి యొక్క పలగ పోషణ చేయుటచే స్త్రీ శ్రీ (లక్ష్మి) యొక్క స్వరూపమగుచున్నది

అనంతరము భీష్ముడు ధర్మరాజున కిట్లు ప్రబోధము సలిపెను —

భీష్మ ఉవాచ

54 ప్రత్యక్షం ప్రతిజననం భోక్తుర్దాతుర్భవత్యుత
సర్వాణ్యన్యాని దానాని పరోక్షఫలవన్త్యుత

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

అన్నదానము దాతను భోక్తను ఇరువురను ప్రత్యక్ష రూపముగ సంతుష్టిపఱచునదై యున్నది తక్కిన దానములన్నిటి యొక్క ఫలము పరోక్షమైయున్నది

55 అశ్వమేధసహస్రం చ సత్యం చ తులయా ధృతమ్
అశ్వమేధసహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే

త్రాసు యొక్క ఒక పళ్ళెమునందు వేయి అశ్వమేధ యాగముల యొక్క పుణ్యము మఱియొక దాని మీద కేవలము సత్యము ఉంచబడినచో సత్యమే గురుతరమైనదని తెలియగలదు

56 అజన్మమరణాద్ యస్తు బ్రహ్మచారీ భవేదిహ
న తస్య కించిదప్రాప్యమితి విద్ధి నరాధిప

ఏ వడ్జీవితము బ్రహ్మచారిగా నుండువానికి అలభ్యమైనది ఒకింతైనను లేదని తెలిసికొనుము

57 అన్తరా సాయమాశం చ ప్రాతరాశం చ యో నరః
సదోపవాసీ భవతి యో న భుఙ్క్తేఽన్తరా పునః

ఎవడు కేవలము ప్రాతఃకాలమున, సాయంసమయమున మాత్రము భోజనము చేయునో మధ్యలో ఏమియు తినడో అతడు సదా ఉపవాసియనియే తలంచవలెను

ఇమ్మాట భీష్ముడు ధర్మరాజునకు పూర్వము మహర్షులు చెప్పిన ధర్మములను పేర్కొనెను అందు భరద్వాజుడిట్లు వచించెను —

భరద్వాజ ఉవాచ

58 ఉత్పన్నస్య రురోః శృఙ్గం వర్ధమానస్య వర్ధతే
ప్రార్థనా పురుషస్యేవ అస్య మాత్రా న విద్యతే

(భరద్వాజుడు ఇట్లు చెప్పెను —)

పుట్టిన మృగము ఎదుగుచున్న కొలది దాని కొమ్ములు కూడ ఎట్లు పెరుగుచుండునో అట్లే మనుజుని తృష్ణయు పెరుగుచుండును దానికి హద్దు ఏమియు లేదు

గౌతముడిట్లు చెప్పెను —

గౌతమ ఉవాచ —

59 న తల్లోకే ద్రవ్యమస్తి యల్లోకం ప్రతిపూరయేత్
సముద్రకల్పః పురుషో న కదాచన పూర్యతే

(గౌతముడు ఇట్లు చెప్పెను —)

మనుజుని ఆశ యొక్క పొట్టను నింపునట్టి వస్తువేదియు ఈ ప్రపంచమున లేదు మనుజుని ఆశ సముద్రము వంటిది అది ఎన్నడును నిండదు

అత్రి ఈ ప్రకారముగ చెప్పెను —

అత్రి రువాచ

60 న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఎవాభివర్ధతే

(అత్రి యిట్లు చెప్పెను —)

భోగములను అనుభవించుటచే వానిని గూర్చిన ఆశ ఎన్నడును తగ్గదు పైపెచ్చు అగ్నిలో నెయ్యి వేసిన చందమున అది ఇంకను అధికమగుచుండును

అరుంధతి ఇట్లు చెప్పెను—

అరున్ధత్యువాచ

61 ధర్మార్థం సంచయో యోవై ద్రవ్యాణాం పక్షసమ్మతః
తపఃసంచయ ఏవేహ విశిష్టో ద్రవ్యసంచయాత్

(అరుంధతి ఇట్లు చెప్పెను—)

ధర్మము చేయుటకై ధనమును సంపాదించవలెనని ఈ ప్రపంచమున కొందఱి అభిప్రాయమై యున్నది కాని ధన గ్రహణముకంటె తపస్సుయొక్క సంపాదనయే శ్రేష్ఠమైనది

పరాశరుడు ఇట్లు ప్రబోధించెను—

పరాశర ఉవాచ

62 జ్ఞానేన్ద్రియేణ దాన్తేన శుచినాచాపలేన వై
అదుర్బలేన ధీరేణ నొత్తరోత్తరవాదినా
అలుబ్ధేనానృశంసేన ఋజునా బ్రహ్మవాదినా
చారిత్రతత్పరేణైవ సర్వభూతహితాత్మనా
అరయః షడ్ విజేతవ్యా నిత్యం స్వం దేహమాశ్రితాః
కామక్రోధౌ చ లోభశ్చ మానమోహౌ మదస్తథా

(పరాశరుడు ఇటు చెప్పెను—)

మనుజుడు జితేంద్రియుడు మనోనిగ్రహి, పవిత్రుడు చంచలత్వ రహితుడు బలయుతుడు ధైర్యశాలి వాద వివాదరహితుడు, లోభ వర్జితుడు దయాళువు సరళస్వభావ యుతుడు బ్రహ్మవాది, సదాచారపరాయణుడు సర్వహితాత్ముడు అయి తనయందున్న కామ క్రోధ లోభ మోహ మాన మదములను ఆఱుమంది శత్రువులను తప్పక జయించవలెను

63 విధినా ధృతిమాస్థాయ శుశ్రూషురనహంకృతః
వర్ణత్రయస్యానుమతో యథాశక్తి యథాబలమ్
కర్మణా మనసా వాచా చక్షుషా చ చతుర్విధమ్
ఆస్థాయ నియమం ధీమాఞ్ఛాన్తో దాన్తో జితేన్ద్రియః

బుద్ధిమంతుడు విధిపూర్వకముగ ధైర్యము నాశ్రయించి గురు సేవాతత్పరుడై అహంకారశూన్యుడై సర్వానుభూతికి పాత్రుడై తనశక్తి బలము లననుసరించి కర్మ మనస్సు వాక్కు నేత్రములు— అను వీనిద్వారా నాలుగు విధములైన సంయమము నవలంబించి శాంత చిత్తుడై దమనశీలుడై జితేంద్రియుడై యుండవలెను

64 పరిసంఖ్యాన తత్త్వజ్ఞస్తథా సత్యరతిః సదా
ఊర్ధ్వం నాధో న తిర్యక్ చ న కించిదభికామయేత్

(సన్యాసి) వస్తువులయొక్క స్వరూపమును చక్కగ విచారించి వాని తత్త్వమును తెలిసికొని సదా సత్యమందు అనురక్తుడై యుండవలెను పైన క్రింద ప్రక్కల ఏ వస్తువును ఎప్పుడును కోర రాదు

65 ఏవం సంచరమాణస్తు యతిధర్మం యథావిధి
కాలస్య పరిణామాత్ తు యథా పక్వఫలం తథా
స విసృజ్య స్వకం దేహం ప్రవిశేద్ బ్రహ్మశాశ్వతమ్

ఈ ప్రకారముగ విధిపూర్వకముగ యతిధర్మమును పాలించు సన్యాసి కాలపరిణామవశమున తన శరీరమును పక్వ ఫలమునువలె వదలి, సనాతన బ్రహ్మమందు ప్రవేశించుచున్నాడు

66 నిరామయమనాద్యన్తం గుణసౌమ్యమచేతనమ్
నిరక్షరమబీజం చ నిరిన్ద్రియమజం తథా

67 అజయ్యమక్షరం యత్ తదభేద్యం సూక్ష్మమేవ చ
నిర్గుణం చ ప్రకృతిమన్నిర్వికారం చ సర్వశః

68 భూతభవ్య భవిష్యస్య కాలస్య పరమేశ్వరమ్
అవ్యక్తం పురుషం క్షేత్రమానన్త్యాయ ప్రపద్యతే

ఆ బ్రహ్మము నిరామయము అనాది అనంతము సౌమ్యగుణ యుక్తము చైతన్యరూపము అనిర్వచనీయము బీజరహితము,

ఇంద్రియాతీతము జన్మవర్జితము అజేయము నాశరహితము అభేద్యము సూక్ష్మము నిర్గుణము సర్వశక్తివంతము నిర్వికారము, భూత భవిష్యద్వర్తమానముల ప్రభువు పరమేశ్వరుడు అయియున్నది అదియే అవ్యక్తము అంతర్యామి క్షేత్రము కూడ అయియున్నది దాని నెఱుఁగువాడు మోక్షమును పొందును

69 ధృత్యా శిశ్నోదరం రక్షేత్ పాణిపాదం చ చక్షుషా
ఇన్ద్రియార్థాంశ్చ మనసా మనోబుద్ధౌ సమాదధేత్

ధైర్యముచే ఉపస్థను (జననేంద్రియమును) ఉదరమును అరికట్టవలెను నేత్రముల ద్వారా చేతులను కాళ్ళను అరికట్టవలెను మనస్సుచే ఇంద్రియ విషయములను అరికట్టవలెను మనస్సును బుద్ధి యందు స్థాపించవలెను

70 జ్ఞానయుక్తస్తథా దేవం హృదిస్థముపలక్షయేత్
ఆదీప్యమానం వపుషా విధూమమనలం యథా
రశ్మిమన్తమివాదిత్యం వైద్యుతాగ్నిమివామ్బరే
సంస్థితం హృదయే హ్యేశం శాశ్వతమవ్యయమ్

వివేకయుక్తుడగు సాధకుడు తన హృదయమున విరాజమానుడైయున్న పరమాత్మ దేవుని సాక్షాత్కరించుకొనవలెను ఆకాశమున మెఱపు యొక్క ప్రకాశము చూడబడునట్లు కిరణయుక్తుడగు సూర్యుడు భాసించునట్లు ఆ పరమాత్మ దేవుడు పొగలేని అగ్నివలె తేజోవంతముగ ప్రకాశించుచుండుటను గాంచవలెను హృదయ దేశమున విరాజమానుడైన ఆ నాశరహిత, సనాతన పరమేశ్వరుని బుద్ధియను నేత్రము ద్వారా దర్శింపవలెను

71 నిష్కలం కేవలం భవతి శుద్ధతత్త్వార్థ తత్త్వవిత్

శుద్ధతత్త్వార్థమును తత్త్వము ద్వారా తెలిసికొనువాడు అవయవరహిత అద్వితీయ బ్రహ్మమే యగుచున్నాడు

ఎదప భీష్ముడు ప్రపంచములో వంద్యులు పూజ్యులు ఎవరను ధర్మరాజ యొక్క ప్రశ్నకు సమాధాన మొసంగుచు ఇంద్ర మాతలి సంవాదమును ఎఱిగించెను పూర్వము ఇంద్రుడు తన సారథియగు మాతలితో ఇట్లు చెప్పెను —

ఇన్ద్ర ఉవాచ

72 ధనం విద్యాస్తథైశ్వర్యం యేషాం న చలయేన్మతిమ్
చలితాం యే నిగృహ్ణన్తి తాన్ నిత్యం పూజయామ్యహమ్

(ఇంద్రుడు మాతలితో ఇట్లు చెప్పెను —)

ధనము విద్య ఐశ్వర్యము ఎవరి బుద్ధిని చలింప చేయజాలవో ఎవరు చంచలబుద్ధిని వివేకముచే వశమందుంచుకొనుదురో అట్టి మహనీయులను నేను నిత్యము పూజించుచున్నాను

అటు తరువాత భీష్ముడు ధర్మరాజునకీ ప్రకారము బోధించెను —

భీష్మ ఉవాచ

73 ఆచారాల్లభతే హ్యాయురాచారాల్లభతే శ్రియమ్
ఆచారాత్ కీర్తిమాప్నోతి పురుషః ప్రేత్య చేహ చ

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

సదాచారము వలననే మనుజునకు ఆయుస్సు లభించును సదాచారము వలననే అతడు సంపదను బడయును సదాచారము వలననే అతనికి ఇహ, పరలోకములందు కీర్తి లభించును

74 తస్మాత్ కుర్యాదిహాచారం యదీచ్ఛేద్ భూతిమాత్మనః
అపి పాపశరీరస్య ఆచారో హన్త్యలక్షణమ్

కాబట్టి శ్రేయస్సును కోరు మనుజుడు ఈ ప్రపంచమున సదాచారమునే పాలింపవలెను శరీరమంతయు పాపమయమైన వాడుకూడ

దాచారమును పాలించుచో అతడు తన శరీర మనంబుల యొక్క
చెడ్డ లక్షణములను అణగద్రొక్కి వేయును

75 వాక్సాయకావదనాన్నిష్పతన్తి
యైరాహతః శోచతి రాత్ర్యహాని
పరస్య వా మర్మసు యే పతన్తి
తాన్ పణ్డితో నావసృజేత్ పరేషు

వచనరూప బాణములు నోటి నుండి వెలువడగనే వానిచే
కొట్టబడి జనులు రాత్రింబగళ్ళు శోక నిమగ్నులగుచున్నారు కావున
మనుజుడు ఇతరులకు బాధ కలుగజేయు వచనములను ఎన్నడును
పలుకరాదు

76 (న సంధ్యాయాం స్వపేన్నిత్యం స్నాయాచ్ఛుద్ధః సదా భవేత్)
న చాభ్యుదితశాయీ స్యాత్ ప్రాయశ్చిత్తీ తథా భవేత్
మాతాపితరముత్థాయ పూర్వమేవాభివాదయేత్
ఆచారమథవాప్యన్యం తథాయుర్విన్దతే మహత్

సాయంకాలమున నిదురించరాదు ప్రతి దినము స్నానము
చేయుచు పవిత్రతాపూర్వకముగ ఉండవలెను సూర్యోదయమగు
వఱకు ఎప్పుడను నిదురించరాదు ఎప్పుడైన అట్లు నిదురించినచో
ప్రాయశ్చిత్తము చేసికొనవలెను ప్రతి దినము ఉదయమున లేచిన
పిమ్మట మొదట తల్లిదండ్రులకు తదుపరి ఆచార్యునకు ఇతర
గురుజనులకు నమస్కరింపవలెను దీనివలన దీర్ఘాయువు లభించును

77 సర్వాణి ఖలు తీర్థాని గుణవన్తి మనీషిణః
యత్తు తీర్థం చ శౌచం చ తన్మే శృణు సమాహితః

ఈ ప్రపంచమునగల తీర్థములన్నియు బుద్ధిమంతులకు సత్ఫల
మునే కలుగజేయును కాని వాని యన్నింటిలోను మహా పవిత్రమై
ప్రధానమైనట్టి తీర్థమును గూర్చి చెప్పుచున్నాను వినుడు

78 అగాధే విమలే శుద్ధే సత్యతోయే ధృతిహ్రదే
స్నాతవ్యం మానసే తీర్థే సత్త్వమాలమ్బ్య శాశ్వతమ్

దేనియందు ధైర్యమను కుండము సత్యమను జలము నిండి యున్నదో ఏది అగాధమును అత్యంత నిర్మలమును శుద్ధమును అయి యున్నదో అట్టి మానస తీర్థమున సదా పరమాత్మ నాశ్రయించి స్నానము చేయవలెను

79 నిర్మమా నిరహంకారా నిర్ద్వన్ద్వా నిష్పరిగ్రహాః
శుచయస్తీర్థ భూతాస్తే యే భైక్ష్యముపభుఞ్జతే

మమత్వము అహంకారము రాగద్వేషాది ద్వంద్వములు, పరిగ్రహము లేనివారును భిక్షచే జీవన నిర్వహణము కావించు వారును విశుద్ధ అంతఃకరణము కలవారును అగు సాధు మహాత్ములు తీర్థ స్వరూపులై యున్నారు

80 నోదకక్లిన్నగాత్రస్తు స్నాత ఇత్యభిధీయతే
స స్నాతో యో దమస్నాతః స బాహ్యాభ్యన్తరః శుచిః

శరీరమును కేవలము నీటియందు తడుపుటయే స్నానమనం బడదు ఎవరు మనస్సు ఇంద్రియములయొక్క సంయమము కలిగి యుండునో అతడే బాహ్యాభ్యంతరములందును పవిత్రుడుగ తలంచ బడును

81 వృత్తశౌచం మనఃశౌచం తీర్థశౌచమతః పరమ్
జ్ఞానోత్పన్నం చ యచ్ఛౌచం తచ్ఛౌచం పరమం స్మృతమ్

శుద్ధి నాలుగు విధములుగ చెప్పబడినది—ఆచారశుద్ధి మనః శుద్ధి, తీర్థశుద్ధి జ్ఞానశుద్ధి వీనియందు జ్ఞానముచే కలుగుశుద్ధియే శ్రేష్ఠ మని తలంచబడినది

82 మనసా చ ప్రదీప్తేన బ్రహ్మజ్ఞానజలేన చ
స్నాతి యో మానసే తీర్థే తత్స్నానం తత్త్వదర్శినః

ఎవడు ప్రసన్న శుద్ధమనస్సుచే బ్రహ్మజ్ఞానమను జలము ద్వారా మానస తీర్థమందు స్నానము చేయునో అతని ఆ స్నానము తత్త్వదర్శియగు జ్ఞానియొక్క స్నానమని తలంచబడినది

83 సమారోపితశౌచస్తు నిత్యం భావసమాహితః
కేవలం గుణసమ్పన్నః శుచిరేవ నరః సదా

ఎవడు సదా శౌచాచార సంపన్నుడై, విశుద్ధభావయుక్తుడై కేవలము సద్గుణ విభూషితుడై యుండునో అట్టి వానిని సదా శుద్ధుడుగనే తలంచవలెను

84 మనసశ్చ పృథివ్యాశ్చ పుణ్యాస్తీర్థాస్తథాపరే
ఉభయోరేవ యః స్నాయాత్ స సిద్ధిం శీఘ్రమాప్నుయాత్

ఈ ప్రకారముగ భూమియందును మనస్సునందును అనేక పుణ్యమయ తీర్థములుకలవు ఎవడీ రెండు విధములైన తీర్థములందును స్నానముచేయునో అతడు శీఘ్రముగ పరమాత్మ ప్రాప్తియను సిద్ధిని పొందుచున్నాడు

భీష్మాచార్యుడు ధర్మరాజాదులకు పెక్కు ధర్మములను ఉపదేశించుచుండగా అచ్చోటికి స్వర్గలోకమునుండి దేవగురువగు బృహస్పతి ఏతెంచి ధర్మరాజునకిట్లు బోధించెను—

బృహస్పతిరువాచ

85 ఏకః ప్రసూయతే రాజన్నేక ఏవ వినశ్యతి
ఏకస్తరతి దుర్గాణి గచ్ఛత్యేకస్తు దుర్గతిమ్

(బృహస్పతి ధర్మరాజుతో ఇట్లు చెప్పెను— )

ప్రాణి ఒంటరిగనే జన్మించుచున్నాడు ఒంటరిగనే మరణించుచున్నాడు ఒంటరిగనే దుఃఖమును దాటివైచుచున్నాడు ఒంటరిగనే దుర్గతిని అనుభవించుచున్నాడు

86 అసహాయః పితామాతా తథా భ్రాతా సుతో గురుః
జ్ఞాతిసమ్బన్ధివర్గశ్చ మిత్రవర్గస్తథైవ చ

తండ్రి తల్లి సోదరుడు పుత్రుడు గురువు జ్ఞాతి, సంబంధము కలవారు మిత్రులు—ఎవరుకూడ మనుజునకు (అంత్యకాలమున) సహాయము చేయజాలరు

87 మృతం శరీరముత్సృజ్య కాష్ఠలోష్టసమం జనాః
ముహూర్తమివ రోదిత్వా తతో యాన్తి పరాఙ్ముఖాః

జనులు అతని మృతశరీరమును కట్టెవలె మట్టిముద్దవలె విసరి పారవేసి కొద్దిసేపు ఏడ్చి తదుపరి అతనివైపునుండి ముఖము త్రిప్పి వెడలిపోవుచున్నారు

88 తైస్తచ్ఛరీరముత్సృష్టం ధర్మ ఏకోఽనుగచ్ఛతి
తస్మాద్ ధర్మః సహాయశ్చ సేవితవ్యః సదా నృభిః

అతని కుటుంబసభ్యులు అతని శరీరమును పరిత్యజించి వెడలి పోవుచున్నారు కాని ఒక ధర్మమే ఆ జీవుని అనుసరించి వెడలుచున్నది కావున ధర్మమే నిజమైన సహాయకుడు అందుచే మనుజుడు సదా ధర్మమునే అనుసరించవలెను

89 ప్రాణీ ధర్మసమాయుక్తో గచ్ఛేత్ స్వర్గగతిం పరామ్
తథైవాధర్మసంయుక్తో నరకం చోపపద్యతే

ధర్మయుక్తుడగువాడు ఉత్తమ స్వర్గమున కేగుచున్నాడు అధర్మపరాయణుడగు నరకమందు పడుచున్నాడు

90 పృథివీ వాయురాకాశమాపో జ్యోతిర్మనోఽన్తకః
బుద్ధిరాత్మా చ సహితా ధర్మం పశ్యన్తి నిత్యదా

భూమి జలము, అగ్ని వాయువు, ఆకాశము మనస్సు, యముడు బుద్ధి ఆత్మ—ఇవియన్నియు మనుజుడుచేయు ధర్మము కర్మముపై దృష్టినుంచుదురు

91 ప్రాణినామిహ సర్వేషాం సాక్షిభూతా నిశానిశమ్
ఏతైశ్చ సహ ధర్మోఽపి తం జీవమనుగచ్ఛతి

పగలు, రాత్రికూడ ఈ ప్రపంచమున సమస్త ప్రాణుల కర్మలకు సాక్షులు వీనియన్నిటితోకూడ ధర్మమున్ను జీవుని అనుసరించుచున్నది

92 ఇహలోకే చ స ప్రాణీ జన్మప్రభృతి పార్థివ
సుకృతం కర్మ వై భుఙ్క్తే ధర్మస్య ఫలమాశ్రితః

93 యది ధర్మం యథాశక్తి జన్మప్రభృతి సేవతే
తతః స పురుషో భూత్వా సేవతే నిత్యదా సుఖమ్

జీవుడు పుట్టుకనుండియు పుణ్యకర్మలను చేయుచుండుచో అతడు ధర్మముయొక్క ఫలమును ఆశ్రయించితదను సారము సుఖముననుభవించును తన శక్త్యనుసారము చిన్నప్పటినుండియు ధర్మమును సేవించుచో, అతడు సదా సుఖమును అనుభవించును

94 అథాన్తరా తు ధర్మస్యాప్యధర్మముపసేవతే
సుఖస్యానన్తరం దుఃఖం స జీవోఽప్యధిగచ్ఛతి

అట్లుకాక ధర్మముమధ్య అపుడపుడు అధర్మమునుకూడ చేయుచో అతడు సుఖము తరువాత దుఃఖమునుకూడ అనుభవించవలసవచ్చును

95 అధర్మేణ సమాయుక్తో యమస్య విషయం గతః
మహద్ దుఃఖం సమాసాద్య తిర్యగ్యోనౌ ప్రజాయతే

అధర్మ పరాయణుడు యమలోకమునకేగి అచటమహా దుఃఖమునను భవించి తదుపరి ఇచట పశుపక్ష్యాది జన్మలనెత్తును

96 సర్వేషామేవ దానానామన్నం శ్రేష్ఠముదాహృతమ్
పూర్వమన్నం ప్రదాతవ్యమృజునా ధర్మమిచ్ఛతా

అన్నిదానములకంటె అన్నదానము శ్రేష్ఠమని చెప్పబడినది కాబట్టి ధర్మము యెడల ఇచ్ఛగలవారు సరళభావముతో మొదట అన్నదానమే చేయవలెను

97 న తత్ పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః
ఏష సంక్షేపతో ధర్మః కామాదన్యః ప్రవర్తతే

ఏ కార్యము లేక ఏ విషయము తనకు మంచిదిగా తోచదో దానిని ఇతరుల యెడల చేయరాదు ఇదియే ధర్మముయొక్క సంక్షిప్త లక్షణము దీనికి భిన్నమగు నడవడిక కామమూలకమైయున్నది

తరువాత భీష్ముడు ధర్మరాజునకిట్లు బోధసలిపెను—

భీష్మ ఉవాచ
98 రూపమవ్యంగతామాయుర్బుద్ధిం సత్త్వం బలం స్మృతిమ్
ప్రాప్తుకామైర్నరైర్హింసా వర్జితా వై మహాత్మభిః

(భీష్ముడు ధర్మరాజుతో ఇటు చెప్పెను —)

సుందరరూపము పూర్ణ అంగత్వము పూర్ణ ఆయుస్సు, ఉత్తమబుద్ధి సత్త్వము, బలము స్మరణశక్తి-వీనిని పొందదలంచు మహాత్ములు హింసను పూర్తిగ వదలివైచిరి

99 స్వమాంసం పరమాంసేన యో వర్ధయితుమిచ్ఛతి
నారదః ప్రాహ ధర్మాత్మా నియతం సోఽవసీదతి

నారదుడు ఇట్లు చెప్పెను—ఇతర ప్రాణుల మాంసముచేత, మాంసమును అభివృద్ధి చేయదలంచువాడు నిక్కముగ దుఃఖమును అనుభవించును

100 అహింసా పరమో ధర్మ స్తథాహింసా పరం తపః
అహింసా పరమం సత్యం యతో ధర్మః ప్రవర్తతే

అహింస పరమ ధర్మము అహింస పరమ తపస్సు అహింస పరమ సత్యము ఏలయనిన దానివలననే ధర్మమునొక్క ప్రవృత్తి సంభవించును

101 న హి ప్రాణాత్ ప్రియతరం లోకే కించన విద్యతే
తస్మాద్ దయాం నరః కుర్యాద్ యథాఽఽత్మని తథాపరే

ప్రపంచమున తన ప్రాణముకంటె అధికప్రియమైన వస్తువు ఇంకొకటిలేదు కాబట్టి మనుజుడు తనపై దయ కలిగి యుండునట్లు ఇతర ప్రాణుల యెడలకూడ దయ కలిగి యుండవలెను

102 మాంస భక్షయతే యస్మాద్ భక్ష్యయిష్యే తమప్యహమ్
ఏతన్మాంసస్య మాంసత్వమనుబుద్ధ్యస్వ భారత

(వధింపబడు ప్రాణి ఇట్లు చెప్పుచున్నది —)

నేడు నన్ను అతడు భక్షించుచున్నాడు కావున నేనున్ను ఎప్పుడైన అతనిని భక్షించెదను' —ఇదియే మాంస పదము యొక్క తాత్పర్యమని తెలిసికొనుము

103 ఘాతకో వధ్యతే నిత్యం తథా వధ్యతి భక్షితా
ఆక్రోష్టా క్రుధ్యతే రాజంస్తథా ద్వేష్యత్వమాప్నుతే

ఈ జన్మయందు ఏ జీవి హింసింపబడుచున్నదో అది మఱుసటి జన్మయందు తన ఘాతకుని వధించుచున్నది తన్నిదిరకుకు భక్షించిన వానిని చంపివేయుచున్నది ఇతరులను నిందించువాడు మఱుజన్మ మందు వారి క్రోధమునకు ద్వేషమునకు పాత్రుడగుచున్నాడు

పిమ్మట ధర్మరాజునకు భీష్ముడు విద్యా తపోదానములను గూర్చి చెప్పుచు వ్యాస మైత్రేయ సంవాదమును ఎఱిఁగించెను వ్యాసముని మైత్రేయునితో ఇట్లు చెప్పెను—

వ్యాస ఉవాచ

104 త్రీణ్యేవ తు పదాన్యాహుః పురుషస్యోత్తమం వ్రతమ్
న ద్రుహ్యేచ్చైవ దద్యాచ్చ సత్యం చైవ పరం వదేత్

(వ్యాసముని మైత్రేయునితో ఇట్లు చెప్పెను —)

వేదములు మనుజులకు మూడు విషయములను వ్రతములుగ చెప్పినవి—(1)ఎవనికిని ద్రోహము చేయరాదు (2)దాన మొసంగుము (3) సత్యమును ఎలుకుము

అనంతరము భీష్ముడు ధర్మరాజునకిట్లు బోధసలిపెను—

భీష్మ ఉవాచ

105 అద్భిర్గాత్రాన్మలమివ తమోఽగ్నిప్రభయా యథా
దానేన తపసా చైవ సర్వపాపమపోహతి

(భీష్ముడు ధర్మరాజునకిట్లు వచించెను— )

జలము చే శరీరమాలిన్యము తొలగిపోవునట్లు అగ్నియొక్క ప్రభచే చీకటి అదృశ్యమగునట్లును దానము తపస్సులచే మనుజుని పాపమున్ను నశించిపోవును

సమస్త శాస్త్రముల యొక్క సారమేది? దేనివలన మానవునకు గొప్ప శ్రేయస్సు కలుగును? అని ధర్మరాజు ప్రశ్నింప వానిని విశదీకరించుటకై భీష్ముడు నారద పుండరీక సంవాదమును కూర్చి తెలిపెను

పూర్వము పుండరీకుడను జపపరాయణుడైన బ్రాహ్మణుడు నారదుని జీవునకు దేనిచే శ్రేయస్సు కలుగునని ప్రశ్నింప నారదుడిట్లు సమాధాన మొసంగెను—

నారద ఉవాచ

106 ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా

(నారదుడు చెప్పెను —)

సమస్త శాస్త్రములను కూలంకషముగ పరిశీలించి మరల మరల విచారణచేయగా సదా నారాయణుని ధ్యానించవలెను అను ఒకే సిద్ధాంతము స్థిరపడినది

107 నమో నారాయణాయేతి యో వేద బ్రహ్మ శాశ్వతమ్
అన్తకాలే జపన్నేతి తద్విష్ణోః పరమం పదమ్

ఎవడు ఓమ్ నమో నారాయణాయ అను అష్టాక్షర మంత్రమును సనాతన బ్రహ్మరూపముగ ఎఱుఁగునో మఱియు ఎవడు అంత్యకాలమున (మఱియు సర్వకాలము లందును) దీనిని జపించునో అతడు విష్ణువుయొక్క పరమ పదమును పొందును

108 శ్రవణాన్మననాచ్చైవ గీతస్తుత్యర్చనాదిభిః
ఆరాధ్యం సర్వదా బ్రహ్మపురుషేణ హితైషిణా

తన హితమును కోరువాడు సదా శ్రవణ మనన గీతా స్తుతి పూజనాదులద్వారా బ్రహ్మస్వరూపుడగు నారాయణుని ఆరాధించవలెను

తరువాత భీష్ముడు ధర్మరాజునకిట్లు తెలిపెను—

భీష్మ ఉవాచ

109 పృథివీ రత్నసమ్పూర్ణా జ్ఞానం చేదమనుత్తమమ్
ఇదమేవ తతః శ్రావ్యమితి మన్యేత ధర్మవిత్

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను—)

ఒక ప్రక్క రత్నములతో నిండిన సమస్త భూమండలము మఱియొక ప్రక్క సర్వోత్తమ (అధ్యాత్మ) జ్ఞానము ఉన్నచో ఆ రత్నయుక్త భూమిని వదలి ఈ సర్వోత్తమ జ్ఞానమునే శ్రవణము గ్రహణము చేయవలయును ధర్మజ్ఞులు ఈ ప్రకారమే విశ్వసించుదురు

తరువాత భీష్ముడు నారదునిచే శ్రీకృష్ణునకు తెలుపబడిన శివపార్వతుల సంవాదమును ధర్మరాజునకెఱిగించెను పూర్వము పార్వతీదేవి యొక్క ధార్మిక ప్రశ్నలను పురస్కరించుకొని శివుడామెకు ఈ ప్రకారముగ బోధించెను—

శ్రీ మహేశ్వర ఉవాచ

110 సర్వభూతదయా ధర్మో న చైకగ్రామవాసతా
ఆశాపాశవిమోక్షశ్చ శస్యతే మోక్షకాఙ్క్షిణామ్

(శివుడు పార్వతితో ఇట్లు చెప్పెను—)

మోక్షమును అభిలషించువారు సమస్త ప్రాణికోట్ల యెడల దయ కలిగియుండవలెను. వారు సదా ఒకే గ్రామమున నివసింపరాదు. ఆశయను బంధనమును ఛేదించుటకై వారు ప్రయత్నించవలెను. ఇదియే ముముక్షువునకు ప్రశంసనీయమైన విషయము.

111 అధ్యాత్మగతిచిత్తో యస్తన్మనాస్తత్పరాయణః
యుక్తో యోగం ప్రతి సదా ప్రతిసంఖ్యానమేవ చ

ముముక్షువు అధ్యాత్మజ్ఞానమునే శ్రవణము చేయవలెను. దానిని మనన, నిదిధ్యాసనలను గావింపవలెను. దానియందే సదా నిమగ్నుడై యుండవలెను. నిరంతరము యోగాభ్యాసమందు ప్రవృత్తుడై తత్త్వమును విచారణ చేయుచు నుండవలెను.

112 చతుర్విధా భిక్షవస్తే కుటీచకబహూదకౌ
హంసః పరమహంసశ్చ యో యః పశ్చాత్ స ఉత్తమః

సన్న్యాసులు నాలుగు తెరగతులుగా నుందురు. కుటీచక బహూదక హంస, పరమహంసలని వారిలో ఉత్తరోత్తర శ్రేష్ఠులుగా నుందురు.

113 కర్మభిః శుచిభిర్దేవి శుద్ధాత్మా విజితేన్ద్రియః
శూద్రోఽపి ద్విజవత్ సేవ్య ఇతి బ్రహ్మాబ్రవీత్ స్వయమ్

శూద్రుడైనను జితేంద్రియుడై పవిత్ర కర్మల యొక్క అనుష్ఠానముచే తన అంతఃకరణమును పవిత్రమొనర్చుకొనుచో, అతడు ద్విజునివలెనే సేవ్యుడగును — ఇది సాక్షాత్ బ్రహ్మదేవుని కథనమైయున్నది.

114 స్వభావః కర్మ చ శుభం యత్ర శూద్రేఽపి తిష్ఠతి
విశిష్టః స ద్విజాతేర్వై విజ్ఞేయ ఇతి మే మతిః

నా అభిప్రాయమేమనగా శూద్రుని స్వభావము కర్మ ఉత్తమమైనవి అగుచో అతడు ద్విజాతి వారికంటెను అధికముగ మాననీయుడగును

115 న యోనిర్నాపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః
కారణాని ద్విజత్వస్య వృత్తమేవ తు కారణమ్

బ్రాహ్మణత్వము యొక్క ప్రాప్తియందు కేవలము జన్మ సంస్కారము శాస్త్రజ్ఞానము సంతతి ఇవియే కారణము కావు బ్రాహ్మణత్వము యొక్క ప్రధాన హేతువు సదాచారమే అయి యున్నది

116 సర్వోఽయం బ్రాహ్మణో లోకే వృత్తేన తు విధీయతే
వృత్తే స్థితస్తు శూద్రోఽపి బ్రాహ్మణత్వం నియచ్ఛతి

దేవీ! బ్రహ్మము యొక్క స్వభావము సర్వత్ర సమానముగ నున్నది ఎవని యందు అట్టి నిర్గుణ బ్రహ్మము యొక్క జ్ఞానము కలదో అతడే బ్రాహ్మణుడు — అని నా అభిప్రాయము

117 జాయమానస్య జీవస్య మృత్యుః పూర్వం ప్రజాయతే
సుఖం వా యది వా దుఃఖం యథాపూర్వం కృతం తు వా

ఎవడు జన్మించునో అతని మృత్యువు కూడ మొదటనే జన్మించియుండును మనుజుడు పూర్వజన్మ యందెట్టి కర్మ చేసి యుండెనో తదనుసారమిపుడు సుఖముగాని దుఃఖముగాని అతనికి కలుగును

118 అప్రమత్తః ప్రమత్తేషు విధిర్జాగర్తి జన్తుషు
న హి తస్య ప్రియః కశ్చిన్న ద్వేష్యో న చ మధ్యమః

జీవులు ప్రమత్తత (సోమరితనము) యందు పడి ఎదురించినను వారి ప్రారబ్ధము ప్రమత్తత లేనిదై సావధానముగ నుండి మేలు కొనియే యుండును దానికి ఎవడును ప్రియుడు కాడు ద్వేష పాత్రుడు కాడు మధ్యముడును కాడు

119 యాదృశం కరుతే కర్మ తాదృశం ఫలమశ్నుతే
స్వకృతస్య ఫలం భుఙ్క్తే నాన్యస్తద్ భోక్తుమర్హతి

జీవుడెట్టి కర్మచేయునో అట్టి ఫలమునే పొందును అతడు తాను చేసిన కర్మయొక్క ఫలమును స్వయముగనే అనుభవించును మఱియెవనికిని దానిని అనుభవించు అధికారము లేదు

120 శరీరాత్మసమాహారో జన్తురిత్యభిధీయతే
తత్రాత్మానం నిత్యమాహురనిత్యం క్షేత్రముచ్యతే

శరీరము ఆత్మ — వీని యొక్క సంయోగమే జీవుడు లేక ప్రాణి అనబడును వీనియందు ఆత్మ నిత్యమని జీవుడు అనిత్యమని చెప్పబడినది

121 శృణు భామిని కర్తారమాత్మా హి న చ కర్మకృత్
ప్రకృత్యా గుణయుక్తేన క్రియతే కర్మ నిత్యశః

దేవీ! వినుము ఆత్మ కర్త కాదు అది కర్మచేయుట లేదు ప్రకృతి యొక్క గుణములతో కూడిన ప్రాణి ద్వారా సదా కర్మ చేయబడుచున్నది

122 సాత్త్వికాః పుణ్యలోకేషు రాజసా మానుషే పదే
తిర్యగ్యోనౌ చ నరకే తిష్ఠేయుస్తామసా నరాః

సాత్త్వికగుణములు కల మనుజులు పుణ్యలోకముల కేగుచున్నారు రాజస మనుష్యులు మనుష్యలోకమందు ఉండుచున్నారు తమోగుణము కలవారు పశుపక్ష్యాది జన్మలందు, నరకమందు ఉండుచున్నారు

123 కేవలం శ్రద్ధయా దేవి శ్రుతిమాత్ర నివిష్టయా
తతోఽస్తీత్యేవ మన్తవ్యం తదా వాఽమవాప్నుయాత్

దేవి! కేవలము వేదమునందు పూర్ణముగ శ్రద్ధ ఉంచి పరలోకము పునర్జన్మ కలవు — అని నమ్మవలెను దీనిచే ఆస్తికునకు హితము కలుగుచున్నది

124 దోషసాకల్యసంత్యాగాన్మునిర్భవతి మానవః
సాకర్యం పశ్య ధర్మస్య కార్యారమ్భాదృతేఽపి చ
ఆత్మోపలబ్ధోపరమాల్లభన్తే సుకృతం పరమ్

దేవీ! దోషములన్నిటిని విడిచివైచుటచే మనుజుడు ముని యగుచున్నాడు చూడుము! ధర్మ మాచరించుటలో ఎంత సులభత్వము సుగమత్వము కలదో? ఏ పని చేయకుండగనే తన దోషములను త్యజించినంత మాత్రముచే మనుజుడు పరమ పుణ్యమును పొందుచున్నాడు

125 అదేవ ధర్మమిత్యాహుర్దోషసంయమనం ప్రియే
యమధర్మేణ ధర్మోఽస్తి నాన్యః శుభతరః ప్రియే

ప్రియురాలా! దోషములను సంయమన మొనర్చుట (తొలగించుట) ధర్మమని చెప్పబడినది (దోష) సంయమనమను ధర్మమును పాలించుటచే ఏ ధర్మ మాచరింపబడుచున్నదో అదియే అన్నిటికంటె గొప్ప శ్రేయస్సును కలుగజేయును మఱియొకటి కాదు

126 సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌరివ
నాస్తి సత్యాద్ పరం దానం నాస్తి సత్యాత్పరం తపః

సముద్రమును దాటుటకు నావ ఎట్లు సాధనమో, అట్లే సత్యము స్వర్గలోకమున కెగయుటకు నిచ్చెన వంటిది సత్యమును మించిన దానముగాని తపస్సు గాని లేదు

127 యథా శ్రుతం యథా దృష్టమాత్మనా యద్యథాకృతమ్
తథా తస్యావికారేణ వచనం సత్యలక్షణమ్

ఏది ఎట్లు వినబడినదో చూడబడినదో తనచే ఎట్లు చేయబడినదో, దానిని ఏ విధమైన పరివర్తనము లేక వాక్కు ద్వారా ప్రకటించుట సత్యము యొక్క లక్షణమై యున్నది

128 న వా ప్రాణైః ప్రియతమం లోకే కించన విద్యతే
తస్మాత్ ప్రాణిదయా కార్యా యథాఽఽత్మని తథా పరే

ప్రపంచమున ప్రాణముల కంటె ప్రియమైన వస్తువింకొకటి ఏదియును లేదు కావున సమస్త ప్రాణుల యెడల దయ కలిగియుండ వలెను తన యెడల దయ ఎట్లు మనుజునకు అభీష్టమైయున్నదో అట్లే ఇతరుల యెడల కూడ దయ కలిగియుండవలెను

129 నాస్తి మోక్షాత్ పరందేవి నాస్తి మోక్షాత్ పరాగతిః
సుఖమాత్యన్తికం శ్రేషమనివృత్తం చ తద్ విదుః

మోక్షమునకు మించిన తత్త్వమేదియును లేదు మోక్షము కంటె ఉత్తమమైన గతి ఏదియును లేదు జ్ఞానులు మోక్షమును ఎన్నడును నివృత్తము కానిదిగను శ్రేష్ఠమైనదిగను ఆత్యంతిక సుఖముగను నమ్ముచున్నారు

130 నాత్ర దేవి జరా మృత్యుః శోకో వా దుఃఖమేవ వా
అనుత్తమమచిన్త్యం చ తద్దేవి పరమం సుఖమ్

దేవీ! ఆ మోక్షస్థితియందు వార్ధక్యము మృత్యువు శోకము దుఃఖము ఉండవు అది సర్వోత్తమమైన అచింత్యమైన సుఖము యున్నది

131 తత్ర సంసారచక్రస్య మోక్షో జ్ఞానేన దృశ్యతే
అధ్యాత్మ తత్త్వవిజ్ఞానం జ్ఞానమిత్యభిధీయతే

సంసార చక్రమును గూర్చిన జ్ఞానముచే మోక్షము కలుగు చున్నది అధ్యాత్మతత్త్వమును బాగా తెలిసికొనుటయే జ్ఞానమని చెప్పబడుచున్నది

132 విముక్తః సర్వపాపేభ్యో లఘ్వాహారో జితేన్ద్రియః
ఆత్మయుక్తః పరాం బుద్ధిం లభతే పాపనాశినీమ్

మనుజుడు సమస్త పాపముల నుండియు విముక్తుడై తేలికయైన ఆహారమును స్వీకరించుచు ఇంద్రియములను నిగ్రహించి పరమాత్మ చింతనమందు లగ్నమొనర్పవలెను దీనిచే అతనికి పాపనాశకరమగు శ్రేష్ఠబుద్ధి ఉదయించును

133 ఉచ్ఛ్రయాంశ్చ నిపాతాంశ్చ దృష్ట్వా ప్రత్యక్షతః స్వయమ్
అనిత్యమసుఖం చేతి వ్యవస్యేత్ సర్వమేవ చ

ఈ ప్రపంచమున ఉత్థానము పతనము – వీనిని మనుజుడు స్వయముగ ప్రత్యక్షముగ చూచి ఇదంతట సమస్తము అనిత్యమని దుఃఖరూపమని ఎఱుంగవలెను

134 అర్థానామార్జనే దుఃఖమార్జితానాం తు రక్షణే
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్

ధనమును సంపాదించుటలో దుఃఖము కలుగుచున్నది దానిని రక్షించుటలో దుఃఖము కలుగుచున్నది అది నశించిపోయినపుడు, ఖర్చు అయిపోయినపుడు దుఃఖము కలుగుచున్నది ఈ ప్రకారముగ దుఃఖభాజనమైన ధనమునకు ధిక్కారము!

135 అర్థవన్తం నరం నిత్యం పఞ్చాభిఘ్నన్తి శత్రవః
రాజా చోరశ్చ దాయాదా భూతాని క్షయ ఏవ చ

136 అర్థమేవమనర్థస్య మూలమిత్యవధారయ
న హ్యనర్థాః ప్రబాధన్తే నరమర్థవివర్జితమ్

దేవీ! ధనవంతుడగువానిని సదా ఐదు మంది శత్రువులు బాధించుదురు వారెవరనగా — రాజు దొంగ, ఉత్తరాధికారులు (వారసులు) ఇతర ప్రాణులు క్షయము కావున నీవు అర్థమును (ధనమును) అనర్థమునకు మూలమని తెలిసికొనుము ధనరహితునకు అనర్థ బాధలెవ్వియును ఉండవు

137 జిత్వాపి పృథివీం కృత్స్నాం చతుఃసాగరమేఖలామ్
సాగరాణాం పునః పారం జేతుమిచ్ఛత్యసంశయమ్

నాలుగు సముద్రములు మొలత్రాడుగా నున్న ఈ భూమండలమునంతను జయించినను మనుజుడు సంతుష్టిని పొందుటలేదు అతడు తిరిగి సముద్రమునకు ఆవలనున్న దేశములను కూడ జయించదలంచును దీనియందు సందేహము లేదు

138 యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్ సుఖమ్
తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్

ఈ ప్రపంచమున కామసుఖమేది కలదో, పరలోకమున గొప్ప దివ్యసుఖమేది కలదో ఆ రెండును కలసికూడ తృష్ణాక్షయ సుఖము యొక్క పదునారవ భాగమునకైనను సరిపోవు

139 అప్రమత్తః సదా రక్షేదిన్ద్రియాణి విచక్షణః
అరక్షితేషు తేష్వాశు నరో నరకమేతి వా

బుద్ధిమంతుడు చాల జాగ్రతగ ఉండి తన ఇంద్రియములను సదా నిగ్రహించవలెను ఏలయనిన వానిని నిగ్రహించనిచో మనుజుడు శీఘ్రముగ నరకమున పడిపోవును

140 హృది కామద్రుమశ్చిత్రో మోహసంచయసమ్భవః
అజ్ఞానరూఢమూలస్తు విధిత్సాపరిషేచనః

141 రోషలోభమహాస్కన్ధః పురా దుష్కృతసారవాన్
ఆయాసవిటపస్త్రీవ శోకపుష్పో భయాఙ్కురః

142 నానాసంకల్పపత్రాఢ్యః ప్రమాదాత్ పరివర్ధితః
మహతీభిః పిపాసాభిః సమన్తాత్ పరివేష్టితః

143 సంరోహత్యకృతప్రజ్ఞే పాదపః కామసమ్భవః
నైవ రోహతి తత్త్వజ్ఞే రూఢో వా ఛిద్యతే పునః

144 కృచ్ఛ్రోపాయేష్వనిత్యేషు నిస్సారేషు ఫలేషు చ
దుఃఖాదిష్షు దురన్తేషు కామయోగేషు కా రతిః

కామమను వృక్షము కలదు అది మోహమను బీజము నుండి ఉత్పన్నమైనది ఆ కామమను విచిత్ర వృక్షము హృదయ ప్రదేశమందే కలదు అజ్ఞానమే దాని గట్టి వేరు సకామకర్మ చేయవలెనను కోరికయే దానిని తడుపుట యగును రోషము లోభము దాని విశాలమైన స్కంధము పాపమే దాని సారభాగము ఆయాస ప్రయాసలే దాని కొమ్మలు తీవ్రశోకము దాని పుష్పములు భయము అంకురము వివిధ సంకల్పమును దాని ఆకులు ఇది ప్రమత్తతచే వృద్ధి నొందియున్నది తీవ్రతర తృష్ణయను తీగె ఆ చెట్టు యొక్క అన్నివైపుల ప్రాకియున్నది అజ్ఞానియందే ఈ కామ వృక్షము ఉత్పన్నమై పెరుగుచున్నది తత్త్వజ్ఞాని యందిది మొలచుట లేదు ఒకవేళ మొలిచినను విరిగిపోవుచున్నది ఈ కామ వృక్షము అనిత్యమైనది దాని ఫలము నిస్సారమైనది దాని ఆది అంతములు దుఃఖమయములైయున్నవి దానితో సంబంధము కలుగ జేసికొనుట యందు ఏ వివేకవంతునకు అనురాగము ఉండగలదు?

145 ఇన్ద్రియేషు చ జీర్యత్సు ఛిద్యమానే తథాఽఽయుషి
పురస్తాచ్చ స్థితే మృత్యౌ కిం సుఖం పశ్యతః శుభే

దేవీ! ఇంద్రియములు సదా శిథిలములై పోవుచున్నవి ఆయుస్సు నష్టమైపోవుచున్నది మృత్యువు ఎదుటనే నిలబడియున్నది ఇది యంతయు చూచినచో ఎవరికి సంసారమందు ఏమి సుఖము గోచరించును?

146 జాయమానాంశ్చ సంప్రేక్ష్య మ్రియమాణాంస్తథైవ చ
న సంవేగోఽస్తి చేత్ పుంసః కాష్ఠలోష్టసమో హి సః

147 యదా నోఽధ్రువజీవితస్య
కిం పుత్రభిర్మిత్ర పరిగ్రహైశ్చ
విహాయ యద్ గచ్ఛతి సర్వమేవం
క్షణేన గత్వా న నివర్తతే చ

ప్రపంచమున జన్మించి మరణించువారిని చూచియు మనుజునకు వైరాగ్యము కలుగనిచో ఇక అతడు కొయ్యవలె లేక మట్టిగడ్డవలె జడమైనవాడే యగును. ఎవడు వినాశశీలుడైయున్నాడో ఎవ్వని జీవితము నిశ్చితమైనది కాదో అట్టివానికి బంధువులతో మిత్రులతో ఏమి ప్రయోజనము? ఏలనన అతడు అందరిని క్షణకాలములో వదలివైచి వెడలిపోవుచున్నాడు. వదలివైచి మరల (ఆ శరీరముతో) తిరిగివచ్చుట లేదు.

148 ఏవం చిన్తయతో నిత్యం నరాణామనిత్యతామ్
ఉద్వేగో జాయతే శీఘ్రం నిర్వాణస్య పరస్పరమ్

149 తేనోద్వేగేన చాప్యస్య విమర్శో జాయతే పునః
విమర్శో నామ వైరాగ్యం సర్వద్రవ్యేషు జాయతే

150 వైరాగ్యేణ పరాం శాన్తిం లభన్తే మానవాః శుభే
మోక్షస్యోపనిషద్ దివ్యం వైరాగ్యమితి నిశ్చితమ్

151 ఏతత్ తే కథితం దేవి వైరాగ్యోత్పాదనం వచః
ఏవం సంచిన్త్య సంచిన్త్య ముచ్యన్తే హి ముముక్షవః

ఈ ప్రకారముగ సదా సమస్త పదార్థముల అనిత్యత్వము నెరుకుచు చింతన చేయుచుండు మనుజునకు శీఘ్రముగ మోక్షకారణమగు వైరాగ్యము కలుగుచున్నది. ఆ వైరాగ్యముచే అతని మనస్సునందు మరల విమర్శ జనించుచున్నది. సమస్త పదార్థముల యెడల కలుగు వైరాగ్యము పేరే విమర్శ. వైరాగ్యముచే మనుజునకు పరమశాంతి

లభించుచున్నది వైరాగ్యము మోక్షమునకు అతి సమీపమున గల ఒక దివ్యసాధనము — అని నిశ్చయముగ చెప్పబడినది దేవీ! ఇప్పుడు నీకు వైరాగ్యమును ఉత్పన్న మొనర్చు వాక్యములు చెప్పబడినవి ముముక్షువులు ఈ ప్రకారము మరల మరల విచారణ చేయుటచే ముక్తులగుచున్నారు

152 శరీరాచ్చ పరో దేహీ శరీరం చ వ్యపాశ్రితః
శరీరిణః శరీరస్య సోఽన్తరం వేత్తి వై మునిః

శరీరమునకు పరముగ శరీరధారియగు ఆత్మ కలదు అది శరీరమునందు నివసించుచున్నది శరీరము శరీరి (దేహి) — అను వీని భేదమును తెలిసికొనినవాడే ముని

153 రసః స్పర్శశ్చ గన్ధశ్చ రూపం శబ్దవివర్జితమ్
అశరీరం శరీరేషు దిదృక్షేత నిరిన్ద్రియమ్

రసము స్పర్శ గంధము, రూపము, శబ్దము - ఇవి లేనిదియు, ఇంద్రియ రహితమైనదియు శరీరరహితమైనదియు అగు ఆత్మను శరీరము లోపల చూడవలెను

154 అవ్యక్తం సర్వదేహేషు మర్త్యేష్వమరమాశ్రితమ్
యః పశ్యేత్ పరమాత్మానం బన్ధనైః స విముచ్యతే

సమస్త మానవ దేహములందును అవ్యక్త రూపమున నున్నదియు, మరణరహితమైనదియు అగు ఆ పరమాత్మను ఎవడు చూచునో అతడు బంధనముల నుండి విముక్తుడగును

155 ఇమాన్ యోగస్య దోషాంశ్చ దశైవ పరిచక్ష్యతే
దోషైర్విఘ్నా వరారోహే యోగినాం కవిభిః స్మృతః

దేవీ! యోగుల యొక్క మార్గమున కొన్ని దోషముల వలన విఘ్నములు కలుగునని పెద్దలు చెప్పిరి ఆ దోషములు పదియని చెప్పబడినవి

156 కామః క్రోధో భయం స్వప్నః స్నేహామత్యశనం తథా
వైచిత్త్యం వ్యాధిరాలస్యం లోభశ్చ దశమః స్మృతః

కామము క్రోధము భయము స్వప్నము స్నేహము (దృశ్య పదార్థముల యెడల మమత్వము) అధిక భోజనము మానసిక వైకల్యము వ్యాధి అలసత్వము లోభము — అనునివి ఆ పది దోషములు అయియున్నవి

157 ఏతైస్తేషాం భవేద్ విఘ్నో దశభిర్దైవకారితైః
తస్మాదేతానపాస్యాదౌ యుఞ్జీత చ పరం మనః

దేవతలచే కలిగింపబడు ఈ పది దోషములచే యోగులకు విఘ్నము కలుగును కావున మొదట ఈ పది దోషములను తొలగించుకొని మనస్సును పరమాత్మ యందు సంలగ్నము చేయవలెను

158 మద్భక్తా న వినశ్యన్తి మద్భక్తా వీతకల్మషాః
మద్భక్తాః సర్వలోకేషు పూజనీయా విశేషతః

దేవీ! నా భక్తులు ఎపుడును నశింపరు వారి పాపములన్నియు తొలగిపోవును వారు మూడు లోకములందును విశేషముగ పూజనీయులై యుందురు

అపుడు పార్వతి శివునితో ఇట్లు చెప్పెను —

ఉమోవాచ

159 పతిర్హి దేవో నారీణాం పతిర్బన్ధుః పతిర్గతిః
పత్యా సమా గతిర్నాస్తి దైవతం వా యథా పతిః

(పార్వతి శివునితో ఇట్లు చెప్పెను —)

భర్తయే స్త్రీలకు దేవత భర్తయే స్త్రీలకు బంధువు భర్తయే స్త్రీలకు పరమగతి స్త్రీలకు భర్తతో సమానముగ మఱి యొక దేవత కాని లేదు

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లు వచించెను —

వైశమ్పాయన ఉవాచ

160 యస్య స్మరణమాత్రేణ జన్మసంసారబన్ధనాత్
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే

(వైశంపాయనుడు జనమేజయునితో ఇట్లు చెప్పెను —)

ఎవని నెక్క స్మరణ మాత్రముచె మనుజుడు జన్మసంసార బంధనము నుంచి విడివడుచున్నాడో సమస్తము యొక్క ఉత్పత్తి కి కారణభూతుడగు అట్టి విష్ణుభగవానునకు నమస్కారము

161 నమః సమస్త భూతానామాది భూతాయ భూభృతే
అనేకరూపరూపాయ విష్ణవే ప్రభవిష్ణవే

సమస్త ప్రాణుల యొక్క ఆదిభూతుడును భూమిని భరించువాడును అనేక రూపములను ధరించువాడును సర్వసమర్థుడును అగు విష్ణు భగవానునకు ప్రణామము

తదుపరి భీష్ముఁడు ధర్మరాజున కిట్లు ప్రబోధము చేసెను —

భీష్మ ఉవాచ *

162 ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః
యద్భక్త్యా పుణ్డరీకాక్షం స్తవైరర్చేన్నరః సదా

(భీష్ముడు ధర్మరాజున కిట్లు చెప్పెను —)

మనుజుడు కమలనేత్రుడగు వాసుదేవుని భక్తిపూర్వకముగ గుణసంకీర్తన రూపస్తోత్రములచే సదా అర్చించుటయే సమస్త ధర్మములలోను గొప్ప ధర్మమని నేను తలంచుచున్నాను

163 న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్
జన్మమృత్యుజరావ్యాధిభయం నైవోపజాయతే

---

* ఈ సందర్భమున భీష్ముడు కావించిన శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రము ఈ గ్రంథారంభమున 191 వ పేజి యందు ప్రకటింపబడినది

వాసుదేవుని భక్తులకు ఎచటను ఎపుడును అశుభము కలుగదు మఱియు వారికి జన్మ మృత్యు వార్ధక్య వ్యాధులను గూర్చిన భయమున్ను ఉండదు

164 సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః

సమస్త శాస్త్రములందును ఆచారము (ఆచరణ) ప్రథమముగ ఎంచబడినది ఆచారము నుండి ధర్మము ఉత్పన్నమగుచున్నది ధర్మమునకు ప్రభువు భగవంతుడగు అచ్యుతుడు

165 ఇదమాహ్నికమవ్యగ్రం కుర్వద్భిర్నియతైః సదా
నృపైర్నరశార్దూల ప్రాప్యతే శ్రీరనుత్తమా

ఎవరు మనస్సును ఇంద్రియములను వశమందుంచుకొని శాంతి పూర్వకముగ ప్రతిదినము ఈ (క్రింద చెప్పబోవు) మంత్రమును జపించుదురో వారికి సర్వోత్తమ సంపత్తి కలుగును.

166 నమో వసిష్ఠాయ మహావ్రతాయ
పరాశరం వేదనిధిం నమస్యే
నమోఽస్త్వనన్తాయ మహోరగాయ
నమోఽస్తు సిద్ధేభ్య ఇహాక్షయేభ్యః

167 నమోఽస్త్వృషిభ్యః పరమం పరేషాం
దేవేషు దేవం వరదం వరాణామ్
సహస్రశీర్షాయ నమః శివాయ
సహస్రనామాయ జనార్దనాయ

(ఆ మంత్రము ఈ ప్రకారముగ కలదు —) గొప్ప వ్రతధారియగు వసిష్ఠునకు నమస్కారము వేదనిధియగు పరాశరునకు నమస్కారము విశాలసర్పరూపధారియగు అనంతునకు నమస్కారము అక్షయమగు సిద్ధసమూహామునకు నమస్కారము ఋషి బృందము

నకు నమస్కారము పరాత్పరుడు దేవాధి దేవుడు వరదాతయగు పరమేశ్వరునకు నమస్కారము వేయి శిరంబులుకల శివునకు, వేల కొలది నామములను ధరించిన జనార్దనునకు నమస్కారము

అంతట శ్రీకృష్ణుడు శివుని మహిమను గూర్చి తెలుపుచు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —

వాసుదేవ ఉవాచ

168 నాస్తి కించిత్పరం భూతం మహాదేవాద్ విశామ్పతే
ఇహ త్రిష్వపి లోకేషు భూతానాం ప్రభవో హి సః

(శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ముల్లోకములందును శివుని మించిన శ్రేష్ఠుడగు దేవత మఱి యొకడు లేడు కారణము అతడు సమస్త ప్రాణుల యొక్క ఉత్పత్తి కారణభూతుడై యున్నాడు

అనంతరము భీష్ముడు ధర్మరాజునకీ ప్రకారము బోధించెను—

భీష్మ ఉవాచ

169 అహింసా సత్యమక్రోధో దానమేతచ్చతుష్టయమ్
అజాతశత్రో సేవస్వ ధర్మ ఏష సనాతనః

(భీష్ముడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

అహింస సత్యము క్రోధరాహిత్యము దానము — అను ఈ నాల్గింటిని సదా సేవించుము ఇది సనాతన ధర్మము

170 మనుష్యా యది వా దేవాః శరీరముపతాప్య వై
ధర్మిణః సుఖమేధన్తే లోభద్వేషవివర్జితాః

మనుష్యులైనను దేవతలైనను ఎవరు శరీరమును కష్టపెట్టియైనను ధర్మాచరణమందు లగ్నమైయుందురో లోభమును, ద్వేషమును వదలివేయుదురో వారు సుఖమును పొందుదురు

171 తీర్థానాం గురవ స్తీర్థం చోక్షాణాం హృదయం శుచి
దర్శనానాం పరం జ్ఞానం సంతోషః పరమం సుఖమ్

తీర్థములలో సర్వోత్తమ తీర్థము సజ్జనులు పవిత్ర వస్తువులలో హృదయము మహా పవిత్రమైనది జ్ఞానములలో పరమార్థజ్ఞానము సర్వోత్కృష్టమైనది అన్ని సుఖముల కంటె ఉత్తమ సుఖము సంతుష్టి

172 యథా లవణమమ్భోభిరాప్లుతం ప్రవిలీయతే
ప్రాయశ్చిత్తహతం పాపం తథా సద్యః ప్రణశ్యతి

ఉప్పుకల్లు నీటిలో కరిగిపోవునట్లు ప్రాయశ్చిత్తముచే వెంటనే పాపము నశించిపోవును

అపుడు భీష్ముడు శ్రీ కృష్ణునితో ఇట్లు చెప్పెను —

భీష్మ ఉవాచ

173 ఉక్తవానస్మి దుర్బుద్ధిం మన్దం దుర్యోధనం తదా
యతః కృష్ణస్తతో ధర్మో యతో ధర్మస్తతో జయః

(భీష్ముడు శ్రీకృష్ణునతో ఇట్లు చెప్పెను —)

నేను ఇదివరకు దుర్యోధనునితో ఇట్లు చెప్పితిని — ఎచట శ్రీ కృష్ణుడుండునో అచట ధర్మముండును ఎచట ధర్మముండునో అచట జయముండును

అటు పిమ్మట భీష్ముడు కొద్దిసేపు మౌనముగ నుండి తరువాత యోగిక క్రియద్వారా ప్రాణత్యాగము చేసెను అత్తరి శోకమగ్నుడైన ధర్మరాజును శ్రీ కృష్ణుడు వ్యాసముని ఓదార్చిరి పిదప శ్రీ కృష్ణుడు ధర్మరాజున కిట్లుపదేశించెను

ఓమ్

# 14 అశ్వమేధిక పర్వము

వాసుదేవ ఉవాచ

1 సర్వం జిహ్మం మృత్యుపదమార్జవం బ్రహ్మణః పదమ్
ఎతావాన్ జ్ఞానవిషయః కిం ప్రలాపః కరిష్యతి

(శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

కుటిలత్వము మృత్యువు యొక్క స్థానము. సరళత్వము బ్రహ్మమును పొందుటకు సాధనము. దీనిని చక్కగ తెలిసికొనుటయే జ్ఞానము. దీనికంటె వేఱుగ చెప్పబడునదె యంతయు కేవలము ప్రలాపమే యగును. అది యెవని కేమి ఉపకారము చేయగలదు?

2 ద్వ్యక్షరస్తు భవేన్మృత్యుస్త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వతమ్
మమేతి చ భవేన్మృత్యుర్న మమేతి చ శాశ్వతమ్

మమ (నాది) అను రెండక్షరములు మృత్యురూపములు. న మమ (నాది కాదు) అను మూడక్షరములు సనాతన బ్రహ్మమును పొందుటకు కారణమైయున్నవి. మమత్వము మృత్యువు; దానిని త్యజించుట నాశరహిత అమృతత్వమైయున్నది.

3 బ్రహ్మమృత్యూ తతో రాజన్నాత్మన్యేవ వ్యవస్థితౌ

ఈ ప్రకారముగ మృత్యువు అమృతత్వము — రెండును మనుజుని లోపలనే యున్నవి.

4 లబ్ధ్వా హి పృథివీం కృత్స్నాం సహస్థావరజఙ్గమామ్
మమత్వం యస్య నైవ స్యాత్ కిం తయా స కరిష్యతి

చరాచర ప్రాణిసహితమగు ఈ భూమినంతను పడసినను ఎవనికి దానియందు మమత్వము లేదో, అతడు దానిని పొంది ఏమి చేయగలడు?

5 అథవా వసతః పారం వనే వన్యేన జీవితః
మమతా యస్య ద్రవ్యేషు మృత్యోరాస్యే స వర్తతే

ఎవడు అరణ్యమందుండి ఫలమూలాదులచే జీవితమును గడపునో అట్టివానికి పదార్థములందు మమత్వముండినచో అతడు మృత్యుముఖమున ఉన్నట్లేయగును

6 బాహ్యాన్తరాణాం శత్రూణాం స్వభావం పశ్య భారత
యన్న పశ్యతి తద్ భూతం ముచ్యతే స మహాభయాత్

బయట లోపల గల శత్రువులను గూర్చి బాగా తెలిసికొనుము ఈ మాయిక (మాయామయ) పదార్థములను మమత్వ దృష్టితో చూడనివాడు గొప్ప భయమునుండి విముక్తిని బొందును

7 భూయో భూయో జన్మనోఽభ్యాసయోగాద్
యోగీ యోగం సారమార్గం విచిన్త్య
దానం చ వేదాధ్యయనం తపశ్చ
కామ్యాని కర్మాణి చ వైదికాని

8 వ్రతం యజ్ఞాన్ నియమాన్ ధ్యానయోగాన్
కామేన యో నారభతే విదిత్వా
యద్ యచ్చాయం కామయతే స ధర్మో
న యో ధర్మో నియమస్తస్య మూలమ్

యోగి అనేక జన్మలందలి అభ్యాసముచే యోగమునే మోక్ష మార్గముగ నిశ్చయించి కోరికలను నశింపజేసికొనుచున్నాడు ఈ విషయమును తెలిసికొనువాడు దానము వేదాధ్యయనము తపస్సు వేదోక్త కర్మ వ్రతము నియమము ధ్యానము యోగాదులు—వీనిని కోరికతో అనుష్ఠించడు కోరికతో కర్మము చేయుట ధర్మము కానేరదు వాస్తవముగ కోరికలను నిగ్రహించుటయే ధర్మము మరియు అదియే మోక్షమునకు మూలము

తరువాత కొంత కాలమునకు శ్రీ కృష్ణుడు ధర్మరాజును అశ్వమేధ యజ్ఞమాచరించుటకై ప్రేరణ చేసెను అనంతరము ధర్మరాజాదులు హస్తినాపురము వెళ్ళిరి శ్రీ కృష్ణుడు అర్జునునితో తాను ద్వారకకు పోవదలంచినట్లు చెప్పగా అపుడు అర్జునుడు భగవానునితో ఇట్లు చెప్పను —

అర్జున ఉవాచ

9 యత్ తద్ భగవతా ప్రోక్తం పురా కేశవ సౌహృదాత్
తత్ సర్వం పురుషవ్యాఘ్ర నష్టం మే భ్రష్టచేతసః

10 మమ కౌతూహలం త్వస్తి తేష్వర్థేషు పునః పునః
భవాంస్తు ద్వారకాం గన్తా నచిరాదివ మాధవ

(అర్జునుడు శ్రీ కష్ణుని ఇట్లడిగెను —)

మీరు సౌహార్దపూర్వకముగ పూర్వము ఏ జ్ఞానమును నాకుపదేశించితిరో ఆ నా జ్ఞానమంతయు ఇపుడు విచలితచిత్తుడనగుటచే మఱచిపోతిని ఆ విషయములను వినుటకు నా మనస్సునందు మరల మరల ఉత్కంఠ కలుగుచున్నది ఇపుడు మీరు శీఘ్రముగ ద్వారకకు వెళ్ళనున్నారు కావున ఆ జ్ఞానమంతను తిరిగి నాకుపదేశింపుము

అర్జునుని ఆ వాక్యములను విని శ్రీ కృష్ణుడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను —

వాసుదేవ ఉవాచ

11 అబుద్ధ్యా నాగ్రహీర్యస్త్వం తన్మే సుమహదప్రియమ్
న చ సాద్య పునర్భూయః స్మృతిర్మే సమ్భవిష్యతి

(శ్రీ కృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను —)

అర్జునా! నీవు అబుద్ధిచే ఆ ఉపదేశమును జ్ఞాపకముంచుకొనలేదు అది నాకు చాల అప్రియముగ నున్నది ఆ విషయములను ఇపుడు పూర్తిగ స్మరణ చేయుట సంభవముగా తోచలేదు

12 న హా దర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే
శక్యం అస్మరూ భూయస్తథా వక్తుమశేషతః

ఆ జ్ఞానము బ్రహ్మపదమును కలిగించుటకు చాలినదై యున్నది ఆ ధర్మమునంతను అదియే రూపమున ఇప్పుడు తిరి చెప్పుట నాకు వశము కాదు

13 పరం హి బ్రహ్మ కథితం యోగయుక్తేన తన్మయా
ఇతిహాసం తు వక్ష్యామి తస్మిన్నర్థే పురాతనమ్

ఆ సమయమున యోగయుక్తుడనై నేను పరమాత్మ తత్త్వమును వర్ణించితిని ఇప్పుడు ఆ విషయము సక - జ్ఞానము కలిగించుట కొఱకై నేను ఒక ప్రాచీన ఇతిహాసమును వర్ణించు చున్నాను వినుము

పూర్వమొకానొక బ్రాహ్మణుడు బ్రహ్మలోకము నుండి బయలుదేరి స్వర్గలోకము గుండా నా యొద్దకు వచ్చెను నేనాతని మోక్ష విషయమై ప్రశ్నించగా ఆతడు బ్రాహ్మణ సిద్ధ కాశ్యప సంవాదమును చెప్పెను పూర్వము కాశ్యపుడను తపస్వి ఒకానొక సిద్ధమహాత్ముని యొద్దకు వెళ్ళగా ఆ సిద్ధుడు కాశ్యపునకిట్లు ఉపదేశించెను

బ్రాహ్మణ ఉవాచ

14 యః స్యాదేకాయనే లీనస్తూష్ణీం కించిద చింతయన్
పూర్వం పూర్వం పరిత్యజ్య స తీర్ణో బన్ధనాద్ భవేత్

(సిద్ధ బ్రాహ్మణుడు కాశ్యపునకు ఇటు చెప్పెను —)

ఎవడు దేహాభిమానమును వదలి ఏమియు చింతింపక మౌన భావముతో ను సర్వలోక ప్రైక అధిష్ఠానమగు పరమాత్మ యందు లీనమై యుండునో అతడే సంసార బంధము నుండి విముక్తుడగు చున్నాడు

15 విహాయ సర్వసంకల్పాన్ బుద్ధ్యా శారీరమానసాన్
శనైర్నిర్వాణమాప్నోతి నిరిన్ధన ఇవానలః

ఎవడు బుద్ధితో విచారించి శారీరక మానసిక సంకల్పము లన్నిటిని త్యజించి వేయునో అతడు కట్టెలేని అగ్నివలె మెల్లమెల్లగ శాంతిని బడయును

16 విముక్తః సర్వసంస్కారైస్తతో బ్రహ్మ సనాతనమ్
పరమాప్నోతి సంశాన్తమచలం నిత్యమక్షరమ్

సమస్త సంస్కారముల నుండి విముక్తుడైనవాడు శాంత అచల నిత్య నాశరహిత సనాతన పరమాత్మను పొందుచున్నాడు

17 ఇన్ద్రియాణి తు సంహృత్య మన ఆత్మని ధారయేత్
తీవ్రం తప్త్వా తపః పూర్వం మోక్షయోగం సమాచరేత్

ఇంద్రియములను విషయముల నుండి మరలించి వానిని మనస్సునందు మనస్సును ఆత్మయందు స్థాపించవలెను ఈ ప్రకారముగ మొదట తీవ్ర తపస్సు నాచరించి పిదపరి మోక్షోపయోగియైన ఉపాయము నవలంబించవలెను.

18 సంయతః సతతం యుక్త ఆత్మవాన్ విజితేన్ద్రియః
తథా య ఆత్మనాఽఽత్మానం సమ్ప్రయుక్తః ప్రపశ్యతి

ఏ సాధకుడు సదా సంయమ పరాయణుడు యోగయుక్తుడు మనస్సును వశమందుంచుకొనువాడు జితేంద్రియుడు అయియుండునో అతడే ఆత్మచే ప్రేరితుడై బుద్ధిద్వారా అద్దానిని సాక్షాత్కరించుకొనగలడు

19 ఇషీకాం చ యథా ముఞ్జాత్ కశ్చిన్నిష్కృష్య దర్శయేత్
యోగీ నిష్కృష్య చాత్మానం తథా పశ్యతి దేహతః

ముంజ గడ్డి నుండి దర్భను వేఱుచేసి చూచునట్లు యోగి ఆత్మను ఈ దేహము నుండి వేఱుచేసి చూచుచున్నాడు

20 స నియమ్యేన్ద్రియగ్రామం నిర్ఘోషం నిర్జనే వనే
కాయమభ్యన్తరం కృత్స్నమేకాగ్రః పరిచిన్తయేత్

నిర్జన వనప్రదేశమున ఇంద్రియములను నిగ్రహించుకొని ఏకాగ్రచిత్తుడై శబ్దశూన్యముగ తన శరీరము యొక్క బయట లోపల ప్రతి అంగమందును పరిపూర్ణ పరమాత్మ యొక్క చింతనము చేయవలెను

21 న త్వసౌ చక్షుషా గ్రాహ్యో న చ సర్వైరపీన్ద్రియైః
మనసైవ ప్రదీపేన మహానాత్మా ప్రదృశ్యతే

ఆ పరమాత్మ యొక్క దర్శనము నేత్రములతో కాజాలదు కేవలము బుద్ధి యను దీపము యొక్క సహాయముచే ఆ పరమాత్మ యొక్క దర్శనము కాగలదు

22 జీవో నిష్క్రాన్తమాత్మానం శరీరాత్ సమ్ప్రపశ్యతి
స తముత్సృజ్య దేహం స్వం ధారయన్ బ్రహ్మ కేవలమ్

23 ఆత్మానమాలోకయతి మనసా ప్రహసన్నివ
తదేవమాశ్రయం కృత్వా మోక్షం యాతి తతో మయి

తత్త్వజ్ఞుడగు జీవుడు తన్ను తాను శరీరము కంటె వేఱుగ చూచును అతడు శరీరమునందున్నను దానిని (శరీర భావమును) త్యజించి దాని వేఱుతనమును అనుభవించుచు తన స్వరూపమగు కేవల పరబ్రహ్మమును పరమాత్మను చింతన చేయుచు బుద్ధి యొక్క సహాయముచే ఆత్మ యొక్క సాక్షాత్కారమును పొందును అపుడతడు ఇట్లు తలంచుకొని నవ్వుచుండును — ఆహా! ఎండమావులందలి జలమువలె నా యందే ప్రతీతమగు ఈ ప్రపంచము ఇంతవఱకు నన్ను వ్యర్థముగ భ్రమయందు పడవైచినది! ఎవడీ ప్రకారము పరమాత్మ యొక్క దర్శనము చేసికొనునో అతడు దానినే ఆశ్రయించి, తన యందే పరమాత్మను అనుభవింపదొడంగుచు ముక్తినొందును

అటు పిమ్మట శ్రీకృష్ణుడు అర్జునున కిట్లు బోధించెను —

వాసుదేవ ఉవాచ

24 పరా హి సా గతిః పార్థ యత్తద్ బ్రహ్మసనాతనమ్
యత్రామృతత్వం ప్రాప్నోతి త్యక్త్వా దేహం సదా సుఖీ

(శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను —

అర్జునా! సనాతన బ్రహ్మమే జీవుని పరమగతి అయియున్నది జ్ఞాని దేహాభావమును త్యజించి ఆ బ్రహ్మమందే అమృతత్త్వమును బొందును మఱియు ఎల్లప్పుడు సుఖవంతుడై యుండును

తరువాత శ్రీకృష్ణుడు అర్జునునకు బ్రాహ్మణ పతిపత్నీ సంవాదమును చెప్పెను పూర్వమొకానొక జ్ఞానవిజ్ఞాన సంపన్నుడగు బ్రాహ్మణుండెను అతడు తన పత్నికి ఈ ప్రకారముగ బోధించెను —

బ్రాహ్మణ ఉవాచ

25 ఏకః శాస్తా న ద్వితీయోఽస్తి శాస్తా
యో హృచ్ఛయస్తమహమనుబ్రవీమి
తేనైవ యుక్తః ప్రవణాదివోదకం
యథా నియుక్తోఽస్మి తథా వహామి

(బ్రాహ్మణుడు తన పత్నితో ఇట్లు చెప్పెను —)

ప్రపంచము యొక్క శాసకుడు ఒకడే అయియున్నాడు రెండవవాడు లేడు ఎవడు హృదయమందు విరాజిల్లుచున్నాడో అట్టి పరమాత్మయే అందఱి యొక్క శాసకుడు నీరు క్రిందివైపునకు ప్రవహించునట్లు పరమాత్మ యొక్క ప్రేరణచే నేను ఏ కార్యమందు నియుక్తుడనగుచున్నానో దానినే పాలించుచున్నాను

26 ఏకో గురుర్నాస్తి తతో ద్వితీయో
యో హృచ్ఛయస్తమహామనుబ్రవీమి
తేనానుశిష్టా గురుణా సదైవ
పరాభూతా దానవాః సర్వ ఏవ

ఒకడే గురువు రెండవవాడు లేఁడు హృదయమందున్న పరమాత్మనే నేను గురువుగ చెప్పుచున్నాను ఆ గురువు యొక్క అనుశాసనవ చేతనే దానవులందఱును ఓడిపోయిరి

27 ఏకో బన్ధుర్నాస్తి తతో ద్వితీయో
యో హృచ్ఛయస్తమహామనుబ్రవీమి
తేనానుశిష్టా బాన్ధవా బన్ధుమన్తః
సప్తర్షయశ్చైవ దివి ప్రభాన్తి

ఒకడే బంధువు కలడు అతడు తప్ప మఱియొక బంధువు లేనే లేడు హృదయమందున్న పరమాత్మనే నేను బంధువని చెప్పుచున్నాను ఆతని ఉపదేశముచేతనే బంధువులు బంధువులుగ వర్తించుచున్నారు మఱియు సప్తర్షులు ఆకాశమున ప్రకాశించుచున్నారు

28 అపేతవ్రతకర్మా తు కేవలం బ్రహ్మణి స్థితః
బ్రహ్మభూతశ్చరఁల్లోకే బ్రహ్మచారీ భవత్యయమ్

వ్రత కర్మములను త్యజించి కేవలము బ్రహ్మమందు స్థితుడై యుండువాడు బ్రాహ్మస్వరూపుడై ప్రపంచమున సంచరించును అతడే ముఖ్యమగు బ్రహ్మచారి

29 ఏతదేవేదృశం సూక్ష్మం బ్రహ్మచర్యం విదుర్బుధాః
విదిత్వా చాన్వపద్యన్త క్షేత్రజ్ఞేనానుదర్శితాః

బుద్ధిమంతులు దీనినే సూక్ష్మబ్రహ్మచర్యమని చెప్పిరి తత్త్వదర్శి యొక్క ఉపదేశమును పొంది ప్రబుద్ధులైన ఆత్మజ్ఞానులు ఇట్టి బ్రహ్మచర్యము యొక్క స్వరూపమును తెలిసికొని సదా దానిని పాలించుచున్నారు

30 సమ్యగుపాయో దృష్టశ్చ భ్రమద్భిరివ లక్ష్యతే
కర్మబుద్ధి రబుద్ధిత్వాఽజ్ఞాన లిఙ్గైరివాశ్రితమ్

క్షేత్రజ్ఞుడగు పరమాత్మను సాక్షాత్కరించుకొనుటకు పూర్ణమగు ఉపాయము గాంచబడినది అది యేదనగా - కర్మలు త్యజించి వైచుటయే తుమ్మెదలచే గంధము వలె అది తనకు తానే తెలియబడు చున్నది కర్మవిషయకమగు బుద్ధి వాస్తవముగ బుద్ధి కాదు అది జ్ఞానమువలె ప్రతీతమగ చున్నది కాని వాస్తవముగ అది జ్ఞానము కాదు

అనంతరము శ్రీకృష్ణుడు అర్జునునకు మోక్షధర్మములను గూర్చి చెప్పుచు గురుశిష్య సంవాదమును ఎఱిగించెను ఒకానొక శిష్యుడు అధ్యాత్మరంగమున తన సందేహములను తీర్చుకొనుట కొఱకు గురువును కొన్ని ప్రశ్నలడుగగా గురు వీ ప్రకారము సమాధాన మొసంగెను —

గురు రువాచ

31 జ్ఞానం త్వేవ పరం విద్మః సంన్యాసం తప ఉత్తమమ్
యస్తు వేద నిరాబాధం జ్ఞానతత్త్వం వినిశ్చయాత్
సర్వభూతస్థమాత్మానం స సర్వగతిరిష్యతే

(గురువు శిష్యునకు ఇట్లు చెప్పెను —)

మేము (ఆత్మ) జ్ఞానమునే పరబ్రహ్మముగను సంన్యాసమునే ఉత్తమ తపస్సుగను భావించుచున్నాము ఎవడు అబాధితమగు జ్ఞాన తత్త్వమును నిశ్చయ పూర్వకముగ నెఱిగి తన్ను సమస్త ప్రాణికోట్ల యందున్నట్లు చూచునో అతడు సర్వవ్యాపకుడని యెంచబడును

32 యో న కామయతే కించిన్న కించిదభిమన్యతే
ఇహలోకస్థ ఏవైష బ్రహ్మభూయాయ కల్పతే

ఎవడు ఏ వస్తువును కోరడో ఎవని మనస్సునందు దేని యెడలను అభిమానము ఉండదో అతడు ఈ లోకమునందున్నను బ్రహ్మభావమును పొందును

33 అవ్యక్తబీజప్రభవో బుద్ధిస్కన్ధమయో మహాన్
మహాహఙ్కారవిటప ఇన్ద్రియాఙ్కురకోటరః

34 మహాభూతవిశేషశ్చ విశేషప్రతిశాఖవాన్
సదాపర్ణః సదాపుష్పః సదా శుభఫలోదయః

35 ఆజీవః సర్వభూతానాం బ్రహ్మబీజః సనాతనః
ఏతజ్జ్ఞాత్వా చ తత్త్వాని జ్ఞానేన పరమాసినా
ఛిత్త్వా చ మరతాం ప్రాప్య జహాతి మృత్యు జన్మనీ

ఈ దేహాము ఒక వృక్షము వంటిది అజ్ఞానము దీని వేరు బుద్ధి స్కంధము అహంకారము కొమ్మలు, ఇంద్రియములు తొఱ్ఱలు, పంచమహాభూతములు దాని విశేష అవయవములు ఆ భూతముల యొక్క విశేష భేధము దాని చిన్న కొమ్మలు దాని యందు సంకల్పములను ఆకులు కర్మలను పుష్పములు మొలచుచున్నవి శుభా శుభ కర్మలచే కలుగు సుఖదుఃఖాదులు దాని ఫలములు ఈ ప్రకారము బ్రహ్మమను విత్తనము నుండి ప్రకటమై ప్రవాహ రూపమున సదా ఉండి యుండు ఈ దేహామను వృక్షము సమస్త ప్రాణుల యొక్క జీవితమునకు ఆధారమైయున్నది ఎవడు దీని తత్త్వమును బాగుగ నెఱిగి జ్ఞానమను ఉత్తమ ఖడ్గముచే దీనిని ఛేదించి వేయునో అతడు అమరత్వమును పొంది జనన మరణరూప బంధనము నుండి విముక్తిని పొందును

ఈ ప్రకారము గురువు శిష్యునకు బోధించుచు సందర్భ వశమున బ్రహ్మదేవ మహర్షి సంవాదమును తెలియజేసెను పూర్వ మొకపుడు బ్రహ్మదేవుడు కొందఱు ఋషులకు ఈ ప్రకారముగ బోధ సలిపెను —

బ్రహ్మోవాచ

36 సత్యాద్ భూతాని జాతాని స్థావరాణి చరాణి చ
తపసా తాని జీవన్తి ఇతి తద్ విత్త సువ్రతాః

(బ్రహ్మదేవుడు మహర్షులకు ఇట్లు చెప్పెను —)

ఉత్తమవ్రత పాలకులారా! చరాచర జీవులు సత్యస్వరూప మగు పరమాత్మ నుండియే ఉత్పన్నమైనారు తపస్సను కర్మచే జీవితమును ధరించుచున్నారు వారు తమ కారణ స్వరూపమగు బ్రహ్మమును మఱచి తమ కర్మల ననుసరించి జననమరణరూప చక్రమందు తిరుగాడుచున్నారు

37 కామానాత్మని సంయమ్య క్షీణతృష్ణః సమాహితః
సర్వభూత సుహృన్మిత్రో బ్రహ్మభూయాయ కల్పతే

ఎవడు కోరికలను తన యందు లీనమొనర్చుకొని తృష్ణారహితుడై ఏకాగ్రచిత్తుడై సమస్త ప్రాణికోట్లకు సుహృదుడై మిత్రుడై యుండునో అతడు బ్రహ్మప్రాప్తి పాత్రుడగును

38 యథాగ్నిరిన్ధనైరిద్ధో మహాజ్యోతిః ప్రకాశతే
తథేన్ద్రియనిరోధేన మహానాత్మా ప్రకాశతే

కట్టెలు వేయుటచే అగ్ని ప్రజ్వలించి మహా ఉద్దీప్తమై కానుపించునట్లు ఇంద్రియములను నిగ్రహించుటచే పరమాత్మ ప్రకాశము యొక్క విశేష అనుభవము కలుగుచుండును

39 యదా పశ్యతి భూతాని ప్రసన్నాత్మా౽౽త్మనో హృది
స్వయంజ్యోతిస్తదా సూక్ష్మాత్ సూక్ష్మం ప్రాప్నోత్యనుత్తమమ్

ఎపుడు యోగి ప్రసన్నచిత్తుడై సమస్త ప్రాణులను తన యంతఃకరణమందున్నట్లు చూచునో, అపుడతడు స్వయంజ్యోతి స్వరూపుడై సూక్ష్మము కంటె సూక్ష్మమగు పరమాత్మను పొందుచున్నాడు

40 మనో మనసి సంధాయ పశ్యన్నాత్మాన మాత్మని
సర్వవిత్ సర్వభూతేషు విన్దత్యాత్మాన మాత్మని

ఎవడు మనస్సును హృదయ కమలమందు స్థాపించి తన యందే ధ్యానము ద్వారా ఆత్మదర్శనమును గూర్చిన ప్రయత్నము చేయునో అతడు సమస్త ప్రాణులందును సర్వజ్ఞుడగుచున్నాడు మఱియు అతనికి అంతఃకరణమందు పరమాత్మతత్త్వము యొక్క అనుభవము కలుగును

41 సర్వం కృతం వినాశాన్తం జాతస్య మరణం ధ్రువమ్
అశాశ్వతం హి లోకేఽస్మిన్ సదా స్థావరజఙ్గమమ్

ఏయే వస్తువులు నిర్మింపబడుచున్నవో వాని నాశము తప్పక కలుగును ఎవడు జన్మించెనో అతనికి మృత్యువు నిశ్చితమైయున్నది ఈ ప్రపంచమున స్థావర జంగమములందేదియు ఎల్లపుడు ఉండునది లేదు

42 తస్మాజ్జ్ఞానేన శుద్ధేన ప్రశాన్తాత్మా జితేన్ద్రియః
నిర్మమో నిరహంకారో ముచ్యతే సర్వపాప్మభిః

కావున విశుద్ధ జ్ఞానము ద్వారా ఎవని చిత్తము శాంతమైనదో ఎవనికి ఇంద్రియములు వశములైనవో ఎవడు మమత్వము అహంకారము లేనివాడై యుండునో, అతడు సమస్త పాపముల నుండి విడివడుచున్నాడు

43 అహింసా బ్రహ్మచర్యం చ సత్యమార్జవమేవ చ
అక్రోధశ్చానసూయా చ దమో నిత్యమపైశునమ్
అష్టస్వేతేషు యుక్తః స్యాద్ వ్రతేషు నియతేన్ద్రియః

అహింస బ్రహ్మచర్యము సత్యము సరళత్వము, క్రోధము యొక్క అభావము దోషదృష్టిని త్యజించుట ఇంద్రియ నిగ్రహము చాడీలు చెప్పకుండుట — అను ఈ ఎనిమిది వ్రతములను జాగ్రతగ పాలించవలెను ఇంద్రియములను వశమందుంచుకొనవలెను

44 అనాగతం చ న ధ్యాయేన్నాతీతమనుచిన్తయేత్
వర్తమానముపేక్షేత కాలాకాఙ్క్షీ సమాహితః

భవిష్యత్తు కొఱకు విచారించరాదు గడచిన దానిని గూర్చి చింతింపరాదు వర్తమానమును ఉపేక్షింపవలెను కేవలము కాలమును ప్రతీక్షించుచు చిత్తవృత్తులను సమాధానపఱచుకొనుచు నుండవలెను

45 న చక్షుషా న మనసా న వాచా దూషయేత్ క్వచిత్
న ప్రత్యక్షం పరోక్షం వా కించిద్ దుష్టం సమాచరేత్

తాబేలు తన అవయవములను లోని ముడుచుకొనునట్లు ఇంద్రియములను విషయముల వైపు నుండి తొలగించవలెను ఇంద్రియములు మనస్సు బుద్ధి - వీనిని దుర్బలముగ నొనర్చి నిశ్చేష్టముగ గావించవలెను తత్త్వములన్నిటి యొక్క జ్ఞానమును బడయవలెను

46 నిరాశీర్నిర్గుణః శాన్తో నిరాసక్తో నిరాశ్రయః
ఆత్మసఙ్గీ చ తత్త్వజ్ఞో ముచ్యతే నాత్ర సంశయః

ఎవడు నిష్కాముడుగ నిర్గుణుడుగ, శాంతుడుగ అనాసక్తుడుగ నిరాశ్రయుడుగ ఆత్మపరాయణుడుగ, తత్త్వజ్ఞుడుగ నుండునో అట్టివాడు ముక్తుడగును ఇందు సంశయము లేదు

47 ఏతావిదన్తవేలాయాం విసంఖ్యాయ తత్త్వవిత్
ధ్యాయేదేకాన్తమాస్థాయ ముచ్యతేఽథ నిరాశ్రయః

48 నిర్ముక్తః సర్వసఙ్గేభ్యో వాయురాకాశగో యథా
క్షీణకోశో నిరాతఙ్కస్తథేదం ప్రాప్నుయాత్ పరమ్

ఏ తత్త్వవేత్త అంత్యకాలమున తత్త్వముల జ్ఞానమును పొంది ఏకాంతమున కూర్చొని పరమాత్మను ధ్యానించునో అతడు ఆకాశమున సంచరించు వాయువు వలె అన్ని విధముల ఆసక్తుల నుండి విడివడి

పంచకోశరహితుడై నిర్భయుడై నిరాశ్రయుడై, ముక్తుడై పరమాత్మను పొందుచున్నాడు

49 తపః ప్రదీప ఇత్యాహురాచారో ధర్మసాధకః
జ్ఞానం వై పరమం విద్యాత్ సంన్యాసం తప ఉత్తమమ్

తపస్సు దీపము వంటిది ఆచారము (సదాచారము) ధర్మము యొక్క సాధకము జ్ఞానము పరబ్రహ్మము యొక్క స్వరూపము సంన్యాసమే ఉత్తమ తపస్సు

50 యో విద్వాన్ సహవాసం చ వివాసం చైవ పశ్యతి
తథైవైకత్వనానాత్వే స దుఃఖాత్ ప్రతిముచ్యతే

ఎవడు సంయోగమును కూడ వియోగరూపమున చూచునో నానాత్వమందు ఏకత్వమును చూచునో అతడు - దుఃఖము నుండి సర్వథా ముక్తుడగును

51 నిమేషమాత్రమపి చేత్ సంయమ్యాత్మానమాత్మని
గచ్ఛత్యాత్మప్రసాదేన విదుషాం ప్రాప్తమవ్యయామ్

ఎవడు ఒక్క నిమిషమైనను తన మనస్సును ఆత్మయందు ఏకాగ్రపఱచునో, అతడు అంతఃకరణము యొక్క ప్రసన్నత్వమును పొంది బుద్ధిమంతులకు కలుగు అక్షయగతిని పొందును

52 అనుమానాద్ విజానీమః పురుషం సత్త్వసంశ్రయమ్
న శక్యమన్యథా గన్తుం పురుషం ద్విజసత్తమాః

అంతర్యామియగు పరమాత్మ సత్త్వ స్వరూపమగు ఆత్మయందు ఉన్నాడు మేము అనుమాన ప్రమాణము ద్వారా ఈ విషయమును చక్కగ తెలిసికొనుచున్నాము ఈ విషయమును తెలిసికొనక పరమ పురుషుని పొందుట సంభవము కాదు

53 జ్ఞానం నిఃశ్రేయ ఇత్యాహుర్వృద్ధా నిశ్చితదర్శినః
తస్మాజ్జ్ఞానేన శుద్ధేన ముచ్యతే సర్వకిల్బిషైః

తత్త్వజ్ఞులు జ్ఞానమే పరమ శ్రేయోదాయకమైన సాధనమని చెప్పెదరు కావున పరమ శుద్ధమైన జ్ఞానము ద్వారానే మనుజుడు సమస్త పాపముల నుండియు విముక్తుడగుచున్నాడు

54 యథాధ్వానమపాథేయ ప్రపన్నో మనుజః క్వచిత్
క్లేశేన యాతి మహతా వినశ్యేదన్తరాపి చ

55 తథా కర్మసు విజ్ఞేయం ఫలం భవతి వా న వా
పురుషస్యాత్మనిఃశ్రేయః శుభాశుభనిదర్శనమ్

ఎవడైన దారిబత్తెమును ఏర్పాటు చేసికొనకయే యాత్రకు పూనుకొనినచో అతడు దారిలో చనిపోవచ్చును అట్లే పూర్వజన్మలందలి పుణ్యము లేనివాడు యోగమార్గము యొక్క సాధన యందు ప్రయత్నించుచో యోగసిద్ధి రూపఫలము చాల కష్టముతో పొందును లేక పొందకయు పోవచ్చును మనుజునకు తన శ్రేయస్సాధనయే అతని పూర్వజన్మల శుభాశుభ సంస్కారఫలను తెలుపునదై యున్నది

56 ధ్యానయోగముపాగమ్య ప్రసన్నమతయః సదా
సుఖోపచయమవ్యక్తం ప్రవిశన్త్యాత్మవిత్తమాః

ఎవరు ధ్యానయోగమును ఆశ్రయించి సదా ప్రసన్న చిత్తులై యుందురో ఆత్మవేత్తలలో శ్రేష్ఠులగు అట్టివారు సుఖము యొక్క రాశియగు అవ్యక్త పరమాత్మ యందు ప్రవేశించుదురు

ఆ తరువాత శ్రీకృష్ణుడు అర్జునునితో హస్తినాపురమునకు వెళ్ళి అచట నుండి ద్వారకకు పయనమైపోయెను మార్గమధ్యమున ఉత్తంకముని కలసికొని ఆతనితో సంభాషించి అతనికి తన విశ్వరూపమును చూపి మరుభూమి యందు జలము సంభవించునట్టి వర

మొసంగెను ఎదప శ్రీకృష్ణుడు ద్వారకచేరి అచట కొంత కాలము ఉండి తిరిగి హస్తినాపురమునకు వచ్చెను అనంతరము శ్రీ కృష్ణుడు ఉత్తర యొక్క మృతపుత్రుని ఉజ్జీవింపజేసెను అతనికి పరిక్షిత్తు అని నామకరణము చేయబడెను ఎమ్మట వ్యాసముని శ్రీ కృష్ణుడు ధర్మరాజునకు అశ్వమేధ యజ్ఞము చేయులాగున తెలుపగా ఆతడంగీకరించి అందుల్ల వలసిన సర్వసన్నాహములను గావించెను అర్జునుడు దేశ దేశములను జయించి వచ్చెను యజ్ఞము నిర్విఘ్నముగ సమాప్తమయ్యెను తత్సందర్భమున పెక్కు దానధర్మములు కావింపబడెను

యజ్ఞ పరిసమాప్తి సమయమున అచటికి ఒక ముంగిసవచ్చి రాజులారా! ఈ యజ్ఞము కురుక్షేత్ర నివాసియగు ఒక ఉదార బ్రాహ్మణుడు కావించిన ఒకసేరు పేలపిండి యొక్క దానముతో సమానమైనది కాదు — అని వచించెను ఆ వాక్యము వినగనే అచటి బ్రాహ్మణులు ఆశ్చర్యపడి ఆ సంఘటన యొక్క వివరములు తెలుపుమని కోరగా ఆ ముంగిస యిట్లు చెప్పెను — కురుక్షేత్రమున ఒక బీద బ్రాహ్మణుడుండెను అతడు అచటచట బియ్యపు గింజలు మొదలైనవి ఏరుకొని వచ్చి కుటుంబ పోషణము చేయుచుండెను ఒకనాడు ఆ కుటుంబస్థులు సరిగా భోజనము చేయనారంభించుచుండగా, ఒక అతిథి అచటికి వచ్చెను అతని రాకచే వారు ప్రసన్నులైరి అత్తఱి బ్రాహ్మణుడు తన భాగము భోజనమును ఆ అతిథికి పెట్టెను కాని అతిథి దానిని తిని సంతుష్టి నొందలేదు అపుడు బ్రాహ్మణ పత్ని తన భాగము అన్నమును కూడ అతనికి పెట్టెను అది తినినను అతిథి తృప్తిని చెందలేదు అపుడు బ్రాహ్మణ కుమారుడు తన వంతు అన్నమును అతిథికి పెట్టెను దానిని భుజించినను అతిథికి తృప్తి కలుగలేదు అపుడు ఇంటికోడలు తన వంతు అన్నమును అతిథికి పెట్టెను కుటుంబము వారి త్యాగమును, ఔదార్యమును దానపరత్వమును

చూచి అతిథి చాల సంతుష్టుడయ్యెను సాక్షాత్ ధర్మమే ఆకృతి ధరించి ఆ అతిథి రూపమున అచటకి వచ్చెను అతిథి రూపమును ధరించిన ఆ ధర్మము అంతట త్యాగశీలుడగు ఆ బ్రాహ్మణునితో ఇట్లు చెప్పెను —

57 స్వారారలం లోభబీజం రాగగుప్తం దురాసదమ్
తం తు పశ్యన్తి పురుషా జితక్రోధా జితేన్ద్రియాః
బ్రాహ్మణాస్తపసా యుక్తా యథాశక్తి ప్రదాయినః

(బ్రాహ్మణ రూపమును ధరించిన ధర్మము బ్రాహ్మణునితో ఇట్లు చెప్పెను —)

స్వర్గద్వారము యొక్క గడియ లోభమను బీజముతో చేయ బడినది ఆ ద్వారము రాగము ద్వారా గుప్తముగ నున్నది కాబట్టి దాని లోపల ప్రవేశించుట చాల కష్టము ఎవరు క్రోధమును జయించి వైచిరో ఇంద్రియములను వశమొనర్చికొనిరో, యథాశక్తి దానము చేయుదురో అట్టి తపస్వులు మాత్రమే ఆ ద్వారమును చూడ గల్గుదురు (తెరవగలరు)

ఆ కథను పురస్కరించుకొని వైశంపాయనుడు జనమేజయునితో ఇట్లు వచించెను —

వైశమ్పాయన ఉవాచ

58 అద్రోహః సర్వభూతేషు సంతోషః శీలమార్జవమ్
తపో దమశ్చ సత్యం చ ప్రదానం చేతి సమ్మితమ్

(వైశంపాయనుడు జనమేజయునకిట్లు చెప్పెను —)

ఏ ప్రాణి యెడల ద్రోహము చేయకుండుట మనస్సునందు సంతుష్టి కలిగియుండుట శీలము సదాచారమును పాలించుట అందఱి యెడల సరళత్వ పూర్ణమగు నడవడిక కలిగియుండుట తపస్సు చేయుట మనస్సును ఇంద్రియములను సంయమమందుంచుకొనుట,

సత్యము పలుకుట న్యాయముగ సంపాదించిన దానిని శ్రద్ధతో దానము చేయుట — అను వీనిలో ఒక్కొక్క సుగుణము పెద్ద పెద్ద యజ్ఞములతో సమానమైయున్నది

59 ఏష ధర్మో మహాయోగో దానం భూతదయా తథా
బ్రహ్మచర్యం తథా సత్యమనుక్రోశో ధృతిః క్షమా

60 సనాతనస్య ధర్మస్య మూలమేతత్ సనాతనమ్
శ్రూయన్తే హి పురా వృత్తా విశ్వామిత్రాదయో నృపాః

దానము ప్రాణుల యెడల దయ బ్రహ్మచర్యము సత్యము కరుణ ధైర్యము క్షమ (ఓర్పు) - ఇవియే ధర్మము ఇవియే సనాతన ధర్మము యొక్క సనాతన మూలములు పూర్వము విశ్వామిత్రుడు మొదలగు రాజులు వీనిచేతనే సిద్ధిని బొందినట్లు చెప్పుదురు

అశ్వమేధ యజ్ఞానంతరము ధర్మరాజు శ్రీకృష్ణుని ధర్మ విషయమై ప్రశ్నింప శ్రీకృష్ణుడిటు సమాధాన మొసంగెను —

61 జన్మాన్తరసహస్రైస్తు మనుష్యత్వం హి దుర్లభమ్
తద్ గత్వాపి హి యో ధర్మం న కరోతి స్వవఞ్చితః

(శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను — )

వేలకొలది జన్మలలో సంచరించిన పిదప కూడ మనుష్య జన్మ లభించుట కష్టము అట్టి దుర్లభమగు మనుష్య జన్మను పొందియు ఎవడు ధర్మమును అనుసరించడో అతడు గొప్ప లాభమును పోగొట్టు కొనిన వాడే యగును

62 కుత్సితా యే దరిద్రాశ్చ విరూపా వ్యాధితాస్తథా
పరద్వేష్యాశ్చ మూర్ఖాశ్చ న తైర్ధర్మః కృతః పురా

ఈ జన్మయందెవరు నిందితులుగను దరిద్రులుగను విరూపులు గను రోగులుగను ఇతరులచే ద్వేషింపబడవారుగను మూర్ఖులుగను ఉన్నారో వారు పూర్వజన్మయందు ధర్మమును అనుసరించలేదు

63 యే చ దీర్ఘాయుషః శూరాః పణ్డితా భోగినస్తథా
నీరోగా రూపసమ్పన్నాస్తైర్ధర్మః సుకృతః పురా

ఎవరు దీర్ఘాయువులుగను శూరవీరులుగను పండితులుగను భోగ సామగ్రి సంపన్నులుగను రోగరహితులుగను రూపవంతులుగను ఉన్నారో వారు పూర్వజన్మయందు నిశ్చయముగ ధర్మమును సంపాదించిన వారే అయియున్నారు

64 ఇదం మే మానుషం జన్మ కృతమాత్మని మాయయా
ధర్మసంస్థాపనార్థాయ దుష్టానాం నాశనాయ చ

ఇపుడు ధర్మమును స్థాపించుట కొరకు దుష్టుల యొక్క వినాశము కొరకు నేను నా మాయచే మానవ శరీరమందు అవతార మును ధరించితిని

65 మద్భక్తా న వినశ్యన్తి మద్భక్తా వీతకల్మషాః
మద్భక్తానాం తు మానుష్యే సఫలం జన్మ పాణ్డవ

నా భక్తులకు నాశమెన్నటికిని కలుగదు వారు పాపరహితులు మనుజులలో నా భక్తులగు వారి యొక్క జన్మ సఫలమైనది

66 న తదస్తి క్వచిద్ రాజన్ యత్రాహం న ప్రతిష్ఠితః
న చ తద్ విద్యతే భూతం మయి యన్న ప్రతిష్ఠితమ్

నేను లేని పదార్థమే లేదు మరియు నా యందు ఉండని జీవుడే లెదు

67 మయా సృష్టాని భూతాని మన్మయాని చ భారత
మామేవ న విజానన్తి మాయయా మోహితాని వై

ధర్మరాజా! సమస్త ప్రాణులు నా నుండియే ఉత్పన్నములగు చున్నవి అవి యన్నియు నా స్వరూపములే అయినను నా మాయచే మోహితులై నన్ను తెలిసికొనుట లేదు

68 భారతం మానవో ధర్మో వేదాః సాఙ్గోపాఙ్గచికిత్సితమ్
అజ్ఞాసిద్ధాని చత్వారి న హన్తవ్యాని హేతుభిః

భారతము, మనుస్మృతి నాలుగు వేదములు ఆయుర్వేద శాస్త్రము — ఈ నాలుగున్ను సిద్ధ ఉపదేశము నిచ్చునవై యున్నవి కావున తర్కము ద్వారా వీనిని ఖండింపరాదు

69 యథా వికసతే పుష్పే మధు గృహ్ణన్తి షట్పదాః
ఏవం గృహీతా సావిత్రీ సర్వవేదే చ పాణ్డవ

తుమ్మెదలు వికసించిన పుష్పముల నుండి వాని సారభూతమగు తేనెను గ్రహించునట్లు సమస్త వేదముల నుండి వాని సారభూతమగు గాయత్రి (మంత్రము) గ్రహింపబడుచున్నది

70 అలోల జిహ్వః సముపస్థితో ధృతిం
నిధాయ చక్షుర్యుగమాత్రమేవ తత్
మనశ్చ వాచం చ నిగృహ్య చఞ్చలం
భయాన్నివృత్తో మమ భక్త ఉచ్యతే

జిహ్వ చంచలముగ లేనివాడును ధైర్యము కలిగియుండు వాడును నాలుగు చేతుల దూరము వఱకు దృష్టి నుంచి నడచు వాడును చంచల మనస్సును వాక్కును వశమందుంచుకొనిన వాడును భయము లేనివాడగు నా భక్తుడని చెప్పబడును

71 ధర్మో జయతి నాధర్మః సత్యం జయతి నానృతమ్
క్షమా జయతి న క్రోధః క్షమావాన్ బ్రాహ్మణో భవేత్

ధర్మము జయించును అధర్మము కాదు సత్యము జయించును అసత్యము కాదు క్షమ జయించును కోపము కాదు కావున ఉత్తమ మనుజుడు క్షమాశీలుడై యుండవలెను

72 అనాగతాని కార్యాణి కర్తుం గణయతే మనః
శారీరకం సముద్దిశ్య స్మయతే నూనమన్తకః

73 తస్మాద్ ధర్మసహాయస్తు ధర్మం సంచినుయాత్ సదా
ధర్మేణ హి సహాయేన తమస్తరతి దుస్తరమ్

మనుజుని మనస్సు భవిష్య కార్యములను చేయుటకు ఆలోచించుచున్నది కాని కాలుడు అతని నాశవంతమైన దేహమును చూచి నవ్వుచున్నాడు కావున ధర్మమునే సహాయకుడుగ నెంచి అద్దాని సంపాదన యందే సదా సమాసక్తుడై యుండవలెను ధర్మము యొక్క సహాయముచే మనుజుడు దుస్తర నరకమును దాటివైచుచున్నాడు

74 ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః
ద్వితీయం ధర్మశాస్త్రాణి తృతీయం లోకసంగ్రహః

ధర్మము యొక్క తత్త్వమును తెలిసికొనదలంచువారికి వేదము ముఖ్య ప్రమాణము ధర్మశాస్త్రము రెండవ ప్రమాణము లోకాచారము మూడవ ప్రమాణము

75 ఆచారః ప్రథమో ధర్మో హ్యహింసా సత్యమేవ చ
దానం చైవ యథాశక్తి నియమాశ్చ యమైః సహ

సదాచారము అహింస సత్యము శక్త్యనుసారము దానము, యమ నియమముల పాలనము — అను ఈ సద్గుణములు ముఖ్య ధర్మములై యున్నవి

76 ఉపాధ్యాయాద్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా
పితుః శతగుణం మాతా గౌరవేణాతిరిచ్యతే

గౌరవమునందు పది ఉపాధ్యాయుల కంటె ఒక ఆచార్యుడు నూర్గురు ఆచార్యుల కంటె ఒక తండ్రి నూర్గురు తండ్రుల కంటె ఒక తల్లి అధికులు

77 ఏతేషామపి సర్వేషాం గరీయాన్ జ్ఞానదో గురుః
గురోః పరతరం కించిన్న భూతం న భవిష్యతి

కాని జ్ఞానమొసంగు గురువులు వీరందఱి కంటెను మిగుల శ్రేష్ఠులు గురువు కంటె గొప్పవాడు ఇంతవఱకు లేడు ఇక మీాదట ఉండబోడు

78 శపతా యత్ కృతం పుణ్యం శప్యమానం తు గచ్ఛతి
శప్యమానస్య యత్ పాపం శపన్తమనుగచ్ఛతి

ఒకనిని నిందించువాని పుణ్యము నిందింపబడు వాని యొద్దకు వెడలిపోవును నిందింపబడు వాని పాపము నిందించు వాని యొద్దకు వచ్చిచేరును

79 వ్రతస్య పారణం తీర్థమార్జవం తీర్థముచ్యతే
దేవశుశ్రూషణం తీర్థం గురుశుశ్రూషణం తథా

80 పితృశుశ్రూషణం తీర్థం మాతృశుశ్రూషణం తథా
దారాణాం తోషణం తీర్థం గార్హస్థ్యం తీర్థముచ్యతే

81 ఆతిథేయం పరం తీర్థం బ్రహ్మతీర్థం సనాతనమ్
బ్రహ్మచర్యం పరం తీర్థం త్రేతాగ్నిస్తీర్థముచ్యతే

వ్రతపరిపాలన సరళత్వము దేవతల సేవ గురుశుశ్రూష — మాతాపితరుల సేవ స్త్రీలను సంతుష్టులుగ చేయుట గృహస్థ ధర్మమును పాలించుట అతిథిసేవ వేదాధ్యయనము బ్రహ్మచర్య పాలనము ఆహవనీయాది మూడు విధములైన అగ్నులు — ఇవి యన్నియు మహా తీర్థములని చెప్పబడినవి

82 ద్వివిధం తీర్థమిత్యాహుః స్థావరం జఙ్గమం తథా
స్థావరాజ్జఙ్గమం తీర్థం తతో జ్ఞానపరిగ్రహః

రెండు విధములైన తీర్థములు కలవు స్థావరమని జంగమని స్థావరతీర్థము కంటె జంగమతీర్థము (గుర్వాదులు) శ్రేష్ఠము సేవించిన దానిచే జ్ఞానము కలుగుచున్నది

83 కర్మణాం విశుద్ధ్యా పురుషస్యేహ భారత
హృదయే సర్వతీర్థాని తీర్థభూతః స ఉచ్యతే

ఈ ప్రపంచమున పుణ్యకర్మ యొక్క అనుష్ఠానముచే విశుద్ధుడైన మనుజుని హృదయమున సమస్త తీర్థములు వసించుచున్నవి కనుక అతడు తీర్థస్వరూపుడని చెప్పబడును

84 గురుతీర్థం పరం జ్ఞానమతస్తీరం న విద్యతే
జ్ఞా తీర్థం పరం తీర్థం బ్రహ్మతీర్థం సనాతనమ్

గురువను తీర్థమువలన పరమాత్మ జ్ఞానము కలుగుచున్నది కావున అతనికంటె గొప్ప తీర్థము వేఱొకటి ఏదియు లేదు తీర్థములలో జ్ఞాన తీర్థము సర్వశ్రేష్ఠమని బ్రహ్మతీర్థము సనాతనమని చెప్పబడినది

85 క్షమా తు పరమం తీర్థం సర్వతీర్థేషు పాణ్డవ
క్షమావతామయం లోకః పరశ్చైవ క్షమావతామ్

తీర్థములన్నిటిలోను క్షమ (ఓర్పు) అను తీర్థము చాలగొప్పది క్షమాశీలురకు ఇహ పరలోకములందు సుఖము కలుగును

86 ఆత్మా నదీ భారత పుణ్యతీర్థ
మాత్మా తీర్థం సర్వతీర్థప్రధానమ్
ఆత్మా యజ్ఞః సతతం మన్యతే వై
స్వర్గో మోక్షః సర్వమాత్మన్యధీనమ్

ఆత్మయను నది పరమపావనమైన తీర్థము ఇది అన్ని తీర్థములలో ప్రధానమైనది ఆత్మ సదా యజ్ఞరూపమని తలంచబడినది స్వర్గము మోక్షము- అన్నియు ఆత్మకు అధీనములే అయి యున్నవి

87 ఆచారనైర్మల్యముపాగతేన
సత్యక్షమానిస్తులశీతలేన
జ్ఞానామ్బునా స్నాతి హి నిత్యమేవం
కిం తస్య భూయః సలిలేన తీర్థమ్

సదాచారము యొక్క పాలనచే అత్యంత నిర్మలుడైనవాడును సత్యము క్షమ — వీని ద్వారా మహత్తర శాంతిని బడసినవాడును జ్ఞానమను జలమందు నిరంతరము స్నానము చేయువాడునగు మహనీయునకు కేవలము నీటితో నిండియున్న తీర్థముతో ఏమి పని ?

88 త్రిదణ్డధారణం మౌనం జటాధారణముణ్డనమ్
వల్కలాజినసంవాసో బ్రహ్మచర్యాభిషేచనమ్

89 అగ్నిహోత్రం గృహేవాసః స్వాధ్యాయందారసత్క్రియా
సర్వాణ్యేతాని వై మిథ్యాయదిభావో న నిర్మలః

హృదయము శుద్ధముగా లేనిచో త్రిదండము ధరించుట, మౌనముగ నుండుట జడలు ధరించుట శిరోముండనము గావించుకొనుట నారవస్త్రములు ధరించుట వ్రతములు అభిషేకములు చేయుట అగ్నియందు ఆహుతులు వేయుట గృహస్థధర్మమును పాలించుట స్వాధ్యాయము గావించుట భార్యను సత్కరించుట— అను ఈ కర్మలన్నియు వ్యర్థములై పోవును

90 మనశ్శౌచం కర్మశౌచం కులశౌచం చ భారత
శరీరశౌచం వాక్శౌచం శౌచం పఞ్చవిధం స్మృతమ్

మనశ్శౌచము క్రియాశౌచము కులశౌచము శరీరశౌచము వాక్ - శౌచము — అని ఈ ప్రకారముగ పంచవిధ శౌచములు - చెప్పబడినవి

91 పఞ్చస్వేతేషు శౌచేషు హృది శౌచం విశిష్యతే
హృదయస్య చ శౌచేన స్వర్గం గచ్ఛన్తి మానవాః

ఈ ఐదు శౌచములలో హృదయ శౌచము అన్నిటికంటెను గొప్పది హృదయ శుద్ధి వలననే మనుజులు స్వర్గమున కేగుచున్నారు

92 సంతుష్టో బ్రాహ్మణస్తీర్థం జ్ఞానం వా తీర్థముచ్యతే
మద్భక్తాః సతతం తీర్థం శఙ్కరస్య విశేషతః

సంతుష్టుడు జ్ఞానము కూడ తీర్థములని చెప్పబడుచున్నవి నా భక్తులు సదా తీర్థరూపులై యున్నారు ఇక శివుని భక్తులు ఇంకను విశేషముగ తీర్థరూపులై యున్నారు

93 అనృశంస్యమహింసా చ యథా సత్యం తథాఽఽర్జవమ్
అద్రోహశ్చైవ భూతానాం మదతానాం వ్రతం నృప

క్రూరత్వము లేకుండుట అహింస సత్యము ఋజుత్వము, ఏ ప్రాణి యెడల ద్రోహము చేయకుండుట — అనునివి నా భక్తుని యొక్క వ్రతములై యున్నవి

అనంతరము ధృతరాష్ట్రుడు గాంధారి వనమున కేగుటకు నిశ్చయించిరి ఆ సమయమున ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు రాజనీతిని బోధించి ఇట్లు పలికెను—

ఓమ్

# 15 ఆశ్రమవాసిక పర్వము

ధృతరాష్ట్ర ఉవాచ

1 సర్వథైవ మహారాజ శరీరం ధారయేదిహ
ప్రేత్య చేహ చ కర్తవ్యమాత్మనిశ్శ్రేయసంపరమ్

(ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను —)

ఈ ప్రపంచమున అన్ని ఉపాయముల ద్వారా శరీరమును రక్షించుకొనవలెను దాని ద్వారా ఇహలోక పరలోకములందును తనకు శ్రేయమును కలుగజేయు సాధనలు చేయవలెను

ధృతరాష్ట్ర గాంధారీలతో కుంతీదేవి కూడ వనమునకు పయనమయ్యెను తదుపరి కొంత కాలమునకు ధర్మరాజు కూడ వనమునకు పోయెను వనమందు వ్యాసముని ధృతరాష్ట్రునకీ ప్రకారము బోధించెను —

వ్యాసోవాచ—

2 ఏతద్ధి త్రితయం శ్రేష్ఠం సర్వభూతేషు భారత
నిర్వైరతా మహారాజ సత్యమక్రోధ ఏవ చ

(వ్యాసముని ధృతరాష్ట్రునకిట్లు చెప్పెను —)

ఎవనితోను వైరము లేకుండుట, సత్యము పలుకుట క్రోధమును సర్వదా వదలి వేయుట – అను ఈ మూడు సుగుణములు అన్ని ప్రాణులందును శ్రేష్ఠములుగ తలంచబడినవి

అనంతరము యుద్ధమందు మరణించిన కౌరవ పాండవులు వ్యాసముని యొక్క ప్రభావముచే గంగాజలము నుండి ప్రకటమయిరి. అచటనున్న వారందరు వారిని దర్శించిరి వ్యాసమునిచే అనుగ్రహించబడిన దివ్యదృష్టిచే ధృతరాష్ట్రుడు, గాంధారి ఆ బంధ్వాదులందరిని చూడగల్గిరి అనంతరము ఆ బంధ్వాదులందరు అంతర్ధానమై పోయిరి ఎదప వైశంపాయనుడు జనమేజయునకిట్లు చెప్పెను —

వైశమ్పాయన ఉవాచ

3 అవినాశ్యస్తథాయుక్తః క్షేత్రజ్ఞ ఇతి నిశ్చయః
భూతానామాత్మకో భావో యథాసౌ న వియుజ్యతే

(వైశంపాయనుడు జనమేజయునితో ఇట్లు చెప్పెను —)

ఈ శరీరమున క్షేత్రజ్ఞుడు కర్మలతో కూడుకొని యున్నను వాస్తవముగ నాశరహితుడే యగును ఈ విషయము నిశ్చితమై యున్నది కాని పంచభూతములతో (శరీరాదులతో) తదాత్మ్యమును స్వీకరించినందువలన, జ్ఞానములేకున్న వానినుండి వేఱు కానేరడు

4 నానాభావాస్తథైకత్వం శరీరం ప్రాప్య సంహతాః
భవన్తి తే తథా నిత్యాః పృథగ్భావం విజానతామ్

పంచభూతములు ఇంద్రియములు మొదలగు నానావిధము లైన పదార్థములు శరీరమును పొంది ఏకత్వమును బడయుచున్నవి దేహాదులను ఆత్మనుండి వేఱుచేయు యోగులకు ఆ పదార్థము లన్నియు నిత్య ఆత్మ స్వరూపమగుచున్నవి

ఎమ్మట వ్యాసమహర్షి యొక్క అనుగ్రహముచే జనమేజయునకు తన తండ్రియగు పరిక్షిత్తు యొక్క దర్శనము లభించెను కొంత కాలమునకు అరణ్యమున దావాగ్ని చెలరేగగా, ధృతరాష్ట్రుడు, గాంధారి కుంతీదేవి ఆ అగ్నిలో దహింపబడి పోయిరి తదుపరి ఋషుల శాపమువలన యదువంశ వినాశము సంభవించెను అనంతరము బలరాముడు, శ్రీకృష్ణుడు పరమధామమున కేగిరి అర్జునుడు ద్వారకకు వెళ్ళి ద్వారకావాసులను తన వెంట తీసుకొని వెళ్ళెను అనంతరము సముద్ర జలములచే ద్వారకా పట్టణము ముంచివేయ బడెను ఎమ్మట వ్యాసముని అర్జునునితో ఇట్లు చెప్పెను —

ఓమ్

# 16 మౌసల పర్వము

వ్యాస ఉవాచ

1 ఏవం బుద్ధిశ్చ తేజశ్చ ప్రతిపత్తిశ్చ భారత
భవన్తి భవకాలేషు విపద్యన్తే విపర్యయే

(వ్యాసముని అర్జునునితో ఇట్లు చెప్పెను —)

(జ్ఞాన) ఉద్భవసమయ మేతెంచినపుడు మనుజుని బుద్ధి తేజస్సు, జ్ఞానము వికాసమును పొందును తద్విపరీత సమయ మేతెంచినపుడు, ఇవి యన్నియు నశించిపోవును

ఓమ్

# 18 స్వర్గారోహణ పర్వము

సౌతి రువాచ

1 సర్వజ్ఞేన విధిజ్ఞేన ధర్మజ్ఞానవతా సతా
అతీన్ద్రియేణ శుచినా తపసా భావితాత్మనా

2 ఐశ్వర్యే వర్తతా చైవ సాంఖ్యయోగవతా తథా
నైక తన్త్ర విబుద్ధేన దృష్ట్వా దివ్యేన చక్షుషా

3 కీర్తిం ప్రథయతా లోకే పాణ్డవానాం మహాత్మనామ్
అన్యేషాం క్షత్రియాణాం చ భూరిద్రవిణతేజసామ్

(సౌతి శౌనకాది ఋషులతో ఇట్లు చెప్పెను —)

సర్వజ్ఞుడును, విధి విధానము నెఱింగినవాడును ధర్మజ్ఞుడును సాధువును, ఇంద్రియాతీతజ్ఞాన సంపన్నుడును, శుద్ధుడును తపస్సు యొక్క ప్రభావముచే పవిత్రమైన అంతఃకరణము కలవాడును, ఐశ్వర్య సంపన్నుడును సాంఖ్యము యొక్క యోగము యొక్క విద్వాంసుడును, అనేక శాస్త్రములపారదర్శియు మునివర్యుడును అగు వ్యాసమునీంద్రుడు తన దివ్యదృష్టితో చూచి మహాత్ములగు పాండవుల యొక్కయు ఇతరులగు మహా ధనవంతులును తేజస్సంపన్నులును అగు రాజుల యొక్కయు కీర్తిని ప్రసరింప జేయుటకై ఈ భారత ఇతిహాసమును రచించెను

4 అష్టాదశపురాణాని ధర్మశాస్త్రాణి సర్వశః
వేదాః సాఙ్గాస్తథైకత్ర భారతం చైకతః స్థితమ్

5 శ్రూయతాం సింహనాదోఽయమృషేస్తస్య మహాత్మనః
అష్టాదశపురాణానాం కర్తుర్వేదమహోదధేః

పదునెనిమిది పురాణములను రచించిన మహనీయుడును, వేద విద్యా మహా సముద్రుడును మహాత్ముడును అగు వ్యాసమునీంద్రుని

ఈ సంహావాదమును వినుము — పదునెనిమిది పురాణములు సమస్త ధర్మశాస్త్రములు అంగసహిత చతుర్వేదములు గ్రోసుకోని ఒక పళ్ళెరమందును కేవలము భారతమును మాత్రము మఱొక పళ్ళెరమందును ఉంచి తూచినచో భారత మొక్కటియే తక్కిన వాని యన్నింటితో సమానముగ నుండును

6 త్రిభిర్వర్షైరిదం పూర్ణం కృష్ణద్వైపాయనః ప్రభుః
అఖిలం భారతం చేదం చకార భగవాన్ మునిః

మునివర్యుడును భగవంతుడును ప్రభువు (శ్రీ) వేదవ్యాసులు మూడు సంవత్సరముల కాలములో ఈ భారతమునంతను పూర్తి చేసిరి

7 ఆకర్ణ్య భక్త్యా సతతం జయాఖ్యం భారతం మహాత్
శ్రీశ్చ కీర్తిస్తథా విద్యా భవన్తి సహితాః సదా

జయ మను పేరుకల ఈ భారత ఇతిహాసమును నిత్యము భక్తి పూర్వకముగ వినుచుండునో అతనికి ఐశ్వర్యము కీర్తి విద్య— ఈ మూడును లభించును

8 ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్

భరతశ్రేష్ఠా! ధర్మ అర్థ కామ మోక్షములను గూర్చి ఈ భారతమందేది చెప్పబడినదో అదియే తక్కిన చోట్ల గూడ కలదు ఏది దీని యందు లేదో అది ఎచటను లేదు

9 అనాగతశ్చ మోక్షశ్చ కృష్ణద్వైపాయనః ప్రభుః
సందర్భం భారతస్యాస్య కృతవాన్ ధర్మకామ్యయా

నిత్యసిద్ధుడును మోక్ష స్వరూపుడును అగు కృష్ణ ద్వైపాయనుడు (వ్యాసమునీంద్రుడు) ధర్మప్రచారము కొఱకై ఈ భారతమును రచించెను

వ్యాసముని శుకునితో భారత సారభూతమగు ఉపదేశమును ఈ ప్రకారముగ బోధించెను—

వ్యాస ఉవాచ—

10 మాతాపితృసహస్రాణి పుత్రదారశతాని చ
సంసారేష్వనుభూతాని యాన్తి యాస్యన్తి చాపరే

(వ్యాసముని శుకునితో (భారత సారభూతమగు ఉపదేశమును) ఇట్లు వచించెను— )

మనుష్యుడు ఈ ప్రపంచమున వేలకొలది తల్లిదండ్రుల యొక్కయు వందలకొలది స్త్రీ పురుషుల యొక్కయు సంయోగములను అనుభవించెను అనుభవించుచున్నాడు (జ్ఞానము లేనచో) ముందును అనుభవించును

11 హర్షస్థాన సహస్రాణి భయస్థానశతాని చ
దివసే దివసే మూఢమావిశన్తి న పణ్డితమ్

అజ్ఞాని ఎఱిగినము సంతోషము యొక్క అవకాశములు వేలకొలది భయము యొక్క అవకాశములు వందలకొలది వచ్చుచుండును కాని జ్ఞానియొక్క మనస్సుపైవాని ప్రభావమేమియు ఉండదు

12 ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి మే
దర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే

నేను రెండు చేతులు పైకెత్తి పెద్దగా ఈ విధము చెప్పుచున్నను ఎవడును వినుటలేదు— ధర్మముచే మోక్షము కలుగును ధర్మముచే అర్థ కామములున్ను సిద్ధించును. అయినను జనులు అట్టి ధర్మము నేల సేవించకున్నారు?

13 న జాతు కామాన్న భయాన్న లోభాద్
ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః

నిత్యో ధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః

కామముచే గాని భయముచేగాని లోభముచే గాని, ప్రాణ
ములను రక్షించుటకొరకు గాని ధర్మమును త్యజించరాదు ధర్మము
నిత్యము సుఖదుఃఖములు అనిత్యములు జీవాత్మ నిత్యుడు అతని
బంధకారణమగు అజ్ఞానము అనిత్యము

అంతట సౌతి శౌనకాది మహర్షులకిట్లు బోధించెను—

సౌతిరువాచ

14 ఇమాం భారతసావిత్రీం ప్రాతరుత్థాయ యః పఠేత్
స భారతఫలం ప్రాప్య పరం బ్రహ్మాధిగచ్ఛతి

(సౌతి శౌనకాది మహర్షులకు చెప్పెను— )

మహాభారతముయొక్క ఈ సారభూతమగు ఈ ఉపదేశము
భారతసావిత్రి అను పేరుతో ప్రఖ్యాతిగాంచినది మానవుడు ప్రతిదిన
ప్రొద్దునలేచి దీనిని పఠించునో అతడు సంపూర్ణ భారత
అధ్యయన ఫలితమును పొంది బ్రహ్మమును సాక్షాత్కరించుకొనును

15 యథా సముద్రో భగవాన్ యథా చ హిమవాన్ గిరిః
ఖ్యాతావుభౌ రత్ననిధీ తథా భారతముచ్యతే

ఐశ్వర్యశాలియగు సముద్రము హిమాలయ పర్వతము
ఈ రెండును రత్నముల నిధులని చెప్పబడినట్లు భారతము
ఉపదేశ రూపరత్నములకు భాండాగారమని చెప్పబడును

16 కార్ష్ణం వేదమిమం విద్వాఞ్శ్రావయిత్వార్థమశ్నుతే
ఇదం భారతమాఖ్యానం యః పఠేత్ సుసమాహితః
స గచ్ఛేత్ పరమాం సిద్ధిమితి మే నాస్తి సంశయః

ఏ విద్వాంసుడు కృష్ణద్వైపాయన (వేదవ్యాస) ప్రోక్త
ఈ భారతమను పంచమవేదమును ఇతరులకు వినిపించునో అతనికి

ప్రాప్తచేకూరును ఎవడు ఏకాగ్రచిత్తుడై ఈ భారత ఉపాఖ్యానమును పఠించునో అతడు మె క్షమను పరమ సిద్ధిని బడయును ఇవ్విషయమున నాకు సంశయము లేదు

17 ద్వైపాయనోష్ఠపుటనిఃసృతమప్రమేయం
పుణ్యం పవిత్రమథ పాపహరం శివం చ
యో భారతం సమధిగచ్ఛతి వాచ్యమానం
కిం తస్య పుష్కరజలైరభిషేచనేన

వేదవ్యాసమునియొక్క ముఖమునుండి బయలుదేఱిన ఈ అప్రమేయ పవిత్ర పుణ్యదాయక పాపహారక శ్రేయోదాయక భారతమును ఎవడు ఇతరులవలన వినునో అట్టివానికి పుష్కర తీర్థమందు స్నానము చేయవలసిన ఆవశ్యకత ఏమికలదు?

18 యో గోశతం కనకశృఙ్గమయం దదాతి
విప్రాయ వేదవిదుషే సుబహుశ్రుతాయ
పుణ్యాం చ భారతకథాం సతతం శృణోతి
తుల్యం ఫలం భవతి తస్య చ తస్య చైవ

ఎవడు గోవులయొక్క కొమ్ములకు బంగారమును పూసి వేదవేత్తలును బహ్మజ్ఞులును అగు బ్రహ్మజ్ఞానులకు దానమిచ్చునో ఎవడు భారతమును ప్రతిదినము శ్రవణమాత్రము కావించునో, వారిరువురకును సమానఫలితము లభించును

**హరిః ఓమ్ తత్ సత్**

ఓమ్



# శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు

## 1 గీతా మకరందము

రచయిత శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు

రాయల్ సైజు 1100 పేజీలుగల మహా గ్రంథము

ఇందు (శ్రీ) భగవద్గీత మూలశ్లోకములు ప్రతి శ్లోకమునకు అవతారిక ప్రతిపదార్థము తాత్పర్యము వ్యాఖ్యానము ప్రశ్నోత్తరములు కలవు ఇంకను గీతను గూర్చిన అనేక వివరములు గ్రంథాది యందు పొందుపఱుపబడినవి ఇవిగాక గీతాతత్త్వమును సుబోధకమొనర్పగల దాదాపు నూఱు పేజీలుగల గొప్ప ఉపోద్ఘాతమున్ను ప్రారంభమున గలదు గీతాభిలాషులకు చాల ఆవశ్యకమైన గ్రంథము పూర్తి క్యాలికో బైండు వెల రు **45 00**

---

## 2 GITAMAKARANDA

(In English)

Price Rs **45 00**





# 3 శ్రీ వసిష్ఠ గీత

అను

## సంక్షిప్త యోగవాసిష్టము

**అనువాదకులు** శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు

శ్రీ వసిష్ఠ మునీంద్రులచే శ్రీరామచంద్రునకు ఉపదేశింపబడిన యోగవాసిష్టమను మహోన్నత ఆధ్యాత్మిక గ్రంథము యొక్క సంక్షిప్త స్వరూపమే ఈ వసిష్ఠ గీత ఇందు మూల శ్లోకములు తెలుగు తాత్పర్యములు కూడ కలవు రెండు భాగములు కలసి ఒకే వాల్యూముగా అచ్చువేయబడినది ముముక్షువులకు అత్యావశ్యకమైన గ్రంథము

డెమ్మీ సైజు 360 పేజీలు — వెల రు **40 00**

---

# 4 భాగవత రత్నాకరము

**అనువాదకులు** శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు

భాగవతమునందు భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధకములైన శ్లోకములను ఏరి తెలుగు తాత్పర్యమునుచేర్చి ఈ గ్రంథము ప్రకటింపబడినది ముముక్షువులకు అత్యంతావశ్యకమైన గ్రంథము

వెల రు **40 00**





# 5 రామాయణ రత్నాకరము

**అనువాదకులు : శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు**

రామాయణము నందు ఆధ్యాత్మిక బోధకు సంబంధించిన శ్లోకములు ఏరి, తెలుగు తాత్పర్యమును చేర్చి ఈ గ్రంథము ప్రకటింపబడినది గ్రంథ ప్రారంభమున శ్రీరామ స్తోత్రములు అనేకము చేర్చబడినవి రామాయణమును గూర్చిన పెక్కు వివరములు తెలుపు ఉపోద్ఘాతమున్ను కలదు ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ఇది చాల ఆవశ్యకమైన గ్రంథము

డెమ్మీసైజు దాదాపు 800 పేజీలు వెల రు **40 00**

---

# 6 భారత రత్నాకరము

లక్ష శ్లోకములతో కూడిన మహాభారతమును చదివి సారాంశమును గ్రహించుటకు అందరికి సాధ్యపడు విషయము కాదు కావున శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు భక్తులకు అందుబాటులో ఉండుట కొరకు సారభూతమైన ఘట్టములను పరికూర్చిన గ్రంథమే భారత రత్నాకరము

డెమ్మీసైజు దాదాపు 800 పేజీలు వెల రు **40 00**





# 7 ఉపనిషద్రత్నాకరము

ఆధ్యాత్మిక వాఙ్మయమునందు విశేష ప్రాముఖ్యతను గలిగి యున్నవి వేదములు

అట్టి వేదముల సారము ఉపనిషత్తులు అట్టి ఉపనిషత్తుల సారమును భక్తులకు అందించవలెనను ఉద్దేశ్యముతో శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాముల రు 108 ఉపనిషత్తులలోని ముఖ్యమైన మంత్రాలను ఏరి వాటికి తాత్పర్యమును వ్రాసిన గ్రంథరాజమే ఉపనిషద్రత్నాకరము వెల రు **35 00**

---

# 8 యోగవాసిష్ఠ రత్నాకరము

శ్రీ వసిష్ఠులవారు శ్రీరామచంద్రునకు ఉపదేశించిన గ్రంథము పేరు యోగవాసిష్ఠము ఇట్టి గ్రంథము 32 వేల శ్లోకములతో కూడుకొని యున్నది

అంతటి బృహద్గ్రంథము లోని సారాంశమును భక్తులకు అందించవలెనను సంకల్పంతో శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాముల వారు సాధనలకు ఎక్కువగా ఉపయోగపడు శ్లోకములను ఏరి వాటికి తాత్పర్యమును వ్రాసిన గ్రంథమే యోగవాసిష్ఠ రత్నాకరము గ్రంథ ప్రారంభమున శ్రీ యోగవాసిష్ఠము యొక్క కథాభాగ మంతయు వచనరూపముగా దాదాపు 200 పేజీలలో వివరించబడినది

వెల రు **25 00**





## 9 గీతోపన్యాసములు

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు గీతా తత్త్వమును గూర్చి కావించిన మహోపన్యాసముల సంగ్రహమే ఈ గ్రంథము సర్వులకును గ్రాహ్యమగు రీతి సులభశైలిలో వ్రాయబడినది గీతాభిలాషులకు అత్యంత ప్రయోజనకరమగు గ్రంథము

1/8 క్రౌన్ సైజు 680 పేజీలు — వెల రు 22-00



## 10 మోక్షసాధన రహస్యము

రచయిత శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

ఇందు మానవుడు మోక్షమును, బంధరాహిత్యమును పరమ శాంతిని బడయుటకు వలసిన సాధనోపాయములు పద్ధతులు ఎన్నియో వివరింపబడినవి ముముక్షువులకు చాల హితకరమైన గ్రంథము

1/8 క్రౌన్ సైజు 675 పేజీలు — వె రు 22-00





# 11 పరమార్థ కథలు

రచయిత శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు

నిగూఢమైన ఆధ్యాత్మికతత్త్వము కథలద్వారా ఉపమానముల ద్వారా దృష్టాంతముల ద్వారా తెలుపబడినపుడు మాత్రమే శ్రోతల హృదయమున చక్కగ ప్రవేశించగలదు వేదాంత తత్త్వమును సుబోధక మొనర్చగల ఆధ్యాత్మిక కథలు ఎన్నియో ఈ గ్రంథమున వ్రాయబడినవి ప్రతి కథ చివర ఆ కథకుసంబంధించిన నీతికూడ తెలుపబడినది సాధకులకు ఆధ్యాత్మ క్షేత్రమున ఈ గ్రంథము ఎంతయో ఉపకరించగలదు

1/8 క్రౌన్ సైజు దాదాపు 800 పేజీలు వెల రు **22-00**



# 12 బ్రహ్మచర్య విజయము

బ్రహ్మచర్యము యొక్క మహిమ అమోఘమైనది అట్టి బ్రహ్మచర్యమును ఎట్లు అవలంబించవలెను? మార్గములు సూత్రములు రహస్యములు వివరముగా తెలుసుకొనదలచినవారికి ఈ గ్రంథము బాగుగా ఉపయోగపడగలదు

వెల రు **15-00**





# 13 ఆధ్యాత్మ రామాయణము

అధ్యాత్మ రామాయణమను మహోన్నత గ్రంథమును రచించిన వారు శ్రీ వేదవ్యాస మునీంద్రులు ఈ గ్రంథము పార్వతీ పరమేశ్వర సంవాద రూపముగ నున్నది

మూల గ్రంథములోని అమూల్య భావములు సంక్షేపముగ వచన రూపమున ఈ పుస్తకమునందు వివరింపబడినది

వెల రు 12-00



# 14 బ్రహ్మానంద వైభవము

రచయిత శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు

ప్రతి జీవియు ఆనందమును కాంక్షించుచుండును ఆనందము యొక్క పరాకాష్టయే బ్రహ్మానందము విషయానందము క్షణికమైనది బ్రహ్మానందము శాశ్వతమైనది అట్టి బ్రహ్మానందమును బడయుటకు పెక్కు ఉపాయములు ఈ గ్రంథమున తెలుపబడినవి సర్వులకును ఆవశ్యకమైన గ్రంథము

1/8 క్రౌన్ సైజు దాదాపు 200 పేజీలు వెల రు 12 00





# 15 భజనలు - కీర్తనలు

భగవంతుని భజించుటకు సంకీర్తన మొనర్చుటకు వలసిన భజనలు-కీర్తనలు 565 ఈ గ్రంథమున ప్రకటింపబడినవి ప్రతి భజన యొక్క తాత్పర్యమున్ను తెనుగులో వివరింపబడినది కాబట్టి భజనలు సలుపువారికి, సంకీర్తనాదులు నొనర్చువారికి ఈ గ్రంథము చాల సహాయకారిగ నుండగలదు

1/8 క్రౌన్ సైజు 366 పేజీలు    వెల: రు **2-00**



# 16 శ్రీ భగవద్గీత

## (స్థూలాక్షరి)

(త్రివర్ణ ముఖచిత్ర ఫోటో - ప్లాస్టిక్ కవరుతో)

ఇందు భగవద్గీత మూల శ్లోకములు, పెద్ద టైపులలో ప్రకటింపబడినవి ప్రతి శ్లోకమునకు తెలుగు తాత్పర్యము కూడ కలదు దృష్టిమాంద్యము కలవారు కూడ ఈ గ్రంథము ద్వారా గీతా పారాయణము చేయుటకు వీలుండును

450 పేజీలు    వెల రు **12-00**





# 17 శ్రీ భగవద్గీత

## [మూలం]

ఇందు భగవద్గీత మూల శ్లోకములు గలవు పారాయణోప యుక్తమైనది (కృష్ణుని త్రివర్ణ ముఖచిత్రము కేపరు ప్లాస్టిక్ కవరుతో)

ప్యాకెట్ సైజు 31' పేజీలు వెల రు **4 00**



# 18 శ్రీ మలయాళ మహర్షి

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారి గురుదేవులయిన శ్రీ మహర్షి మలయాళ స్వాములవారి జీవిత విశేషములను వారి బోధనలు శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు క్లుప్తముగా వివరించిన గ్రంథము

వెల రు **5 00**



# 19 వివేకానంద సింహనాదం

శ్రీ వివేకానందస్వామివారి యొక్క గంభీరమైన వాక్యములు ఆధ్యాత్మిక బోధలు ఇందు కలవు ఇంగ్లీషు వాక్యములు, వాని తెలుగు తాత్పర్యము కూడ ఇందు కలవు ఆధ్యాత్మపథమున పయనించువారికి ఈ గంభీర వాక్యములు ఎంతయో ఉత్తేజమును కలుగజేయగలవు

వెల రు **3 00**





# 20 యమలోక వార్తలు

జీవుడు ఏ పాపము చేసినచో యమలోకమున ఆతనికి ఏ దండన లభించునో ఆ వివరములున్ను నరకబాధలు లేకుండ చేసికొనుట కొరకు మార్గములున్ను ఈ గ్రంథమున తెలుపబడినవి

వెల రు **3 00**

# 21 శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారి జీవిత చరిత్ర

శ్రీ కాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమము యొక్క స్థాపకులును, గీతామకరందాది గ్రంథ రచయితలున్ను అష్టోత్తర శతగీతాజ్ఞానయజ్ఞ నిర్వాహకులున్ను అగు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారియొక్క జీవిత విశేషములు ఇందు కలవు

వెల రు **6 00**



# 22 తత్త్వసారము

నిగూఢమైన వేదాంత తత్త్వము సులభమైన తత్త్వములు (పాటలు)తో ఇందు తెలుపబడినవి జనసామాన్యమునకు వీనిద్వారా ఆధ్యాత్మిక జ్ఞానము చక్కగ బోధపడగలదు ఈ తత్త్వములను (పాటలను) వ రి వారికి అనుగుణ్యమైన రాగములతో పాడుకొని ఆనందించవచ్చును

వెల రు 2 50

# 23 మానస బోధ

వేదాంత రహస్యములను అందరికి అందుబాటులో ఉండుట కొరకు జనసామాన్యానికి ఇష్టమైన భాషలో అనగా పాటల రూపక ముగా తయారుచేసిన బాగుండునని తలంచి శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు 108 పాటలుగ తయారుచేసిన గ్రంథమే మానసబోధ

వెల రు 2 50



# 24 పాండవ గీత

భక్తిరసాత్మకములైన పెక్కు మహత్తర శ్లోకములతో గూడిన గ్రంథమే ఈ పాండవ గీత ఇందు కేవలము పాండవులే కాక ఇంకను అనేకమంది మహర్షులు వచించిన దివ్యబోధలు గలవు

వెల రు **2 50**



# 25 మోక్షద్వార పాలకులు

పరిపూర్ణశాంతికి నిలయమైన మోక్షమును పొందుటకు ముముక్షువు ప్రయత్నించుచున్నాడు మరి అట్టి ప్రయత్నములను ఫలించుటకు వలసిన అనేక సులభోపాయములను ఈ గ్రంథము తెలుపుచున్నది

వెల రు **1 50**



## 26 ధ్యాన పద్ధతి

సాధకుడు ధ్యానమును ఎలా అభ్యసించాలి మనస్సును ఎలా నిలపాలి అవరోధములను ఎలా ఎదుర్కొనాలి మొదలగు విషయములు ఈ గ్రంథములో విశదీకరింపబడినవి

వెల రు 1 75

## 27 ఆత్మతత్త్వ విచారణ

సర్వజీవులందును సాక్షిరూపమున వెలుగుచు సమస్త ప్రపంచమునకు ఆధారభూతమై జగత్తు నశించినను తాను మాత్రము నశింపక సమస్తమును ప్రకాశింపజేయునది ఏది కలదో అట్టి ఆత్మతత్త్వమును గూర్చిన విచారణ ఇందు తెలుపబడినది

వెల రు 1 50

## 28 వైరాగ్య సాధన

దుఃఖాక్రాంతుడై పరిభ్రమించు జీవునకు తరుణోపాయమును తెలుపునట్టిదే ఈ గ్రంథము

వెల రు 1 75



# 29 ఆధ్యాత్మ జడ్జిమెంటు

పరమార్థక్షేత్రమను కోర్టులో ముముక్షువను వాది అజ్ఞానమను ప్రతివాదిపై దావా చేయగా సద్గురువు అను జడ్జి ఇరువైపుల సాక్షులను విచారించి డిక్రీ ఇచ్చును విచారణ అత్యంత మనోరంజకముగ నుండును

వెల రు 2 00



# 30 ప్రణవ పూజ

నిర్గుణ పరబ్రహ్మము యొక్క వాచకమగు ప్రణవము (ఓంకారము) మహా పవిత్రమైనది మహోన్నతమగు అట్టి ప్రణవము యొక్క పూజావిధానము ఇందు తెలుపబడినది

వెల రు 1 00



# 31 గౌరీపూజా విధానము

శ్రీ గౌరీదేవి యొక్క పూజా విధానము అర్చన పద్ధతి ఇందు తెలుపబడినది

వెల రు 1 00





# 32 ద్వాదశ మంజరి

ముముక్షువులకు అత్యావశ్యకములైన పండ్రెండు బోధలు (వ్యాసములు) ఇందు కలవు

వెల రు 1 50

# 33 ఆధ్యాత్మిక హితోక్తులు

ఆధ్యాత్మిక క్షేత్రమున సాధకునకు ఆవశ్యకమైన పెక్కు హితోక్తులు ఇందు వివరింపబడినవి

వెల రు 1 00

# 34 మట్టిలో మాణిక్యము

ఈ శరీరము ఆత్మదేవునకు మందిరమనియు భగవంతుడు జేరుటకు దివ్యరథమనియు అట్టి భగవంతుని స్వరూపమును తేటతెల్లముగ ఎవ్రులికరించిన గ్రంథమే మట్టిలో మాణిక్యము

వెల రు 1-75



## 35 అమృత బిందువులు

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు ఉపన్యాసముల ద్వారా బోధించు అనేక ధర్మరహస్యములను ఇంకను మహనీయులు బోధించిన దివ్యసూక్తులు సదుపదేశములు సుభాషితములు అను అనేక శీర్షికలను ఏరి చేర్చి కూర్చిన గ్రంథమే ఈ అమృతబిందువులు

వెల రు **12 00**

## 36 గీతోపన్యాసముల కెసెట్సు

పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి గీతోపన్యాసాలు చాలా ప్రశస్తమైనవి వేలకొలది ప్రజానీకం ఈ ఉపన్యాసాలు వినడానికి గీతాయజ్ఞాలకు హాజరయ్యేవారు తిరుమల-తిరుపతి దేవస్థానంవారు పై ఉపన్యాసాలు ప్రాముఖ్యం గుర్తించి వాటిని రికార్డుచేసి కెసెట్సుగా విడదల చేశారు ఇపుడు 1 నుండి 18 వ అధ్యాయములు లభిస్తున్నాయి

ఒక అధ్యాయం ఒక కెసెట్ వెల రూ **25/**

---

గ్రంథములు కావలసినవారు క్రింది అడ్రసుకు వ్రాయండి


మేనేజరు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ శుకబ్రహ్మాశ్రమము (Post)

శ్రీ కాళహస్తి 517 640

(చిత్తూరు Dt) A P

ఫోన్ : 239



# 37 "వేదాంత భేరి"

మనశ్శాంతికి మహదవకాశము

(గీతామకరంద రచయిత శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి సందేశము ప్రతినెల తెలుసుకొనవచ్చును)

మహర్షుల చరిత్రలు, దేవాలయముల చరిత్రలు, ఆరోగ్య సూత్రములు, మహనీయుల సందేశములు సంస్కృత భాషా శిక్షణ మొదలగు ఎన్నో నూతన విషయములను తెలుసుకొనదలంచినారా? అయినచో వేదాంతభేరి పత్రిక చదవండి మనశ్శాంతిని పొందండి క్రింది అడ్రసుకు M O ద్వారా రూ 16-00 పంపండి పత్రికను పొందండి సంవత్సర చందా రూ 16-00 లు మాత్రమే

అడ్రసు వేదాంతభేరి కార్యాలయము
సూర్యారావుపేట
పోస్టు బాక్సు నెం 323
విజయవాడ 520 002



# ధరల పట్టిక

## శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | గీతామకరందము | 45 00 |
| 2 | Gitamakaranda (English) | 45-00 |
| 3 | శ్రీవసిష్ఠగీత | 40 00 |
| 4 | రామాయణ రత్నాకరము | 40 00 |
| 5 | భాగవత రత్నాకరము | 40 00 |
| 6 | భారత రత్నాకరము | 40 00 |
| 7 | ఉపనిషద్రత్నాకరము | 35 00 |
| 8 | గీతోపన్యాసములు | 22 00 |
| 9 | మోక్షసాధన రహస్యము | 22 00 |
| 10 | పరమార్థ కథలు | 22 00 |
| 11 | ఆధ్యాత్మ రామాయణము | 12-00 |
| 12 | బ్రహ్మానంద వైభవము | 12 00 |
| 13 | భజన కీర్తనలు | 12 00 |
| 14 | అమృత బిందువులు | 12 00 |
| 15 | శ్రీభగవద్గీత (స్థూలాక్షరి) | 12 00 |
| 16 | శ్రీ భగవద్గీత (మూలం) కృష్ణుని రేపరు ప్లాస్టిక్ కవరుతో | 4 00 |
| 17 | వివేకానంద సింహనాదము | 3 00 |
| 18 | యమలోక వార్తలు | 3 00 |
| 19 | శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి జీవిత చరిత్ర | 6 00 |
| 20 | తత్త్వసారము | 2 50 |

| | | |
|---|---|---|
| 21 | మానస బోధ | 2 50 |
| 22 | పాండవగీత | 2 50 |
| 23 | ఆధ్యాత్మ జడ్జిమెంటు | 2 00 |
| 24 | ప్రణవపూజ | 1 00 |
| 25 | గౌరిపూజా విధానము | 1 00 |
| 26 | ద్వాదశ మంజరి | 1 50 |
| 27 | ఆధ్యాత్మిక సూక్తులు | 1-00 |
| 28 | మోక్షద్వారపాలకులు | 1 50 |
| 29 | ధ్యానపద్ధతి | 1-75 |
| 30 | ఆత్మతత్త్వ విచారణ | 1-50 |
| 31 | వైరాగ్య సాధన | 1 75 |
| 32 | మట్టిలో మాణిక్యము | 1 75 |
| 33 | వేదాంతభేరి ఆధ్యాత్మిక మాసపత్రిక సం॥రం చందా | 16 00 |
| 34 | శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి గీతోపన్యాసముల క్యాసెట్ ఒక్కొక్క అధ్యాయముగల కెసెట్ | 25-00 |

---

గ్రంథములు కావలసినవారు క్రింది అడ్రసుకు వ్రాయండి

మేనేజరు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ శుకబ్రహ్మాశ్రమము పోస్టు

శ్రీకాళహస్తి – 517 640 చిత్తూరు జిల్లా